# సంస్కృతవాఙ్మయచరిత్ర

ప్రథమసంపుటము:

## వైదికవాఙ్మయము.

బ్రహ్మశ్రీ.
మల్లాది - సూర్యనారాయణశాస్త్రిగారు
ప్రధానపండితులు
ఆంధ్రవిశ్వకలాపరిషత్కలాశాల




వాల్తేరు.
1933
మద్రాసు:
ఆనందముద్రణాలయమునందు ముద్రితము.



[వెల రూ. 3—0—0.

# విషయసూచిక.

| | పుట. |
|---|---|
| పీఠిక ... ... | i |
| ఉపయుక్తగ్రంథనామపట్టిక ... | i |
| విజ్ఞప్తి ... ... | i |
| కృతికర్తవిన్నపము ... ... | i |
| కృతిసమర్పణము ... ... | i |
| **ప్రథమాధ్యాయము.** | |
| గ్రంథావతారిక ... ... | 1 |
| ఆర్యులు-వారి మొదటినివాసము ... | 3 |
| ఐరోపాఖండవాదము ... | 4 |
| ఉత్తరధ్రువమండలవాదము ... | 6 |
| ఆర్యావర్తవాదము ... ... | 16 |
| మధ్యాసియాఖండవాదము ... | 20 |
| చతుర్వాద పరిశీలనము ... | 21 |
| ఆర్యులరాక ... ... | 24 |
| **ద్వితీయాధ్యాయము.** | |
| వైదికవిజ్ఞానము ... ... | 28 |
| వేదనిత్యత్వాపౌరుషేయత్వవిచారము. | 31 |
| ఋగ్వేదవాక్యవిచారణ ... | 36 |
| అపౌరుషేయత్వవిచారపర్యవసానము. | 39 |
| వేదకాలము ... ... | 40 |
| అదితియుగాదినిర్ణయము ... | 44 |
| **తృతీయాధ్యాయము.** | |
| భాష ... ... | 47 |
| ఆర్యలిపి ... ... | 52 |
| జ్యోతిర్విజ్ఞానము-లిపి ... | 58 |
| ఆర్యభాష-వ్యావహారికస్థితి | 61 |
| సంస్కృతము-ప్రాకృతములు ... | 64 |
| ప్రాకృతములు-దేశభాషలు ... | 67 |
| సంస్కృతభాషాప్రశంస | 68 |
| **చతుర్థాధ్యాయము.** | |
| వాఙ్మయవిభాగము ... .. | 69 |
| వేదములు ... ... | 69 |
| సంహితలపౌర్వాపర్యము .... | 71 |
| త్రయి-అథర్వణము ... ... | 73 |
| వేదప్రశంస ... ... | 74 |

| | పుట. |
|---|---|
| **పఞ్చమాధ్యాయము.** | |
| ఋక్సంహిత-దానివిభాగము ... | 76 |
| ఋక్సంఖ్యానిర్ణయము ... | 78 |
| సూక్తద్రష్టలు-సూక్తములు ... | 81 |
| మండలద్రష్టలు-మండలములు ... | 87 |
| మండలములయేర్పాటు ... | 91 |
| ఋషులయితిహాసములు ... | 93 |
| ఋగ్వేదదేవతలు ... ... | 99 |
| ఋగ్వేదశాఖలు ... ... | 103 |
| ఋక్సంహితలోనివర్ణనలు ... | 106 |
| దావాగ్నివర్ణనము ... ... | 109 |
| సూర్యుఁడు ... ... | 113 |
| విష్ణువు ... ... | 120 |
| రుద్రుఁడు ... ... | 122 |
| వరుణుఁడు ... ... | 124 |
| నదులు ... ... | 125 |
| పర్వతములు ... ... | 129 |
| సముద్రము ... ... | 130 |
| ఆర్యులవర్గములు-జాతులు ... | 130 |
| అనార్యులు ... .. | 136 |
| వర్ణములు ... ... | 141 |
| వృత్తులు ... ... | 143 |
| కృషి ... ... | 145 |
| వాణిజ్యము ... ... | 147 |
| శస్త్రజీవిక ... ... | 149 |
| మృగయ ... ... | 150 |
| లోహములు ... | 151 |
| ఆహారము ... | 151 |
| పానీయములు ... | 152 |
| సురాపానము ... ... | 153 |
| మాంసాశనము ... ... | 153 |
| సాంఘికాచారములు ... ... | 155 |
| వివాహము ... ... | 156 |
| స్వయంవరము ... ... | 157 |
| దాయార్హత ... | 158 |
| అంత్యక్రియాచారములు ... | 158 |
| ధర్మాచరణము ... | 159 |

# పీఠిక.

'యస్య నిశ్వసితం వేదా యో వేదేభ్యోఽఖిలం జగత్ ।
నిర్మమే త మహం వందే విద్యాతీర్థ మహేశ్వరమ్ ।

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు సుప్రసిద్ధసంస్కృతాంధ్రపండితులు, బహుళసంస్కృతాంధ్ర గ్రంథరచనపటిష్ఠ పాండితీవిరాజితులు. సంస్కృతవాఙ్మయచరిత్రనాంధ్రమున రచించి పండితులకును కళాశాలావిద్యార్థిగణమునకును భాషాసారస్వతమునకును మహోపకారము గావించిరి. ఇట్టి గ్రంథములు పాశ్చాత్యభాషలలో నుదయించినవి కాని దేశభాషలలో నిదియే ప్రథమ ప్రయత్నము. సంస్కృతమునఁగూడ పెక్కులక్షణగ్రంథరాజము లుద్భవించినను భాషాచారిత్రక గ్రంథములు కాని సారస్వతచారిత్రక గ్రంథములుకాని రచియింపఁబడి యుండలేదు. పాశ్చాత్యపండితులు రచించిన గ్రంథములు మార్గదర్శకము లయినను పర్యాప్తభాషాభిమానప్రపూరితములు కానందునను, ప్రాచీనార్య నాగరికతావిజృంభణమును తదౌన్నతిని సంకుచితములుగాఁ గనపర్చు నుద్దేశమును వ్యక్తపర్చునవి యగుటను భారతీయులహృదయములకు కొన్నిపట్ల భ్రమ విషాదములు కలుగఁజేయునవిగాఁ గన్పట్టుచున్నవి. ఇట్టికొఱంతను దొలగింప స్వదేశ పండితులు తమసహజశేముషీవిలసిత పరిశోధనములతోడ నార్యవిజ్ఞానఖని యనఁదగు సంస్కృతవాఙ్మయచారిత్రమును లోకమునఁ బ్రకాశింపఁజేయు బాధ్యతగల వార లయియున్నారు. అట్టియెడ గ్రంథకర్తలగు మల్లాదిసూర్యనారాయణశాస్త్రిగారు తమకర్తవ్యమును శ్లాఘాపాత్రముగా నిర్వర్తించి రని తెలుపుటకు మిక్కిలి సంతసించుచున్నాఁడను. నేను లౌకికవ్యవహారనిమగ్నుఁడను. వారు నిరంతరాధ్యాపక కార్యనిష్ఠులు. వారు రచించిన మహాగ్రంథమునకుఁ బీఠికను వ్రాయుభారము ననర్హుఁడ నగునాపై వైచిరి. శక్తికొలఁదిని గాలపరిమితికొలఁదిని నిద్దాని వ్రాయఁబూనితిని. ఇందలి గుణదోషములను బండితులు విచారించుటలో మే ముభయులమును క్షంతవ్యులమే. శాస్త్రిగారి గ్రంథమునందు పాశ్చాత్యమతావిష్కరణమును, తన్మతానువాదమును గొంతవఱ కనివార్యములుగాఁ గానవచ్చినను స్వాభిప్రాయములను వ్యక్తపఱచుపట్ల శాస్త్రిగారు నిరంకుశముగా స్వీయమతమును వెలిపుచ్చిరి. ఇట్టి యుద్గ్రంథము మనదేశమునను మనమాతృభాషను నూతనమును బ్రథమప్రయత్నము నగుటను విమర్శకులకు పెక్కులోపము లిందు స్ఫురింపవచ్చును. కాని గ్రంథము వ్యాప్తిచెందినకొలఁదిని నితరదేశభాషలలోనికిఁ

బరివర్తింపఁబడిన కొలఁదిని దీనిగుణసముదాయము పండితులకు గోచరింపక తప్పదు. అట్లితర దేశ భాషలలోనికిఁ బరివర్తనము చేసి ప్రకాశింపఁజేయఁదగిన దీగ్రంథ మనిమాత్రము నిస్సంశయముగా దృఢవిశ్వాసముతో విన్నవింపఁగలవాఁడను. కొన్నితావుల గ్రంథకర్తగారి స్వకీయాభిప్రాయములతో నే నేకీభవింపఁజాలక పోయినను గ్రంథరచనయందు వారు చూపిన సారస్వతపరిచయమును గవేషణ సామర్థ్యమును అనర్గళమృదుమధుర పదవాక్యఘటనా సౌందర్య చాతుర్య లహరీ మహిమను వర్ణనాచమత్కృతిని దిలకించి పులకితాంతరంగుఁడనై భళీ యని కొనియాడ వెనుదీయువాఁడను మాత్రము కాఁజాలను. సంస్కృతవాఙ్మయమును అందు వైదికవాఙ్మయప్రాభవమును ఆర్యులయొక్కయు మానవజాతియొక్కయు నమూల్యపైతృకధనముగా భారతీయు లందఱును పరిగణింపవలసియున్నది. వైదికరహస్యము లపారములు, దుర్విజ్ఞేయార్థబహుళములు, సర్వజ్ఞకల్పము లని భాష్యకర్తలవలనను శ్రీశంకరాద్యాచార్య పురుషలవలనను వేయివిధములఁ గొనియాడఁబడి నవియు నై యున్నవి. అర్వాచీనులలో ననేకపండితులు వివిధార్థముల స్వమతాభిమాన పురస్సరముగా వ్యక్తపఱచియుండిరి. ఆర్యసమాజమువారు యజ్ఞములు భౌతికశాస్త్ర క్రియాపరిశోధన సూచక విశేషములుగా వర్ణించియుండిరి. దయానందసరస్వతీ స్వాములవారు సత్యార్థప్రకాశికయను పేర స్వతంత్ర గ్రంథమును రచించి పెక్కుచోట్ల వేదమంత్రములకు భిన్నార్థములు గల్పించి వారిశిష్యులకు మార్గప్రదర్శకు లైరి. వారిజీవితకాలములోనే వాదప్రతివాదములు ప్రబలి ఖండనమండనగ్రంథము లనేకములు వెడలినవి. ఉదాహరణమునకు మాత్రము గురుదత్తవిద్యార్థిగారును మొన్న మొన్న పి. నారాయణగౌడ్ యెమ్ యే గారును రచించిన Message of the XXth Century అను గ్రంథమును తార్కాణముగాఁ దీసికొనవచ్చును. వీర లశ్వమేధయాగమును X-Ray పరముగా సమర్థించిరి. బ్రహ్మీభూతు లయినశ్రీబోధానంద భాగతీస్వాములవారు వేదమంత్రములు సీచలోహములవలన స్వర్ణమును (Alchemy) పుట్టించువిధులుగా సమన్వయించిరి. ఇటీవల బొంబయినగరమున ముద్రణముగాంచిన యొకానొకగ్రంథమున వి. జి. రేవేగారు దీని శారీరక శాస్త్రమును గాను యోగశాస్త్రముగాను సాధించిరి. మతాచార్యు లద్వైతవిశిష్టాద్వైతద్వైత ప్రకాశకములుగా వర్ణించియుండిరి. మోక్షమూలరు మొదలగు పాశ్చాత్యపండితులు వీనిమహిమను బొగిడి యెద్దియో మహత్తర మగునర్థ మిం దిమిడి యుండనోపు నను నూహను మాత్రము కనఁబర్చి రచనా సౌందర్యమును బొగడుచు నట్టి పురాతన కాలమం దార్యులు కనఁబర్చిన కవితాశక్తికి నచ్చెరువుచెందుచు పరంపరావిచ్ఛేదమున సరియగునర్థమును బోధచేయునుపాయ మంతరించిన దని యంతటితో విరమించిరి.

## వేదము లపౌరుషేయములు.

ఆస్తికజనము మాత్రము వేదరాశి శబ్దముచేతను నర్థముచేతను నిత్యమును నపౌరుషేయమును, నీశ్వరనిర్మితముకూడఁగాక యీశ్వరనిశ్వసితరూపము నని మిక్కిలిశ్రద్ధాభక్తులతో దీని భజించుచుండిరి. ఈవిషయమునఁ బూర్వమీమాంసకులకు నుత్తరమీమాంసకులకు నించుకమతభేదము కలదు. తార్కికు లసంసారీశ్వరపురుషనిర్మితము లని వాదించిరి. సాంఖ్యు లాప్తవాక్యము లనిరి. నాస్తికో వేదనిందకః, అను మనువచనమునకు గుఱియై బౌద్ధచార్వాకాదులు వేదప్రామాణ్యము నంగీకరింప రైరి. ఇట్లనేకవిధముల విప్రతిపత్తిని గలిగించు వేదరాశి కాలము గుర్తింప నలవికానిపురాతనవిద్యయై యున్నది, గ్రంథకర్తలు తిలకపండితాదుల ననుసరించి కాలనిర్ణయమునకుఁ గడంగియు, పూర్వోత్తరమీమాంసాది శాస్త్రవచనములఁ జర్చించి, తుదకు 'యుగాంతేఽన్తర్హితాన్ వేదాన్' అనుచు, వేదములు ఋషిదృష్టములను మతము నావిష్కరించిరి. క్రైస్తవమత గ్రంథ మగుబైబిలును మహమ్మదీయ మతగ్రంథ మగుఖురాన్‌షరీఫ్ గ్రంథమును భగవద్వాక్యములుగా నాయామతస్థులు నమ్ముదురు. పారశీకుల ఛందోవస్థానాదిగ్రంథములు గూడ మహర్షిదృష్టము లని నమ్మఁబడుచున్నవి, ఆగమికులు పాంచరాత్రాద్యాగమములు వేదతుల్యము లనియును వేద మంతర్హితమైనదిన ములలో బ్రహ్మవలన వెలసిన వనియును నమ్ముదురు. తాంత్రికులు, తాంత్రికాగమములు వేదమునకుఁ బూర్వ ముండిన వనియును వేదము లందంతట తాంత్రికవిద్య ద్యోతక మగు ననియును నిగమాగమము లన్యోన్యసంబంధముఁ కలిగి సమానప్రామాణ్యప్రతిపత్తి కల వనియును జెప్పుదురు. ఇం దేది సత్యము విశ్వసనీయ మెద్ది యనువిచారము పండితుల కనివార్య మగుచున్నది. షడంగముల నుభయమీమాంసలను పూర్ణముగా నభ్యసించినను నీశ్వరానుగ్రహమును గురుకటాక్షమును లేనియెడల వేదార్థము దురవగాహ మని యాస్తికు లనియెదరు. దివ్యజ్ఞానసమాజము వారును వారిలో ముఖ్యు లగు Madame Blavatsky గారును వారి శిష్యురాలు ఆనీవసంతమ్మగారును Secret Doctrine అను నుత్తమగ్రంథమునందు వేదమంత్రములకు యుక్తిపూరితము లయినకొన్నినూతన భావములు స్ఫురించునర్థములు దెలిపిరి. బహుగ్రంథపరిచయముననుు పాశ్చాత్య విద్యాగంధమువలనను ఆధునికు లగుభారతీయులు వ్యామోహితు లయి సత్యమును వెదకి వెదకి వేసరి విఫలమనోరథు లయి యుదాసీనత వహించి యున్నవారు. ఏనాఁటనయిన భగవంతుఁడు తనదివ్యజ్ఞాన మహిమను భూమిపయి మనుజునకు నేవిధమున నయినఁ బ్రసాదించియుండె నని నమ్మినచో నది నిక్కముగ వేదఋషులభావవీథి వారితపఃఫలంబున నావిర్భవింపఁజేసె ననునమ్మిక నుపయుక్తము కాకపోదు. గ్రంథకర్తలుగూడ నొకచో నీభావమే యావిష్కరించిరి.

పతంగో వాచం మనసా బిభర్తి ।
తాం గంధర్వో వదద్గర్భే అంతః ।
తాం ద్యోతమానాం స్వర్యం మనీషాం ।
ఋతస్య పదే కవయో నిపాంతి ॥
యుగాంతేఽంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః ।
లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా ॥

వేదమునకంటెఁ బ్రాచీన మయిన సారస్వతసంపద యేమనుజభాషయం దును గానరాదు. దీనికి కర్త వెదకినను గానరాఁడు. ఇది అనాదిసిద్ధమై శ్రుతిరూప మున వెలయుచున్నది.

## శబ్దమువలన సృష్టి.

వైదిక భాష సంస్కృతముగ నున్నది. ఇది వైదికలౌకికభేదమునద్వివిధ ముగఁ గన్పట్టుచున్నది. అథశబ్దానుశాసనమ్ - కేషాం శబ్దానాం, లౌకికానాం వైదికానాంచ యను పతంజలి మహాభాష్యవచనము లిందుకు నిదర్శనము లయి యున్నవి. శబ్దార్థములకుఁ గలసంబంధము ఔత్పత్తికము నీశ్వరసంకేతితము ననియుఁ బూర్వమీమాంసకులమతమై యున్నది. అత ఏవచ నిత్యత్వమ్మను నుత్తరమీమాంసా సూత్రవ్యాఖ్యానావసరమున శ్రీశంకరభగవత్పాదులవారు శబ్దార్థములచేఁగూడ నిత్యత్వమును ఆనుపూర్వీనిత్యత్వమును గూడ నంగీకరించి యుండిరి. కాలాకాశవన్నిత్యత్వ మ్మని శ్రీవిద్యారణ్యులవారు సృష్టిదశయందు నావిర్భావరూపనిత్యత్వము నంగీకరించి ద్యోతకముగావించిరి. Max Muller పండి తుఁడు గూడ శబ్దార్థసంబంధనిరూపణమందు స్ఫోటవాదముయొక్క మహిమను మిక్కిలి కొనియాడి యుండెను. పూర్వమీమాంసా శాస్త్రము వేదప్రామాణ్య మును గూర్చియు శబ్దప్రామాణ్యమునుగూర్చియు విస్తరించి చర్చించి సిద్ధాం తము నేర్పఱచినది. శబ్దసృష్టిని బైబిల్ గ్రంథముగూడ నంగీకరించినది. వేదము వలన నఖిలజగత్తు సృష్టింపఁబడిన దనినయెడల మన మేల నమ్మరాదు. శబ్ద బ్రహ్మముయొక్కమహత్త్వము నించుక పాశ్చాత్యభౌతికశాస్త్రము గ్రహించుచున్నది. వితంతివార్తాశ్రవణమే యిందులకు దృష్టాంత మయియున్నది. మంత్రముల మహిమయును వర్ణానుపూర్వియొక్క ప్రభావమును, ఉపాసకు లందఱకును బ్రత్య క్షమై యున్నవి. మంత్రము యంత్రము దేవత యుపాసకుఁడుగురువును నేకరూప ము లని మంత్రశాస్త్రము తెల్పుచున్నది. ఇటీవల నొకపరాను దేశయువతీమణి కనిపెట్టిన యొకవాద్యవిశేషమువలన వివిధరాగాలాపములచే భిన్నభిన్న దేవతా స్వరూపములు వాలుకలపైఁ జిత్రింపఁబడిన వని ప్రకటింపఁబడిన వృత్తాంతము పూర్వమీమాంసాసిద్ధాంతము నెంతయు బలపఱచుచున్నది. పాశ్చాత్యసిద్ధాంతు లలోఁ గ్రొందఱి మతముప్రకారము The word of God అనఁగా శబ్దము

సృష్టికి మూలకారణ మని నిర్ణయింపఁబడినది. సృష్టికికారణము (Logos) అనునదీ విషయమే. భౌతికవిజ్ఞానమభివృద్ధిచెందినకొలఁది ప్రకృతిరహస్యములు ప్రత్యక్షానుభవగోచరము లగుచున్నవి. ప్రత్యక్షప్రమాణము గోరువారికి శ్రుతియు ప్రత్యక్ష ప్రమాణము కాకపోదు.

'స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యమ్।'
అనుమానః చతుష్టయమ్॥

ఇచ్చటఁ బ్రత్యక్ష మనఁగా శ్రుతియే. మనకుఁ బ్రత్యక్షము కానిశ్రుతులు మన్వాది మహర్షులకుఁ బ్రత్యక్షములు గనుక ననుమేయశ్రుతిమూలకముగ స్మృతిప్రామాణ్యము సిద్ధించు నని స్మృతిపాదమున మీమాంసాశాస్త్ర ముద్ఘోషించినది. వేదము లనంతములు. అనంతా వై వేదాః। యను వేదవాక్యమే కలదు. మంత్రబీజాక్షరములమహిమ మంత్రశాస్త్రమునవలనఁ దెలియఁదగును. అట్టి మహిమ సాక్షాత్కారదశయందు ప్రత్యక్షరూప మగును. ఉపాసనబలమున దేవతాప్రత్యక్షము జరుగుట స్వానుభవైకవేద్యము. అట్టి ప్రత్యక్షము విజ్ఞానశాస్త్రవిరుద్ధము కా దని దివ్యజ్ఞానసంఘముపారిలోఁ బెక్కండ్రు నమ్మెదురు. ఇంక వైదికకర్మములవలన నపూర్వము జనించి ఫలరూప మగు ననుట నేల విశ్వసింపరాదో తెలియకున్నది. వేదమహర్షులు ప్రత్యక్షానుభూతినే వెల్లడించిరి. వారు లోకప్రతారణోద్యోగులు కారు. ఆత్మభ్రాంతి కలవారును కారు. అహం మనురభవమ్మను నామదేవవాక్యమును, అపశ్యమహమేతత్సూర్యమండలం పరివర్తమానమ్। అనుగార్గ్య ప్రాణత్రాణవచనమును ప్రత్యక్షకృతములు పరోక్షకృతములు నాత్మకృతములు ననుయాస్కనిరుక్తనృతమంత్ర విభాగములు నిందుకు దృష్టాంతములుగా నున్నవి.

## సంస్కృతము దేవభాష.

సంస్కృతమునకు దేవభాషయను వాడుక కలదు. దీని కీ నామమెట్లు సార్థకమయ్యె నను విషయము నింకను బండితులు చర్చించి సిద్ధాంతములను నిరూపింతురుగాక! నాకుఁ దోచినదానిని దెల్పెదను. సప్తకోటి మహామంత్రములకు బీజము లయిన అకారాదిక్షకారాంతము లయిన వర్ణమాతృకా సముదాయము సంస్కృతమునఁగాక వేఱొండుభాషఁ గానరాదు. కావున నది వర్ణసమామ్నాయమైనది. ఆమ్నాయశబ్దార్థము పండితులకు గోచరమే. సమామ్నాయః సమామ్నాతః అను యాస్కవచనము సమామ్నాయార్థమును దెలుపును. పాణిని ప్రత్యాహారసూత్రములకును మహేశ్వరసూత్రము లనుసంజ్ఞ కలదు. సనకాది సిద్ధుల నుద్ధరించుటకై నటరాజరాజు నృత్తావసానమందు ఢమరుకమును పదునాల్గు సారులు వాయించిన నవి యుద్భవించిన వఁట. నటరాజు నృత్యము ప్రపంచసృష్టి

హేతుభూత మెట్లయినదియును నటరాజు విగ్రహమును జూచి Edward Carpenter మొదలగు పాశ్చాత్యులుకూడ విస్మితు లయి వ్రాసినవ్రాతలుసాక్ష్య మిచ్చుచున్నవి. ఈప్రత్యాహారసూత్రములపయి నందికేశ్వరకారికలఁ జూచిన నిందలి నిగూఢతత్త్వము దెలియక మానదు. ప్రథమ ప్రత్యాహారసూత్రార్థ మిట్లు వివరింపఁబడినది. నిర్గుణపరబ్రహ్మస్వరూప మయిన అకారము మాయాస్వరూప మయిన ఇకారసాన్నిధ్యముచే ఉకారరూప ప్రపంచపరిణామమును జెందినది. చివరనుండు లణ్।హయవరట్। అను సూత్రములు వరుసగ పృథ్వి ఆకాశ వాయు జల (అమృత) అగ్ని (తేజః) భూతములయొక్క బీజము లయియున్నవి. మంత్రశాస్త్రమునందలి యేబీజనిఘంటువు నైనఁ జూచినచో వీనిశక్తులు దేవతలు ప్రత్యధిదేవతలు మొదలగు విషయములు తెలియఁగలవు. సంయుక్తాక్షరములు నిట్లే బీజశక్తులు కలిగి యున్నవి. క్షరము లేని దక్షరము. అది అకారమును చివరక్షకారమును అగ్నిబీజమగు రకారముతోఁ జేరి 'అక్షర' సంజ్ఞ చెందినది. హం క్షం అను రెండక్షరములు నాజ్ఞాచక్రమున ద్విదళమున మంత్రబీజములై హంసమంత్రమునకు వర్ణము లయినవి. హంసమంత్రమున కజపాగాయత్రి యని పేరు. హకారము పురుషబీజము సకారము ప్రకృతి లేక స్త్రీబీజము. బిందువు పురుషస్వరూపము. విసర్గ ప్రకృతిరూపము. బిందువిసర్గలు త్రిభుజ రూపము. ప్రకాశబిందువు విమర్శాత్మకమై విభిన్నమై విమర్శబిందువై వాని వలన మిశ్రబిందు వుదయించి యీమూటియొక్క త్రిరేఖా సంబంధమువలన త్రికోణముగా నేర్పడి అందువలనఁ గామకళ యుదయించి సృష్టికిఁ గారణ మగుచున్న దని కామకళావిలాస మనుమంత్రశాస్త్ర గ్రంథము తెల్పును. హంస స్సోహమ్ అను మంత్రమునఁ బురుషప్రకృతులు కలసియున్నవి. సోహమ్మను మంత్రమునుండి పురుషప్రకృతి బీజరూపములు లయిన సకారహకారములను విలాపము చేయఁగా అనఁగా సోహమ్ అను దానిలోని సకారహకారములఁ దీసివేయగా 'ఓమ్' అను ప్రణవముమాత్రము నిలచు నని శ్రీశంకరాచార్యుల వారు ప్రపంచసార తంత్రమునఁ దెలిపిరి. మఱియు ప్రథమాక్షరమగు 'అ' కారము 'హ' కారముతోఁగూడి బిందుసంయుతమై యాత్మవాచి యగుచున్నది, మూలాధారము మొదలుగ షట్చక్రములయం దీబీజన్యాస మెట్లున్నదియు షట్చక్రనిరూపణము మొదలగు గ్రంథములవలనఁ దెలియుసగును. కొన్ని యాంగ్లమున పరివర్తితము లయి Sir John Woodroffe అనున్యాయమూర్తివలన Garland of Letters Serpent Power అను నిత్యాది గ్రంథములుగా బ్రకాశింపఁబడినవి. వర్ణమయీ మంత్రమయీ యంత్రమయీ'యిత్యాది దేవతా స్తుతివాక్యములు నిందులకు నిదర్శనములే. మాతృకావిలాసమను సంస్కృత గ్రంథమునఁగూడ నీవిషయము విస్తరింపఁబడినది. అంతర్మాతృకా బహిర్మాతృకాన్యా

సాధులతో మంత్రోపాసనముచేయు సాధకుల కివి యనుభవసిద్ధములే. గ్రంథ విస్తరభీతిచే నింతకంటె విపులముగాఁ జర్చింపనైతిని. బీజశక్తులు సంపూర్ణముగా నావిర్భవించిన వర్ణసమామ్నాయ మితరభాషలయందు లేదు. ఏ భాషయందైనను బీజశక్తులు కలసినయెడల మాంత్రికవర్ణాను పూర్వివలన జనించిన శక్తి సిద్ధి హేతువు కాఁబరగునని మంత్రమహార్ణవాది గ్రంథములలో నుదాహరింపఁబడిన మంత్రసము దాయమే దృష్టాంతమయియున్నది. కావ్యముల వర్ణబీజగణ కూట ములవలన నగు ఫలములు నిట్టివే. వైదికమంత్రములు నట్లే ప్రత్యక్ష శక్తిగోచ రము లగుట వైదికుల నమ్మకమైయున్నది. కావున శ్రుతిప్రత్యక్ష మని వ్యవహ రింపఁబడును. ఇష్టప్రాప్తికిని ననిష్ట పరిహారమునకు నలౌకికోపాయమును బోధించు నది వేదమని విద్యారణ్యులు.స్వర్గమును బ్రత్యక్షముగఁ 'జూచి వచ్చినవారలు లేకు న్నను,స్వర్గము నిత్యమును బ్రత్యక్షమునని యే మీమాంసకమతము.పునరావృత్తి రహితమైనట్టియు స్వస్వరూపావస్థానరూప మగు మోక్షాపేక్షచే కర్మచితలోకము లల్పాస్థిరఫలదములని వేదాంతమతము. ఏది యెట్లున్న నేనాఁడయిన పరమేశ్వ రుఁడు పుడమిపై మానవునకు తన దివ్యజ్ఞానమహిమ నించుకేని ప్రసాదించె నని నమ్మవలసివచ్చినప్పుడు వైదిక విజ్ఞాన మట్టి భగవత్ప్రసాద మని నమ్ముట కెట్టి యాక్షేపణయుఁ గానరాదు. వైదికఋషుల దివ్యజ్ఞాన తేజోవిలసితములగులో కోత్త రానుభవములను విశదీకరించిన వేదము లట్టివను ధృఢవిశ్వాసము సమంజస మగుట కాక్షేప మేమి ?

వేదకాలము వేదభూమి వైదికకర్మములను గూర్చి యొకించుక చర్చించుట యిచ్చట నావశ్యక మని యోచించి సంక్షేపముగా వాయావిషయముల వివరింప యత్నింపవలసివచ్చినది. బహు గ్రంథపరిశీలనము చేసి గ్రంథకర్త లీవిషయ మున స్వాభిప్రాయ మచ్చటచ్చటఁ జూపించుచుఁ జరిత్రకారులమతములను వివరించియుండిరి. వేద మపౌరుషేయ మను విశ్వాసము గల యాస్తికుల కిట్టి బాహ్యాంగ పరీక్షలతో నిమిత్తములేదు. పాశ్చాత్యపండితు లనేకులు వేదకాల ము మానవయుగమునఁ గ్రీస్తునకు పూర్వము కొలదిశతాబ్దముల క్రిందటి దన్నట్లు వ్రాసియుండిరి. ఇట్టివాదము లభిమానగ్రస్తములు కాని వాస్తవములు కానేర వని శ్రీయుత బాల గంగాధర తిలకుపండితులును నాధునికులలో Rigvedic India గ్రంథకర్తలయిన దాసుగారును మిక్కిలి పరిశోధనముచేసి పాశ్చాత్యవాదము లపభ్రంశము లనియును దుష్పాండిత్య విలసితము లనియును నూతనపరిశోధనపద్ధతులకు మార్గమును జూపిరి. "యో వేదేభ్యోఽఖిలంజగత్త" న్ను ప్రతిజ్ఞయొక్క వాస్తవమును గనిపెట్టఁ దలఁచినచో సర్వజ్ఞకల్ప మని యా చార్యపురుషులవలన వేనోళ్లఁ గొనియాడఁబడిన వేదప్రపంచమును బరిశీలింపఁ బూనిననచో నొక పురుషాయుర్దాయమును నొక పురుషబుద్ధియు నీపనికిఁ బర్యా

ప్తములుకా వని చెప్పకతీఱదు. భారతీయుల పైతృకధన మయినట్టియు, సనాతన
ధర్మమున కాదిమూలమును హిమవత్పర్వతమువలెఁ గర్మభూమికిఁ బ్రతిష్ఠానము
నయినట్టియు నార్యజాతీయ జీవనదీ ప్రభవస్థానమును దేవతాత్మస్వరూపమును
నన్యులకజేయము నగునట్టియు నీవేదరాశిని భారద్వాజ వృత్తాంతమును స్మరించు
కొనిదరిఁ జేరఁజూచు వారలు పెక్కు సంఘములుగా నేర్పడి పరిశోధనము చేయ
వలసిన యావశ్యకత గోచరమగుచున్నది. గ్రంథకర్తలు పొగడిన రీతిని
వేదవాఙ్మయ మాంధ్రలోకమున హెచ్చు తేజమును బొందినది. వైదికపరిశో
ధన శాఖనేర్పరచి యిట్టి కార్యమునకుఁ గడఁగుట యాంధ్ర విశ్వ విద్యా
లయమువారి ప్రథమ కర్తవ్య మని వేఱుగ నుడువ నవసరము లేదు.
ఉదాహరణమున కొకచిన్న విజ్ఞప్తిని చేయుచున్నాఁడను. లోకమాన్యు లార్య
భూమి యుత్తరధ్రువప్రాంత మని సహేతుకముగ నిర్ధారణచేసిరి. దాసుగారామత
మును ఖండించుచు సప్తసింధుప్రదేశ మార్యభూమి యని స్థిరపరిచిరి. కాని
యుత్తరధ్రువప్రాంతలక్షణ సూచకము లగు ఋఙ్మంత్రములకు గతి కల్పించుట
కాయాసపడిరి. అట్టిభౌతికపరిస్థితులు భరతఖండమునం దెన్నఁడయినఁ గలిగియుం
డెనా యను సంశయము కలుగవచ్చును. ప్రస్తుతమందు భూవ్యాసాగ్రములయిన
దక్షిణోత్తరధ్రువప్రాంతములు హిమభరితము లయి యుండుటయు, నుత్తరధ్రువము
మేరుసంజ్ఞ కనుకూల మయి దేవమాన మని పేరు గన్నదీర్ఘాహోరాత్రపరిమితియుఁ
జక్రభ్రమణరూపమయిన సూర్యచంద్ర నక్షత్రగతియు సంభవించుచుండుటయు,
నీ మొదలగుకారణములు లోకమాన్యుని గూడ నించుక భ్రమింపఁ జేసినవి. అయి
నను వేదములయందు ద్ఘాటింపఁబడిన జ్యోతిశ్శాస్త్రవిషయములే యుగపరివర్తన
మందు దృష్టములయినవో చెప్ప జాలమనియుఁ గడపటి పరివర్తనముంబట్టి పర్యా
లోచనముచేయగా నాంగ్లేయుల సిద్ధాంతములకంటె నతిదీర్ఘ కాలద్యోతకములు
కాఁజాలుననియు నిర్ణయించి వేదము లనాదులనవచ్చునను భావమును సూచించిరి.
గ్రంథకర్తలు కూడ చారిత్రకవాదములు చర్చించియు నిప్పటికిదియే వేదవాక్యము
లకు దగ్గరగా నున్నదనుచు నీ మతమును బ్రదర్శించిరి. కాని యాధునికపాశ్చా
త్యభూగోళవిజ్ఞానమును పురస్కరించుకొని లక్నో (లక్ష్మణపురీ) విశ్వవిద్యాలయ
పండితులగు ప్రొవెసరుసహానీగారు మొన్నమాపురమందిరమున నిచ్చినయుపన్యాస
ములో జలస్థలవిభాగమును ఖండపరివర్తనమును వివరించుచు దక్షిణోత్తరధ్రువ
ములని వాడఁబడు ధ్రువములకు కూడ చలనము కల దనునాశ్చర్యోక్తిని బ్రకటిం
చిరి. దాని వినినతోడనే నాహృదయ మమితానందకందళితమైనది. మేరువు హిమ
గిరి నొకకాలమున నుండియుండు ననియు నుత్తరధ్రువప్రాంతపరిస్థితు లీసప్తసింధు
దేశమునందే యుండెననియును నార్యజాతి యైరోపామధ్యభాగమునుండి కాని
యాశియామధ్యభాగమునుండి కాని భారతభూమికి వలసవచ్చినది కాదనియు నాకుఁ

జిరకాలమునుండి కలిగిననమ్మిక దృఢతరమైనది. కాళిదాసుచే కుమారసంభవమున వర్ణింపఁబడిన హిమగిరి వృత్తాంతము సత్యమై యీవిషయమునఁ బ్రమాణ మగుచున్నది. పాశ్చాత్యవిజ్ఞానసంపద నానాఁటికి విస్తరిల్లుచుఁ బ్రకృతిరహస్యముల నన్వేషించుచు వానిని బయలుపరచిన కొలఁదిని వేదఋషులసర్వజ్ఞత్వము సిద్ధాంతీకరింపఁబడుచున్నది. మహింజోదారో నాగరికత, సుమేరియను నాగరికతయను నవికూడ నీవిషయమును స్థిరపఱుచును. ఇందు కింకొకచిన్నయుదాహరణము దేశకాలములతత్త్వమును బాశ్చాత్య భౌతికశాస్త్ర మింతవఱకు బాగుగ గుర్తెఱిఁగియుండలేదు. శర్మణ్యదేశీయవిద్వాంసుఁడగు (Einstein) ఐన్‌స్టైన్ పండితుఁడు తనదివ్య పరిశోధనలవలన పాశ్చాత్యలోకమును విస్మితము గావించెను. ఆయన వలన సిద్ధాంతము చేయఁబడిన రిలెటివిటీ Relativity (సరియైన పారిభాషిక పదము లేమినిద్వంద్వతయందుము) యను నూతనసిద్ధాంతపు మహత్త్వ మింకను కొందఱు పాశ్చాత్యపండితుల కగమ్యగోచరముగా నున్న దనియు నుపనిషద్వేదాంతాభ్యాసకుల కది సుగమ మనియును మనశాంతిరామమూర్తి యెమ్. యే. ఐ. సి. యస్. పండితు లొకానొకతఱిదనయుపన్యాసములోఁ దెల్పియుండిరి. మఱియు దేశకాలము లేక స్వరూప మనియు వేఱొకభిన్నవస్తుపరిణామములు కాని వాస్తవముగఁదత్త్వములు కానేర వనియు నుడివిరి. ఈయుక్తిని గణితశాస్త్రముచే సాధించుశక్తి వారికి కలదు నా కది యసాధ్యము కాని

తస్యాఃపాకవిశేషేణ।
స్మృతంకాల విశేషణమ్॥
తస్మా ద్వా ఏతస్మా దాత్మన
ఆకాశ స్సంభూతః।
ఆకాశా ద్వాయుః॥

ఇత్యాదివాక్యములయందును కాలాకాశవన్నిత్యత్వమ్॥ అను వ్యావహారిక నిత్యత్వద్యోతనార్థక వాక్యములయందును పరమాత్మ దేశకాలాపరిచ్ఛిన్నవస్తువని తెలుపువేదాంతములందును భూరాదిసప్తవ్యాహృతులఁ దెల్పునుపనిషద్వాక్యములయందును నెట్టినిగూఢ ప్రకృతిరహస్యము లంతర్గతములై యుండునో వానిని నావంటియజ్ఞుఁడు గాక వివిధవిజ్ఞాన శేముషీధురంధరులగు పండితప్రకాండులు శోధింతురుగాక యని యొక్కయుదాహరణము మాత్రము సూచించితిని. ప్రకృతియందు చిత్తు జడము ననునవి భిన్నతత్త్వములుగా బ్రహించిన శాస్త్రములు ఖండితములైనవి.జడజగత్తునది చిదాత్మక మను నద్వైత సిద్ధాంతమునకుఁ బాశ్చాత్య భౌతిక విజ్ఞానశాస్త్రము తోడ్పడుచున్నది. కాణాదమతమునఁ బరమాణువాద మున్నది. ఇట్టిపరమాణువు లనబడునవి (atoms = అణువులు) ప్రకృతిశాస్త్రమున భిన్నములై అట్టి యుద్భేదమున ననంతశక్తి సంయుతము

లయి యుండుటయును, అట్టిఅణువులలోని విద్యుద్బిందువుల విన్యాసక్రమము ననుసరించి యణువ్యక్తిత్వ మేర్పడుచున్న దనియు నవీనభౌతిక సంప్రదాయసిద్ధమైనవచనము. కాని విద్యుద్బిందు విన్యాసమునకు (Disposition of Electrons) మూలకారణ మగుశక్తి పాశ్చాత్యుల కింకను గోచరించియుండ లేదు. సామాన్యమైన వెలుతురుయొక్క స్వభావమునుగూర్చి మొన్నటివఱకు సిద్ధాంతము లప సిద్ధాంతము లగుచుండినవి. జగదేకపండితుఁడగు మన సర్. సి. వి. రామను పండితుఁడుకదా దానితత్త్వమును లోకమునకు వెల్లడించెను. రామనువంటి పండితగ్రామణులు వైదికాగ్రేసరులయినచో వేదరహస్యములను గుర్తింపకపోరు. విజ్ఞానశాస్త్రము విజృంభించినకొలదిని మానవబుద్ధి వైభవము వికసించిన కొలదిని వేనవేలుగా విద్వాంసులు భూగర్భతత్త్వఖగోళ భూగోళమానవజన్మ వృత్తాంతాది వివిధశాస్త్రముల పారంగతులయినవారు వైవిధములఁ జర్చించి సార మెఱింగి సభలుగ కూడి పరిశోధించినచో వేదరహస్యము లీశ్వరకటాక్షముండిన భావగోచరములై యమితోత్సాహజనకము లగు నని ననుకోటివారలు నిరంతరముప్రతీక్షించుచుందురు. వైదికకర్మలనుగూర్చియు నార్యసాంఘికాచారములను గుఱించియు పాశ్చాత్యపండితులు మొదలగువారు భిన్నాభిప్రాయములు కలవారై యున్నారు. యజ్ఞేనహి దేవా దివం గతాః ॥ యజ్ఞోవైవిష్ణుః ॥ అను నీ మొదలగు వాక్యములు వేదమునందే కలవు. ద్రవ్యమయయజ్ఞములు పశుహింసాది లక్షణములు కల వని జ్ఞానయజ్ఞమే గీతాశాస్త్రము బోధించినది కావున నదియే యీకాలమున నాచరణీయ మనియుఁ గొందఱి యభిప్రాయము. యజ్ఞములు, హవిర్యాగము లేదును పాకయజ్ఞము లేదును సోమయాగసంస్థ లేదును నని సూత్రకారులమతమై యున్నది. సోమయాగమును కొన్నిపట్ల నిందించినను నద్దానిఁ బొగడుచు సోమము నుత్కర్ష చేసిన మంత్రములు కొన్ని పారశీకుల ఛందోవస్థానమునఁగలవు. సోమ మొక మత్తుపదార్థ మనియును నద్దానిగ్రోలి మత్తిల్లి మయి మఱచుటకుఁగా నీసోమయాగము లుద్భవించిన వని కొంద ఱందురు. ఆత్మ నిష్క్రియమున నసంస్కార్యమును నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావమును గావున జీవేశ్వరభేదమును పురస్కరించుకొని ప్రవర్తించిన వైదిక లౌకికశాస్త్రములన్నియు నవిద్యావిలసితము లని యద్వైతులసిద్ధాంతము. పశుహింసను విడిచి పిష్టపశువుతో యాగములు సలిపి కర్మఫలములఁ గోరునవి ద్వైతవిశిష్టాద్వైత సంప్రదాయములును దీక్షితపంథానుగు లగు కొందఱి మతమునై యున్నవి. యాగమందలి హింస హింస కా దనియును హింస యను దానియర్థము వేఱనియును పశువునకు బత్రినిధి లేదనియును ప్రభుసమ్మితము లగు వేదవాక్యములకు వికల్పములఁ గల్పింపరాదనియును కలివర్జ్యములు యాగములని నిషేధించినను వేదప్రచారమును వర్ణాశ్రమాచారధర్మములును

నిల్చియున్నంతవఱకు నవి యవశ్యమాచరింపఁ బడవలయుననియును, ఆస్తిక లోకము ఘోషించుచున్నది. పైని నుడివినరీతిని యాగముల కార్యసామాజికులు విపరీతార్థములు గల్పింపసాగిరి. వేదములేని వేదాంత మెచ్చటఁ గల దని యును బరమాద్వైతవాదమున నైష్కర్మ్యసిద్ధికిని జిత్తశుద్ధికిని మూలకారణము లగు వైదికకర్మములు విడువ రాదనియును గీతావాక్యముల నుదాహరించు పండిత శ్రేష్ఠులు కలరు. "దీనిభావమేమి తిరుమలేశ" యని యస్మదాదులు సందేహాందోళిత మనస్కులై యుఱ్ఱూఁతలూఁగుచుందురు. వివరించి చూడ సృష్టికార్యమే యజ్ఞరూపమున జరిగినట్లు కానవచ్చును. పురుషసూక్తమును దైత్తిరీయమునందలి "ప్రజాపతి రాత్మనో వపాముత్ఖిదత్" ఇత్యాదివాక్యములును గభీరభావముల వ్యక్తిపరచుచున్నవి. దయామయుఁడగు పరమేశ్వరుడు తనశరీరమును యాగము కావించి సృష్టిచేసెను. ఆహా! యెట్టి మహత్తరాశయము. యేసుక్రీస్తు తన శరీరమును బలిసమర్పించి పాపులకు గతి నొసంగెనుకదా! ఆత్మయాజీ స్వారాడ్భవేత్ ॥ అను మనువాక్యమును స్మరణకుఁ దెచ్చుకొనవలయును. మస్తిష్కము పురోడాశ మనియే పురుషశిరస్సున నెనిమిది కపాలములుంటంజేసి "యాగ్నేయ మష్టాకపాలం నిర్వపతి" యను నిట్టివాక్యముల కుపపత్తులు భాష్యముల వివరింపఁబడియుండెను. నరమేధాది దురాచారములకు కూడ వేదము తావైనంగా నని యపభ్రమలు పొందుటకంటెఁ బురుషజీవిత మొకయుత్కృష్టయాగరూప మని భావించుట సర్వసమంజసము. ఇట్టిక్లిష్టసమస్యల నూహించి విప్పుట బహుళాయాససాధ్య మని విజ్ఞులకు గోచరింపక మానదు. బైబిలుగ్రంథమందుగూడ నరమేధప్రశంస గల దనుటయు భగవంతునికి దనుజుని బలిగా నీయ సమకట్టిన వాని మందలించి ఛాగపశువు నొసంగుటకై హెచ్చరించిన బైబిలులోని భగవద్వాక్యమును స్మరించిన నిట్టిభావము లన్నిమతగ్రంథములందును కల వనియు వానిగూఢమర్మము లెఱుంగనిమనకు వింతగఁదోచిననునవ్వానివలన నాగ్రంథముల సత్యత కించుకేనియు న్యూనత వాటిల్ల దని బుద్ధియు మంతులకుఁ దోపకమానదు. సృష్టియందలి నిగూఢ రహస్యముల దృశ్యప్రదర్శనములే యాగ సంస్కారములుగఁ గన్పట్టకమానవు. అలౌకికవిషయము లగుటను మానవ బుద్ధికి సులభముగా గోచరింపనేరవు. గ్రంథవిస్తరభీతి నీవిషయ మింతటితో ముగింపవలసివచ్చినది.

## ఆర్యవిజ్ఞాన సంపద.

ఆర్యవిజ్ఞానసంపద వేదములఁ గానవచ్చునంతవఱకు నతిమానుషముగఁ దోపకమానదు. వైదిక మంత్రార్థముల వివరించుపట్లు నార్యవిజ్ఞానమును బ్రకటించుతఱి నార్యులకు కృషివాణిజ్యాదిపరిశ్రమముల బ్రావీణ్యము కల దనియు ఖనిజలోహాది సాధన సంపద గల దనియును నెడారులను పచ్చికబయళ్లను పశు

చారణవృత్తితో చర్య జరుపువారలు కాక నగర పురాదిస్థావర ప్రతిష్ఠానములు కలవారై సంఘీభావమున రాష్ట్రసంపదలు కూడ కలవారలనియు నుడువుట యాశ్చర్యజనకములు కాకమానవు. అల్పమేధస్కులగు మనుజుల విజ్ఞాన సీమయెక్కడ! త్రికాలవేత్తలు నతీంద్రియార్థ ద్రష్టలు నగు నార్య మహర్షుల విజ్ఞాన సంపద యెక్కడ! పాశ్చాత్య సంఘములవలె ఘుణాక్షర న్యాయమున సాంఘికవృత్తి ఖేలనమున నార్యసంఘ మేర్పడినది కాదు. చిర స్థాయియై పటిష్ఠమై ద్రఢిష్ఠమై సర్వాంగ సుందరమై యన్యుల కజేయమై శాశ్వత శశ్వద్ధర్మముల ప్రతిష్ఠింపఁబడినది యార్యసంఘము. ఆర్య జాతీయాంతరాత్మ తేజః పుంజచ్ఛటలే వేదరాశి. అట్టి సనాతన ధర్మనిబద్ధ మగు నార్యజాతియం దంతఃకలహములఁబెంచి వర్ణసంకరకారకు లగువారలు నారకీయ జనములని వేఱుగఁ జెప్పనేల? యుగానుసరణముగ ధర్మగ్లాని యొకవేళ గలిగినను నైసర్గిక దీప్తిచే పునరుద్ధారమును గొనుశక్తి యార్యజాతియం దంతర్భావమునొంది యున్నది. మానవధర్మశాస్త్రము మానవకోటి కంతకును బ్రమాణము. అందలి ధర్మసూక్ష్మములు బాగుఁగ దిలకించుచో నేఁటికి ననుభవ గమ్యములు. మానవ ధర్మశాస్త్ర మహిమమును సాంఘిక శాస్త్ర సంబంధమునఁ దిలకింప నిచ్చగించు నెడల దానిని గుఱించి పండితశ్రేష్ఠులగు బాబు భగవాన్‌దాసు మహాశయుల గ్రంథమును దిలకింపుఁడు. మనుధర్మశాస్త్ర మేమి పాపము చేసెనో దానిని దగులఁబెట్టుటకై కొందఱు యత్నములఁ జేయుచుండిరి. కాని యది తగులఁబడ నేరదు. వర్ణాశ్రమధర్మ మార్యజాతికి సంపూర్ణ లక్షణము. మానవజాతి యెద్దియేని యొకవిధమున నీచాతుర్వర్ణ్య విభాగసృష్టి నంగీకరించుచున్నది. నైసర్గికవిభాగమును బోనాఁడి యాగంతుక పరిస్థితుల నవలంబించుచో నీరు పల్ల మెఱింగిన టెఱుఁగున యుగాంత మందయిన వర్ణవిభాగము కాకమానదు. ద్వంద్వాతీతులును నాత్మవంతులును సహం బ్రహ్మాస్మి సోహం బ్రహ్మ సర్వం ఖల్విదం బ్రహ్మ'' యను మహావాక్యార్థముల ననుభవమునకుఁ దెచ్చికొనిన విజ్ఞానఘనులు నగు వారలకు విధినిషేధములు లేవు. అత్యాశ్రములు వారలు. వ్యావహారిక దశయందు మాత్రము సృష్టితోఁ గూడ వర్ణాశ్రమధర్మ ముండునది యని గ్రహింపక తప్పదు. గాంధిమహాత్మునివంటి యత్యాశ్రమియును వర్ణాశ్రమధర్మము లుండి తీరవలయును గాని స్వైచ్ఛికరూపమునఁ బునస్సృష్టి కావలెననియెను. ఇది కేవలము ప్రమాద జనిత మని యాస్తికులు నమ్ముదురు.

## వైదికవాఙ్మయము.

వేదరాశి యనంతమనియు నపారమనియు బైని జెప్పియుంటిని. కర్మాంగోపయుక్తము లగు కొలది సంహితా బ్రాహ్మణములుమాత్ర మామ్నాయదశఁ

జెందియున్నవి. మన దౌర్భాగ్యవశమునఁ దక్కినవి ఖిలములైనవి. మన కగోచరములుగ నున్న వింకెన్ని కలవో మన యూహాల కతీతములు. బాబు భగవాన్‌దాసు పండితులు ప్రకటించిన ప్రణవవాదమను నుత్కృష్ట గ్రంథపీఠికలో వారు తెలియఁపరచిన తెలుఁగున సంధుఁడగు నొక పండితుఁ డా గ్రంథము నంతటిని మఱియు ననేక గ్రంథములను ధారావాహినిగా నిరర్గళముగ నొప్పగించువాఁడఁట. ఆయనవలన ఋగ్వేదమునం దొకలక్ష ఋక్కులును వానికి నమిత సంఖ్యగల మహేంద్రభాష్యాది భాష్యములు నున్నట్లును, ఇట్లే యల్పము లని మన మనుకొనుచున్న పెక్కు గ్రంథములకు శాస్త్రములకు శ్లోకగద్యాత్మకము లగు పెక్కు భాష్యములు కల వనియును వాని నన్నిటి నాయంధుఁడగుమహనీయుఁడు జిహ్వాగ్రమున నుంచుకొనె ననియును వివరించిరి. ఇది యొకయచ్చెరువుకాదు ఆర్యసంతతియొక్క మహాభాగ్య మిదియే. మనదురదృష్టవశమున పెక్కులమూల్య గ్రంథములు మృగ్యము లయినవి. కొన్నివిదేశగతము లయినవి. కొన్ని భూగర్భమునం దినిడియున్నవి. మఱికొన్ని పరశురామప్రీతిని బొందినవి. సంస్కృతవాఙ్మయమపారజలరాశి. వైదికవాఙ్మయము వాస్తవముగ ననంతమే. "వేదాక్షరాణియావంతి పఠితాని ద్విజోత్తమైః। తావంతి హరినామాని" యనునార్యోక్తి మృష కానేరదు. అథర్వణ సంహితకు కొన్నికల్పసూత్రాది గ్రంథములను నచ్చొత్తింపించి మనకు గానుక నిచ్చినపాశ్చాత్యపండితులు మనకు వందనీయులే. కాని వేమన చెప్పినదియే వేదమనిమాత్రము విశ్వసింపరాదు. విధర్ములును విదేశీయులు నగువిద్వాంసులే తమజీవితముల ధారవోసి యిట్టి పరిశ్రమము చేయుచుండ భారతీయు లుదాసీను లయి యుంట కడుంగడు శోచనీయము. గ్రంథకర్త లగు మల్లాద సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృతవాఙ్మయచారిత్రమును రచించి గోచరించెడు గ్రంథరాజముల పరిచయమును బ్రశస్తిని మనకుఁ జూపినందులకు మనకృతజ్ఞతకు పాత్రులు. వేదములు మూఁడు మాత్రము మొదట నుండె ననియును నాథర్వణశ్రుతి యాధునిక మనియు నెంచుట సరి గా దని నామదికిఁ దోచుచున్నది. త్రయీశబ్దము సంఖ్యను మాత్రమిచట నిర్దిష్టము చేయదు. చత్వారో వేదాః। అను ప్రామాణ్యవచనము కలదు. యజ్ఞోపయుక్తము లగు వేదములు మూడగుటను బ్రధానములుగ గణింపఁబడినవి.

అగ్నివాయురవిభ్యస్తు త్రయం బ్రహ్మసనాతనమ్।
దుదోహయజ్ఞసిద్ధ్యర్థమ్ ఋగ్యజుస్సామలక్షణమ్॥
అనిమనువచనము.

దాశతయ్యీ యని ఋగ్వేదమున కొకనామాంతరము కలదు. దాశతయ్యీ యనుశబ్దము వలన ఋక్కులసంఖ్యయు తేటపడును.ఋగ్వేదాధ్యయనమున కత్యంతోపయుక్తము లగు పది గ్రంథములను నిరంతరపాఠముగ పఠనముచేసిన వారలే

దశగ్రంథాలవారైరి. వేదవిభాగమును జేసి వ్యాసులు అన్వర్థనామధేయము కలవారై వేదవ్యాసులయిరి. ఋగ్వేదమునను సామవేదమునను యజుస్సులున్నను యజుర్వేదమున ఋక్సామములున్నను బాహుళ్యవశమున నాయాయిసంజ్ఞలనిడిరి. ఆయనాచార్యులసిరి. అత్యల్పమేధావంతులగు మనుజులకు దుష్కరమైనందున వేదరాశి విభజింపఁబడినది. ప్రధాన ఋత్విగ్గణములయొక్క కర్మవిశేషములనుబట్టి విభాగమేర్పడెను.

ఋగ్వేదేన హోతా కరోతి।
యజుర్వేదే నాధ్వర్యుః।
సామవేదే నోద్గాతా।
సర్వైర్బ్రహ్మా॥

అనువాక్యమున బ్రహ్మ యాథర్వణముగూడ దెలిసి యధ్వరరక్షణము చేయఁగలవాఁడై యుండవలయునని గోభిలసూత్రమునఁ గలదు. సత్యవ్రత సామశ్రమిగారి నిరుక్తపర్యాలోచనమను గ్రంథమును జూడుఁడు విశదమగును. యజ్ఞనిర్వర్తనముకొఱకు మూఁడువేదముల యావశ్యకతయుఁ గలదు. నాల్గవవేదము యజ్ఞరక్షణముకొఱకగును. శాంతికపౌష్టికాభిచారములయందుమాత్ర ముపయోగముగల యాథర్వణముయొక్కవ్యాప్తి సంక్షిప్తమైన నొక యాశ్చర్యము కానేరదు. ఋగ్వేదమునందలి ఋక్కులన్నియును యాజ్యాపురోను వాక్యలుగా నుపయోగింపఁబడవలసినవిగా నున్నవి. కొలది ఋక్కులుమాత్ర మట్లుపయోగింపఁబడుచు మఱికొన్ని యాశ్వినాదిశస్త్రములుగా పఠింపఁబడుట కల్పసూత్రములను ననుక్రమణికల ననుసరించి కానవచ్చుచున్నది. "భూః" అనువ్యాహృతివలన ఋగ్వేదము వైశ్యజాతియు నుత్పన్నము లయినవి. "భువః" అనుదానివలన యజుర్వేదము క్షత్రియులును, "సువః" అనుదానివలన బ్రాహ్మణులును సామవేదమును నుత్పన్నములు. గార్హపత్య, దక్షిణ, ఆహవనీయాగ్నులును, గాయత్రీ త్రిష్టుప్, జగతీచ్ఛందస్సులును ప్రాతర్మాధ్యందినసాయం సవనములును రథంతర వామదేవ్య బృహత్ సామములును పరస్పరసంబంధము గలిగియున్నవి. ఈవిషయము నిరుక్తమునదైవతకాండమునను నుపనిషత్తులను బ్రాహ్మణములను బాగుగఁ దెలియఁదగును. అగ్ని వాయువు ఆదిత్యుడు నీమూఁడు వేదములకుఁ బ్రధానదేలులు. ఆదిమంత్రముల సూచింపఁబడిరి. అగ్నిమీళేపురోహితమ్॥ ఇషేత్వోర్జేత్వావాయవస్థోపాయవస్థ॥ అగ్నఆయాహివీతయే గృణానోహవ్యదాతయే॥ ఆథర్వణమున శాంతికరము లగునుదకము లాదిని పేర్కొనఁబడినవి. బ్రహ్మయజ్ఞక్రమము దీనిననుసరించినదే. యజ్ఞం వాతా దారభే, అని యధ్వర్యుఁడు మొదలిడును. అగ్ని వాయు సూర్యులు వాస్తవముగ నొకదేవతయే. స్థానభేదమువలన నామాంతరములు. అగ్ని, దేవతలలో నవముఁడు విష్ణు వధికుడు.

అగ్ని దేవతలలో మొదటిసృష్టి. అగ్నిం దేవతానాం ప్రథమ మసృజత. పాశ్చాత్యుల సృష్టివిధానశాస్త్ర మెంతచక్కఁగ నిట నిరూపింపఁబడినదియో చూడుడు. భూమ్యాది గ్రహమండలములు మండుచుండు వాయురూపములయి యుండి ద్రవరూప మయిపిదప ఘనీభవించిన వఁట (Nebular Theory) అగ్నిః పూర్వరూపంఆదిత్య ఉత్తరరూపం। ఆపః సంధిః। వైద్యుతస్సంధానమ్." జ్వలనరూపమగు (నగ్ని వాయువు) ఆదిత్యరూపమగు ప్రాణవాయువును, వైద్యుతము (Electricity) వలన సంధానము చేయఁబడి సంధిరూప మగునుదకము లేర్పబడినవి. విజ్ఞానశాస్త్రమున Electrolysis యెలెక్ట్రొలిసిస్ ($H_2O$ = water) అని ఋజువు చేయఁబడిన విషయ మిదియే. ఆదిత్యుడు ప్రాణవాయు స్వరూపమని పాశ్చాత్యు లంగీకరించియే యున్నారు. సర్వభూత ప్రాణసమష్టిమూర్తియే యాదిత్యుఁడు. "యోఽసౌ తపన్నుదేతి। ససర్వేషాంభూతానాం ప్రాణానాదాయోదేతి." కావున నవే బ్రహ్మ హిరణ్యగర్భుఁడు త్రయీమయుఁడు విశ్వమూర్తి త్రిమూర్త్యాత్మకుఁడు జగచ్చక్షువు కర్మసాక్షియునై యున్నవాఁడు. "అగ్నౌప్రాస్తాహుతిస్సమ్య గాదిత్య ముపతిష్ఠతే" ఆదిత్యా జ్జాయతే వృష్టిః "భూమిం పర్జన్యాజిన్వంతి దివం జిన్వం త్యగ్నయ" ఇతి ఇత్యాదివాక్యము లూహ్యములు. సహస్రసంసూర్యతాయా ఇతివైశంపాయనః" ఇట్లనేక బ్రహ్మాండాధిపతులగు సూర్యులు కల రనుపాశ్చాత్య సిద్ధాంతము దృఢతర మగుచున్నది.

In the beginning there was the deep.
The Spirit of the Lord moved over the deep.

(*The Bible, Genesis.*)

ఇది బైబిలులోని ప్రథమవాక్యము సృష్టిని దెలుపవుది. దీనితో శ్రుతి వాక్యములఁ సరిపోల్చి చూడుడు.

అంభస్యపారే భువనస్యమధ్యే నాకస్యపృష్ఠే మహతో మహీయాన్.
శుక్రేణజ్యోతీంషి సమను ప్రవిష్టః ప్రజాపతిశ్చరతి గర్భేఅంతః।
"హిరణ్యజ్యోతిః సరిరస్యమధ్యే"
ఇమే వై లోకాః అపాంరసః॥
హిరణ్యగర్భంపశ్యత జాయమానం॥

ఇత్యాదివాక్యముల తాత్పర్యము నించుక నిదానించి తిలకించినచో నిజము తేటపడును. దిక్ప్రదర్శనముగా నింతవఱకు నాకుఁదోఁచినవానిని సంగ్రహించివ్రాసితిని. ఇందులేనిదందును లేదు అందుగల దిందునుగలదు, ఇందులేని దెందులే దనునార్యోక్తి స్పష్ట మగుచున్నది. కావున వేద మీశ్వరస్వరూపము నీశ్వర నిశ్వాసరూపము నగుటచే జగత్సృష్టికారణ మనుటలో నెట్టి సంశయము

నుండరాదు. ఏతౌవై సూర్యాచంద్రమ సో ర్మహిమానంబ్రాహ్మణోవిద్వా నభి జయతి । బ్రహ్మణోమహిమానమాప్నోతి। అనువాక్యముల యర్థమును దేవయానపితృయాన మార్గముల గలుగు నుత్తరాయణ దక్షిణాయన శుక్లకృష్ణ పక్షములగతియు నిడాపింగళా సుషుమ్నలతత్త్వమును జీవునకు బ్రహ్మభావమును బోధించును. ఇట్టి యమూల్యవిజ్ఞానఖనియగు వేదరాశి మనపాలిటి భాగ్యసంపదకావున నగణితకాలమునుండియు స్వరాక్షరపద భ్రంశములు లేకుండ కేవలము శ్రుతిరూపమున బెద్దలవలన కాపాడుకొనఁబడుచు వచ్చుదానిని భద్రపరచుకొని యిహపరములసాధించు చతుర్వర్గ పురుషార్థముల వృద్ధినొంది యార్యసంతతి తమయమోఘవి జ్ఞానసంపదల దిక్కుల వెదచల్లి మానవాళియజ్ఞానతిమిరమును బటాపంచలుకావించి తన నైసర్గికదివ్యప్రభాభిరింఛోళితేజః పుంజముల ముల్లోకముల నావరించి విలసిల్లుఁగావుత మని వేదమూర్తిని వేఁడుకొనుచునింతటితో విరమింపఁదలచినాఁడను.

శ్లో॥ నమస్తే గార్హపత్యాయ ।
నమస్తే దక్షిణాగ్నయే ।
నమ ఆహవనీయాయ ।
మహావేద్యై నమోనమః ॥
కాండద్వయోపపాద్యాయ । కర్మబ్రహ్మస్వరూపిణే ।
స్వర్గాపవర్గరూపాయ । యజ్ఞేశాయనమోఽస్తుతే ॥

ఓమ్ ॥ సహ నావవతు ।
సహ నౌభునక్తు ।
సహ వీర్యంకరవావహై ।
తేజస్వి నా వధీత మస్తు
మా విద్విషావహై ॥

ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

ఆంగిరసఫాల్గునపూర్ణిమా
భానువారము.
విశాఖపట్టణము.
12 మార్చి 1933.

విబుధవిధేయుఁడు,
భారద్వాజగోత్రుఁడు.
ప్రభల లక్ష్మీనరసింహము.
(B. A. B., L. Advocate)

# ఏతచ్చరిత్ర రచనోపయుక్త గ్రంథనామపట్టిక.

## సంస్కృతగ్రంథములు, సభాష్యములు సవ్యాఖ్యానములు.

---

1. అథర్వసంహిత నేపకలాలప్రతి, శంకర
2. అమరకోశము. [పాండురంగప్రతి.
3. అష్టాధ్యాయి, పాణిని
4. ఆపస్తంబశ్రౌత, గృహ్య, ధర్మసూత్ర
5. ఆశ్వలాయన శ్రౌతవృత్తి. [ములు.
6. ఋక్ప్రాతిశాఖ్యము. శౌనకుఁడు ?
7. ఋగ్విధానము. ,,
8. ఋగ్వేదసంహిత. మాక్సుముల్లరుప్రతి.
9. ఐతరేయ బ్రాహ్మణము
10. ఐతరేయారణ్యకము.
11. కర్ణాటచ్ఛందోఽంబుధి. నాగవర్మ
12. కాండానుక్రమణి.
13. కాత్యాయన వార్త్తికములు.
14. కౌషీతకి బ్రాహ్మణము.
15. గోపథబ్రాహ్మణము.
16. గౌతమ ధర్మసూత్రము.
17. చరణవ్యూహము.
18. చరణవ్యూహ పరిశిష్టము.
19. ఛాందోగ్యోపనిషత్తు.
20. తంత్రవార్త్తికము. కుమారిలభట్టు.
21. తాండ్యబ్రాహ్మణము.
22. తైత్తిరీయ సంహిత-కృష్ణ యజుర్వేదము.
23. తైత్తిరీయ బ్రాహ్మణము.
24. తైత్తిరీయారణ్యకము.
25. తైత్తిరీయోపనిషత్తు.
26. తైత్తిరీయ ప్రాతిశాఖ్యము.
27. దేవీభాగవతము.
28. నారదశిక్ష
29. నిరుక్తము. యాస్కుఁడు
30. నృసింహ తాపిన్యుపనిషత్తు.
31. న్యాయసూత్రములు.
32. పరాశరస్మృతి-మాధవీయవ్యాఖ్య.
33. పూర్వ మీమాంసాదర్శనము, శబరస్వామి
భాష్యములో
34. ప్రాకృత ప్రకాశము. వరరుచి, డాక్టరు
వైద్యాగారి పీఠికతో.
35. బృహదారణ్యోపనిషత్తు
36. బృహద్దేవత.
37. బోధాయన గృహ్యసూత్రములు.
38. బ్రహ్మసూత్ర భాష్యము. శంకరాచార్య
కృతము.
39. భాగవతము.
40. మత్స్యపురాణము.
41. మనుస్మృతి.
42. మహాభారతము.
43. మహాభాష్యము. పతంజలి.
44. మాండూక్యోపనిషత్తు.
45. ముండకోపనిషత్తు.
46. ముక్తికోపనిషత్తు.
47. యాజ్ఞవల్క్యస్మృతి.
48. వంశబ్రాహ్మణము.
49. వాజసనేయ సంహిత.
50. వాయుపురాణము.
51. వాల్మీకి రామాయణము.
52. విష్ణుపురాణము.
53. వేదాన్త పరిభాష.
54. వైతానసూత్రము
55. శతపథ బ్రాహ్మణము.
56. శుక్లయజుః ప్రాతిశాఖ్యము కాత్యా
యనుఁడు.
57. షడ్భాషాచంద్రిక చెరుకూరి లక్ష్మీధర
శాస్త్రి.
58. షడ్గురుశిష్యుని వేదార్థదీపిక.
59. సర్వానుక్రమణి
60. సాంఖ్యకారికలు.
61. సిద్ధాన్తకౌముది భట్టోజీ దీక్షితులు.
62. సూర్యసిద్ధాన్తము. భాస్కరాచార్యులు.
63. లిఖితసంస్కృత గ్రంథవిషయ వివరణ
పట్టికాసంపుటములు.
౧. తంజావూరు మహారాజ లైబ్రరీ.
౨. మదరాసు ఓరియంటల్ లైబ్రరీ.
౩. బొంబాయి ,,

౪. కలకత్తా ,,

౫. లండన్ ఇండియా ఆఫీసు ,,

## ఆంధ్ర గ్రంథములు.

1. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము కొ. వెం. లక్ష్మణరావుగారి "అక్షరములు అథర్వవేదము" అనువ్యాసములు.
2. వేదభూమి అ. వెం. చలపతిరావుగారిది.
3. వైదికనిలయము
4. వేదకాలనిర్ణయము.

(3, 4) తిలక్ పండిత గ్రంథముల యాంధ్రానువాదములు. మా. సత్యనారాయణశాస్త్రి కృతములు.

## ఇంగ్లీషు గ్రంథములు.

1. 'ఆర్యులయుత్తరధ్రువనివాసము' 'The Arctic Home in the Vedas' లోకమాన్య బాలగంగాధర తిలక పండితులు.
2. డాక్టరు ఇసాక్ టైలరు పండితుని 'Origin of the Aryans'
3. ష్లెగల్ పండితుని 'Origin of the Hindus.'
4. బన్సెన్ పండితుని 'Outlines' Vol. I.
5. మాక్సుమల్లరు పండితుని "Lectures on the Science of Language."
6. మెగ్డోనలు పండితుని 'History of Sanskrit Literature.'
7. గోవెన్ పండితుని 'History of Indian Literature.'
8. లార్డ్సుఎల్ఫిన్‌స్టన్ పండితుని 'History of India.'
9. మూయిర్ పండితుని 'Original Sanskrit Texts' Vol. II.
10. చింతామణి వినాయక వైద్యపండితుని 'History of Sanskrit Literature.'
11. బర్నెలు పండితుని 'South Indian Palaeography.'
12. మాక్సు మల్లరు పండితుని 'History of Ancient Sanskrit Literature'
13. మాక్సు డంకరు పండితుని 'History of Antiquity.'
14. గోల్డు స్టూకర్ పండితుని 'Panini' his place in Sanskrit Literature.'
15. R. G. Bhandarkar Commemoration Vol.
16. కాల్డువెల్లు పండితుని 'Comparative Grammar of the Dravidian Languages.'
17. Journal of R. A. S. Vols. II, V, XVI.
18. పార్గిటర్ పండితుని 'Ancient Indian Historical Traditions.'
19. అవినాశ చంద్రదాస పండితుని 'Rig-Vedic India.'
20. వీబరు పండితుని 'History of Indian Literature.'
21. ఏ. బి. కీతుపండితుని 'ఆంగ్లీకృతకృష్ణయజుర్వేదము'
22. విట్నీ పండితుని 'ఆంగ్లీకృతాథర్వవేదము' Horvard Oriental Series Vols. 7, 8.
23. బాలగంగాధరతిలక పండితుని 'Orian' మృగశీర్ష.
24. చక్రవర్తి పండితుని 'A short History of Sanskrit Literature.'
25. బ్లూంఫీల్డు పండితుని 'Vedic concordance.'
26. స్టైన్‌కోనో పండితుని పైశాచీ భాషావిషయక వ్యాసము.
27. సర్ జాన్ మార్షల్ పండితుని 'Mahinjo-daro and the Indian Civilisation.'
28. డాక్టరు బ్యూహ్లరు పండితుని ఆపస్తంబధర్మసూత్ర పీఠిక.
29. ఏ. బి. కీతుపండితుని 'ఐతరేయారణ్య పీఠిక.

ఈపట్టికలోఁ జేర్పఁబడని వింకను కొన్ని గలవు. అట్టివి గ్రంథపఠనసందర్భమునఁ దెలియఁగలవు మఱియు, ఆర్యన్ క్రెడిలు మొదలగు కొన్నియాంగ్ల గ్రంథములలోని వచనములు పూర్వోక్తగ్రంథములనుండి గ్రహింపఁబడిన వగుటచే వాని నిందు చేర్పనలేదని తెలియనగును,




# వి జ్ఞ ప్తి.

---

సంస్కృతకవి జీవితము, ఆంధ్రభాషానుశాసనము మొదలగు బహు గ్రంథములు రచియించి చిరకాలముగా సంస్కృతాంధ్రభాషాసేవ యొనర్చుచున్న విఖ్యాతపండితు లగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు నిర్మించిన యీ వైదికవాఙ్మయచరిత్రమును ససాకల్యముగాఁ జదివి సంస్కృతభాషా వాఙ్మయచరిత్ర ప్రశంసారూపముగా సంతోషపూర్వకముగాఁ బాఠకలోకమున కీ విజ్ఞప్తి యొనరించు భాగ్యము నా కబ్బినది. ఉదారహృదయు లగు పాఠకోత్తము లిందలి గుణము గ్రహింతురుగాక,

గీర్వాణవాఙ్మయ చరితమునకుఁ దొలుత దారి తీసినవారు పాశ్చాత్యపండితులు. అందు ప్రధానముగా శార్మణ్య దేశీయ సంస్కృతపండితులు. వారు సంస్కృత సారస్వతేతిహాస విషయక గ్రంథములు రచియించినపిమ్మటనే భారతీయ పండితుల దృష్టి యటు ప్రసరించినది. ఇంచు మించు రెండుశతాబ్దములనుండి పాశ్చాత్యులు గీర్వాణవాఙ్మయమున కఖండసేవ యొనరించుచున్నారు. నిష్పాక్షికదృష్టితో నీవిషయముం దలఁచుకొనినపు డెల్లఁ బ్రాజ్ఞుఁ డగు నేభారతీయునిమనంబున నైన నాశ్చర్యము, లజ్జ కృతజ్ఞత ముప్పిరిగొనక మానవు. సంస్కృతసారస్వతము తత్పూర్వము పాశ్చాత్యుల కంతగాఁ దెలియదు. తద్వాఙ్మయముం బరివేష్టించి యున్నయాచ్ఛాదనమును పాశ్చాత్యపండితులు 150 సంవత్సరముల క్రిందటఁ దొలఁగించి యుండిరి. దీనినే వారు ('Discovery of Sanskrit') అనుచుందురు,

భారతీయసారస్వత మేశాఖయందుఁ జూచిన నపారత్వముం బ్రదర్శించునని 'సర్ విలియమ్ జోన్స్' (Sir William Jones) పండితుఁడు నుడివి యున్నాడు.

గీర్వాణభాషా వాఙ్మయముల వైశిష్ట్యమును మఱియొక పాశ్చాత్య సంస్కృతపండితుఁ డిట్లు నుడివియున్నాఁడు.

"To the Sanskrit, the antiquity and extent of its literary documents, the transparency of its grammatical structure, the comparatively primitive state of its accent system and thorough grammatical treatment it has early received at the hands of native scholars, must ever secure the foremost place in the comparative study of Indo-Aryan Researches."

'సర్ మోనీర్ విలియమ్స్' (Sir Monier Monier Williams) అను పాశ్చాత్యసంస్కృత పండితుఁడుగూడ సంస్కృత వైశిష్ట్యమును స్వనిర్మితమగు "ఆధునిక హైందవదేశము" అను గ్రంథరాజమునఁ జక్కఁగ విశదీకరించి యున్నాఁడు[1]. అట్లే శార్మణ్యదేశీయ విద్వత్కవికంఠీరవుఁడును, విమర్శకాగ్రేసరుఁడు నగు "ష్లెగెల్" (Schlegel) పండితుఁడు తన 'సారస్వతేతిహాస విచారము'ను గ్రంథమున సంస్కృతభాషా ప్రాశస్త్యము నుగ్గడించియున్నాఁడు[2].

వైదికవాఙ్మయమునందలి లిఖితగ్రంథములను సంపాదించి, ముద్రించి, వైదికసారస్వతాభ్యుదయమునకుఁ దోడ్పడిన పాశ్చాత్య సంస్కృతపండితు లందఱకు భారతీయులు ఋణగ్రస్తు లనుట నిక్కము. వారినిర్నిద్రదీక్షచేతనే వైదిక వాఙ్మయవిషయక గ్రంథములు క్రిమికీటకములపాలు గాక సూర్యాలోకభాగ్యము వడసినవి. ప్రప్రథమమునఁ గ్రీ. శ. 13, 14 శతాబ్దులలోఁ పాశ్చాత్యదేశీయులు భారతీయశాస్త్ర విజ్ఞానవైభవమును 'అరేబియా' దేశీయులవలనఁ దెలిసికొనిచుండిరి. క్రీ. శ. 16-వ శతకమునుండియు నైరోపీయమత ప్రచారకులు భారతీయుల సనాతన భాషావాఙ్మయములం గూర్చి వినుటయే కాక, తత్పరిచయభాగ్యముం గూడ నించించుక పొందుచుండిరి. సుమారు 3 శతాబ్దముల క్రిందట (1651 లో) 'అబ్రహామ్‌రోజర్' అను మతప్రచారకుఁడు భర్తృహరి 'సుభాషితత్రిశతి'ని 'పోర్చుగీస్' భాషలోనికిఁ బరివర్తింపించి, దానిని 'డచ్' భాషలోని కనువదించియున్నాఁడు. ఇతఁడు ప్రాచీనభారతీయ బ్రాహ్మణవాఙ్మయము నధికరించి ('Open door to the hidden Heathendom') అను నొకగ్రంథముంగూడ నిర్మించియున్నాఁడు. ఐనను 150 వత్సరముల క్రిందటిదనుక భారతీయమేధా సంపదంగూర్చి పుక్కిటిపురాణముగఁ జెప్పుకొనుట దక్క ఐరోపాదేశములో సంస్కృత సారస్వత వైభవము నిదమిత్థమని యుద్ఘోషించు ప్రమాణగ్రంథ మెద్దియు లేదయ్యె. క్రీ. శ. 17-వ శతాబ్దిలో నైరోపీయుఁ డగు 'నొబిలియస్' (Rev. Roberto de Nobilius) అను 'జెసూట్' మతప్రచారకుఁ డొకఁడు వేదగ్రంథసంపాదనకుఁ బ్రయత్నించి, చెన్నపురి రాజధానినుండి 'యజుర్వేద'పుఁ బ్రతినొక పండితునియొద్దనుండి సంగ్రహించి 'ఐరోపా' తీసికొనివెళ్లి తనయొద్ద 'యజుర్వేద ము'న్నట్లు ప్రచురించెను. ఇది నిజమైన 'యజుర్వేదమే' యనుకొని, సుప్రసిద్ధ ఫ్రెంచి కవీశ్వరుఁ డగు 'వ్రాల్టెయిర్' (Voltaire) దీనిం బఠించి, ప్రశంసించి 'ఫ్రాన్స్‌దేశరాజకీయ గ్రంథాలయము'లో దీనిం జేర్చెను. కాని యిది నిజమైన 'యజుర్వేదము' కాదు. వై భారతీయపండితుఁ డాపేరితోఁ గల్పించిన గ్రంథము. ఇట్లే 'కోల్‌బ్రూక్' పండి

1. Sir M. M. William's "Modern India".
2. History of Literature by Schlegel. P. 117.

తుఁడు (Colebrooke) కూడ వేదసంగ్రహణమునకుం బ్రయత్నించి, మోస పోయెను. తరువాత 1789 ప్రాంతముల 'పోలీర్' (Colonel Polier) అను నాతఁడు భగీరథ ప్రయత్న మొనర్చి జయపురమున నాల్గువేదముల ప్రతులను సంపాదించి వానిని 'బ్రిటిష్ మ్యూజియమ్' (British Museum) లోఁ జేర్చెను. కల్పిత వేదగ్రంథవృత్తాంతము పాశ్చాత్యపండితులలో వేదముల విషయమై యవిశ్వాసముం బుట్టించెను. సంస్కృత సారస్వతమే లే దను నొక యపోహ వారిలో మొన్న మొన్నటిదనుకఁ బ్రబలియుండెను. 'స్టివార్ట్' ( Dugald Stewart) అను తత్త్వవేత్త సంస్కృతవాఙ్మయమే కాక, సంస్కృతభాషయు మిథ్యయేయనియు, 'అలెగ్జాండర్' దండయాత్రలకుఁ బిమ్మట 'గ్రీక్' భాషా వాఙ్మయపద్ధతిని సునిపుణధిషణు లగుబ్రాహ్మణులు సంస్కృతభాషాసారస్వత ముల సృష్టించి యుందు రనియు వ్రాసియున్నాఁడు. 1838 లోఁగూడ 'డిబ్లిన్' నగరపండితుఁ డొకఁడు పై యభిప్రాయమును బ్రబలముగ సమర్థించుచు వ్యాసము వ్రాసియున్నాఁడు.

1830 లో 'రోసెన్' పండితుఁడు (Prof. Rosen) ఋగ్వేదమునందలి కొన్నిసూక్తముల 'లండన్' నగరమునఁ బ్రచురించెను. 1838 లో నీతఁడు లండన్‌నగరమునఁ బ్రచురించిన ఋగ్వేద ప్రథమాష్టకముతోడనే వైదికశబ్ద తత్త్వగవేషణము నిజముగా నారంభమైన దని చెప్పవలెను. ఈతఁ డకాల మృత్యువువాతఁబడుటంజేసి తక్కినయష్టకములు ప్రచురింపఁబడ వయ్యె. కాని యితనివైదికవాఙ్మయసేవ పాశ్చాత్యపండితుల మనంబుల నరికట్టివైచెను. దీనికి ఫలముగ ఫ్రాన్సుదేశమున 'బర్నాఫ్' (Eugene Burnouf) పండితుని యాధ్య క్ష్యమున వేదాధ్యయనమునకు బీజారోపణ మొనర్పఁబడినది. తచ్ఛిష్య శిఖామణి యగు 'రాథ్' (Prof. Rudolf Roth) పండితుఁడు 1846 లో వైదికవాఙ్మ యేతిహాసములంగూర్చి ('On the Literature and History of the Veda') యొకానొకగ్రంథము రచించి ప్రకటించెను. ఇందలి కొన్నిభాగములను 1847-48 నడుమ, 'మూయిర్' (J. Muir) పండితుఁ డాంగ్లభాషలోనికిఁ బరివర్తించి 'వంగీయాసియా పరిషత్పత్త్రిక' ('Journal of the Asiatic Society of Bengal') బ్రచురించియున్నాఁడు. 'లిడ్లే' (Lydley) పండితుని యభిప్రాయాను సార మాపరిషత్తు 1847 నుండి 'భారతీయగ్రంథమాల' (Bibliotheca Indica) యనుపేర గ్రంథములఁ బ్రకటింప మొదలిడెను. ఆవత్సరముననే ఆచార్య 'రోయర్' (Dr. Roer) ఋగ్వేదప్రథమ ద్వితీయాష్టకముల నాంగ్లానువాద ముతోఁ బ్రచురించియుండెను. కాని ప్రాచ్యభారతీయ సంఘము (East India Company) వారి యాలంబమున 'మ్యాక్స్‌మ్యూలరు' పండితాగ్రణి (Prof. Max Muller) సాయణభాష్యముతోడను, 'విల్సన్' పండితుని (Prof. H. H.

Wilson) యాంగ్లానువాదముతోడను ఋగ్వేదమును బ్రకటించుచున్నాఁడని తెలియఁగా నతఁడా ప్రయత్నమును మానివేసెను. 1849-75 నడుమ 'మ్యాక్స్ మ్యూలరు' భట్టాచార్యుఁడు ఋగ్వేదము నాలుభాగములుగా, (టీక, శబ్దానుక్రమణికలతోఁ బ్రచురించెను. ఈతఁడే 1856-59 నడుమ ఋగ్వేదప్రథమాష్టకమును 1873 లో ఋగ్వేదమును బూర్తిగాఁ బదపాఠముతో ముద్రింపించెను. 1877 లో 'ఔఫ్రెట్' పండితుఁడు (Prof. Th. Aufrecht) ఋగ్వేదము నంతను రోమన్‌లిపిలో, ననుక్రమణికతోఁ గూడఁ బ్రకటించెను. 1848-51 నడుమ నీ వేదము ఫ్రెంచ్‌భాషలోని కనువదింపఁబడెను. 1876 లో 'లుడ్విగ్' పండితుడును (Prof. Alfred Ludwig), 1876-7 లో 'గ్రాస్‌మన్' పండితుఁడును (Prof. Hermann Grassmann) ఋగ్వేదమును శార్మణ్యభాష (German) లోనికిఁ బరివర్తించి, ప్రచురించిరి. 'బోట్లింగ్' పండితుఁడును (Prof. Bohtlingk) 'రాథ్' (Prof. R. Roth) పండితుఁడును, 1853-75 నడుమ, రష్యా దేశరాజధాని యగు 'సెయింట్‌పీటర్స్‌బర్గు' (St. Petersburgh) నగరమున 'సంస్కృతజర్మన్ బృహన్నిఘంటువుం' బ్రకటించిరి. 1848-52 నడుమ 'రాథ్' యాస్కుని 'నిరుక్తము'ను, వ్యాఖ్యతోడను, తనటిప్పణులతోడను ముద్రింపించెను. 1863 లో 'హాగ్' పండితుఁడు (Prof. Martin Haug) 'ఐతరేయ బ్రాహ్మణము' ను రోమన్‌లిపిలో రెండుసంపుటములుగా బ్రచురించుటయే కాక దాని కాంగ్లపీఠికాను వాదములంగూడఁ బ్రకటించెను. 1864-65 లో 'స్టెన్జ్లర్' (Prof. Stenzler) పండితుఁ 'డాశ్వలాయన గృహ్యసూత్రము'ను జర్మన్ భాషానువాదముతోఁ గూడఁ బ్రచురించెను. ఆసమయముననే 'ఓల్డెన్‌బర్గ' పండితుఁడు (Prof Hermann Oldenburg) 'సాంఖ్యాయన గృహ్యసూత్రము'ను, భాషాంతరీకరణ టిప్పణులతో, 'వీబర్' (Prof. Weber) పండితుని పత్రిక ('Indische Studien') లోఁ బ్రచురించెను. 1857-8 లో ఋగ్వేదము యొక్క 'శౌనకప్రాతిశాఖ్యము'ను, భాష్యానువాదములతో, ఫ్రెంచ్‌దేశీయ వైదికపండితుఁ డగు 'రేనీర్' (Prof. Regnier) ప్రచురించెను. 1856-69 లో దీనినే 'మ్యాక్స్‌మ్యూలరు' జర్మనీభాషానువాదముతో ముద్రించెను. తన పత్త్రికలో 'వీబర్' పండితుఁడు 1858 లోఁ 'పాణినీయశిక్ష'ను, 1863 లో రోమన్‌లిపిలోఁ బింగళుని 'ఛందస్సూత్రము'ను బ్రకటించెను. 'మేయర్' పండితుఁడు (Rudolf Mayer) 1877 లో 'ఋగ్విధాన, బృహద్దేవతల'ను టీకతో ముద్రించెను. 1862 లో 'హాల్' విద్వాంసుఁడు (Dr. Fitz Edward Hall) ఋగ్వేదముపై 'రావణభాష్యము'ను గొంతభాగము బ్రకటించెను, (In 'Asiatic Researches') ఇట్లు వైదికసారస్వతక్షేత్రమునఁ గఠోరకృషి సల్పిన పాశ్చాత్య సంస్కృతపండితుల మూలమున 'షడ్వింశబ్రాహ్మణము' 'సామ

విధాన బ్రాహ్మణము,' శుక్ల, కృష్ణ యజుర్వేదములు,' 'అథర్వవేదము,' 'పాతంజల మహాభాష్యము,' 'శాంకరశారీరకభాష్యము,' 'రామానుజీయ శ్రీభాష్యము మొదలగు ననేక గ్రంథములు ప్రచురింపఁబడెను. మఱియు వీరు వైదిక, పౌరాణిక వాఙ్మయముల నధికరించి యనేకవ్యాసములఁ బ్రచురించియుండిరి.

పాశ్చాత్యుల వేదసమన్వయపద్ధతి:—పాశ్చాత్య వైదిక విద్వాంసులలో 'గోల్డ్‌స్టూకర్' (Prof. Theodor Goldstucker) దిగ్దంతి. ప్రాచీనవేదభాష్యకర్తలగుయాస్క, మహీధర, సాయణాదులయం దీతని కమేయ గౌరవప్రపత్తులు గలవు. వీరిలో నుత్తరోత్తరులకంటెఁ బూర్వపూర్వులే ప్రమాణతరులని యీతని విశ్వాసము. వేదమునకుఁ దద్భాష్యవ్యాకరణ నిర్మాతలకు గాలవ్యవధి యెంతవఱకు నుండునో దాని ననుసరించి వీరియెడ మనకుఁ బ్రామాణ్యము తగ్గుచుండును. పాణిని వ్రాసిన వైదికశబ్దముల వివరణమునకుఁ దత్పూర్వులగు యాస్క, గార్గ్య శాకల్య, శాకటాయనాదులు వ్రాసినదానికి భేదము పొడగట్టినచో మనము నవీనుఁడగుపాణిని యభిప్రాయముకంటెఁ బ్రాచీను లగు యాస్కాదుల వ్రాతలనే ప్రమాణతరముగ నంగీకరింపవలె నని 'గోల్డ్‌స్టూకర్' పండితుని యభిప్రాయము. తక్కిన పాశ్చాత్య వైదికవిద్వాంసులలో మహారథుఁడు 'రాథ్' పండితుఁడు. వేదాధ్యాపనమునను, వైదికవైదుష్యమునను దనతో సమానుఁడు లేఁడని యీతని యభిప్రాయము. తన సంస్కృత బృహన్నిఘంటు పీఠికలో నీతఁడు సాయణాదుల నిరసించుచు, నూతన మగుతనవేదసమన్వయపథమును స్పష్టీకరించి యున్నాఁడు:—

(1) సాయణుడుఁ తనకుఁబూర్వము గొన్నిశతాబ్దముల క్రిందటఁ బ్రచారములోనున్న వైదికపండితుల యభిప్రాయమునుమాత్రమే క్రోడీకరించెను.

(2) సాయణాది ప్రాచీనవేదభాష్యకర్తలకంటె వేదము యొక్కసరియైన యర్థముం జెప్పుటలోఁ దాను విశేషసమర్థుఁడఁట!

(3) సాయణాదు లేదైన వైదికపదమునకుఁ బూర్వాపరవిచారము లేక, యాపద మాయాచోటులనెట్లు ప్రయోగింపఁబడినదో చూడక, తమకుఁదోఁచినట్టు లర్థముంజెప్పుదురు. తానన్ననో వేదమున నాపదమెక్కడెక్కడఁ బ్రయోగింపఁబడెనో యాభాగముల నన్నిటిని గూలంకషముగశోధించి, పిమ్మట నాపదమున కర్థను వ్రాయునఁట!

(4) వేదభాష్యకర్తలనలెఁగాక తాను వారిమార్గమునకంటెఁ బ్రశస్తతరమగు శబ్దవ్యుత్పత్తి పద్ధతింబట్టి వేదమును సమన్వయమొనర్చునఁట!

(5) వేదద్రష్టల హృదయమును బోధపఱచుట తన పరమోద్దేశముగాని, కొన్ని శతాబ్దములనుండి యనుశ్రుతముగా వచ్చుచున్న సంప్రదాయదత్తమగు వైదికార్థమును బోధపఱచుటకాదఁట!

పై వాక్యముల నన్నిటిని 'గోల్డ్‌స్టూకర్' పండితుఁడు తీవ్రముగాఖండించి యున్నాఁడు ; దిఙ్మాత్రము సూచించెద:—

(1) సుప్రాచీనము లగు నితిహాససంప్రదాయముల ననుసరించియే సాయణుఁడు వేదభాష్యమును నిర్మించియున్నాఁడు. ఈతఁడు మిక్కిలి యాస్కుని ప్రమాణీకరించుకొని యున్నాఁడు. కావున నీతనిభాష్యమున నించుకప్రాచీనము లగు సంప్రదాయార్థములు గ్రోడీకరింపబడె ననుట సరికాదు. 'రాథ్' వాక్యమునకుఁ బ్రమాణములు లేవు.

(2) సాయణునికంటె దాను వేదసమన్వయమున సమర్థుఁడ ననుటకు నాతనిపాండిత్య మంతయు నీతని కుండుటయేకాక, తన్నిర్మితగ్రంథములం గూడ నీతఁడు వ్యాసంగమొనర్చి యుండవలెను. నిఘంటు నిర్మాణావసరమున 'రాథ్,' సాయణవేదభాష్యపు వ్రాతప్రతులకొఱకు గవేషణ మొనరించియు, వానిం బడయఁజాలక, యెట్టకేలకుఁ బ్రథమాష్టకభాష్యమును మాత్రము పడయఁగల్గెను. తరువాత నిఘంటుకారచనావసరమునఁ ద్వితీయాష్టకభాష్యములోఁ గొంత వఱకుఁ జూచియుండునేమో, తక్కినసాయణభాష్యమంతయు నీతని కచుంబితమే! ఇట్టియెడ నీతఁడు సాయణభాష్యము నంతను జూచినవానివలెనే, సాయణధిషణాతీత మగుఘనకార్యమును దాను నిర్వహించుచుంటి నని చెప్పుట యెంతసాహసమో యాలోచింపుఁడు !

(3) సాయణుఁడు భారతవర్షమున నవతరించిన మహావిద్వాంసులలో నాయకమణి ; త్రయీభాష్యనిర్మాత, ప్రధానబ్రాహ్మణములకును, గల్పగ్రంథములకును భాష్యకర్త, దిగ్దంతివంటి మీమాంసకుఁడు, సంస్కృతధాతువులం గూర్చి యుద్గ్రంథమును నిర్మించిన మహాశాబ్దికుఁడు, పాణినికాత్యాయనాదుల కృతులు జిహ్వాగ్రమునఁ గలవాఁడు భారతవర్షమున నపరశివావతారముగా నారాధింపఁబడువాఁడు ; ఇట్టిమేధానిధి వేదములలో నొకేపదముయొక్క వివిధ ప్రయోగముల విమర్శింపక భాష్యము వ్రాసెనఁట! ఆయన చేయులేదని తా ననుకొనిన యీకార్యమును 'రాథ్' చేసెనఁట !

(4) కూలంకషమగు శబ్దశాస్త్రజ్ఞానము లేక, కేవలశబ్దవ్యుత్పత్తిమార్గము ననుసరించి వేదముల సయిన్వయించుట దుశ్శకము. తనసంస్కృతజర్మన్ నిఘంటువులో సంస్కృత వ్యాకరణ విరుద్ధముగ నీతఁడువ్రాసిన యపార్థములం గనుచో నీతనికిఁ గలవ్యాకరణ వైదుష్యము తేటపడును !

(5) ప్రాచీనవేదభాష్యములగవేషణ మొనర్చియే సాయణుఁడు భాష్యమును రచించెను, కాని తన కించుక పూర్వకాలమునందలి సంప్రదాయము ననుసరించి వేదమును సమన్వయింపలేదు. అట్లుకానిచో వేదము సమన్వయింపనేరదు.

'రాథ్' కంటె నీతని సహగ్రంథకర్త శాస్త్రజ్ఞానమున నధికుఁడు. అట్టి వానికే పాణినీయాదులు సుబోధములు కాలేదు! ఈతనిమాట యేల? వీరి నిఘంటువులో నీతఁడు రచించిన భాగములు వ్యాకరణ దోషబహుళములుగాను న్నవి.ఇట్టి యీతఁడు సాయణునికంటె సదసద్వివేచనముగల సమన్వయకర్తయఁట!

వేదసమన్వయవిషయమునఁ బాశ్చాత్యసంస్కృతజ్ఞులు విదులు భిన్నభిన్న మార్గముల ననుగమించిరి.

(i) 'బోట్లింగ్,' 'రాథ్' 'గ్రాస్‌మన్' పండితులమత మొకటి. వీరు భారతీయ వేదభాష్యకారులను దృణీకరించిరి.

(ii) 'గోల్డుస్టూకరు,' 'విల్సన్' పండితులమతము వేఱు; వీరి యభిప్రాయము ననుసరించి, సాయణాది భారతవర్షీయ భాష్య కర్తలే వేదముల సరిగా సమన్వయింప దక్షులు.

(iii) 'లుడ్విగ్' (Alfred Ludwig) మొదలగు పండితులు 'యాస్క, సాయణ, మహీధరాదులు పరంపరాగతమగు సనాతన సంప్రదాయార్థము నెఱిఁగినవా రగుటచే వారి భాష్యములు నిరసింపఁ దగినవికావు; కానివారు చెప్పినదే పరమార్థ మని యెంచక, వారి యభిప్రాయముల బాగుగా విమర్శించి పరిగ్రహింపవలె'నని నుడివియున్నారు.

(iv) 'రాథ్' 'లుడ్విగ్ పండితుల పద్ధతులలోని గుణమునుమాత్రము గ్రహించి, 'పిషెల్' 'గెల్డ్‌నర్' (Geldner) పండితులు మఱియొకమార్గమును నిర్మించిరి; వేదవేత్త కాఁదలచినవాఁడు, సాయణుని యభిప్రాయము లెంతయసంబద్ధములుగాఁ బరస్పరవిరుద్ధములుగాఁ జూపట్టినను వానిని నిరసింపఁజనదు. వారి భాష్యపఠనము కేవలతుషాఖండనమువలెఁ బైకిఁ జూపట్టినను, బరిణామమున నంతేస్సారప్రయోజకమే. ప్రాచ్యపాశ్చాత్య పద్ధతులకు సామరస్యము గల్పించి యానూతనఫక్కిని వేదమును సమన్వయించుట తగు నని వీరియభిప్రాయము. ఈదృశసమన్వయపద్ధతియే యనుత్తమ మని నాయభిప్రాయముకూడ.

ఆధునికకాలమున భారతవర్షమున సంస్కృత భాషాభ్యాసనమునకుఁ బ్రోత్సాహ మొసఁగిన మహనీయుఁడు 'ఇండియాగవర్నర్ జనరల్' అగు 'హేష్టింగ్స్' ప్రభువు (Lord Warren Hastings) భారతీయులను వారి ధర్మశాస్త్రము ననుసరించి పాలించుట న్యాయ మని యీతఁడు 'వివాదార్ణవసేతువ'ను ధర్మశాస్త్రగ్రంథమును సంస్కృతముననే పండితులచే రచింపించెను. నాఁడు సంస్కృతమున జితశ్రము లగునాంగ్లపండితులు లేకపోవుటచే నిది 1776 లో 'పెర్షియన్' భాషలోనికి, నందునుండి యాంగ్లమునకుఁ బరివర్తింపఁబడెను. ప్రాచీనసంస్కృతభాషా వాఙ్మయముల నధికరించి యాంగ్లమున వ్రాయఁబడిన ప్రథమ ప్రమాణగ్రంథము, పైగ్రంథముయొక్క పీఠికయే,

పాశ్చాత్యసంస్కృతపండితులు.

1. 'చార్లెస్ విల్కిన్స్' (Charles Wilkins: 1750—1836):—ఆంగ్ల దేశ సంస్కృతపండితులలోఁ బ్రథముఁ డగునీతఁడే 'యూరప్' దేశమునకు సంస్కృత గ్రంథ పరిచయముగలిగించిన మార్గదర్శి. 'హేస్టింగ్స్' ప్రోద్బలముననే యీతఁడు సంస్కృతక్షేత్రమునఁ గఠోర వ్యవసాయమొనర్చి 1785 లో భగవద్గీత'కును, 1787 లో 'హితోపదేశము'నకును బరివర్తనములఁ బ్రచురించెను.

2. 'సర్ విలియమ్ జోన్స్' (Sir William Jones: 1746—94):—ఈయన పాశ్చాత్యసంస్కృత పండితులలో మహర్షి; నిశితాసిసదృశధిషణా సంపన్నుఁడు; సర్వతో ముఖపాండితీ మండితుఁడు; కలకత్తా రాజధానిలోఁ బ్రధాన న్యాయమూర్తి 28 భాషలలోఁబండితుఁడు; 1784 లో నాసియావిద్వత్పరిషత్తును గలకత్తాలో స్థాపించెను; ప్రాచ్యవిజ్ఞాన విషయక వ్యాసములకై యొకపత్రికను (Journal of the Asiatic Society) నెలకొల్పెను. 1789 లో 'శాకున్తలము'ను 'మనుస్మృతి'ని ఆంగ్లములోనికిఁ బరివర్తించెను. ప్రాచీన సంస్కృత గ్రంథముల నాగరలిపిలో ముద్రించిన ప్రథమ పాశ్చాత్యుఁడీతఁడే. స్వయముగా నాగరాక్షరములంజెక్కి, మూసలోఁబోసి 'యూరప్'లోఁ బ్రథమమున నాగర ముద్రణము నొనర్చిన మహనీయుఁడీతఁడే; హైందవశాసనములఁ బరిశోధించి, యాంగ్లీకరించి భారతీయ పురాతత్త్వగవేషణమున విశేషాభిరుచింగలిగించెను; సంస్కృతము, 'జర్మన్' 'ల్యాటిన్' భాష లేకమూలకములనియుఁ బరస్పర బద్ధములనియుఁ బ్రతిపాదించెను; 'జర్మన్' 'కెల్టిక్', 'పర్షియన్' భాషలతోఁ గూడ సంస్కృతమునకు సంబంధ ముండియుండు నని నిరూపించెను; ప్రాచీన భారతీయ దేవతలకు 'గ్రీక్' 'రోమన్' దేవతలకు నత్యంతసామ్యమున్న దని సిద్ధాంతీకరించియున్నాఁడు.

3. 'హెన్రీ థామస్ కోల్‌బ్రూక్' (Henry Thomas Colebrooke 1765—1837):—ఆనుషంగిక శబ్దశాస్త్ర స్థాపనమునకుఁ బురాతత్త్వగవేషణమునకు మూలపురుషుఁడు. 'జోన్స్' ప్రజ్వలింపఁజేసిన ప్రాచ్యవిజ్ఞానదీపిక కీతఁడు స్నేహపూరణముం జేసెను. శాస్త్రీయపద్ధతుల ననుసరించి సంస్కృతభాషా వాఙ్మయసమాలోచన మొనరించినవారిలోఁ బ్రథముఁడు. ఈతఁడు వేసిన పునాదులమీఁదనే తక్కిన పాశ్చాత్య సంస్కృతపండితులు సారస్వతసౌధముల నిర్మించియుండిరి. భారతీయుల ధర్మశాస్త్రములు, దర్శనములు, మతములు, వ్యాకరణము, గణితము, జ్యోతిషము మొదలగువాని నధికరించి యీతఁ డనేక కృతుల నిర్మించెను; 1805 లో వేదములగుఱించి, సప్రమాణము, సనుత్తమము

నగు వ్యాసమును రచించి పాశ్చాత్యులకు వేదపరిచయము నొనరించిన మహోదయుఁ డీతఁడే. పెక్కువేల రూప్యములు వెచ్చించి యీతఁడు సంపాదించిన సంస్కృత లిఖితకోశసముచ్చయము ప్రకృతము 'లండన్' నగరమునందలి భారతీయభవనము (India Office) నలంకరించి యున్నది. 19 వ శతాబ్దారంభమున 'జర్మనీ' 'ఫ్రాన్స్' దేశీయుల ననేకుల సంస్కృతమున దిగ్దంతులనంటి పండితులఁగా నొనర్చిన మహనీయుఁడు.

4. అలెగ్జాండర్ హేమిల్టన్' (Alexander Hamilton: 1765-1824):-
ఇతఁడు భారతవర్షమున, సంస్కృతమునందు దృఢవ్యుత్పత్తినంది, 1802 లో 'ఫ్రాన్స్' దేశముద్వారమున 'నింగ్లాండు వెడలుచుండ నాఁటిరాజకీయ పరిస్థితులం బట్టి విదేశీయుఁ డగునతనిఁ గారాగారమం దుంచిరి. ఆసమయమున నాదేశమున నున్న 'జర్మనీ' దేశకవిశిరోమణి,

5. 'ష్లెగల్'(Friedrich Schlegel 1772-1829) ఈతనియొద్ద సంస్కృతము నభ్యసించి భారతీయ భాషావిజ్ఞానములంగూర్చి ('On the Language and Wisdom of the Indians' 1808) యొక గ్రంథమునురచించెను. ఈగ్రంథమే భాషాప్రపంచమున నమితసంక్షోభమును గలిగించి, చారిత్రకదృష్టిని, భాషాతత్త్వమును సమాలోచించు నూతనపథమును నిర్మించెను. నాఁటినుండియు సంస్కృత వాఙ్మయమునకు సేవ యొనరించిన పాశ్చాత్య పండితులలోఁ బ్రధానులు చాలవఱకు 'శార్మణ్యా' దేశీయులే. 'ష్లెగెల్' పండితుని కృతియే యీయఖండసేవకు మూలకందము. ఇతని సంస్కృతభాషా సేవకంటెనుగూడ నీతని సోదరుఁడగు—

6. 'ఆగస్ట్ విల్ హెల్మ్ వాన్ ష్లెగల్' (August Wilhelm von Schlegel: 1767—1845) చేసిన సంస్కృత సారస్వత సేవ మిగులఁ బ్రశస్యము. 1818 లో నూతనముగ స్థాపింపఁబడిన 'బోన్ విశ్వకళాపరిషత్తు' (Bonn University) లో నీతఁడు గీర్వాణాచార్యుఁడుగా నియమింపఁబడెను. జర్మనీదేశమునందలి గీర్వాణాచార్యులలోఁ బ్రథముఁడు (The first Sanskrit Professor in Germany), 1823 లో నీతఁడు 'భారతీయ గ్రంథావళి' (Indische Bibliothek') యను పత్రికను బ్రచురింప నారంభించి, యందు భారతీయ శబ్దతత్త్వవిచారకము లగుననేకవ్యాసములఁ బ్రచురించెను; మఱియుఁ బ్రాచీన సంస్కృత గ్రంథములఁ బ్రచురించియు, వాని ననువదించియు, శబ్దతత్త్వవిచారకము లగుననేక కృతుల నిర్మించియు సంస్కృతమున నన్నప్రాశన మొనరించిన మహానుభావుఁడు.

7. 'ఛేజీ' (A. L. Chegy: 1773—1832) 'ఫ్రాన్స్' దేశములోఁ బ్రప్రథమమున సంస్కృతము నభ్యసించి ప్రథమ సంస్కృతాచార్యుఁ డనఁ

బరగెను. 1803—1832 నడుమ నీతఁడు 'ఫ్రాన్సుదేశకళాశాల' (College de France)లోఁ బ్రథమ గీర్వాణాచార్యుఁడుగా నుండెను; అనేక సంస్కృత గ్రంథములఁ బ్రకటించి, యనువదించి సంస్కృతమున కనర్ఘసేవ యొనరించెను. 'ష్లెగెల్' పండితునికి సతీర్థ్యుఁడును, 'ఛేజీ' పండితుని శిష్యుఁడునగు—

8. 'ఫ్రాన్జ్ బాప్' (Franz Bopp: 1791-1867) 'జర్మనీ' దేశీయుఁడే' 1812 లో 'ప్యారిస్' నగరమున 'ఛేజీ' సన్నిధినే సంస్కృతమున నఖండపాండితిని సంపాదించి, యత్యగాధగవేషణ మొనరించి, సంస్కృత క్రియాపదముల రూపములను, 'గ్రీక్', 'ల్యాటిన్', 'పెర్షియన్', 'జర్మన్' భాషలలోని క్రియాపదరూపములతోఁ బోల్చుచు నొకయుద్గ్రంథమును ('Conjugations-system') రచించి, 1816 లో దానిం బ్రచురించి 'తులనాత్మకశబ్దతత్త్వశాస్త్రము' (Science of Comparative Philology) అనునొక నూతనశాస్త్రమునకు శంకుస్థాపన మొనర్చెను. నేఁటివఱకు నీశాస్త్ర మనర్గళాభ్యుదయము నందుచున్నది. అనేకసంస్కృత గ్రంథములఁ బ్రచురించుటయే కాక యితఁడు 'కోల్‌బ్రూక్' పండితుఁ డాంగ్లీకరించిన వేదములలోఁ గొన్నిభాగముల 'జర్మనీ' భాషలోనికిఁ బరివర్తించెను. ఈతని సంస్కృతవ్యాకరణములు, అకారాది సంస్కృతశబ్దకోశము ('Glossarium Sanscritum' Berlin, 1830)ను 'జర్మనీదేశములో సంస్కృతభాషాభ్యుదయమునకు విశేషసాహాయ్య మొనరించెను. 'బాప్' పండితునికి సహాధ్యాయియు, గురువును, 'ఛేజీ' పండితునియన్తేవాసియు నగు:—

9. 'బర్నాఫ్' (Prof. Eugene Burnouf: 1801—'52) అను 'ఫ్రెంచ్' సంస్కృతపండితుని మూలముననే యూరప్‌ఖండ పండితులు నిజముగా వేదాధ్యయనమునకు మొదలిడిరని చెప్పవలెను. 1832 లో 'ఫ్రాన్సుదేశకళాశాల' (College de France) యందు 'ఛేజీ' పండితునితరువాత నీతఁడే గీర్వాణాచార్యపీఠము నధిరోహించెను. ఈవైదికచూడామణి చరణ సన్నిధినే, 'బాప్','రాథ్' 'మ్యాక్స్‌మూలర్' మొదలగుననేకమహనీయులు వేదాధ్యయన, మొనరించి వైదికశిరోమణు లైరి. 1829-43 నడుమ 'బర్నాఫ్' 'వెండిడాడ్' ('Vendidad Sade') ను బ్రకటించెను. ఐరోపాఖండమున వేదాధ్యయనమునకు మార్గదర్శియగుటయే కాక, ఇతఁడు 'ల్యాస్సెన్' (C. Lassen) పండితునితోఁ గలసి పాలీ భాషను గుఱించి యొకవ్యాసమును, బౌద్ధమతచరితమును రచించెను. 'ష్లెగెల్' (A. W. von Schlegel) పండితునిశిష్యుఁ డగు—

10. 'ల్యాస్సెన్' (Christian Lassen: 1800—'76) పండితుఁడు తన కాలమువఱకు భారతవర్షమును గుఱించి తెలిసినయుదంతమునంతయు నొక్కచోఁ గ్రోడీకరించి 'భారతీయపురాతత్త్వకోశము' ('Indische Alterthums Kunde'=

Indian Archaeology) అను నాలుగు సంపుటముల బృహద్గ్రంథమును 1843-62 నడుమఁ బ్రకటించెను.

యూరప్ఖండమున సంస్కృతభాషాభ్యసనము ప్రారంభదశలో నున్న కాలమున నంఁగా 1830 ప్రాంతమువఱకుఁ, బాశ్చాత్య సంస్కృతపండితులు విశేషముగా లౌకిక సంస్కృత వాఙ్మయముననే కృషిసల్పుచుండిరి. 'శాకుంతలము' 'భగవద్గీత' 'మనుస్మృతి' 'భర్తృహరి' 'హితోపదేశము' మొదలగునవియే ప్రాచ్యసారస్వతమునఁ బ్రధానగ్రంథము లని వారితలంపు. ప్రాచ్యవిజ్ఞానమునకు మూలకంద మగు 'వేదము' గాని, 'బౌద్ధవాఙ్మయము' గాని వారికి చుంబితప్రాయము లనియే యనఁదగును. ప్రప్రథమమున వేదముల నధికరించి 'కోల్ బ్రూక్' పండితుఁడు (1805 లో) ప్రమాణ మగువ్యాసమును బ్రచురించియే యున్నాఁడు. కాని సనాతన మగువైదికవాఙ్మయమును యూరప్ఖండమునకు సుగమముగా నొనర్ప సంకల్పించుకొని:—

11. 'రోసెన్' (Friedrich Rosen: 1805-'37) అను శార్మణ్యదేశీయ వైదికాగ్రణి, ప్రాచ్యభారత భవనము (East India House) నందలి పరస్సహస్ర తాళపత్ర గ్రంథములగవేషణ మొనర్చి ఋగ్వేదప్రథమాష్టకమును బరిష్కరించి వైదికశబ్దతత్త్వవిచారమునకుఁ ద్రోవఁజూపెను. ఈతఁడు కాలధర్మము నందినయచిరకాలమున నివి ప్రచురింపఁబడెను (1838) ఈతనియకాలమృత్యువు వలన నీగ్రంథమంతటితో నిలచిపోయెను. 'బాప్' పండితునిశిష్యుఁడును, శార్మణ్యదేశీయ వైదికాగ్రణులలో నొకఁడునగు:—

12. 'బెన్ఫీ' (Theodor Benfey: 1809-1881) పండితుఁడు 1848 నుండి 'గోత్తిఙ్గెన' (Gottingen in Germany) విశ్వవిద్యాలయమున గీర్వాణాచార్య పీఠము నలంకరించియుండెను. సంస్కృతవాఙ్మయమున కఖండసేవ యొనరించిన 'బ్యూలర్' పండితుఁడును, మొన్న మొన్నను గీర్తిశేషుఁ డైన ఫ్రెంచ్ సంస్కృతపండితుఁ డగు 'సెనార్' (Emile Senart) నీతనిశిష్యులే, 1848 లో నీతఁడు 'సామవేదము'ను, 1866లోఁ దనసంస్కృతాంగ్లనిఘంటువును బ్రచురించెను. 'బెన్ఫీ' పండితునికి సహపాఠియు, 'బర్నాఫ్' 'బాప్' పండితుల శిష్యుఁడును, జర్మనీదేశ వైదికచక్రచూడామణియు నగు:—

13. 'మ్యాక్స్‌మ్యూలర్' (Prof. Friedrich Max Muller: 1823-1900) పండితుఁడు వైదిక సాహిత్యమున కఖండసేవ యొనరించెను. 'బర్నాఫ్' పండితుని ప్రోద్బలముననే యీతఁడు తనజీవితమంతయు ఋగ్వేదాధ్యయనమునకై ధారవోసి, ఋగ్వేదమును మొట్టమొదట సాయణభాష్యముతో నాగరలిపిలో (1849-75) నడుమఁ బ్రచురించెను. సుగృహీతనాముఁడు, నభినవభోజుఁడును, విజయనగరప్రభువు నగుస్వర్గీయశ్రీమదానంద గజపతీంద్రుని యౌదార్యమువలన నీ

నీయుద్గ్రంథమును రెండవసారి యాపండితుఁడే 1890-92 లోఁ బ్రచురించెను. మఱియునీతఁడు 'ప్రాచీన సంస్కృతసారస్వత చరితము,' 'భారతీయదర్శన షట్కము' మొదలగు నుద్గ్రంథముల రచించి, 'ప్రాచ్యసారస్వత పవిత్రగ్రంథావళి' ని బ్రచురించియుండెను. ఇతఁడు తులనాత్మకపురాణ తత్త్వశాస్త్రము Comparative Mythology)నకు మూలపురుషుఁడు. ఇతనిసహాధ్యాయియు జర్మనీదేశీయ వైదికపండితుఁడు నగు—.

14. 'రుడోల్ఫ్‌రాథ్' (Rudolph Roth: 1821—'95) 'టుబిన్జన్' (Tubingen) విశ్వవిద్యాలయమున గీర్వాణాచార్యుఁడుగా నుండెను; 'బర్నాఫ్' పండితుని యన్తేవాసి; 'విట్నీ' (William D. Whitney 1827—'94) 'ల్యాన్‌మన్,' 'గెల్డ్‌నర్' పండితుల కాచార్యుఁడు. 1846 లో నీతఁడు వైదికవాఙ్మయము, వైదికచరితముల నధికరించి (On the Literature and History of the Veda') జర్మనీభాషలో నొక యుద్గ్రంథమును రచించి, యాదేశములో వేదాధ్యయనమునకు శంకుస్థాపన మొనరించెను. నాఁటినుండియుఁ దద్దేశీయు లనేకులు ప్రజ్వలితోత్కంఠతో వేదవేదాఙ్గములఁ గూలంకషముగ మథింప మొదలిడిరి. 19 శతాబ్దము నుత్తరార్ధమున భారతీయపురాతత్త్వ పరిశోధనము (Indian Archaeology) విశేషాభ్యుదయము నందుటకు మూలకందము 'రాథ్' పండితుఁడు.

15. 'ఆటోబోయిట్లింగ్ (Otto Bohtlingk: 1815—?) అను నిరువురు జర్మనీదేశ వైదికపండితులు నిర్మించిన బృహత్సంస్కృతనిఘంటువే ('The Sanskrit—Worterbuch') ఇది 1852—75 నడుమ 7 సంపుటములలో రష్యా రాజధాని 'సెయింట్‌పీటర్స్‌బర్గు' (St. Petersburg) నగరమునందలి 'శాస్త్ర కళాపరిషత్తు' (Academy of Arts and Sciences) వారిచేఁ బ్రకటింపఁబడెను. జర్మనీదేశీయు లెంతటి నిర్నిద్రదీక్షతోఁ గఠోరవ్యవసాయము సల్పుదురో యీ గ్రంథము నొక్కపరి యవలోకించినఁ దెలియఁగలదు.

16. 'థియొడర్ ఔఫ్రెట్' (Theodor Aufrecht: 1822—1907.) 'మ్యాక్స్‌మూలర్' 'బెన్ఫీ' పండితుల సతీర్థ్యుఁడు; 'బాప్స్' పండితుని శిష్యుఁడు; 'ఎడింబరో' (1862-75), 'బోన్' (1875—89) విశ్వవిద్యాలయములలో గీర్వాణాచార్యుఁడు. 'మ్యాక్స్‌మ్యూలర్' నకు ఋగ్వేదప్రచురణావసరమున విశేషము తోడ్పడి, యది ముద్రింపఁబడుచున్నకాలముననే (1849-75) 'ఔఫ్రెట్' పండితుఁడును ఋగ్వేదమూలమును బూర్తిగాఁ (1861-'63) బ్రచురించి వైదిక వాఙ్మయమునకు విశేషసేవ యొనరించెను. 40 వత్సరములు, ముద్రితాముద్రితము లగుసంస్కృత గ్రంథములసూచికల నీతఁడు గవేషణ మొనర్చి, నిర్నిద్రదీక్షతో (1891-1903 నడుమ) 3 సంపుటములలో సంస్కృత

గ్రంథములయు, గ్రంథకర్తలయు సూచిక ('Catalogus Catalogorum') ప్రచురించెను. ఈ బృహత్కోశమున నకారాదిగఁ జేర్కొనఁబడిన గ్రంథ, గ్రంథకర్తృసంఖ్య వేలుగాని వందలుగాదు. ఏదేనొక గ్రంథముయొక్క ప్రతులు ప్రాచ్యపాశ్చాత్య గ్రంథనిలయములలో నెక్కడెక్కడ నెన్నెన్నికలవ్వో, యాయా గ్రంథకర్తలకృతు లెవ్వియో యిందు సూచింపఁబడెను. ప్రాచ్యసారస్వత పరిశోధకుల కిది కల్పతరువు.

పాశ్చాత్య సంస్కృతపండితుల ధర్మమా యని వైదికగ్రంథముల కేమి, లౌకికసంస్కృతగ్రంథముల కేమి ప్రమాణతమము లగు ప్రతులు ప్రచురింపఁబడినవి. ప్రకృత ముపలబ్ధమగు ప్రాచీన 'గ్రీస్' దేశవాఙ్మయ మంత వైపుల్యము గల వైదికవాఙ్మయమును పాశ్చాత్యులు మథించి వైచిరి. ఒక్క శతాబ్దిలో, 'గ్రీస్' సారస్వత, 'రోమన్' సారస్వతములకంటె విపులమగు వైదిక, లౌకిక గీర్వాణవాఙ్మయ మంతయు వీరిచే క్షుణ్ణము చేయఁబడినది. సమర్థులగు పండితులీవాఙ్మయమునందలి మూలగ్రంథములను, వానికిఁ బరివర్తనముల, విమర్శములఁ బ్రచురించియుండిరి. సంస్కృతవాఙ్మయమునఁ బ్రతిశాఖయందు నపారముగ గవేషణ మొనర్పఁ బడెను. సర్వతోముఖముగ నభ్యుదయము నందిన హైందవ వాఙ్మయమున నన్నిశాఖలలోను బాండిత్యము సంపాదించుకొనుట యెంతటి యతిమానుష ప్రతిభాశాలి కైనను దుశ్శకముగా నుండెను. హైందవ విజ్ఞాన శాస్త్రమున బహుముఖముల నొనరింపఁబడిన పరిశోధనములఫలములను, విజ్ఞాన సర్వస్వమువంటి యొకసర్వంకషకోశ (Encyclopaedia) రూపమున నేకముఖముగా నొనర్చుట యత్యంతాపేక్షణీయముగాఁ జూపట్టెను. అట్టి ఘనకార్యమును దలపెట్టిన మహాత్ముఁడు జర్మనీసంస్కృత విద్వచ్ఛిరోమణియు, సర్వంకషమేధానిధియునగు.

17. 'జార్జిబ్యూలర్' (Dr. J. George Buhler: 1837—1898) పండితుఁడు ; 'బెన్ఫీ' పండితుని శిష్యుఁడు; ప్రకృతము 'ప్రేగ్' (Prague) విశ్వవిద్యాలయమున గీర్వాణాచార్యపీఠిక నలంకరించి, చిరకాలముక్రిందటనే 'జర్మనీ' భాషలో గీర్వాణవాఙ్మయచరితమును రచించి జగద్గీత కీర్తినొందిన 'వింటర్ నిట్జ్' పండితుఁడు 'బూలర్' శిష్యుఁడే, 1863 నుండి చిరకాలము 'బూలర్' బొంబాయిలోని 'ఎల్ఫిన్‌స్టన్' కళాశాలలోను, పిమ్మట 1880 నుండి 'వియన్నా' విశ్వకలాపరిషత్తు (University of Vienna)నందును గీర్వాణాచార్యుఁడుగానుండి, 'వియన్నా' లోనే 'విశ్వకళాపరిషత్ప్రాచ్య సాహిత్యపరిషత్తు'ను, పరిషత్పత్రిక (Vienna Oriental Journal)ను నెలకొల్పి ప్రాచ్యవిజ్ఞానమున కెంతయో సేవ చేసెను. భారతీయులంగూర్చి నాఁటికిఁ దెలిసిన సర్వవిషయములు—వారి చరిత్రము, మతము, దర్శనములు, సారస్వతము మొదలగున వన్నియు—బోధించు

'హైందవార్య శబ్దతత్త్వ పురాతత్త్వ విజ్ఞాన సర్వస్వము' ('Encyclopaedia of Indo-Aryan Philology and Archaeology' or briefly 'Encyclopaedia of Indo-Aryan Research') అను గ్రంథసముచ్చయమును బ్రచురింప నీతఁ డుపక్రమించెను. ఇతని సంపాదకత్వముననే యిది 1897 నుండియుఁ బ్రచురింపఁబడఁజొచ్చెను. ఈ బృహద్గ్రంథ నిర్మాణమునకై జర్మనీ ఆస్ట్రియా, ఇంగ్లాండు, హాలెండ్. అమెరికా, ఇండియా మొదలగు దేశములలోని దిగ్దంతుల వంటి సంస్కృతపండితులు నడుము కట్టిరి. ఈ గ్రంథ మకారాది కోశరూపము గాదు; ఆయావిషయముల నధికరించి సర్వంకషముగఁ దెలుపు గ్రంథము లీనామముతోఁ బ్రచురింపఁబడుచున్నవి. ఇది ప్రారంభింపఁబడిన యొక వత్సరముననే 'బూలర్' కీర్తిశేషుఁడయ్యెను. ఈతనియకాల మృత్యువుచే బ్రాచ్యవిజ్ఞానమునకుఁ దీరనిలోటు వాటిల్లినది. ఈతని జీవితకాలమున 9 సంపుటములు మాత్రము ప్రచురింపఁబడినవి. తరువాత నీభారమును 'గొటింజన్' (Gottingen) సంస్కృత విద్వాంసుఁడు 'కీల్‌హార్న్' (Prof. Kielhorn) వహించెను. ప్రకృత మీఘనకార్యమును 'ల్యూడర్స్' (Prof. H. Luders) 'వకెర్నగెల్' (Prof. J. Wackernagel) అను నిరువురు ప్రసిద్ధవిద్వాంసులు నిర్వహించుచున్నారు. ఈ గ్రంథములలోఁ జాలవఱకు 'జర్మనీ' భాషలోనే రచింపఁబడినవి. భారతీయులకుఁగూడఁ బోధపడు నట్లీగ్రంథము లన్నియు నాంగ్లముననే రచింపఁబడవలెనని 'బూలర్' పండితుఁ డెప్పుడును గోరుచుండెడివాఁడు. వైదికదేవతలంగుఱించి 'మెక్‌డానెల్' (Prof. A. A. Macdonell) పండితుఁడు వ్రాసిన ('Vedic Mythology' అను) గ్రంథము, అథర్వవేదము నధికరించిన ('The Atharvaveda') 'బ్లూమ్‌ఫీల్డ్' పండితుఁడు (1899) రచించినకృతి, 'జకారయా' (Zachariae) పండితుని సంస్కృతనిఘంటు చరితము ('Die Indischen Worterbucher' 1897) మొద లగునవేకకృతు లీగ్రంథసముచ్చయముననే ప్రచురింపఁబడినవి.

18. 'గెల్డ్‌నర్' (Prof. Karl Friedrich Geldner: 1853—1929) జర్మనీదేశీయుఁడు, 'రాథ్' పండితుని శిష్యుఁడు; 'బెర్లిన్' నగరమున (1890—1907), 'మార్‌బోర్' (University of Marburg) విశ్వవిద్యాలయమున (1907 నుండి) గీర్వాణాచార్యుఁడు గా నుండెను. వేదముల సమన్వయమార్గమున 'రాథ్' మతము నీతఁడు ఖండించెను. 'రాథ్‌పండితుఁడనేక స్థలముల వేదమున కపార్థము చెప్పె ననియు నాయాభాగములకు సాయణుఁడే సరియైన యర్థము వ్రాసెననియు, నమెరికా, యూరప్‌ఖండ పండితులు సాయణభాష్యముల నెంతహాస్యభాజనములుగా నెంచినను, వేదసమన్వయపథమునఁ దద్భాష్యసాహాయ్యము లేక యొకపద మైనను గదల్చుట దుస్తర మనియు నీతఁడును,

దన్మిత్రుఁడు 'పిషెల్' (Prof R. Pischel) పండితుఁడును వేదముల నధికరించి వ్రాసిన ('Vedische Studien') గ్రంథము పీఠికలో వ్రాసియున్నారు. వ్యాఖ్యాన్వితముగ నీతని ఋగ్వేదజర్మన్ భాషానువాదము మొదటిభాగము 1923 లోఁ బ్రకటింపఁబడెను. ఈ యనువాదమున కాంగ్ల పరివర్తనమును బూర్తిగా 'హార్వార్డ్ ప్రాచ్యగ్రంథమాల'లోఁ (Harvard Oriental Series) బ్రచురింప 'గెల్డ్నర్' పండితుని ప్రాణమిత్రుఁడు, నమెరికాదేశ సంస్కృత విద్వాంసులలో నాయకమణి యు నగు—

19. 'చార్లెస్ రాక్వెల్ ల్యాన్మన్' (Prof. Charles Rockwell Lanman) నమకట్టినట్లు తెలియుచున్నది. ఇతఁడు 'విట్నీ' (William Dwight Whitney:1827—'94) పండితుని శిష్యుఁడు, 'హార్వర్డ్' విశ్వవిద్యాలయమున గీర్వాణాచార్యపీఠాధిపతి; 1891 నుండి 'హార్వర్డ్ ప్రాచ్యగ్రంథమాల' యను పేరితో ననేకము లగునుద్గ్రంథములు ప్రచురించిన సుకృతి, 'మెక్డానెల్' పండితుఁడు పరిష్కరించిన శౌనకుని 'బృహద్దేవత' (1904), 'విట్నీ' పండితుని 'అథర్వవేదాంగ్లానువాదము' (1905), 'బ్లూమ్ఫీల్డ్' (Prof. Maurice Bloomfield) పండితుని 'వైదిక ప్రతీక' ('Vedic Concordance', 1906) 'బెరిడేల్ కీత్' పండితుని (Prof. A. B. Keith) 'తైత్తిరీయ సంహితాంగ్లానువాదము' (1914), 'ఋగ్వేదీయ బ్రాహ్మణముల యనువాదము' (1920), 'వేదోపనిషత్తుల యందలి మతదర్శనములు' ('The Religion and Philosophy of the Vedas and the Upanishads' 1925) 'కీత్' పరిష్కృతమగు 'ఐతరేయారణ్యకము', బ్లూమ్ఫీల్డ్' నిర్మిత 'ఋగ్వేదీయ పునరుక్త్యనుక్రమణిక' (Rigveda Repetitions', 1916) 'మెక్డానెల్' పండిత పరిష్కృతమగు కాత్యాయనుని 'ఋగ్వేదీయ సర్వానుక్రమణి' మొద లగునుద్గ్రంథము లీగ్రంథమాలలోఁ బ్రచురింపఁబడినవియే.

20. 'మెక్డానెల్' పండితుఁడు(Prof. Arthur Anthony Macdonell: 1854—1931) ఇతఁడు 'బెన్ఫీ' పండితునిశిష్యుఁడు, 'ఆక్స్ఫర్డ్' విశ్వకళాపరిషత్తులో గీర్వాణాచార్యుఁడు (Boden Prof. of Sanskrit) 'బూలర్' పండితుని 'విజ్ఞానసర్వస్వమున కీతఁడు 'వైదికదేవతలం' గూర్చి రచించిన ('Vedic Mythology' అను) కృతియు, వైదికవ్యాకరణము' 'సంస్కృతాంగ్ల నిఘంటువు' 'వైదికనామ, విషయానుక్రమణిక' 'హార్వర్డ్‌ప్రాచ్యగ్రంథమాల' లో నీతఁడు పరిష్కరించిన కృతులును సుప్రసిద్ధములే. ఇతఁడు 1928 లో 'ఆక్స్ఫర్డ్' నగరమున సమావేశమైన యంతర్జాతీయ ప్రాచ్యవిద్వన్మహాపరిషత్తునకు (The XVII 'International Congress of Orientalists') అగ్రాసనాధిపత్యము వహించెను. చిరకాలముక్రిందటనే యీతఁడు 'సంస్కృత వాఙ్మయచరితము' నాంగ్ల

మున రచించెను. మొన్న మొన్న 'భారతవర్ష ప్రాచీనవైభవము' ('India's Past' 1927) అనునుద్గ్రంథమును రచించి, 1931 లోఁ గీర్తిమూర్తిని ధరించెను. ఇతని శిష్యులలో నగ్రగణ్యుఁడు గురువును మఱపించెడి పాండిత్యముగలవాఁడును, 'స్కాట్‌లెండ్' నందలి 'ఎడింబరో' విశ్వకళాపరిషత్తున గీర్వాణాచార్యపీఠిక నలంకరించిన—

21. 'బెరిడేల్ కీత్' (Prof. Arthur Berriedale Keith:1879—) పండితుఁ డిపు డింకను సంస్కృతవాఙ్మయసేవ యొనరించుచున్నాఁడు. ప్రాచ్య విజ్ఞానప్రపంచమున నీతనికచుంబితమగు శాఖయేలేదఁట! ఇతఁడు బహుగ్రంథ నిర్మాత. ఇతని 'సంస్కృత నాటకచరితము,' 'సంస్కృతవాఙ్మయ—లౌకిక—చరితము' సుప్రసిద్ధములే. 'హార్వర్డ్‌ప్రాచ్య గ్రంథమాల'లోఁ బ్రచురింపఁ బడిన యీతనికృతు లిదివఱకే పేర్కొనఁబడియున్నవి.

ఏడిలంగ్, వీబర్, మ్యాక్స్‌మ్యూలర్, స్మాల్, మెక్‌డానెల్, ఎర్న్‌హార్ విట్జ్, వింటర్‌నిట్జ్, ఫ్రెజర్, మొద లగుపాశ్చాత్యదేశ పండితులును; టి. యన్ భట్టాచార్యులు, తరణీచరణ చౌదరి, ఆచార్య మాధవదాన చక్రవర్తి, చింతామణి వినాయకవైద్యపండితుఁడు, మొదలగు భరతఖండపండితులు నిప్పటికాంగ్ల భాషలో సంస్కృతవాఙ్మయము నధికరించి వేలువేలు చరిత్రగ్రంథములు రచియించిరి. సంస్కృతభాషలో యజ్ఞేశ్వరచిమనభట్ట పండితుఁడు 'ఆర్య విద్యా సుధాకర' మనుపేర నొకచరిత్రము నిర్మించెను. కేదార విద్యాభూషణుఁడు వైదికవాఙ్మయచరితను, మహామహోపాధ్యాయ రామావతార శర్మ పాండేయులు సంస్కృతసారస్వ తేతిహాసమును రచియించి రని వింటిని గాని వానిని జూచుభాగ్యము నాకు లభింపలేదు. మెక్‌డానెల్ పండితుని వైదికవాఙ్మయ చరిత్రభాగమును పి. పి. సుబ్రహ్మణ్యశాస్త్రి యమ్. ఏ., శిరోమణి కె. యల్. వ్యాసరాయ శాస్త్రిగారును సంస్కృతభాషలో ననువదించియున్నారు. ఇది వైదికసాహిత్యచరిత నునుపేరఁ బ్రకటిత మైనది. దీనినే ఉభయభాషాప్రవీణ క్రొత్త సత్యనారాయణచౌదరి గారాంధ్రీకరించిరి. ఇది గాక గీర్వాణవాక్ప్రపంచ మనుపేర, పిన్నంరాజు వెంకట సుబ్రహ్మణ్యశర్మగారు తెలుఁగునఁ బ్రకటించినది మఱియొకటికలదు. కేవలము సంస్కృత వాఙ్మయచరితము లనఁదగినవి గాకున్నను, సర్. యమ్. మోనియర్ విలియమ్సు, డాక్టరు. ఏ. ఏ. మాక్డానెల్ మొద లగుమఱికొందఱు పాశ్చాత్యులు భారతీయసారస్వతము భారతీయవిజ్ఞానము మొద లగువానినిగూర్చి గ్రంథములు రచియించి ప్రకటించియున్నారు.

ఇట్లు వైదిక లౌకికరూపమైన సంస్కృత సారస్వతమునుగూర్చి పెక్కండ్రు చరిత్రగ్రంథములు నిర్మించియున్నారుగాని వీనిలో మెక్‌డానెల్ పండితుని సంస్కృత సారస్వతచరితమే మనదేశమున నెక్కువగా వ్యాపించియున్నది. కడచిన

32 సంవత్సరములలో జరిగిన పరిశోధనలనుబట్టి యిందుమార్పులు సవరణలు చేయవలసియున్నది గాని నేఁటికి నది యట్లే ప్రచురింపఁబడుట శోచనీయము. దీనిని సంస్కృతీకరించిన పి. పి. యస్. శాస్త్రిగారు వగయిరాలు కూడ దీని నట్లే యనువదించిరి గాని సవరింపలేదు. పైగా మూలగ్రంథములోనివే కాక యనువాదమున మఱికొన్నిదోషములు దొరలినవి, వీరి సంస్కృతానువాదమును సత్యనారాయణచౌదరి గా రాంధ్రీకరించుచు, పై రెంటిలోని దోషములకుఁ దోడుగా మఱికొన్నిదోషములు చేర్చిరి. ఇఁక, శర్మగారి గీర్వాణ వాక్ప్రపంచమున్ననో[1]. బహుదోష భూయిష్ఠముగానే యున్నది. అందువలన వైదికవాఙ్మయము నధికరించి రచియించిన యుత్తమచరిత్రగ్రంథ మిదివఱకు లేదయ్యె. ఆలోపముం దీర్పనాంధ్ర విశ్వకలాపరిషత్తువారు గుణోత్తరమును స్వతంత్రపరిశోధన మూలకమునగు బ్రహ్మశ్రీ సూర్యనారాయణశాస్త్రిపాదుల వైదికవాఙ్మయచరిత్రమును బ్రచురించి, ఆంధ్ర విద్వల్లోకమునకు మహోపకృతి నొనరించినవారైరి. శ్రీశాస్త్రిగారును, పాశ్చాత్యపండితులు చెప్పినదానినే వేదవాక్యముగా గ్రహింపక, అందలి గుణదోషములు చక్కఁగ విమర్శించి, తమ స్వాతంత్ర్యముం జాటియున్నారు[2]. శ్రీ శాస్త్రిచరణుల 'లౌకిక సంస్కృతవాఙ్మయచరిత మను ద్వితీయభాగమునుగూడ నచిరకాలమునఁ బ్రకటించి విశ్వకళాపరిషత్తు సంస్కృత శారదారాధన మొనరించును గాక !

విజయనగరము.
20-2-1933

ఇట్లు.
పండిత పాదపరమాణువు,
యీయుణ్ణి వేఙ్కట వీరరాఘవాచార్యుఁడు, బి. ఏ.,
అధ్యక్షుఁడు.
'ఆన్ధ్ర గీర్వాణసాహిత్య పరిషత్తు,'

1. దీనిమీఁది నా విమర్శనమును, 'భారతి' మార్చి 1931, అక్టోబర్ 1931, సంచికలు చూడనగును.

2. చూ. మెక్‌డానెల్, వీబర్, పండితుల యభిప్రాయములమీఁది విమర్శనములు. పుటలు 183-184.

 

# కృతికర్తవిన్నపము.

ఆర్యులారా!

క్రీ. శ. 1909 మొదలుగా 1917 వఱకు నన్నుఁ దమయాస్థాన విద్వాంసునిగా నాదరించి, ఉత్తర రామచరితాంధ్ర దశరూపకాది గ్రంథములు నాచే రచియింపఁజేసిన సంస్కృతాంధ్ర భాషాభిజ్ఞులును నాఁటి వెంకటగిరి సంస్థానాధీశ్వరులు నగు శ్రీమహారాజా సర్ వెలుగోటి రాజగోపాల కృష్ణయాచేంద్ర బహాదరు జి. సి. ఐ. ఇ. వారి పోషణమున సంస్కృత కవిజీవితము రచియించి 1911 లోఁ బ్రకటించితిని. ఆయుద్యమమున శ్రీవారే కాక, నన్నుఁ దమయాస్థాన పండితునిగా నాదరించి సత్కరించుచువచ్చిన నాఁటి జటప్రోలు సంస్థానాధిపతు లగు శ్రీరాజా సురభి వెంకటలక్ష్మారావు బహాదరువారును, నాఁటి మునునూరు సంస్థానప్రభువు లగు శ్రీరాజా నారయప్పారావు బహాదరువారును, ప్రస్తుత వెంట్రప్రెగడ సంస్థానపతు లగు శ్రీరాజా సింహాద్ర్యప్పారావు బహాదరువారును, నన్ను మిక్కిలి యాదరించిరి. ఆరాజ మహారాజుల నాఁటి సమాదరణమే నేఁటి సంస్కృత వాఙ్మయ చరిత్రకుఁ బునాది యగుటచే వారు నా కొనర్చిన యుపకృతి సత్కృతుల కియ్యెడ ముందుగాఁ గృతజ్ఞత చూపుచున్నాను.

సంస్కృత కవిజీవితము పునర్ముద్రణ మపేక్షించునాఁటి కనఁగా 1916 లో నే ననంతపుర దత్తమండల కలాశాలలోఁ బని చేయుచుంటిని. అపుడు క్రొత్తగాఁ గలాశాలకు వచ్చిన సంస్కృత గ్రంథసంచయము గాంచి, సంస్కృత వాఙ్మయచరిత్రమే రచియించి ప్రకటించెదఁ గాక యని సంకల్పించి యపుడే ఋగ్వేదాది గ్రంథపఠన పరిశోధనము లారంభించితిని గాని 'శ్రేయాంసి బహువిఘ్నాని' యన్నట్లు కొంతకాల మాపని సాగునప్పటికి నేను రాజమహేంద్రవర కలాశాలకు మాఱుటయు దైవికము లయిన క్లేశములపా లగుటయు, నడుమ నడుమ భీష్మప్రతిజ్ఞ, ఆంధ్రభాషానుశాసనము మొదలగు కృతులు ప్రకటించుటయుఁ గారణములుగాఁ దలపెట్టిన యాకృత్యము నిర్విఘ్నముగా జరుగలేదు కాని, ఆయుద్యమము మాత్రము విడువలేదు.

అనంతరము 1929 మొదలుగా సుమారు రెండు సంవత్సరములు రాజమహేంద్రవరమం దుండియు, పదపడి యాంధ్రవిశ్వ కలాపరిషత్కలాశాలాంధ్రాధ్యాపక పదవీవశమున విశాఖపట్టణము వచ్చియు, తదేకదీక్ష వహించి మొట్లో

వైదిక వాఙ్మయచరిత్రరచనము పూర్తిగావించి నేటికిఁ బ్రాజ్ఞలోకమునకు సమర్పింపఁ గలిగితిని. లౌకిక వాఙ్మయచరిత్ర రచనమును గావించుచున్నాను.

పూర్వ శాస్త్రకర్తలు కొందఱు వేదావిర్భావతిరోభావములం గూర్చి చర్చించియుఁ దుద కవి యనాదు లపౌరుషేయము లనుచుఁ దత్కాలకర్తృత్వ విచారమునకు స్వస్తిచెప్పి వైదికవిజ్ఞానము విస్తరింపఁ జేయుమార్గము పట్టిరి గాని తదుత్పత్తివికాసనముల విచారణముఁ బొంతఁ బోరైరి. దానంజేసి యావిషయ మజ్ఞేయ మని యూహింపఁ దగియున్నది. అయినను ముందు కొందఱు పాశ్చాత్య పరిశోధకులును, తరువాతఁ గొందఱు భారతీయ విద్వాంసులును సాహసించి వైదిక విద్యారణ్యమునఁ జొరఁబడి యధిక పరిశ్రమ చేసి తచ్చరిత్రము వెలువరింపఁ గొన్నిత్రోవలు త్రొక్కిరి గాని యవి యన్నియుఁ గొన్ని ప్రధానచరిత్రాంశ ముల నేకీభవింపక వేఱుపడిన వనుట విదితము. ఆవిషయము లెవ రెట్లు శోధిం చిన నిది మిథ్య మని నిర్ణయింప శక్యము గాని వగుటయే యందుకుఁ గారణ మని చెప్పఁదగి యున్నది. అందుచేఁ జరిత్రరచనము క్లేశాతిక్లేశకర మని యెఱిఁ గియు సంస్కృతవాఙ్మయచరిత్ర మాంధ్రవాగ్దేవిచరణకమలముల నుపాయన ముగా సమర్పించు నుత్కంఠతోఁ బూర్వచరిత్రకర్తల మార్గములు పరిశీలిం చియు స్వతంత్రముగా వైదికవాఙ్మయము పరిశోధించియు నీచరిత్రగ్రంథము రచియింప శక్తివంచన లేక పరిశ్రమ యొనర్చితిని. ఈగ్రంథమున వర్ణింపఁ బడిన బహువిధ విషయములును వానింగూర్చి కావించిన చర్చలును విమర్శనము లును, అందుకుఁ బ్రమాణములుగాఁ జూపిన బహు గ్రంథములలోని వాక్య ములును నా పరిశోధనపద్ధతిని విశదీకృత విషయస్వరూప స్వభావములను దెలు పకపోవు గాని, గుణగ్రహణపారీణులగు విద్యాధికుల యామోదము తెలియు వఱకును నాకృషిసార్థక మైన దని మాత్రము తలంపఁజాలను. అదిగాక లోక ములో నెం దయిన గుణముతో దోషము గూడ నుండకపోదు గావున నీసందర్భ మున—

"దృష్టం కిమపి లోకేఽస్మి న్న నిర్దోషం న నిర్గుణమ్
ఆవృణుధ్వ మతో దోషాన్ వివృణుధ్వం గుణాన్ బుధాః".

అనుసూక్తిని సహృదయు లగుపాఠకులకు స్మృతికిఁ దెచ్చుటకంటె వే ఱేమియు వ్రాయఁజాలను.

నేను రాజమహేంద్రవరము విడిచి విశాఖపట్టణము వచ్చినతఱిని గావలు సిన గ్రంథములు యూనివర్సిటీ పుస్తక భాండాగారమునకు వచ్చియుండలేదు. ఆసమయమున బ్రహ్మశ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారు తమవద్ద నున్న వైదికగ్రంథము లన్నియును, కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ పరవస్తు

రంగాచార్యుల వారిపౌత్రులగు శ్రీమాన్ లక్ష్మీనరసింహస్వామి అయ్యవార్లం గారు తమ యార్షపుస్తకాలయమందలి ముద్రితాముద్రిత గ్రంథసంతతిని సంతోషపూర్వకముగా నాకెర విచ్చిరి. ఆంధ్రవిశ్వ విద్యాలయములోని చరిత్రా ధ్యాపకులును మన్మిత్రులు నగు శ్రీయుతులు మామిడిపూడి వెంకటరంగయ్య పంతులు (M. A.) గారును, గొర్తి వెంకటరావు (M. A. L. L. B.) గారును, ఆంగ్లచరిత్ర పరిశోధనమున నాకుఁ గలిగిన సంశయము లెడనెడఁ దీర్చుటయే కాక, తత్పరిశోధనమునకుఁ దగిన సూచనలు గూడఁ దెల్పుచు వచ్చిరి. నాయభి లాషము వేళ్ళ గావింపక, ఆంధ్రవిశ్వకలా పరిషదుపాధ్యక్షు లగు సర్ ప్రొఫె సరు సర్వేపల్లి రాధాకృష్ణపండితు లాదరముతోఁ గృతిపతిత్వ మంగీకరించిరి. వేదవేదాంగ పాఠకులును సుప్రసిద్ధన్యాయవాదులు నగు శ్రీ ప్రభల లక్ష్మీ నరసిం హముపంతులుగారు ప్రేమతో దీనికిఁ బీఠిక రచియించిరి. సంస్కృతాంధ్ర సాహిత్య పరిషదధ్యక్షు లగు శ్రీయియాయుణ్ణి వేంకట వీరరాఘువాచార్యులు (B.A.) గారు విజ్ఞప్తి వ్రాయుటయే కాక, అకారాదిపదసూచిక నిర్మించిరి. ఆంధ్రవిశ్వ కలాపరిషత్పాలకులు దీనిని బరిషత్పక్షమున దయచేసి ప్రకటించిరి. వీరి కంద ఱకిని గృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను. ఈ గ్రంథరచనమున నే నుపయోగించిన యాయాగ్రంథముల పట్టికయొకటి మొదటఁ జేర్చితిని. తత్క ర్తల కెల్లరకుఁ గృతజ్ఞుఁడను. ముద్రణమున సంభవించిన కొన్ని ముఖ్యదోషము లకు శుద్ధపత్రము చివరఁ జేర్చితిని. అత్యల్పము లయిన మఱికొన్ని యచ్చుతప్పు లుండును. పాఠకు లట్టివానిని సవరించుకొని పఠింతురుగాక. ఉదారహృదయ ముతో నీగ్రంథము చదివి యిందలి గుణము గ్రహించుటయే నా పరిశ్రమకుఁ దగినఫల మను నావిన్నపమును విద్వల్లోక మాదరించుఁగాక.

ఆంగీరసఫాల్గునపూర్ణిమా
భానువారము.
విశాఖపట్టణము.
12—3—1933.

ఇట్లు, విన్నవించు విధేయుఁడు,
మల్లాది సూర్యనారాయణశాస్త్రి,
కృతికర్త.

శ్రీ ర స్తు.

# కృ తి స మ ర్ప ణ ము.

శ్లో. శ్రీవాస స్సకలాధార శ్చిదానన్ద స్సదాత్మకః
రాధాకృష్ణ స్సదా పాయా ద్రాధాకృష్ణ విపశ్చితమ్.

శ్లో. సత్యం జ్ఞాన మనా ద్యనన్త మఖిలం బ్ర హ్మేతి య శ్శ్రూయతే
సర్గ స్యాస్య నిమిత్తకారణ ముపాదానం చ యః కీ ర్త్యతే
సర్వా న్తర్గతచిన్మయ శ్చ జగత స్సా క్షీతి యః కథ్య తే
సోఽయం విశ్వవిభు శ్శ్రియం దిశతు రాధాకృష్ణ విజ్ఞానినే.

మ. పర మర్థించుతపస్వు లెవ్వనికృపాపాంగంబు సోఁకంగ భా
స్వర సంవిన్మయదృష్టి మంత్రములు సంభావించి వీక్షించి రా
పరమేశానుఁడు వేదవేద్యుఁ డఖిలబ్రహ్మాండసంధాత త
త్పరతన్ బ్రోచు సతీసుతాన్వితుని రాధాకృష్ణ విద్వన్మణిన్.

క. సర్వార్థసాధకంబులు
సర్వేశ్వరనిధులు వేదశాస్త్రంబులు మా
సర్వేపల్లికులాంబుధి
పర్వేందుని గృష్ణు సర్వభద్రుని జేయున్.

క. అని పరమేశ్వరమహిమం
బనుసంధానించి మంగళాశీర్వాదం
బొనరిచి కృతి యిచ్చుతలం
పున రాధాకృష్ణుచరితమును వర్ణింతున్.

గీ. బ్రహ్మవిజ్ఞానవిలసిత బ్రహ్మజాతి
నాకతరుశాఖలం బాకనాఁటిశాఖ
సాధువ ర్తన నీశ్వరారాధనమున
వాసి కెక్కి న సర్వేపల్లివంశ మలరు.

క. శ్రీవత్సగోత్ర మగునా
పావనవంశమున రామభ క్తిగరిష్ఠుం
డై వెలసినసీతారా
మావనిసురుఁ డొప్పెఁ గొండమాంబిక సతిగా.

క. వారిర్వురి తనయుం డగు, వీరాస్వామి ప్రధాని వేదోక్తసదా
చారాంచితుఁడై తహసీ, ల్దారుండై తిరుతనీపురంబున వెలసెన్.

చ. అతనికి ధర్మబుద్ధి వినయంబు వివేకము నూఁతగా సతీ
హితచరితంబు గల్గి పరమేశ్వరుఁ గొల్చెడిసీతమాంబయం
దతిమృదుభాషణుల్ గురుజనస్థిరభక్తులు నీతిమార్గస
మ్మతగతులైన యేవురు కుమారులు పుట్టిరి వారిలోపలన్.

క. మేధావిశేషసంపద, బోధాయనుఁ డగుచు బాల్యముననే సవిమ
ర్శాధీతవిద్యుఁడై శ్రీ, రాధాకృష్ణుండు వంశరంజరంజనుఁ డయ్యెన్.

సీ. తల్లిభాష పఠించెఁ దమిళంబు నార్జించె
సంస్కృతసాహితి సంతరించె,
ఆంగ్లభాషావాఙ్మయాభ్యాసచాతురి
ముందంజయై కాన్క లంది మించె,
హైందవాంగ్లేయతత్త్వాగమంబులయందు
నందె వేసినచేయినై రహించె,
నేర్పున రాజధానీకలాశాలలోఁ
దత్త్వశాస్త్రాచార్యతను వహించె,

గీ. ఆంధ్రకర్ణాట వంగవిద్యాలయముల
దేశమంతట మ్రోఁగుకీర్తిని గడించె,
దానిఁ బాశ్చాత్యఖండమధ్యములఁ బెంచెఁ
బురుషసామాన్యుఁడే కృష్ణబుధవరుండు.

సీ. సిద్ధసంకల్పుఁ డాశ్రితవత్సలుండు స
ర్వవ్యాపకుండు సద్వర్తనుండు,
దూరదర్శనుఁ డహంకారదూరుఁడు సభా
రంజనుండును గర్వభంజనుండు,
ఆగమాంతాంతర్విహారుండు ధార్మిక
నరహితుండును మహీవరసఖుండు,
నగుచు రాధాకృష్ణుఁ డనునామ మన్వర్థ
మొనరించు సుగుణంబులను నితండు,

గీ. కృష్ణుఁ డగుఁగాని వర్ణమం దెన్న వేఱు
కృష్ణుఁ డగుఁగాని యామాయ లెన్న లేవు
కాని కృష్ణుండె తత్త్వవిజ్ఞానమందు
రాజనీతిని ధర్మసంరక్షణమున.

సీ. వాసి కెక్కిన దివ్యవక్తృత్వ మెంతుమా,
గర్జత్తరంగ యాకాశగంగ,
వన్నె గాంచినమహావైదుష్య మందుమా.
యా ననిపించు రత్నాపణంబు,
కార్యనిర్వాహప్రగల్భత చూతుమా,
గడిదేఱుమంత్రియుగంధరుండు,
తులఁ దూఁగుసిరిసంపదలు నిరీక్షింతుమా
తులకించు పచ్చని దోసతోఁట,

గీ. హృదయమా ధీరము సుదార, మెలమి వెలయు
పల్కులా మృదులంబులు, భావమందు
మేని గంభీరము ఫలానుమేయ మహహా!
కృష్ణవిద్వాంసుచరిత కీర్తింపఁ దరమె ?

సీ. తిలకపండితరవీంద్రుల సెబా సనిపించెఁ
బరిశోధనారంభపటిమ మించి,
రాయలసమితివారల కబ్బ మొదవించె
వేద్యాంశమర్మముల్ వెల్లడించి,
డాక్టరు బిరుదపాఠంబు లాకర్ణించె
శారదాపీఠంబు సంస్తుతించి,
సార్వభౌమునిచేతి సర్ బిరుదార్జించె
వేదాన్తతత్వ మావిష్కరించి,

గీ. విశ్వజాతిబుధాస్థాని వేడ్క నించె
భారతీయార్యవిజ్ఞానధార ముంచి,
యాంధ్రవిశ్వవిద్యాపీఠి నగ్రపీఠ
మధివసించిన యీకృష్ణబుధవరుండు.

గీ. తెనుఁగు జాతికిఁ బేరు తెచ్చినమనీషి
తెలుఁగుభాషను లేవనెత్తినహితైషి,
ఆంధ్రదేశాభివృద్ధికి నాశ్రయుండు
భవ్యచరితుండు చిరకాలపరిచితుండు,

చ. హితుఁడును శ్రీసరస్వతుల కిష్టుఁడు విశ్వకలాప్రవీణ సం
శ్రితగురుపీఠపాలన గరిష్ఠుఁడు పండితలోకరంజక
ప్రతిభుఁడు నీతికోవిదుఁ డుపాయవిదగ్రణి సర్వదేశస
న్నుతకృతికర్త, యిట్టిసుగుణున్ గృతిభర్తఁగఁ జేయు టొప్పదే.

క. జగ మెఱిఁగిన సుశ్లోకుఁడు
జగము నెఱింగినసుధీ విశాలుఁడు కులశీ
లగుణాన్వితుఁ డీకృష్ణుఁడె
తగుఁ గృతి నర్పింప ననుచుఁ దత్పరమతినై.

సీ. వేదవేదాంగాది వేత్తలు బహువిధ
వాఙ్మయవిదు లొక్కనంక వెలయ,
సంస్కృతాంధ్రాంగ్లభాషలఁ గృతుల్ రచియించు
పండితకవు లొక్కప్రక్క మెఱయ,
తత్వార్థగణితపదార్థరసాయనా
ర్థచరిత్రబుధు లొక్కదండ నుండ,
విశ్వవిద్యాలయ వివిధసభ్యులు ధర్మ
శాస్త్రకోవిదు లొక్కసరణిఁ దనర,

గీ. రాజులును మంత్రులును మహారాజు లెలమి
నుచితపీఠంబులందు గూర్చుండియుండఁ
గృతిపరిగ్రహ సూచకస్మిత హితాస్యుఁ
డగుచుఁ బేరోలగం బున్నయవసరమున.

క. కృతి వైదికవాఙ్మయ మని
కృతిపతి వేదాంతవిషయకృతమతి యని నా
కృతి సార్థక మగు నని యీ
కృతి రాధాకృష్ణబుధున కిచ్చితి వేడ్కన్

చ. సరసవచోవిలాస! బహుశాస్త్రవిచారణచాతురీధురం
ధర! పరమార్థబోధన విధానకుశాగ్రమనీష! తావక
స్ఫురదురు కీర్తికాంత నినుఁ బొందిన యీకృతికన్యయుం బర
స్పరసహవాసభాగ్యమున శాశ్వతభోగము గాంత్రు గావుతన్.

క. అనుపమ వాగాభరణా!
వినుతగుణా! ఆంధ్రవిశ్వవిద్యాలయ పా
లననిపుణా! నిజకులవ
ర్ధన! రాధాకృష్ణ భక్త రాధాకృష్ణా!

వ. అవధరింపుము.

श्रीरस्तु.

ओन्नमः परब्रह्मणे.

# సంస్కృతవాఙ్మయచరిత్ర

ప్ర థ మ భా గ ము.

## వై ది క వా ఙ్మ య ము.

ప్ర థ మా ధ్యా య ము.

### గ్ర న్థా వ తా రి క.

ఓ న్నమ స్సర్వవేదాన్తవేద్యాయ పరమాత్మనే।
వేదేభ్యో వేదదర్శిభ్యో మహర్షిభ్యో నమో నమః॥

నత్వా గణాధిపం వాణీం కృత్వా చ గురువన్దనం।
ధ్యాత్వా సూత్రపురాణాదిగ్రన్థకర్తౄన్ మహామునీన్॥

వైదిక లౌకిక సారస్వతతత్వ మహత్త్వదర్శనాదర్శం।
సంస్కృతవాఙ్మయచరితం కరోమి సవిమర్శ మాన్ధ్రభాషాయామ్॥

వేదవేదాంగ మీమాంసాది భేదమునను స్మృతీతిహాసపురాణాది భేదమునను బహువిధ మయ్యు వైదిక లౌకికభేదమున ద్వివిధ మైన యార్యవాఙ్మయము భరతఖండముపాలిటి మహాభాగ్యనిధియై వైదిక లౌకికభాషా నిబద్ధమై యలరారుచు నదియే క్రమముగా సంస్కృతవాఙ్మయ మనుసామాన్యనామము వహించినది. దీర్ఘాయు వగునొక ప్రతిభాశాలి తనజీవితకాల మంతయు దారవ్రాసినను సాకల్యముగాఁ దెలిసికొనఁ దరము గాని యావాఙ్మయము-అందును విశేషించి వైదికభాగము పెక్కువేల సంవత్సరములుగా బ్రాహ్మణ సంతతివారిచే నధ్యయనాధ్యాపనవ్యవహారమునఁ జెక్కు చెదరకుండఁ గంఠస్థముగా రక్షింపఁబడుచు వచ్చుటయే దానిమహిమను వేనోళ్లఁ జాటుచున్నది. అట్టి విజ్ఞాన నిధానము పరమపావనము సకలార్థసాధనము నైనయార్యసారస్వతము తొల్లి చిరకాల

మాసేతుహిమాచలము భరతఖండమున నేకచ్ఛత్రాధిపత్య మొనరించియు దేశ కాలపాత్రముల మార్పులను బట్టి క్రమముగా క్షీణదశకు వచ్చుటచే నీకాల మున బ్రాహ్మణజాతియందు లౌకికసాహిత్యమునఁ బరిచయముగలవాఁడు నూటి కొకఁడుగాని వేదములు పఠించినవాఁడు వేయింటి కొకఁడుగాని యుండఁడని చెప్పవలసివచ్చినది. ఆహా కాలము! అనంతశక్తిసంపన్న మైనదానివిలాస మెపు డెట్లు పరిణమించునో. యెవఁ డెఱుఁగును?

అయినను సర్వసంపత్సమేతయు సాత్వికచిత్తవృత్తియు నగు భరతమాత యెడనెడ ననార్యుల పోరాటములకును దనపుత్రులయంతః కలహములకును విదేశీయుల ఘోరయుద్ధములకును మతద్వేషుల దురంతహింసలకును అనుకూలశత్రువుల వంచనలకును లోనై పడరానిపాట్లుపడి కలఁత చెంది చెంది వాడి వత్తయై ధైర్యస్థైర్యములు ధనరత్నరాసులు ఛత్రచామరములుఁ గోల్పోయియు నడుమ నడుమ నించించుక సారస్వతసంపదఁగూడఁ బోఁగొట్టుకొనియు ఆవేదవేద్యుని కరుణాకటాక్ష వీక్షణ విశేషముననో వైదికార్యుల సత్సంకల్ప ప్రభావముననో తనకాణాచి యగువాఙ్మయనిధిమాత్ర మెట్లో రక్షించుకొనుచు వచ్చె ననియే మన మిపుడు సంతోషింపవలసియున్నది. కావుననే గతి లేని బానిసయై యాఁకటిబాధ నకనకంబడు భరతఖండమున వేదశాస్త్రాదు లిప్పటికిని, కొనయూపిరితో దేశమున నందందు గానవచ్చుచున్నవి గాని లేకున్న వాని పేరైన లేకుండఁ బోయి యుండునుగదా!

అట్టి వాఙ్మయసంపదతోఁ గొన్నివేల సంవత్సరముల క్రిందట నార్యావర్తమునుండి క్రమముగా దక్షిణాపథమునకు వెడలివచ్చిన యార్యులలోఁ గొందఱీయాంధ్రదేశముఁ జొచ్చి యిందు స్థిరపడి వేదవేదాంగ విజ్ఞానసుధాధారల నీదేశమంతయుఁ బావనము గావించిరి. నాఁటినుండి నేఁటిదనుక నాంధ్రదేశీయులగు శ్రోత్రియులవలె సుస్వరముగా శ్రుతిరంజకముగా వేదములు పఠించువారు భరతఖండమున లేరనెడి ఘనతకీదేశము పాత్రమైనది. ఇప్పటికి నట్టి వేదపాఠకు లిందు కొందఱు కలరుగాని మొత్తముమీఁద ముఖ్యముగా నాముష్మికచింతతో వేదాదివిద్య లభ్యసించు బ్రాహ్మణజాతి యిపుడు ముప్పాతిక మువ్వీసము దానికి దూరమైన దని చెప్పవలసి వచ్చినపుడు తక్కిన యాంధ్రలోకమునకు వాని మహత్త్వ మించుకైన గోచరింప కున్న దని వేఱే చెప్పనేల? కావున మహర్షులును మహాకవులును దమ విజ్ఞానసూత్రమున గ్రుచ్చి భారతీదేవి మకుటమున కలంకారముగా సమర్పించిన సంస్కృత వాఙ్మయ దివ్యమాల్యము సుగంధ మింతైన నాఘ్రాణించి యాంధ్రు లానందింతురుగాక యని యాంధ్రభాష నీసంస్కృత వాఙ్మయచరిత్ర రచియింప నారంభించుచున్నాను.

## ఆర్యులు – వారి మొదటినివాసము.

ఈ గ్రంథమున మొదటిభాగ మగు వైదికవాఙ్మయమునుదంతము తెలిసి కొనుటకు ముందు దాని కాధారభూతు లైన ప్రాచీనార్యులనుగూర్చియు వారి నివాసాదికమునుగూర్చియుఁ గొంత యెఱుంగుట యావశ్యక మే కాని, ప్రత్యేక గ్రంథము కాఁదగిన యీ విషయమును బ్రాచ్యపాశ్చాత్యపండితు లనేకు లనేక విధములఁ జర్చించి సిద్ధాంతీకరించియుండ మరల దానినే విమర్శించి నిర్ణయింపఁ బూనుట చర్వితచర్వణమే కాక గ్రంథవిస్తరము కూడ నగును గావున నార్యుల యుదంతము నిందు సంగ్రహముగా ముచ్చటింతము.

ఆర్యశబ్దము ఋగ్వేదమునఁ బెక్కుచోట్లఁ గానవచ్చును[1]. దీనికిఁ బూజ్యు లైనవిద్వాంసు లనియుఁ గర్మానుష్ఠానపరు లనియుఁ ద్రైవర్ణిక మైనయుత్తమ జాతివా రనియు నీశ్వరపుత్రు లనియు నర్థములు కలవు. అట్టి యీ యార్యు లెక్కడివారు? ఎప్పటివారు? అను ప్రశ్న లిపుడు చరిత్రపరిశోధకులను గలఁత పెట్టుచున్న ప్రాచీనచరిత్ర విషయక ప్రశ్నలలో నతిముఖ్యము లైనవి. వీనికి సదుత్తరము లిచ్చుటకుఁ దగిన సాధనసామగ్రి మిక్కిలి తక్కువయనుటకుఁ బ్రపంచమందలి యిప్పటి వివిధ జాతులవారి భాషలలోని కతిపయశబ్ద సాదృశ్య మును వారిగ్రంథములలోని కొలఁదిగాథలును వారి కొన్ని యాచారములును భూగర్భశాస్త్రమును భూగర్భగత వస్తుపరిశోధన శాస్త్రమును మున్నగునవి యాధారములుగాఁ బరిశీలించి విమర్శించియు, సిద్ధాంతమున వేఱువేఱుత్రోవలు త్రొక్కిన యాధునిక చరిత్రకారుల యాశయములే తార్కాణము. ఆర్యుల తొలుతటినివాసస్థాన మేదో యొకటి యగును గాని వారు వారూహించినయన్ని యును గావు కదా! కాని, యీ చరిత్రకర్త లందఱును మాననీయులే. అట్టి యెడ వారిలో నెవరి మత మాననము? ఎవరిది కాదనము? అయినను, ప్రపంచ మందలి సకలవాఙ్మయ పఙ్క్తికి ఋగాదివేద వాఙ్మయము శ్రీకార మని యెల్ల ఖండములవా రంగీకరించి యుండఁగా, ఆర్యుల నిజవృత్తాంత మినుమంతైనఁ దెలి యఁజేయ దానికంటె వేఱొకటి యుత్తమ ప్రమాణము కాఁజాల దనుట సత్యమై యుండఁగా, ఏది వేదవచనప్రామాణ్య మనుసరింపక వైపూఁతమెఱుం గులతోఁ దల యెత్తెనో యట్టి సిద్ధాంత మూహాలమీఁదిమేడ యనక తీఱ దని

1. విజానీ హ్యార్యాన్. ఋ. 1-51-8;
జ్యోతి శ్చక్రథు రార్యాయ. ఋ 1-117-21.
హత్వీ దస్యూన్ ప్రార్యం వర్ణ మావత్. ఋ. 3-34-9.
ఆర్యం త్రైవర్ణికవర్ణమ్. సాయణభాష్యము.
ఆర్య ఈశ్వరపుత్రః. నిరు.....6-26.

కొందఱు తలంతురు కాని యది సరిగాదు. ఏ మనఁగాఁ?—విషయమా, బహు పురాతనము మిక్కిలి దురవగాహము. ఉపాయసంపదయా, అత్యల్పము సంశయాస్పదము. అట్టియెడ వాఙ్మయసేవాభిలాషతోఁ జేసిన యెట్టి కృషియైనను సత్యాన్వేషణ తత్పరులగు తరువాతివారికి మార్గదర్శక మగునే కాని యూరకపోదు. అందుచే నేసిద్ధాంత మైన నేదో యొకవిధముగాఁ బ్రయోజనకారియే కాని యనాదరణీయము కాదు.

ఇఁక వేదవచన ప్రామాణ్య మందుమా, ఆర్యుల కాలనివాసాదులను దెలుపు వాక్యములు వేదములం దైనను విశేషముగా లేవు. ఆయున్న వైన నొక చోట లేవు. అందందు చెదరి పడియున్నను వివిధసందర్భములలో నున్నయవి ప్రత్యక్షముగాఁ బైవిషయములను బోధించునట్లు కానరావు. అయినను వాని నిజార్థము గ్రహింత మన్న నందలిభాష సుఖబోధ్యము గాదు. పైగా వారినాఁటికే యందలి నిజము గోచరింపమిఁగాఁబోలు భాష్యకర్తలు గూడఁ గొన్నికొన్ని వాక్యముల యర్థమును మార్గాంతరముఁ బట్టించియున్నారని కొందఱనుచున్నారు. అయినను శ్రమపడి వాని తత్త్వము గ్రహింత మన్నఁ బైవిషయముల కాధారములుగాఁ గనవచ్చెడి యాయావాక్యముల సమన్వయైక్యము దుర్ఘట మగుచున్నది. అందుచేతనే పెక్కండ్రు చరిత్రకారు లార్యనివాసాదికమును వేదవాక్యముల సాహాయ్యమున నిరూపింపఁజాలక పోయి రని యూహింపవలసియున్నది. కాని, యీపనికి దొరఁకొన్నవారును గొందఱు గలరు. వారిలో నగ్రగణ్యులు లోకమాన్య బాలగంగాధరతిలక పండితులు. వేదప్రమాణ నిరూపిత మైన వారి సిద్ధాంతము గూడ సరిగా దని యాధునికులు మఱికొందఱు తలంచుచున్నారు. కావున బహుపురాతన మగుటచే నిద యిత్థ మని నిర్ణయింప శక్యము గాకున్న యీ విషయమునుగూర్చి వారి వారి యభిప్రాయములు సంగ్రహముగా నుదాహరించుకొనుటయే మన మొదటిపని.

## ఐరోపాఖండవాదము.

ఆర్యుల మొట్టమొదటి నివాసస్థాన మైరోపాఖండ మనియు, ఉత్తర ధ్రువ మండల మనియు, ఆర్యావర్త మనియు, మధ్యాసియాఖండ మనియు, నాలుగు వాదములు గలవు. వీనిలో నైరోపావాదము కేవలము స్వదేశాభిమానముతో బయలుదేఱిన దగుటచేతను, దీనిని బలపఱిచెడి హేతువులు సమంజసములు కాకపోవుటచేతను, భారతీయ చరిత్రకారులు దీనిని గణింపక పోవుట యటుండ సుప్రసిద్ధు లైన పాశ్చాత్యపరిశోధకులు కూడ దీని నాదరింప లే దనుట విదితము. ఆర్యులతొంటి నివాసము జర్మనీ యనియు, తూర్పుయూర పనియు, మధ్యయూర పనియు, ఉత్తరయూరపనియు, స్కాండినేవియా యనియు, ఇంక నేదేదో

యనియు నీవాదమునం దనేకమతములు కలవు[1]. వీని కనుగుణముగా, పుఱ్ఱెల సిద్ధాంత మొకటి లేచినది. భూగర్భము త్రవ్వి త్రవ్వి తీసిన పుఱ్ఱెలలోఁ గొన్ని పొడుగుగా నుండి హైందవుల తలలను బోలియుండుటచే హిందూదేశార్యులు యూరపునుండి లేచి వెళ్లినవారే యని యొకనిర్ణయము. ఆ పుఱ్ఱెలలో వెడల్పుగా నున్నవే యార్యులకపాలము లనియు, ఆ ప్రాచీనార్యు లిప్పటి ఫ్రాన్సుదేశమున మొదట నివసించినగాలు లనియు మఱియొక నిర్ణయము. ఆ పొడుగు పుఱ్ఱెలవా రిప్పటి జర్మనుల మూలపురుషులే యని యింకొకనిర్ణయము [2]. యూరపులోని లిథూనియన్ భాష వైదిక సంస్కృతముకంటెను ఆ వెస్తాకంటెను మిక్కిలి ప్రాచీన మైనదిగాఁ గనఁబడుచున్నది గావున, పురాత నార్యజాతిలో మొట్ట మొదటి శాఖవారు లిథూనియనులే యని తోఁచుచున్న దని యొకయూహ [3]. యూరపులోని యతిప్రాచీన మైన లిథూనియన్ భాషనుండియే సంస్కృత భాష పుట్టి హిందూదేశము చేరిన దని యొకసిద్ధాంతము [4]. ఇట్లు తల లెత్తిన సారము లేని యీ వివిధమతములే యైరోపావాదము దుర్బల మని చెప్పక చెప్పుచున్నవి. ఇఁక రెండవది.—

## ఉత్తరధ్రువ మండలవాదము.

డాక్టరు వారెన్ మొదలగు విదేశపండితులు సూచించిన యీ యుత్తర ధ్రువమండలవాదము తిలకుగారివలన నభివృద్ధికి వచ్చినది. వారు వేదములలోని యుత్తరనివాసము (Arctic Home in the Vedas) అను పేర నార్యుల మొదటినివాస ముత్తర ధ్రువమండల మని నిర్ణయించుచు నాంగ్లమున మహా గ్రంథము రచియించిరి. అది యంతయుఁ జదివినవారికిఁగాని దాని గొప్ప తనము పూర్తిగా గోచరింపదు కాని, యీ వాదము సమర్థించుటకు వారు చూపిన ప్రధాన ప్రమాణముల యాకార మొకింత గ్రహింతము.

"భూమండలముయొక్క యుత్తరధ్రువమునకు సరిగా నుత్తరమున నొక నక్షత్రము కలదు. అదియే ధ్రువనక్షత్రము. అది యెపుడును గదలక యొక చోటనే యున్నట్లు కనఁబడును. ఉత్తరధ్రువము వద్దకు వెళ్లి నిలిచి చూచిన వారి కానక్షత్రము సరిగా నెత్తిమీఁద నున్నట్లును, తక్కిన నక్షత్రములు దాని చుట్టును, తలమీఁది గొడుగువలెను లేక కుమ్మర సారెవలెను గిరగిరఁ దిరుగు

1. **Aryan cradle P. 35.**
2. **Arctic Home P. 15, 16.**
3. **Aryan cradle.**
4. **Origin of Aryans P. 20.**

చున్నట్లును గనవచ్చును. అచ్చట ఖగోళములో నుత్తరార్ధగోళమే కనఁబడును. దక్షిణార్ధగోళ మెపుడును మఱుఁగుపడియే యుండును. అచ్చట సూర్యుఁ డుదయించిన యాఱునెలలకుఁ గాని యస్తమింపఁడు. అస్తమించిన యాఱుమాసములకుఁ గాని యుదయింపఁడు. అందుచే నక్కడ నాఱుమాసము లెడతెగని పగలును, ఆఱుమాసము లెడతెగని రాత్రియు సంభవించుచుండును. ఆమహారాత్రి గతించునపుడు సూర్యుఁడు దక్షిణార్ధగోళముననుండి యుత్తరార్ధగోళములోని కుదయించుచున్నట్లు ప్రత్యక్ష మగును. ఇట్టి లక్షణములతోఁ గూడిన యుత్తరధ్రువమే మేరుపర్వత మని ప్రాచీనులు వర్ణించి యున్నారు.

మఱియు సూర్యుఁ డుదయించుటకు ముందు గనిపించు వెలుతు రుషస్సనఁ బడును. అది యుత్తర ధ్రువవాసులకు దీర్ఘరాత్రి యంతరించు సమయమున భూమ్యాకాశములు కలిసినట్లుండు దిక్చక్రమువద్ద (Horizon) కనవచ్చి దాని యంచు చుట్టును, ఇరువది గడియల కొకసారి గిఱ్ఱునఁ దిరుగుచుండును. క్రమ క్రమముగా వెలుతు రధికమగు చున్నట్లుగా, ఆయుషస్సులు ముప్పది రోజులు తిరుగు నప్పటికి సూర్య బింబము ప్రత్యక్ష మగును. కెప్టెన్‌పిమ్ (Captain Pym) అను పండితుఁ డుత్తర ధ్రువమునొద్దఁ గనవచ్చు దివారాత్రములను సంధ్యాకాలములను వివరించి యుచటి సంవత్సరము నిట్లు వర్ణించియున్నాఁడు:—జనవరి 29 తేదిని మొట్టమొదట వెలుఁగు కనిపించును. ఇదే యుషఃకాంతి. ఇది 47 దినము లుండును. తరువాత మార్చి 16 తేదిని సూర్యబింబ ముదయించును. సెప్టెంబరు 25 తేది నస్తమించును. కాని తరువాత 48 రోజుల వఱకును సంజవెలుఁ గుండును. తరువాతి నవంబరు 13 తేది మొదలుగా 76 రోజులు సూర్యసంబంధమైన వెలుతు రే యుండదు. కాని యారోజులలోఁ గూడ, ఉత్తరధ్రువమునకు సరిగా నెత్తిమీఁదఁ బసిఁడిరంగు కాంతులను విరివిగా వెదచల్లునట్టి ఆరోరాబోరియాలిస్ (Aurora borealis) అను పెద్దజ్యోతివలన వెలుతురు సంభవించుచుండును. అట్టి బంగారుకాంతులచేఁ గ్రమ్మఁబడి యుండుటచేతనే మేరువు బంగారుకొండ యను ప్రసిద్ధిగాంచిన దనుట నిజము. ఇది యుత్తరధ్రువ బిందువువద్ద నుండు లక్షణము. దీని ప్రాంతప్రదేశమే యుత్తర ధ్రువమండల మనఁబడును. అది యతిప్రాచీనకాలమున సమశీతోష్ణమై మనుష్యులు నివసించుట కనుకూలముగా నున్నట్లును, ఆర్యు లాకాలమున నచ్చట నివసించి యున్నట్లును, పిదపఁ గొంతకాలమునకు వచ్చిన హిమప్రళయముచే నా ప్రదేశమంతయు హిమమయము కాఁగా నందు నశింపఁగా మిగిలినవారు దక్షిణదేశములకుఁ జేరినట్లును భూగర్భశాస్త్రాది పరిశోధనవలనఁ దెలియుచున్నది. కావున నార్యులతొంటి నివాస ముత్తరధ్రువమండల మని విశ్వసింపనగును."

పై యుత్తరధ్రువలక్షణ వర్ణనలు వేదాదులందు కల వనుట కుదాహరణ ములు కొన్ని :—

ఉత్తరధ్రువమువద్ద నిలిచి పైకిఁ జూచినవానికి సరిగాఁ దన నెత్తిమీఁద నక్షత్రమండలము బొంగరమువలె గిరగిరఁ దిరుగుచున్నట్లు కనఁబడు నను టయక్కడిలక్షణములలో మిక్కిలి విచిత్రమైనది. దీనిని సమర్థించు ప్రమాణ వచనము లి ట్లున్నవి.

"ఇంద్రుఁడు ఇరుసుచే రథచక్రములను వలెనే తనబలకర్మచే భూమ్యా కాశములను గట్టిగాఁ బట్టి యుంచెను[1]."

"ఇంద్రుఁ డాకాశమున సూర్యుని లేక ద్యులోకమును స్తంభింపఁ జేసెను[2]."

"ఇంద్రుఁ డనేకము లైన తేజస్సులను సారథి రథచక్రములను ద్రిప్పు నట్లే త్రిప్పుచున్నాఁడు[3]."

పై వాక్యములనుబట్టి చూడఁగా, ఆకాశ మొక స్తంభ మాధారముగా నిలిచి యున్న ట్లున్న దనుటచే, ఆ స్తంభముకొన ధ్రువనక్షత్ర మనియు, అది సరిగా నెత్తిమీఁద నున్న దనియుఁ దెలియవచ్చును. దాని చుట్టును నక్షత్ర ములు తిరుగుచున్న వనుటచే నాకాశము రథచక్రమువలెనే యా స్తంభాగ్ర మాధారముగా గిరగిరఁ దిరుగుచున్న దనుట స్పష్ట మగుచున్నది. మఱియు, "సప్తర్షి మండలము మిక్కిలి యెత్తుగా నున్న దనియు నది రాత్రి కనిపించును గాని పగలు కనఁబడ దనియు[4]." వర్ణింపఁ బడియుండుటచే, సప్తర్షి మండల ముద యాస్తమయము లెఱుఁగ దనియు, సరిగా నెత్తిమీఁద నుండునది యెల్లపుడును ధ్రువనక్షత్రముచుట్టు దిరుగుచునే యుండు ననియు విదిత మగుచున్నది. ఈ వర్ణన లుత్తరధ్రువమునకు మాత్రమే సరిపడునవి యగుటచే నచ్చటి పూర్వో క్తము లైన యాకాశ స్థితిగతులను గన్నులారఁ జూచినవారో లేక వారివలనఁ గర్ణాకర్ణికగా విన్నవారో పైవర్ణనలు చేసి యున్నా రనుట నిర్వివాదము గావున నార్యు లుత్తరధ్రువ మండలమున నివసించినవా రని చెప్పవలసి వచ్చుచున్నది.

ఉత్తరధ్రువమునద్ద నాఱునెలలు పగలు నాఱునెలలు రాత్రియు సంభ వించు నన్నదానికిఁ బ్రమాణములు;—"ఏది మన కొక సంవత్సరమో, అది

---

1. యో అక్షేణ చక్రియా శచీభి ర్విష్వ_క్త స్తంభ పృథివీ ముత ద్యాం, ఋ. 10-89-4.

2. అవంశే ద్యా మ స్తభాయ ద్బృహంత మారోదసీ, ఋ. 2-15-2.

3. స సూర్యశి పర్యురూవరాం స్యేంద్రో వవృత్యా ద్రథ్యేవ చక్రా. ఋ. 10-89-2.

4. అమీ య ఋక్షా నిహితాస ఉచ్చా నక్తం దదృశ్రే కుహ చిద్ది వేయుః। ఋ.1-24-10, తై. ఆ. ప్రశ్న 1-11.

దేవతల కొక్కదినము [1]." అను తైత్తిరీయ బ్రాహ్మణములోని వాక్యమునుబట్టి దేవతల దినమునందు సగము పగలును సగము రాత్రియు ననుట తెల్లమే కావున, ఆ పగటిభాగము మన యాఱుమాసముల యుత్తరాయణ మనియు, ఆ రాత్రిభాగము మన యాఱుమాసముల దక్షిణాయన మనియు స్పష్ట మగుచునే యున్నది. దీనిని మనుస్మృతిలోని యీ వాక్యము మఱింత ధ్రువపఱుచుచున్నది.

"మానవ సంవత్సరము దేవతల కొకపగలు నొకరాత్రియు నగును. అది వాభాగ ముత్తరాయణము. ఆరాత్రిభాగము దక్షిణాయనము [2]." దీని నింకను మహాభారత మిట్లు తేటపఱుచుచున్నది.

"తేజశ్శాలి యైన మహామేరు వుత్తరదిక్కును బ్రకాశింపఁ జేయుచున్నది. ... ... ... ఈ మేరువునకుఁ బ్రతిదినము సూర్యచంద్రులు ప్రదక్షిణము చేయుచుందురు. నక్షత్రములు దీని చుట్టును దిరుగుచుండును ... ... ... ఇచ్చట నున్నవారి కొకపగలు నొకరాత్రియుఁ గలిసి మన సంవత్సరముతో సమాన మగును [3]." జ్యోతిశ్శాస్త్ర ప్రమాణమునుబట్టి పైని వర్ణింపఁబడిన మహామేరు వుత్తరధ్రువ మనుటయు, అచ్చటి యాఱుమాసముల పగటిని ఆఱుమాసముల రాత్రిని బ్రాచీనార్యులు చూచి రనుటయు స్పష్టముగదా! ఇఁక నుత్తరధ్రువ రూపమైన మహామేరువువద్దఁ గనవచ్చు సూర్యుని, తైత్తిరీయారణ్యక మెట్లు వర్ణించుచున్నదో చూతము,

"ఆరోగుఁడు భ్రాజుఁడు పటరుఁడు పతంగుఁడు స్వర్ణరుఁడు జ్యోతిషీమంతుఁడు విభాసుఁడు, అను పేళ్లుగల సప్తసూర్యులును లోకహితార్థము ప్రాణికోటి కనుకూలముగ నాకాశ మంతయుఁ బ్రకాశింపఁ జేయుచున్నారు. కశ్యపుఁ డనెడివాఁ డెనిమిదవసూర్యుఁడు. అతఁడు మహామేరువు నెన్నఁడును విడువఁడు.

---

1. ఏకం వా ఏత ద్దేవానా మహః య త్సం వత్సరః. తై. బ్రా. 3-9-22-1
2. దైవే రాత్ర్యహనీ వర్షం, ప్రవిభాగ స్తయోః పునః,
   అహ స్త త్రోదగయనం, రాత్రి స్స్యా ద్దక్షిణాయనం, మను. 1-67.
3. ఉదీచీం దీపయ న్నేవ దిశం తిష్ఠతి వీర్యవాన్
   మహామేరు ర్మహాభాగ శివో బ్రహ్మవిదాం గతిః, ......
   ఏనం త్వహ రహ ర్మేరుం సూర్యాచంద్రమసౌ ధ్రువం,
   ప్రదక్షిణ ముపావృత్య కురుతః కురునందన,
   జ్యోతీంషి చా ప్యశేషేణ సర్వా ణ్యనఘ! సర్వతః
   పరియాంతి మహారాజ గిరిరాజం ప్రదక్షిణం.........
   బభూవ రాత్రి ర్దివసశ్చ తేషాం సంవత్సరేణైవ
   సమానకాలః! భార - అరణ్య - 163, 164 అధ్యా.

ఆసప్తసూర్యులును జగత్తును బ్రకాశింపఁజేయుటకై కశ్యపునివల్ల జ్యోతిస్సు పొందుచున్నారు." ఇందు వర్ణింపఁబడిన సూర్యులను జూచినసాక్షులు కూడ నీయనువాకమందే లభించుచున్నారు.

"వత్సపుత్రుఁ డగు పంచకర్ణ ఋషియు, ప్లక్షపుత్రుఁ డగు సప్తకర్ణ ఋషియు 'మేము సప్తసూర్యులను జూచినాము. కశ్యపసూర్యుఁడు మాకు గురూపదేశమువలన వినవచ్చినవాఁడే కాని యతనిని మేము చూడలేదు. అతఁడున్న మహామేరువును జేరుటకు మేము సమర్థులము కాలేదు' అనిచెప్పఁగా గర్గపుత్రుఁడైన ప్రాణత్రాతమహర్షి వారితో నిట్లు పలికెను. 'ఓమునులారా! మహామేరువునఁ బరివర్తమాన మగు కశ్యపనామక సూర్యమండలమును నేను గన్నులారఁ జూచితిని. మీరు మహామేరువునుగూర్చి వెళ్లి దాని శిఖర మెన్నఁడును విడువని కశ్యపసూర్యుని సందర్శింపుఁడు[2]" అని చెప్పి వారికి మార్గ ముపదేశించెను.

పై సూర్యవర్ణన ముత్తరధ్రువ లక్షణమును గన్నులకుఁ గట్టుచున్న దనుట స్పష్టము గదా! ఇఁక నార్యు లాధ్రువలక్షణములను బ్రత్యక్షముగాఁ జూచి యున్నవా రనుట కాశ్చర్య మేమి? అయిన నీ విషయమునఁ బ్రత్యక్ష ప్రమాణము జ్యోతిశ్శాస్త్రము గావున సూర్యసిద్ధాంతమున భాస్కరాచార్యు లేమి చెప్పిరో చూతము.

"మేరువునుత్తరాగ్రమున నున్న దేవతలు, రాత్ర్యనంతరమున నొక్క మాఱు మాత్రమే యుదయించునట్టియు మేషాదిరాశిషట్క మందుండునట్టియు సూర్యుని నిరంతరము చూచుచుందురు[3]." దీనినిబట్టి మేరువునద్ద మేషసంక్రమణమునాఁటి సూర్యోదయము మొదలుగా తులాసంక్రమణమునాఁటి సూర్యాస్తమయమువఱకు నాఱునెలలు విడువనిపగ లనియు, తరువాత మరల మేషసంక్రమణమువఱకు నాఱునెలలు విడువనిరాత్రి యనియు, ఆమేరు వుత్తరధ్రువమే యనియు విదిత మగుచున్నది. ఇట్లచ్చటియాఱేసినెలల యహోరాత్రములను బ్రత్యక్షముగాఁ దెలియఁజేయువాక్యములు బహుపురాతన మైనఋగ్వేదములోఁ గనరాకపోయినను, ఈభావము తెలుపువాక్యము లందు లేకపో లేదు. అందు గనవచ్చు దేవయానపద ముత్తరాయణమునకు సమాన మనియు, పితృయాణ పదము దక్షిణాయనమునకు సమాన మనియుఁ దెలియవచ్చును. దేవయానపదము

---

1-2. "ఆరోగో భ్రాజః పటరః పతఙ్గః స్వర్ణరో జ్యోతిషీమాను విభాసః" ఇత్యాది— తై. ఆర - 1-7. అనువా.

3. మేరౌ మేషాదిచక్రార్థే దేవాః పశ్యన్తి భాస్కరం। సకృ దేవోదితం — సూ. సి. 12—67.

ఋగ్వేదమునఁ బెక్కుచోట్లఁ గనఁబడును[1]. 'పితృయాణ' శబ్ద మిట్లే సరిగా లేదు గాని, ఇది దేవయానముకంటె నితర మైనమృత్యుమార్గ మని యొకచోట నున్నది. ఇంతకంటె విస్పష్టముగా, దేవతలమార్గము పితృదేవతలమార్గము నని మఱియొక చోట నున్నది[2]. పై వాక్యమున కర్థము వ్రాయుచు సాయణాచార్యులు దేవయాన పితృయాణము లని యర్థము వ్రాసి యున్నారు. పై దేవయానపదము దివాకాలపర మనెడిభావము తెలుపుచున్న 'ప్రమేపంథా' యనెడి ఋక్కును[3] పరిశీలింతము. "నాచేత దేవయానమార్గములు చూడఁబడుచున్నవి. ఎట్టివి? బాధ కలిగింపనట్టి వియు, తేజస్సులచే సంస్కరింపఁబడినట్టివియును. ఏమనగా?—తూర్పున నుషస్సు యొక్క కేతు వగు తేజస్సు కనవచ్చుచున్నది. ఆయుషస్సు మిక్కిలి యెత్తయిన ప్రదేశములనుండి ప్రత్యఙ్ముఖమై మన కభిముఖముగా వచ్చుచున్నది" దీనినిబట్టి దేవయాన ముషస్సుతోఁ బ్రారంభ మగు ననియు, పితృయాణము చీఁకటితోఁ బ్రారంభమగు ననియు గ్రహింపనగును. అయితే, ఈ దేవయాన పితృయాణ ములు మనదేశమునఁ గనవచ్చు దివారాత్రములే యని యేల తలంపరా దనెడి యాక్షేపము వచ్చునేమో కాని, పై ఋక్కుల కాధారభూతు లైనపూర్వఋషులు తాము ప్రతిపన్నెండుగంటలకుఁ జూచునట్టి యహోరాత్రములనే యంతగొప్ప చేసి, నేను దేవయానము చూచినాను, నేను దేవయానపితృయాణ మార్గములను విన్నాను' అనుచు నాశ్చర్యముతోను, అత్యాసక్తితోను, అట్లు పలికియుండ రని యూహించినచో, నివి యుత్తరధ్రువలక్షణము లైన యాఱుమాసములపగ టికిని, ఆఱుమాసములరాత్రికిని సమానము లని తెలియకపోదు. ఈ భావము పూర్వోదాహృతము లైనతైత్తిరీయబ్రాహ్మణాది వాక్యముల యర్థములకు సరి పడుచున్నది. ఇది ఖగోళశాస్త్రమును గణితశాస్త్రమును బట్టి యిక్కడి ప్రాచీనా ర్యులు గ్రహించి చెప్పినమాట కాదు. ఏ మనఁగా? ఈశాస్త్రములు రెండును వేద ములకుఁ దరువాత వ్యాప్తి చెందినవి గాని వేదకాలమునఁ బ్రబలినవి కావు, ఋగ్వేదాదులందు ఖగోళజ్ఞానమునకుఁ గొన్ని నిదర్శనములు గనవచ్చుచున్నను, అవి కంటికి గోచరించునవే కాని యూహించి లెక్క వేసి చెప్పినవి కావు. మంత్రబ్రాహ్మణముల కాలమునఁ బై విషయ మట్టి విజ్ఞానమునఁ గనిపెట్టఁబడిన దని విశ్వసించుటకుఁ దగినయాధారములును గనరావు. అది గాక మనయార్యు

---

1. ఋగ్వే - అంత ర్విద్వాగ్ అధ్వనో దేవయానా నతంద్రో 1-72-7 ఏహ యాతం పథిభి ర్దేవయానైః. 1-183-6.

2. పరం మృత్యో అనుపరేహి పంథాం య స్తే స్వ ఇతరో దేవయానాత్. 10-18-1 ద్వేస్రుతీ అశృణవం పితౄణా మహం దేవానా ముత-10-88-15. ఋ—

3. ప్ర మే పంథా దేవయానా అదృశ్ర న్నమర్ధంతో వసుభి రిష్కృతాసః । అభూ దు కేతు రుషసః పురస్తా త్ప్రతీ చ్యాగా దధి హర్మ్యేభ్యః. 7-76-2.

లనుండి కట్టకడపట విడిపోయినవారగు పారశీకుల మతగ్రంథ మగు 'వెందిదాదు'లోఁ గూడ నీయర్థ మిచ్చు వాక్యముండుటచేఁబట్టి చూడఁగా వీ రందఱును దొల్లి యొక్కచోటఁ గలసియున్నతఱిఁ గన్నులారఁ గాంచిన యీ వైచిత్ర్య మును మఱవక తమ గ్రంథములలో వర్ణించుకొనియున్నా రని తోఁచకపోదు. అం దట్లున్నది—"తైచ అయర మైన్యస్తే యత్ యారే[1]" దీని యర్థమిది—"వారు, ఏది యొకసంవత్సరమో, అది యొకదినముగా భావింతురు". ఈ వాక్యము తైత్తిరీయబ్రాహ్మణములోని— 'ఏకం వా ఏత ద్దేవానామహః య త్సంవత్సరః' అను వాక్యమునకు సరి యైనదండాన్వయమువలె నున్నది గదా! ఇంక నిట్టి వెన్నో యీ విషయము దృఢపఱుచుటకుఁ దగిన ప్రమాణములుకలవు. ఇఁక నుత్తరధ్రువమండలమున నెలరోజు లుషస్సు గనవచ్చు ననుటకుఁ బ్రమాణవచనములు కొన్ని.—

సంహితలందును బ్రాహ్మణములందును గూడ, ఉషస్సు పెక్కుచోట్ల మిక్కిలి విచిత్రముగా వర్ణింపఁబడినది. అనేకస్థలముల నిది బహువచనాంతముగా వాడఁబడినది. మఱియు. ఉదయింపఁబోవునది-ఉదయించుచున్నది - ఉదయించినది-అని మూఁడు భేదములతోను, మూఁడురంగులతోను వర్ణింపఁబడినది[2]. దీర్ఘకాల ముండునదిగాను ముప్పదిరోజు లుండునది గాను నిరూపింపఁబడినది. ఈ యుషస్సును గూర్చి తిలకుపండితులు ప్రత్యేకముగా నొక ప్రకరణము వ్రాసియున్నారు[3]. విశేష విషయములు దానివలనఁ దెలియవచ్చును గావున గ్రంథవిస్తరము గాకుండ నిందు కొలఁదిప్రమాణములు మాత్రము గ్రహింతము. 'ఈయుష స్సుదయించి యెంతకాల మైనది? దీని కంతము కనఁబడదే! ముందు పుట్టిన యుషస్సులవలెనే. యిదియును వెలుఁగు కలిగించుచుఁదనవెనుకఁ బుట్టునట్టి తక్కిన యుషస్సులతోఁ జక్కఁగాఁ గలియుచున్నది[4]." (దీనిచే, ఉషస్సున కనంతత్వ ముక్త మగుచున్నది. రాఁబోవునుషస్సులు కూడ దీని ప్రకాశము ననుకరించుచున్నవి. భాష్యము) 'అక్కచెల్లెళ్లయిన ముప్పది మంది ఉషోదేవతలు సమాన మైన ప్రకాశరూపమును ధరించి విద్వత్పురుషుల వలెఁ గనవచ్చుచు గిరగిరఁ దిరుగుచు బయలుదేఱినచోటు చేరుచున్నారు.

---

1. వెందిదాద్. ఫరార్డ్, 2, పేరా 40. Arc. H. P. 71.

2. ఉషసే స్వాహా వ్యుష్టై స్వాహోదేష్యతే స్వాహోద్యతే స్వాహోదితాయ స్వాహా. తై. సం. 7-2-20 తిస్రః దాసు చిత్రాః-ఋ. 5-79-9.

3. Arctic Home. cha V.

4. కియత్యా య త్సమయా భవాతి యావ్యూషు ర్యాశ్చనూనం వ్యుచ్ఛాన్, అనుపూర్వాః కృపతే వావశానా ప్రదీధ్యానా జోష మన్యాభి రేతి. ఋ. 1-113-10.

5. త్రింశ త్స్వసార ఉపయన్తి నిష్కృతగ్ సమానం కేతుం ప్రతి ముఞ్చమానాః ఋతుగ్ స్తన్వతే కవయః ప్రజానతీ ర్మధ్యే ఛన్దసః పరియన్తి భాస్వతీః. తై. సం. 4-3-11.

'(ఉషస్సులు) ఈదినమునను బరస్పరము సమానములే. అట్లే రేపును బరస్పరము సమానములే. ఇట్లేకరూపము లయిన యుషస్సులు పరిశుద్ధములు. ఇవి యత్యంత మాయతమును తమోనివారకుఁడగు సూర్యునిస్థానము నగు మేరువలయమును (ప్రతిదినము) సేవించుచున్నవి. (ఇవి సూర్యునికి) ముందు ముప్పదియోజనముల దూరమునఁ బుట్టుచున్నవి. వీనిలో నొక్కొక్కటియు (ఏకైకభూభాగవర్తులకు) తత్కాలమందే గమనాగమనాది రూపమైన ప్రజ్ఞను నిర్వహించుచున్నవి'[1].

'సదృశీ రద్య'యను ఋక్కునకుఁ బైయర్థము వచ్చునట్లు సాయణాచార్యులవారు భాష్యము వ్రాయుచు, ఉషఃకాల పరిమితిని ప్రతిదినసూర్యగతిని యోజనశబ్దార్థమును నిర్ణయించుచు, సర్వదేశములవారికి నొక్కదినమందే యుషస్సు గనఁబడును గావునఁ బ్రదేశబాహుళ్యమునుబట్టి యుషస్సు లనెడి బహువచనము యుక్తమగుచున్న దనుచు నింకను గొన్ని విశేషములు వివరించి యున్నారు. తిలకుగా రీఋక్కు నుదాహరించుచు "ఇంతకు మున్నెవ్వరును దీని భావము తృప్తికరముగా వెల్లడించియుండలేదు. సూర్యునిముందు ముప్పదియోజనములదూరమున నుషస్సులు వెలుఁగుచున్న వనెడిసాయణవచనము మిక్కిలి సరసముగా నున్నది. కాని సాయణులు యోజనశబ్దమునకు సరియైనయర్థము వ్రాయలేదు. వ్రాసినయర్థము జ్యోతిర్గణితమునకు విరుద్ధముగా నున్నది. పాశ్చాత్యు లీపదమునకు వ్రాసినయర్థము లైనను బొసఁగవు.' అనుచు ఋగర్థ మిట్లు వ్రాసిరి.

'ఉషస్సులు నేఁ డున్నట్లే రేపు నుండును. అవి వరుణదేవుని నివాసమునఁ జాలాకాలము వసియించును. అవి పరిశుద్ధములు. అవి యొకదానివెనుక నొకటి వలయాకారముగా ముప్పదియోజనములు తిరుగును. అట్లు తిరుగు ప్రతి యుషస్సును మొదట బయలుదేఱిన స్థలమును మరలఁ జేరును"[2]

ఇందు, పరియన్తి యనుక్రియకు గుండ్రముగాఁ దిరుగుచున్న వనియు, క్రతుశబ్దమునకు యథాస్థానమనియు, యోజనశబ్దమున కొకరోజునఁ దిరుగఁ దగిన దూరమనియు నర్థములు వ్రాసిరి. యోజన శబ్దమున కీయర్థమును సాయణు లెచ్చటను వ్రాయలేదు. పాశ్చాత్యపండితు లెవరునుగూడ నిట్లు వ్రాయలేదు. కాని పూర్వోదాహృత ప్రమాణవచనములను బట్టియు సందర్భమునుబట్టియు నితరఋక్కులలోని పదాదిశబ్దములను బట్టియు తిలకపండితు లీయర్థము సాధించిరి. దీని యౌచిత్యమునకు విద్వల్లోకమే ప్రమాణము. ఈ సందర్భమున సద్యశ్శబ్దమున కొకయర్థము నాకు స్ఫురించినది, అది యీవాదమున కుచిత మగునేని

1. సదృశీ రద్య సదృశీ రిదు శ్వో దీర్ఘం సచంతే వరుణస్య ధామ, అనవద్యా స్త్రింశతం యోజనా న్యేకైకా క్రతుం పరియన్తి సద్యః. ఋ. 1-113-8.

2. Arctic Home P. 103.

పండితలోక మాదరించుఁగాక. అపుడు చతుర్థపాద తాత్పర్య మిట్లుండును. '(ఉషస్సులు) ఒకదినమం దొకటిచొప్పునఁ దిరుగుచు మొదట బయలుదేఱిన స్థలముఁజేరును' సద్యశ్శబ్దమున కొకదిన మందనెడి యర్థము నిరుక్త సమ్మత మగును. ఇంక నీవిషయమును సమర్థింప నుదాహరింపఁబడిన యుషోవర్ణనము లనేకములు కలవుగాని యందు రెండుమాత్రము గ్రహింతము.

'బ్రహ్మ యీపరిదృశ్యమాన మైనజగత్తు నైదుగు రుషోదేవతలతో నిర్మించెను. వారిలో నొక్కొక్కరి కైదుగురుచొప్పునఁ జెల్లెండ్రను గలిగించెను'[1].

మొదటి యైదుగురును వారి సోదరు లిరువదియైదుగురును గలిసి ముప్పది మంది యగుచున్నారు. అనఁగా నుత్తర ధ్రువప్రాంతమున విడువకుండఁగా ముప్పది దినములలోఁ గనవచ్చునుషస్సులు వీరే యనుట విదితము. మఱియు, 'ఉషోదేవీ! భర్తసమీపమున సంచరించు పతివ్రతవలెనే జారుఁడై రాత్రితోఁ గలసియున్న నీప్రియుఁ డగు సూర్యునియెడ సంచరించుచు, నతని విడువక యింకను నీవు కనఁబడుచునే యున్నావు. (అనఁగా దుష్టశీలుఁడైన పతిని సాధ్వి యెట్లు విడువదో యట్లే నీవును సూర్యుని విడువకున్నా వని భావము) అందుచే సూర్యుఁ డుదయించుచుండ నతని (ప్రాచీనం) ముందు ప్రదేశమున నేవి యుద యించుచున్నవో, ఆ నీతేజస్సులే (అహాని) యింక ననేకము లున్నవి." [2]

పై సాయణభాష్య తాత్పర్యము తిలకించిన తిలకపండితులు 'అహాని'యను దానికి దినము లర్థము చెప్పి యారోజు లింక ననేకము లున్నవని చెప్పుట సమం జస మని యభిప్రాయ మిచ్చిరి. ఈ మార్పుగూడ సందర్భోచితమై యుత్తర ధ్రువవాదమును బలపఱచుచున్న దని చెప్పవచ్చును.

ఉత్తర ధ్రువమునకును దానికిఁ గ్రిందుగా నుండు ధ్రువరేఖకును నడుమ నుండు భూభాగ ముత్తర ధ్రువమండల మనఁబడును. అచ్చట ధ్రువనక్షత్రము సరిగా నెత్తిమీఁద నుండక ప్రక్కగాఁ గనిపించును. సూర్యునియుదయాస్త మయములందును మార్పులు గనవచ్చును. అచ్చటి సంవత్సరలక్షణ మందలి భిన్నభిన్న ప్రదేశములనుబట్టి మాఱుచుండును. అనఁగా, దీర్ఘరాత్రి-రాత్రి యెక్కువ పగలుతక్కువయగు దివారాత్రములు, పగలెక్కువ-రాత్రి తక్కువయ గుదివారాత్రములు, దీర్ఘదివసము-అనుక్రమమున సంవత్సర చక్రము తిరుగు

---

1. పఞ్చభి ర్ధాతా విదధా విదం య త్తాసాగ్ స్వసృూ రజనయ త్పఞ్చ పఞ్చ. తై. సం. 4-3-11.

2. తా నీ దహాని బహులా న్యాసన్యా ప్రాచీన ముదితా సూర్యస్య, యతః పరిజార ఇ వాచర న్త్యుషో దదృక్షే న పున ర్యా తీవ. ఋ. 7-76-3.

చుండును. దీర్ఘరాత్రి దీర్ఘదినసముల తగ్గుదలనుబట్టి క్రమముగా, అహోరాత్ర క్రమములుగల మాసములు. ఏడు-ఎనిమిది-తొమ్మిది-పది-పదకొండు. అగును. ఈ మాసస్థితికిఁదగినట్లు, ఉషఃకాలపరిమితియు క్షీణించుచుండును.

ఆమండలమున నందందు నివసించువారి సంవత్సరములు సూర్యరశ్మి గల మాసములకే సంబంధించినట్లును, అట్టి సంవత్సరములలోఁ జేయు క్రతువులు వార్షికసత్రము లనఁబడుచు వచ్చినట్లును, ఆయజ్ఞములు చేయువారు-నవగ్వులు-దశగ్వులు-అనుపేళ్లఁ బరఁగినట్లును, వేదములవలనఁ దెలియవచ్చుచున్నది.[1]. ఈ విషయము లన్నియు నిందు వివరించుట ప్రకృతముగాదు కావునఁ బ్రధాన విషయమునకు సంబంధించిన దీర్ఘరాత్రి వర్ణనను లొకటి రెండు చూతము.

'అదితీ! మిత్రావరుణులారా! మీయెడ నపరాధము చేసినాము. అయినను మాపై దయ యుంచి రక్షింపుఁడు. ఇంద్రా! విస్తీర్ణమును భయరహితము నైన నీ తేజస్సును మేము పొందెదముగాక. గాఢాంధకారయుక్తము లైన దీర్ఘరాత్రులు మా కెదురుగా వ్యాపింప కుండుఁగాక'.[2].

"చిత్రావసూ! సుఖముగా నీపారమును బొందనిమ్ము. రాత్రియే చిత్రావసువు... ...దీనికై పురాతన కాలమందు బ్రాహ్మణులు భయపడిరి.[3]

'దేనియావలియొడ్డు కనవచ్చుట లేదో, అట్టి రాత్రియందు చరాచర ప్రపంచమంతయు విభజింపరాక యేకాకారముగా నున్నది. ఓరాత్రీ! మేము విపత్తు లేమియు లేకుండ నీపారము పొందెదముగాక. ఓ దేవీ! నీయావలి యొడ్డు చేరెదము గాక.[4]

'మేము, ఒక్కొక్కరాత్రినే చూచువారమై మా బిడ్డలతో నీ దీర్ఘరాత్రిని దాఁటెదముగాక. నావ లేని వారు గంభీర మైన సముద్రాదికమును వలెనే మాశత్రువు లీరాత్రిని దాఁటఁ జాలరు.[5]

అబ్బా! ఏమిభయము! ఎంతపరితాపము? ఈ రాత్రి కంత మున్నదా? ఎప్పటి కైనఁ దెల్లవాఱునా? మా పిల్లలును మేమును బ్రతికి బయటఁ బడు

---

1. ఋ. 9-114-3; 5-45-9, 1-164-2, 1-33-6, 3-39-5. మొదలైనవి.

2. అదితే మిత్ర వరు ణోత మృళయ ద్యో వయం చకృమా కచ్చి దాగః । ఉర్వశ్యా మభయం జ్యోతి రింద్ర మానో దీర్ఘా అభినశ న్తమిస్రాః ఋ. 2-27-14.

3. చిత్రావసో స్వస్తితే పార మశీయ ...... రాత్రి ర్వైచిత్రావసు రవ్యుష్ట్యైవా ఏతస్యై పురా బ్రాహ్మణా అభైషు ర్వ్యుష్టి మేవా వరున్ధే. తై, సం. 1-5-5,7.

4. న యస్యాః పారం దదృశే న యోయు వద్విశ్వ మస్యాం నివిశతే య దేజతి । అరిష్టాస స్త ఉర్వి తమస్వతి పార మశీమహి పారమశీమహి. అథ. 19-47-2.

5. రాత్రిం రాత్రి మరిష్యన్త స్తరేమ తన్వా వయం । గంభీర మప్లవా ఇవ న తరేయు రరాతయః. అథ. 19-50-3.

దుమా ? అనిపించి దేవతలకు ప్రొక్కించి ప్రాచీనార్యులను భయసాగరమున ముంచిన యాదీర్ఘరాత్రి యుత్తరధ్రువమండలి భయంకరరాత్రి యగును గాని, కొన్ని గంటలమాత్ర ముండునట్టి భరతఖండరాత్రి యగునా ? ఇంక నితర ప్రమాణములు కొన్ని.——

పారసీకుల మతగ్రంథములందును గ్రీకులు మొదలగువారి పూర్వగ్రంథము లందును ఋగ్వేదాదులలోని యుత్తరధ్రువప్రాంతవర్ణనలకు సరివచ్చు వర్ణనము లనేకములు కలవు. అవి యన్నియు, తిలకుగారి గ్రంథమునఁ జూడనగును. వానిలో నొకటి యిం దుదాహరింతును. ఇది హిమప్రళయము లేక జలప్రళయమునకు సంబంధించిన గాథ.——

"ఒకనాఁటి యుదయమున మనువునకుఁ జేతులు కడుగుకొనుట కొకరు నీళ్లిచ్చిరి. అతఁడు హస్తప్రక్షాళనము చేయుచుండఁగా నొకచేఁపపిల్ల యా నీళ్ల నుండి యతనిచేతిలోఁ బడి 'అయ్యా ! నన్ను రక్షింపుము తరువాత నిన్ను నేను రక్షింతు' ననెను. ఎట్లు రక్షింతు వని యతఁ డడుగ ప్రజానాశక మైన జల ప్రళయమునుండి నిన్ను రక్షింతు నని యది పల్కెను. నిన్ను నే నెట్లు రక్షింతు నని మరల నడుగ నది యిట్లనియె.

'మే మెన్నాళ్లు చిన్నపిల్లలముగా నుందుమో. అన్నాళ్లును భయమే సంభవించుచుండును. ఏ మనఁగా ? చేఁప చేఁపనే తినును. అందుచే న న్నొక నీళ్లకుండలోఁ బెట్టుము. ఆ కుండ నాకుఁ జాల నపుడు పెద్ద నీళ్లగొయ్యితీసి దానిలో విడిచిపెట్టుము. ఆ గొయ్యి మించునట్లు నేను బెరిఁగినంతనే నన్నుఁ దీసికొనిపోయి సముద్రములో విడిచిపెట్టుము. అపుడు నేను హాని లేకుండఁ జక్కఁగా వర్ధిల్లుదును. ముం దొకానొక సంవత్సరము పెద్దవఱద వచ్చును. అపు డొకనావ యెక్కి నావద్దకు రమ్ము. నేను వఱద దాఁటించి నిన్నుఁ గాపాడుదును' మనువు మత్స్యము చెప్పినట్లు చేసెను. అది చెప్పినట్లే యొకయేఁడు వఱదయు వచ్చెను. మనువు నావ యెక్కి యా మత్స్యమునొద్దకు వెళ్లెను. ఆఝషము నావను సమీపించెను. మనువు దాని నోటికి నావత్రా డందిచ్చెను. అది యాత్రాడు నోటఁబట్టుకొని యుత్తరగిరి వైపు నావను లాగుకొనివచ్చి (గిరినిఁజేరి) ఈ చెట్టునకు నావ కట్టి పెట్టుము. ఈప్రవాహము తగ్గినపిదపఁ గ్రిందికి దిగు మని చెప్పెను. మను వట్లే చేసెను. అందుచేతనే యుత్తరగిరికి మనువు నవసర్పణ మను పేరు వచ్చినది. ఆ వఱదలో సర్వప్రజలు నశించిరి మను వొక్కఁడు మాత్రమే మిగిలెను. అందుచే నతఁడు ప్రజాకాముఁడై పాకయజ్ఞము చేసెను. దానివలన నొకసంవత్సరమున కొకస్త్రీ యుదయించెను." శతపథ బ్రాహ్మణము[1].

---

1. 'మనవేహవైప్రాతః—' ఇత్యాది—శత - బ్రా - కాం. 1. అధ్యా. 8. బ్రా. 3 మం 1-12.

ఈకథయే, అథర్వవేదమునఁ గూడఁ గలదు[1]. ఇదియే పారశీకుల 'వెందిదాద్' అను మతగ్రంథములోఁగూడ నున్నది[2]. ఇందలి జలప్రళయ మందు హిమ ప్రలయ మనఁబడినది. ఇందలి మను వందు యిమ యనురాజుగా నుండెను. మనువు వివస్వంతుని పుత్త్రుఁడు 'యిమ' వివంఘుతుని పుత్త్రుఁడు. దీనినిబట్టి యిద్దఱును వైవస్వతు లగుచున్నారు. ఇందు మత్స్యము రక్షణోపాయము చెప్పెను. అందు అహురామజ్దా యను దైవము రక్షణోపాయము చెప్పెను. ఈ కథలయొక్క పోలికనుబట్టి యీ రెం డార్యశాఖలవారును దొల్లి యొకచోట నివసించి యుందు రని చెప్పవచ్చును గదా! ఇఁక నట్టిస్థల మేది యనుట కిది వఱకుఁ జూపినవాని కుపోద్బలకముగా, పారసీక గ్రంథములలోని మఱికొన్ని వాక్యము లాలోకింతము.

అహురామజ్దా యను పారసీకులదేవుఁడు, ఐర్యనవైజో - సుగ్ధ - మోరు హప్త హిందు - రంఘు - మొదలగు పదునాఱు దేశములను మానవ నివాస యోగ్యములనుగా నిర్మించె ననియు, అందు ఐర్యనవైజో స్వర్గ మనియు వెందిదాదులో వర్ణింపఁబడినది. ఇందు, ఏడుమాసములు వేసవియు, అయిదుమాసములు చలియు నుండు నని 'బుందహిష్' అను గ్రంథము చెప్పుచున్నది. పది మాసములు వేసవియు రెండుమాసములు చలియు నుండు నని 'అవెస్తా' చెప్పుచున్నది. ఈ భేదములు ఋగ్వేదములోని సప్తమాస, దశమాస సంవత్సరములకు సరిపడుచున్నవి. దీనినిబట్టి ఐర్యనవైజో యనునది, ఉత్తర ధ్రువమండలమే యనియు, "ఐర్యన = ఆర్యులయొక్క, వైజో = బీజము, విత్తనము, అనఁగా మూలస్థానము" అనెడి వ్యుత్పత్త్యర్థమును బట్టి యది యార్యుల నివాసస్థాన మనియు విశద మగుచున్నది. ఇఁకనో, ఐర్యనవైజో యెక్కడి దనెడి విషయమున బహువాదములు గలవు. వాని నెల్ల తిలకుపండితులు ఖండించి, అది యుత్తర ధ్రువమండలమే యని నిర్ధారణ చేసియున్నారు. కావున నిఁక దీనిని విడిచి మూఁడవవాదము గ్రహింతము

## ఆర్యావర్తవాదము.

ఆర్యుల జన్మభూమి యార్యావర్త మనెడి వాదము గూడఁ బ్రాచీన మైనదే కాని నేఁటిదిగాదు. స్వదేశమందలి యభిమానముచే భారతీయులే యిట్లు చెప్పుచున్నా రనుటకు వీలులేకుండఁ బాశ్చాత్యపండితులు కొంద ఱీయభిప్రాయము నెడనెడ వెల్లడించు చుండుటయే యిందలి విశేషము. ఋగ్వేదమందు

1. 14-39 - 7, 8, అథర్వ——

2. వెందిదాద్ 2 అధ్యా.

వర్ణింపఁబడిన స_ప్తసింధువులు (నదులు) ప్రవహించినట్టి దేశమే యార్యుల జన్మభూమి యనియు, అదే యార్యావ_ర్త మనియు నిందలి సారాంశము. ఈ వాదమును సమర్థించుటకును, ఉ_త్తర ధ్రువవాదమును ఖండించుటకును, ఆర్యుల యాదిమ నివాసమునుగూర్చి ప్రాచ్యపాశ్చాత్య పండితులు చర్చించి వ్రాసిన చరిత్ర గ్రంథములలోని కొన్ని విమర్శన వాక్యములను, భూగర్భ భూగోళాది శాస్త్రజ్ఞుల యూహలను ఋగ్వేదాదులలోని కొన్ని మాటలతో సరిపుచ్చి సమన్వయించుచు, కలక_త్తా విశ్వవిద్యాలయ చరిత్రాధ్యాపకులగు అవినాశ చంద్రదాసుగారు 'ఋగ్వేదీయ హిందూదేశము' (Rig-Vedic India) అను పేర నొక పెద్దగ్రంథము నాంగ్లమున రచియించి 1921 లోఁ బ్రకటించిరి. అందలిచర్చ యంతయు సంగ్రహముగా నైన నున మిందు గ్రహించుట కవకాశము లేదు. కావలసినవా రా గ్రంథమును జూతురుగావున నుత్తరధ్రువ వాదమును నిరాకరించుటకు వా రెత్తుకొనినవానిలో నతిముఖ్యము లైన కొన్ని విషయములను మాత్రము మనము గైకొని పరికింతము.

"ఇతరనదు లన్నిటిలోను మిక్కిలి పవిత్ర మైన సరస్వతీనది పర్వతముల నుండి సముద్రమువఱకుఁ బ్రవహించుచున్నది[1]. అనెడి ఋగ్వేద వచనమునుబట్టి యీ ఋక్కు పుట్టినకాలమున సరస్వతీనది సముద్రములోఁ గలియుచున్న దనుట తెల్లము. కాని యది యిపుడు సముద్రములోఁ బడుటలేదు సరిగదా పైగా రాజపుతానా యెడారిలోని యిసుకదిబ్బలలో నంతరించి పోయినది. అక్కడికి సముద్ర మిపుడు కొన్నివందల మైళ్లదూరమునఁ గాని లేదు. కావున సరస్వతీ నది యణఁగిపోయిన రాజపుతానాయెడారి బహుప్రాచీనకాలమున సముద్రమై యుండు నని తెలియవచ్చుచున్నది. మఱియు, ప్రాచీన హైందవార్యులు నాలుగు సముద్రము లెఱిఁగినట్లును, ఆర్యవణిజులు సముద్రముపై నౌకాయానము చేసినట్లును ఋగ్వేదమునఁ బెక్కుచోట్లఁ గనవచ్చుచున్నది[2]. వారు నివసించు భూభాగమున స_ప్తసింధులు (నదులు) ప్రవహించుచున్నట్లును, అందుచే నది స_ప్తసింధుదేశ మయినట్లును, అదియే యార్యావ_ర్తనామము చెందినట్లును ఋగ్వేదములోని కొన్ని వర్ణనలవలనఁ దెలియవచ్చుచున్నది[3]. ఈ స_ప్తసింధువే పారశీకుల జెండవెస్తాలో 'హ_ప్తహిందు'గాఁ బేర్కొనఁబడినది.

ఋగ్వేదీయార్యులు స_ప్తసింధుదేశము దాఁటి యావలిదేశము నెఱిఁగి నట్లు కనఁబడదు. అందుచే వారికిఁ దెలిసినట్లు వర్ణింపఁబడిన నాలుగు సము

1. ఏకా చేతత్ సరస్వతీ నదీనాం శుచి ర్యాతీ గిరిభ్య ఆ సముద్రాత్. ఋ. 7-95-2.

2. 'రాయః సముద్రాం శ్చతురో௨స్మభ్యం సోమవిశ్వతః' ఇత్యాది ఋ. 9.33-6, 10-47-2, 1-48-3, 1-56-2, 1-116-3, 4-55-6, 5-85-6, 7-88-3.

3. 'ఇమంమేగంగే—' ఇత్యాది—10-75-5, 6 ; 1-32-12, 4-28-1.

ద్రము లీయార్యావర్తభూమికి నాలుగు సరిహద్దులుగా నుండవలసియున్నది. భూగర్భశాస్త్రమునుబట్టి చేసిన పరిశోధనలవలన సప్తసింధుదేశము చతుస్సముద్ర పరివేష్టిత మని తేలినది. ఈదేశము ఋగ్వేదీ యార్యులు నివసించుకాలమున మిక్కిలి హిమప్రాయమై యున్నట్లుగా ఋగ్వేదమువల్లను, పరిశోధనలవల్లను గూడఁ దెలియవచ్చుచున్నది. కాని యీ కాలమున దీని సరిహద్దులగు సముద్రములు కానరావు. అవి యతి ప్రాచీనకాలమున భూకంపాద్యుపద్రవములవలన మఱుఁగుపడిపోయినవి. ఆసముద్రప్రదేశములు మెట్ట లయిపోయినవి. అంత మాత్రమున నార్యులు సముద్రమే యెఱుఁగ రనియు ఋగ్వేదములో వర్ణింపఁ బడిన సముద్రము మనము చూచుచున్న సముద్రమువంటిది గా దనియు, అది మిక్కిలి లోఁతునీటితో నున్న నదిలోని పెద్దమడుఁ గనియుఁ బాశ్చాత్యులు కొందఱు చెప్పినమాట సరిగాదు. వైదికార్యులనాఁటి దేశపరిస్థితులును ఆనాఁటి సరిహద్దులును అప్పటి శీతోష్ణస్థితియు మాఱి యెన్నోవేల సంవత్సరము లైనది. అయినను, ఆ చిహ్నములు ఋగ్వేదమువల్లను భూగర్భ పరిశోధనవల్లను సత్యములని తెలియుచున్నది. కావున ఋగ్వేదీయార్యుల తొలుతటి నివాసము సప్తసింధుదేశ మనుట ధ్రువము. ఉత్తర ధ్రువమండలముగాని, యితరఖండములు గాని కావు,'' అనుచు బహువిధ ప్రమాణము లుదాహరించుచు నార్యావర్త వాదమును సమర్థించి, తిలకుగారు చూపిన ప్రమాణముల నీ క్రిందివిధముగా ఖండించిరి[1].

[2]"నక్షత్రమండల మడ్డముగా, కుమ్మరసారెవలెఁ దిరుగుట యుత్తర ధ్రువలక్షణ మైనట్లును, అది ఋగ్వేద వర్ణనలకు సరిపడుచున్నట్లును, తిలకుగారు చెప్పినది సరిగాదు. ఋగ్వేదములో నది రథచక్రమువలెఁ దిరుగుచున్నట్లు వర్ణింపఁబడినది. ఆఱునెలల పగటిని; ఆఱునెలల చీకటిని దెలుపువర్ణనలు ఋగ్వేదమున లేవని తిలకుగారే యంగీకరించిరి. ఉత్తర ధ్రువమున సూర్యుఁడు దక్షిణ దిక్కున నుదయించుచున్నట్లు గోచరించును గావున, ఉషస్సుకూడ దక్షిణదిక్కునందే యుదయించునట్లు గోచరింపవలెనుగాని ఋగ్వేదములో నది తూర్పున నుదయించుచున్నట్లు వర్ణింపఁబడినది. అందుచే ఋగ్వేదములోనియుషోవర్ణనలు త్తర ధ్రువవాదమున కుపకరింపవు. ఈ విషయ మొక్కటియే తిలకుగారిని సమాధానపఱిచి వారి యుత్తర ధ్రువవాదము వదలుకొనునట్లు చేయుటకుఁ జాలి

1. పూర్వోక్తవిషయమును, చెప్పఁబోవు నుత్తర ధ్రువవాద ఖండన విషయమును దాసుగారి ఋగ్వేదీయ హిందూదేశములోని వివిధప్రకరణములనుండి సంగ్రహింపఁబడినవి. విపరము లాగ్రంథమునఁ జూడనగును.

2. ఇం దుదాహరింపవలసిన ప్రమాణవచనము లుత్తర ధ్రువవాద సందర్భమున వెనుక నుదాహరింపఁబడినవి.

యున్నది. మఱియు నెలదినము లెడ తెగనియుషస్సు ఋగ్వేదవర్ణనలలోఁ గన రాదు. 'వెందిదాద్'లోని ఐర్యనవైజో తిలకుగారు తలంచినట్లుగా నుత్తర ధ్రువములోనిది గాదు. కావున నుత్తర ధ్రువవాదము సరిగాదు. ఆర్యులమొదటి నివాస మార్యావర్తమే" అనుచు తిలకుగారు చూపిన వివిధ ప్రమాణములను విమర్శించుచు నెంతో వ్రాసిరి. మఱియు తిలకుగా రుదాహరించిన మనుమత్స్య కథను వీరుగూడ లేవనెత్తి, చరిత్రములో ముఖ్యమైన హిమప్రళయవృత్తాంతము ఋగ్వేదమున వర్ణితము కాలేదనియు, అర్వాచీనమైన శతపథ బ్రాహ్మణములోని యీ కథ నుత్తరధ్రువమునకు సరిపుచ్చుట యుక్తముగా లేదనియుఁ జెప్పుచు, భూకంపాదులవలన రాజపుతానా సముద్రము పైకి లేవఁగా వచ్చిన జలప్రళయమునకు సప్తసింధుదేశము పాల్పడినపుడు మనువు ప్రాణసంరక్షణార్థ ముత్తరగిరికిఁ జేరె ననుట సముచితముగా సమన్వయించుచున్న దని సమర్థించిరి, ఇది యిట్లుండ:—

దాసుగారి గ్రంథముమాడ్కి నుత్తరధ్రువవాదమును 'వేద భూమి' యను నాంధ్రగ్రంథముగూడ నిరసించుచున్నది[1]. ఇంతకు ము న్నుదాహరించిన మనుమత్స్య కథయందలి 'ఉత్తరగిరి' ప్రయోగమునుబట్టి "ఉత్తరధ్రువ వాసులు ప్రళయానంతరము దక్షిణముగా వచ్చుచుఁ దమకు దక్షిణదిక్కున నున్న హిమగిరి నుత్తరగిరి యనుట సంభవింపదు కావున, నార్యావర్తమునుండి యుత్తర ధ్రువమునకు వలసవెళ్లిన యొకశాఖవారు కొంతకాల మచ్చట నివసించి ప్రళయము వచ్చినపుడు తిరిగి తమ జన్మభూమి యగు నార్యావర్తమునకు వచ్చుచుఁ దమకుఁ బూర్వ మభ్యస్త మయిన రీతిని హిమాలయము నుత్తరగిరి యని పిలిచి యుందురు. అట్లు కానిచోఁ గ్రొత్తగా వచ్చువారు తమకు దక్షిణ ముగా నున్న హిమగిరి నుత్తరగిరి యని పిలుచుట కేవల మసంభవము" అని యీ గ్రంథ మొక యాక్షేపము చేసియున్నది. కాని యిది యసంగతము. ఉత్తరధ్రువమునకు వలసవెళ్లినవారే మరలఁ దిరిగివచ్చి రనుటకు వీలులేదు. వారి సంతతివారికి హిమగిరి యుత్తరగిరి యనెడియభ్యాస ముండుట కంతకంటెను వీలు కనఁబడదు. కాక యెవరయినను దమకు దక్షిణముగా నున్నకొండ నుత్తర గిరి యనుట యుక్తియుక్తమే కాదు. కావున హిమగిరికి దక్షిణభాగమున నివ సించిన యార్యసంతతిమహర్షులు తమ ప్రాచీన గురుపరంపరనుండి కర్ణాకర్ణికగా వచ్చుచున్న యాగాథను శతపథబ్రాహ్మణమున సమకూర్చుచు, మనువు విపత్సము ద్రమును సముద్రమును దాఁటి యీయుత్తరగిరిని జేరె నని చేతితోఁ జూపుచుఁ బ్రయోగించినట్లుగా 'ఏత ముత్తరగిరిం' అని ప్రయోగించి యుందు రనుట

1. అచ్యుతుని వెంకటాచలపతిరావుగారి యీ గ్రంథము స్వధర్మప్రకాశినిలోఁ బ్రక టింపఁబడినది.

సంభావ్య మగును గాని యార్యావర్తార్యు లుత్తరధ్రువము చూచుటకు వెళ్లి వచ్చుచు నిట్లు ప్రయోగించి యుందురనుట యర్థము కాదు. అయినను ఋగ్వే దాదులలోని యుత్తరధ్రువలక్షణ వర్ణనలను సమర్థించుటకై యార్యులు కొంత కాల మైన నుత్తరధ్రువమండలమున వసించి రని యంగీకరించుచున్న యీ గ్రంథమండలి పై యాక్షేపము కూడ ముదావహమే యగుచున్నది. ఇఁక నాల్గవవాదమునుగూడ నించుక యవలోకింతము.

## మధ్యాసియా ఖండవాదము.

ఈవాదమును 1820 లో, జే. జి. రోడ్ అను పాశ్చాత్య విమర్శకుఁ డారంభించెను. వెందిదాదులోని ప్రథమ ప్రకరణమునఁ దెలియవచ్చు భూగోళ పరిస్థితినిబట్టి చూడఁగా, ఇరానియనుల (పారశీకుల) ప్రథమనివాసము బాక్ట్రియా ప్రదేశ మని యతని యూహ. దీనినే తరువాత పాట్‌దొరయు (Schlegal) షెల్గల్ పండితుఁడును బలపఱిచిరి. ఆసియాఖండముయొక్క కేవల దక్షిణభాగమున నున్న హిందూదేశమునుండి మానవతరంగము లుత్తరపశ్చిమ దిశలకుఁ బ్రవహించిన వనుట యుక్తముగాదు. తమ జన్మస్థానమునకు దగ్గఱగానుండు దేశములకు మనుష్యులు వలసపోవుట సహజము. అట్టిమధ్యదేశము కాస్పియను సముద్రము తూర్పుభాగమనుట సమంజస మని షెల్గల్ పండితునివాదము[1]. దీని కనుగుణముగా, ఇండియా జర్మనీ జాతులమొదటి నివాసము, ఇరానియన్ దేశములోని ఆక్సస్, జక్సార్టిస్ నదుల ప్రాంతభూమి యని స్పెగల్‌పండితుఁడు తలంచెను[2]. బన్సెన్ పండితుఁడు, ఆర్యులు హిమాలయములు దాఁటి దక్షిణమున నున్న సప్తసింధుదేశమునకుఁ బోయినట్లు కనఁబడుచున్నది. అంతకుముందు వారు హిమాలయముల కుత్తరమున గ్రీకులు - ఇటాలియనులు - స్లావియనులు జర్మనులు - కెల్టులు - అనువారితోఁ గలసి యుండి రని వ్రాసెను[3]. ఆర్యుల నివాసము మధ్యాసియా యను తలంపుతోనే భాషాశబ్దముల సాదృశ్యమును దానికిఁ దోడు చేసి మాక్సిముల్లరు (Max Muller) పండితుఁడు, హైందవులు-పారశీకులు - గ్రీకులు - రోమనులు - స్లావులు - కెల్టులు - జర్మనులు - అను జాతులవారి పూర్వు లందఱు నొకప్పు డొకచోటఁ గలసియుందు రనియు, అది మధ్యాసియాలోని యత్యున్నత ప్రదేశమై యుండు ననియుఁ దలంచెను[4]. ఆర్యులు హిందూకుష్‌పర్వతములు దాఁటివచ్చి హిందూదేశములోని వాయవ్య

1. Origin of Hindus.
2. Spiegel's Avesta.
3. Bunsen's outlines Vol I. p. 129.
4. Lectures on the Science of Language in 1861.

భాగ మైనపంజాబుదేశ మాక్రమించి యుందురని (Macdonell) మాగ్డోనలు పండితుఁడు వ్రాసెను[1]. గోవెన్ (Gowen) పండితుఁడుగూడ వీరిమతమే యవలంబించెను[2]. తరువాతికాలమున శకులు యూనీలు హూణులు మంగోలీలు, అను వారు మధ్యాసియానుండియే హిందూదేశమునకుఁ గొందఱును యూరపుదేశమునకుఁ గొందఱును బ్రయాణముచేయుట చూడఁగాఁ దొలుత నార్యజాతుల వారుగూడ నచ్చటనుండియే బయలుదేఱి యితరదేశములకుఁ బోయి యుందురని యూహించుట కెక్కువ యవకాశము కనఁబడుచున్నది కావున హిందూదేశార్యు లచ్చటినుండి వచ్చినవారే యనుట సంభావ్య మనికొంద ఱూహించుచున్నారు. మఱియు దూరదేశములకుఁ బోయినతెగలు చిన్న వగుటచే నక్కడి జాతులతోఁ గలసిపోఁగా వారిస్వభాష మిక్కిలి మాఱిపోయి యుండు ననియు, అయినను హైందవార్యభాషలోని కతిపయశబ్దముల సాదృశ్యము నేఁటికిని లిథూనియన్ మొదలగు కొన్నిటియం దెక్కువగాఁ గనఁబడుచున్నదనియు వారు తమవాదమును బలపఱుచుకొనుచు, మధ్యాసియానుండి సప్తసింధు దేశమునకు వచ్చినతెగ పెద్దది యఁగుటచేతను, అది యీదేశమునఁ దొలుత నున్నసంఘముతోఁ గలియక దాని నణఁగించిన దగుటచేతను. భాషయందు మార్పేమియు సంభవింపక యది యట్లే నిలిచి వర్ధిల్లిన దని కూడ వారుపపత్తి చూపుచున్నారు. పై కారణములను బట్టి యీవాదము కొంతవఱకు సముచితముగాఁ గనఁబడు చున్నను వైదికప్రమాణముల కిది గుఱి కాలే దనెడి యాక్షేపము మాత్రము దీనివె న్నంటి యున్నది. అయిన నీ వాదము నేఁటికిని జరిత్రకారుల సమ్మతిని గాంచుచునే యున్నదిగాని, యింతకు మున్నే (Lord Elphinstone, Muir) లార్డు ఎల్ఫిన్‌స్టన్, మూయిరు మొదలగు పండితులు కొందఱు హైందవార్యుల జన్మభూమి హిందూదేశమే యనెడి భావము ప్రకటించిరి[3]. ఉత్తర ధ్రువవాదు లవియు నివియుఁ గూడ నూహలమీఁది సిద్ధాంతములే యనుచున్నారు.

### చతుర్వాద పరిశీలనము.

ఇంతవఱకు నార్యుల ప్రథమ నివాసమునుగూర్చి నాలుగువాదముల స్వరూప స్వభావములు సంగ్రహముగాఁ దెలిసికొని యున్నాము కాని, వీనిలో నేది గ్రాహ్య మనెడివిచారణయే కష్టసాధ్యముగా నున్నది. ఐరోపావాదము నిస్సార మని బహువిమర్శకుల వ్రాఁతలనుబట్టి నిశ్చయింపవచ్చును గాని, తక్కిన

---

1. History of Sanskrit Literature p. 139.

2. History of Indian Literature Ch. 3.

3. History of India p. 95, 96. Original Sanskrit Texts Vol. II. p. 322, 387.

మూఁడింటిలోను గుణములు దోషములు కలసి యుండుటచే నెందలి గుణములు హెచ్చుగా నున్నవో కనిపెట్టుట కష్ట మగుచున్నది. తరువాతి రీతినిబట్టి మధ్యాసియాదేశమే తొలుతఁగూడ నితరదేశము లన్నిటికిని జనప్రవాహములను బంపి యుండు ననియు, అందు దగ్గఱ నున్న సప్తసింధుదేశమునకు వచ్చిన యార్య సంఘ మితరసంఘముల సంపర్కము లేమిని దను తొల్లిటిభాషను సాంఘికాచారములను గాపాడుకొనుచు వచ్చి యభివృద్ధి కెక్కె ననియు భావింత మన్న, ఈ వాదము వైదిక ప్రమాణములకు గుఱి కాకున్న దన్న యాక్షేపమునకు మాత్రము విఱుగుడు కనఁబడుట లేదు. ప్రాచీనకాలస్థితినిబట్టి మధ్యాసియాలో నెడతెగని మబ్బులవలన సూర్యరశ్మి లేని కొన్నిదినములకాలము దీర్ఘరాత్రివలె నుండి యుండు నని తలంత మన్నను, ఋగ్వేదములోని యాఱునెలలరాత్రి, ఆఱునెలల పగలు, నెలదినములయుషస్సు, అనెడి లక్షణములు మధ్యాసియాకు సంభవింపఁ జాలవు. ఈ లక్షణములు దీనికి సరిపుచ్చుట సాధ్య మయ్యేనేని, యీ వాద మన్నిటికంటె నుత్తమ మగును.

తక్కిన రెండువాదములు నెక్కువగా వేదవాక్యములమీఁద నాధారపడియున్నవి. అందుతిలకుగా రుదాహరించిన ఋక్కులు కొన్ని యుత్తరధ్రువ లక్షణములకు సరిపడ కున్న వనియు, మఱికొన్ని వారు చెప్పిన యర్థము నీయఁజాల వనియు, ప్రాచీన తమ మయిన ఋగ్వేదమే యీవిషయమునఁ బ్రమాణ మనియుఁ జెప్పుచు, వా రుదాహరించిన ఋక్కులు కూడఁ బురాతన సప్తసింధు దేశమునకే సమన్వయించుచున్న వని దాసుగా రనుచున్నారు. వీరు తలంచినట్లు తిలకుగా రిచ్చిన యుదాహరణములు సమర్థము లైనను గాకున్నను, తొంటి సప్తసింధుదేశము చతుస్సముద్ర పరివేష్టిత మనెడి వీరి భూగర్భశాస్త్ర ప్రమాణమును, వేదములలోని దీర్ఘరాత్రి దీర్ఘోషోవర్ణన లాకాలమున నార్యావర్తమునకే సరిపడుననెడి వీరివాదమును సమర్థనీయము లైనచో నార్యులపుట్టి ల్లార్యావర్త మనుటకు సంతసించువారిలో మన మగ్రగణ్యుల మగుటకు సందేహము లేదు.

తిలకుగారి యుత్తర ధ్రువవాదము గూడ భూగర్భ భౌతిక ఖగోళాది పరిశోధన సిద్ధాంతములతోనే ప్రారంభ మైనది. వాని ననుసరించి తమవాదము నెలకొల్పుటకు వారు రెండు ప్రకరణము లుపయోగించిరి. వారు వారు గావించిన పరిశోధనములఁ గల విరోధములను జూపించిరి. కేవలము వానినే నమ్మినచోఁ దత్వము తేల దనెడిభావము సూచించిరి. కావున నవీనపరిశోధనలనుబట్టి యిందే వాద మాననము? ఏది కా దనము? ఆపరిశోధనలు రే పెట్లు మాఱునో! అవి నిర్దుష్టము లైన సిద్ధాంతము లని యెవరు చెప్పఁగలరు? అందుచే గ్రాంథికవాక్యములే యిందు ప్రమాణ మనవలసి వచ్చినది. అయితే, దానినిబట్టి యెవరి వాదము సముచితము?

"తానీదహాని-యనెడి ఋక్కులోని కొన్నిపదములకు, తిలకుగారు బలాత్కారముగాఁ దమవాదమున కనుకూలమయిన యర్థము లాగిరి కాని, వారు దీనికిఁ బూర్వమందున్న-ప్రమే పంథా దేవయానా-యనెడి ఋక్కును[1]. లెక్క చేసి చదివినచోఁ దప్పక మఱియొక మార్గమునకు మళ్లియుందురు. తిలకుగారి వాదమునుబట్టి, ఉషస్సు దక్షిణదిక్కున నుదయించినదని చెప్పవలసి యుండఁగా ఆఋక్కు, తూర్పున నుదయించినట్లు చెప్పుచున్నది గావున నది యెంతమాత్ర ముత్తర ధ్రువలక్షణమును సూచింపఁజాలదు. ఇదొక్కటియే వెంటనే తిలకు గారిని సమాధానపఱిచి వారివాదమును వదలుకొనునట్లు చేయఁగలదు.'' అని దాసుగారు దృఢప్రతిజ్ఞతో వ్రాసినవిషయ మెంతవఱకు సత్యమో చూతము.

తిలకుగారు తిన్నగాఁ జూడ లేదని దాసుగా రన్నఋక్కులోని పదము 'పురస్తాత్.' దీనికి సాయణులు 'పూర్వస్యాందిశి' (తూర్పుదిక్కున) అని యర్థము వ్రాసిరి. తిలకుగా రీ ఋగర్థము నాంగ్లమున నిట్లు సంగ్రహించి వ్రాసిరి.

"The Devayāna Path has become visible to me...The banner of the Dawn has appeared in the east." [2].

దీనియర్థమిది:—దేవయానమార్గము నాకుఁ గనఁబడుచున్నది ... ఉషస్సు యొక్క కేతువగు తేజస్సు తూర్పుదిక్కున గోచరించుచున్నది.

దీనినిబట్టి తూర్పుదిక్కున నుషస్సు గనవచ్చుచున్న దన్నయర్థము తిలకు గారు గ్రహించి రనుట విదితము గదా! ఇఁక వారు గ్రహింపని దేది?— ఉత్తర ధ్రువవాదమే సరియైన దైనచో నీఋక్కు దక్షిణదిక్కున నుష స్సుద యించె నని చెప్పవలె నఁట. అట్లు చెప్పక తూర్పున నుదయించిన దని చెప్పిన దఁట. అందుచే నిది యుత్తర ధ్రువలక్షణ సూచకము గా దఁట. ఉత్తర ధ్రువ వాసు లక్కడ సూర్యుఁ డుదయించుదిక్కు దక్షిణ దిక్కని వ్యవహరించుకొన్న ట్లొక యుదాహరణ మైన దాసుగారు పురాతన గ్రంథములనుండి యుదాహరించి నచో వారి యాక్షేప మమోఘమై వెలయునుగాని యట్లు జరుగలేదు.

ఏదేశమం దైనను, ఏకాలమం దైనను, మానవుఁ డించుక ప్రపంచ జ్ఞానము వచ్చినది మొదలుగా సూర్యుఁ డుదయించుదిక్కు తూర్పు దిక్కని వ్యవ హరించుకొనుట జగత్ప్రసిద్ధము. అట్టియెడ ఖగోళ భూగోళ విజ్ఞానము విస్తరిం చిన యీకాలమున నిక్కడ నున్నమనము, లేక యక్కడికి వెళ్లివచ్చినవారి వ్రాఁతలవల్లఁ దెలిసికొన్నమనము, ఉత్తర ధ్రువమువద్ద సూర్యుఁడు దక్షిణార్ధ గోళముననుండి యుదయించుచున్నట్లు గోచరించు నని గ్రహించుచున్నాము గదా యని యుత్తరధ్రువమండలమున నివసించిన యాకాలమునాఁటి యార్య ఋషులు

---

1. ఈ ఋక్కుల యర్థము వెనుక వివరింపఁబడినది.

2. Arctic Home in the Vedas. p. 73.

దక్షిణమున నుష స్సుదయించిన దనక తూర్పున నుదయించిన దని వర్ణించుటచే నది యుత్తర ధ్రువలక్షణసూచకము గా దనుట యతి సాహసముగాని వేఱు గాదు. అక్కడి సూర్యోదయ మిక్కడి మనకు శాస్త్రజ్ఞానమునుబట్టి దక్షిణ మైన ట్లుండు నని యక్కడివారికిఁ గూడ దక్షిణము గావలసిన దేనా? మన కయినట్లే యక్కడివారికి సూర్యుఁ డుదయించుదిక్కు తూర్పుదిక్కు కాదా? తైత్తిరీయారణ్యకముగూడ, సూర్యుఁ డుదయించునదే తూర్పుదిక్కని వర్ణింప లేదా?[1]. కావున దానుగా రతిముఖ్యమని తలంచిన యీ వ్యాఖ్యాన ముత్తర ధ్రువవాదమునకు బాధకము గాక సాధకమేయగుచున్నది. కాని, కడపటి హిమ ప్రలయము తరువాతనే యార్యు లుత్తరధ్రువము విడిచి యూరపు ఖండము లలో నాఁగక మధ్యాసియాకు వచ్చి యక్కడ సుమారు రెండువేలయేండ్లు గడపినతరువాత వారితరములవారు సప్తసింధుదేశమునకు వచ్చి వెక్కువందల మైళ్లదూరమునఁ గాని లేనిచతుస్సముద్రముల నెట్లు వర్ణింపఁ గలిగి రనునాక్షేప మునకు మాత్రము సదుత్తర మిందు తృప్తికరముగా లభింపకున్నది. మఱియు ఋగ్వేదములోని సప్తసింధువు లార్యావర్తములోనివి కావు. అవి దేవలోక నదులు. వాని పేళ్లు తరువాత వీనికిఁ బెట్టఁబడియుండు ననెడి యూహాయు నంత తృప్తికరముగా సమన్వయింప కున్నది. కాని, తక్కిన యుత్తర ధ్రువలక్షణములు మాత్రము ఋక్కులతోఁ జక్కఁగా సమన్వయించుచున్నవి. విషయ మతి దురవగాహ మగుటచేతను, ప్రత్యక్షముగా నిర్ణయింపఁదగిన యాధారములు దుర్లభ మగుటచేతను, వైవాదములనుగూర్చి యిదమిత్థ మనుట సాహసము కాక పోదుగాని, యిప్పటికిఁ జేసిన చర్చకు ఫలముగా, ఆర్యుల మొదటి నివాస ముత్తర ధ్రువమండల మనియు, పురాతనవైదిక విజ్ఞానము సాంగోపాంగముగా వికసించినచో టార్యావర్త మనియు భావింతము.

## ఆర్యుల రాక.

ఉత్తర ధ్రువమండలమున నాలుగైదు హిమప్రళయములు వచ్చియుండు ననియు, రెండే వచ్చియుండు ననియు భూగర్భశాస్త్రజ్ఞులమతములు ద్వివిధముగా నున్నవి. ఇందు రెండవమత ముచితతర మని పెక్కండ్రు భావించుచున్నారు. కడపటి హిమప్రళయమునకుఁ బూర్వము పెక్కువేల సంవత్సరముల క్రిందటనే యచ్చట మనుష్యులు నివసించిన చిహ్నములు కనవచ్చుచున్న వనియు, ఆ ప్రళ యము క్రీస్తు పూర్వము సుమా రెనిమిది, లేక పదివేలసంవత్సరముల క్రిందట వచ్చినదనియు, భావించిన యమెరికను భూగర్భశాస్త్ర వేత్తల నిర్ణయము మన

1. స ఇత ఆదాయాపః । అంజలినాపురస్తాదు పాదధాత్ । ఏవాహ్యేవేతి । తత ఆదిత్య ఉదతిష్ఠత్ । సాప్రాచీదిక్ ॥ ప్ర. 1-23.

వేదపురాణముల మతమునకు సరిపడుచున్నదని తిలకుగారు సమర్థించియున్నారు. ఈ సమర్థనము, వారి 'మృగశీర్ష'యను పుస్తకములోని వేదకాలనిర్ణయమునకు సరిపడుటకై దేవమనుష్యమానములను సరిపుచ్చుటచే నమెరికను భూగర్భశాస్త్రజ్ఞుల నిర్ణయము ననుసరించినది గాని, లేకున్న మొదటి హిమప్రళయముతరువాతనే యార్యు లుత్తరధ్రువము విడిచి వచ్చి రని నిర్ణయించినచో, దాసుగారు చూపినభూగర్భశాస్త్రవేత్తల మతమున కది సరియై రాజపుతానాయెడారినము ద్రముగా నున్న కాలమునకు సరిపడునేమో యని యనుమానింపవలసి యున్నది. అట్లన్నచో వేదకాలము చాలా వెనుకకుఁబోవునేమో యని తిలకుగారు సందేహించినమాటనిజము[1].

ఆర్యు లుత్తర ధ్రువమండలమున వసియించుకాలమునం దార్యేతరజాతులు కొన్ని వైరోపాఖండమునఁ బూర్వశిలాయుగమునాఁటిమోటుతనముతో నుండెననియు, ఉత్తరశిలాయుగ మారంభమై సుమా రెనిమిదివేలయేండ్లయి యుండుననియు మఱికొందఱు భూగర్భపరిశోధకులు చెప్పినమాటలు గూడఁ దమసమర్థనమునకుఁ దోడు గావించుకొని, భూగోళపరిస్థితులు తెలుపునెడ నొకటిరెండువేల వత్సరములతారతమ్యము గణనీయము కాదనుచుఁ దుదకు నేఁటికిఁ బదివేల సంవత్సరముల క్రిందట నార్యు లుత్తర ధ్రువమున నివసించినవా రని తిలకు పండితుఁడు నిర్ధారణచేసెను. కాని, యిక్కడ నొక్కమాట.

ప్రపంచమందలి మానవజాతి కంతకు నుత్తర ధ్రువమే జన్మస్థలమా? మనుష్యజాతుల కన్నిటికిని దొలుదొల్త మూలాధారమైన దొక్కదాంపత్యమేనా? ఇపుడార్యుల మనుకొను ఖండాతరవాసులును భారతీయార్యులు నొక్కచోటినుండి విడిపోయినవారేనా? అను ప్రశ్నల కెవ రెట్టి సమాధానములు చెప్పినను, అవి యన్నియు నూహలే కాని సిద్ధాంతములు కావు. ఉత్తర ధ్రువము విడిచి దక్షిణముగా బయలుదేఱినయార్యు లాయాప్రదేశములఁ జిరకాలము వసించుటయు నపుడపుడు శాఖలుగా విడివడి యాయాదేశముల కేగుటయు నసంభావ్యములు కావు కాని, యట్లు దేశద్రిమ్మరులై వచ్చునార్యసంతతివారు కడపట రెండుచీలిక లగుటయు, నం దొకశాఖ పారశీకమునను రెండవశాఖ యార్యావర్తమునను స్థిరపడుటయు బహుసాదృశ్యములనుబట్టి విశ్వసనీయము లని విస్పష్టముగాఁ జెప్పుటకుఁ దగినంతగా, ఖండాతరవాసులైనయార్యులు పారశీకభారతీయార్యులనుండి విడిపోయినవారే యని చెప్పఁదగినంత ప్రబలాధారములు మాత్రము విశేషించి కానరావు. భాషలలోని కొన్ని శబ్దముల సాదృశ్యమును

---

1. ఉత్తర ధ్రువార్యావర్తవాదములకు సమన్వయము గావింపఁదగిన యీవిషయ మింకను విచారణీయము.

వాఙ్మయములలోని కొన్ని గాథలయేకీభావమును జాత్యైక్యమును సమర్థింపఁ జాలవని కొందఱి యభిప్రాయము. హిమప్రళయమునకు మున్నో తరువాతనో యార్యజాతి శాఖోపశాఖలుగా విడిపోయి యుండు ననియు, మధ్యాసియాఖండ మునకు వలనవచ్చినపిదపనే యార్యజాతి విడిపోయి యుండుననియు మఱికొందఱి యభిప్రాయము. ఇంతకును, ఉత్తరధ్రువమండలమున నొక్క యార్యజాతియే నివసించి యుండె ననుటకుఁ గాని, ఆకాలమం దితరమానవజాతు లందు నివ సింపలే దనుటకుఁ గాని ప్రమాణము లెవరికిని లభించి యుండలేదు. అట్టియెడ నిట్టియగాధ విషయములలోఁతు కనుంగొన నెవరితరము? ఏది యేమయినను సనాతనమైన వైదిక విజ్ఞానసంపదతోఁ దులఁదూఁగుచున్న యార్యశాఖ యొకటి యుత్తరధ్రువమునుండి దక్షిణముగా బయలుదేఱె ననియు, అది యచ్చటనుండి విడిపోయినయితరశాఖలవల్లఁ గాని తరువాత మధ్యాసియాఖండమునఁ దనతో విడిపోయినపారశీకార్యశాఖవల్లఁగాని మరల సాంకర్యము చెందక పరమపావ నమై యుండె ననియు, అది యార్యావర్తమునకు వచ్చినపిదపఁ గూడ నిందలి యనార్యశాఖలను జెంతఁ జేరనీయక పరిశుద్ధముగా నుండె ననియు, అదియే మన వైదికార్యశాఖయనియుఁ దలంచుట కిసుమంతయు సందేహము లేదు.

హిమప్రళయమునాఁటికే మనప్రాచీనార్యులు నాగరకులై ధర్మనిష్ఠులై యుత్తమజ్ఞానదాయిని యగు వాగ్దేవి నుపాసించుచునున్నవా రనుటకు ఋగ్వే దములోని కొన్ని సూక్తములే ప్రమాణము. కాని యా మహావిప్లవమున నశిం పఁగా మిగిలినవా రెట్లో ప్రాణములతో నీవలఁ బడి యం దందు తిరుగుచు మధ్యాసియా ఖండమునందలిసమప్రదేశములఁ బ్రవేశించి స్థిరపడునాఁటికి వారి తరములు గొన్ని గడచి యుండవచ్చును. అప్పటికిని వారి వంశములవారు పూర్వులనుండి యనుశ్రుతముగా వచ్చుచున్న వైదికవిజ్ఞానసంపదను మాత్రము పోఁగొట్టుకొనక హృదయమందును కంఠమందును, ఆచరణమందును, నిలుపుకొని యుండే సుమారు రెండువేల సంవత్సరములు గడపియుందురు. పిదప వారి తర ములవారు తమ కాప్రదేశములు గూడ ననుకూలము గానిస్థితికి వచ్చినందు ననో మఱెందుచేతనో వానిని విడిచి క్రమముగా గాంధారాది దేశములగుండా హిమాలయ దక్షిణభాగమందలి సప్తసింధుతీర భూముల స్థిరనివాసము లేర్పఱుచు కొని తమనివాసమున నాభూమి కార్యావర్త మను పేరు తెచ్చిరి. అనఁగా, ఉత్తరధ్రువమండల వైదికార్య పరంపరలోనియార్యులు హిమప్రళయానంతరము సుమారు మూఁడువేల సంవత్సరములకుఁ బిదప, లేకయిప్పటికి సుమారాఱువేల సంవత్సరముల క్రిందట భరతఖండమందలిసప్తసింధుతీరాశ్రమములందు తమ వైదికవిజ్ఞానబీజములను మొలకెత్తింప నారంభించి యుందు రని విశ్వ

సింప నగును. అట్లు వారు తమపూర్వులయుపదేశముగా వచ్చుచున్నవైదిక విజ్ఞానము నెట్టియిక్కట్టు వచ్చినను మఱవక తమప్రాణముకంటె నెక్కువగా సంరక్షించుకొనుచు వచ్చి రనుటయే వేదనిత్యత్వమహత్త్వములను వేనోళ్లఁ బ్రశంసించుచున్నది. ఇందుకే ప్రపంచ మంతయు నాశ్చర్య మగ్నమానసమై సర్వవిశ్వ వాఙ్మయమున కాద్య మైనది భారతీయవాఙ్మయమే యని పొగడు చున్నది. అట్టి మహావాఙ్మయమున కాధారభూతు లైన ప్రాచీనమహర్షుల పాదారవిందము లొక్కసారి మనసార స్మరించి యిఁక వైదిక విజ్ఞానస్వరూప మవలోకింతము.

ఇది మల్లాది సూర్యనారాయణశాస్త్రి విరచితమైన సంస్కృత
వాఙ్మయచరిత్ర ప్రథమభాగమగు వైదికవాఙ్మయ
చరిత్రయందలి ప్రథమాధ్యాయము.




---

# ద్వితీయాధ్యాయము.

## వైదిక విజ్ఞానము.

వేదములు నిత్యము లనాదు లపౌరుషేయము లందుమా, వాని కొక కాలమే లేదు. అనిత్యములు సాదులు పౌరుషేయము లందుమా, వీని యని త్యత యెట్టిదో, వీనియాది యెక్కడనో, వీని నెవరు రచించిరో, యుక్తిప్రమా ణానుభవసిద్ధముగా నిర్ణయింప వీలు కనఁబడదు. అయినను ప్రాచ్యపాశ్చాత్య చరిత్రకర్తలు కొందఱు వేదకాలమును భిన్నభిన్నగతుల సూచించి యుండుటచే వేదసూక్తములందు గోచరించుచున్న విజ్ఞాన మెప్పటి దని విచారింపవలసి వచ్చినది.

ఆర్యావర్తమునకు వచ్చి స్థిరపడిన యార్యులు తమప్రాచీనపరంపరనుండి యానుపూర్విగా వచ్చుచున్నవైదికవిజ్ఞానము నేమఱక చాలాపటుకు సంరక్షించు కొనుచు వచ్చి రని యింతకు మున్నె తెలిసికొని యుంటిమి. అందలి సత్యమును నిరూపించునాధారములు ఋగ్వేదసూక్తములం దనేకములు కలవు. అందు గొన్ని:—

"అగ్నిదేవుఁడు పూర్వమహర్షులకు స్తుత్యుఁడు. ఇప్పటి మనకును స్తుత్యుఁడు [1]. ఏయింద్రుఁడు పూర్వకాలపుఋషులచేఁ జేయఁబడినట్టియు, ఇప్పటి ఋషులచేఁ జేయఁబడుచున్నట్టియు స్తుతులచే వృద్ధి పొందు చున్నాఁడో, ఆ యింద్రుఁడు సోమమునకుఁ బ్రభువు. ఓ యధ్వర్యూ! ఇతనికి సోమ మిమ్ము[2]. ఇంద్రునిసంబంధ మైన ధనదానము లనాదికాలసిద్ధములు[3]. ఇంద్రుఁడు చేసిన పూర్వకాలప్రసిద్ధములైన శూరకృత్యములు చెప్పుచున్నాను[4]. ఓస్తోతా! ఇంద్రుఁ డొనర్చినపురాతనకృత్యములను స్తుతింపుము[5]. ఓ యశ్విదేవతలారా! నే నిపుడు వర్ణించిన బహుపురాతనము లైనట్టి మీవీరకర్మములను మాపితృపితామహా దులు చెప్పిరి[6]. ఓ యింద్రా! ఈనూతనస్తుతిచే బలవత్తముఁడ వయినట్టి పురాతనుఁడ వైన నిన్ను, పురాతనమహర్షుల వలెనే వృద్ధి నొందింపఁ

---

1. అగ్నిః పూర్వేభి ర్ఋషిభి రీడ్యో నూతనై రుత. ఋగ్వే. 1-1-2.
2. అధ్వర్యో వీర ప్రమహే సుతానా మింద్రాయ భర సహ్యస్య రాజా, యః పూర్వ్యాభి రుత నూతనాభి ర్గీర్భి ర్వావృధే గృణతా మృషీణాం. 6-44-13.
3. పూర్వీ రింద్రస్య రాతయో న విదస్యం త్యూతయః. 1-11-3.
4. ఇంద్రస్య ను వీర్యాణి ప్రవోచం యాని చకార ప్రథమాని వజ్రీ. 1-32-1.
5. అస్యేదు ప్రబ్రూహి పూర్వ్యాణి తురస్య కర్మాణి నవ్య ఉక్థైః. 1-61-13.
6. ఏతాని వా మశ్వినా వీర్యాణి ప్రపూర్వ్యా ణ్యాయవోఽవోచన్. 1-117-25.

ప్రవర్తించుచున్నాను[1]. ఋషులలోపల సత్యవంతులు కవులు పూర్వకాలికులు సూర్యతేజస్సును బొందినవారు సత్యమంత్రులు నైన యంగిరసులు దేవతలతోఁ గలసి యానందించువారైరి[2].

పై వాక్యములందువలెనే, అదితి వసిష్ఠులు మిత్రావరుణులు మొదలగు వారి గాథలందును పూర్వ్యా పూర్వ పూర్వ్యయుగ ప్రత్నాది శబ్దములు కనవచ్చు చున్నవి, అవి ప్రాచీనదేవతలను ప్రాచీనమహర్షులను వారికి సంబంధించిన పురాతన కార్యములను బోధించుచు, వానియందలి విషయ మంతయుఁ బూర్వ యుగమునాఁటి దని తెలుపుచున్నవి. ఇట్లు పూర్వయుగమో పూర్వ్యయుగమో యని ఋక్కులు ఘోషించుచుండఁగా నందలి విషయ మంతయు హిమప్రళయ మున కీవలిదే కాని యావలిది కా దని కొందఱు పాశ్చాత్య విమర్శకులు వాదింప సాహసించుటకుఁ గారణ మేమో యూహింప వలసినదే కాని చెప్ప వలసినది గాదు. ఇట్లనుటచే ఋగ్వేదాదులందు నూతన విషయములు లే వని నామతము కాదు. ప్రాచీనార్వాచీనవిషయములు రెండును సుస్పష్టముగా నందు గోచరించుచునే యుండును. వానింగూర్చి తరువాత విచారింతము. ఇపుడు మన కంటియెదుట నున్న సూక్తములమాట వేఱు. అందలి విషయముమాట వేఱు. ఆ విషయములోను నవీనము నవీనమే. ప్రాచీనము ప్రాచీనమే. మన మిపుడు ప్రాచీన విషయముఁగూర్చియే ప్రసంగించుచున్నాము. వేదము, ఋషులు తీరి కూర్చుండి రచించిన పుక్కిటి పురాణము గా దనియు, ఈశ్వరానుగ్రహ లబ్ధము సత్యప్రమాణబద్ధము నగు నుత్తమగ్రంథ మనియు విశ్వసించినవారికిని దాని సంప్రదాయ మెఱిఁగినవారికిని వేదవిషయముయొక్క ప్రాచీనత యెట్టిదో సుల భముగా బోధపడును.

పురాతనదేవత యగునింద్రుని బురాతన ఋషులు స్తుతించినట్లే నేను స్తుతించుచున్నాను. బహు పురాతనము లైనయశ్వి దేవతల వీరకృత్యములను ప్రాచీనగురుపరంపరనుండి యానుపూర్విగా వచ్చుచున్నరీతిని వినుచున్నాను. అనునవి మొదలుగాఁగల పురాతన విషయములతోడి సూక్తములు హిమప్రళయ మునకుఁ దరువాతివన్న నవచ్చును గాని యావిషయములు పురాతనములు గా వనవచ్చునా? అంగిరసులు దేవలక్షణములతో విలసిల్లుచున్నా రని స్తుతించిన ఋషి యర్వాచీనుఁడే యని యంగీకరించినను, ఆ గాథ ప్రాచీనము కాక పోదు గదా?[3].

---

1. తం వో ధియా నవ్యస్యా శవిష్ఠం ప్రత్నం ప్రత్నవ త్పరితం సయధ్యై. 6-22-7.
2. త ఇ ద్దేవానాం సధమాద ఆస న్నృతావానః కవయః పూర్వ్యాసః
గూఢం జ్యోతిః పితరో అన్వవిందన్ త్సత్య మంత్రా అజనయ న్నుషాసం. 7-76-4.
3. ఋ. 10-72.

అదితిగాథను దెల్పుసూక్త మిటీవలి దన్నను, ఆ గాథావిషయ మెన్నికల్పముల క్రిందటిదో, దానినిగూడ నిటీవలికిఁ జేర్ప సాహసించువా రుందురా? కావున నెట్లు పరిశీలించి చూచినను, ఋగ్వేదాదులందు పురాతనము లని వర్ణింపఁబడిన విషయము లెల్ల, హిమప్రళయమునకుఁ బూర్వ ముత్తర ధ్రువమండలమున నివసించిన యార్యులకుఁ బురాతనములై యంతకుఁ బూర్వమయిన యుగమునకు సంబంధించినవే కాని హిమప్రళయానంతరకాలమునకు సంబంధించినవి కా వని తెలియవచ్చును. దీనినిబట్టి యార్యవైదికవిజ్ఞానము పాశ్చాత్యులు తలంచిన దానికంటె నెంతోకాలము పూర్వమునకుఁ బోవుచున్న దనుట నిజము. సత్యాన్వేషణ తత్పరుల కిది యాశ్చర్యకరము కాఁ జాలదు గదా!

ప్రపంచము పుట్టినపిదప ననేకప్రళయములు వచ్చి యుండె నని మన పురాణములు చెప్పుచున్నవి. భూగర్భశాస్త్రజ్ఞులును జెప్పుచున్నారు. ప్రళయకాలము, ఒక ప్రళయమునకు మఱియొక ప్రళయమునకుఁ గల మధ్యకాలము, చతుర్యుగపరిమితి, మన్వంతరము, కల్పము, మొద లగునవి మనుస్మృతి మహాభారతములం దొకరీతిగాను, తక్కిన పురాణాదులందు మఱియొకరీతిగాను గనవచ్చుచున్నవి. ప్రళయకాలనిర్ణయమున భూగర్భశాస్త్రవేత్తలమతములు వేఱువేఱుగా నున్నవి. ఇట్లున్నవివిధమతములకుఁ గొంచె మెచ్చుతక్కువగా నైక్యము గలుగునట్లు ఖగోళశాస్త్రముతో సమన్వయించుటకై పూర్వులు దేవమానమునఁ జూపిన యతిశయోక్తిని, తగ్గించుచు సప్రమాణముగాఁ జక్కనిచర్చ యొనర్చి యుగ మనునది పదివేల సంవత్సరము లనియు సంధికాలములతో నది పన్నెండు వేలయేం డ్లగు ననియు, తిలకుపండితు లొక యభిప్రాయము తెలిపియున్నారు[1]. దానినిబట్టి చూచినను, హిమప్రళయానంతర యుగారంభమునకును దత్పూర్వ యుగారంభమునకును బండ్రెండువేల వత్సరముల యంతరము గనవచ్చుచున్నది. ఋగ్వేదమందు పేర్కొనఁబడిన పూర్వయుగ మాయుగమో దాని పూర్వయుగమో లేక దానికిని బూర్వయుగమో యెవ్వరును నిర్ణయింపఁ జాల రనుటకు, అదితిమొదలగుప్రాచీనదేవతలగాథలే తార్కాణ మగుచున్నవి. అందుచే నార్యుల వైదిక విజ్ఞానసూత్ర మవిచ్ఛిన్న మైన దనియు దాని మొదలు పూర్వపూర్వమునకుఁ బోయి కాలగర్భమం దెక్కడనో మానవదృష్టికి గోచరింపనిచోట మఱుఁగుపడి యున్న దనియు నూహింపవలసి వచ్చుచున్నది. ఆ కారణముచేతనే అట్టి సంతతావిచ్ఛిన్నవిజ్ఞానసూత్రమున గ్రుచ్చినసూక్తములతోడి వేదము లనాదు లనఁబడుచున్నవి. కావున నిందలి సత్యము తెలిసికొన వేదశాస్త్రాదు లేమి చెప్పుచున్నవో చూతము.

1. Arctic Home - XIII cha.

"సకల బ్రహ్మాండమయుఁడు సర్వజ్ఞుఁడు నగు విరాట్పురుషుని వలన ఋక్కులు సామములు ఛందస్సులు యజుస్సులు జనియించినవి[1]. ప్రజాపతి లోకములకు మేలు చేయఁ దలఁచి పృథ్వీసార మగ్ని యనియు అంతరిక్షసారము వాయు వనియు ద్యులోకసార మాదిత్యుఁ డనియు నిశ్చయించి వారివలనఁ గ్రమముగా ఋగ్యజుస్సామవేదము లుద్ధరింపఁజేసెను[2]. వేదప్రాప్తికొఱకుఁ దపస్సు చేయుచున్న పురుషులకు స్వయంభుబ్రహ్మ వేదపురుషుఁడై ప్రత్యక్ష మయ్యెను. అతనిని జూచుటచేఁ బురుషులు ఋషు లైరి. ఇంద్రియాతీత మైన వేదమును బరమేశ్వరానుగ్రహమునఁ జూచిన యాపురుషులు ఋషు లనుపేరఁ బరఁగిరి[3]. ఋగ్వేద మగ్నివలన యజుర్వేదము వాయువువలన సామవేద మాదిత్యునివలన జనియించెను[4]. ఋగ్యజుస్సామాథర్వములు, ఉపనిషత్పురాణేతిహాస సూత్రాదులును, పరమేశ్వర నిశ్వసితములు[5]. పూర్వకాలమందు మహర్షులు మహాతపస్సు చేసి స్వయంభుబ్రహ్మచే ననుజ్ఞాతులై యుగాంత కాలమం దంతర్హితము లైన యితిహాసములతోడి వేదములను మరలఁ బొందిరి[6]. చతుర్ముఖ బ్రహ్మనాలుగుముఖములనుండి నాలుగువేదములు పుట్టెను. పరమేశ్వరుఁడు ముందుగా బ్రహ్మను సృజించి యతనికి వేదము లుపదేశించెను[7]."

ఇట్లే యింకను బెక్కువచనములు కలవు. ఇందు వేదోత్పత్తి మార్గములు భిన్నభిన్నములు గాఁ గనవచ్చుచున్నను, తుద కివి యన్నియు వేదములకుఁ బరమేశ్వరుఁడే మూలకారణ మనెడి ప్రధానమార్గమునఁ గలియుచున్నవి గావునను, శాస్త్రయోనిత్వా త్తనుసూత్ర మీయర్థమే స్థిరపఱుచుచున్నది కావునను వీనివైవిధ్యము చర్చనీయము కాదు కాని, పైవాక్యములనుబట్టి చూచినచో వేదము లనాదు లనెడి విశ్వాస మాగ్రంథములనాఁటికే దృఢముగా నాటుకొని పోయిన దని మాత్రము తెలియకపోదు. ఇందుకు వేదము నిత్యమా, అనిత్యమా? పౌరుషేయమా, అపౌరుషేయమా? అని సకలశాస్త్రకర్తలు బహువిధములఁ జేసినవిమర్శనములే ప్రమాణము. అతిగంభీరములు నపారములు హేతువాదబద్ధములు నైన యావిమర్శనములసారాంశ మిందు కొంచెము గ్రహింతము.

## వేదనిత్యత్వాపౌరుషేయత్వ విచారము,

ఆస్తికమతము లన్నియు వేద మనాది యపౌరుషేయ మనుసిద్ధాంతమున నేకీభవించుచున్నవి కాని, దాని నిత్యత్వమునెడ నీమద్భేదము గలదు. వేద

1. ఋ. 10-90-9.—2. ఛాందో. 4-17.—3. తై. ఆ. 2-9.
4. ఐ. బ్రా. 5-32.—5. బృహదా. 2-4-10.
6. భార. శాం. 210-5-19.—7. స్మృతివచనములు.

మకర్తృకము, అత్యంతనిత్యము, అపౌరుషేయ మని పూర్వ మీమాంసా మతము. వేదము పరమేశ్వర కర్తృకము, వ్యవహారనిత్యము, అపౌరుషేయ మని యుత్తర మీమాంసామతము. తక్కిన వెక్కుమతములు కొంచె మెచ్చు తక్కువగా దీనినే యనుకరించుచున్నవి.

జైమినిమతమందు వేదమునకుఁ గర్త లేఁడు. బాదరాయణ మతమందు వేదమున కీశ్వరుఁడు కర్త. అట్లే కాదేని యద్వితీయ పరబ్రహ్మమును బ్రతి పాదించెడి యద్వైతమునకే భంగము వచ్చును. కావున వేద మీశ్వర కార్య మని యుత్తరమీమాంసామత మంగీకరింపక తప్ప కున్నది. ఇందుకు ఋగ్వే దాది సకలశాస్త్రములకుఁ బరబ్రహ్మము కారణ మనెడి శాస్త్రయోనిత్వాత్తను సూత్రమే ప్రమాణము. ఈ సూత్రము వేదాంతములు పరమాత్మను బ్రతి పాదించుటంజేసి, అతఁడు శాస్త్రము ప్రమాణముగాఁ గలవాఁ డని రెండవపక్షము నకుఁ గూడ నవకాశ మిచ్చుచున్నది గాని, ఆపక్ష మైనను వేదమున కీశ్వరుఁడు కర్త యనెడి మొదటిపక్షమున కడ్డము రాదు. ఇట్లున్న ద్వివిధమతముల నను సరించి వేదప్రామాణ్యమును జర్చించి సాయణాచార్యులు ఋగ్వేదభాష్యావతా రికలో వేదనిత్యత్వాదుల నిట్లు నిర్ణయించియున్నారు[1].

“రఘువంశాదికావ్యములమాడ్కి వేదములుకూడ నీకాలమందలివే కావున నవి యనాదులు కావు. వైయాసికము భారతము, వాల్మీకీయము రామాయణ మనుచో భారతరామాయణములకు వ్యాసవాల్మీకులు కర్తలుగాఁ జెప్పఁబడు చున్నట్లే వేదభాగము లైన కాఠకతైత్తిరీయాది శాఖలకుఁ గఠ తిత్తిర్యాది పురుషులు కర్తలుగాఁ దలంపఁబడుచున్నారు. కావున వేదము లపౌరుషే యములు కావు. కాళిదాసాది వాక్యమువలె వేదవాక్యమును బౌరుషేయ మగును. మఱియును, అనిత్యులు జననమరణవంతులు నగు బబరాది పురుషులు వేదమునందు పేర్కొనఁబడియున్నారు. ఆబబరాదులకుఁ బూర్వము వేదము లేదని దీనివలనఁ దెలియుచున్నది గావున వేదము లనిత్యము లగును.”

“వేదరూపశబ్దము కఠాదిపురుషులకంటెఁ బ్రాచీన మైన దనియు,అది నిత్య మనియు, జైమిన్యాచార్యులు సిద్ధాంతీకరించియున్నారు. దానినిబట్టి వేదశబ్ద ములును వాని యర్థములును వాని సంబంధములును నిత్యము లని తెలియు చున్నది. బబరాది పురుషవాచక శబ్దములు శబ్దానుకరణములు గాని యనిత్య మనుష్యవాచకములు కావు. కావున నట్టిశబ్దము లను కరణరూపము లగుటచే నిత్యార్థమునే తెలుపుచున్న వనుట సత్యము. కఠతిత్తిర్యాదు లాయాశాఖలను లోకమునఁ బ్రవర్తింపఁజేసినవారు గాని తత్కర్తలు గారు. వేదవాక్యములకుఁ గర్త లేఁడు. అవి స్వతంత్రము లనాదులు.”

1. ఆయవతారిక ననుసరించి యీవిషయ మిందు సంగ్రహముగాఁ జూపితిని.

"అయితే, పూజ్యపాదుఁడైన బాదరాయణుఁడు, ఋగ్వేదాది సకల శాస్త్రమును నిర్మించుటచేతనే పరబ్రహ్మ సర్వజ్ఞుఁ డగుచున్నాఁడని చెప్పెను గదా! వేదమునకుఁ గర్త లేక పోవుట యెట్లు ?"

"పరమేశ్వరనిర్మిత మన్నను మనుష్యనిర్మితము కాదు కావున వేదము పౌరుషేయ మనఁదగదు. ఇట్టియపౌరుషేయత్వ ముద్దేశించియే బాదరాయణులు, అత ఏవ చ నిత్యత్వ మ్మనుసూత్రమున వ్యవహారదశయందాకాశాది కముపలెనే వేదము నిత్య మని సెలవిచ్చియున్నారు. మఱియు 'వాచా విరూప నిత్యయా' ఇత్యాది ఋక్కులనుబట్టి, అవాంతరప్రళయావస్థాయి యగువేదము దేవమనుష్యాదిసృష్టికి హేతు వగుచున్నది కావున వేదశబ్దము నిత్యమనియు నభిప్రాయ మిచ్చియున్నారు."

"వేద మీశ్వరప్రణీత మని శ్రుతిస్మృతులు చెప్పుచున్నను, శరీరధారి యైన పురుషుఁడు నిర్మించినది కాకపోవుటచే నది యపౌరుషేయ మని సాధింపఁ జూచితివి కాని, సహస్రశీర్షా పురుష ఇత్యాదిశ్రుతులచే నీశ్వరుఁడును సశరీరుఁడని తెలియుచున్నది. కర్మఫలరూప మైనశరీరము తాల్చినవాఁడు కాఁ డందువేని, అదియును బొసఁగదు. జీవవిశేషు లైనయగ్నివాయ్వాదిత్యులవల్ల వేదము లుత్పన్నము లైన వని వేదమే చెప్పుచున్నది. కావున వేదము పౌరుషేయమే."

"అగ్న్యాదు లీశ్వరప్రేరణమున ఋగాదివేదము లావిష్కరించినవారు గాని నిర్మించినవారు కారు. అందుచే నీశ్వరునికిఁ బ్రేరకత్వరూపమైన కర్తృత్వము ద్రష్టవ్య మగుచున్నది. దానంజేసి వేదమునకుఁ బురుషకర్తృత్వ దోషశంక యుదయింప నవకాశము లేదు."

ఇత్యాదిగాఁ బూర్వపక్ష సిద్ధాంతము లొనర్చిన శ్రీసాయణులు తైత్తిరీయారణ్యకభాష్యమున మంత్రకృన్మంత్రపతిశబ్దముల యర్థము వివరించుచు 'కానైతే వేదములకు కర్తలు లేరు. అయినను, కల్పాదియం దీశ్వరానుగ్రహమున వేదములను బొందినవారు మంత్రకృత్తు లనియు వారే సంప్రదాయప్రవృత్తిచే మంత్రములను బాలించి మంత్రపతు లనియుఁ, జెప్పఁబడుచున్నారు. అని స్వాభిప్రాయ మెఱిఁగించిరి. దీని నంతను బట్టి ఋషులు మంత్రద్రష్ట లనియు వేదము లపౌరుషేయము లనియు వారినిర్ణయము స్పష్టపడుచున్నది. ఈవిధముగా నుభయమీమాంసామతముల నుద్ఘాటించినసాయణులు పూర్వమీమాంసామతమం దెక్కువ తాత్పర్యము చూపినట్లు గోచరించుచున్నను, వేద మీశ్వరకార్య మనెడియుత్తరమీమాంసామతము కూడ వారికిష్టము కాక పోలేదు.

ఇది యిట్లుండ శబ్దము వర్ణాత్మక మనియు ధ్వన్యాత్మక మనియు స్ఫోటాత్మక మనియు భిన్నమతములు కలవు. శంకరభగవత్పాదులు వాని నెల్ల

నొక్కచోఁ జేర్చి చర్చించి స్ఫోటవాదమును నిరసించి ధ్వనివ్యంగ్యము వర్ణాత్మకము నైనశబ్దము నిత్య మని సిద్ధాంతీకరించి[1] వేద మీశ్వరకార్య మనెడి యభిప్రాయమును వారు విస్పష్టముగా నావిష్కరించుటచే వారిమతమందు వేద మాకాశాదికమువలెనే వ్యవహార నిత్యమై యపౌరుషేయ మగు ననెడినిర్ణయమే తేలుచున్నది.

ఇంక నిట్లే వివిధము లయినశాస్త్రచర్చలు కలవు గాని వానినెల్ల సందర్శించినవేదాంతపరిభాష యేమి చెప్పుచున్నదో చూతము.

“వేదములు నిత్యము లగుటచేఁ బురుషనిర్మితత్వదోషము లేక ప్రమాణము లగుచున్న వని మీమాంసకు లందురు కాని, ఆ నిత్యత్వమెట్టిది? వర్ణనిత్యత్వమా? ఆనుపూర్వితోఁడినిత్యత్వమా? వర్ణనిత్యత్వ మందువేని లౌకికవాక్యములును నిర్దోషము లగును. ఆనుపూర్వీవిశిష్టనిత్యత్వ మందువేని వర్ణము లనిత్యము లగుటచే వర్ణసముదాయాత్మక మయినపదమును, పదసమూహాత్మక మైన వాక్యమును గూడ ననిత్యము లగును గావున వాక్యాత్మక మైనవేద మనిత్యము కాక తప్పదు. మామతమందును వేదము నిత్యము కాదు. ఏ మందువా? అది పుట్టుచున్నది కాఁబట్టి-ఋగాది వేదములు పరమేశ్వరనిశ్వసితము లనిశ్రుతులే చెప్పుచున్నవి. అయినను వేదములు, నైయాయికులు చెప్పుచున్నట్లు క్షణికములు కావు. వర్ణపదవాక్యసముదాయాత్మక మైనవేదము లాకాశాదులవలె సృష్టికాలమం దుదయించి ప్రళయకాలమం దంతరించును గాని యామధ్యకాలమందు వర్ణముల కుత్పత్తివినాశములు కలుగవు. “అట్లయితే గగనాదిప్రపంచమువలెనే యుత్పత్తి నొందువేదము పరమేశ్వరకర్తృకమై పౌరుషేయ మగుచుండఁగా, వేద మపౌరుషేయ మనెడినీసిద్ధాంతమునకు మాత్రము భంగము రాదా?” యని యడుగుదు వేని వినుము.

ఇది పురుషుఁ డుచ్చరించుటచేఁ గలిగినపౌరుషేయత్వముగాని, పురుషుని వలనఁ బుట్టుటచేఁ గలిగినపౌరుషేయత్వము గాని కాదు. పౌరుషేయ మనఁగా నేమి? “ఆనుపూర్విగా వచ్చునట్టి సమానజాతీయవాక్యముల యుచ్చారణము నపేక్షింపకుండఁగా నొకపురుషుఁడు నవీనముగా నుచ్చరించిన వాక్యసముదాయము పౌరుషేయ మనఁబడును[2]. అట్టి పౌరుషేయత్వము వ్యాసాదులభారతాదులకు సంభవించును గాని వేదమునకు సంభవింపదు. పరమేశ్వరుఁడు సృష్టికి మొదటఁ దత్పూర్వసర్గసిద్ధ మైనవేదానుపూర్వికి సమాన మైనయానుపూర్వి గల

1. బ్ర. సూ. 1-4-28.

2. వే. ప. ఆ—సజాతీయోచ్చారణానపేక్షోచ్చారణ విషయత్వం పౌరుషేయత్వం.

వేదమునే రచియించెను గాని దానికి విజాతీయ మైనవేదమును రచింప లేదు[1]. ఈ హేతువునుబట్టి యీశ్వరకర్తృక మైనను వేద మపౌరుషేయమే యని గ్రహింపఁదగును."

ఇది యిట్లుండ సృష్టి వేదశబ్దమువల్లనే జరుగుచున్న దని వేదనిత్యత్వవాది యగు వైదికమతము మఱియొకవిధముగా నిట్లు చెప్పుచున్నది.

"ప్రజాపతి సృష్టి యారంభించుటకు ముందుగా 'ఏతే' యని యుచ్చరించి దేవతలను 'అసృగ్రమ్' అని యుచ్చరించి మనుష్యులను 'ఇందవః' అని యుచ్చరించి పితృదేవతలను, ఇట్లే యాయాశబ్దము లుచ్చరించి పశుపక్ష్యాదులను సృజించె ననియు[2], బ్రహ్మ వేదత్రయప్రకాశిత మైనసృష్టిని మనస్సున నాలోచించె ననియు[3], స్వయంభువు సృష్టికి ముందు వేదమయ మైనదివ్యవాక్కును సంప్రదాయానుగుణముగాఁ బ్రవర్తింపఁజేసె ననియు[4], శబ్దపూర్వకసృష్టిని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. ఈ విషయమునే యీ క్రిందిస్మృతి వచనములు బలపఱుచుచున్నవి.

"నామరూపేచ భూతానాం కర్మణాంచ ప్రవర్తనం
వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః,
సర్వేషాం చ స నామాని కర్మాణి చ పృథక్పృథక్
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథ క్సంస్థాశ్చ నిర్మమే."

మఱియు నియతాకృతి గలదేవమానవాదిజగత్తు నిత్య మైనజాతిని జెప్పుచున్న వైదిక శబ్దములవలననే యుత్పన్న మగుచున్నది గావున వేదశబ్దములకు నిత్యత్వ మంగీకరింపఁ దగు నన్న 'అతఏవచనిత్యత్వ' మ్మను బ్రహ్మసూత్రము నర్థమును 'ధీరులైన యాజ్ఞికులు పూర్వపుణ్య విశేషమున వేదప్రాప్తిమార్గము తెలిసికొన నర్హత కలవారై, అతీంద్రియద్రష్టలైనమహర్షులయందు ప్రవేశించి యున్న యావేదవాక్కును సాక్షాత్కరింపఁజేసికొని రను శ్రుత్యర్థము స్థిరపఱుచుచున్నది[5]. దీనినిబట్టి వైదికశబ్దము నిత్య మని తెలియవచ్చుచున్నను, ఈ నిత్యత పూర్వ మీమాంస తెల్పిన యాత్యంతికనిత్యత కా దని బాదరాయణమతమునఁ దెలియుచున్నది. ఇట్లున్నవివిధమతములలో నొక్కపూర్వ మీమాంసామతము

---

1. తథాచ, సర్గాద్యకాలే పరమేశ్వరః పూర్వసర్గసిద్ధవేదానుపూర్వీసమానాను పూర్వికం వేదం విరచితవాన్, నతు తద్విజాతీయ మితి. వే. ప. అ. ధర్మరాజాధ్వరీంద్రః.

2. ఛాందో - ఏత ఇతి వై ప్రజాపతి ర్దేవా నసృజత.........

3. బృహ - స మనసా వాచం మిథునం సమభవత్. 3-1-4.

4. అనాదినిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా - ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః.

5. యజ్ఞేన వాచః పదవీయ మాయన్ తామన్వవింద న్నృషిషు ప్రవిష్టామ్. ఋ. 10-71-3.

తప్పఁ దక్కిన మతముల యభిప్రాయములనుబట్టి వేద మీశ్వరనిర్మితము, వ్యవహారనిత్యము, అపౌరుషేయము, అని సాధింపఁగలిగినను, మనము ఋగ్వేదమందలి యొకటి రెండడ్డములు మాత్రము దాఁటవలసియున్నది.

ఋగ్వేద వాక్యవిచారణ.

ఋగ్వేదమందు, ఆర్యావర్తమునకును, ఆర్యుల సాంఘికస్థితులకును వారి వృత్తులకును సంబంధించిన వర్ణనలు కొన్ని కనఁబడుచున్నది. కొన్ని ఋక్కులును సూక్తములును ఋషులు రచియించినట్లు కనఁబడుచున్నవి. ముఖ్యముగా నీ రెండు విషయములను వేదములు పౌరుషేయము లనుటకుఁ గారణముగాఁ గొందఱు గ్రహించుచున్నారు. కావున నట్టివానిని గొన్నిటి నుదాహరించి యందలి విషయము యథాశక్తి పరిశీలింతము.

ఓ గంగా యమునా సరస్వతీ శుతుద్రీ పరుష్ణీ నదులారా! అసిక్నీ నదితోఁ గూడినయోమరుద్వృధా! వితస్తానుషోమానదులతోఁ గూడినయో యార్జికీయా! మీరు నాస్తోత్రము వినండి[1].

గంగా యమునాది సప్తనదులు నింద్రునికీర్తిని ధరించుచున్నవి[2].

ఇట్లే గంగాదినదుల వర్ణనలు పెక్కుచోట్లఁ గలవు[3].

కృష్ణుఁ డనుపేరు గలయసురుఁడు పదివేలమంది యసురులతోఁ గూడినవాఁడై, అంశుమతీ నదీతీరమం దుండెను. బృహస్పతిసహాయుఁ డైనయింద్రుఁ డచ్చటికి వెళ్లి వానిని వాని యనుచరులను గొట్టెను[4].

సాయణాచార్యు లీకథను వ్రాయుచు, ఈ ఋక్కునకు వైదికకర్మపరముగా వ్యాఖ్యానముచేసిరి. ఇట్టి గాథలు ఋగ్వేదమున నెన్నో కలవు. వానినన్నిటినిగూడ భాష్యకర్తలు కర్మపరముగా సమన్వయించి యున్నారు.

ఇంద్రా! అనార్యులు నాస్తికులు నగుకీకటులు నివసించు కీకటజనపదములందు నీగోవు లేమి చేయుచున్నవి ?[5].

---

1. ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా, అసిక్న్యా మరుద్వృధే వితస్త యార్జికీయే శృణు హ్యాసుషోమయా, ఋ. 10-75-5.

2. అస్యశ్రవోనద్యస్సప్త బిభ్రతి. 1-102-2.

3. 1-3-10 ; 1-32-12 ; 3-23-4 ; 4-28-1 ; 6-61-10 ;

4. అవద్రప్సో అంశుమతీ మతిష్ఠ దియానః కృష్ణో దశభి స్సహస్రైః ఆవత్త మింద్రః శచ్యా ధమంత మపస్నేహితీ ర్నృమణా అధత్త. 8-96-13. ఇదే యీ షడ్భేదముతో తై. ఆర 1-6 లో నున్నది.

5. కిం తే కృణ్వంతి కీకటేషు గావో నాశిరం దుహ్రే న తపంతి ధర్మం. ఋ. 3-53-14.

ఓ యింద్రా! గోతమపుత్రుఁడయిననోధ యనుఋషి, గుఱ్ఱములను బూన్చినరథము గలవాఁడవును బలవంతుఁడవు నైననిన్ను స్తుతించుటకు నూతనమైన యీ సూక్తము రచియించెను[1].

ఓయింద్రా! ప్రయాణము గోరుపురుషులు మార్గములు నిర్మించునట్లే నిన్ను స్తుతించుటకై గృత్సమదు లీస్తోత్రము నిర్మించిరి.

ఎడ్లు సుఖముగా నాఁగటికాఁడి మోయుఁగాక, కర్షకులు చక్కఁగాఁ బని చేయుదురు గాక, నాఁగలి చక్కఁగా దున్నుఁగాక, ఓనాఁగటిచాలా! నీవు మాకు మేలు గలిగింప నీకు వందనము చేయుచున్నాము[3].

యజ్ఞము చేయుటచే దంపతులు పూర్ణాయుర్దాయము కలవారై ధన కనకపుత్రసంపదలు పొందుచున్నారు[4].

జూదగానిని భార్య నిందించినది. అత్తగారు తిట్టినది[5].

జూద మాడిననన్ను నాభార్య తిట్టలేదు, సిగ్గు పడలేదు, మంచిది[6].

బ్రాహ్మణులవలె స్తుతిపాఠకు లగుచున్నారు. రాజులవలె సేవింపఁదగినవారగుచున్నారు[7].

ఇట్లు దేశజాతివృత్తిధర్మములను దెలుపుఋక్కులింకను గొన్ని ఋగ్వేదమందు కలవు. ఇట్లే యజురాదివేదములందును బ్రాహ్మణములందును గూడ నర్థవాదము లైనమంత్రములు, జాతిసంఘములధర్మములను దెలుపు గాథలు, రాజులు మొద లగు మహాపురుషుల కథలు గనవచ్చు నన్నమాట సత్యమే కాని, యీవేదములందే మంత్రములు దేవాతాకర్తృకము లనియు, ఋషులు జ్ఞానదృష్టిచే సూక్తములు దర్శించిరనియు, దేవతలు దివ్యవాక్కున సూక్తములు రచించి రనియు ననేకస్థలములఁ గనవచ్చును. అందు గొన్ని:—

దేవతలు దివ్యవాణిని గలిగించిరి.—ఆవాగ్దేవి మనలను బొందుఁగాక[8].

---

1. సనాయతే గోతమ ఇంద్ర నవ్య మతక్ష ద్బ్రహ్మ హరియోజనాయ, ఋ. 1-62-13.

2. ఏవాతే గృత్సమదాః శూర మన్మా వస్యవో నవయునాని తక్షుః. 2-19-8.

3. శునం వాహాః శునం నరః శునం కృషతు లాంగలం. 4-57-4. అర్వాచీ సుభగే సీతే వందామహే త్వా యథా నః సుభగా ససి. 4-57-6.

4. పుత్రిణా తా కుమారిణా విశ్వ మాయు ర్వ్యశ్నుతః. ఉభా హిరణ్య పేశసా. ఋ. 8-31-8.

5. ద్వేష్టి శ్వశ్రూ రప జాయా రుణద్ధి. 10-34-3.

6. న మామిమేథ న జిహీళ ఏషా శివా.

7. విప్రాసో న మన్మభిః స్వాధ్యః—రాజానో నచిత్రాః, 10-78-1.

8. దేవీం వాచ మజనయంత దేవా స్తాం విశ్వరూపాః పశవో వదంతి. సా నోమంద్రేష మూర్జం దుహానా ధేను ర్వా గస్మా నుప సుష్టు తైతు. ఋ. 8-100-11.

ఓవిరూపమహర్షీ! ఉత్పత్తిరహిత మైనమంత్రవాక్కుచే స్తుతింపుము[1].

ఇంద్రావరుణులు పూర్వము ఋషుల కనుగ్రహించిన మనీషను వాక్కును మతిని శ్రుతమును, పూర్వయాజ్ఞికులు యజ్ఞము చేయువారై సృజించిన స్థానములను, తపశ్శక్తిచే నేను జూచితిని[2].

అంభృణమహర్షి కూతురు రగువాగ్దేవి బ్రహ్మవిదుషియై తానే సర్వజగద్రూపము సర్వాధిష్ఠాన మని తన్నే స్తుతించుకొనెను. తాను వసురుద్రాదిస్వరూపమున సంచరించుచున్నట్లు వర్ణించుకొనెను[3].

గోతముఁ డుచ్చరించిన స్తుతిరూప మైన సూక్తమును మరుత్తులు మిక్కిలి యుత్కృష్టమును సుప్రసిద్ధము నైనదానినిగాఁ జూచిరి—ఇచ్చట గోతముఁడు ప్రవక్తయే కాని సూక్తకర్త కాఁ డని విదిత మగుచున్నది[4].

ఓయింద్రా! యజమానుఁడు నీకై సరిక్రొత్తదియు స్తుతిలక్షణమైనదియు నగుసూక్త రూపవాక్కును రచియించెను. ఇతనికిఁ బురాతనమును సత్యమును సర్వహృదయముల నెఱుంగునదియు నగుబుద్ధి నొసంగుము[5]—ఇందు స్తుతివాక్యములు క్రొత్త వైనను, ఇందలి విషయము పురాతన మని తెలియవచ్చుచున్నది.

అగ్ని మీళే ఇత్యాదికసూక్తమునకు విశ్వామిత్రపుత్రుఁడు మధుచ్ఛందనుఁడు ద్రష్ట. అతీంద్రియ మైన వేదమును బరమేశ్వరానుగ్రహమున ముందు సందర్శించినవాఁడు ఋషియనఁబడును—ఇట్లే వేదసూక్తకాండాదుల కాయా ఋషులు ద్రష్టలుగాఁ జెప్పఁబడుచున్నారు[6].

ఇఁక నీసందర్భమునకు సరిపడునట్టి శాస్త్రవచనములు రెండుమూఁ డుదాహరించి ప్రకృతమును సరింతము.

"స్రష్ట పూర్వకల్పమం దేవిధముగా సృజించెనో యావిధముగానే యుత్తర కల్పమందును సూర్యచంద్రులను మూఁడులోకములను సృజించును"[7]. అని

---

1. తస్మై నూన మభిద్యవే వాచా విరూపనిత్యయా. ఋ. 8-75-6.

2. ఇంద్రావరుణా య దృషిభ్యో మనీషాం వాచో మతిం శ్రుత మదత్త మగ్రే। యాని స్థానా న్యసృజంత ధీరా యజ్ఞం తన్వానా స్తపసా భ్యపశ్యం. ఋ. 8-59-6.

3. అహం రుద్రేభి ర్వసుభి శ్చరా మ్యహ మాదిత్యైరుత విశ్వేదేవైః అహం మిత్రావరుణోభా బిభర్మ్యహ మింద్రాగ్నీ అహ మశ్వినో భా. 10-125-1.

4. ఏత త్త్యన్న యోజన మచేతి సస్వర్హ యన్మరుతో గోతమో వః. పశ్యన్ హిరణ్యచక్రానయోదంష్ట్రా న్విధావతో వరాహూన్. 1-88-5.

5. ఇంద్ర య స్తే నవీయసీం గిరం మంద్రా మజీజనత్। చికిత్విన్మనసం ధియంప్రత్నా మృతస్య పిప్యుషీం. ఋ. 8-95-5.

6. ఋ. 1-1-1 అవతారిక.

7. సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్, దివంచ పృథివీం చాంతరిక్ష మథో స్వః. ఋ. 10-190-3.

తెల్పుమంత్రమును బట్టియు, "సంసార మనాది యని బాదరాయణులు నిరూపించుటను బట్టియు[1] వారిమతమున, సమస్త వ్యక్తులు పుట్టుచుఁ జచ్చుచు మరలఁ బుట్టుచుండుట నైసర్గికము గావునఁ బూర్వసృష్టిలోని చేతనాచేతనవస్తువుల నామరూపము లుత్తరసృష్టిలోఁగూడ నెడతెగక సంభవించుచునే యుండును. అందుచే వేదములందు తాదృశవస్తునామములు గనవచ్చుచున్నను విరోధములేదు"[2]. అని యాచార్యులవారు బాదరాయణులసూత్రమున కర్థము వివరించి, వైయభిప్రాయమును ధ్రువపఱుచుచు సెల విచ్చియున్నారు. అందుచేతనే ఋగ్వేదసూక్తములను మధుచ్ఛందసుఁడు మొదలగుఋషులును, యజురాదివేదముల భాగములను ప్రజాపతిమొదలగు కాండర్షులును సందర్శించి రని శౌనకాదులు స్మరించుచున్నారు. మఱియు 'పూర్వకల్పమం దేప్రాణు లేకర్మము లాచరించిరో, వారుత్తరకల్పమం దాకర్మలకు సజాతీయము లైనకర్మములనే యాచరింతురు[3]. 'ప్రళయానంతరము జన్మించినఋషులకు వారిపూర్వనామములను, వేదవిషయకమైనవారిపూర్వజ్ఞానమును బ్రహ్మదేవుఁడు మరల నిచ్చుచుండును[4]. అని స్మృతులు ఘోషించుచున్నవి."

దీనినిబట్టి నదీఋష్యాదిసంజ్ఞ లుండుటచే వేదములు ఋషికల్పితము లనుట పొసఁగ దని శంకరుల వారియభిప్రాయము విశద మగుచున్నది.

## అపౌరుషేయత్వవిచారపర్యవసానము.

విషయ మి ట్లున్నది. వేదప్రామాణ్యవాదు లగుశాస్త్రకర్తలలో నొకరును వేదము పౌరుషేయ మని యంగీకరించి యుండలేదు. కాని, నాస్తికు లైనచార్వాకాదులు మాత్రము వేదము పురుషప్రణీత మని వాదించియున్నారు. వేదకర్తలే వేదద్రష్టలుగాఁ జెప్పఁబడుచున్నారు గాని ఋషులే వేదములు నిర్మించి రని పాశ్చాత్యు లనుచున్నారు. ఇఁక దీనిం గూర్చి విశేషచర్చ యేల? వైదికవిజ్ఞాన మెన్నఁడు లోకమునఁ బ్రవృత్త మయ్యెనో, తెలియరామిం జేసి యది యనాది యనియు ఛందోరూపము దాల్చినదానిప్రవృత్తి కీశ్వరప్రేరణమే పరమకారణముగా బ్రహ్మజ్ఞానసంపన్నులు తపోయోగనిష్ఠాగరిష్ఠులు నగుమహర్షులు వేదమం

---

1. ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ. బ్ర. సూ. 2-1-36.

2. సమాననామరూపత్వా చ్చావృత్తా వప్యవిరోధో దర్శనా త్స్మృతేశ్చ. బ్ర. సూ. 1-3-30.

3. తేషాం యే యాని కర్మాణి ప్రాక్ సృష్ట్యాః ప్రతిపేదిరే। తా న్యేవ తే ప్రపద్యంతే సృజ్యమానాః పునః పునః ॥

4. ఋషీణాం నామధేయాని యాశ్చ వేదేషు దృష్టయః। శర్వర్యంతే ప్రసూతానాం తా న్యేవైభ్యో దదా త్యజః ॥

త్రములు సందర్శించి రనియు దానంజేసి వేదము లపౌరుషేయము లనెడివిశ్వా సము భరతఖండమున వేల్లు నాటుకొని నిశ్చలముగా నున్న దనియుఁ దెలియనగును. వేదము లపౌరుషేయము లనుటలో నిదియే పరమార్థము.

## వేదకాలము.

దీనినిగూర్చి ప్రాచ్యపాశ్చాత్యవిమర్శకు లనేకమార్గములఁ జర్చించి తమకుఁ దోఁచినరీతి నభిప్రాయము లావిష్కరించియున్నారు. వారిలో వేదము లతిప్రాచీనము లని చెప్పుచుఁ గొంతచర్చ చేసియుఁ దుదకు వేదకాలనిర్ణయ ప్రయత్నము నిరర్థక మని విడిచినవాఁడు వీబరుపండితుఁ డొకఁడే కాని, తక్కినవా రందఱు నేదో యొకమాట చెప్పుచునే వచ్చిరి. మోక్షమూలరు ఋగ్వేద పరిశోధనమున బహుకాలము గడపియు వేదకాలము క్రీస్తుపూర్వము ౧౨౦౦ సంవత్సరములకు దాఁట దని చెప్పెను. మేగ్డోనలు వైయభిప్రాయము నేదో కొంచెము విమర్శించి దానిని ౧౩౦౦ వఱకు గొంచెను. విట్నీపండితుఁడు ౨౦౦౦ అనెను. బ్రన్‌హోఫరు ౨౫౦౦ అనెను. జాకోబీపండితుఁడు ౪౦౦౦ పైమాట యని వక్కాణించెను. ఋగ్వేదమున వక్కాణింపఁబడిన నాలుగుసముద్రములును బ్రాచీనార్యావర్తదేశమునకు నాలుగుసరిహద్దులు గా ము న్నొకకాలమున నుండియున్నట్లు భూగర్భశాస్త్ర పరిశోధనవలనఁ దెలియవచ్చుచున్నది కాఁబట్టి, యాచతుస్సముద్రము లంతరింపక పూర్వము ఋగ్వేదము పుట్టె నని ప్రాచీనమత మనుసరించిన దాసుగారి సిద్ధాంతము. వారియభిప్రాయప్రకార మాకాలము లక్షయేండ్లకుఁ దక్కువ కా దన్న ననవచ్చును, భూగర్భ శాస్త్రపరిశోధనలవలనఁ దేలిన యభిప్రాయములును, ప్రళయకాలములను గూర్చినయభిప్రాయములును గూడ వేఱువేఱుగా నుండుటచే వానిపై నాధారపడువా రీవిషయమున మిక్కిలి యావలికిఁ బోవుటయో మిక్కిలి యీవలికి వచ్చుటయో సంభవించుచున్నది. ఎట్లయినను వేదకాలనిర్ణయమున నిర్వివాద మైనసిద్ధాంతము లేదు. అనేకు లిట్లే తమకుఁ దోఁచిన ట్లిచ్చినయభిప్రాయముల నెల్ల నిరసించుచు, సృష్టిప్రక్రియ వేదమందు నిరూపింపఁబడినది గావున సృష్ట్యాదినుండియు వేదము లిట్లే వచ్చుచున్న వని మన పెద్ద లనుచున్నారు. ఇఁక నీవిషయముఁ గూలంకషముగా విమర్శించిన తిలకపండితులయాశయ మెట్లున్నదో చూతము. వీరు 'వేదములలోనియుత్తరనివాస' మను గ్రంథమునఁ గడపటియధ్యాయమం దీవిషయము చక్కఁగాఁ చర్చించుటయే కాక వేదకాలనిర్ణయమునకు (orin) మృగశీర్ష యనుచిన్నగ్రంథముకూడ రచియించియున్నారు. ఈగ్రంథమున వేదములలోని ఖగోళజ్ఞానమును బోధించు వాక్యముల నుదాహరించి జ్యోతిర్గణితమునుబట్టి వేదములకాలము నిర్ణయించుచు, అందుకు వ్యతిరేకాభిప్రాయము సూచించినబెంట్లీ మొదలగువారి వాదములను ఖండించుచు, తమయభిప్రాయమును బలపఱుచునట్టిగ్రీకుపారశీకాదిగాథల నుదా

హరించుచు సంపూర్ణవిమర్శనము గావించి యున్నారు. వారివలె నీవిషయము తరిచినవారు లేరనుట యతిశయోక్తి కాదు. కావున వారియభిప్రాయ మిందు సంగ్రహముగాఁ దెలుపుచున్నాను.

"సూర్యుఁ డేదినమున నేనక్షత్రమువద్దనుండి బయలుదేఱునో, ఆదినము సంవత్సరాది యనియు; ఆనక్షత్రమువద్దకు మరల సూర్యుఁడు వచ్చునప్పటికి సంవత్సర మయ్యె ననియుఁ బూర్వులు గ్రహించి దానినిబట్టి వార్షికసత్రములు మున్నగుకర్మము లాచరించుచుండెడి వారనుటకు వేదములలోఁ బ్రమాణవచనములు గలవు[1]. దీనినిబట్టి యాసంవత్సరాది దినమున సూర్యునివద్ద నున్ననక్షత్రము ప్రథమనక్షత్రముగా గణింపఁబడుచు వచ్చె ననియు, అందు విషువత్తుండె ననియుఁ దెలియవచ్చుచున్నది. విషువత్తనఁగా నహోరాత్రములు సమానముగానుండు కాలము.

పైని జెప్పినదాని కనుగుణముగా, కృత్తిక ప్రథమనక్షత్రముగా గణింపఁబడినకాలము తైత్తిరీయబ్రాహ్మణమువలనఁ దెలియుచున్నది[2]. ఈవిషయమును బలపఱుచునట్టివాక్యములు బ్రాహ్మణాదులం దింకనుగలవు[3]. ఈ ప్రమాణములను బట్టి తైత్తిరీయ సంహితా కాలమునాఁటికి వసంతవిషువత్తు కృత్తికా నక్షత్రమం దున్నట్లు విదిత మగుచున్నది. ఒక్కొక్కనక్షత్రమందు విషువత్తు ౯౬౦ సంవత్సరము లుండును. అది యొకనక్షత్రమునుండి మఱియొక నక్షత్రమున కతిసూక్ష్మముగా వెనుకకు నడచుచుండును. వరాహమిహిరునికాలమున విషవత్తు రేవత్యంతమం దున్నది. (అది యిప్పటికి ౧౪౦౦ సంవత్సరముల క్రిందటిమాట.) దానిని బట్టి విషువచ్చలనమును జ్యోతిర్గణితరీతిచేఁ బరిశీలింపఁగా, కృత్తికానక్షత్రమందు విషువత్తున్నకాలము క్రీస్తుపూర్వము ౨౩౫౦ సంవత్సరము లగుచున్నది. అందుచేఁ దైత్తిరీయసంహితాకాల మదియే యని తేలుచున్నది. కాని యింతటితో వేదకాల నిర్ణయము కాలేదు. వేదములలోని యితరవాక్యములనుబట్టి యింకను వెనుకకు వెళ్లుట కవకాశము కలదు.

తైత్తిరీయసంహితలో[4]. ఉత్తరఫల్గునీ నక్షత్రయుక్తపూర్ణిమయు చిత్రా నక్షత్రయుక్తపూర్ణిమయు సంవత్సరాదిదినము లయినట్లును, ఆ దినములు దీక్షారంభదినము లయినట్లును, సంవత్సరముఖము లయినట్లును వర్ణింపఁబడియున్నది. ఈవిషయమును బలపఱుచునట్టివాక్యము లనేకములు బ్రాహ్మణములలోఁ గన

1. తై. బ్రా. 1-5-2-1,—2. 1-5-2-7, 3. 1-1-2-1, తై. సం. 4-4-10. 7-4-8, తం. బ్రా. 5-9. మొద—

4. సంవత్సరాయ దీక్షిష్యమాణా ఏకాష్టకాయా మిత్యాది—తై. సం. 7-4-8.

వచ్చుచున్నవి[1]. ఈఫాల్గునియు చైత్రియు దినములను దెల్పునవే కాని మాసములను దెల్పునవి కావు.

దీనినిబట్టి ఫాల్గునపౌర్ణమాసి సంవత్సరాదిదినముగా నున్నకాలమును, చైత్రపూర్ణిమ సంవత్సరాదిదినముగా నున్నకాలమును, పూర్వోక్తసంహితా బ్రాహ్మణములకు మున్నొకానొకప్పుడు కల వని విదిత మగుచున్నది. ఇందు ఫాల్గున పూర్ణిమ సంవత్సరాదిదిన మగుటనుగూర్చి యించుక విచారింపవలసి యున్నది. ఇది వసంతవిషువత్సంవత్సరాది యన్నచో వసంతవిషువత్తు, ఉత్తరాభాద్రలో నుండవలెను. అట్లుండెనేని యాకాలము క్రీస్తుపూర్వము ౨౦ వేల సంవత్సరము లగును. అది యసంభవము గావున హిమసంక్రమణమువద్ద ఫాల్గున పూర్ణిమనాఁడు సంవత్సర మారంభ మయ్యె నని చెప్పవలసియున్నది. అట్టి సంవత్సరాది ప్రాచీనకాలమునఁ గల దనెడిగాథ తమనాఁటి కనుశ్రుతముగా వచ్చుటచేతనే తైత్తిరీయ సంహితా బ్రాహ్మణాదులలో ఋషు లట్లు వర్ణించి యున్నా రనుట విశ్వసనీయము. ఫాల్గునపూర్ణిమ హిమసంక్రమణమువద్ద సంవత్సరాదిదిన మైన దనఁగా మృగశీర్షలో వసంతవిషువత్తున్న దనుటయే. అనఁగాఁ దైత్తిరీయసంహితాకాలమునఁ గృత్తికలో నున్నవిషువత్తు రెండు నక్షత్రములు వెనుక నున్న దనుట. అట్లయినచో మృగశీర్ష, ప్రథమ నక్షత్రముగా గణింపఁబడినట్లు ప్రమాణము కావలసియుండునుగదా !

మృగశీర్షనక్షత్రమునకు ఆగ్రహాయణి యను నామాంతరము గలదు[2]. ఆగ్రహాయణీనక్షత్రయుక్తపౌర్ణమాసి దానియందు కలదు కావున మార్గశీర్ష మాసమున కాగ్రహాయణిక మనుపేరు గూడ వచ్చినది[3]. ఈయర్థమును, పాణినీయము బలపఱుచుచున్నది గావున,[4]. ఒకప్పుడు మృగశీర్షనక్షత్రము ప్రథమ నక్షత్రముగా గణింపఁబడె ననుటకును, దానియందువిషువత్తుండెననుటకును,

---

1. "ఏషాహ వై సంవత్సరస్య ప్రథమా రాత్రి ర్య త్ఫాల్గునీపౌర్ణమాసీ." శత - బ్రా. 6-2-2-18.

"ఏషావై ప్రథమా రాత్రిః సంవత్సరస్య య దుత్తరే ఫల్గునీ ముఖత ఏవ సంవత్సర స్యాగ్నిమాధాయ వశీయా న్భవతి." తై. బ్రా. 1-1-2-8.

"ముఖంవా ఏత త్సంవత్సరస్య య త్ఫాల్గునీపౌర్ణమాసీ." సాం. బ్రా. 4-4.

"ముఖ ముత్తరే ఫల్గున్యౌ పుచ్ఛం పూర్వే." గో. బ్రా. 1-19.

"ఉత్తరయో రాదధీత ఏషా వై ప్రథమా రాత్రిః సంవత్సరస్య య దుత్తరే ఫల్గునీ" ఆధాన బ్రాహ్మణము.

2. మృగశీర్షం మృగశిర స్తస్మి న్నే వాగ్రహాయణీ, అమరకోశము.

3. మార్గశీర్షే సహామార్గ ఆగ్రహాయణిక శ్చ సః.
మృగశిర ఏ వా గ్రహాయణీ తద్యుక్తాపూర్ణి మాస్మి న్నితి. వ్యాఖ్య.

4. సా స్మిన్పౌర్ణ మాసీతి, 4-2-21 ; ఆగ్రహాయణ్యశ్వత్థాట్ఠక్. 4-2-22. అష్టాధ్యాయి.

ఆగ్రహాయణీ శబ్దవ్యుత్పత్తియే ప్రమాణము[1]. దీనినిబట్టి మృగశీర్షనక్షత్రము వద్ద సూర్యుఁ డుదయించు సమయమును బ్రాచీన వైదిక ఋషు లెఱుఁగుదు రనియు, ఆదినము సంవత్సరాదిగా గణింపఁబడుటచేత నే మృగశీర్ష కాగ్రహాయణీనామము వచ్చె ననియు విదిత మగుచున్నది. కాని, మార్గశీర్షమున కాగ్రహాయణిక మనుపే రుండుటచే మార్గశీర్ష మాసముతో సంవత్సరారంభ మయ్యె నని మాత్రము తలంపరాదు. అశ్వినీనక్షత్రము మన కిపుడు నక్షత్రగణనలోఁ బ్రథమనక్షత్ర మైనను, ఆశ్వయుజమాసము సంవత్సరారంభ మాస మగుట లేదు. కావున మృగశీర్షయందు విషువత్తున్న దని తెలుపుటచేత నే, దాని యాగ్రహాయణీనామ మన్వర్థమగుచున్న దని గ్రహింపఁ దగును[2]. ఇట్లు మృగశీర్షనక్షత్రమందు విషువత్తున్నదనువిషయమును బ్రాచీను లెఱుఁగుదు రని తిలకపండితులు గ్రీకుపారశీకాది సారస్వతములనుండి కొన్నిగాథ లుదాహరించుచు విపులముగాఁ జర్చించి నిర్ణయించిరి. ఈకాలము క్రీస్తుపూర్వము సుమారు ౪౦౦౦ సంవత్సరము లగుచున్నది. ఇంతటితోను విడువక తిలకుగా రింకను వెనుకకుఁ బోఁజూచి విషువత్తు పునర్వసులో నుండుట గూడఁ బ్రాచీను లెఱుఁగుదు రనుటకు సూచనలు చూపించిరి.

వెనుక నుదాహరించిన తైత్తిరీయసంహితా వాక్యమువలనఁ జైత్రపూర్ణిమగూడ నొకప్పుడు సంవత్సరాదిగా నున్నట్లు తెలిసికొనియున్నాము. అది గూడఁ బూర్వయుగ వృత్తాంతమునే తెలుపుచున్నది గావున దానినిబట్టి హిమసంక్రమణమువద్దఁ జైత్రపూర్ణిమనాఁడు సంవత్సరారంభ మైనకాలము గూడ గోచరించుచున్నది. అక్కడ సంవత్సరారంభ మైన దనఁగా విషువత్తు పునర్వసు నక్షత్రమునం దున్న దనుటయే. అనఁగా మృగశీర్షకంటె రెండునక్షత్రములవెనుక నున్న దనిభావము. అట్లయినచో పునర్వసునక్షత్రము ప్రథమ నక్షత్రముగా గణింపఁబడినట్లు ప్రమాణవచనములు కావలెను. అట్టి ప్రత్యక్షవాక్యములు వేదాదులందు గనరావు కాని, మైత్రేయ బ్రాహ్మణ తైత్తిరీయ సంహితలలోని యొకగాథమాత్ర మీవిషయమును జక్కఁగా సూచించుచున్నది.

---

1. ఆగ్రే హాయన మస్యా ఇత్యాగ్రహాయణీ, అని పాణినిమత మనుసరించిన భట్టోజీదీక్షితులవృత్తి.

2. దీనియర్థము సాధించుటకై తిలకపండితులు, పెద్దవ్యాఖ్యానము చేసియున్నారు. మాసము పేరునుబట్టి నక్షత్రమునకుఁ బేరు వచ్చిన ట్లమరసింహాదులు పొరబడి రనెడి యభిప్రాయముతోను మాసానాం మార్గశీర్షో ఽహం ఋతూనాం కుసుమాకరః, అనుభగవద్గీతావచనమున, మార్గశీర్షము సంవత్సరాద్యమాస మని సూచిత మగుట యసంగత మనుతలంపుతోను వా రట్లు హెచ్చుగా వ్రాసియుందురు.

"ఒకప్పుడు యజ్ఞపురుషుఁడు కోపగించి దేవతలయాగమునుండి లేచి పోయెను. అపుడు దేవతలు యజ్ఞాంగము నొనర్ప నశక్తులై, అదితివద్దకు వెళ్లి మాయాగము మేము సమాప్త మొనరించున ట్లనుగ్రహింపవలసిన దని కోరిరి. అందు కదితి యంగీకరించి, సోమయాగము లన్నియు నాతోఁ బ్రారంభించి నాతో సమాప్తి గావింపవలె నని వరము కోరెను. అందుకు దేవత లంగీకరించి యాగప్రారంభకాలమందలి చరువును (హవ్యము) సమాప్తికాలమందలి చరువును, అదితిదేవతాకములుగాఁ జేయవలె నని నిర్ణయించిరి. అదితి యట్లు కోరెను గావునఁ బ్రారంభావసానములందలిచరు వ ట్లదితి దేవతాకముగాఁ జేయుట యుక్తము. ఈయర్థమునే తైత్తిరీయము కూడఁ జెప్పుచున్నది.[1] దీనిని బట్టి పునర్వసునక్షత్రమునకు, అదితి యధిష్ఠానదేవత యగుటచే, ఆ నక్షత్రముతో యజ్ఞ మారంభించి యానక్షత్రముతో యజ్ఞము సమాప్తి చేయవలసి నట్లు తెలియవచ్చుచున్నది. అనఁగా, పునర్వసు నక్షత్రమందు విషువత్తుండుటచే, ఆనక్షత్రమువద్ద సూర్యుఁ డుదయించి మరల నా నక్షత్రమువద్దకు వచ్చుటకు సంవత్సర మగు ననియు, అందుచే పునర్వసు నక్షత్రముతో సంవత్సర మారంభ మగు ననియు భావము. ఇట్లు సూచింపఁబడిన యీభావమును, తిలకుగారు ఋగ్వేదాదులలోని యితరవాక్యములచే సమర్థించియున్నారు. దీనిని బట్టియుఁ బ్రాచీనుల యజ్ఞాచారములనుబట్టియుఁ బురాతనఋషులు పునర్వసులో విషువత్తున్నకాలముగూడ నెఱిఁగియుందు రనుట కవకాశము గలుగుచున్నది. అందుచే వేదకాలము మఱి రెండువేల సంవత్సరములు వెనుకకు జరుగును. అనఁగా క్రీస్తుపూర్వము సుమారు ౬౦౦౦ సంవత్సరము లనుట. ఇట్లు వేదకాలమును జర్చించి సిద్ధాంతీకరించిన తిలకపండితులు తమ రెండుగ్రంథముల కడపట నిచ్చిన వేదకాలవిభాగాదికమును సంగ్రహముగా నిందు తెలుపుచున్నాను.

### అదితియుగాది నిర్ణయము.

ఉత్తర ధ్రువహిమ ప్రళయానంతరయుగారంభము.

క్రీస్తుపూర్వము ౧౦,౦౦౦ లేక ౮౦౦౦ సంవత్సరములు. వేదసూక్తము లందలి యనేకవిషయములు హిమప్రళయ పూర్వకాలమందలి వని వైదికఋషు లెఱుంగుదురు. బహుపురాతనము లైన యావిషయములే సూక్తరూపమును దాల్చినవి.

---

1. యజ్ఞో వై దేవేభ్య ఉపక్రామత్ — ఇత్యాది — ఐ. బ్రా. 2-1 దేవా వై దేవయజనమధ్యవసాయ — ఇత్యాది — తై. సం. 6-1-౫.

క్రీస్తుపూర్వము ౬౦౦౦-౪౦౦౦. ఈకాలమున నుత్తరధ్రువము విడిచిన యార్యులు క్రమముగా నాసియాఖండాదులందు సంచరించుట అందందు నివసించుట. ఇది యార్యనాగరికతయందు ప్రథమయుగము. ఇదే, అదితియుగము, లేక పునర్వసుయుగము. ప్రాచీనవైదికవిజ్ఞానవికాసము మరల నీయుగమం దారంభ మైన దనవచ్చును.

క్రీస్తుపూర్వము ౪౦౦౦-3000. ఇదియార్యనాగరకతయందు ద్వితీయ యుగము. ఇదే మృగశీర్ష యుగము. ఇందు ఋగాదివేదములలోనియనేకసూక్తము లావిష్కృతము లైనవి. హిమప్రళయమునకుఁ బూర్వమునుండియుఁ బ్రాచీన మహర్షి పరంపరాముఖమున వచ్చుచున్న వైదికవిజ్ఞానము నేమఱక యీకాల మందలి ఋషులు దానిని భద్రపఱిచినవిధాన మిందు గనవచ్చును.

క్రీస్తుపూర్వము 3000—౧౪౦౦. ఇది యార్యసభ్యతయందు తృతీయ యుగము. ఇదే కృత్తికాయుగము. ఇందు తైత్తిరీయసంహితయు, బ్రాహ్మణములు మొదలగువైదికభాగములు సంపూర్ణత వహించినవి.—తైత్తిరీయమునకు మున్ను సామవేదమును వెనుక నథర్వవేదము నీయుగమునందే యావిర్భవించిన వని చెప్ప వచ్చును. వీని పౌర్వాపర్యమునెడ మతభేదములు కలవు. సామవేదము ముందో తైత్తిరీయము ముందో నిర్ణయించుట క్లిష్టమే కాని యీ రెండింటికినిగూడ నథర్వ వేద మర్వాచీన మనుట మాత్రము తెల్లము.—

క్రీస్తుపూర్వము ౧౪౦౦—౫౦౦. ఇదియార్యసభ్యతయందు చతుర్థయుగము. ఇదే గౌతమ బుద్ధపూర్వయుగము. దీనిని సూత్రయుగ మందురు. ఇందు వివిధసూత్రములు బహువిధవేదాంతములు నుదయించినవి.

వేదముల నింకను, కాలగర్భములోనికిఁ గొనిపోవుటకు సూచనలు లేక పోలేదు. ఆర్యవిజ్ఞానముపునాది కనిపెట్టవలె నంటే హిమప్రళయకాలము వెనుక కెక్కడికో పోవలెను. కాని యాదారి యగమ్యగోచరముగా నున్నది. అందు చేతనే పూర్వులు వేదము లనాదు లనిరి. వైదికవిజ్ఞానము బహుపురాతన మచింత్య మతిమానుషము నగుటచే వా రట్లు భావించుట సమంజసమే."

వేదము లీశ్వరానుగ్రహాలబ్ధములు ఋషిదృష్టములు నని వైదికఋషులును బూర్వశాస్త్రకర్తలును దలంచిన దానిని తిలకుగారియభిప్రాయము సమీపించుచునే యున్నది. ఎట్లయిన నేమి ? వేదముకంటెఁ బురాతన మైనగ్రంథము ప్రపంచమందు వేఱొకటి కనఁబడ లేదు. దానికంటెఁ బూజనీయ మైనప్రత్యక్షదైవతము వే ఱొకండు కనఁబడదు.

కావున వేదకాలమునుగూర్చి యెవ రెన్ని వ్రాసినను, అవి యన్నియు నూహలే యగును గాని సిద్ధాంతములు కాఁజాల వని నాయభిప్రాయము. అయినను దెలిసినంతలో నేదో యొకటి యిద మిత్థ మనుట చరిత్రకారునివిధి గావున

నాబుద్ధికి శ్రీతిలకపండితులసిద్ధాంత మిప్పటి కుచితముగాఁ గనఁబడుచున్న దని మనవిచేయుచున్నాను[1]. ఇఁక నీవిషయము నెక్కువగాఁ జర్చించుటకంటె.—

"యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః,
తపసా లేభిరే పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా."

అను భారతోక్తిని స్మరించి దాని తత్వము గ్రహించుటయే యుచితము.

ఇది మల్లాది సూర్యనారాయణశాస్త్రి విరచితమైన వైదిక
వాఙ్మయచరిత్రయందలి ద్వితీయాధ్యాయము.

---

1. శ్రీచింతామణి వినాయకవైద్యపండితుల యభిప్రాయముకూడ దీనికి దగ్గఱగానే యిట్లున్నది.

శ్రుతియుగము—క్రీ. పూ. ౪౫౦౦—౨౦౦.

స్మృతియుగము - లౌకికసంస్కృతయుగము - క్రీ. పూ. ౨౦౦—క్రీ. ౨౦౦.

భాష్యయుగము - క్రీ. ౨౦౦—౧౫౦౦.

H. San. Leteratur Vol I. P. 17.

# తృతీయాధ్యాయము.

## భాష.

వైదికార్యులు వేదములోని శబ్దజాలమును, తాము నిత్యము వ్యవహరించుకొను శబ్దజాలము, నేపేరఁ బిలుచుచుండెడివా రనుప్రశ్నకు ఋగాది సంహితలలోనెట్టి సమాధానము కనరాదు గాని, పాణినీయ మిట్లుసమాధాన మిచ్చుచున్నది. అందు వైదికశబ్దములకు వేదము - ఛందస్సు - అనియు, లౌకిక శబ్దములకు లోకము - భాష - అనియు, సంజ్ఞలు కనవచ్చుచున్నవి. వైదికలౌకిక శబ్దములభేదము చూపించుసందర్భములందు 'ఛందసి - భాషాయామ్' అనుచుఁ బాణిన్యాచార్యులును, "ఛందసి - వేదే, భాషాయామ్ - లోకే, అనుచుఁ బతంజలిమునియు, ఇట్లే యాస్కాచార్యులును రెండువిధము లైనసంజ్ఞలు వాడి యున్నారు[1]. ఈసంజ్ఞలు శబ్దరాశిపరము లని యీక్రింది వ్యుత్పత్తులు చెప్పుచున్నవి.

విద జ్ఞానే - దేనిచే ధర్మాధర్మములు తెలిసికొనుచున్నారో, అది వేదము. చది ఆహ్లాదనే - నియమబద్ధ మైనయేది యాహ్లాదకర మగుచున్నదో, అది ఛందస్సు[2]. లోకృ దర్శనే, భాషార్థశ్చ - దేనిచే జనులు పరస్పరము సంభాషింతురో, అది లోకము. భాష వ్యక్తాయాంవాచి - దేనిచే జనులు పరస్పరాభిప్రాయములు స్పష్టపఱుచుకొందురో, అది భాష.

ప్రదీపోద్ద్యోతకర్త లగుకైయటనాగేశభట్టులు నీ సంజ్ఞలు శబ్దజాలపరము లనెడి భావము తెలిపియున్నారు. అయితే, ఇట్లు ఛందోవేదసంజ్ఞలచే విలసిల్లిన వైదికశబ్దరాశియు భాషాలోకసంజ్ఞలచే విలసిల్లినలౌకికశబ్దరాశియుఁ దొలుదొల్త నేకమా భిన్నమా ? అనువిషయ మిపు డాలోచింపవలసియున్నది. ఇందుకు మఱి కొంచెము వెనుకకు వెళ్లి చూతము.

వేదములోనివెక్కుశబ్దములను గ్రీకు లాటిన్ జర్మన్ ఫ్రెంచి లిథూని యన్ మొద లగు భాషలలోని వెక్కుశబ్దములు పోలి యున్న వనియు, పారశీకులజెండవెస్తాలోనిభాష ఋగ్వేదభాషకు మిక్కిలి దగ్గఱగా నున్న దనియు నార్యభాషాశబ్ద సాదృశ్యపరిశోధకులు నిర్ణయించి యున్నారు. సకార హకార భేదముతోను, ఈషద్వర్ణ భేదముతోను, వైదికశబ్దములును జెండవెస్తాశబ్దములు ననంఖ్యాకములు పోలుచున్నవి. కొన్నిటికి భేదమే కనఁబడదు. ఇందుకుఁగొన్ని:—

1. పాణిని - అష్టా. 1-2-61, 3-2-108, మహాభా. 1-1-1 నిరుక్త. 1-4-5, 1-2-5, 1-2-7,—2. ఛది సంవరణే- ?

సప్త - హప్త, సింధు - హిందు, అసుర - అహుర, మన్యన్తే - మైన్యన్తే, దేవ - దేవ, ఇంద్ర, - ఇంద్ర, ఇత్యాదులు. ఇఁక దీనికిని దక్కిన కొన్నిభాషల కునుగల పోలిక కుదాహరణములు కొన్ని:—

| సంస్కృ. | లాటిన్. | గ్రీకు. | జర్మన్. | ఇంగ్లీ. |
|---|---|---|---|---|
| అస్తి. | ఎస్త్. | ఎష్టి. | ఇష్ట్. | ఇజ్. |
| భరామి. | ఫెరో | ఫెరో | బైరా | బేర్ |
| ద్వా. | దువ్రో | దువ్రో | ప్వై | టూ |
| నౌః. | నావిస్ | నౌస్ | నో ? | ... |
| సప్త | సెప్తెమ్ | హెప్తె | సిబున్ | సెవెన్ |
| అగ్నిః | ఇగ్నిస్ | ... ... | ఓగ్ని | ... |
| మానవః | మెన్స్ | ... ... | మన్ | మేన్ |
| జానుః | గెనూ | గోనూ | క్నియూ | నీ |
| నవః | నోవుస్ | నోయ్ | న్యూఎ | న్యూ |
| నభః | నెబులా | నెఫోస్ | నెబులా | ... |
| జనః | గెనుస్ | గెనోస్ | జినస్ | ... |
| పితా | పాటెర్ | పాటెర్ | ఫాటెర్ | ఫాదర్ |
| మాతా | మాటెర్ | మాటెర్ | ముట్టెర్ | మదర్ |
| భ్రాతా | ఫ్రాటెర్ | ... ... | బ్రూడెర్ | బ్రదర్ |

చిన్నమార్పులతోడి యిట్టిపదము లనేకములు కలవు. ఇట్టిశబ్దసాదృశ్యముసుబట్టి హైందవార్యుల ప్రాచీనులు మున్నొకప్పు డున్నయేదో యొకచోటి నుండికాని, వారినుండికాని, గ్రీకు మొద లగుశాఖలవారు విడిపోయినపుడును, తరువాతఁ బారసీకులు విడిపోయినపుడును, వా రేభాష మాటలాడుచుండెడివారో దేశకాలపరిస్థితులనుబట్టి వెంపును మార్పును జెందినయాభాషలో సప్తసింధు దేశముఁ జొచ్చిన వారిసంతతివా రగువైదికార్యులు సూక్త మంత్రములను సందర్శింప నారంభించి రనియు, ఆభాషనే తొలుదొల్త నిత్యవ్యవహారమున నుపయోగించుచుండి రనియుఁ జెప్పవలసియున్నది. కాని, ఆస్థితిమాత్రము చిరకాలము నిలిచియున్న దనుటకు వీలు లేదు. ఏ మనఁగా ? సంఘము పెరుఁగుచున్నకొలఁదిని దేశము విస్తరించుచున్నకొలఁదిని నూతనవృత్తులు నవీనపదార్థములు వాని వివిధోపయోగములు నేర్పడుచున్నకొలఁదిని, అన్యజాతులతో సహవాసము గాని సంఘర్షణముగాని సంభవించుచున్నకొలఁదిని వాడుకలో నూతన శబ్దజాలము హెచ్చుటయుఁ బ్రాఁతశబ్దములు రూపమునందు నర్థమునందు మార్పు చెందుటయుఁ గొన్ని వ్యవహారమునుండి తొలఁగిపోవుటయు వ్యావహారికభాషలకైన జ మనుట మన కనుభవసిద్ధము, ప్రాచీనార్యులకాలమునఁ గూడ

వారి భాష కిట్టియవస్థ సంభవించిన దనుట యస్వాభావికము కాదు. అట్లు పెరిఁగి నట్టియు మాఱినట్టియు శబ్దజాతము ఛందస్సున కనుకూల మయిన యుదాత్త పావనరూపముతో వేదద్రష్టలవాక్కుల కెక్కి వేదమున స్థిరపడుటయు, అదియే జనసామాన్యమునోటఁ బడి మరలమరల మార్పు చెందుటయుఁ గారణములుగాఁ గ్రమముగా నచిరకాలముననే వైదికలౌకికశబ్దజాలము లించించుక వేఱుపడుచు వచ్చిన దనుట వాస్తవము. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు:—

౧. తొల్లి క్రమముగా వ్యవహారమందుండెడి 'దేవాసః - దేవాః, కర్ణేభిః - కర్ణైః, అస్మే - అస్మభ్యమ్, యుష్మే - యుష్మాను ఇత్యాదిద్విరూపములు వేదమున నిలిచినవి. వీనిలో మొదటిరూపములు లోకమున నడుగంటినవి.

౨. 'న' అనెడినిపాతము తొల్లి, ఉపమానార్థమును నిషేధార్థమును గూడఁ జెప్పుచుండెడిది. దీనియీయర్థములు రెండును వైదికమున నున్నవి. ఇందు మొదటియర్థము లౌకికమునఁ దొలఁగినది.

3. తొలుత వర్తమానాది కాలముల విధింపఁబడెడి దశవిధలకార ములలో లేట్ లకారమునకు సంబంధించిన 'ఈశై - పతాప - తారిషత్.' మొదలగురూపములు ఛందస్సులో నున్నవి. ఈలకారమే భాషనుండి జాఱి పోయినది.

౪. పూర్వము సాధారణముగా నొకలకారమునకు బదులుగా మఱి యొకలకారము ప్రయోగింపఁబడుచుండెడిది. లోడర్థమందు 'ఆగమత్' వర్త మానార్థమందు 'మమార' అనురీతి నుండెడి యీపద్ధతి వైదికిలోఁ గనవచ్చును. లౌకికిలోఁ గనరాదు.

౫. లిడ్వద్భావమందు "బభ్రిః-పపిః-దదిః" ఇత్యాదిరూపములు వైదికిలో నున్నవి. లౌకికిలో లేవు.

౬. మున్ను తుమర్థమందు ధాతువునకు 'సే-సేన్-అసే-అసేన్-' ఇత్యా దులు పదియేనుప్రత్యయములు చేరుచుండెడివి[1]. వీనితోను, తుమ్ప్రత్య యముతోను గూడినయట్టిరూపములు వేదములోఁ గనఁబడుచున్నవి. తుమ్ప్రత్య యాంతరూపములు మాత్రమే లోకమునఁ గనవచ్చుచున్నవి. తక్కినప్రత్యయ ములు పదియేనును గూడ నిందు లోపించినవి.

౭. "ఇవ-చిత్-ను-చ-అథాపి" అనునిపాతములు రెండింటియందును గలవు. కాని యివి తఱచుగా వేదమున నుపమార్థకములు గూడ నగును. ఇందు 'ఇవ' ఒక్కటియే లోకమున నుపమార్థక మగుచున్నది.

1. అష్టాధ్యాయి—3-4-9.

౮. వేదములోని వికరణములును లోకములోని వికరణములును, పరస్పర విరుద్ధములై పెక్కుచోట్లఁ గనవచ్చును. "భేదతి-భినత్తి," మరతే-మ్రియతే, నేషతు-నయతు, తరుషేమ-తరేమ" ఇత్యాదు లసంఖ్యాకములు కలవు. వైజంటలు సమానార్థకములు. ఈ ద్వివిధరూపములును వైదికిలో నున్నవి. రెండవ రూపములు మాత్రమే లౌకికిలో నున్నవి.

౯. ఈ రెంటిలోని శబ్దములను బోల్చి చూచినచో వర్ణలోప వర్ణాగమ వర్ణాదేశ వర్ణవ్యత్యయాదిరూపము లైనవికారములు గనిపించును. ఇందుకు గృభ్ణామి-గృహ్ణామి, జభార-జహార, హిరణ్యయేన-హిరణ్మయేన, పన్థాః-పన్థానః, వ్యోమన్-వ్యోమ్ని[1].

ఇత్యాదు లుదాహరణములు. వైజంట లన్నియు వేదమున నున్నవి. రెండవరూపములు మాత్రమే లోకమున నున్నవి. ఇట్టి వసంఖ్యాకములు కలవు. ఈ ప్రయోగభేదములనుబట్టి యార్యుల తొల్లిటి వ్యవహారమునందు వర్ణలోపాదుల రూపభేదము చెందుచు వచ్చినశబ్దము లన్నియు వేదమున కెక్కి యందు నిశ్చలములై నిలిచియున్నవనియు, వానిలోఁ గొన్నికొన్ని క్రమక్రమముగా వ్యవహార ప్రవాహమునఁ బడి కొట్టుకొనిపోయిన వనియుఁ దెలియకపోదు. అందు చేతనే యివి రెండును మొట్టమొదట నొక్కటై తరువాత రెండై కొంతకాలము దగ్గఱదగ్గఱగా వచ్చి తరువాత మెల్లగాఁ బరస్పరము దూరమై పిదపఁ బూర్తిగా విడిపోయిన వని చెప్పఁబడుచున్నది. అట్లు విస్పష్టముగా వేఱుపడినను, రెంటి యందు నేక మైనవర్ణసమామ్నాయమును శబ్దమూలములును బహుశబ్దరూపములును వీని ప్రాచీనైకత్వమును స్మృతికిఁ దెచ్చుచునే యున్నవి. అయిన నేమి? కాలక్రమమున లౌకికభాష యనేకాంతరములు దాఁటి వచ్చినకొలఁదిని దానిని సంపూర్ణముగా నెఱిఁగినవారి కైనను, శబ్దకఠిన మర్థగంభీరము పరుషోచ్చారణము విలక్షణనామక్రియాదిరూప మక్షరాక్షరస్వర ముదాత్తవేషము నైనవైదిక భాష తెలియరానిస్థితికి వచ్చుటయు, దాని నుభయభాషాభిజ్ఞు లగునైరుక్తులు వైయాకరణులు మొద లగువిద్వాంసులు విడఁగొట్టి యర్థము చెప్పవలసివచ్చుటయు సంభవించినది.

పైని వివరించినవిధముగా వైదికినుండి వేఱుపడిన లౌకికి క్రమముగా నియమహీన మగుచుండుట కనిపెట్టి కాశ్యప శాకల్య శాకటాయ నాదిమును లాయాకాలములందు దానిని యథోచితముగా సంస్కరించుచు వచ్చినట్లుగాఁ బాణినీయములోని వారిప్రశంసవల్లనే తెలియవచ్చుచున్నది. వారివ్యాకరణము లలో శాకటాయనునిశబ్దానుశాసనము సజీవమై యున్నట్లు తెలియుచున్నది.

1. పై తొమ్మిదింటిలోను గనవచ్చు వ్యాకరణసంజ్ఞలు తరువాత వైయాకరణులు కల్పించిన వనుట విదితము.

ఆవ్యాకరణము లసమగ్రము లగుటచేతనో మఱెందుచేతనో లౌకికి స్వేచ్ఛగా విజృంభించుటయు వికృతిశబ్దజాలము మఱొకభాషగా మాఱుచుండుటయుఁ, జూచి తరువాత నార్యభాషను జక్కఁగా శాసింపఁ బాణిన్యాచార్యులు పూను కొని రనుట విదితము. తరువాత వారి ననుసరించి వరరుచియు(కాత్యాయనుఁడు) పతంజలియు భాషను మిక్కిలి కట్టుదిట్టము చేసిరి. అట్లు శబ్దశాస్త్రక్రమము ననుసరించి సంస్కారము నొందుచు వచ్చినయార్యభాష సంస్కృతసంజ్ఞను దానివికృతశబ్దజాలము ప్రాకృతనామమును జెందినవి. భాషాపర మయిన యీ సంస్కృతశబ్దము పాణిన్యాచార్యులకు మున్నే పుట్టి నట్లుగా వాల్మీకిరామాయణ మున నొకయుదాహరణము కనఁబడుచున్నది[1]. వార్తికకారవరరుచికి సమ కాలికుఁడో పూర్వుఁడో యైనమఱియొకవరరుచి రచియించినప్రాకృతసూత్రము లలోఁ గనవచ్చుచున్నది[2]. ఈ ప్రాకృతవ్యాకరణ మైనను గ్రీ. పూ. ౫౦౦ సంవ త్సరములక్రిందటి దనుట స్పష్టము. ఇందు సంస్కృతమునుండి శౌరసేనీప్రాకృత మును దానినుండి పైశాచియుఁ బుట్టినట్లు చెప్పఁబడినది[3]. కాని పైశాచియే శౌరసేనికంటె ముందటి దని కొందఱి మతము. ఇట్లు తెలియవచ్చు సంస్కృత ప్రాకృతముల సంబంధమునుబట్టి పాణినికి మున్నే యార్యభాషనుండి వికృతిశబ్ద జాలము వెలువడి యొకదేశభాషగా మాఱెననియు నందుచేత నే సాంకర్యము గలుగకుండుట కదిసంస్కారార్హమై గాఢముగా సంస్కృత మైన దనియు వికృ తికిఁ బ్రకృతి యార్యభాష యనుటకు బదులుగా వరరుచ్యాదులు తమనాఁటికిఁ బ్రసిద్ధ మైన సంస్కృతసంజ్ఞను వాడి రనియు నిట్లు భాషాస్థానమునఁ బ్రవేశిం చిన సంస్కృతసంజ్ఞ సుప్రసిద్ధ మగుటచే సకలార్యవాఙ్మయమునకు సంస్కృత వాఙ్మయ మనెడి వ్యవహారము క్రమముగాఁ బ్రబలిన దనియుఁ దెలియనగును. ఇంతవఱకుఁ జేసిన పరిశీలనమునుబట్టి యార్యావర్తమునకు వచ్చినయార్యుల మాతృభాషయే వేదమునకును లోకమునకును మాతృక యనియు లోకము యొక్కకడపటి పరిణామమే సంస్కృత మనియు నదియే కాలక్రమమున దాని వికారము లయిన ప్రాకృతములకుఁ దల్లి యయ్యె ననియు విదిత మగుచున్నది. కాని యిక్కడ నొక్కమాట. లోక మొక్కటియే మాఱుచు రాలేదు. వేదమును గొంచెము కొంచెము మాఱుచునే వచ్చినది. మంత్రములందలి యుచ్చారణ కాఠిన్యమును శబ్దములబిగువును బ్రాహ్మణములం దించుక మందగించినవి. అందును వేదాంతములందు మఱియు సడలినవి. గ్రాంథికవ్యావహారిక భాషల

1. ధారయన్ బ్రాహ్మణం రూప మిల్వల స్సంస్కృతం వదన్. ఆమంత్రయతి విప్రాన్ స్మ. వా. రా. 3-11-57.

2. శౌరసేనీ-ప్రకృతి స్సంస్కృతమ్. 12-1-2.

3 పైశాచీ, ప్రకృతి శ్శౌరసేనీ. 10-1-2.

కుండఁదగినమర్యాద కనుగుణముగా లౌకిక భాషాధర్మములు వైదికభాషలో వ్యాపింపఁ జొచ్చిన వనుట కిదియే నిదర్శనము. ఇట్లు వాఙ్మయసాక్ష్యమునుబట్టి భాషాస్వరూపము తెలిసికొన్నట్లే లిపిస్వరూపమును గూడ నించుక తెలిసికొన యత్నింతము.

## ఆర్యలిపి.

ఇది యొక గొప్పవిషయము. హైందవార్యభాషకు లిపి యెపుడు పుట్టె నని పరిశీలింపఁ బాశ్చాత్యపరిశోధకులు కొందఱు పృథివి తలక్రిందు చేసి చూచి తుదకు, కొండ త్రవ్వి యెలుకను బట్టిన ట్లన్నసామెత సార్థకము కావించిరి. ఔను వేదములే మొన్నమొన్నటి వనువారికి లిపి నిన్నటిదిగాఁ గనఁబడుట యుక్తమే. భారతీయుల నాగరకత ప్రాచీన మనుట యిష్టము గానివారి కట్లే కనఁబడును. కనుక నట్టివారివ్రాఁతలను గణింప కుండుటయే యుచితము.

ఏదేశమం దైనను, ఏజాతి యైనను నాగరికతను జెందిన దన్నచో, అది లిపి యెఱుఁగు నని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అట్టియెడ జగత్తునందలి యితరజాతులు తమమానవత్వమును గుర్తించుకొనుట కెంతో ముందుగా జ్ఞాననేత్రమున వైదికసూక్తములు సందర్శించుచు ఖగోళవిజ్ఞానమున సూర్యచంద్రనక్షత్రాదులగతు లెఱుంగుచు, పక్షమాససంవత్సర దినములను గణించుచు, ఒకటి మొదలుగాఁ బరార్థమువఱకుఁ గలసంఖ్యలను లెక్కించుచు, కృషివాణిజ్యములు చేయుచు ననార్యులతోఁ బోరాడి వారి నణఁచుచు బహువిధ మైన యుత్తమలోకజ్ఞానమున నాగరికులై విలసిల్లిన వేదములనాఁటియార్యులు లిపియే యెఱుఁగరనుటకంటె హాస్యాస్పద మైనది వేఱుండదు. ఏచరిత్రాంశ మైనను నిర్ణయించుటకు వారికి ముందుగా శిలాతామ్రశాసనములో పత్రములో ప్రత్యక్షము కావలెను గాని యనుమానప్రమాణ మెంతబలవత్తర మైనను వారు నమ్మరు. పైగా విషయమునకు సంబంధించిన ప్రాచీనశబ్దములకుఁగూడఁ దమ వాదమున కనుకూల మైనయర్థము చెప్పుదురుగాని సరి యైనయర్థము చెప్పరు.

"సంస్కృతభాషలో మొదట లిపి యనుపదమే లేదు. అది క్రీస్తుపూర్వము డేరియ స్సనుపారసీకరాజు చెక్కించిన బేహిస్తూన్ శాసనములోని 'డిపి' యనుపదమునుండి వచ్చి లిపి యైనది. ఆపదముతోనే పురాతనపారశీకభాషలోని వ్రాఁతయక్షరములు గూడ హిందువులకు వచ్చిన'వని బర్నెల్ పండితుని యభిప్రాయము[1]. సంస్కృతములోనిలిపిశబ్దమే పారశీకమునకుఁ బోయి డిపి యైనదను కోసోవిజ్, స్పెగల్ పండితులమాటలుగూడ బర్నెలుగారికి నచ్చలేదు. ఋగ్వేదపరిశోధనమందును దానిముద్రణమందును దనవయ స్సంతయుఁ గడపిన

1. Burnell's South Indian Paleography. P. 6, 7.

మోక్షమూలరుపండితుఁడు "వైదికార్యులు లిపి యెఱుఁగరు. వారివేదములు ముఖస్థములే కాని గ్రంథస్థములు కావు. ఆకాలమున గురుముఖమునుండి శిష్యులు వేదమంత్రములు విని నేర్చుకొనుచుండెడివారు కావుననే వేదములకు శ్రుతు లనుపేరు వచ్చినది. నేఁడు గూడ వేదము ఘనాంతము కంఠపాఠముగా వచ్చినవారు కనఁబడుచుండఁగా, ఆ కాలమున వేదము కేవలము ముఖస్థముగానే పఠనపాఠన వ్యవహారమున నిలిచిన దనుట యబ్బురము కాదు. ఆకాలమున లిపియే యున్నయెడల దానియుపకరణములపేళ్లయిన వేదమున నుండకపోవు. నిజ మరయఁగా, లిపి సూత్రకాలమున వచ్చినదనఁ దగును గాని యవు డైన నది వాడుకలో లేదు." అని సిద్ధాంతీకరించి యున్నారు[1]. అచ్చుపుస్తకములు సిద్ధముగా నున్నయీకాలములోఁగూడ, బ్రాహ్మణులు గురుముఖమునుండి వినియే వేదము కంఠపాఠము చేయుచున్నా రని తెలిసియు, నిదే కారణముగాఁ బూర్వ కాలమున లిపి లే దనుటకు వీరెట్లు సాహసించిరో చెప్పఁజాలము. "క్రీస్తు పూర్వము నాల్గవశతాబ్దినుండి హిందువులు లిపి నెఱుఁగుదు"రని మేక్డోనలు పండితుఁడు, నియార్కసుమొద లగువారియూహలనుబట్టి వక్కాణించియున్నాడు[2]. "క్రీస్తుపూర్వ మెనిమిదవ శతాబ్దిలో వేదసంహితలు వ్రాఁతలో నుండవచ్చు" నని మాక్సుడంకరు చెప్పియున్నాఁడు[3]. గోల్డుస్టక్కరు' పండితుఁడు, తన 'పాణిని'పీఠికలో, 'పాణిని క్రీస్తుపూర్వ మష్టమశతాబ్దిలోనుండెను. అతఁడు లిపి నెఱుఁగును. కావున నది క్రీ. పూ. వెయ్యి సంవత్సరములనాఁడే వెలసియుండును, అని వ్రాసియున్నాఁడు[4]. ఇంక నెందఱో యెన్నివిధములనో యిట్లే యభిప్రాయము లిచ్చియున్నారు. ఇట్టి యభిప్రాయములు చూచియే కొమరరాజులక్ష్మణరావుగా రతిరములనెకి వ్యాసమున లిపినిగూర్చి సవిస్తరముగాఁ జర్చించి సిద్ధాంతీకరించి యున్నారు[5]. ఆవ్యాస మాంధ్రలోకమునకు విదితమే కావున మనము విశేష ముగాఁ జర్చింపక లిపిసిద్ధాన్తసారము మాత్రము గ్రహింతము.

క్రీస్తుపూర్వము ౨౭౮—౨౩౨ నడుమఁ బాటలీపుత్రము రాజధానిగా హిందూదేశ మేలినయశోకచక్రవర్తి దేశమంతటను ధర్మశాసనములు స్థాపింపఁ జేసె ననియు, వానిలో హిందూదేశవాయవ్య భాగమందలి పొలిమేరలలోని శాసనములలిపి యపసవ్యముగా నుండి ఖరోష్ఠి యనఁబడుచున్న దనియు, తక్కిన దేశమంతట నున్నశాసనములలోనిలిపి సవ్యముగా నుండి బ్రాహ్మియనుపేరఁ

1. Ancient Sanskrit Literature.
2. History of Sanskrit Literature P. 19.
3. History of Antiquity.
4. Introduction to Panini.
5. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. ౨, సంపుటము.

బిలువఁబడుచున్న దనియు విదితమే కావునఁ బరిశోధకు లాదఱు నీలిపికాల మంగీకరింపక తప్పినదిగాదు. అశోకునిశాసనములకు ధర్మలిపు లని పేరు. దేశమందలి యెల్లజనులును మతధర్మములు తెలిసికొనుట కాశాసనము లేర్ప డిన వనుట సమంజసము కావున నప్పటికి దేశమున లిపి వ్యాపించిన దని చెప్పవచ్చును. మనుమనికాలములో లిపి యిట్లు ప్రబలియుండఁ బితామహుని కాలములో లిపి యనుమాటయే లేదనుట యెట్టిసాహసమో చెప్పఁజాలము. అశోకునితండ్రి బిందుసారుఁడు. అతఁడు క్రీ. పూ. ౨౯౭ - ౨౭౨ నడుమ రాజ్యముచేసెను. అతనితండ్రి చంద్రగుప్తుఁడు క్రీ. పూ. ౩౨౧ - ౨౯౭ నడుమ హిందూదేశ మేలినవాఁడు. అతనికిఁ బూర్వము కడపటినందరాజు రాజ్యము చేయుచుండఁగా గ్రీకురా జైనయలగ్జాండరు హిందూదేశము మీఁదికి దండెత్తి వచ్చి వాయవ్యభాగము కొంత వశపఱుచుకొని పోయెను. అతనితో హిందూదేశమునకు వచ్చినసేనానాయకుఁ డగు 'నియార్కు' స్సనువాఁ డును, కడపటినందుని జంపి చక్రవర్తి యైన చంద్రగుప్తునివద్దకు సెల్యూకస్సను గ్రీకురాజుచే రాయబారిగాఁ బంపఁబడిన మెగస్థనీ సనువాఁడును, హిందువులు లిపి యెఱుఁగరని వ్రాసినట్లుగాఁ బాశ్చాత్యులు కొంద ఱభిప్రాయ పడిరిగాని వారి యభిప్రాయము లసత్యము లని మెగస్థనీసు వ్రాఁతవల్లనే స్పష్టపడినది. అతఁడు, హిందూదేశమున బాటలప్రక్క దూరము తెలుపుగుర్తులును మకాములు తెలుపుగుర్తులును గల ఱాళ్లు పాతఁబడి యుండెననియు, చంద్రగుప్తునికిఁ బూర్వము ౬౪౫౧ సంవత్సరములు రాజ్యము చేసినమాటయేఁబది ముగ్గురు రాజులపేళ్లను దెలుపుపట్టిక యొకటి చంద్రగుప్తసంస్థానమున నేను జూచితి ననియు వ్రాసిన మాటలు బయలుపడినపిదప వారి యభిప్రాయము లబద్ధములు గాక మఱేమగును? లిపి లేకయే రాజులనామములు పట్టికలో నుండెనా? అంకెలు లేకయే పురాతన రాజుల రాజ్యకాలములు తెలుపఁబడెనా? అక్షరములు లేకయే మజిలీలపేళ్లు రాళ్లమీఁదఁ జెక్కఁబడెనా? ఇది యిట్లుండ నిండు. శాసనమే కావలె నంటే పిప్రవాశాసనముకంటెఁ బురాతన మైనది యింతవఱకుఁ గనరాదు. దానిని గూర్చియు మనవారికిని దెల్లవారికిని భేదాభిప్రాయములు కలవు. అది యొక వృత్పాత్రము. బుద్ధుని గోత్రమువా రయినశాక్యు లతనియస్థు లాపాత్రములోఁ బెట్టి పాఁతిపెట్టిన విషయము ప్రాచీన పాలీభాషలో దానిమీఁదఁ జెక్కఁబడి యున్నది. ఈవిషయము బుద్ధుని మరణకాలమునాఁటిదే కాని, యీశాసనము మాత్రము తరువాతిదే యని కొందఱు. ఆశాసనభాష ప్రాచీనము గావున శాసనము గూడఁ బ్రాచీనమే యని కొందఱు. శాసనభాషనుబట్టి యీశాసనము బుద్ధుని నిర్వాణకాలమునాఁటిదే యన్నచో, లిపి క్రీ. పూ. ౫౦౦ వఱకును,

అప్పటికి శాసనలేఖనాచార ముండుటంబట్టి యింకను వెనుకకును బోవును. ఇందు కింక గ్రంథములే శరణము.

అశోకునికాలమునఁ బుట్టిన లలితవిస్తర మనుబౌద్ధమతగ్రంథ మొకటి ప్రసిద్ధి కెక్కి యున్నది. అందు బుద్ధుని చరిత్ర వర్ణింపఁబడియున్నది. దానిలో బుద్ధుఁడు, బ్రాహ్మి-ఖరోష్ఠి-పుష్కరసారి-అంగలిపి-మగధలిపి-దేవలిపి-నాగలిపి-మధ్యాక్షరవిస్తరలిపి-సంఖ్యాలిపి-వాయాణలిపి - దక్షిణలిపి - బ్రహ్మవల్లీలిపి-మనుష్యలిపి-ఉత్తరకురుద్వీపలిపి-పూర్వవిదేహలిపి-అపరగౌడాదిలిపి-పాదలిఖితలిపి - అనులోమలిపి-అంగుళీయలిపి-లేఖప్రతిలేఖలిపి-మొదలుగా నఱువదినాలుగు లిపు లెఱింగినట్లు వర్ణింపఁబడినది. ఇందు కొన్ని వర్ణముల వ్రాతను దెలుపునవిగాను మఱికొన్ని చిత్రలిపులుగాను గనవచ్చుచున్నవి. ఇన్నిలిపులు బుద్ధుఁ డెఱుఁగునా యనునది వేఱువిషయము. ఇన్నిలిపుల నాకాలమున లలితవిస్తర కర్త యెట్లు పేర్కొనె ననుటయే మన కిపుడు కావలెను. అందుకుఁ బ్రాచీన మైనలిపిసంప్రదాయ మొకటి లిపికారపరం పరాయత్తమై వచ్చుచుండెడి దని చెప్పవలసినదే. అంతకు మున్నెన్ని వేలయేండ్లనుండియో వివిధరూపముల విస్తరించుచు వచ్చినందుననే యట్టి లిపి సంప్రదాయ మానాఁటికి వెల్లివిరిసె నని యూహింపవలసినదే. ఈయూహ యెట్లు స్థిరపడునో చూతము.

పాణినికాలమును గొందఱు ముందుకు లాగఁజూచిరి కాని, అది తప్పక యష్టమశతాబ్దియేయని జర్మనీపండితుఁడగు గోల్డుస్టక్కరు నిర్ణయించియున్నాఁడని యింతకుఁ బూర్వమే చదివి యున్నాము. పాణిని 'దివావిభానిశేత్యాది సూత్రములో' లిపి-లిబి-శబ్దములను బేర్కొని, లిపికర లిబికర రూపములను శాసించెను[1]. దానినిబట్టి పాణినికాలమున లిపి వ్యాప్తి చెంది యుండె నని చెప్ప వచ్చునుగదా! కాని లిపికరశబ్దమునకు శిలలమీఁద శాసనములు చెక్కువాఁడని మాక్సుముల్ల రర్థము చెప్పెను. అనఁగాఁ బత్రములమీఁద నక్షరములు వ్రాసెడి యాచార మాకాలమున లే దని యతని యభిప్రాయము. ఈయభిప్రాయ మెట్లు సముచిత మగునో చర్చింతము.

"లిప ఉపదేహే. లిప్యతేఽనయా పత్ర మితి లిపిః, లిపిం కరోతీతి లిపికారః, లిఖ అక్షరవిన్యాసే. లిఖ తీతి లేఖకః" అని, ధాత్వర్థములనుబట్టి రెంటికిని భేదము గనవచ్చుచున్నను, లిపికారలేఖక శబ్దములు సమానార్థకములే యని యంగీకరింతము. అమరసింహుఁడును వీనిని బర్యాయపదములనుగానే పేర్కొని యున్నాఁడు[2]. అశోకుని శాసనములకు ధర్మలిపు లనుపేరును గనఁబడుచున్నది. ఇదంతయు సత్యమే కాని శిలాశాసనములు చెక్కుటకు, ఉలి మొద లగునుప

1. అష్టాధ్యాయి. 3-2-21.
2. లిపికారో ఽక్షరచణో ఽక్షరచుంచు శ్చలేఖకే.

కరణములు నిర్మించుకొన్న యానాఁటివారు తాటాకుమీఁదనో భూర్జత్వక్కుల మీఁదనో యక్షరవిన్యాస మొనర్ప గంటమువంటి యుపకరణము నిర్మించుకొన కుందురా? శిలాశాసనలేఖనము లిపి కావచ్చునుగాని పత్రలేఖనము లిపి కా దని యెక్కడ నున్నది? ఏరంగులోనో వ్రాయఁబడినదియు లిపి యగునని లిపిధాత్వర్థమువలనఁ దెలియుచున్నదిగదా! లిప లిఖ ధాతువులయర్థము విచారించినచో, పత్త్రాదులమీఁది యక్షరవిన్యాసము లిపి యనియు, శిలాదులమీఁది యక్షరవిన్యాసము లేఖన మనియు, పాణినికాలమున వాడఁబడుచుండె ననితోఁచకపోదు. తరువాత నివి రెండును సమానార్థకములుగా వాడఁబడుటచే నిఘంటుకారులు వీనిని బర్యాయపదములనుగాఁ జేసియుందురు. అంతమాత్రమునఁ బత్రలిపి పాణినికాలమున లే దనరాదు. ఇందుకు మఱియొక నిదర్శనము.

ఇంద్రవరుణేత్యాది సూత్రమునఁ బాణిన్యాచార్యులు యవనానీశబ్దమును శాసించిరి[1]. అది లిప్యర్థక మనెడివారి యభిప్రాయమును 'యవనాల్లిప్యామ్' అనువార్తికమునఁ గాత్యాయనులు వివరించిరి. 'యవనయవాల్లిపిదుష్టే[2]'. అనెడి శాకటాయనవ్యాకరణసూత్రమును జూచియే పాణిన్యాచార్యులు యవనానీరూపమును దమసూత్రమున శాసించి రనుట స్పష్టము. దీనివలనఁ బాణినికాలమందే కాదు, అతనికిఁ బూర్వుఁ డయినశాకటాయనునికాలమందుగూడ లిపి వాడుకలో నున్నదనియు, నాఁటియార్యులు తమలిపినే కాక, క్రొత్త దైనయవనలిపిని గూడ నెఱుఁగుదు రనియుఁ దెలియుచున్నది[3].

వేదములలో లిపిశబ్దము లేదు గాని, అక్షర-వర్ణ-శబ్దములు తఱచుగాఁ గనవచ్చును[4]. ఈ రెండును ధ్వన్యాత్మకములుగాఁ గనఁబడవచ్చును గాని, వర్ణధాత్వర్థమును వర్ణశబ్దార్థమును బరిశీలించినచో వేదకాలమున లిపి యున్న దనుట కవకాశ మధికముగాఁ గనఁబడకపోదు. పాణినీయధాతుపాఠమందు, వర్ణధాతువునకు వర్ణక్రియ, విస్తారము, గుణవచనము, అని మూఁ డర్థములు కలవు[5]. వర్ణశబ్ద మీయర్థములను బోధించుచు సర్వవాఙ్మయమందు వ్యాపించినది. ఈధా

1. ఇంద్ర.వరుణ భవ శర్వ రుద్ర మృడ హిమారణ్య యవ యువన మాతులాచార్యాణామానుక్. 4-1-49.

2. శాక. వ్యా. 1-3-56 (తంత్రవార్తికమునుండి).

3. ఇది, పాణిని కంతో తరువాత వచ్చిన గ్రీకులలిపి కాదు. ప్రాచీన మైనకీలలిపి యని లిపిశోధకుల యభిప్రాయ మఁట.

4. ద్వయో రసుష్టుభో శ్చతుష్షష్టి రక్షరాణి. తేభ్య స్త్రియో వర్ణా అజాయంత. ఐ. బ్రా. 15. ఓంకారం పృచ్ఛామః. కోధాతుః...కత్యక్షరః కతివర్ణః ఇత్యాది. గో. బ్రా. 1-24. ద్విపదా చతుష్పదాక్షరేణ మిమతే సప్తవాణీః. ఋ. 1-164-24.

5. వర్ణ వర్ణక్రియా విస్తారగుణవచనేషు. చురాదు.

త్వర్థములను బట్టియే, అమరసింహాదులు, వర్ణశబ్దము ద్విజాతులను-శుక్లాదులను-స్తుతిని-అక్షరమును; తాలవిశేషమును-బ్రహ్మచర్యమును-విశేషణమును-విలేపనమును-కథను-చెప్పు నని తెలిపి యున్నారు[1]. మఱియు బ్రాహ్మణాదిజాతులను జెప్పువర్ణశబ్దమునకు, కపిలారుణపీత కృష్ణవర్ణములచే నిరూపింపఁబడునవి వర్ణములు (జాతులు) అని వ్యాఖ్యాత లర్థము వ్రాసి యున్నారు[2]. ఈ యర్థమునకుఁ బ్రమాణ మైనవిష్ణుపురాణవచన మిట్లున్నది.

"కపిలా శ్చారుణాః పీతాః కృష్ణా శ్చేతి పృథక్ పృథక్

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా శ్చేతి వివక్షితాః".

ఇట్లున్నవర్ణధాత్వర్థవివరణమును వర్ణశబ్దార్థవైవిధ్యమును బట్టి చూడఁగా కపిలాదికములయిన రంగులనుబట్టి బ్రాహ్మణాదిజాతులకు వర్ణము లను పేరు వచ్చి నట్లే, నీలారుణాదికములయిన రంగులతో వ్రాయుటనుబట్టి యక్షరములకు వర్ణము లనుపేరు వచ్చి యుండుననని చెప్పనచ్చును. ఒక జాతిపలకమీఁద జాతి ముక్కతో వ్రాసినపు డక్షరములు తెల్లగానుండును. లేక పసరుతోఁగాని మషితోఁగాని భూర్జపత్రములమీఁద వ్రాసినచో నవి పచ్చగానో నల్లగానో యుండును, లేక బొగ్గుతో భూమిమీఁద వ్రాసినచో నల్లగానుండును. అట్టి యక్షరము లన్నియు నానారంగులనుబట్టి వర్ణము లగుచున్నవి. ఋషులు తా ముచ్చరించునట్టి స్వరవ్యంజనముల కిట్టిరూపకల్పనము చేసికొని యుందు రని యూహించుట యొకగొప్పగాదు. మహిత విజ్ఞానసంపన్ను లగువారిమహాప్రతిభ కక్షరరూపకల్పనరూపమైనలిపి గోచరింప లే దనుట వింత గాని, యతిమానవము లైనమంత్ర బ్రాహ్మణములను గనిపెట్టినవారు లిపిని గనిపెట్టి రనుట యొకవింత గాదు. ఇందుకు మఱియొక నిదర్శనము.

ఋగ్వేదాదులందు గనవచ్చు ఖగోళవిశేషవర్ణనములే తరువాతిజ్యోతిశ్శాస్త్రవిజృంభణమునకు బీజ మనుట నిర్వివాదము. ఆనాఁడు వా రేవయిన నుపకరణములు నిర్మించుకొనియే ఖగోళము పరిశోధించినా రేమో చెప్పఁజాలము గాని, యిప్పటివా రందు కుపయోగించు వివిధోపకరణములకంటెను సునిశితమైనజ్ఞానదృష్టియుఁ బ్రతిభావిశేషమును వారి పరమోపకరణము లని మాత్రము విస్పష్టముగాఁ జెప్పఁగలము.

వేదములం గనవచ్చు జ్యోతిశ్శాస్త్రసంబంధ మయిన విజ్ఞానము క్రీ. పూ. ౨౭౮౦-౧౮౨౦ మధ్యకాలమును దెలుపుచున్నదని (Weber) వీబరు పండి

1. వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ స్తుతౌ వర్ణంతు వా౽క్షరే. అమరకోశము. వర్ణ స్తాల విశేషే స్యాద్బ్రహ్మచర్యే విశేషణే విలేపనే-కథాయాంచ.

2. వర్ణ్యంతే కపిలారుణపీత కృష్ణవర్ణై ర్నిరూప్యంత ఇతి వర్ణాః.

తుఁడు సూచించెను[1]. మృగశీర్ష ప్రథమనక్షత్రముగా గణింపఁబడిన కాలమును వైదికార్యులు వేదములందు సూచించియున్నారని యింతకుఁ బూర్వము చదివియే యున్నాము. అట్లే నక్షత్రగతులు మేషాదిరాసులగతులు దినమాస సంవత్సరముల పరిమితులు వారు చక్కఁగా నెఱుఁగుదు రనుట కన్ని సంహితా బ్రాహ్మణములలోను బహుప్రమాణములు గనవచ్చును గావున గ్రంథవిస్తరము గాకుండఁ బ్రకృతవిషయమును బలపఱుటకై వారిజ్యోతిశ్శాస్త్ర విజ్ఞానమును దెలుపునట్టి యొక్కవిషయ ముదాహరించెదను.

జ్యోతిర్విజ్ఞానము—లిపి.

శుక్లపక్షప్రతిపత్తు మొదలుగా, అమావాస్యాన్తము చాంద్రమాస మగును. ఇందు ముప్పదితిథు లుండును. సూర్యోదయము మొదలుగా మరల సూర్యోదయమువఱకు నొకదినము. అట్టిదినములు ముప్పది సవనమాస మగును. కాని చాంద్రమాసతిథులు చంద్రగతిని బట్టి యించుక తగ్గుచువచ్చుటచే సవనమాసదినములతో సరిచూచునపుడు సంవత్సరమున కాఱుదినములు తగ్గును. అనఁగా సంవత్సరమునకుఁ జాంద్రమానమునుబట్టి 3౫౪ దినములు. సావన మానమునుబట్టి 3౬౦ దినములు, పూర్వకాలమందు వైదికార్యు లీయాఱుదినముల భేదము కనిపెట్టి సావనమానమును చాంద్రమానమును సరిపుచ్చుకొనుటకై యజ్ఞకర్మలయం దాదినము లుత్సృజ్యము లని చేసిన నిర్ణయమును, అం దేదినములుత్సృజ్యము లని చేసినవిచారణయు, తైత్తిరీయ సంహితలోఁ గనవచ్చుచున్నవి[2]. మఱియు సూర్యుఁ డొక నక్షత్రమునద్దనుండి బయలుదేఱి తిరిగి యానక్షత్రమువద్దకు వచ్చునప్పటికి 3౬౬ దినములు పట్టును. సూర్యగతిని బట్టి యేర్పడుదీనినే సౌరమాన సంవత్సర మందురు. దీనికిని, చాంద్రమాన సంవత్సరమునకును ౧౨ దినముల భేద మున్నది. ఈ భేదమును బూర్వులు కనిపెట్టి, వార్షికసత్రముచేయు సందర్భమునం దీపండ్రెండుదినములు చేయవలసిన యజ్ఞోపక్రమణ పూర్వకర్మలు కొన్ని నిర్ణయించుకొన్నట్లుగా సంహితా బ్రాహ్మణములందు గనవచ్చుచున్నది[3].

---

1. See History of Indian Literature P. 2. Note. 2.

2. "షడ్భిర్మాసా న్త్సంపాద్యాహ రుత్సృజన్తి షడ్భిర్హి మాసా న్త్సంపశ్యన్తి। అర్ధమాసై ర్మాసా న్త్సంపాద్యాహ రుత్సృజన్తి." ఇత్యాది. 7-5-6-1. "ఉత్సృజ్యాం 3 నోత్సృజ్యా 3 మితి మీమాగ్ంసన్తే బ్రహ్మవాదిన స్తద్వాహు రుత్సృజ్య మే వేతి- ఇత్యాది. 7-5-7-1.

3. "వేదమాసో ధృతవ్రతో ద్వాదశప్రజావతః వేదాయ ఉపజాయతే. తై. 1-25-8 "యది సంవత్సరే నాఽఽదధ్యాత్, ద్వాదశ్యాం పురస్తాదాదధ్యాత్, సంవత్సరప్రతిమా వై ద్వాదశ రాత్రయః, సంవత్సర మే వాస్యాఽఽహితా భవన్తి." తై. బ్రా. 1-1-9-10.

ఇట్లు కలాకాష్ఠాదిపరిమాణములలో నిసుమంతయైన భేదము రాకుండ దినపక్షమాస సంవత్సరములు నిర్ణయించుటకును, త్రివిధములైన సంవత్సరభేదములు కనిపెట్టుటకును సూర్యచంద్రనక్షత్రగతిప్రమాణములు తెలిసికొనుటకును ముందుగా వారు గణిత మెఱింగియుండవలెనుగదా! ఆగణితము నాలుగు నోటిమాటలతోఁ దీఱునా? వందలు వేలు లక్షలు కోట్లు మొదలగుసంఖ్యలు కలుపవలెను, తీసివేయవలెను గుణించవలెను భాగించవలెను. ఈపనులన్నియు నంకెలు వ్రాయుట తెలియకయే చేసియుందురనుట భావ్యమా? తైత్తిరీయ బ్రాహ్మణములోఁ బేర్కొనఁబడిన సంఖ్యలమొత్తము పరమేశ్వరుఁడైనను పలకమీఁద వేయవలసినదే కాని నోటితోఁ జెప్పఁగలఁడా? పది వంద వేయి పదివేలు మొదలగుమొత్తములను బది పెట్టి గుణించుచుఁ బోఁగా వచ్చిన మొత్తములు పరార్థము వఱకు ననేకములు కలవు[1]. తలంచుటకైనను శక్యము గాని యాపెద్ద మొత్తములను చేతిమీఁదనైన వేయకుండ నోటితోఁ జెప్పుట సాధ్యమా? పత్త్రాదులపై నంకెలు వ్రాయ నేర్చినవారా మొత్తముల వివరముల నక్షరములతో వ్రాయ నేర్చియుండరా? కావునఁ బ్రాచీనశాసనములు లేనంతమాత్రమున హిందువులు లిపి యెఱుఁగరనివాదించెడి పాశ్చాత్యులమాట గణనీయము కాదనియు, వేదములనాఁడే యార్యులు లిపి యెఱుఁగుదురనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

మనపురాణగాథలన్నిటియందు నేదో యొకవిధమయిన సత్యార్థము మఱుఁగుపడియున్నదని నమ్మినచో వేదాపహారణగాథ కూడ నీవిషయమునఁ దోడ్పడఁగలదు. బ్రహ్మ నిద్రించుచుండఁగా సోమకుఁడు లేక హయగ్రీవుఁ డను నసురుఁడు వేద మపహరించె నని యుం దున్నది. ఆదొంగిలించిన వేదము బ్రహ్మ నోటిలోని మంత్రము లనుటకు వీలులేదు. అది లిఖితవేదపుస్తక మయి యుండవలెను. లేకున్న దొంగిలించుకొని పాఱిపోవుట యెట్లు సంభవించును? ఇఁక నీకథకు సంబంధించిన పాత్రలందుమా, బ్రహ్మ, అతనిపుత్త్రుఁడు రక్షోహాణుఁడు, విష్ణువు, కృష్ణుఁడు, అను పేళ్లుగలఋషులు. వీరు ఋగ్వేదసూక్తద్రష్టలలోఁ జేరియున్నారు. ఆర్యులకు శత్త్రువులయిన యసురుల ఘోరకృత్యము లనేకములు ఋగ్వేదమున వర్ణింపఁబడి యున్నవి. ఇఁక సమన్వయము-బ్రహ్మర్షిగారి వేదపుస్తకము నొకయసురుఁ డపహరించెను. రక్షోహాణుఁడో విష్ణువో వానిని గొట్టి మరల నాపుస్తకమును దెచ్చెను. ఇదియే తరువాతఁ జిరకాలమునకు వేదమహత్త్వమును విష్ణుని వేదరక్షణపరాయణత్వమును దెల్పెడి భగవత్కథగా మాఱి

1. శతాయ స్వాహా సహస్రాయ స్వాహా ఽయుతాయ స్వాహా నియుతాయ స్వాహా ప్రయుతాయస్వాహా, ఽర్బుదాయ స్వాహా న్యర్బుదాయ స్వాహా సముద్రాయస్వాహా మధ్యాయ స్వాహా ఽన్తాయ స్వాహా పరార్ధాయ స్వాహా-తై. సం. 7-1-20.

నది. ఇం దసంభావ్య మే మున్నది? కావున నీ కథచేఁ గూడ వైదికార్యులకాల మున లిపి యున్న దనుట స్పష్టము. ఇఁక నాలిపి యే దందుమా, అశోకునినాఁటి దియు లలితవిస్తరమునఁ బేర్కొనఁబడిన లిపులలో మొదటిదియు నగుబ్రాహ్మీ లిపికి మాతృకమైన లిపి యని చెప్పవచ్చును. ఇంతకంటె దాని నిజస్థితి తెలిసి కొనఁ జాలము. కాని యిప్పటిసిరావంటిమషితో నక్షరములు వ్రాసెడియాచా రము మాత్రము బుద్ధమునినాఁటికే వచ్చి యుండు నని, యతని ఖననస్థాన మందలి గోడమీఁదఁ గనవచ్చు మషీలిఖితాక్షర పంక్తులనుబట్టి కనిపెట్టి యున్నారు. ఇంతకంటెఁ బ్రమాణ మేమి కావలెను? అయిన నింతకుఁ జేసిన చర్చను మఱింత బలపఱుచునట్టి నవీనపరిశోధన నించుక యుదాహరింతము.

సింధుదేశమున లార్కానాజిల్లాలో లార్కానానగరమునకు ౨౫ మైళ్ల దూరమున 'మహింజోదారో'[1] యను ప్రదేశము గలదు. అది పాడుపడిన ప్రాచీన పురప్రదేశము. అది త్రవ్వఁగా బౌద్ధస్తూపాదులు బయటఁబడినవి. ఆస్థలము త్రవ్వఁగా దానిక్రింద మఱియొక నష్టపురమునకు సంబంధించిన చిహ్నములు కనవచ్చినవి. అట్లు క్రిందికిఁ ద్రవ్వుకొనుచుఁ బోఁగాఁ బోఁగా నొకదానిక్రింద నొకటిగాఁ బాడుపడిన పురప్రదేశములు మఱియైదు కనఁబడినవి. మొత్త మీ యేడు నష్టపుర ప్రదేశములలో నొకదానికిని మఱియొక దానికిని గలమధ్యకాల మెంత తక్కువగాఁ జూచినను, అయిదువందల సంవత్సరము లనుకొనవచ్చు ననియు, అట్లు లెక్కింపఁగా వానికాలపరిమితి ౩౫౦౦ సంవత్సరములగు ననియు, ఆప్రదేశములలో దొరకినపెంకులు కుండలు మొద లగువాని మీఁది ముద్రలు, క్రీస్తుపూర్వము మూఁడువేల సంవత్సరముల క్రిందటివిగాఁ బరిశోధకులు నిర్ణయిం చిన ఈలం-మెసపొటోమియాలలోని ముద్రలను బోలియున్న వనియు, కావునఁ జిత్రలిపి యాకృతిగల యీ ముద్రలు క్రీస్తుపూర్వము మూఁడువేల సంవత్సర ములపై కాలములోనివై యుండు ననియు, తద్వస్తు పరిశోధనము నొకగ్రంథ ముగాఁ బ్రకటించిన సర్ జాన్ మార్షల్ దొరగారు వ్రాయుచున్నారు. ఆముద్రల మీఁదిలిపి కుడివైపునుండి యెడమవైపునకుఁ జదువఁ దగినదిగా నున్నది. అందలి కొన్ని యక్షరములు బ్రాహ్మీలిపిలోనివానికిఁ బ్రకృతు లనఁదగి యున్నవి. ఆ పురము లార్యులవా? లేక యనార్యులవా? ఈలిపి వీరిదా? వారిదా? అనువిషయము లింకను సందిగ్ధములు గానే యున్నవి గాని, యెట్లయిన నతి ప్రాచీన మైనయీవిష యముగూడ సింధునదీ ప్రాంతమునఁ గ్రీస్తుపూర్వము మూఁడువేలయేండ్లక్రిందట నొకలిపి కల దని చెప్పుటకుఁ బ్రబలప్రమాణము కాకపోదు. ఇంక—

1. Mahinjo-daro, and the Indus civilisation. Vol. I. 1931.

## ఆర్యభాష-వ్యావహారికస్థితి.

వేదముతో విడిపోక ము న్నేది యార్యవ్యవహారమం దుండెనో, అదియే దానితో విడిపోయినపిదప లోకము లేక భాష యనుపేర వాడుకలో నుండె ననియు, అదియే క్రమముగా సంస్కృతసంజ్ఞ చెందిన దనియు నింతకుమున్ను తెలిసికొనియున్నాము. ఆ యభిప్రాయమునే మఱికొంత దృఢపఱుచుకొందము.

పాణిన్యాచార్యులకుఁ బూర్వమునుండియుఁ బామరులయుచ్చారణమున వైకల్యము నొందినయార్యభాషాశబ్దజాలము కొంత వికృతరూపమున దేశమందు వ్యాపించుచు వచ్చిన దనుట సత్యమేకాని, అతనినాఁటికే కాదు, పతంజలిముని నాఁటికిఁ గూడ నార్యభాష యుత్తమజాతులవాడుకలో నున్నదనుటకావంతయు సందేహములేదు. ఇందుకుఁ బూర్వలక్షణ గ్రంథములే యేకగ్రీవముగా సాక్ష్య మిచ్చుచున్న ట్లింతకుఁ బూర్వమే యెఱిఁగియున్నాము. మఱియు:—

దేశభేదమునుబట్టి వచ్చినలౌకికశబ్దభేదములకు'ఉదీచామ్',ప్రాచామ్' అనుచుఁ బాణిన్యాచార్యు లనుశాసనము గావించి యున్నారు[1]. ఉదా.—హారిషేణిః హారిషేణ్యః.—ఆమ్రగుప్తాయనిః-ఆమ్రగుప్తిః, ఇత్యాదులు. ఈజంటలలో మొదటి రూపము లుదీచ్యు లుచ్చరించునవి. రెండవరూపములు ప్రాచ్యులు పలుకునవి. ఇట్లే పాణినీయాష్టాధ్యాయికి లొంగని బహుశబ్దములు వాడుకలోఁ దనకుఁ గనవచ్చుటంజేసి కాత్యాయను లనేకవార్తికములు కల్పించి వాని కనుశాసనము గావించియున్నారు[2]. ఉదా.—పద్మనాభః-పఞ్చనదమ్-సప్తగోదావరమ్-క్షీరోదః-వధూటీ-వార్ధకమ్-ఇత్యాదులు-ఇట్లు వేలకొలఁదిలౌకికశబ్దములకు వార్తికములు గతి కలిగించినవి. ఇట్లే భగవత్పతంజలి పెక్కులౌకిక ప్రయోగముల విచారణ కావించుటయే కాక, ఉదీచ్యప్రాచ్య దాక్షిణాత్యదక్షిణాపథభేదముతో బహుశబ్దముల యర్థభేదములను రూపభేదములను గూడఁ జేర్కొనుచు, ఆర్యులవాడుకను జూపుచు ననేకస్థలముల లౌకికశబ్దప్రసంగము గావించియున్నారు[3]. ఉదా.—వేదే లోకే యని ప్రయోగింపఁ దగియుండ దాక్షిణాత్యులు వైదికేషు లౌకికేషు, అని ప్రయోగింతురు. దక్షిణాపథమందు గొప్పసరస్సును 'సరసీ'యని వ్యవ

1. నేనాన్తలక్షణకారిభ్యశ్చ. 4-1-152, ఉదీచామిఞ్. 4-1-153. ఉదీచాం వృద్ధాదగోత్రాత్. 4-1-157, 3-1-90, 4-2-113.

2. అన్యత్రాపి దృశ్యతే, నదీగోదావరీభ్యాఞ్చ. ఉత్తరపద స్యేతి వక్తవ్యమ్, వయస్య చరమ ఇతి వాచ్యమ్, వృద్ధా చ్చేతి వక్తవ్యమ్.

3. ప్రియతద్ధితా దాక్షిణాత్యాః. యథా లోకే వేదే చేతి ప్రయోక్తవ్యే, యథా లౌకిక వైదికే ష్వితి ప్రయుఞ్జతే. మ. భా. 61-P. దక్షిణాపథేహి మహాన్తి సరాంసి సరస్య ఇత్యుచ్యన్తే. P. 257 హమ్మతిః సురాష్ట్రేషు రంహతిః ప్రాచ్యమధ్యమేషు, గమి మేవ త్వార్యాః ప్రయుఞ్జతే. దాతి ర్లవనార్థే ప్రాచ్యేషు, దాత్ర ముదీచ్యేషు. P. 65.

హరింతురు. సురాష్ట్రులు రంహతిధాతువును వాడుదురు. ఆర్యులు గమిధాతువునే వాడుదురు. ఇత్యాదులు. ఈవిధముగానే యాస్కాచార్యులు నిరుక్తప్రయోజనములు వక్కాణించుచు, "లోకమందలి శబ్దములట్లు వేదమందలి శబ్దములును, అర్థవంతములే. పాత్రమాహర, ఆహరపాత్రమ్' అని లోకమం దనునట్లుగా, 'అగ్న ఆయాహి' యను దానిని, 'ఆయా హ్యగ్నే' యనుటకు వీలు లే దని మంత్రము లనర్థము లనరాదు. లోకమందును బ్రయోగనియమము కనఁబడుచున్నది. 'ఇంద్రాగ్నీ-పితాపుత్రౌ' ఇత్యాదులు నియతవాచోయుక్తియు నియతానుపూర్వియుఁ గలుగునట్లుగానే ప్రయోగింపఁబడుచున్నవి" అనుచు లౌకికశబ్ద ప్రసంగము వెక్కు-చోట్లఁ దెచ్చియున్నారు[1]. ఆర్యభాష వాడుకలో నున్నదనుటకుఁ బైలక్షణకర్తల వచనములే మొదటి ప్రమాణము. ఇఁక రెండవది:—

స్త్రీయును శూద్రుఁడును గాక తక్కినయార్యజాతి పురుషులు నమస్కరించినచో వారి నాశీర్వదించునపుడును, కొంచెము దూరమం దున్నవారిని సంబోధించునపుడును, హై-హే-యనుశబ్దములను నామములకుఁ జేర్చి పిలుచునపుడును, వాక్యముతుద 'భోః' చేర్చి దీవించునపుడును, ప్లుతస్వర మాయాశబ్దముల కుచితముగాఁ బాణినీయమున విధింపఁబడియున్నది.[2].

ఉదా:—ఆయుష్మా నేధి దేవదత్త 3. పయః పిబ సోమదత్త 3.

విజయీ భవ భోః 3. హే 3. రామ. రామహై 3. ఇత్యాదులు. 3.

ఆర్యభాష వాడుకలో లేనిచో నిరుపయోగమైనయీవిధిని, పాణిని యేల చేసియుండును? అట్లు వాడుకయే లేనిచో లోకవ్యవహారమందు మాత్రమే యుండఁదగిన దీనిని, కాత్యాయనపతంజలు లాదరించి యేల వివరింతురు? కావున దీనింబట్టియు నార్యావర్తమం దానాఁ డార్యభాష వాడుకలో నున్నదనవచ్చును.

కాని, రానురాను వికృతిభాష దేశమున వ్యాపించుచున్నకొలఁదిని సంస్కృత ముత్తమజాతులవాడుకలో నుండుచువచ్చి, క్రమముగాఁ దక్కినజాతులుగూడ సనియమ సంస్కృతభాషోచ్చారణమున నలసము లగుటచే నది బ్రాహ్మ

1. అర్థవన్త శ్శబ్దసామాన్యాత్, యథా ఏతన్నియతవాచో యుక్తయో నియతానుపూర్వా భవన్తీతి లౌకికే ష్వ ప్యేతద్యథేన్ద్రాగ్నీ పితాపుత్రా వితి-ఇత్యాది-నిరుక్తము. 1-16-1.4.

2. ప్రత్యభివాదేఽశూద్రే-దూరాద్ధూతేచ - హైహేప్రయోగే హైహయోః. 8-2-83-85. అష్టా.

భోరాజన్యవిశాం వేతి వాచ్యమ్. కాత్యా.

అవిద్వాంసః ప్రత్యభివాదే నామ్నో యే న ప్లుతిం విదుః।
నైవ లోకే నచ వేదే దీర్ఘప్లుతౌ సంవృతా స్తః కాతర్హి?
విపృతౌ-మహాభా. P. 34—81.

3. ఉదాహరణములలోని 3 అంకె ప్లుతస్వరమునకు గుర్తు.

జాతివాడుకలోమాత్రమే సుప్తరూపమున నిలిచి యున్నదని మహాభాష్యము లోని కొన్ని వాక్యములనుబట్టి తెలియవచ్చుచున్నది. అక్కడక్కడ నున్న యా వాక్యములభావ మిందు తెలుపుచున్నాను.

"శబ్దములను జక్కఁగాఁ దెలిసికొని యందు నేర్పరియై వ్యవహారకాలమునఁ బ్రయోగించువాఁడు ఫలమును బొందును. శబ్దజ్ఞానమున ధర్మము, అపశబ్దజ్ఞానమున నధర్మము కలుగును. అపశబ్దము లెక్కువ. శబ్దములు తక్కువ, (సుశబ్దములనుట) ఒక్కొక్కశబ్దమున ననేకము లయిన యపభ్రంశములు కలవు. 'గౌః' అనుశబ్దమునకు గావీ, గోణీ, గోతా, గోపోతలికా, ఇత్యాదు లయినయపభ్రంశములు పెక్కు కలవు. కావున వాగ్యోగవేదియై శబ్దములను బ్రయోగింపవలెను. "బ్రాహ్మణుఁడు ఫల మపేక్షింపక షడంగయుక్తమైనవేదము చదువవలెను, దాని నెఱుఁగవలెను." బ్రాహ్మణుఁ డపశబ్దము పలుకరాదు. బ్రాహ్మణుఁ డవశ్యము శబ్దము నెఱుఁగవలెను. శబ్దప్రయోగమందు నిపుణు లగువారు శిష్టులు"[1]. అనుచు బ్రాహ్మణులు మాత్రమే వేదవేదాంగములు చదివి సుశబ్దప్రయోగమున నేర్పరులు కావలె నని పతంజలి శాసించుటచే నతని నాఁటికి వేదాధ్యయనము బ్రాహ్మణజాతిమాత్రాధీనమైన దనియే కాదు, దేశమున నపభ్రంశవ్యాప్తి యధికమయ్యె ననియు విదిత మగుచున్నది. మఱియు నీశాసనమే బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులవలె సుశబ్దప్రయోగదక్షులు కాకపోయినను సంస్కృతభాషా వ్యవహారమునకు దూరము కాలే దనియు, అట్లితర జాతివ్యవహారమున శబ్దము లపభ్రంశము లగుచుండుటచేతనే పతంజలి బ్రాహ్మణులను మేల్కొలిపె ననియు సూచించుచున్నది. ఈ సూచనమునుగూడ, సూతుఁ డొకఁడు సూతశబ్దార్థనిర్వచనము విషయమై యొకవైయాకరణునితో వివాదపడుటను దెల్పుమహాభాష్యమే స్థిరపఱుచుచున్నది. ఇఁకమూఁడవది:—

భగవత్పతంజలికిఁ దరువాతఁగూడ నట్లే సంస్కృతము వాడుకలో నుండుటయుఁ గొన్నిజాతు లపభ్రంశ మధికముగా మాటలాడుటయుఁ గలదు. కావుననే నాటకములలో నుత్తమపాత్రములకు సంస్కృతమును స్త్రీ నీచపాత్రములకుఁ బ్రాకృతమును రూపకకర్తలు వాడుటయు, ప్రదర్శనసమయమున నీచపాత్రము లుత్తమపాత్రముల సంస్కృతభాషణము గ్రహింపఁగలుగుటయు, నాటకప్రేక్షకు లందఱును బ్రాకృతమువలెనే సంస్కృతము తెలిసికొని యానం

---

1. యస్తు ప్రయుఙ్క్తే కుశలో విశేషే శబ్దా న్యథా వద్వ్యవహారకాలే — భూయాంసో ఽపశబ్దాః అల్పీయాంసః శబ్దాః..."బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడఙ్గో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ." బ్రాహ్మణేన మ్లేచ్ఛితవై నాపభాషితవై. బ్రాహ్మణే నావశ్యం శబ్దాః జ్ఞేయాః. ఇత్యాదయః-మ-భా-శబ్దానుశాసనప్రయోజనాది విషయములలోనివి.

దింపఁగలిగియుండుటయు, సమర్థనీయములగుచున్నవి. కావున నింతకు మున్ను చేసినచర్చనుబట్టి యుఁ జూపిన ప్రమాణములనుబట్టియుఁ దొల్లి యార్యావర్తమున నార్యభాష నాడుకలో నున్న దనియు, శాకటాయనపాణినీయాది సంస్కృతమై యది సంస్కృతసంజ్ఞ జెందినపిదపఁ గూడ నల్లే యుండి క్రమముగా నుత్తమజాతులందును దరువాత బ్రాహ్మణజాతియందును వాడుకకు వచ్చి యనంతరము క్రీస్తుశకారంభమున కించుక మున్నే గ్రంథములయందు విశ్రమించె ననియు విశ్వసింపవచ్చును. తక్కిన కాలనిర్ణయాదులందు వేబర్ప్రోనలు త్రొక్కినను సంస్కృత మార్యావర్తమున సూత్రయుగము కడపటివఱకు వాడుకలో నున్నదనువిషయమునమాత్రము వీబరుమొదలగుపాశ్చాత్యపండితు లనేకు లేకీభవించుచున్నారు. ఈ విషయ మింకను బలపఱుప సంస్కృత ప్రాకృతముల ప్రకృతివికృతిసంబంధ మొకింత పరీక్షింతము.

## సంస్కృతము – ప్రాకృతములు.

క్రీ. పూ. నాల్గవశతాబ్దిలోనిపతంజలిముని యొక్కొక సంస్కృతశబ్దమునకనేకాపభ్రంశములు కల వని చెప్పినట్లును, తత్పూర్వము పుట్టిన ప్రాకృతలక్షణము సంస్కృతమునుండి శౌరసేన్యాది ప్రాకృతము లుదయించిన వని చెప్పినట్లును, అంతకంటెను బూర్వుఁడును, ఎనిమిదవ శతాబ్దిలోనివాఁడు నగుపాణిన్యాచార్యులకును దత్పూర్వు లగుశాకల్యశాకటాయనాదులకును బూర్వమే యార్యభాషలోని శబ్దజాలము వికృతిగా మాఱుచుండినట్లును జదివియున్నాము. ఇందుకుఁ దగినట్లుగా నీచపాత్రముల కుపయోగింపఁబడినయట్టి వికృతిశబ్దములు దృశ్యకావ్యములఁ గనవచ్చుచున్నవి. ఇప్పటి భారతీయదేశభాష లన్నిటియందును వినవచ్చుచున్నవి. ఇది కాదనుటకు శక్యము కాదుగదా! ఇంక సంస్కృత శబ్దములు వికృతిరూపములు దాల్చుటకుఁ గారణ మేమి? అట్టి వికృతశబ్దజాల మెప్పటినుండి యేవిధముగా దేశమున నొకవాడుకభాషగా మాఱినది? అను ప్రశ్నల కుత్తరములు చెప్పవలసియున్నది. ఇందు మొదటిదాని కొక్కటే కారణము. అది యుచ్చారణదోషమే-సంఘము పెరిగినకొలఁదిని, భాషాభిజ్ఞత తగ్గినకొలఁదిని, యథావర్ణానుపూర్విగా శబ్దములను గ్రహింపఁజాలని స్త్రీబాలమందుల తప్పుపలుకుబడియే కారణ మనుట స్పష్టము. అందుచేతనే సుశబ్దము లపశబ్దము లైనవి. అందుకే శాకటాయనాదులు భాషను నిర్బంధింపవలసివచ్చినది. అందుచేతనే, "అపశబ్దములు హెచ్చుచున్నవి. బ్రాహ్మణుఁ డైనవాఁ డెవఁడును దుష్టశబ్దము లుచ్చరింపరాదు" అని పతంజలి శాసనము చేయవలసివచ్చినది. అట్లు పలుకుబడిలో మాఱినవాని కుదాహరణములు:—

ఏకమ్-ఎక్కం, బ్రహ్మో-బ్రహ్మా, ధర్మః-దమ్మం, గృహమ్-ఘరం, కస్య-కస్స, సూత్రమ్-సుత్తం, ఇత్యాదులు-ఎట్టిసుశబ్దములైనను వాడుకలో నిట్లు

మాటు ననుటకు, మన కిపుడు వినవచ్చుచున్న-బేధం-గోధావరి-లగ్గం-యగ్గం-జొరం-మొదలైనయపభ్రంశములే నిదర్శనము. ఇఁక రెండవది:—

పాణినినాఁటికే యపభ్రంశశబ్దజాలము దేశమున మఱియొక వాడుక భాషగా వ్యాపించిన దనుట నిజమే యైనను, అందుకుఁ దగినలిఖిత ప్రమాణము చూపింపఁజాలకున్నాము కాని బుద్ధమునినాఁటి కది వాడుకలోనున్నట్లు నిదర్శనము లభించుచున్నది. బుద్ధుఁడు తనమతధర్మము లన్నియు సులభముగాఁ దెలియుటకై యేభాషలో దేశీయుల కుపదేశించెనో, ఆభాషలోనే యాధర్మోపదేశము లన్నియు నతనిశిష్యులు 'పిటకము' లనుపేర సమకూర్చియున్నారు. బుద్ధుఁడు క్రీస్తుపూర్వము ౫౦౦ సంవత్సరములకుఁ బూర్వుఁ డగుటచే నప్పటికి సంస్కృతేతరమైన యొకభాష యాదేశ మంతట వాడుకలో నున్న దనుట నిజమని తెలియుచున్నది. బుద్ధుని ఖననస్థానమున దొరకిన 'పిప్రవా' శాసనములోనిశబ్దములు ప్రాచీనపాలీభాషకుఁ జెందిన వనియు, క్రీ. పూ. మూఁడవ శతాబ్దిలోని యశోకుని శాసనములలో నున్నశబ్దము లర్వాచీనపాలీభాషకుఁ జెందిన వనియుఁ బరిశోధకులు చెప్పుచున్నారు. ఆరెంటిలోని పదములును సంస్కృతపదములవికృతరూపము లనుట సిద్ధము.

ఉదా:—పిప్రవాశాసనములో - బుధన - భగవతే - సభగినికనం - సపుతదలనం-అనుమాట లున్నవి. ఇవియే, అశోకశాసనములనాఁటిపాలీలో, బుద్ధస్స - భగవతో - సభగినం - సపుత్తదారానం - అని వ్రాయనలసి యుండును. ఇవి క్రమముగా నీక్రింది సంస్కృత శబ్దముల వికృతులు.

బుద్ధస్య - భగవతో - సభగినీకమ్ - సపుత్రదారమ్.

కావున బుద్ధునికిఁ బూర్వమే వికృతిశబ్దజాలము దేశమున నొక వాడుక భాషగా వ్యాపించి సంస్కృతముప్రక్కనే నడచుచున్నదనుట నిజ మగుచున్నది.

దీనినిబట్టి క్రీ. పూ. అనేకశతశాబ్దములకుఁ బూర్వమే సంస్కృతజన్యమైన యొకభాష సంస్కృతముప్రక్కనే లోకవ్యవహారమున నున్నట్లును, అదియే పాలీ యని పిలువఁబడుచున్నట్లును దెలిసినది. కాని యీపాలీ యెపు డెక్కడఁ బుట్టిన దనువిషయముమాత్రము నేఁటికిని నిశ్చితము కాలేదు. దీనినిగూర్చి శాసన పరిశోధకులును భాషాశాస్త్రజ్ఞులును బహువిధములుగాఁ దలఁచుచున్నారు. అయినను గొంత తెలియఁ బ్రయత్నింతము.

ప్రాకృత వ్యాకరణసంప్రదాయములు రెండు. మొదటిది హిందూదేశ ప్రాగ్భాగమునకును, రెండవది పడమటిభాగమునకును సంబంధించినవి. శాకల్య భరతకోహలాదుల ననుసరించి, వరరుచి వ్రాసిన'ప్రాకృత ప్రకాశము' తూర్పు సంప్రదాయమునకుఁ జేరినది. ఈవరరుచి వార్తికకారుఁడై ప్రసిద్ధి కెక్కిన కాత్యాయనవరరుచి కాఁడు. కాని యతనికి సమకాలికుఁడో పూర్వుఁడో యగును.

ఏ మనఁగా నితని ప్రాకృతసూత్రములకే కాత్యాయనుఁడు 'ప్రాకృతమంజరి' యనుపేర వ్యాఖ్య వ్రాసెను[1]. ఈ ప్రాకృతప్రకాశము ననుసరించినవారు క్రమదీశ్వర లంకేశ్వర రామశర్మ తర్కవాగీశ భామహాదులు. పడమటిసంప్రదాయమునకుఁ జేరిన సూత్రాత్మకమైన ప్రాకృతవ్యాకరణము మఱియొకటి యున్నది. దానిని వాల్మీకి రచియించె నని తన్మతానుసారు లైన త్రివిక్రమ హేమచంద్ర సింహరాజ లక్ష్మీధరశాస్త్రి ప్రభృతులు చెప్పుచున్నారు[2].

ఈ యుభయసంప్రదాయములవారును, పైశాచీ ప్రాకృతము హిందూదేశమునఁ బెక్కుచోట్లఁ బెక్కువిధములుగా వ్యాపించిన దని చెప్పుటయే ప్రాకృత భాషలలో దీనిప్రాముఖ్యమును బ్రకటించుట యగుచున్నది. మార్కండేయ పండితుఁడు పైశాచి వ్యాపించిన కేకయ మగధ శూరసేన పాండ్యాదులను గణించుచు, వానిలోఁ గేకయ శూరసేన పాంచాలములలోని పైశాచి పరిశుద్ధమైన దని చెప్పెను. లక్ష్మీధరశాస్త్రియు నట్లే యుత్తరదక్షిణములలోని పెక్కు దేశములను గణించుచుఁ బైశాచి సింహళమునందు గూడ వ్యాపించె నని తెల్పి యుండెను[3]. ఇట్లే పెక్కండ్రు పైశాచీభాషను బ్రశంసించి యున్నారు. అట్టి యీపైశాచికిని పాలీభాషకును సంబంధ మే మయినఁ గలదేమో చూతము.

క్రీ. పూ. ౩-౪ శతాబ్దులలో బుద్ధశిష్యపరంపరలోనివారు వ్రాసినబౌద్ధ గ్రంథములలోనిభాష యిపుడు మాగధిగాఁ దలంపఁబడు చున్నది. అశోకుని శాసనములలోనిభాష సంస్కృతప్రాకృతజన్య మగుట విదితము. ఇది గాక, బుద్ధుని యుపదేశవాక్యములచేఁ బవిత్ర మయిన పాలీభాషయే దాక్షిణాత్య దేశ బౌద్ధులు వాడఁ జొచ్చిరి. అదియే క్రమముగా సింహళమున (సిలోను) ప్రవేశించి సింహాలి యైనది. ఈవిధముగాఁ దెలియవచ్చుమాగధి లేక యర్వాచీన పాలి, ప్రాచీనపాలీ రూపాంతరమే యనుట కవకాశము గలదు.

'స్టెన్‌కోనో' యనుపాశ్చాత్యపండితుఁడు పైశాచీభాషాస్థాన నిర్ణయమును గూర్చి యొకవ్యాసము వ్రాయుచు, నందు, పైశాచి వింధ్యాద్రికిఁ దూర్పుదక్షిణములఁ బెక్కుదేశముల వ్యాపించిన దనియు, దానితో బహువిధములఁ బాలీభాష యేకీభవించుచున్న దనియుఁ జెప్పుచు నారెంటికిఁ గలసంబంధమును వర్ణించియున్నాఁడు. అతఁడు సూచించిన పాలీపైశాచీసంబంధ మంగీకరించుచు, గ్రియర్సన్ పండితుఁడు, కేకయదేశమునఁ బైశాచీప్రాకృతము చిరకాలముక్రిందటనే దేశభాషగా నున్నట్లును, పాణిన్యాచార్యులజన్మస్థాన మైన తక్షశిలకుఁ బ్రాంతమం దంతటను బైశాచియే పూర్వము వాడుకలో నున్నట్లును

1. చూ. డాక్టరు వైద్యాగారి ప్రాకృత ప్రకాశపీఠిక.
2. ఈ విషయము వివాదగ్రస్తమై యున్నది.
3. షడ్భాషాచంద్రిక.

దానిరూపాంతరమే పాలీభాష యైనట్లును చెప్పుచు నందు కనేకలాక్షణికులయభిప్రాయములనుగూడ నుదాహరించెను[1]. కాల్డువెల్లు పండితుఁడు పైశాచీప్రాకృత సంబంధము గలపెక్కు దేశభాషలలో ద్రావిడభాషలకు మాతృక యైన ప్రాచీన ద్రవిడభాష యొకటి యని వ్రాసెను[2]. నాగవర్మ యనుకర్ణాట లాక్షణికుఁడును, పైశాచీవ్యాప్తిని దెలిపి యున్నాఁడు[3]. ఇట్లు తెలియవచ్చు ప్రమాణములనుబట్టి సంస్కృతమునుండి పుట్టినప్రాకృతములలోఁ బైశాచి ప్రధాన మైన దనియుఁ బ్రాచీనపాలీభాష కదియే మాతృక యనియుఁ దెలియుచున్నది. ఒకవేళ నెవ రైనను, పాలీభాషకుఁ బైశాచి యాధారము కా దని చెప్పఁ జూతురేమో కాని, ఆపాలీలోనిశబ్దజాలము సంస్కృతజన్యమై మాఱినది కా దని మాత్రము చెప్పఁ జాలరు. కావున నిఁక నీచర్చ యిటుంచి యేప్రాకృత మెవ్వ డేదేశభాషగా మాఱి నట్లు కనఁబడుచున్నదో తెలిసికొందము.

## ప్రాకృతములు – దేశభాషలు.

ప్రాకృతి లేక ప్రాకృతమునుండి మహారాష్ట్రభాష యైన మరాటి యేర్పడినది. అపభ్రంశప్రాకృతమునుండి సింధి - పడమటిపంజాబి - కాశ్మీరి - బయలు వెడలినవి. శౌరసేనినుండి, తూర్పుపంజాబి - పూర్వ మవంతీ సంజ్ఞ గలహిందీ-గుజరాతి-బయలుదేఱినవి. మాగధినుండియే, మరాటి - బహువిధమైన బెంగాలీ జనియించిన దని కొందఱు. అర్ధమాగధి బెంగాలీమూల మని మఱికొందఱు. కడపటిదానిలో, ఉరియాకూడఁ జేరును. పైశాచీప్రాకృతము మూలద్రవిడ భాషకుఁ బ్రాపయిన దనెడి లాక్షణికమతమునుబట్టి, తమిళము - తెలుఁగు - కన్నడము-మొద లగుద్రావిడభాషలలోని తద్భవములకుఁ బైశాచీ ప్రాకృతమే మూల మనుట గ్రాహ్యము. ఇంక నెన్నోభాషలు ప్రాకృతభాషామూలకము లని పరిశోధనలవలన గ్రహింప నగుచున్నది. దీనినిబట్టియు నెంతోదీర్ఘకాల మార్యభాష, లేక సంస్కృతము వాడుకలో నున్నఁగాని, యందలి యపారశబ్దజాలము వర్ణలోపవర్ణాగమ వర్ణవ్యత్యయాదిరూప మైన బహువిధవికారములు చెంది యన్నిప్రాకృతములై యిన్నిదేశభాషలుగా మాఱఁ జాల దనుట నిక్కమని తోఁచకపోదు కావునఁ దొల్లి చిరకాల మార్యభాష వింధ్యహిమాలయ మధ్యభాగమునలుఁగడల వాడుకలో నున్న దని నిరాక్షేపముగా విశ్వసింప వచ్చును. ఇట్లార్యభాష, పిదపఁ బ్రాకృతభాషలను గని పెంచుటయే కాదు, అతి ప్రాచీనకాలమున విదేశభాషలకుఁగూడఁ జేయూఁత యొసఁగియున్న దని

1. R. G. Bhandarkar Commemoration Vol. 119—23.
2. Comparative Grammar of the Dravidian Languages.
3. కర్ణాట[illegible]

పాశ్చాత్యులొనర్చిన ప్రశంసవల్లనే తెలియవచ్చుచున్నది గావున మనము మన సంస్కృతమహత్త్వమును వేఱుగాఁ బొగడుకొనుట యనావశ్యకము.

## సంస్కృత భాషాప్రశంస.

కర్జన్ పండితుఁడు (Curzon) ఒక వ్యాసములో "జెండు - గ్రీకు - లాటిన్ - గోథికు - మొద లగుభాష లన్నియు వేఱువేఱుకాలముల సంస్కృతమునుండి పుట్టిన వని స్థిరపఱుప సాహసించుచున్నాను" అని నుడివియుండెను[1]. (W. C. Taylor) టైలరుదొర యొకవ్యాసమున "దేశమున నెన్నిమార్పులు సంభవించినను, చెక్కుచెదరక సాటిలేనిసొగసుఁదనమున విలసిల్లునట్టియు, యూరపుఖండభాషలకుఁ దల్లియైనట్టియు, గ్రీకుభాషమార్దవమునకును రోమక భాష శక్తికిని గారణ మైనట్టియు సంస్కృతభాష నేఁటికి నల్లే హిందూస్థానమునఁ గనఁబడుట యెంతయు నాశ్చర్యకరము" అని పొగడియుండెను[2]. లూయిజ్ జకోలి ట్టను ఫ్రెంచిపండితుఁడు "పురాతన మైనసంస్కృతభాషనుండియే ప్రాచీనార్వాచీన వివిధభాషాసంప్రదాయము లుత్పన్నము లైనవి" అని వ్రాసియున్నాఁడు[3], బీమ్సుపండితుఁడు "అతిప్రాచీనము లైనయనేకశబ్దములవాడుక చూడవలె నంటే, అది మనకిష్ట మైనను గాకపోయినను సంస్కృతభాషలో మునిఁగియే చూడవలెను." అని వక్కాణించెను[4]. ఇంక వీబరు మేక్సిముల్లరు మేగ్డొనలు మొద లగువిద్వాంసులు తాము రచియించినవాఙ్మయ చరిత్రలలో సంస్కృతభాషా వాఙ్మయములను మిక్కిలి ప్రశంసించియున్నా రనుట పునరుక్తము. ఇ ఙ్లెండులో దీనిని స్తుతించియున్నారు. వారు వీ రని గణింప నేల? సంస్కృతము చదువ నేర్చినవాఁ డెవఁ డైనను దీనికిఁ జేయెత్తి మ్రొక్కనివాఁడు లేఁడనుటకంటె దీనిఘనతను వర్ణింపఁజాలము. కావున దేనిప్రాచీన వృత్తాంతమెఱుఁగఁగోరి యింతవఱకును నలుదెసలు పరికించితిమో, అట్టిజగద్వంద్యమును, మహామహిమాభిరామంబును ప్రాచీనార్యుల యమృతవాక్కుల నుదయించి యార్యావర్తమునఁ బెరిఁగి భరతఖండ మంతట విస్తరించినదియు నగునార్యభాషలో విలసిల్లు మహావాఙ్మయము నుదంతమువైపు మన మిఁక దృష్టి మరలింతము.

ఇది మల్లాది సూర్యనారాయణశాస్త్రి విరచితమైన వైదిక వాఙ్మయచరిత్రయందలి తృతీయాధ్యాయము,

---

1. Journal of R. A. S. of G. B. & I. Vol. XVI.
2. Journal of R. A. S. Vol. II.
3. La Bible Dance L. Ind'e P. 178.
4. J. R. A. S. Vol. V.

# చతుర్థాధ్యాయము.

## వాఙ్మయవిభాగము

భారతీయార్యసాహిత్య మంతయు నిపుడు సంస్కృతవాఙ్మయ మనుపేర నేకాకారముగాఁ గనఁబడుచున్నను, ఇందు వివిధము లైన విభాగములు కలవు. దీనిని వైదికము లౌకికము నని కొందఱు చరిత్రకారులు ద్వివిధముగ విభజించి యున్నారు. ఇందు కొంచెము విప్రతిపత్తి కనవచ్చినను, ఈవిభాగము సముచిత మనియే చెప్పవచ్చును. భాషనుబట్టి కాని కాలమునుబట్టి కాని విషయమును బట్టికాని యీవాఙ్మయమును విభజింపఁ బూనినచోఁ బెక్కుతరగతులుగా విభజింప వలసివచ్చును. అట్లు చేసినను, అందు విప్రతిపత్తులు కనిపింపకపోవు. కావున వేదములును వానికెక్కువగా సంబంధించిన గ్రంథములును వైదిక మనియు, తక్కిన సకల గ్రంథములును లౌకిక మనియు విడఁదీయుటయే యుక్త మగుచున్నది. ఇందు,—

సంహితలు బ్రాహ్మణములు ఆరణ్యకములు ఉపనిషత్తులు షడంగములు వేదలక్షణములు పరిశిష్టములు వేదసంబంధిసూత్రములు మొదలయినవి వైదిక భాగమునఁ జేరు ననియు,

వేదసంబంధము తక్కువగాఁ గలకొన్నిసూత్రములును, షడ్దర్శనములును మతధర్మ గ్రంథములును, పురాణేతిహాసకావ్యాదులును, లౌకిక భాగమునఁ జేరుననియు స్థూలదృష్టిని బట్టి పరిగణింతము. ఈ రెండు భాగములలోని సూక్ష్మ విషయములు ప్రకరణవశమునఁ దెలియఁగలవు. ఇపుడు సకలవాఙ్మయ శిరోభూషణ మైనవేదముల వృత్తాంతము సంగ్రహముగాఁ దెలిసికొందము.

## వేదములు.

దేనివలన లోకము ధర్మాధర్మములను దెలిసికొనుచున్నదో, అది వేదము. అది ఋగ్వేదము సామవేదము యజుర్వేదము అథర్వవేదము, అని నాలుగువిధములు. మొదఁటిమూఁడింటికిని మొత్తముగా వేదము శ్రుతి ఆమ్నాయము ఛందస్సు స్వాధ్యాయము, అను సంజ్ఞలారణ్యకోపనిషత్తులలోఁ గనవచ్చుచున్నవి. కాని ఋక్కు-ఋక్కులు, సామము-సామములు, యజుస్సు యజుస్సులు,అనునవియే వీని యేకవచన బహువచనరూపము లైన మొదటి ప్రత్యేకసంజ్ఞ లని యీవేద

ములవల్లనే తెలియవచ్చుచున్నది[1]. మంత్రబ్రాహ్మణాత్మకము వేద మని మఱి యొకలక్షణము కలదు. దానినిబట్టి సంహిత మంత్రభాగ మనియు, దాని వ్యాఖ్యానరూప మైనది బ్రాహ్మణ మనియు స్థూలదృష్టిని దెలిసికొనవచ్చును.

పై ఋక్సామయజుస్సులకు మొత్తముగా మంత్రమనెడి సంజ్ఞ తొల్లి వాడుకలో నున్నట్లు తైత్తిరీయ బ్రాహ్మణము చెప్పుచున్నది[2].

ప్రాచీనమహర్షిదృష్టములును, త్రివిధములు నైనయామంత్రము లేక రాశిగా నుండఁగా నర్వాచీనమహర్షులు దానినుండి పాదముతో నర్థముతోఁ గూడి వృత్తబద్ధము లైనమంత్రములను, వృత్తగీతివర్జితము లైనమంత్రములను వాని వాని ధర్మములనుబట్టి విడఁబఱిచి యొక్కొక్కభాగముగాఁ గూర్చుటచే నవి సంహిత లనెడి సంజ్ఞలను జెందినవి. ఆవిధముగా సంధింపఁబడిన మంత్రభాగములే ఋక్సంహిత సామసంహిత యజుస్సంహిత యనిచెప్పఁబడుచున్నవి. అట్లు విడఁబఱిచినపిదపఁగూడఁ గొన్ని ఋక్కులు యజుస్సునందును, పెక్కుఋక్కులు సామమునందును, కొన్ని సామములు యజుస్సునందును, కొన్ని యజుస్సులు ఋక్సంహితయందును సామమునందునుగూడఁ గనవచ్చుచున్నవి. అట్లు త్రివిధ సంహితామంత్రములు సంకీర్ణముగా నుండుట కనిపెట్టి సూత్రకారులు "మంత్రములకు వ్యవస్థితలక్షణము లేదు" అనెడి యాక్షేప మెత్తుకొని, "వృత్తబద్ధత్వమును గీతిరూపత్వమును వృత్తగీతి వర్జితత్వమును బట్టి ఋక్సామ యజుస్సుల నెఱుఁగవచ్చును గావున వానికి సాంకర్యము కల దని యాక్షేపింపరాదు" అని సమాధానము చెప్పిరి[3]. ఇది కూడ మంత్రము లన్నియు నేకరాశిగా నుండఁగాఁ బూర్వులు వానిని విడఁదీసి త్రివిధముగాఁ గూర్చి రనియు నందుచే నవి సంహితాసంజ్ఞ చెందిన వనియుఁ జెప్పిన పై విషయమును జక్కఁగా సూచించుచున్నది.

మఱియుఁ బూర్వోక్త లక్షణమునుబట్టి వేదమందలి రెండవ భాగము బ్రాహ్మణ మని తెలియవచ్చినదిగదా! అదియు నాభాగమందలి విషయమున కనుగుణముగా వచ్చిన యర్వాచీనసంజ్ఞ యే. సకల జగత్కారణ మైనబ్రహ్మమును బ్రతిపాదించుటంజేసి వేదము గూడ బ్రహ్మశబ్దవాచ్య మైనది. సంహితారూప మయినదానికి వ్యాఖ్యానరూపమై సంబంధించిన భాగమగుటచే దీనికి బ్రాహ్మణ

---

1. తద్యద్వై యజ్ఞస్య సామ్నా యజుషా క్రియతే శిథిలమ్, తద్యదృచా తద్దృఢమ్-తై. సం. 6-5-10- ఋచ స్సామాని యజూంషి. తై. బ్రా. 1-2-1-26.

2. అహే బుధ్నియ మంత్రం మే గోపాయ. య మృషయ స్త్రైవిదా విదుః ఋచ స్సామాని యజూంషి. 1-2-1-26.

3. పూ. మీ. 2-1-35—37. సాయణుల ఋగ్వేదభాష్యావతారిక.

మను పేరు వచ్చినది. ఇట్లు వేదభాగములకు వచ్చిన సంహితా బ్రాహ్మణసంజ్ఞ లారణ్యకాదులందు సర్వత్ర కనవచ్చుచున్నవి. ఇఁక నితరసంజ్ఞలయర్థము :—

దేనివలన ధర్మాధర్మములు వినఁబడుచున్నవో, అది శ్రుతి. పారంపర్యముగా నభ్యసింపఁబడున దామ్నాయము. అధ్యయన మధ్యాయము, స్వకీయ శాఖాధ్యాయము స్వాధ్యాయము. ఇది తత్తచ్ఛాఖాపరముగా నున్నది. ఛందోబద్ధ మయినమంత్రము ఛందస్సు[1]. ఇట్లు వేదాది సమూహసంజ్ఞలను ఋగాది ప్రత్యేకసంజ్ఞలను బొందిన మంత్రములు సంహిత లయినవి. ఈసంహితలలోని త్రివిధమంత్రములును సమకాలికములా, లేక భిన్నకాలికములా, యని విచారణ చేయవలసియున్నది. వెనుకటి చరిత్రకారు లందఱును ఋగాదిసంహితలు భిన్నకాలికము లనియు ఋక్సంహిత సామసంహిత యజుస్సంహితలు క్రమముగా విశేషాంతరములు గల భిన్న భిన్నకాలములలో బయలువెడలిన వనియు వ్రాసియున్నారు. అది యెంతవఱకు సత్యము?—

## సంహితల పౌర్వాపర్యము.

సంహితాబ్రాహ్మణాదులలో వేదక్రమమును దెల్పువాక్యములు కొన్ని కలవు. అన్నిటిలోను ఋగ్వేదము ముందున్నదనుట నిర్వివాదము. కాని కొన్నిటిలో సామవేదమును, మఱికొన్నిటిలో యజుర్వేదమును, ఋగ్వేదము తరువాతఁ బేర్కొనఁబడి యున్నవి. అందుచే సామవేదమే ముం దని కొందఱును యజుర్వేదమే ముం దని కొందఱును జెప్పుట కలదు. కాని సామసంహిత యంతయు ఋగాశ్రితమే యగుటచే దాని ముందువెనుక లాలోచింపవలసిన పనియే లేమింజేసి యీవాదము నిరస్తమగుచున్నది[2]. ఇఁక ఋగ్యజుస్సంహితలు. ఋక్సంహితలో యజుస్సును, యజుస్సంహితలో ఋక్కును బేర్కొనఁబడిన వని యింతకు మున్నుదాహరించిన మంత్రములవల్లనే తెలియుచున్నది. ఇవి సమకాలికము లనుట కిదియే ప్రమాణము, అట్లు కాకపోయినయెడల నొకదాని నొకటి పేర్కొనుట యెట్లు సంభవించును? ఋక్సంహిత మొదటి దైనచో దానిని యజుస్సంహిత పేర్కొనవచ్చునుగాని, తరువాతి దైనదీని న దెట్లు పేర్కొనఁగలుగును? అయితే వారిక్కడ నొకయుక్తి చెప్పవచ్చును. ఋగ్వేదసూక్తము లన్నియు నొక్కమా ఱుదయింప లేదు. అవి కాలక్రమమునఁ బుట్టుచు వచ్చెను. కడపటిసూక్తములు పుట్టునప్పటికి యజుర్మంత్రములు గూడ జనియించుచునుండును. అందుచే ఋక్సూక్తమున యజుస్సు పేర్కొనఁబడి యుండు"నని, సరే. ఇదియు మాకు నిష్టాపత్తియే. ఋగ్వేదసూక్త

1. తై. ఆ. 7-11, 2-15.

2. సామ్నాయం సర్వేషాం ఋగాశ్రితత్వం ప్రసిద్ధమ్. ఋగ్భాష్యావతారిక.

ములు సమాప్తి నొందునప్పటికి యజుస్సులుగూడఁ బుట్టుచుండె ననుట యవి సమకాలికములుగా వచ్చుచున్నవనుట కంటె వేఱుగాదు. ఇది గాక యిందొక్కవిశేషము. ప్రాచీనార్యుల వైదిక విజ్ఞాన మనాది యని యంగీకరింపక తప్పదు. పురాతనయుగమునుండియు నార్యులు క్రతుపరాయణులై గవామయనాది వార్షికసత్రము లాచరించుచు వచ్చి రని ఋగ్వేద వాక్యములవల్లనే తెలిసికొనియున్నాము. క్రతువులందాధ్వర్యవ మంతయు యజుస్సంబంధ మనుట తెల్లము. అధ్వర్యువేదమున నిష్పన్న మైనయజ్ఞశరీరమును స్తోత్రరూప మయిన ఋగ్వేదమును శస్త్రరూప మయినసామవేదము ననుసరించి యుండు నని కర్మకాండ మంతటను గనవచ్చుచున్నది. మఱియు, మనోమయ పురుషునికి యజుర్వేదము శిరస్సు, ఋగ్వేదము దక్షిణపక్షము. సామవేద ముత్తరపక్షము, అని చెప్పెడితైత్తిరీయారణ్యకవాక్యమున యజుర్వేదమునకే ప్రాధాన్య మెక్కువ యని తెలియవచ్చుచున్నది[1]. అట్టియెడఁ బ్రధానభూతము లైన యజుర్మంత్రములు లేకుండఁ గాఁ గేవలము ఋఙ్మంత్రములతోనే పురాతనమహర్షులు సత్రము లాచరించి రనుట పొసఁగదు గావున యజ్ఞము లొనర్పఁ గావలసిన యజుర్మంత్రములు ఋక్కులతోనే పుట్టిన వని చెప్పవలసివచ్చుచున్నది. అట్లు యజ్ఞోపయుక్తము లయినత్రివిధమంత్రములు కలసియుండుటచేతనే వానిని సంహితలక్రిందఁ దరువాతివారు విభజింప వలసివచ్చినది. ఈ యర్థమునే తైత్తిరీయబ్రాహ్మణవాక్య మిట్లు బలపఱుచుచున్నది.

“హేబుధ్నియా! ఏమంత్రమును (జాత్యేకవచనము) అతీంద్రియ ద్రష్ట లైనత్రైవిదు లెఱుఁగుదురో! ఆఋగ్యజుస్సామాత్మక మైననామంత్రమును రక్షింపుము. సన్మార్గవర్తుల కదే నాశనము లేనిసిరి[2]. ఋగ్యజుస్సామములను మూఁడువేదముల నెఱిగినవారు త్రివిదులు. వారి సంబంధ మయినవారు త్రైవిదులు. వారే వృత్తబద్ధ మైనమంత్రము ఋక్కనియు, గీతిరూప మయిన మంత్రము సామ మనియు, తద్వ్యతిరిక్తము గద్యరూపము నయినది యజుర్మంత్ర మనియు నెఱిఁగినవా రనుట స్పష్టము. కావునఁ ద్రయీమంత్రములన్నియు నొకకాలమునఁ గలసి యున్న వనియు, అవి సమకాలికము లనియుఁ దెలుప నింతకంటె నితరప్రమాణ మావశ్యకము కాదు. అది గాక, ఇపుడు మన కంటియెదుట నున్నఋక్సంహితలోఁ గొన్ని సూక్తములును, యజుస్సంహితలోఁ గొన్నిప్రపాఠకములును, అర్వాచీన మహర్షిదృష్టము లైనవి చేరి యున్న వని వేదపరిశోధకుల యభిప్రాయము. అందుకుఁ గొన్ని ఋక్కులును యజుస్సులును

1. తై. ఆ. 8-2.
2. తై. బ్రా. 1-2-1-26.

గూడఁ దోఁచుచున్న వనుట సత్యము. అట్టివానిని బురాతనబుగ్యజుస్సులలోఁ జేర్చకుండఁగాఁ బరిశీలించినచోఁ దక్కినపురాతన మహర్షిదృష్టము లైన బుగ్యజుస్సంహితాభాగములు సమకాలికము లనుట కడ్డ మేమియు రాదు. దీనిచే వేదములు సమకాలికము లని బోధించుచున్న వైదికవాక్యములు సార్థకము లగుటయే కాదు, వేదము లనాదు లనెడివారి విశ్వాసము గూడ సఫల మగును. కావునఁ బురాతనము లైన బుక్సామయజుస్సంహితలు సమకాలికము లనుటయే యుచిత మని నాయభిప్రాయము.

త్రయి—ఆథర్వణము.

పైని జెప్పినత్రివిధము లయినసంహితలందును వాని బ్రాహ్మణములందును బుగ్యజుస్సామములు మూఁడు మాత్రము సర్వత్ర పేర్కొనఁ బడుటయే కాదు, ఈ మూఁడు వేదములకు నేకముగా 'త్రయీ' యనెడి సంజ్ఞ గూడఁ దఱచుగాఁ బ్రయోగింపఁబడి యున్నది[1]. దీనినిబట్టి చూడఁగా బుగ్యజుస్సామ వేదములకుఁ దరువాతనే యథర్వవేదము వెలసినట్లు కనఁబడుచున్నది. ఉపనిషత్తులలోఁ బెక్కుచోట్ల నాథర్వణము పేర్కొనఁబడి యున్నది[2]. కాని తక్కినవేదములవలె నిది యజ్ఞక్రియలయందు తొల్లి యుపయోగింపఁబడినట్లు కనఁబడదు. యాగములయందు హోత - అధ్వర్యుఁడు. ఉద్గాత - బ్రహ్మ - అనువారు ప్రధానులు. హౌత్రము ఆధ్వర్యవము ఔద్గాత్రము బ్రహ్మత్వము, ననునవి క్రమముగా వారికృత్యములు. పూర్వము క్రతువులయం దీకృత్యము లెట్లు నిర్వహింపఁబడుచుండెడి వనువిషయము నైతరేయ బ్రాహ్మణ మిట్లు తెల్పుచున్నది.

"హౌత్రము బుక్కుచేతను, ఆధ్వర్యవము యజుస్సుచేతను, ఉద్గీథము లేక, ఔద్గాత్రము సామముచేతను జరుపఁబడుచున్నవి. అందుచే నివి త్రయీ విద్య యనఁబడుచున్నవి. అట్లయిన బ్రహ్మత్వము దేనిచే జరుపఁబడుచున్నది? త్రయీవిద్యచేతనే యని చెప్పవలెను"[3].

---

1. సైషా త్రయ్యేవ విద్యా తపతి. తై. ఆ. 10-13.
   త్రయో వేదా అజాయన్త. ఐ. బ్రా. 5-32.
   త్రయీ వై విద్యా బుచో యజూంషి సామాని. శ. బ్రా. 4-6-7.
2. బుగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థమ్. ఛా. ఉ. 7-1-2.
   బుగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేదః ము. ఉ. 1-1-5.
   చత్వారో వేదా స్సాఙ్గా స్సశాఖాః—నృ. తా. 1-2.
3. ఐ. బ్రా. 5-33.

దీనినిబట్టి యజ్ఞాదిక్రియలయం దిది బ్రాహ్మణములనాఁటికిఁ గూడఁ బ్రామాణికము గా దని తెల్ల మగుచున్నది కాని యారణ్యకములకాలమున దీనికిఁ బ్రామాణికత్వ మబ్బినట్లు తైత్తిరీయారణ్యకాదులవలనఁ దెలియుచున్నది.

"ఋగధ్యయనక్రియలు దేవతలకు క్షీరాహుతులు, యజురధ్యయన క్రియలు ఘృతాహుతులు, సామాధ్యయనక్రియలు సోమాహుతులు, అథర్వాఙ్గిరోఽధ్యయనక్రియలు మధ్వాహుతులు నగును"[1].

"ప్రజాపతి యజ్ఞ మొనర్చెను. అతఁడు ఋక్కుచే హౌత్రమును యజుస్సుచే నాధ్వర్యవమును సామముచే నౌద్గాత్రమును అథర్వాఙ్గిరస్సులచే బ్రహ్మత్వమును జరిపెను"[2].

దీనినిబట్టి యిది యజ్ఞక్రియాసంబంధము లేక ఋగాది వేదములతో సమానప్రతిపత్తిపొందకుండుట చూచి యాథర్వణశాఖవారు యజ్ఞోపయోగిగాఁ గడపటికాండమును జేర్చి రనియు, నాఁటినుండి యిది యజ్ఞాదిక్రియలం దుప యుక్త మగుచుఁ బ్రామాణికత్వము చెందిన దనియుఁ జరిత్రకారు లూహించుట సముచితమే యగుచున్నది. నిజముగా నీవేదము మొదటినుండియు యాగములం దుపయోగింపఁ బడుచుండెనేని దీనిపేరుగూడ మిగిలినసంహితా బ్రాహ్మణములలో నుండియే యుండును. అట్లు గాక కడపటికాండము చేరినపిదప నిది యజ్ఞోపయోగి యైనది కావుననే దీనిపేరు తరువాత వెలసిన యారణ్యకోపనిషత్తులలోఁ గనవచ్చినది. తక్కినకాండములలోని కొన్ని కొన్ని మంత్రములు స్మార్తక్రియలయందును మూర్ధాభిషేకాది క్షత్రియోచిత కర్మలయందును వినియుక్తము లగుచున్నను[3], ఇరువదవకాండములోని మంత్రములు యజ్ఞములయందు వినియోగింపఁబడుటచేతనే యిది తక్కినవేదములవలెఁ బ్రామాణ్యము సంపాదించుకొనఁగలిగిన దనుట నిజము. అందుచేఁ దొలుత మూఁడువేదములకుఁ ద్రయీసంజ్ఞవచ్చిన దనియు, నథర్వవేదము ప్రమాణ మైనపిదప వేదములు నాలు గనెడివ్యవహారము వచ్చిన దనియు, విదిత మగుచున్నది.

## వేదప్రశంస.

బహుపురాతనార్యు లనాది యనియు నపౌరుషేయ మనియు నిరుపమాన భక్తివిశ్వాసములతో నారాధించుచు వచ్చిన సనాతనవైదిక విజ్ఞానఖనిలో నతీంద్రియద్రష్ట లైనప్రాచీనమహర్షులు తపశ్శక్తిచేఁ గనిపెట్టి పైకిఁ దీసి మెఱుఁగుపెట్టిన దివ్యరత్నములే వేదములు. వేలకొలఁది సంవత్సరములక్రిందట వీనిదివ్యకాంతులచేఁ దొలుత వెలుఁగొందిన దార్యావర్తము. క్రమముగా వీని

1. తై. ఆ. 2-9-1.
2. గో. బ్రా. 3-2.
3. అభిషిక్తోఽథర్వమంత్రైర్మహీం భుఙ్క్తే ససాగరామ్. మత్స్య.

సముజ్జ్వలతేజఃపుంజ మాసేతుహిమాచలము భరతఖండ మంతటఁ బ్రసరించి భారతీయులయజ్ఞానతిమిరము నణఁచి వారిజ్ఞాననేత్రమ్మును వికసింపఁజేసిన దనుట ప్రాచీన భరతఖండచరిత్రములోని మొట్టమొదటివిషయ మని యంగీకరింపనివా రుండరు.

విదేశవిద్యలును వైదేశికాచారములును వెల్లి విరియుటంజేసి సనాతన ధర్మము లడుగంటి నవనాగరికత హెచ్చుచున్న యీకాలమునఁ గూడ వేదము లనుమాట యుచ్చరించినంతనే లేక విన్నంతనే సాక్షరుఁడైన యెట్టివాని హృదయ మం దేని యపూర్వ మనిర్వచనీయము నైనయొకానొక పూర్వకాలపావన చరిత్రాంశస్మృతి యంకురించుటకుఁ గారణము ప్రాచీనార్యులకు వానియెడఁ గలపూజ్యభావము శాశ్వతమై తరతరములనుండి తత్సంతతి వారిహృదయముల నంటి వచ్చుటయే కాక వేఱేమి కలదు ? మఱియు నాఁటినుండి నేఁటిదనుక భరతఖండ మెన్నోయుపద్రవములపా లయినది. సముద్రభాగములు మెట్ట లైనవి. భూభాగములు సముద్రములఁ గలసినవి. రాజ్యములు తలక్రిందైనవి. సామ్రాజ్యములు పేరుమాసినవి. భాషలు మాఱినవి. వేషములు మాఱినవి. వృత్తులు మాఱినవి. పెక్కేల ? నాఁటి భరతఖండము నేఁటిది గాదు. అయినను, వేదములు మాత్ర మొకయక్షర మైనఁ బోకుండ నింతస్వర మైనఁ దప్పకుండఁ బలుకుబడిలో వీసమంత హెచ్చుతగ్గు రాకుండఁ జెక్కుచెదరకుండఁ బుట్టినవి పుట్టినట్లుగా నల్లే కొన్నివేలసంవత్సరములనుండి భరతఖండమునలుఁగడల సంచా రము చేసిచేసి యలసియు, నీనాఁడుగూడ భారతీయులహృదయములందు తమ యెడ భక్తివిశ్వాసము లుప్పతిల్లునట్లు విలసిల్లుటకుఁ గారణ మేమి ? ఆ మహా విద్యలయనిర్వచనీయ మహత్త్వమును, ఆ వేదద్రష్టల యసాధారణతపోమహి మయుఁ గాక వేఱేమి కలదు ? అట్టివి గదా వేదములు ! అట్టి ప్రశంసనీయము లును భరతఖండము పాలిటిభాగ్యదేవతలును జతుర్విధ పురుషార్థసాధనములు నగు వేదములచరిత్రము సవిస్తరముగా నెఱుంగఁ గోరినమనకు, వానిలో నగ్రగణ్య మని వినుతి గాంచినదియు భారతీయవిద్యల కోంకారమును సకలప్రపంచ వాఙ్మ యమునకు శ్రీకారము నగు ఋగ్వేదము హృదయరంజకముగాఁ గన్నుల పండు వుగా ముందు ప్రత్యక్ష మగుచున్నది.

ఇది శ్రీచర్ల బ్రహ్మశాస్త్రి ప్రియశిష్యుఁడగు మల్లాది సూర్య
నారాయణశాస్త్రి రచియించిన వైదికవాఙ్మయ చరిత్ర
యందలి చతుర్థాధ్యాయము.

# పఞ్చమాధ్యాయము.

## ఋక్సంహిత—దాని విభాగము.

ఋగ్వేద మంత్రభాగమే ఋక్సంహిత యనఁబడుచున్నది. మన కిపుడు గనవచ్చు పద్ధతి నెపుడు ఋక్సూక్తములు సంహితారూపము తాల్చినవో నిర్ణయింపఁజాలము కాని, ప్రాచీన మహర్షి పరంపరాదృష్టము లగుచుఁ గాలక్రమమున బహుసంఖ్యాకములై యొక యేర్పాటు లేక పఠనపాఠవ్యవహారసిద్ధములైన వానినెల్లఁ దరువాతి మహర్షులు విషయమునుబట్టి విభజించి యొక క్రమము ననుసరించి వానిని సమకూర్చియుందు రనియు, ఆపని శాకల్యదృష్టమైన పదపాఠము వెలయుటకు మున్నే జరిగియుండు ననియుఁ జెప్పవచ్చును. అట్టి యీ సంహిత యెట్లు విభజింపఁబడెనో చూతము.

అనియతసంఖ్య గల కొన్ని ఋక్కు లొక సూక్తము. అట్టి కొన్ని సూక్తము లొక యనువాకము. అట్టి యనువాకములు కొన్ని యొక మండలము. అట్టి పదిమండలములు ఋక్సంహిత.

అనియతసంఖ్య గల కొన్ని ఋక్కు లొక వర్గము. అట్టి కొన్ని వర్గము లొక యధ్యాయము. ఎనిమిది యధ్యాయము లొక యష్టకము. ఎనిమిది యష్టకములు ఋక్సంహిత.

ఇందు మొదటిది శౌనకపద్ధతి యనియు రెండవది కాత్యాయనపద్ధతి యనియుఁ బ్రతీతి కలదు కాని, అష్టకసంజ్ఞ తప్పఁ దక్కినవిభాగసంజ్ఞలు సర్వానుక్రమణీచరణవ్యూహాదులందు సమానముగానే కనవచ్చుచున్నవి. అయినను ఋక్సంఖ్య మాత్ర మాయాగ్రంథముల వేఱుపడుచున్నది. ఇందుకు ఖిలసూక్తములలోని కొన్ని ఋక్కులు కలియుట కారణ మని కొందఱును, ఆభేదము శాఖాభేదమునుబట్టి వచ్చిన దని కొందఱును దలంచుచున్నారు. ఇది యిట్లుండ సర్వానుక్రమణిలోని మాటలనుబట్టియే ఋక్సంఖ్య వివిధముగాఁ గనవచ్చుచున్నది[1]. ఈ యనుక్రమణి శాకలశాఖకు సంబంధించినది. ఒక శాఖకుఁ జెందిన ఋక్కులమొత్త మొకటిగా నుండక వే ఱగుటకుఁ గారణ మేమో, తెలిసికొనుటకు ముందుగా విభాగములను గనుఁగొందము.

### ౧. సర్వానుక్రమణిలోని మండలాది నిర్ణయము.

ఋక్సంహిత ౧౦ మండలములు. ౬౪ అధ్యాయములు, ౮౫ అనువాకములు ౧౦౨౮ సూక్తములు (ఇందుఖైలికసూక్తములు చేరలేదు.) ౨౦౦౬ వర్గ

1. సర్వానుక్రమణి శౌనకప్రణీతమా, కాత్యాయనకృతమా, అను విషయము తరువాత విచారింపఁబడును.

ములు. ౧౦౫౮౦—౧/౪ ఋక్కులు[1]. ౨౧౨౩౨—౧/౪ అర్ధఋక్కులు. ౧౧౦౭౦౪ చర్చాపదములు. ౧౫౩౮౨౬ పదములు[2]. ౪౩౨౦౦౦ అక్షరములు. బాష్కలసంహితలో ౮ సూక్తము లెక్కువగా నున్నవి గావున నందలి సూక్తములు ౧౦౨౫,

౨. మండలక్రమమున ననువాకవిభాగము.

ప్ర-౨౪. ద్వి-౪. తృ-౫. చ-౫. పం-౬. ష-౬. స-౬. అ-౧౦. న-౭. ద-౧౨. మొత్తము ౮౫ అనువాకములు.

౩. మండలక్రమమున సూక్తవిభాగము.

ప్ర-౧౯౧. ద్వి-౪౩. తృ-౬౨. చ-౫౮. పం-౮౭. ష-౭౫. స-౧౦౪. అ-౯౨. న-౧౧౪. ద-౧౯౧. మొత్తము ౧౦౧౭ సూక్తములు. (అష్టమమండలములో వాలఖిల్యసూక్తములు ౧౧ కలవు. వానితో ౧౦౨౮ సూక్తము లగును.)

౪. ఎన్నెన్ని ఋక్కులు గలవర్గము లెన్నెన్ని యని చేసిన నిర్ణయము. [3].

| ఎన్నిఋక్కులుకలవి ? | ఎన్నివర్గములు ? | ఋక్కులసంఖ్య. |
|---|---|---|
| ౧ ఋక్కుకలది | ౧ | ౧ |
| ౨ ఋక్కులుకలవి | ౨ | ౪ |
| ౩ ఋక్కులుకలవి | ౯౭ | ౨౯౧ |
| ౪ ఋక్కులుకలవి | ౧౭౪ | ౬౯౬ |
| ౫ ఋక్కులుకలవి | ౧౨౦౭ | ౬౦౩౫ |
| ౬ ఋక్కులుకలవి | ౩౪౬ | ౨౦౭౬ |
| ౭ ఋక్కులుకలవి | ౧౧౯ | ౮౩౩ |
| ౮ ఋక్కులుకలవి | ౫౯ | ౪౭౨ |
| ౯ ఋక్కులుకలది | ౧ | ౯ |
| | ౨౦౦౬ | * ౧౦౪౧౭ |

1. ఋచాం దశసహస్రాణి ఋచాం పంచశతానిచ ।
ఋచా మశీతిః పాద శ్చైతత్పారాయణ ముచ్యతే ॥

2. శాకల్యదృష్టే పద మేకలక్షం సార్ధంచ వేదే త్రిసహస్రయుక్తం ।
శతాని చాష్టౌ దశకద్వయంచ పదాని షట్చేతి చ చర్చితాని ॥

3. వర్గాణాం పరిసంఖ్యాతం ద్వే సహస్రే షడుత్తరే. ఈ మొత్తమువిషయమున సర్వానుక్రమణి, అనువాకానుక్రమణి, చరణవ్యూహముకూడ నేకీభవించునుగాని వివరములో నీషద్భేదము లున్నవి. అనువాకానుక్రమణిలో ఎనిమిది ఋక్కులు గలవర్గములు ౫౭ 'త్ర్యూనాష్టి రష్టకానాం' అనుపాఠము ప్రామాదికము.

* ఏవం దశసహస్రాణి శతానాం తు చతుష్టయమ్ ।

౫. ఒక్కొక్కఛందస్సునం దెన్నేసి ఋక్కులున్నవని చేసిన నిర్ణయము.

| | | | |
|---|---|---|---|
| గాయత్రి | ౨౪౫౧ | వెనుకటి మొత్తము. | ౯౭౮౬ |
| ఉష్ణిక్కు | ౩౪౧ | అష్టి | ౬ |
| అనుష్టుపు | ౮౫౫ | అత్యష్టి | ౮౪ |
| బృహతి | ౧౮౧ | ధృతి | ౨ |
| పంక్తి | ౩౧౨ | అతిధృతి | ౧ |
| త్రిష్టుపు | ౪౨౫౩ | ఏకపాదములు | ౬ |
| జగతి | ౧౩౪౮ | ద్విపాదములు | ౧౭ |
| అతిజగతి | ౧౭ | ప్రగాథబృహతి | ౧౯౪ |
| శక్వరి | ౧౯ | కకుప్పు | ౫౫ |
| అతిశక్వరి | ౯ | మహాబృహతి | ౨౫౧ |
| | ౯౭౮౬ | | * ౧౦౪౦౨ |

ఋక్సంఖ్యానిర్ణయము.

పై పట్టికలలోని పువ్వుగుర్తుగల ఋక్సంఖ్యలు పరస్పర విరుద్ధములుగాఁ గనఁబడుచున్నమాట సత్యము. ఇది యిట్లుండ; కలకత్తాసంస్కృతకలాశాలలోనివ్రాఁత ప్రతి యగుశౌనకానుక్రమణిలో ఋక్కులసంఖ్య ౧౦౪౧౭ కనఁబడుచున్నది. మాక్సిముల్లరు చూచినచరణవ్యూహములలో ౧౦౬౨౨ ఋక్కులున్న వఁట. ప్రొఫెసరు శేషగిరిశాస్త్రిగారు చూచిన యచ్చుప్రతిలో ౧౦౫౩౧ ఋక్కు లున్నవఁట. ఇట్లు ఋక్సంఖ్యాపరిమితి విభిన్నముగాఁ గనవచ్చుచున్నది. అందుచే సాయణాచార్యభాష్యముతో మాక్సిముల్లరు ప్రకటించిన ఋగ్వేద

* ఋచాం ద్వ్యధిక మాఖ్యాత మృషిభి స్తత్వదర్శిభిః, సర్వాను—వర్గములనుబట్టి వచ్చిన మొదటిమొత్తమునకును, ఛందస్సులనుబట్టి వచ్చినరెండవ మొత్తమునకును ౧౫ ఋక్కులతేడా కనఁబడుచున్నది. మాక్సిముల్లరు రెండవమొత్తము ౧౦౪౦౯ అయినట్లు చూపెను.

ఈభేదమున కవకాశ మిచ్చిన శ్లోక మిది :—

"దశైవాతి జగత్యోఽపి తథా సప్త న సంశయః। శక్వర్యోఽపి తథైవోక్తా స్తథా నవ విచక్షణైః॥" దీనినిబట్టి, అతిజగతీఛందస్సులోని ౧౭ ఋక్కులకు ముల్లరుగారు ౯ చేర్చి శక్వరీ ఋక్కులు ౨౬ అన్నారు. అందలి ౧౦ ఋక్కులకు ౯ చేర్చి శక్వరీఋక్కులు ౧౯ అని నే నభిప్రాయపడితిని. ఇందుకు దానిక్రిందనే యున్న 'ఏవం దశసహస్రా'ణీత్యాద శ్లోకమే ప్రమాణము.

మండలిబుక్కులను లెక్కపెట్టి చూడఁగా ౧౦౪౭౨ లెక్కకు వచ్చినవి[1]. ఇందు వాలఖిల్యసూక్తములలోని బుక్కులు చేరలేదు. వాలఖిల్యబుక్కుల సంఖ్య ౮౦, కాని వీనికి సాయణాచార్యులు భాష్యము వ్రాయక పోవుట చూడఁగా నివి శౌనకునిఛందోఽనుక్రమణిలోఁ జేరలే దని విదిత మగుచున్నది. ఇట్లు వెవ్వేఱుగాఁ గనవచ్చు బుక్కుల మొత్తములలోఁ దక్కినవానిమాట యెట్లున్నను ముఖ్యముగా శౌనకుని మూఁడు మొత్తములకును, ఇపుడు వ్యాప్తిలో నున్న ప్రతినిబట్టి నేను లెక్కపెట్టిన మొత్తమునకు సమన్వయ మెట్లయినఁ గుదురు నేమో చూతము.

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| ౧౦౪౦౨ | ౧౦౪౧౭ | ౧౦౫౮౦, ౧/౪ | ౧౦౪౭౨ |

ఇందు మొదటిమొత్తము ఛందోఽనుక్రమణినిబట్టి వచ్చినది. రెండవది వర్గానుక్రమణినిబట్టి, మూఁడవది ఋగనుక్రమణినిబట్టి వచ్చినవి. నాల్గవది నేను స్వయముగా లెక్కపెట్టినది. దీనిలో ఏకపాదబుక్కులు ద్విపాదబుక్కులు పునరుక్తము లైనబుక్కులు పూర్తిగా లెక్కింపఁబడినవి.

మొదటిదానికంటె రెండవదానిలో ౧౫ బుక్కు లెక్కువ యున్నవి. అవి కొన్ని పునరుక్తబుక్కు లగుటచే వానిని విడిచినచో నిది మొదటిదానికి సరిపడును.

మొదటిదానిలో ఏకపాదబుక్కులు ౬ ద్విపాదబుక్కులు ౧౭ మాత్రమే గణింపఁబడినవి. అవి ప్రత్యేకమర్థవంతము లగుటచేత ఛందస్సులనుబట్టి ప్రత్యేకముగా గణింపఁబడినట్లును, అర్థైక్యమునుబట్టి యొక్కొక్కఛందస్సులో నున్న రెండేసి ద్విపాదబుక్కు లొక్కొక్క చతుష్పాదబుక్కుగా గణింపఁబడినట్లును ఛందోఽనుక్రమణి పద్ధతినిబట్టి తెలియవచ్చుచున్నది. ఇందుకు సాయణాచార్య వచనమే ప్రమాణము.

మొదటిమండలములో ౬౫ మొదలుగా ౭౦ సూక్తమువఱకును ౬ సూక్తములు ద్విపాదర్చములు. వానికి భాష్యము వ్రాయుచు నాచార్యు లిట్లు చెప్పిరి.

“పశ్వేత్యాదీని షట్ సూక్తాని ద్వైపదాని, తే ష్వధ్యయన సమయే ద్విపదే ద్వే ద్వే ఋచౌ చతుష్పదా మేకైకా మృచం కృత్వా సమామ్నాయతే. అయుక్సంఖ్యాసు యాన్త్యాతిరిచ్యతే సా తథైవామ్నాయతే. ప్రాయే

1. నా లెక్కకు ౧౦౪౭౦ మాత్రమే వచ్చినవి గాని ౨ బుక్కులు చరణవ్యూహమున నెక్కువగాఁ గనఁబడుటచే, లిఖితపుస్తకములందు గాని ముద్రణమందుగాని యీరెండును, పొరపాటునఁ దప్పియుండు నని చరణవ్యూహమునుబట్టి యీ రెండుబుక్కులను జేర్చితిని.

ణా ర్థోఽపి ద్వయో ర్ద్విపదయో రేక ఏవ, ప్రయోగే తు తాః పృథ క్పృథ క్శంసనీయాః."

దీనినిబట్టి, యేకార్థము కలరెండేసి ద్విపద లొకచతుష్పదబుక్కుగాఁ బఠింపఁబడుచున్నట్లును, మిగిలిపోయిన ద్విపద యొక బుక్కుగానే పఠింపఁబడుచున్నట్లును దెలియవచ్చుచున్నది. అట్టిబుక్కులు పైసూక్తము లాఱింటిలోను ౬౧, అయిదవ మండల మిరువదినాల్గవ సూక్తములో ౪, అఱువదియొకటవ సూక్తములో ౧౦, మొత్తము ౭౫ నాలెక్కకు వచ్చినవి. వానిని సాయణాచార్యవచనప్రకారము మార్చినచో ౩౮ బుక్కు లగును. ఈ పద్ధతినిబట్టి పైనాల్గవమొత్తములో ౩౮ తగ్గును. మఱియు,

ఛందోఽనుక్రమణీపద్ధతినిబట్టి యొక ఛందస్సులో గణింపఁబడినబుక్కు రెండుమూఁడు సూక్తములలోఁ బునరుక్త మయినను మరల గణింపఁబడినట్లు కినఁబడదు. అందుచే ఛందోఽనుక్రమణికకును, ఋగనుక్రమణికకును బుక్సంఖ్యలో భేదము రాక మానదు. నేను గణించిననాల్గవ మొత్తములోఁ గొన్ని బుక్కులు రెండేసి మార్లు గణనకు వచ్చి యున్నవి. ఇందు కొకటి రెం డుదాహరణములు:—

'ఉరౌ దేవా అని బాధే స్యామ' అనెడి యేకపాదబుక్కు, అయిదవ మండలము ౪౨-౪౩ సూక్తములు రెంటిలోనుగూడ నున్నది. ఇట్లే "నమశ్వినో రవసా' ఇత్యాదిబుక్కును బైసూక్తములలో రెండుచోట్ల నున్నది. అట్టివాని నెల్లనేను సరిగా గణింపలేదు గాని ౩౨ బుక్కు లుండు ననుటకు సందేహము లేదు[1]. అందుచేఁ బైని జూపినవి ౩౮, ఇట్లు వచ్చినవి ౩౨. మొత్తమీ బుక్కులను పైనాల్గవమొత్తమునుండి తీసివేసినయెడల నది మొదటిమొత్తముతో సరిపడును. కావున ఛందోఽనుక్రమణి పద్ధతినిబట్టి శౌనకాచార్యు లిచ్చినబుక్సంఖ్య ౧౦౪౦౨ పరినిష్ఠిత మని చెప్పవచ్చును. ఇఁక నతఁడే యిచ్చిన మూఁడవ మొత్తము ౧౦౫౮౦-౧/౪ ఉన్నది. దీనినిగూర్చి శౌనకునిపేరనే ముద్రిత మైన యొకచరణవ్యూహ మనులక్షణ మిట్లు చెప్పుచున్నది[2].

"వాలఖిల్య వ్యతిరిక్త మైన బుక్సంఖ్య ౧౦౪౭౨. ఇందు నిత్యద్విపదములు నైమిత్తికద్విపదలు గూడఁ జేరినవి. హవనమందును, అధ్యయనమందును

1. సాయణులవారు, ఇయం బుక్ వ్యాఖ్యాతా, అని పెక్కుచోట్లఁ దెలిపియున్నారు. 2-3-4-5 మండలములలో నట్టి వెక్కువగానున్నవి. ఇది నేను స్థూలదృష్టితోఁ గావించిన బుగ్గణనము. దీనిని సూక్ష్మదృష్టితో, చరణవ్యూహము చర్చించి యున్నది.

2. ఈ చరణవ్యూహము శౌనకోక్త మనియే కాశీపురముద్రిత మయిన పుస్తకమువలనఁ దెలియుచున్నది. చరణవ్యూహములు ౨-౩ ఉన్నవి. అన్నిటియందును నీషద్భేదములు గనవచ్చుచునే యున్నవి. లేఖక దోషములు ముద్రణదోషములు గూడ నందు గలవు.

సమానముగా లెక్కకు వచ్చుద్విపద నిత్యద్విపద. హవనమందు ప్రత్యేకము గాను, అధ్యయనమందు రెండేసి యొకటిగాను లెక్కకు వచ్చునట్టివి నైమిత్తిక ద్విపదలు. అట్టి నిత్యద్విపదలు ౨౩ ను, అట్టి నైమిత్తిక ద్విపదలు ౧౪౦ యును, ఈ మొత్తములో నున్నవి[1].'' అనుచు నట్టిద్విపద ఋక్కులను గణించి చర్చించి యందు ప్రత్యేకఋక్త్వముగల ఋక్కుల నిర్ణయించి, తుదకు నధ్యయనమందలి ఋక్సంఖ్య ౧౦౪౯౬ అనియు, పారాయణమందలి ఋక్సంఖ్య ౧౦౫౮౦-౧/౪ అనియు సిద్ధాంతీకరించియున్నది[2].

ఇట్లు ఋక్సంఖ్యతో నిర్ణయింపఁబడిన శాకల సంహితాసూక్తములు ౧౦౧౭. ఇవి గాక వాలఖిల్యము లనుపేర ౧౧ సూక్తములు ముద్రితపుస్తకము లలో నెనిమిదవ మండలము ౪౮ వ సూక్తము తరువాత వరుసగాఁ గనబడు చున్నవి. అందలి ఋక్కులు ౮౦, ఇవి గాక ఖైలికము లనుపేర ౩౨ సూక్తములు పదియవ మండలమున కనుబంధముగా ముద్రింపఁబడియున్నది. అందలి ఋక్కులసంఖ్య ౧౭౭. వాలఖిల్యములకు వలెనే ఖైలికములకును సాయణులవారు భాష్యము రచియింపలేదు. కాని యందలి శ్రీసూక్తములోని ౧౫ ఋక్కులకు మాత్రము వ్యాఖ్యానము గావించిరి. లోకప్రసిద్ధమైనశ్రీసూక్తము వారిహృదయము నాకర్షించుటయే యందుకుఁ గారణము. ఇఁక బృహద్దేవతలోని యార్షానుక్రమణికనుబట్టి సూక్తద్రష్టలను వారు సందర్శించిన సూక్తములను దెలిసికొందము.

సూక్తద్రష్టలు - సూక్తములు.

అతీంద్రియద్రష్ట యగుమహామహిముఁడు ఋషి యనఁబడును. అనఁగా సాధారణమానవుని కేవిధమునను గోచరింపని మంత్రమయవాక్కులను జ్ఞాననేత్రమున సందర్శించిన విశేషప్రతిభాశాలియగు విద్వద్వరిష్ఠుఁడు ఋషి యని భావము. తాదృశఋషిదృష్టమైనమంత్రమయవాక్కులు సూక్త మనఁబడు చున్నవి. సూక్త మనఁగా సువాక్సముదాయ మని యిక్కడ తాత్పర్యము. సూక్తములలో నొకఋక్కుకంటెఁ దక్కువగా నున్నది గాని ౫౮ ఋక్కుల కంటె నెక్కువగా నున్నది గాని లేదు. అట్టి పరమపవిత్రములు దివ్యజ్ఞానబోధకములు నగు ఋక్సంహితాసూక్తములు వైదికవాఙ్మయమునకే కాదు, ఆర్య

1. ఛందోఽనుక్రమణిలో నేకపదములు ౬ అని యున్నది.

2. చూ. చరణవ్యూ—ప్రథమకండిక. పుటలు 13—18. వాల్గవమొత్తములో నెక్కువగా నున్న ౭౦ ఋక్కులకు నేను స్థూలదృష్టితోఁ గావించినచర్చయే యిందు సూక్ష్మదృష్టితోఁ గావింపఁబడె ననుట విదితము. అందుచే శౌనకుఁ డిచ్చిన మొదటిమొత్తమును మూఁడవమొత్తమును దీనిచే సరిపడు చున్నవి. అందలి విశేషములు చరణవ్యూహమునఁ దెలియఁగలవు.

వాఙ్మయ మంతకును బునాదు లనుట పునరుక్తము. ఋక్సంహితలోఁ గనవచ్చు సూక్తములలో నతిప్రాచీనములు గొన్నియుఁ బ్రాచీనములు కొన్నియు నర్వాచీనములు కొన్నియుఁ గల వని మున్నే తెలిసికొని యున్నాము కావున, నవి యన్నియు నేకకాలమున దృష్టము లైన వని కాని, ఇపుడు సంహితలోఁ గన వచ్చుచున్నవరుసనే యవి కాలక్రమమున ఋషిపరంపరా దృష్టము లైన వని కాని తలంపరాదు. ఇందు కొకయుదాహరణము. విశ్వామిత్రునికొడుకును, మనుమఁడును దర్శించిన సూక్తములు మొదటి మండలమున నున్నవి. విశ్వామిత్రుఁడును, అతని తండ్రి తాతలును గనిపెట్టినవి మూఁడవమండలమున నున్నవి. సూక్తములును వానినిబట్టి మండలములును గాలక్రమము ననుసరించియే యేర్పడెనని తలంచితిమేని, యొక ఋషియొక్క మనుమని మనుమఁడు సందర్శించిన సూక్తములకుఁ దరువాత సుమారు రెండువందల సంవత్సరముల కాఋషి దర్శించిన సూక్తములు వెలసె నని చెప్పవలసివచ్చును, నాఁటి ఋషు లెంతదీర్ఘాయువు లైనను, ఇంతటి వ్యవధానము సంభావ్యము కాఁజాలదు. కావున ఋషు లాయాకాలముల సూక్తములు సందర్శించుచు వచ్చి రనియు, వానిని దరువాతివారు సంహితగాఁ గూర్చుకాలమున విషయమునుబట్టియుఁ బ్రాధాన్యమునుబట్టియు వ్యాప్తినిబట్టియు ముందువెనుకలుగాఁ గూర్చి రనియు భావించుట యుచితము.

ఏయార్యుఁ డే సూక్తమును దర్శించెనో యతఁడు దానికి ఋషి. మఱియు నే సూక్తమందలి వాక్యము లెవరివో వారు వానికి ఋషులు. అనునియముల ననుసరించిన యనుక్రమణికలను, సాయణులఋగ్వేదభాష్య సూక్తావతారికలను బరిశోధింపఁగా సూక్తద్రష్టలు రమారమి నాలుగువందలమంది లెక్కకు వచ్చిరి. వారిలో నొకఋషి కొన్నిఋక్కులు మాత్రమే కనుఁగొనెను. మఱియొకఁడు సూక్త మంతయు దర్శించెను. ఇంకొకఁ డనేకసూక్తములు సందర్శించెను. ఒకొక్కఁ డొకొక్కమండలమే చూచెను. ఒకొక్కఁ డనేకులతోఁ గలిసి యనేకసూక్తములఁ బాల్గొనెను. మఱియుఁ గొన్నిఋషిగణములు కలిసి యొక సూక్తమే కనిపెట్టెను. ప్రత్యేకముగా స్త్రీలు కొన్నిసూక్తములు చూచిరి. దంపతులు కొన్ని గనుఁగొనిరి. వేఱువేఱు స్త్రీపురుషులు కలసి మఱికొన్ని దర్శించిరి. మఱియు ఋగ్వేదసూక్తములమొత్తములో నేవొకొన్ని లెక్క కార్య స్త్రీ దృష్టములును, తక్కిన వందలకొలఁదిసూక్తము లార్యజాతి బ్రహ్మర్షి రాజర్షి దృష్టములు నై నమాట సత్య మైనను, అల్పసంఖ్యాకము లయిన కొన్నిసూక్తముల కతిమానుష మైనయార్షత్వమును మూఁడు నాలుగుసూక్తముల కమానుష మైన యార్షత్వమును సూక్తవిషయాదులనుబట్టి, అనుక్రమణికలు సూచించు

చున్నవి కాని యంతమాత్రమున మానుషేతరవ్యక్తులే వాని ద్రష్టలని యా యనుక్రమణికల యభిప్రాయముగా గ్రహింపఁదగదు.

సూక్తకాలమునకును, అనుక్రమణికాకాలమునకును నడుమఁ బెక్కు వందల సంవత్సరముల యంతర మున్నమాట నిజము. అంత కాలమును సూక్తములతోఁ గూడ సూక్తద్రష్టలనామములు గూడఁ గంఠపాఠముగా నార్యుల వంశక్రమమున వచ్చినవే కాని యెవరో యొక రొకచోట వ్రాసిపెట్టి యుంచినవి కావు. అట్లు వ్రాసియుంచుకాలమునకు సూక్తద్రష్టల నామములు కొన్నికొన్ని తబ్బిబ్బు లగుటయుఁ దాఱుమాఱగుటయు స్మృతిపథము దాటుటయుఁ గూడ సంభవించిన దని యనుక్రమణికలలోని కొన్ని ఋషినిర్ణయవాక్యములే తెలుపుచున్నవి. ఇందు కొకటిరెం డుదాహరణములు:—

మొదటిమండలము ౧౦౫ వ, సూక్తము త్రితుఁడు దర్శించినదా, లేక కుత్సుఁడు రచించినదా యని సందేహము కలిగినది[1].

మూఁడవమండలము ౩౮ వ, సూక్తము దర్శించినఋషి ప్రజాపతి, ఇతఁడు విశ్వామిత్రపుత్త్రుఁడా, లేక వాక్పుత్త్రుఁడా యని సందేహము కలిగినది[2].

ఆఱవమండలము ౧౫ వ, సూక్తము దర్శించిన వీతహవ్యుఁడు భరద్వాజ గోత్రమువాఁ డనియు, ఆంగిరసగోత్రుఁ డనియు మతభేదము సంభవించినది[3].

ఎనిమిదవమండలములోని వాలఖిల్యసూక్తములఋషులే కనఁబడరు[4].

తొమ్మిదవమండలము. ౮౬ వ సూక్తమును దర్శించినవారిగోత్రము లప్రసిద్ధములఁట[5].

ఇంక నిట్టియుదాహరణము లనేకములుకలవు. వీనినిబట్టియు, గోత్రములు తెలియనిఋషుల నాంగిరసగోత్రులనుగాఁ దెలిసికొనఁ దగు నన్నవిధి యేర్పడుటనుబట్టియు[6]. కొందఱు ఋషులజన్మవృత్తాంతము లతిమానుషము లైనకథలుగా

---

1. చంద్రమా ఇతి సూక్తస్య త్రిత ఆప్త్యో ఽథవా, ఋషిః (కుత్సః) బృహద్దేవత; సా. భా.

2. అ త్రానుక్రమణికా-అభితుష్టేవ దశ-ప్రజాపతిః స వైశ్వామిత్రో, వాచ్యోవా ద్వావా తౌ నవైః కో౽పీతి—సా. భా.

3. ఆంగిరసస్య వీతహవ్యస్య భారద్వాజస్య వార్షమ్. సా. భా.

ఇమ మూషువ ఇత్యస్య సూక్త స్యాంగిరస స్సుతః వీతహవ్యః—బృహ:—

4. సర్వానుక్రమణిలోఁ గాని బృహద్దేవతలోఁగాని వారిపేళ్లు లేవు.

5. ఏషాంతు గోత్రం క్వచి దప్రసిద్ధం బృహ:—

6 అనుక్తగోత్రమాంగిరసం విద్యాత్. శౌనకానుక్రమణి—అనుక్తగోత్రోయ స్త్వత్రమండలే లక్ష్యతే మునిః। స తు కాణ్వ ఇతి జ్ఞేయః—బృహద్దేవత.

వర్ణింపఁబడుటనుబట్టియుఁ జూడఁగా ననుక్రమణికా కాలమునాఁటికే వేదపాఠ మందున్న శ్రద్ధ ఋషిచ్ఛందోదేవతా పాఠమునం దుండక క్రమముగా మంద గించుచు వచ్చిన దనియు, అప్పటికిఁ గొందఱు వేదర్షులు దేవతలుగా భావింపఁ బడుచు వచ్చి రనియుఁ దెలియకపోదు. అందుచేతనే ఋషిచ్ఛందో దేవతాది విజ్ఞానము లేనియధ్యయనాధ్యాపనములు పాపహేతువులు గావున వానిని దప్పక తెలిసికొన వలెనన్న శాసన ముదయింపవలసి వచ్చినది. కొన్ని సూక్తముల యందలి విషయములనుబట్టి కొందఱు సూక్తద్రష్టలను దేవతాదులనుగా నను క్రమణికాకర్తలు నిర్ణయింపవలసి వచ్చినది. ఇందు కొకటిరెం డుదాహరణ ములు:—

ప్రజాపతి తృతీయమండలమున విశ్వామిత్రపుత్రుఁడో లేక వాక్పు త్రుఁడో యైన యార్యుఁడు. అతఁడు దశమమండలములోని ౧౨౯ వ, సూక్త మును సందర్శించి యందలి విషయమును బట్టి యనుక్రమణిలో సృష్టికర్త యగు పరమేష్ఠిగా మాఱెను. ఇందుకు, ప్రజాపతిశబ్దము బ్రహ్మపర్యాయములలోఁ జేరుట కూడ నొకకారణ మై యుండవచ్చును.

అగ్నినామకమహర్షులు ముగ్గురునలుగురు భిన్నగోత్రములవా రున్నారు. వారిలో నొకఁడు పావకుఁడు గా మాఱెను. ఇంద్రుఁ డొకఋషిగాఁ బెక్కుచోట్ల నుండి దశమమండలమున వైకుంఠుఁడయ్యెను. సరమ దేవశుని యైనది. ఊర్వశి యచ్చర యైనది. ఇట్లే పూర్వమండలములలోనిఋషులు కొందఱు దశమమండల ములో దేవతాదులుగా మాఱిరి. దీనినిబట్టి యితిహాసములు ప్రబలినకాలమందు వెలసినయనుక్రమణికలలో సూక్తద్రష్టలు కొందఱు నామసామ్యమునుబట్టియు నర్థసందర్భమునుబట్టియు నయ్యాసూక్తములయందలి విషయములను బట్టియు దేవతాదులుగాఁ బరిగణింపఁబడి రని యూహించుట యసంగతము గాదు.

మఱియు నవమమండలము ౬౬ వ, సూక్తమును వందమంది వైఖానసులు దర్శించిరనియు. అష్టమమండలము ౩౪ వ, సూక్తమును వేయిమంది వసురోచులు సందర్శించి రనియు, నవమమండలము ౮౬ వ, సూక్తమును సికతనివావరాది ఋషిగణములు నాలుగు దర్శించె ననియు ననుక్రమణికలనుబట్టి తెలియవచ్చును[1]. ఇచ్చట, ఒక్కసూక్తములోని కొన్నిఋక్కులను వందలకొలఁది వేలకొలఁది ఋషులు సందర్శించుట సంభావ్యమాయని శంకింప నక్కఱలేదు. ఆసూక్త ములను జూచినవా రొకరిద్దఱే యైనను గురుకులములలోని తత్సహవాసు లంద ఱును, కారయితలుగాను ప్రేరకులుగాను ననుమోదకులుగాను దత్సూక్తములఁ బాల్గొనియుండుటచేఁ దత్కర్తలనామము లాసూక్తముల నంటిరాక గణసంజ్ఞలు మాత్రమే వానితో వచ్చియుండె ననుట వాస్తవము. కావున సూక్తద్రష్ట లంద

1. చూ. ఆయాసూక్తముల భాష్యావతారికలు

ఋను బ్రాచీనమహర్షులే యని విశ్వసింపనగును. వారిసంఖ్య రమారమి ౪౦౦—[1].

అనుక్రమణికాదులనుబట్టి నామములు తెలియవచ్చిన ఋషులసంఖ్య పై విధముగా నున్నను, పేళ్లు తెలియని గణర్షులు రెండు మూఁడుసూక్తములఁ జాల్గొనియున్నట్లు వానివల్లనే తెలియవచ్చినది గావున ఋగ్వేదర్షులు సుమారు రెండువేలమంది కైన నుండియుందు రనుటకు సందేహము లేదు. పేళ్లు తెలిసిన వారిలో నిరువదినలుగురు స్త్రీ లున్నా రనుటకంటె నేఁటి కైదువేల సంవత్సరముల క్రిందట భరతఖండమందలి నాగరికతను వేఱుగా వివరింప నక్కఱలేదు. సూక్త ర్షులను గణించిన యనుక్రమణికాకర్త లెల్ల సూక్తదర్శిను లైనస్త్రీలను బ్రహ్మ వాదిను లనుపేర నొకపట్టికగాఁ బ్రత్యేకముగాఁ జూపుచు వచ్చి రనుటకంటె వారికాలమందలి స్త్రీ విద్యాభిరుచికి మఱియొక యుదాహరణ మావశ్యకము కాదు. ఆ బ్రహ్మవాదిను లొకరో యిద్దఱో తక్కినమండలములలోఁగూడఁ గన వచ్చుచున్నను దశమమండలములో నట్టివారు పదాఱుగు రుండుటచే ఋగ్వేద కాలమున వేదవిద్య క్రమముగా స్త్రీసంఘమున నెట్లు వ్యాపించుచువచ్చినదో తెలియక పోదు. అందుకై మంత్రదర్శనమున భరతఖండ మంతకును ఖ్యాతి తెచ్చిన యట్టి స్త్రీరత్నముల నెల్ల నొకచోఁ జేర్చి చూచి యానందింతము[2].

| | | |
|---|---|---|
| రోమశ | వాగ్దేవి | జుహూదేవి |
| లోపాముద్ర | శ్రద్ధ | సరమ |
| అదితి | యమి | ఊర్వశి |
| అపాల | శశ్వతి | ఇపాంమాత |
| శిఖండిని ౧. | విశ్వవార | ఇంద్రమాతలు |

1. ఋషిసూక్తపట్టిక—మొదటి యనుబంధము చూడఁదగును.

2. ఈ స్త్రీలను దెల్పుశ్లోకములు బృహద్దేవతాదులలో నీషత్పాఠభేదములతోఁ గనఁబడు చున్నవి. భాష్యమునఁ గనవచ్చునామములనుబట్టి యాభేదములు సవరించి యాశ్లోకము లిందు చూపితిని.

గోధా ఘోషా విశ్వవా రాపా లేషామ్నిత్ప కర్షికా ।
బ్రహ్మజాయా జుహూ ర్నామ అగస్త్యస్య స్వసాదితిః ।
ఇంద్రాణీ చేంద్రమాతా చ సరమా రోమ శోర్వశీ ।
లోపాముద్రా చ నద్యశ్చ యమీ నారీచ శశ్వతీ ।
శ్రీ ర్లాక్షా సార్పరాజ్ఞీ వాక్ శ్రద్ధా మేధాచ దక్షిణా ।
రాత్రీ సూర్యాచ సావిత్రీ బ్రహ్మవాదిన్య ఈరితాః ॥"
అపాలోపనిషన్నిషత్ - అని పాఠా.
భాష్యములలోనున్న కొంద ఱిందు లేరు.

| | | |
|---|---|---|
| శిఖండిని ౨. | శచి | సార్పరాజ్ఞి |
| ఘోష | సూర్య | రాత్రి |
| దక్షిణ | ఇంద్రాణి | గోధ |

వీరు ఋక్సంహితలోని బ్రహ్మవాదినులు. బ్రాహ్మణాదులలో నింక నిట్టివా రనేక లున్నారు.

సూక్తద్రష్టలు శతర్చులు మధ్యములు క్షుద్రసూక్తులు మహాసూక్తులు నని చతుర్విధముగా నున్నారు. వారిలో:—

శతర్చులు :—ప్రథమమండలద్రష్టలలోని - మధుచ్ఛందుఁడు - మేధాతిథి - శునశ్శేఫుఁడు - హిరణ్యస్తూపుఁడు - కణ్వుఁడు - ప్రస్కణ్వుఁడు-సవ్యుఁడు- నోధనుఁడు - పరాశరుఁడు - గోతముఁడు - కుత్సుఁడు - కశ్యపుఁడు-కక్షీవంతుఁడు- పరుచ్ఛేపుఁడు - దీర్ఘతముఁడు - అగస్త్యుఁడు - అనుపదునాలుగురును. ఆమండలములోని తక్కిన జేత - ఇంద్రుఁడు మొదలగువారి కీసంజ్ఞ లేదు[1]. ఒక్కొకరు నూఱేసిఋక్కులను జూచినవా రగుటచే వీరి కీపేరు వచ్చినట్లు లక్షణములు చెప్పుచున్నవిగాని ఋక్కులసంఖ్యమాత్ర మట్లు కనఁబడదు. మేధాతిథి చూచిన ఋక్కులు ౧౪౩. హిరణ్యస్తూపుఁడు కనుఁగొనినవి ౭౧. ఇట్లే వీరు ప్రత్యేకముగా దర్శించిన ఋక్కులు నూటి కెక్కువగా నో లేక తక్కువగానో యున్నవి గాని నూఱేసిలేవు. అట్టియెడ వీరికి మాత్రమే యీపే రేల వచ్చెనో, వీరివంటి తక్కిన ప్రథమమండలర్షుల కీసంజ్ఞ యెందుకు రాలేదో తెలియరాదు గాని, తొలుత వీరు చూచిన ఋక్కులు నూఱగుటయే వీరి కీపేరు వచ్చుటకుఁ గారణ మని చెప్పవచ్చును. తరువాత ఋక్కులసంఖ్య మాఱి యుండును.

మధ్యములు :—ప్రథమదశమమండలములు గాక తక్కినమధ్యమండలములలోని సూక్తములను దర్శించినఋషులకు మధ్యము లనుపేరు కలదు.

క్షుద్రసూక్తులు, మహాసూక్తులు :—దశమ మండలములో పదికంటె నెక్కువఋక్కులు గలసూక్తములను నిర్మించినవారు మహాసూక్తులనియు, పదికంటెఁ దక్కువ ఋక్కులు గల సూక్తములు నిర్మించినవారు క్షుద్రసూక్తులనియుఁ బేర్కొనఁబడిరి.

ఇట్లు ప్రత్యేకసంజ్ఞలు వడసినసూక్తద్రష్టలలో మధ్యమసంజ్ఞ కలవారిలోఁ గొందఱు మండలద్రష్ట లనుఖ్యాతికిఁ బాత్రులైరి. వారినిగూర్చియు మండలములయేర్పాటును గూర్చియు నించుక తెలిసికొందము.

1. ఋచాం శతానాం ద్రష్టృత్వా దేత ఏవ శతర్చినః।
జేత్రాదీనాంతు త న్నాస్తి తస్మా న్నైతే శతర్చినః - బృహ.

## మండలద్రష్టలు - మండలములు.

ప్రథమమండలమునకుఁ బ్రత్యేకముగా నొకఋషి ద్రష్టగాఁ బరిగణింపఁబడియుండ లేదు. అది విశ్వామిత్రపుత్త్రుఁ డగుమధుచ్ఛందసుని సూక్తములతో నారంభమై యగస్త్యునిసూక్తములతో సమాప్తిగాంచునట్లు కూర్పఁబడినది. అందలి ౧౯౧ సూక్తములును ౬౫ గురు ఋషులపేరఁ గనఁబడును. వారిలో గోతముఁడు కశ్యపుఁ డింద్రుఁడు మొద లగుమహర్షులుగూడఁ గలరు. పెక్కండ్రుమహర్షులు దర్శించినసూక్తము లనేకము లందుండుటచేత నే దానికిఁ బ్రత్యేకద్రష్టగా నొకఋషి పేర్కొనఁబడ లే దని విదిత మగును.

ద్వితీయమండలమునకు ద్రష్ట గృత్సమదుఁడు. ఈమండలమున నతని పుత్త్రుఁ డగుకూర్మ్మఁడు మూఁడుసూక్తములను, భార్గవుఁ డైనసోమాహుతి నాలుగుసూక్తములను దర్శించిరి. తక్కిన వన్నియు శౌనకాపరనాముఁ డగుగృత్సమదుఁడే సందర్శించెను. అందుచే నతనికుమారుఁడును, శిష్యుఁడో లేక మిత్త్రుఁడో యైనసోమాహుతియు నిర్మించినవి కొలఁదిగా నున్నను. దీనికర్తృత్వము గృత్సమదునికిఁ జెందుట యుచితమే యగుచున్నది. ఈ మహర్షినిగూర్చి ఋషిపరంపరనుండి వచ్చిన యొకకథను, వేదార్థదీపిక యనుపేరఁ గాత్యాయనునిసర్వానుక్రమణికకు వృత్తి రచియించిన షడ్గురుశిష్యుఁ డీక్రిందివిధముగా వర్ణించియుండెను.

" భరద్వాజునికొడుకు శునహోత్రుఁడు. ఆమహామునికుమారుఁడు శౌనహోత్రుఁడు. ఆమునీంద్రుఁడు యజ్ఞము చేయుచుండఁగా నతనిని సంతోషపెట్టుటకై యింద్రుఁ డచ్చటికి వచ్చెను. ఇంద్రునిరాక తెలిసికొని యసురులతఁడొకఁడే వచ్చెను బంధింపవచ్చు నని తలంచి యజ్ఞశాలకు వచ్చిరి. ఇంద్రుఁ డది కనిపెట్టి యజమానునివేషముతో నచ్చటినుండి తప్పించుకొని పోయెను. అపు డసురులు శౌనహోత్రుఁడే యింద్రుఁ డని యూహించి యతనిఁ బట్టి తీసికొని పోవుచుండిరి. అపు డాఋషి వారినిజూచి 'ఓయసురులారా! నే నింద్రుఁడను గాను, ఎవఁడు పుట్టుచునే సురలలోఁ బ్రధానుఁడయ్యెనో, ఎవఁడు మనస్వులలో నగ్రగణ్యుఁ డయ్యెనో యతఁ డింద్రుఁడు. ఎవఁడు కదలిపోవుచున్నభూమిని దృఢపఱిచెనో, ఎవఁడు ఱెక్కలతో నెగిరిపోవుచున్న పర్వతములను వానివాని స్థలముల నిలిపెనో యతఁ డింద్రుఁ''డనుచు, 'సజనాసఇంద్రః' అనుమకుటము గలపదునాల్గుఋక్కులతో నింద్రుని స్తుతించుచు నట్టివాఁ డింద్రుఁడు కాని నేను గా''నని చెప్పెను. ఆమాటలు విని వా రతనిని విడిచిపెట్టి పోయిరి. పిదప నింద్రుఁడు శౌనహోత్రుని బిలిచి "ఋషివర్యా! నీస్తుతివాక్యములచే నన్ను సంతోషపెట్టితివి కావున నీవు గృత్సమదుఁ డనుసంజ్ఞను జెందుము. నీస్తుతివాక్యము లోకసూక్తముగా వెలయును. నీవు భృగుకులమున శునక

మహర్షి పుత్రుఁడవై జన్మించి శౌనకుఁ డను పేరఁ బరఁగి యీ స్తుతిరూప సూక్త ములోఁ గూడ ద్వితీయమండలమునకు ద్రష్టవై ఖ్యాతిగాంచుము" అని పలి కెను. అనంతర మతఁ డట్లే శౌనకర్షియై ఋక్సంహితలోని రెండవమండలము సందర్శించెను."

ఈయితిహాసము నమ్మినతిమేని ద్వితీయమండల ద్రష్టయైన శౌనకుఁడే ఋక్ప్రాతిశాఖ్యము, బృహద్దేవత మొద లగు గ్రంథములకర్త యైనట్లును, అతఁడే కల్పసూత్రకర్త యగునాశ్వలాయనునికిని, సర్వానుక్రమణికాదికర్త యగుకాత్యా యనునికిని గురు వైనట్లును నమ్మవలసివచ్చును. అది యసంగతము. పాణి న్యాచార్యులతరువాతివాఁ డయిన వరరుచినామక కాత్యాయనునికి ఋగ్వేదద్వితీయ మండలకర్త యైనశౌనకుఁ డనుగృత్సమదుఁడు గురు వగుట యెన్నటికిని బొసఁ గదు. ఋగ్వేదశౌనకుఁడు మహాభారతమున కెంతోపూర్వుఁడు. బృహద్దేవతాది కర్తయగుశౌనకుఁడు మహాభారతమునకుఁ దరువాతివాఁడు.

తృతీయమండలద్రష్ట విశ్వామిత్రుఁడు. జమదగ్ని ఘోరుఁడు మొదలగు నిద్దఱుమగ్గు రన్యగోత్రములవారు నిర్మించినసూక్తము లిందుకొలఁదిగా నున్నవి. తక్కిన వన్నియు విశ్వామిత్రుఁడును అతనిపుత్రులును అతని తండ్రితాతలును సందర్శించినవే. అయినను. ఇందలిబహుసూక్తము లతనివంశమువారికి సంబంధిం చిన వగుటచేతను, అతఁడు సప్తమహర్షులలో నొకఁ డగుటచేతను,ఈమండలము విశ్వామిత్రదృష్ట మనెడిప్రసిద్ధి వచ్చినది.

చతుర్థమండలము దర్శించినఋషి వామదేవుఁ డని ప్రసిద్ధి. ఇందలిసూక్త ములలో నితరులు చూచినవి మూఁడు నాలుగు మాత్రమే యున్నవి. అవి సంహితానిర్మాణకాలమున విషయసందర్భమును బట్టి యిందు చేరినవి. అందుచే నీమండలము వామదేవ్య మనెడిఖ్యాతికిఁ దగియున్నది.

పంచమమండలమున కాత్రేయ మని పేరు. అత్రియు నతని పుత్ర పౌత్రులును సందర్శించినసూక్తము లిం దనేకములు. ఇతరగోత్రములవారు చూచినవి స్వల్పములు. ఈమండలమం దనుక్తగోత్రుఁడైన ఋషి నాత్రేయు నిగాఁ దెలిసికొనవలెనని యనుక్రమణికలు చెప్పుచున్నవి.

షష్ఠమండలము కేవలము భారద్వాజ మనుకీర్తి గాంచినది. భరద్వా జుఁడు నతనిసుతులును గాక యితరులు దర్శించిన సూక్త మిందొకటియు లేదు. అందుచే నిది పరిశుద్ధముగా భరద్వాజునికే చెందుచున్నది.

సప్తమమండలద్రష్ట వసిష్ఠుఁడు. ఇం దన్నిసూక్తములును వసిష్ఠుఁడు రచియించినవే. ఒకదానిలో మాత్ర మతనిపుత్రులు సహాయులుగా నుండిరి. ౧౦౨ వ, సూక్తములో వసిష్ఠునితోఁగూడ నగ్నిపుత్రుఁ డగుకుమారుఁ డను ఋషి యున్నట్లు బృహద్దేవత చెప్పుచున్నది గాని తక్కినవానిలో నట్లు కనఁ

బడదు. దీనినిబట్టి చూడఁగా మూఁడుబుక్కుల చిన్నసూక్తములో నన్యగోత్రుఁడయినమఱియొకఋషిని జేర్చిన బృహద్దేవతా మతముకంటె నతనిని విడిచిన యితరానుక్రమణికామతమేయుచితతర మగుచున్నది. సాయణులవారుకూడ నతనిని జేర్పలేదు. అందుచేతనే యనుక్రమణికలనాఁటికే సూక్తర్షి విజ్ఞానము మందగించుచు వచ్చిన దని యూహింపవలసి వచ్చినది.

అష్టమమండలము. ఇందలి సూక్తము లత్రి కణ్వ భృగ్వంగిరో మరీచ్యాదిగోత్రములవారు సందర్శించిన వగుటచే దీని కొకఋషి ప్రత్యేకద్రష్టగా నెందును జేర్కొనఁ బడలేదు. ఇందలి సూక్తములు తొలుత ౯౨ అయినను వాలఖిల్యములు చేరినపిదప ౧౦౩ అయినవి. ఈ వాలఖిల్యములకు వీరు కర్త లని యేయనుక్రమణికయు నిరూపించియుండలేదు గాని, కాత్యాయనసర్వానుక్రమణికాభాష్యవివరణము రచియించిన జగన్నాథపండితుఁడు కణ్వపుత్రులు ప్రస్కణ్వాదులు పదిమంది యాపదునొకండుసూక్తములు రచియించినట్లు వక్కాణించి యున్నాఁడు[1]. వారి నామములును వారు రచియించిన సూక్తములును, అనుబంధపట్టికలోఁ గాంచనగును. సాయణాచార్యులు వీనికి భాష్యము వ్రాయకపోవుటను బట్టి యీ వాలఖిల్యములు ప్రాచీనమహర్షిప్రోక్తములుకా వని తెల్ల మగుచున్నది.

నవమమండలము. ఇది వైశ్వామిత్ర కాణ్వాంగిరస భారద్వాజాదులనేకులు రచియించినసూక్తములతో నిండియున్నది. దీనికిఁ బ్రత్యేకద్రష్ట లేఁడు. కాని ప్రాచీను లైనకశ్యపాదులిందు కొన్నిసూక్తముల ద్రష్టలుగా నున్నారు. ఇందలిపవమాన సూక్తములనుబట్టి దీనికి, పావమానమండల మనుపేరు వచ్చినది[2]. పవమానగుణవిశిష్టుఁ డగుసోముఁ డిందలిసూక్తములదేవత. సోమదేవమాహాత్మ్యము వర్ణించునీమండలమునకు సౌమ్యమండల మనియుఁ బేరు కలదు. ఇది కేవలము సోమయాగమునకుఁ జెందినది.

దశమమండలము.—ఇది ద్వితీయాదిమండలములకంటె మిక్కిలి పెద్దది. ఇందలి సూక్తర్షులును బహుసంఖ్యాకులు. దీనికిని బ్రత్యేకద్రష్టగాఁ బేరుపొందిన ఋషి యొకఁడు లేఁడు. కాని పూర్వమండలములలోని మహర్షులు పెక్కండ్రు రచించినసూక్తము లిందును గలవు. ఈమండలము మిక్కిలి యర్వాచీన మని కొందఱియభిప్రాయము. ఇం దర్వాచీనఋషులు దర్శించినసూక్తములు కొన్ని యున్నంతమాత్రమున నిది యంతయుఁ దరువాత బయలువెడలినదే యని చెప్పటకు వీలు గాకున్నది. ఋషుల గోత్రములనుబట్టి చూచినచో నన్నిటియందును,

1. చూ. బృహద్దేవత. పుట 257 లఘుటీక.

2. పావమానం పరం హ్యేత న్నవమం మండలం పఠేత్ ! ఋగ్విధానము.

అర్వాచీనర్షులు రచించిన సూక్తములు గనవచ్చును, అన్నిటియందును ప్రాచీనర్షులు సందర్శించినవి కనఁబడును. విషయములనుబట్టి చూచినను, అట్టిసామ్యము కనరాక పోదు. అట్టియెడ నిదియే యర్వాచీన మని యెట్లు చెప్పనగును? మఱియు సూక్తములకాలక్రమమును బట్టి మండలము లేర్పడలే దని తెలియుచుండఁగా నిది ప్రాచీన మిది యర్వాచీన మని యెట్లు నిర్ణయింప నగును? తత్త్వ మరయఁగా ఋక్సంహిత యంతయు సప్తమహర్షికుటుంబములకును మఱిమూఁడునాలుగితర మహర్షివంశములకును సంబంధించినట్లు కనఁబడుచున్నది. ఇపుడు సంహితలోఁగన వచ్చుమండలములనుబట్టి చూచినచోఁ దత్కర్తలపౌర్వాపర్యము ముందు వెనుకలై బహువిధముగాఁ గనిపించును జూడుఁడు.

కశ్యపుఁడు - అత్రి - భరద్వాజుఁడు - విశ్వామిత్రుఁడు - గోతముఁడు - జమదగ్ని - వసిష్ఠుఁడు-అనువారు సప్తమహర్షులుగా ఋక్సంహితలోఁ గనవచ్చుచున్నారు. వీరివంశములవా రేయేమండలములతో సంబంధించియుండిరో ముందు తెలిసికొందము.

అంగిరోమహర్షివంశ మనేకశాఖము. అం దొకశాఖకు మూలపురుషుఁ డగు బృహస్పతి కుమారుఁడు భరద్వాజుఁడు సప్తర్షులలోనివాఁడు. సపుత్రుఁ డైనయీ మహర్షి షష్ఠమండలద్రష్ట. ఆభరద్వాజుని పౌత్రుఁడును శునహోత్రుని పుత్రుఁడు నగు గృత్సమదుఁడు ద్వితీయమండలద్రష్ట. ఆంగిరసుఁ డైనయితఁడే శౌనకుఁ డనుపేరభార్గవుఁ డయ్యెనఁట. అందుచే నీఋషి రెండుగోత్రములకుఁ జెందినవాఁ డయ్యెను. రహూగణపుత్రుఁడు గోతముఁడు. ఇతఁడు సప్తర్షులలోని వాఁడు. ఇతనికుమారుఁడు గౌతముఁ డైనవామదేవుఁడు చతుర్థమండలద్రష్ట. ఇషీరథపుత్రుఁడు కుశికుఁడు. అతనికొడుకు గాధి. అతని కుమారుఁడు విశ్వామిత్రుఁడు. ఇతఁడు సప్తర్షులలోనివాఁడు. తండ్రితాతలతోను, పుత్రులతోను గూడినయీవిశ్వామిత్రుఁడు తృతీయమండలద్రష్ట. భౌమవంశములోనివాఁ డత్రి మహర్షి. ఇతఁడు సప్తర్షులలోనివాఁడు. సపుత్రుఁడైన యీ యత్రిమహర్షి పంచమ మండలద్రష్ట. మిత్రావరుణపుత్రుఁడు వసిష్ఠుఁడు సప్తర్షులలోనివాఁడు. సపుత్రుఁ డైనయితఁడు సప్తమమండలద్రష్ట. మఱియు, అంగిరోవంశములో మఱియొక శాఖకు మూలపురుషుఁ డైనఘోరమహర్షిపుత్రుఁ డగుకణ్వునిసంతతివారును, ఆంగిరసులును ; గోతముఁడు నతనిసంతతివారును ; సప్తర్షులలోనివాఁడును మరీచి పుత్రుఁడు నగుకశ్యపుఁడును ; వసిష్ఠపౌత్రుఁడగు పరాశరుఁడును, వృషగిరోవంశములోని యంబరీషాదిరాజర్షులును ; ఇంద్రాగస్త్యదీర్ఘతమః కక్షీవంతులును ; విశ్వామిత్రపుత్రులును మొద లగువారు ప్రథమమండల సూక్తద్రష్టలుగా నున్నారు. కశ్యపుఁడు నతనివారును, వరుణపౌత్రుఁడు భృగుపుత్రుఁడు నై సప్తర్షులలోనివాఁ డగుజమదగ్నియు, అత్రిభరద్వాజ విశ్వామిత్రగోతమ వసిష్ఠాదు

లతోఁ బాటుగా నవమమండలసూక్తద్రష్టలుగా నున్నారు. అష్టమ మండల మెక్కువగా నాంగిరసులకు నాంగిరసు లైనకాణ్వులకును సంబంధించి యున్నది. తక్కువగాఁ గశ్యపాత్రిభరద్వాజవసిష్ఠజమదగ్నివంశములకుఁ జెందియున్నది. దశమమండలమున నదితియుఁ దత్పుత్త్రుఁ డగువివస్వంతుఁడు నతనివంశమువా రగుయమ యమీపుత్త్రాదులును కశ్యపాదిసప్తర్షులును తద్వంశములవారును మఱి కొందఱితరగోత్రములవారును సూక్తద్రష్టలుగాఁ గనవచ్చుచున్నారు. ఇం దొక్క విశేషము. కశ్యపాదిసప్తమహర్షులును గలిసి సందర్శించినసూక్త మొకటి నవమ మండలమందును మఱియొకటి దశమమండలమందును గనవచ్చుచున్నవి. ఈ వివరణమునుబట్టి సప్తర్షిసంబంధము లేనిమండలము లే దని స్పష్టపడుచున్నది గావున దశమండలములలోను బ్రాచీనమహర్షిసూక్తములు కొన్నికొన్ని కల వనియు, నవియు నవీనములును గలసియే యజ్ఞకర్మలయందు హౌత్రోపయోగిగా నుండున ట్లొకక్రమము ననుసరించి సంహితారూపము దాల్చిన వనియుఁ దెలియనగును.

## మండలముల యేర్పాటు.

౨-౩-౪-౫-౬-౭ మండలము లొక్కొక్కమహర్షి కుటుంబములోనివారు దర్శించిన వగుటచే నవి యట్లే నిలచినవి. అందలిసూక్తముల విషయములకు సంబంధించిన యితరర్షులసూక్తములు కూడఁ గొన్నియందందు ప్రవేశించినవి. తక్కిననాల్గును మధ్యమండలములకు సంబంధించునట్లుగా వివిధయాగక్రియోపయోగమున కనుగుణముగాఁ గూర్పఁబడినవి. ద్వితీయాదిమండలద్రష్టలయితర సూక్తము లిందు సందర్భోచితముగాఁ బ్రవేశించినవి. దీనినిబట్టి సూక్తములన్నియు యజ్ఞక్రియార్థము లనెడిభావమును, తదనుగుణ మైనక్రియాచరణమును బ్రబలిన కాలమున నీమండలములయేర్పాటు జరిగియుండు ననుట విదితము. కావుననే మధుచ్ఛందసుని సూక్తములు ప్రథమమండలము మొట్టమొదట నుండుటయు నతని మొత్తాత యగుకుశికునిసూక్తము మూఁడవమండలము కడపటిభాగములోని దగుటయు సమర్థనీయము లగుచున్నవి. సప్తర్షులును వారి పిత్రాదు లగుపూర్వులును దర్శించినసూక్తము లొక్కొక్కచో నుండక విషయమునుబట్టి యన్ని మండలములలో నందం దుండుట కూడ సముచిత మగుచున్నది. వివిధకాలముల లోనివగుపూర్వసూక్తములను దరువాతిమును లొకక్రమ మేర్పఱిచి కూర్చి రనుటకు సంహితలోనే కొన్ని నిదర్శనములు కనఁబడుచున్నవి.

'అష్టమనవమమండలములఁ దప్పఁ దక్కినమండలముల మొదట నగ్నీంద్ర స్తుతిపరము లయినయనువాకములు కూర్పఁబడినవి. ఆ యేర్పా టొకయభిప్రాయముతోఁ జేసినట్లు కనవచ్చును జూడుఁడు,

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. మం. | అనువా— | ౧. అగ్నిస్తుతి. | | ష. మం. | అనువా— | ౧. అగ్ని. |
| ,, | ,, | ౨-౩. ఇంద్ర. | | ,, | ,, | ౨. ఇంద్ర. |
| ద్వి. మం. | ,, | ౧. అగ్ని. | | స. మం. | ,, | ౧. అగ్ని. |
| ,, | ,, | ౨. ఇంద్ర. | | ,, | ,, | ౨. ఇంద్ర. |
| తృ. మం | ,, | ౧-౨. అగ్ని. | | ద. మం. | ,, | ౧. అగ్ని. |
| ,, | ,, | ౩-౪. ఇంద్ర. | | అ. మం. | ,, | ౧. ఇంద్ర. |
| చ. మం. | ,, | ౧. అగ్ని. | | న. మం. | ,, | ౧. ఇంద్ర. |
| ,, | ,, | ౨-౩. ఇంద్ర. | | | | |
| పం. మం. | ,, | ౧. అగ్ని. | | | | |
| ,, | ,, | ౨. ఇంద్ర | | | | |

ఇందు కొన్నియనువాకములు పూర్తిగా నగ్నీంద్రస్తుతి పరములుకాక పోయినను, వాతిస్తుతితోనే ప్రారంభింపఁబడి యున్నవి. అష్టమనవమమండలముల ప్రథమసూక్తములు క్రమముగాఁ బ్రగాధ సోమ సూక్తము లనుపేళ్లు గలవి. అవియు నింద్రారాధనోద్దిష్టములుగానే యున్నవి. ఇట్లు మండల ప్రథమ భాగము లొక్కరీతి నుండుట యర్వాచీనమునికృతము గాక సహజ మనఁదగునా? మఱియు:—

సూక్తములలో, ఆప్రీసంజ్ఞ కలవి పది యున్నవి. అం దొక్కొక్క సూక్తమున ౧౧ ఋక్కులచొప్పున నుండునుగాని, ఒకదానిలో ౧౨ మఱియొకదానిలో ౧౩ ఋక్కులు కనఁబడుచున్నవి. ఆఋక్కులు, ఇధ్మాగ్ని లేక సమిద్ధాగ్ని - తనూనపాదగ్ని - నరాశంసాగ్ని - ఇడగ్ని - బర్హిరగ్ని - యజ్ఞశాలా ద్వారాభిమాన్యగ్నులు - ఉషోనక్త దేవతాగ్నులు - దైవ్యహోతృకనామకాగ్నులు - ఇళా సరస్వతీ భారతీ సంజ్ఞకాగ్నులు - త్వష్టృనామకాగ్ని - వనస్పత్యగ్ని - స్వాహా కృత్యగ్ని - అను ద్వాదశవిధరూపములతో నున్నయగ్నిదేవుని స్తుతించునవి గా నున్నవి. వేఱువేఱుఋషులు సందర్శించిన యాసూక్తములు ౪, ౬, ౮ మండలములలోఁ దప్పఁ దక్కిన మండలములలో, తత్తత్కుతు విశేషస్తుత్యర్థములు గాఁ గూర్పఁబడినవి. ఆక్రమ మిది:—

| మం. | సూక్త. | ఋక్కు. | ఋషి. | మ. | సూక్త. | ఋక్కు. | ఋషి. |
|---|---|---|---|---|---|---|---|
| ౧. | ౧౩ | ౧౨ | మేధాతిథి | ౫ | ౫ | ౧౧ | వసుశ్రుతుఁడు. |
| ౧. | ౧౪౨ | ౧౩ | దీర్ఘతముఁడు | ౭ | ౨ | ౧౧ | వసిష్ఠుఁడు |
| ౧. | ౧౮౮ | ౧౧ | అగస్త్యుఁడు. | ౯ | ౫ | ౧౧ | అసితుఁడు. |
| ౨. | ౩ | ౧౧ | గృత్సమదుఁడు | ౧౦ | ౭౦ | ౧౧ | సుమిత్రుఁడు. |
| ౩. | ౪ | ౧౧ | విశ్వామిత్రుఁడు. | ౧౦ | ౧౧౦. | ౧౧ | జమదగ్ని. |

వీనిలో మొదటి రెండు సూక్తులయందలి పన్నెండేసి ఋక్కులును ద్వాదశవిధాగ్నిస్తుతి పరములు. రెండవదానిలోఁ గడపటిది యింద్రస్తుతిపరము. తక్కిన వానిలో 3-౫-౮-౧౧ సూక్తములలో నరాశంసాగ్నిస్తుతి లేదు, ౮-౬-౭-౯ సూక్తములలో, తనూనపాదగ్నిస్తుతి లేదు. ఇంతే భేదము. తక్కినవివిధరూపాగ్నిస్తుతి యన్నిటియందు సమానముగా నున్నది.

ఈ యాప్రీసూక్తములు పదియును బదిఋషికుటుంబములకు సంబంధించి యున్నవి. ఆ కుటుంబముల ప్రధానమహర్షులు - కణ్వుఁడు - అంగిరస్సు - అగస్త్యుఁడు - శునకుఁడు - విశ్వామిత్రుఁడు - అత్రి - వసిష్ఠుఁడు - కశ్యపుఁడు - వధ్ర్యశ్వుఁడు - జమదగ్ని - అనువారు. ఆప్రీసూక్త కర్తలలో జమదగ్ని వసిష్ఠ విశ్వామిత్రులు గాక తక్కినవారు పై ప్రధానమహర్షుల వంశముల లోనివా రని ఋషుల పట్టికవలనఁ దెలియఁగలదు. ఇంక నిట్టినిదర్శనములు కొన్ని కలవు కాని, పైవిషయములనుబట్టి చక్కఁగా నాలోచించినచో మండలములు సహజముగానే యిట్లేర్పడియుండలే దనియు నర్వాచీనులుః వాని నిట్లు సంతరించి యుందు రనియుఁ దెలియకపోదు. ఇట్లు సమకూర్పఁబడిన మండలములలో, నందును గడపటిమండలములలోఁ గొన్ని యర్వాచీన సూక్తములు గూడఁ జేరియున్న వనవచ్చును గాని, తరువాత బయలుదేఱిన యితిహాసముల నాధారముగాఁ జేసికొని, ప్రాచీ నార్వాచీన మహర్షుల నామము లొకటిగాఁ గనవచ్చినంత మాత్రమున నితఁడే యతఁ డని భ్రాంతిపడి సూక్తముల పౌర్వాపర్యము నిర్ణయించుటమాత్ర ముచితము కా దనవలెను. ఇందుకు గృత్సమదునియితిహాస మొకదృష్టాంతము. భారద్వాజగోత్రుఁడు శునహోత్రపుత్రుఁడు నయినగృత్సమదుని భృగుకులమున జన్మింపఁజేసి యతనికి శౌనకుఁ డనుపేరు కల్పించి యాశౌనకుఁడే ద్వితీయమండలద్రష్ట యైనట్లు వర్ణించునొకయితిహాసమునుబట్టి బృహద్దేవతాదిలక్షణకర్తయగు శౌనకుఁడే ద్వితీయమండల సూక్తకర్త యైనట్లు తలంచుట యుచితమా ? ఇట్లనుటచే ఋక్సంహితలో నర్వాచీనసూక్తములు లే వని నాయభిప్రాయము కాదు. కొన్ని యున్నవి. అవి యైనను బ్రాహ్మణములకుఁ బూర్వములు కాని పరములు కా వనియు ఋషులమహత్త్వము దెల్పఁ దరువాతివా రెవరో కల్పించినకథలనుబట్టి పౌర్వాపర్యమును దేల్చుట సరి గా దనియుఁ దలంప నగును. ఇందుకు వైదికర్షులయితిహాసములుగూడఁ గొన్ని చవిచూతము.

### ఋషుల యితిహాసములు.

౧. శ్యావాశ్వునికథ.— "పూర్వకాలమందు దార్భ్యుఁడై నరథవీతి యను రాజు కలఁడు. అతఁడు యజ్ఞము చేయఁబూని, అత్రిమహర్షిపుత్రుఁడై న 'అర్చనాను'డను ఋషి నార్త్విజ్యము చేయఁ బ్రార్థించెను. అతఁడు దాని నంగీకరించి

శ్యావాశ్వుఁ డను తనపుత్రుని వెంటఁబెట్టుకొని వెళ్లి యజ్ఞము జరిగించుచుం డెను. అంత నొకసమయమున రథవీతికూఁతురు సర్వలక్షణసంపూర్ణ యగుకన్య యజ్ఞశాలకు వచ్చి తండ్రివద్దఁ గూరుచుండెను. అత్రిపుత్రుఁ డాపిల్లను జూచి, ఇది నాకోడలయిన బా గుండు నని తలఁచి 'రాజా! ఈకన్యను నాసుతుని కిచ్చి పెండ్లి చేయు'మనికోరెను. అతఁ డందు కిష్టపడియు, తనభార్య యేమిచెప్పునో యని యామె నడిగెను. ఋషి (మంత్రద్రష్ట) కానివానికి మన మింతకు మున్ను పిల్ల నిచ్చియుండ లే దని యామె బదులుచెప్పెను. రా జామాట విని, యవ్వను నిజమే యని, అనృషికి మేము కన్య నివ్వ మని యాత్రేయునితోఁ జెప్పెను. శ్యావాశ్వుఁ డామాట విని నిరాశుఁడై వెడలి బ్రహ్మచర్యరతుఁడై శాంతుఁడై మహాతప స్సానరించుచు నొకనాఁడు భిక్షార్థమై తరంతమరాజుగృహమున కేగి యతనిపత్నియుఁ బరమసాధ్వియు నగుశశీయసి యనుపట్టమహిషిని భిక్ష వేఁడెను. ఆమెయుఁ దపశ్శాలి వచ్చినందు కానందించి యావార్త భర్తతోఁ జెప్పెను. అతఁడును సంతోషించి యామునీంద్రుని బూజింపు మని నుడివెను. అంత శశీ యసి గోశతములు నాభరణములు నతనికి దానముచేసెను. అంతలో రాజు వచ్చి యతనికి ధన మిచ్చి సత్కరించి తనసోదరుఁ డగుపురుమీళ్హునివద్దకుఁ గూడ వెడలి యతనిసత్కారము లందుకొను మని చెప్పి పంపెను. శ్యావాశ్వుఁడు నట్లే యని పయనమై పోవుచు మార్గమధ్యమునఁ దన్నుఁ జూడఁదలఁచి వచ్చినసమాన దివ్యరూపులగుమరుద్దేవతలను సందర్శించి ప్రాంజలియై మ్రొక్కి యర్థవంతము లగునుత్తమవాక్కులతో వారిని స్తుతించెను. ఆస్తుతివాక్యములకు వారు సంతో షించిరి. వానిచేత నే శ్యావాశ్వుఁడును సూక్తద్రష్ట యైనఋషి యయ్యెను. అంత మరుత్తులు శ్యావాశ్వునికి సువర్ణ మిచ్చి వెడలిపోయిరి.

పిదప శ్యావాశ్వుఁడు తనకు లభించిన ఋషిభావమునకును ధనకనకాది లాభమునకును హృష్టుఁడై పితృగృహమునకుఁ దరలిపోయి "నేను ఋషి నయితిని గదా! రథవీతికన్యను బరిణయమాడ నర్హత కలిగినది" అని తలంచి యారాజ పుత్రిని మనసార ధ్యానించుచు మనోరథావేశమున నొకరాత్రి, రథవీతితో 'నాఋషిభావము తెలుపుమ'ని రాత్రిదేవిని దూత్యమొనరింప వేఁడుకొనెను. ఆరాత్రిదేవియు నట్లొనరించెను. రథవీతియు శ్యావాశ్వునియార్షమును విని తనకన్యను వెంటబెట్టుకొని యర్చనానసునియింటికి వచ్చి మున్ను మీకోరికను నిరాకరించినందుకు క్షమింపు మని యతనిఁ బ్రార్థించి, 'నీపుత్రుఁడు వేదపితయై ఋషి యయ్యెను. నీవు ఋషిజనకుఁడ వైతివి. నీసంబంధ మవశ్యవాంఛనీయ మయ్యెను' అని పలికి శ్యావాశ్వునికిఁ దనకూఁతురి నిచ్చి మహావైభవముతో నుద్వాహము జరిగించి యానూతనదంపతులకు ధనకనకవస్తువాహనము లరణ మిచ్చి తా నరణ్యమునకుఁబోయి తపోనిష్ఠ నుండెను." ఆసందర్భమున శ్యావా

శ్వనినోట వెలువడినవాక్యము లన్నియు ఋక్కులై ఋగ్వేదపంచమమండల మున ౬౧,౬౨ సూక్తములుగా వెలయుచున్నవి.

౨. వామదేవునికథ. — మాతృగర్భమున నున్నవామదేవుఁడు వెరఁగి జ్ఞానసంపన్నుఁడై "నేను గర్భము ప్రక్కనుండి బయటఁ బడుదును గాని యోని మార్గమున బయటికిఁ బోవువాఁడను గాను' అని యాలోచించుకొనుచుండెను. ఆయాలోచన మతనితల్లి తెలిసికొని శాంతికై, ఇంద్రుని-అతనితల్లియగునదితిని ధ్యానించెను. వారును సత్వరముగ నామెయాశ్రమమునకు వచ్చిరి. అపు డిం ద్రుఁడు గర్భస్థుని సంబోధించి 'ఓయీ! యోనిమార్గమున దేవత లందఱు జన్మించిరి. అట్టియెడ మనుష్యు లట్లే పుట్టిరని చెప్పవలెనా? చిరకాలగర్భవాస మున నీతల్లి కపాయము కలిగింపక సహజమార్గమున రమ్మని పలికెను. అపుడు గర్భస్థుఁడు "ఇంద్రా! నీవు చెప్పినది స్వాభావికమే యైనను, ఆమార్గము మిక్కిలి దుఃఖకరము కావున నేనట్లు రాను. నాతల్లి కపాయము కలిగింపవద్దని నీవు నాకు బోధించితివి గాని, అనేకసంవత్సరములు నీతల్లి నిన్ను గర్భమున భరింపలేదా? అపుడు నీ వామెకుఁ గ్లేశము గలిగింపలేదా? అని బదులుచెప్పెను. అంత నదితి యతనిని వారించి 'కుమారా! ఇంద్రునిసాటి యేదేవతలకును రాదు. అతఁడు చేసిన మహాకార్యములే యతనిమహత్త్వమును దెల్పు ననుచు నింద్రునికృత్య ములు కొన్ని చెప్పెను. అపుడు వామదేవుఁడు దౌర్గత్యశాంతిని గోరుచుఁ బలికెను.

ఇత్యాదిగా నున్నవారిసంవాదమే చతుర్థమండలమున ౧౮-వ, సూక్త ముగా నున్నది.

3. గోతమునికథ.—ఇతఁ డొకయాశ్రమమున ఘోరతప స్సొనరించుచు నొకనాఁడు మిక్కిలి పిపాసార్దితుఁడై మరుత్తులను ధ్యానించి జల మిమ్మని కోరెను వారును దగ్గఱనే యున్నకూపము నచ్చటికిఁ దెచ్చి యొకచోట స్థాపించి యందలి జలముచే నాఋషినిసంతృప్తుని గావించిరి. దానిచే నతఁడు సేదదేఱి యామరు త్తులను స్తుతించి మఱియుఁ దనకు ధనధాన్యపుత్త్రాదిసంపద గలిగింపుఁ డని వేఁడు కొనెను. ఈకథ ప్రథమమండలము ౮౫-వ, సూక్తములోఁ గొన్నిఋక్కులందు గలదు.

౪. అత్రికథ:—అత్రిమహర్షి తనయాశ్రమమునఁ దపస్సు చేసికొను చుండఁగా రాక్షసులు వచ్చి యతనిని మంటలోఁ బడఁద్రోసిరి. అతఁ డావేఁడిమికి సహింపలేక శైత్యసుఖము గలిగింపుఁ డని యశ్విదేవతలను స్తుతించెను. వా రాస్తోత్రమునఁ బరితుష్టులై యగ్నిజ్వాలలబాధ కలుగకుండ నతనిని రక్షించిరి. అత్రి గావించినయశ్విదేవతాస్తుతియే ప్రథమమండలమున ౧౮౦వ, సూక్త మయినది.

౫. భుజ్యునికథ :— అశ్వీదేవతలకు మిత్రుఁడైనతుగ్రుఁ డనుపేరు గల రాజర్షి యొకఁ డుండెను. ద్వీపాంతరవాసు లతనియెడ వైరము వహించి యకస్మాత్తుగా వచ్చి తుగ్రునికి నతనివారికిని బాధ కలిగించి పోవుచుండిరి. వారిని జయించినఁ గాని యీపీడ తప్ప దని తలఁచి యతఁడు తగినసేనతోఁ గూడఁ దన పుత్రుఁ డయినభుజ్యుని వారిని గెలిచి వచ్చుటకై నావమీఁద ద్వీపాంతరమునకుఁ బంపెను. సేనాయుతుఁ డగుభుజ్యుఁడు నావ యెక్కి సముద్రమునఁ జాలదూరము వెళ్లినపిదపఁ బెద్దగాలి దెబ్బవలన నతనినావ పగిలిపోయెను. అంతట భుజ్యుఁడు ధైర్యము వహించి నిశ్చలచిత్తతతో నశ్వీదేవతలను స్తుతించెను. దానికి వారు సంతుష్టులై నావ లెక్కి వచ్చి సైనికులతోఁ గూడ భుజ్యుని దమనావలమీఁద నెక్కించుకొని మూఁ డహోరాత్రములు గడచునప్పటికి నొడ్డు చేర్చి తుగ్రుని యొద్దకుఁ గొంపోయి యతని కప్పగించిరి :— ఈ స్తుతి ప్రథమమండలము ౧౧౬ వ, సూక్తమునఁ గనవచ్చును.

౬. దీర్ఘతమునికథ :— ఉచథ్యుఁడు బృహస్పతియు నను నిద్దఱు ఋషులు లోకయాత్రమమున నివసించుచుండిరి. వారిలో నుచథ్యునిభార్య యైనమమతాదేవి గర్భవతియై యుండఁగా నొకనాఁ డామని యింట లేనిసమయమున బృహస్పతి యామెను మఱొకచోటికిఁ గొంపోయి యామెతోఁ గ్రీడింపఁజొచ్చెను. అపుడు గర్భస్థుఁ డైనశిశువు 'ఓ మునీ! నేను గర్భమం దింతకు మున్నే యున్నాను. రేతస్సాంకర్యము గావింపకుము' అని వారించెను. అంత బృహస్పతి క్రీడానివృత్తుఁడై కినిసి "ఓ గర్భస్థా! క్రీడాభంగము గావించితివి గావున నీవు జాత్యంధుఁడవు క"మ్మని శపించెను.

అనంతరము మమత శిశువును గనెను. పుట్టుగ్రుడ్డి యైన యాశిశువే దీర్ఘతముఁడు. అతఁడు దృష్టిలేమికి వగచి, అగ్నిదేవుని బ్రార్థించెను. అగ్నియు నాబాలునిస్తుతికి మెచ్చి దృష్టి యిచ్చెను. (౧ మం. ౧౪౭. సూ) ఈ దీర్ఘతముని గూర్చి యనేకకథ లీమండలమునఁ గనవచ్చును.

౭. వృశునికథ. — ఇక్ష్వాకు వంశపురాజయినత్రివృష్ణునిపుత్రుఁడు త్ర్యరుణుఁడు. అతని పురోహితుఁడు జననామకమహర్షికుమారుఁడు వృశుఁడు. రాజసంరక్షణార్థము పురోహితులు రథము నడపుట యారాజవంశమందలి యాచారము. దానినిబట్టి యొకనాఁడు త్ర్యరుణుఁడు రథారూఢుఁడై యొకయెడకో బయలుదేఱ వృశుఁడు గుఱ్ఱములపగ్గములు చేతఁ బూని రథము నడపుచుండెను. అరదము కొంతదూరము పోవునప్పటికి మార్గమధ్యమున నొకబ్రాహ్మణబాలుఁడు దానిక్రిందఁ బడి మృతినొందెను. వృశుఁడు వెంటనే రథ మాపి యాబాలు నీవలికిఁ దీసి 'రాజా! బ్రాహ్మణకుమారుని జంపితివి గదా!' యనెను. నీ వీపిల్లవానిమీఁద రథము నడపి నేను జంపితి ననెద వేల 'యని రా

జనెను. 'నీవు రథస్వామివి గావున నీవే ఘాతుకుఁడ' వని వృశుఁ డన, 'నీవు రథ చోదకుఁడవు గావున నీవే ఘాతుకుఁడ'వని మరల రా జనెను. ఇట్లు 'నీ వంటే నీ' వని వా రిద్దఱు వివాదపడి పెద్దరాజునొద్దకు వెళ్లిరి. అతఁడు జరిగిన సంగతి విని, రథము తోలినవాఁడే ఘాతుకుఁ డని తీర్పు చెప్పెను. అది విని వృశుఁడు తనపైఁ బడినదోషము పరిహరించుకొనఁ దలఁచి, ఋగాత్మకసామమున గాన మొనరించి యావిప్రబాలుని బ్రతికించెను. దానిచే నా పిల్లవాని తల్లి దండ్రులు నితరులు నానందించిరి. అంత వృశుఁడు 'ఈరాజులు నాపై దోషమారోపించిరి గావున వీరియిండ్లలో నగ్ని ప్రజ్వరిల్లకుండుఁగాక యని మనస్సులోనే శపించి వెడలి పోయెను.

ఐక్ష్వాకులగృహములలో నిప్పు రాఁజలేదు. వంటలు లేవు. భోజనములు లేవు. రాచనగరిలో గోల పుట్టినది. పెద్దలకుఁ దెలిసినది. వా రందఱు కలసి యాలోచించి బ్రాహ్మణశాపమే యిందుకుఁ గారణమని నిశ్చయించి వృశుని బిలిపించి క్షమింపు మని ప్రార్థించిరి. అపు డాఋషి మఱియొకసామమున గానము చేసెను. యథాపూర్వముగా రాజగృహములలో నగ్ని ప్రజ్వరిల్లెను. (ఇది ౫ మం. ౨-వ, సూక్తమందున్నది) ఈకథ శాట్యాయన బ్రాహ్మణమున శ్లోకరూపమున నున్నది.

౮. అపాలకథ.—అపాల యనునామె యత్రిమహర్షికూఁతురు. బ్రహ్మ వాదిని. దైవికముగా నామె చర్మరోగముపాలైనది. అందుచే భర్తచే విడువఁ బడినయాతన్వి తండ్రియింటనే వసియించుచుఁ జర్మరోగనివారణార్థ మింద్రుని గూర్చి తపస్సు చేయ నారంభించెను. ఒకనాఁ డాయువతి, 'ఇంద్రునికి సోమ మిష్టముగదా! దానిని సంపాదించి యతనికి సమర్పించెద'నని తలఁచి నదీతీరము నకుఁ బోయి యందందు సోమలతకై వెదకి యెందును గానక, యేటిలో స్నానముచేసి వచ్చుచుండఁగా దారిలో నొకచోట సోమలత కంటఁబడెను, సంతోషముతో దానిముక్క యొకటి గైకొని యింటికి వచ్చుచు నాముక్క నోటఁబెట్టుకొని కొఱికెను. ఆచప్పుడు యజ్ఞము కొఱకు ఱాళ్లతో సోమలత చితుకఁగొట్టినచప్పుడువలె వినవచ్చుటచే నింద్రుఁ డచ్చటికి సిద్ధమై 'యిక్కడ గ్రావములతో సోమలత నలఁగఁగొట్టి రసము తీయుచున్నారా'యని యామె నడిగెను. అందు కపాల 'లేదు లేదు. ఒకకన్య స్నానము చేసి వచ్చుచు దారిలో దొరకినసోమమును, కొఱికి నమలుచున్నది. ఆచప్పుడు నీ కట్లు వినిపించినది కాఁబోలు'నని బదులుచెప్పెను. ఆమాట విని యింద్రుఁడు మరలి పోవుచుం డఁగా నామె "ఏమి! తిరిగి పోయెద వేల? నీ వింటింటికి సోమమునకుఁ దిరుగువాఁ డవు గా నున్నావు. ఇపుడు నాపండ్లతోఁ బిండినసోమరసము త్రాగి పొమ్ము" అని పలుకుచు, నత డింద్రుఁ డని యపుడు గ్రహించి "అయ్యా! నీ వింద్రుఁడ

వని మొదట గ్రహింపలేక పోయితిని. నీవు మాయింటికి రమ్ము. బహు మాన మొనరింతు నని ప్రార్థించి, యతఁడు తిరిగి సమీపించినంతనే 'ఓ సోమమా! ముందు మెల్లగాను బిదప వడిగాను నీ విం(ద్రునిగూర్చి స్రవింపు' మని నోటిలో నున్న సోమమును గోరెను. అపు డింద్రుఁ డామెను గామించి యామెనోటిలో నోరు పెట్టి సోమము పానముచేసెను. అపుడపాల 'చర్మ దోషమున నేను భర్తచే విడువఁబడియు నింద్రునిచే నాదరింపఁ బడితి' నని పలికెను. ఆమాట విని యింద్రుఁడు 'నీ కేమి కావలెనో కోరుకొను' మన, నామె "నాతండ్రి బట్టతలమీఁద శిరోజములు మొలవవలెను. నాజన కునియూషరక్షేత్రము ఫలవంతము కావలెను. నాచర్మరోగము పోవలెను' అని మూఁడు కోరికలు కోరెను. అందు కింద్రుఁడు "నీ మొదటికోరికలు ఫలించును. నీశరీరము సుప్రకాశ మగునట్లు చేయుదును" అని చెప్పి, యపాలను రథచక్ర రంధ్రమునఁ బెట్టి మూఁడు సార్లు గిరగిరఁద్రిప్పెను. దానిచే నాయాత్రేయి దేహము సూర్యసదృశమై ప్రకాశింపజొచ్చెను" (మం. ౮. సూ-౯౧).

ఇట్లన్ని మండలములలోను బహువిధము లైనయితిహాసము లసంఖ్య ముగా నున్నవి. వీనినిబట్టి చూడఁగాఁ బూర్వకాలమున ఋషులు సంతోషసమ యమునఁ గాని యాపత్సమయమునఁగాని దేవతలను దమమేలుకొఱకుఁ బ్రార్థించు నపుడు గాని యితరుల నేదయినఁ గోరునపుడు గాని ప్రకృతివైచిత్ర్యములను గన్నులారఁ జూచినపుడు గాని తన్మయతఁ జెంది కావించిన ఋగాత్మకము లైన వర్ణనములే సూక్తము లైన వనియు నట్టివి యజ్ఞార్థములై తత్తద్దృషిదృష్టము లైనసూక్తములతో సందర్భోచితముగా నయ్యామండలములఁ గూర్పఁబడిన వనియు గ్రహింపఁదగును. మఱియు నిట్టికథలలో నేవో కొన్ని విశ్వసనీయము లుగా నున్నను, అవిశ్వసనీయములు నచింతనీయములు నత్యద్భుతములు నగు కథలే యపరిమితముగాఁ గనవచ్చుటచేఁ దరువాత బయలుదేఱిన యైతిహాసి కులు, సూక్తములందును గొన్ని ఋక్కులందును గనవచ్చు చిన్నచిన్న కథా బీజములను మెల్లగా మొలకెత్తించి పూర్వర్షులయితిహాసములుగా నారణ్యకాదు లందు వర్ణించి రని గ్రహింపఁదగునుగాని, యందు గొన్ని యసంగతవిషయము లున్నను, అవియే యాఋషులచరిత్రము లని మాత్రము విశ్వసింపరాదు. ఇఁకనో, ఋషులుగూడ ననంగత విషయములతోడి కొన్ని యితిహాసములను సూక్తములందు వర్ణించినట్లు కనఁబడుచున్నను, ఐహికాముష్మికజ్ఞానములను బోధింపఁ బ్రవృత్తము లయినయట్టి వానియందలిభావము మాత్రమే మనకు గ్రాహ్యము గాని వానిసత్యాసత్యత్వవిచారణ యావశ్యకము గా దనుట స్పష్టము కావున నిఁక నీవిషయ మిట్లుంచి దేవతలనుగూర్చి కూడఁగొంత విచా రణ చేయుదము.

## ఋగ్వేద దేవతలు.

ఏఋక్కు లెవరిని బ్రతిపాదించునో లేక స్తుతించునో లేక యాహ్వానించునో, వారు వానికి దేవత లనెడియనుక్రమణికానియమమునుబట్టి దేవతల సంఖ్య కొన్నివంద లుండునుగాని యట్టివా రందఱు నతిమానుషలక్షణలక్షితులైనదివ్యులు కారు. కొన్నిఋక్కులకుఁ దత్కర్త లగుఋషులే దేవత లగుదురు. కొన్ని సంవాదసూక్తములలో నుద్దేశింపఁబడిన స్త్రీపురుషు లెవ రయినను దేవత లగుదురు. ఇందు కొకయుదాహరణము. ఊర్వశి పురూరవు నుద్దేశించి సంభాషించునపుడు పురూరవుఁడు దేవత యగును. పురూరవుఁ డూర్వశి నుద్దేశించి మాటలాడునపు డూర్వశి దేవత యగును. ఈపద్ధతిచేఁ గొన్నిసూక్తములలోఁ దిర్యక్కులుగూడ దేవత లగుట సంభవించినది. ఇది యనుక్రమణికాపద్ధతి. ఐతిహాసికపద్ధతియు దేవతానిర్ణయమున దీనితో నేకీభవించును. కాని నైరుక్తులదేవతానిర్వచనపద్ధతి యింతకంటె వేఱుగా నుండును.

'ఈదేవత యనుగ్రహమున నా కీయర్థము సిద్ధించుఁగాక'యనుబుద్ధితోఁ ఋషి యగువాఁ డేమంత్రముచే నేదేవతను స్తుతించునో, యామంత్రము తద్దేవతాక మగును. ఆస్తుతి, నామస్తుతి బంధుస్తుతి కర్మస్తుతి రూపస్తుతి యని చతుర్విధము. మఱియు నామంత్రములు, పరోక్షకృతములు ప్రత్యక్షకృతములు ఆధ్యాత్మికములు నని త్రివిధములు. అందు:—

ప్రథమాదినామవిభక్తి ప్రయుక్తములు ప్రథమపురుషనిర్దిష్టములు పరోక్షకృతములు. ఉదా:—

"ఇంద్రో దివ ఈశే పృథివ్యాః, ఇంద్ర మిద్ గాథినో బృహత్.— ఇంద్రుఁడే దివికిని భువికి నీశ్వరుఁడు, ఓసామగులారా! ఇంద్రుని బృహత్సామచే స్తుతింపుడు." ఇత్యాదిసర్వవిభక్తియుక్త మయినస్తుతి పరోక్షకృత మని భావము.

మధ్యమపురుషప్రయుక్తములు ప్రత్యక్షకృతములు. ఉదా:— "త్వ మింద్ర బలా దధి, కణ్వా అభి ప్రగాయత,-ఇంద్రా! నీవు పరాభిభవసమర్థమైనబలమువలన విఖ్యాతుఁడ వైతివి. ఓకణ్వులారా! మీరు గానముచేయుఁడు" ఇట్లు మధ్యమపురుషసర్వనామ ప్రయుక్త మయినస్తుతి ప్రత్యక్షకృత మని భావము.

ఉత్తమపురుషయుక్తము లాధ్యాత్మికములు. ఉదా:—"అహం రుద్రేభి ర్వసుభి శ్చరామి,-నేను రుద్రులతోను వసువులతోను గలసి సంచరించుచున్నాను" ఇట్లుత్తమపురుష సర్వనామప్రయుక్త మయిన దాధ్యాత్మిక మని భావము.

ఇట్లు త్రివిధస్తుతి రూపములుగాక మిగిలిపోయిన మంత్రము లేయజ్ఞమం దుపయుక్తము లగుచున్నవో దాని దేవతయే వానికిని దేవత యగును. అనఁగా

నట్టిమంత్ర మగ్నిష్టోమమున నుపయోగింపఁబడె నేని దాని కగ్నియే దేవత యని భావము.

అనుచు నైరుక్తులు బహుళముగా ఋగ్దేవతా స్వరూపము దెలిపి యున్నారు. ఇదియుఁ జైయనుక్రమణికాపద్ధతి నే పోలియున్నట్లు కనఁబడును గాని వారి దేవతాసంజ్ఞల నిర్వచనము మాత్రము భిన్నముగా నుండును. పురూరవ శ్శబ్దమునకు బహువిధముగా ధ్వనిచేయునట్టిప్రాణ మని వా రర్థము చెప్పుదురు. ఇట్లే యెన్నో సంజ్ఞలకు వారినిర్వచనములు విచిత్రముగాఁ గానవచ్చును. మఱియును ఋభువులు మనుష్యులయ్యుఁ దపశ్శక్తిచే దేవత్వమును బొంది రనియు, ఆంభృణి బ్రహ్మవిద్యాపారీణురాలై దేవతాత్వము చెందిన దనియు నిట్లే మఱి కొందఱు మానవులు దేవత్వము ప్రాపించి రనియుఁ గొన్ని ఋక్కులే చెప్పుచున్నవి. ఇట్లున్నవివిధ పద్ధతులనుబట్టియు యాజ్ఞికపక్షమునుబట్టియు ఋగ్వేద దేవతలు దాదాపు మూఁడువందలమంది లెక్కకు వత్తురు. వారిలో దివ్యలక్షణ లక్షితులై మహామహిమసంపన్నులు గా వర్ణింపఁబడినవారు సుమారు ముప్పది మందికంటె నెక్కువగా నుండరు. వారిలోను, అగ్నీంద్ర సోమమిత్రవరుణ మరుదశ్వి విశ్వేదేవాది సంజ్ఞలు గలవా రల్పసంఖ్యాకులు ప్రధానదేవతలు. ప్రథమమండలమున రమారమి ౮౦ సూక్తముల నగ్నియు ౯౦ సూక్తముల నింద్రుఁడును వర్ణింపఁబడియున్నా రనుటయె వైదేవతలలోఁ గూడ నింద్రాగ్ను లత్యంతప్రధాను లని తెలుపఁగలదు. మొత్త మన్నిమండలములలోను సుమారు ౨౫౦ సూక్తముల నింద్రుఁడును, ౨౦౦ సూక్తముల నగ్నియు, ౧౦౦ సూక్తముల సోముఁడును స్తుతింపఁబడిరి. పర్జన్యమృత్యుయమాదులు కొందఱు మూఁడేసి సూక్తముల నుతింపఁబడిరి. తక్కినవారిలోఁ బ్రధానదేవతలను వర్ణించు సూక్తములు నూటికిఁ దక్కువగాను మూఁటి కెక్కువగాను గనిపించును. దీనినిబట్టి చూడఁగాఁ దరువాతికాలమున శివకేశవుల కెట్టిప్రాధాన్యము వచ్చినదో, అంత కంటె నధిక మైనప్రాధాన్యము ఋగ్వేదకాలమున నింద్రాగ్నులకుఁ గల దని స్పష్ట మగును.

మఱియు నందందలి ఋక్కులనుబట్టి చూడఁగా, పృథివీస్థానులు, అంతరిక్షస్థానులు, ద్యుస్థానులు, అని దేవతాస్వరూపులు త్రివిధముగాఁ గనవచ్చుచున్నారు. అట్టివారిలో నగ్నియు, వాయువు లేక యింద్రుఁడు, సూర్యుఁడు, నయ్యాస్థానములనుబట్టి ప్రధానదేవతలుగా వర్ణింపఁబడిరి. వారిలోను సూర్యుఁడే తక్కిన దేవతల నిజరూప మనియు, నతఁడే కార్యవశమున వివిధదేవతారూపము దాల్చె ననియు మఱికొన్ని వర్ణనలు కనఁబడుచున్నవి. ఇందుకొక యుదాహరణము:—

"దేవతాతత్త్వవేత్త లయినమేధావు లాదిత్యునే యింద్రునిగాను మిత్రునిగాను వరుణునిగాను, అగ్నినిగాను దివ్యుఁడు సుపర్ణుఁడు నైనగరుత్మంతుని గాను యమునిగాను మాతరిశ్వునిగాను జెప్పుచున్నారు"[1].

ఇత్యాదులందు త్రివిధస్థానదేవతాత్మత్వ మాదిత్యున కారోపింపఁ బడినది. మఱియొకచో నగ్నియే సర్వదేవతాస్వరూపుఁ డని వర్ణింపబడినది[2]. ఇంకొకచో సకలదేవతా స్వరూపుఁడు సర్వజగన్మూలపురుషుఁడు నతీతాగామిసృష్టిమయుఁడు విరాట్పురుషుఁ డని వర్ణింపఁబడినది[3].

ఇట్లు కనవచ్చు వివిధవర్ణలనుబట్టి మంత్రద్రష్ట లైనబుషు లాయా సమయముల నిందాహర్షశోక ప్రశంసాదులలో నేదోయొకటి కారణముగా నీశ్వరమహిమావిష్కృతు లయిన యగ్ని వాయ్వాదిత్యాదులను, అణిమా ద్యైశ్వర్య సంపన్ను లైనవారి రూపాంతరములను, మఱియు నశ్వాదిసత్వ ములను నదీపర్వతౌషధీలతాదులగు నచేతనములనుగూడ వర్ణించి యుండిరనియు, అట్టి వన్నియు యాజ్ఞికపక్షమున దేవతలుగాఁ బరిగణింపఁబడిన వనియుఁ దెలియ నగును. అంతే కాని, "నాఁటిబుషులు చెట్టు పుట్ట గూడ దేవత లనియే భావిం చెడివారు. ఐకాత్మ్యతత్త్వమే యెఱుఁగ"రని మాత్రము భావింపరాదు. ఈ విషయము తత్త్వజ్ఞాన మను శీర్షికక్రింద ముందు విచారింపఁబడును గావున నిపుడు బుషులదేవతావర్ణనములందలి విశేషములు కొన్ని గ్రహింతము.

పరమేశ్వరసంకల్పసిద్ధ మైనపంచమహాభూత సృష్టిలో దృశ్యములును జ్ఞేయములును జేతనాచేతన రూపములు నయినయుత్తమపదార్థము లన్నియుఁ గార్యకారణాభేదభావమునఁ దత్తద్ధర్మానుగుణముగా బుగ్వేదమున వర్ణింపబడినవి. అట్టిదేవతలరూపములు తఱుచుగాఁ బురుషవిధములుగానే కల్పింపఁబడినవి. అనఁగా మానవపురుషులకువలె నాదేవతలకును గరచరణాద్యవయవములు నామ ధేయములు వాహనాద్యుపకరణములు గమనాగమన శ్రవణదర్శన భాషణాది కృత్యములు నారోపింపఁబడినవి. కొన్ని యచేతనములకు సకల చేతనధర్మములు కల్పింపఁబడకపోయినను మహత్త్వబోధకము లగుకొన్ని గుణములు వాని కారో పింపఁబడినవి. సామాన్యముగా దేవతావర్ణనములు రూపకోపమోత్ప్రేక్షా స్వభావోక్తి తద్గుణాద్యలంకారములలో నొకదానికి గుఱియై కనవచ్చును.

సూర్యోదయపూర్వకాలమందలి యుషస్సు స్త్రీవలె వర్ణింపఁబడినది. సోమ లతను నలఁగఁగొట్టుచున్న గ్రావములు తమ యాకుపచ్చనినోళ్లతో సోమ

1. ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్ । ఏకం స ద్విప్రా బహుధా వదం త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః. బు. 1-164-46.

2. అగ్నిర్వై సర్వాదేవతాః.

3. పురుష ఏ వేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్. బు. 10-90-2.

పానము చేయువారిని దయ చేయుఁ డని పిలుచుచున్నట్లు వర్ణింపఁబడినవి. ఇంద్రుఁడు మహాశూరునివలె నాయుధము చేతఁ బట్టి వచ్చినట్లు వర్ణింపఁబడెను. ఇట్టి వర్ణనలనుబట్టి చూడఁగా నయ్యా ప్రాకృతపదార్థములందు ఋషుల కున్నట్లు తలంపఁబడు దేవతాబుద్ధికంటెఁ దత్తద్వస్తు వర్ణనములందలివారి కవితాచాతురియే యధికముగా స్ఫురించుచున్న దని చెప్ప నవకాశము గలుగుచున్నది.

మఱియు దేవతలు కొందఱు కొందఱు వేఱువేఱు ధర్మములు కలవారయ్యు నిద్దఱుచొప్పునఁ గలసి వర్ణింపఁబడిరి. అట్టి దేవతాద్వంద్వము లనేకము లనేకవిధములుగాఁ గనవచ్చుచుండును. అగ్నీసోములు అగ్నీంద్రులు, అగ్నీపర్జన్యులు, అగ్నావిష్ణులు, ఇంద్రాగ్నులు, ఇంద్రాబృహస్పతులు, ఇంద్రాపూషులు ఇంద్రాబ్రహ్మణస్పతులు, ఇంద్రావిష్ణులు, ఇంద్రాపర్వతులు, ఇంద్రాకుత్సులు, ఇంద్రావాయువులు, మిత్రావరుణులు, సోమాపూషులు, సోమారుద్రులు, సూర్యాచంద్రమసులు, వాతాపర్జన్యులు, ఇత్యాదిగా బహుదేవతాద్వంద్వములు కనవచ్చును. మఱియు దేవతలలో నొకరి కొకరు ప్రకృతి యగుట కలదు. ఇది మనుష్యధర్మవిరుద్ధము. మానవులలోఁ దండ్రి కుమారునికిఁ బ్రకృతి యైనట్లు కుమారుఁడు తండ్రికిఁ బ్రకృతి కాఁజాలఁడు కదా! దేవతాధర్మ మట్లుకాదు: తండ్రి కొడుకులు పరస్పరము ప్రకృతు లగుదురు. సూర్యుఁ డగ్నికిఁ బ్రకృతిగాను, అగ్ని సూర్యునికిఁ బ్రకృతిగాను గూడ వర్ణింపఁబడిరి. అదితి దక్షునికిఁ దల్లి, దక్షుఁ డదితికిఁ దండ్రి[1]. మరల నదితి యాదిత్యులకుఁ దల్లి ఇత్యాది దేవతాధర్మము లెన్నో ఋక్సంహితలోఁ గనవచ్చును.

స్త్రీదేవతలలో నదితి యగ్రగణ్యురాలు, ఆమె దేవమాత. ఋగ్వేద గాథలలో నదితిగాథ మిక్కిలి ప్రధాన మైనదియే కాక యతిపురాతన మైనదిగాఁ గూడఁగనవచ్చును. అగ్నీంద్ర వరుణపత్న్యులగ్నాయి ఇంద్రాణి వరుణాని యనుపేళ్ల దేవతలుగా స్తుతింపఁబడిరి. మఱియు సరమ దేవశుని యనునైతిహాసిక పక్షమునకు వ్యతిరేకముగా సరణశీల మైనమధ్యమవాక్కని నైరుక్త లర్థము చెప్పిరి. అట్లే సరస్వత్యాదులు నదీకల్ప దేవత లనిరి. ఇట్లు సమర్థింపఁబడినవియు సూక్తముల వర్ణింపఁబడినవియు నగుకల్పిత స్త్రీపురుషరూపచేతనాచేతనపదార్థము లెన్నో యాజ్ఞికపక్షమున దేవతలుగా గణనకు వచ్చినమాట సత్యమే కాని యట్టివానిని ఋషులు భజనీయము లైనవివిధదైవతములనుగా భావించినట్లు మాత్ర మూహింపరాదు. ఇట్లు బహుదేవతలు సూక్తములం దెల్లఁ గనవచ్చుచున్నను దివోదాసపుత్త్రుఁ డయినపరుచ్ఛేపమహర్షి చేసిన స్తుతినిబట్టి యజ్ఞార్హదేవతలు ముఖ్యముగా ముప్పదిమువ్వు రని యీక్రిందివిధముగాఁ దెలియవచ్చుచున్నది.

---

1. అదితేర్దక్షో అజాయత దక్షా దదితిః పరి ఋ॰ 10-72-4.

"యే దేవాసో దివ్యేకాదశస్థ పృథివ్యా మధ్యేకాదశస్థ
అప్సుక్షితో మహినైకాదశస్థ తే దేవాసో యజ్ఞ మిమం జుషధ్వం[1]."

ద్యులోకదేవతలు పదునొకండుగురు. పృథివీలోకదేవతలు పదకొండుగురు. అంతరిక్షలోకదేవతలు పదకొండుగురు. నిజముగా, పృథివ్యంతరిక్షద్యులోకాభిమానినులైనదేవతలు ముగ్గురే. కాని, వారే తమతమమహిమలచే ముప్పదిముగ్గురు దేవత లగుచున్నారు. వారే అగ్నివాయ్వాదిత్యాదు లనుట స్పష్టము. దీనినిబట్టి మహామహిమవిరాజితు లయినయగ్న్యాదులే ప్రధానదేవతలుగా యజ్ఞములం దారాధింపఁబడుచు వచ్చి రని తెలియుచున్నది. ఈ ముప్పదిముగ్గురే నిజమహిమవిలాసముల ముప్పదిమూఁడుకోట్లదేవతలుగాఁ బురాణేతిహాసాదులఁ బ్రశంస కెక్కి రనితోఁచుచున్నది. ఇఁక నీవిషయ మిట్లుంచి శాఖాభేదముల నించుక పరిశీలింతము.

## ఋగ్వేదశాఖలు.

సంహితాబ్రాహ్మణాత్మకము లయిన నాలుగు వేదములు ననేకవిధశాఖ లయినట్లు లక్షణగ్రంథాదులవలనఁ దెలియవచ్చును గాని యందు యజుర్వేదము కృష్ణశుక్లభేదమున ద్వివిధమై కనవచ్చునట్లు తక్కిన ఋగాదివేదములశాఖలు వేఱుగాఁ గనరావు. అందు ప్రకృతమైనఋగ్వేదమునకు ౨౧ శాఖలును సామవేదమునకు ౧౦౦౦ శాఖలును యజుర్వేదమునకు ౧౦౧ శాఖలును అథర్వవేదమునకు ౯ శాఖలును గొందఱిమతమున ౧౫ శాఖలును గల వనియు, అధ్వము పాదము శ్రుతి శాఖ యనునవి పర్యాయవాచకము లనియు షడ్గురుశిష్యుఁడు తెలిపియున్నాఁడు కాని యాయాశాఖలనామము లన్నియు వాక్రుచ్చ లేదు[2]. ఋగ్వేదశాఖలలో నైదింటి నామములుమాత్రము తత్ప్రవర్తకుల పేళ్లతో పురాణలక్షణగ్రంథాదులఁ గనవచ్చుచున్నవి. అవి యైనను, ఒకదానిలోని సంజ్ఞలతో మఱియొకదానిలోనివి పోల కున్నవి. శాకల్యశిష్యులైన ముద్గల గోఖుల వాత్స్య శాలీయ శిశిర సంజ్ఞలు గలవా రైదుగురు శాఖాభేద ప్రవర్తకు లని ఋక్ప్రాతిశాఖ్యభాష్యములో నువ్వటుఁ డుదాహరించిన పురాణవచనము

---

1. ఋ. 1-139-11.

2. ఋగ్రూపమంత్రబాహుళ్యా దృగ్వేద స్స్యా త్తథేతరో,
ఏకవింశ త్యధ్వయుక్త మృగ్వేద మృషయో విదుః,
సహస్రాధ్వా సామవేదో యజు రేకశతాధ్వగమ్,
నవాధ్వా థర్వణోఽన్యేతు ప్రాహుః పంచదశాధ్వగమ్,
అధ్వా పాద శ్శ్రుతి శ్శాఖా, ఇతి పర్యాయవాచకాః,
కాత్యాయన సర్వానుక్రమణీ వృత్తిపీఠిక.

చెప్పుచున్నది[1]. వైవానిలోనిగోఖుల శారీరసంజ్ఞలు మఱియొకప్రతిలో గోకుల శైశిరసంజ్ఞలుగాఁ గనవచ్చుచున్నవి. వాయుపురాణములో ముద్గల గోలక ఖాలీయ మాత్స్య శైశిరేయ సంజ్ఞలు కనవచ్చుచున్నవి. విష్ణుపురాణము, ముద్గల గోశ్వలు వాత్స్య శాలీయ శిశిర సంజ్ఞలు చూపుచున్నది[2]. వ్యాళికృత వికృతి వల్లి శాకల్యశిష్యులైన నైష్ఠికబ్రహ్మచారులు నూర్వురిలోను గృహస్థులు ధర్మిష్ఠులు కుటుంబవంతులు నగుశైశిరబాష్కల సాంఖ్య వాత్స్యాశ్వలాయనులు శాఖాప్రవర్తకు లని చాటుచున్నది[3].

ఇట్లు విభిన్నములుగా నున్నపూర్వోదాహృతవచనములలో నేది సరి యైనదో, యేది కాదో నిర్ణయింప నాధారములు కనరావు కాని షడ్గురుశిష్యుని వచనము తప్పఁ దక్కిన వన్నియు ఋక్శాఖ లైదని మాత్రము చెప్పుచున్నవి. ఇది యిట్లుండ చరణవ్యూహ మనుమఱియొకలక్షణగ్రంథ మాశ్వలాయన శాంఖాయన శాకల బాష్కల మాండూకాయన భేదమున ఋక్శాఖ లైదు విధము లని చెప్పుచు వానియందలి మండలాధ్యాయసూక్త ఋగాదిగణనమును మన మింతకు మున్ను శౌనకుని యనుక్రమణికనుబట్టి చదివిన విధముననే తెలుపుచున్నది[4]. మఱియు, ఋగ్వేదసర్వానుక్రమణి సూక్తగణనము చేయుచు 'ఏత త్సహస్రం దశసప్త చైవ, అష్టా వతో బాష్కలకే ఽధికాని'—శాకల సంహితలో ౧౦౧౭ సూక్తము లున్నవి. ఇంతకంటె నెనిమిదిసూక్తము లెక్కువగా బాష్కలసంహితలో నున్నవి. అని తెలుపుచున్నది[5]. ఈ రెంటినిబట్టియుఁ

---

1. చూ. కాశీలో ముద్రింపఁబడిన ప్రతి.
2. మాక్సిముల్లరు Sans list. P. 189.
3. శాకల్యస్య శతం శిష్యా నైష్ఠికబ్రహ్మచారిణః,
 పంచ తేషాం గృహస్థా స్తే ధర్మిష్ఠా శ్చ కుటుంబినః,
 శైశిరో బాష్కల స్సాంఖ్యో వాత్స్య శ్చై వాశ్వలాయనః,
 పం చైతే శాకలా శ్శిష్యా శ్శాఖాభేదప్రవర్తకాః,
 మద్రాసు ప్రాచీనాముద్రితసంస్కృతగ్రంథపట్టిక: P. 694.
4. ఈ చరణవ్యూహము శౌనకుని దని యొకప్రతిలోను, వ్యాసుని దని మఱియొక ప్రతిలోను గనవచ్చును.

తత్ర ఋగ్వేద స్యాష్టౌ భేదా భవంతి, చర్చా శ్రావక శ్చర్చకః శ్రవణీయపారః క్రమపారః క్రమజటః క్రమపదః క్రమరథః క్రమదండ శ్చేతి, చతుష్పారాయణ మేతేషాం పంచవిధా భవంతి. ఆశ్వలాయన...... తేషా మధ్యయనం, అధ్యాయానాం చతుష్షష్టి ర్మండలానామిత్యాది.

5. బాష్కలసంహితలో నెక్కువగా నున్నయెనిమిది సూక్తములును వాలఖిల్యము లనుట కవకాశము కలదు గాని, మాక్సిముల్లరు ప్రకటించినదానిలో నవి ౧౧ సూక్తములుగాఁ గనఁబడుచున్నవి. అతనికి లభించినప్రతులలో మఱిమూడుసూక్తములు ప్రక్షిప్తములై యుండు నని యూహింపనయ్యెడి.

బూర్వోదాహృత వివిధవచనములనుబట్టియుఁ బరిశీలింపఁగాఁ దొలుత ఋక్సంహిత యొకటే యనియు, దానిని లోకమునఁ బ్రవర్తింపఁజేసినవారి నామములనుబట్టి యదియే యైదుశాఖలుగా వ్యవహరింపఁబడుచున్న దనియు విదితమగుచున్నది. ఇది సత్య మైనను, ప్రవర్తకులనామములు కొన్ని వేఱువేఱుగాఁ గనవచ్చుటచే నందు ప్రధానశాఖాప్రవర్తకు లెవ రనెడి సందేహ ముదయింపక పోదు కాని, పూర్వాచార్యవచన ప్రామాణ్యమునుబట్టి తెలిసికొనఁ దగినంతలోఁ జరణవ్యూహము పేర్కొనినసంజ్ఞలలో బాష్కల సంజ్ఞ తప్పఁ దక్కిన నాలుగును పాణినిసూత్ర నిష్పన్నములై కనవచ్చుటచేతను[1] వికృతివల్లి వక్కాణించిన శైశిరీయశాఖ శాకల శాఖలో నంతర్భూత మని సర్వానుక్రమణీ ఋక్ప్రాతిశాఖ్యములు చెప్పుటచేతను[2], పాణినిదృష్ట మైనశాంఖాయనశబ్దమే[3] క్రమముగా సాంఖ్యాయనశబ్దముగా మాఱియుండు ననుట విశ్వసనీయ మగుటచేతను, మాండూకాయన శాఖా ప్రవర్తకులలోఁ దరువాత 'బ్రసిద్ధుఁడగు వాత్స్యుఁ డనుముని పేర నదియే వాత్స్యాయనశాఖ యని వ్యవహరింపఁబడియుండు ననుట సంభావ్య మగుటచేతను[4] వికృతివల్లికంటెఁ జరణవ్యూహ మెక్కువగాఁ బూర్వకాలమునఁ బ్రసిద్ధి కెక్కియుండుటచేతను దీనిలోని శాఖా సంజ్ఞలు సరి యైనవని తోఁచుచున్నది. ఇట్లు సంహితాప్రవర్తకశాఖలే కాక, అధ్యయనబ్రాహ్మణసూత్ర భేదములవల్లఁ గూడ నేర్పడిన శాఖ లనేకములు కలవు. వానిస్వరూప మించుక పరిశీలింతము.

"వేదరాశి విధ్యర్థవాదమంత్రాత్మకమై త్రివిధముగా నున్నది[5]. అందు మంత్రబ్రాహ్మణాత్మకమైన స్వాధ్యాయైకదేశము శాఖ యని చెప్పఁబడుచున్నది. ఆ సంహితాబ్రాహ్మణములలో దేనికైనను సంభవించిన భేదమునుబట్టి వేదమున నవాంతరశాఖ లేర్పడుచున్న వనుట సత్యము. సాంగ మైనస్వాధ్యాయము వేదశబ్ద వాచ్య మైనట్లే సాంగ మైన శాఖగూడ వేదైకదేశమగుటచే శాఖాంతరత్వమును బొందుచున్నది అట్టిశాఖ కంగము సూత్రము. దానిభేదమున స్వాధ్యా

1. నడాదిభ్యః ఫక్. 4-1-99 ; అశ్వాదిభ్యః ఫఞ్. 4-1-110, శాకలా ద్వా. 4-3-128, శారద్వమాండూకాభ్యాంచ. 4-1-19.

2. తా న్యారణే శాకలే శైశిరీయే-సర్వాను—యథా ఋగ్వేదే పారయణామ్నాయే శాకల్యే శైశిరీయకమితి-ఋక్ప్రా).

3. అశ్వాదిభ్యః ఫఞ్, - గోత్రాపత్యే - గణపాఠే శంఖ.

4. మండూకవాత్స్యులలో నెవరు ప్రాచీనులో! పాణినిదృష్టము మాండూకాయన శబ్దము.

5. తత్ర తావ ద్విధ్యర్థవాదాత్మనా త్రిధా వ్యవస్థితో వేదరాశిః బాధా. సూ. సాయణులు.

యాధ్యయనము భేదించుచున్నది కావున శాఖాభేదవ్యవహారమునకు సూత్రము హేతు వగుచున్నది "[1]. ఇత్యాదివాక్యములనుబట్టి, ఐతరేయ - కౌషీతకి-పైంగి-బౌధాయన - కాత్యాయన - మాధ్యందినాది శాఖలు, సంహితాబ్రాహ్మణ సూత్రములు వ్యాపించినకాలఁదిని, కర్మాచరణమున భిన్నమతము లుదయించిన కాలఁదిని బయలుదేఱిన వని తెలియవచ్చుచున్నది. కావున ఋక్సంహితమాత్ర మేవ్వో కొన్నియితరసూక్తములు కలియుటచేతను, లేక తదధ్యయన భేదము చేతను వే ఱయినట్లు కనిపించినను స్వరూపముచే నొకటి యై నట్లు విశ్వసింప వచ్చును. ఇ ట్లేర్పడిన వివిధశాఖలలోని బ్రాహ్మణాది గ్రంథములఁ గొన్ని కొన్ని పాఠములు నశించుటయుఁ గొన్ని శాఖ లడు గంటుటయుఁ గాలక్రమమున సంభ వించె ననుట నిజము. ఇందుకు బ్రాహ్మణోక్తవిధులలో నుత్సన్నము లైనపాఠ ములు ప్రయోగమునుబట్టి యనుమానింపఁబడుచున్న వనునది మొదలుగాఁ గల శాస్త్రవచనములే ప్రమాణము[2]. దీనినిబట్టి పేళ్లు తెలియకుండఁగా జీర్ణము లైనవే శాక నామమాత్రావశిష్టము లైనశాఖలు గూడ బ్రాహ్మణసూత్ర పాఠభేదములనుబట్టి వే ఱయినను, ప్రాచీనమహర్షి దృష్టము లైన సూక్తముల యెడ వేఱు గా వనియు, ఆ సూక్తములే సంహితగా నేర్పడిన వనియు, దానికిఁ బదము (పదవిభాగము) నిర్మించిన శాకల్యమునియే తత్సంహితా ప్రవర్తకుల కాదిగురు వనియు దానంజేసి ఋక్సంహితకుఁ దొలుత శాకలసంహిత యనుపేరు వచ్చిన దనియుఁ దెలియనయ్యెడి. అట్టిలోకైక పూజ్య మయిన యీసంహితలోని మనోహరము లైనకొన్నివర్ణనలు చదివి యానందింతము.

### ఋక్సంహితలోని వర్ణనలు.

నిత్యసత్యవ్రతులు నైహికవిజ్ఞాన ఘనులు నాముష్మికపరాయణులు వశ్య వాక్కులు నగు పూర్వమహర్షులు వీనులార వినియుఁ గన్నులారఁ గాంచియు యథార్థము లని నమ్మియు మనసార భావించియు వర్ణించిన వివిధవిషయములతో నాఁటికాలమును గన్నులకుఁ గట్టు దివ్యమణిదర్పణ మైన ఋక్సంహిత కేవలకర్మ పరతంత్ర మైనమంత్రరాశి మాత్రము కాదు. వింధ్యహిమాచల మధ్యదేశ మున ధర్మము నాలుగుపాదముల నడపించినప్రభువు. దక్షిణాపథంబున వైదిక

---

1. స్వాధ్యాయైకదేశో మంత్రబ్రాహ్మణాత్మక శ్శా ఖేత్యుచ్యతే - ఇత్యాది—హిరణ్య - సూ. భా.

2. బ్రాహ్మణోక్తా విధయ స్తేషా ముత్సన్నాః పాఠాః ప్రయోగాదను మీయన్తే - ఉత్స న్నాః పాఠాః, అధ్యేతృదౌర్బల్యాత్, ఆప - సూత్ర.

శాఖానాం విప్రకీర్ణత్వాత్పురుషాణాం ప్రమాదతః, నైకశ్చ మన్వాదిస్మృతీ నా ముపుత్సన్న శాఖామూలత్వ మభ్యుపగత మిత్యాది—కుమారిలతంత్ర. 1-3.

విజ్ఞానమునకు దారి చూపినమిత్త్రుఁడు. భరతఖండమునకు భవ్యోపదేశము చేసిన పరమగురువు. శిశుకు శిశు, వ్యాకరణంబున కాకరము, ఛందస్సునకు మూల కందము, నిరుక్తంబునకుఁ బ్రవక్త, జ్యోతిషంబునకు జ్యోతి, కల్పమున కాకల్పము, మీమాంసలకు మేర, న్యాయంబున కాయువు, పురాణేతిహాసముల పుట్టిల్లు, ధర్మశాస్త్రములతల్లి, వివిధార్యభావల విత్తనము. వేయేల ? సకల విద్యోపజీవిక యగు నుపజ్ఞ. వాగ్దేవి కుపాయనముగా ఋషులు తొలుదొల్త సంతరించి సమర్పించిన దివ్యరత్న పేటిక. వివిధవిజ్ఞానమణుల విలసిల్లు నదియే భారతీయుల పెన్నిధి. మఱియు ఋగ్వేదము భావిసంతతివారు చూచి గ్రహించి యానందించుటకై ప్రాచీనమహర్షులు చిత్త్రించి యుంచిన యార్యావర్త చిత్త్రపటము. అందు ఋష్యాశ్రమములు యజ్ఞవాటికలు నదులు పర్వతములు వనములు తరుగుల్మ లతాదులు ఆర్యులు అనార్యులు పోరాటములు జయములు పరాజయములు, కృషి గోరక్షణము వాణిజ్యము నౌకాయానము రథయానము వధూవరులయను రాగములు దాంత్యములు వివాహములు సమావేశములు విరహములు తపోమహిమలు దేవతాను గ్రహములు సల్లాపములు సంవాదములు సమాలోచనములు ప్రకృతివిజ్ఞానము పదార్థవిజ్ఞానము ఖగోళవిజ్ఞానము భూగోళవిజ్ఞానము ధైర్య సాహసములు కామక్రోధాదులు శమదమాదులు మొదలయిన వెన్నో యాయా సందర్భముల ననేకభంగుల దృగ్గోచర మగును. అట్టి వాఙ్మయ కల్పభూరుహ మైన ఋక్సంహితలోని కొన్నివర్ణనలయందలివిశేషములు గ్రహించి యానందించుటకు ముందు సర్వదేవతా నమస్కారరూప మగుమంగళాచరణముగా నఖిల దేవముఖ మైన యగ్నిదేవుని మధుచ్ఛందోమహర్షి వాక్కులతోనే స్తుతింతము.

"అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం హోతారం రత్న ధాతమం ॥

రాజునభీష్టము సంపాదించు పురోహితునట్లు యజ్ఞమున కపేక్షిత మైన హోమమును సంపాదించునట్టియు లేక యజ్ఞమునెదుట నాహవనీయరూపమున నుండునట్టియు, ప్రకాశింపఁజేయువాఁడు లేక దానాదిగుణయుక్తుఁ డైనట్టియు, దేవతలయాగములందు హోత యనుపేర ఋత్విజుఁ డైనట్టియు, యాగఫలరూప మైనరత్నాదిధనసంపద నిచ్చునట్టియు, అగ్నిదేవుని స్తుతించుచున్నాను లేక యాచించుచున్నాను." అని యర్థము. యజ్ఞములందు ముందుభాగమునకుఁ దీసికొని రాఁబడువాఁ డనియు, దేవసేనను ముందునడపువాఁ డనియు కాష్ఠాదుల యందు సంకుచితముగాఁ దనయంగమును బొందించువాఁ డనియు నగ్నిశబ్దమును బహువిధముగా యాస్కుఁడు నిర్వచించెను. ఇందు కడపటి నిర్వచనము సహజముగాను దక్కినవి యజ్ఞపక్షముగాను బౌరాణికపక్షముగాను సరిపడుచున్నవి.

ఈ ఋక్కు ఋక్సంహితలో నిపుడు మొట్టమొదటిదిగాఁ గనవచ్చుచున్న మాట సత్యమే కాని యిది వైదికవాఙ్మయ రచనయం దాద్యమంత్రము మాత్రము కాదు. సంహిత యేర్పడుకాలమునఁ బ్రాచీనార్వాచీన సూక్తములు కొన్ని ముందువెనుక లయినవనువిషయము నింతకుమున్నే కొంత తెలిసికొని యున్నాము. ఇది గాక మధుచ్ఛందసుఁడే తా నర్వాచీనుఁడయినట్లు దీని తరువాతి ఋక్కులోనే యీక్రిందివిధముగా సూచించియున్నాఁడు.

"అగ్నిః పూర్వేభి ర్ఋషిభి రీడ్యో నూతనై రుత। స దేవాఁ ఏహ వక్షతి॥

అర్థము:—ఈయగ్ని పూర్వర్షు లనఁగా, పురాతను లైన భృగ్వంగిరః ప్రభృతిమహర్షులకు స్తుత్యుఁడు, నూతను లనఁగా నిదానీంతనుల మైన మనకును స్తుత్యుఁడు. మనచేఁ గొనియాడఁ బడినయితఁ డీయజ్ఞమునకు దేవతలను దీసికొని వచ్చుఁ గాక"

దీనినిబట్టి మధుచ్ఛందసునికిఁ బూర్వము మహర్షు లనేకు లగ్నిస్తుతి యొనరించియున్నా రని స్పష్ట మగుచున్నది. అట్టి యగ్నిస్తుతిరూప సూక్తములు ప్రతి మండలమందును గనవచ్చుచున్నవి. "ఇతనికిఁ బూర్వము ఋషు లుండవచ్చును, వా రగ్నిస్తుతులు చేసియుండవచ్చునుగాని యవి సూక్తములై యీసంహితలో నున్న వనుటకుఁ బ్రమాణ మేమి"? అని యడుగఁదు రేని, మధుచ్ఛందసుని యీస్తుతిని సూక్తముగా గణించుచువచ్చిన యార్షానువాక సంప్రదాయము జమదగ్న్యాది మహర్షుల యీస్తుతులనుగూడ సూక్తములనుగా గణించుచు వచ్చుటయే ప్రమాణము. ఇందలి రత్నధాతమ శబ్దము తప్పఁ దక్కిన వన్నియు నతి సులభములై లౌకికభాషలోని శబ్దములవలె నున్నవి. కావున నెట్లయిన నీఋక్కు ఋషిదృష్టము లయినవానిలో మొట్టమొదటిది కా దనుట నిర్వివాద మని నామతము. ఈ సందర్భమున మంత్రకృత్తులకాలమందే కాక యామంత్రములను సంహితగాఁ గూర్చిన యర్వాచీనకాలమందుఁ గూడ జాతికంటె గుణమే యెక్కువపూజాస్థానముగా నుండెడి దనువిషయమును, రాజర్షి యైన మధుచ్ఛందసుని సూక్తములను బ్రహ్మర్షులు ఋగ్వేదాదియందు సమకూర్చుటయే ధ్రువపఱచుచున్న దని స్మరింపఁదగును.

ఋక్సంహితలో నైదవవంతు సూక్తము లగ్నిస్తుతిపరములే యని తెలియుచుండ నగ్నివర్ణన లెన్ని యని యిం దుదాహరింప నగును? అందుచే నందందలి కొన్ని ఋక్కులయర్థ మిందు తెలుపుచున్నాను. దీర్ఘతముఁ డనుఋషి వేఁడిమి యనుగుణము ప్రధానముగా నగ్నిదేవు నిట్లు వర్ణించెను.

"అగ్ని, పాకాదికముచే నన్నసాధకుఁ డగుచున్నాఁడు. శరీరాభివృద్ధికి హేతు వగుచున్నాఁడు. యజ్ఞములందు హవిస్సు గొనుచున్నాఁడు. ఇట్లు లౌకిక వైదికకర్మములను నిర్వర్తింపఁజేయుచు నిత్యుఁడై భూలోకవర్తి యగునితఁడే సకలలోకహితకారియగువృష్టికిఁ గారణమై విద్యుద్రూపమున నంతరిక్షమున వెలుఁ గొందుచున్నాఁడు. మఱియు నీయగ్నియే సూర్యకిరణముల ప్రవృత్తికి మూలమై తద్ద్వారా భూమిమీఁది జలము నాకర్షించి సూర్యుని బొందించి యచ్చటఁ జిరకాల ముంచి పిదప నంతరిక్షమున మేఘములయం దుంచి యాజల మును వర్షకాలమున మరల వర్షింపఁజేయుచున్నాఁడు"[1]. మఱియు నీ ఋషియే యగ్నిదేవుని తేజశ్శక్తిని విశ్వాత్మకత్వము నిట్లు కొనియాడెను.

"ఓయగ్నీ! నీవల్లనే రాత్ర్యభిమాని యగువరుణుఁడు వర్షాదికర్మ సమర్థుఁ డగుచున్నాఁడు. అహరభిమాని యగుమిత్రుఁడు తమోనాశకుఁ డగుచు న్నాఁడు. అట్లే యర్యముఁడును దానాదిస్వకార్యధురంధరుఁ డగుచున్నాఁడు. బండికంటికమ్మి చక్రమును జుట్టి యున్నట్లే నీవు సర్వకర్మప్రవృత్తిచే విశ్వా త్ముఁడవై వరుణాదులను వ్యాపించియున్నావు"[2].

సోమాహుతి యనుఋషి దావాగ్ని నిట్లు వర్ణించెను.

"అగ్ని, మిక్కిలి తొందరపాటుతో వనములు దహించుచున్నాఁడు. నీటి ప్రవాహమువలెనే యిటునటు పోవుచున్నాఁడు. యుద్ధమునకుఁ బోవురథమువలెనే ధ్వని చేయుచున్నాఁడు. రమణీయుఁడును సంతాపకుఁడు నయినయితఁడు తన నల్లనిజాడలనడుమ నల్లనియంతరిక్షమున సంచరించునాదిత్యునివలెనే ప్రకాశించు చున్నాఁడు"[3].

నోధోమహర్షి వైశ్వానరాగ్ని నిట్లు స్తుతించెను.

"ఓయగ్నీ! లోకములలో నున్నయగ్ను లన్నియు నీశాఖలే కాని వేఱు కావు. నీవల్లనే నిర్జరు లందఱును జీవించుచున్నారు. సకల నరులగర్భములందు జాఠరరూపమున నాభి వగుచు, నిట్రాడు తనమీఁద మోపినవెదుళ్లన్నిటిని ధరించునట్లే యానరుల నందఱిని నీవు ధరించుచున్నావు"[4].

ఆంగిరసుఁ డైనహిరణ్యస్తూపుఁ డగ్నిప్రార్థనము గావించుచుఁ బ్రాచీన యష్టలను గొందఱి నిట్లు పేర్కొనెను.

---

1. 2. ఋ 1-141-2,9.

3. ఋ. 2-4-6.

4. ఋ. 1-59-1.

"హవిస్సులు గ్రహింప యజ్ఞములకుఁ బోపుస్వభావము గలయగ్నిదేవా! మనువు అంగిరోమహర్షి యయాతి ఇంకను బూర్వులును యాగము లొనరించి నపుడు వెళ్లినట్లే యిపు డీయజ్ఞమునుగూర్చియు దేవయజనప్రదేశమునకు వెళ్లి దేవతాసమూహము నిచ్చటికిఁ దోడ్కొని రమ్ము. వారిని దర్భాసనములమీఁదఁ గూర్చుండఁబెట్టుము. వారి కిష్టమైనహవిస్సు లిమ్ము."

ఇంద్రుఁడు:—ఇంద్రవర్ణనసూక్తములు ఋక్సంహితలో నాల్గవవం తున్న వని యింతకు మున్నే చదివియున్నాము. యజ్ఞాదికర్మలందు మిక్కిలి ప్రధాన దేవతగాఁ గొనియాడఁబడునింద్రుని బూర్వర్షు లందఱు గూడ వర్ణించి యున్నా రనుట యతిశయోక్తి కాదు. ఇంద్రుఁడు దేవనాయకుఁడై నమహాశూరుఁ డనెడిపురాణేతిహాసప్రసిద్ధికి ఋగ్వేదమే మూల మనుట నిజముకాని, యందలి కొన్నిఋక్కులభావము ననుసరించి నిరుక్తకారుఁడైనయాస్కుఁ డింద్రశబ్దము నెట్లు నిర్వచించెనో ముందు చూతము.

ఇరాం దృణాతీతి - భోజనపదార్థముల నుద్దేశించి తన్నిష్పాదకమైన జలముకొఱకు మేఘమును బద్దలుకొట్టువాఁ డింద్రుఁడు. ఇరాం దదాతీతి - వృష్టి నిష్పాదనముచే నన్నమును లోకమున కిచ్చువాఁ డింద్రుఁడు. ఇరాం దధాతి - తృప్తికారణమైనసస్యమును జలదానమునఁ బోషించువాఁ డింద్రుఁడు. ఇరాం దారయతీతి - భోజ్యద్రవ్యములను బుట్టించుటకై కర్షకముఖమున భూమిని దున్నువాఁ డింద్రుఁడు. ఇరాం ధారయతీతి - సస్యములు నశింపకుండఁగా నిలుపు వాఁ డింద్రుఁడు. ఇందవే ద్రవతీతి - సోమరసముకొఱకు యజ్ఞభూమికిఁ బరు గెత్తువాఁ డింద్రుఁడు. ఇందౌ రమతే-సోమరసమునఁ గ్రీడించువాఁ డింద్రుఁడు. ఇంద్ధే భూతాని - ప్రాణిదేహములందు చైతన్యరూపమునఁ జొచ్చి వానిని బ్రకాశింపఁజేయువాఁ డింద్రుఁడు—ఈకడపటినిర్వచనమును వాజసనేయులు గూడఁ జెప్పుచు, సర్వేంద్రియాధిష్ఠానపురుషరూపుఁడై ప్రాణిదేహములను బ్రకాశింపఁజేయువాఁ డింద్ధుఁ డనియు, అతనినే యింద్రుఁ డనుచున్నా రనియుఁ జెప్పిరి.—పరమాత్మస్వరూపుఁ డయిన యీదేవుని సకలేంద్రియములతోను బ్రాణాపానాదివాయువులతోను గూడినవానినిగా నుపాసకులు ధ్యానించుచుఁ బ్రకాశింపఁజేయుచున్నారుగావున నితని కింద్రనామము సంపన్నమైన దనియొక బ్రాహ్మణము చెప్పుచున్నది. ఈపక్షమున - ఇధ్యతే దీప్యత ఇ తీంద్రః - అని కర్మార్థకవ్యుత్పత్తి చెప్పవలెను. ఆగ్రాయణముని - ఇదంకరణాత్ - పరమాత్మ స్వరూపుఁడయిన యితఁ డీజగత్తును నిర్మించుటచే నింద్రుఁ డయ్యె నని చెప్పెను. ఔపమన్యవముని - ఇదందర్శనాత్ - వివేకముచేఁ బరమాత్మ నపరోక్షముఁగాఁ జూచినవాఁ డింద్రుఁ డని నిర్వచించెను. ఇంక నిట్టి నిర్వచనము లనేకములు

కలవు.[1]. వీని నన్నిటినిబట్టి చూచినచోఁ బూర్వు లింద్రుని భావించుచు వచ్చిన క్రమము తెలియకపోదు. అట్టియింద్రుని వైదికర్షులు కొంద ఱెట్లుభావించి వర్ణించిరో పరిశీలింతము. హిరణ్యస్తూపుఁ డను ఋషి యిట్లు పలుకుచున్నాఁడు.

"ఇంద్రస్యను వీర్యాణి ప్రవోచం యానిచకార ప్రథమాని వజ్రీ ।

అహ న్నహి మన్వప స్తదర్ద ప్రవక్షణా అభిన త్పర్వతానాం ॥ [2].

వజ్రధారి యైనయింద్రుఁ డొనర్చినపూర్వసిద్ధములు ముఖ్యములు నైన పరాక్రమకృత్యములను జెప్పుచున్నాను. అతఁడు మేఘమును బద్దలుకొట్టెను. పిదప దానినుండి జలము భూమిమీఁదఁ బడునట్లు చేసెను. పర్వతములకు సంబంధించిన జలౌఘములు నదులుగాఁ బ్రవహించునట్లు చేసెను."

"అహ న్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టా స్మై వజ్రంస్వర్యం తతక్ష ।

వాశ్రా ఇవ ధేనవః స్యందమానా అంజః సముద్ర మవజగ్ము రాపః ॥[3].

ఈయింద్రునికి త్వష్ట చక్కఁగాఁ బ్రయోగింపఁదగిన వజ్రాయుధము చేసి యిచ్చెను. దానితో నితఁడు పర్వతము నాశ్రయించియున్న మేఘమును భేదించెను. దానంజేసి భూమిపైఁబడి ప్రవహించుచున్న జలములు, హంభారవ మొనర్చుచు ధేనువులు తమదూడలను జేరునట్లే లెస్సగా సముద్రమును జేరుచున్నవి." ఇట్లే యీసూక్త మంతయు మేఘరూపవృత్రవధవర్ణన కుపయుక్తమై యున్నది. ఇందలి మఱికొన్ని ఋక్కుల భావము[4].

దుర్మదుఁ డైనవృత్రుఁడు తనకుఁ బ్రతివీరుఁడు లేఁ డనుగర్వముతోఁ బరభయంకరుఁ డగునింద్రుని బోరికిఁ బిలిచెను. కాని వాఁ డింద్రుఁడు చేయువధను దప్పించుకొన లేకపోయెను. తుద కింద్రునిచే హతుఁడై నదులలోఁబడి వానిని గలఁచి వానిగట్లను విఱిచివైచెను."

"కాళ్లును జేతులును దెగినవృత్రుఁడు మరల లేచి యింద్రునితో యుద్ధము చేయఁగోరెను. అపు డింద్రుఁడు కొండచఱియవంటివానిబొమ్మమీఁద వజ్రముతోఁ గొట్టెను. అంత నవయవహీనుఁ డైనవృత్రుఁడు, కొజ్జావాఁడు వీరపురుషునిసాటి గోరియు నశక్తుఁ డైనట్లే వ్యర్థుఁడై క్రిందఁ బడెను."

"వర్షములేమిని ఖిన్న మయినజనమున కానందము గలిగించినట్టి జలములు ప్రవాహవేగమున గట్లు తెగినసింధునదము నతిక్రమించి పోవునట్లే చచ్చి

---

1. చూ. ఋ. భా. 1-3-4.

2. 3. ఋ. 1-32-1,2.

4. ఋ. 1-32-6, 7, 8, 10,;11.

పడియున్న వృత్రుని దాఁటి పోవుచున్నవి. ఏవృత్రుఁడు బ్రతికియున్నపు డీజల ములను నిరోధించెనో, యిపు డామేఘరూప వృత్రుఁ డాజలముల కాళ్లక్రిందనే పడినవాఁ డయ్యెను.''

"నిలుకడ లేక నిచ్చలు ప్రవహించునట్టి నీళ్లలోఁ బడి మునిఁగిపోవుటచేఁ బేరు తెలియకుండఁగాఁ బోయిన వృత్రునిదేహమును జలము లాక్రమించి ప్రవహించుచున్నవి. వృత్రుఁడు దీర్ఘ మైన నిద్రాత్మకమరణము నొంది యంత ర్హితుఁ డయ్యెను.''

"వర్షము లేకుండఁ జేసి లోకమునకు హాని కలిగించిన వృత్రుఁడు, పణి నామకరాక్షసుఁడు గోవుల నరికట్టినట్లే యుదకములను నిరోధించెను. అపుడు, ఇంద్రుఁడు వృత్రుఁడు మూసివేసినజలద్వారమును వానిని జంపి తెఱచెను.''

ఇట్లు వృత్రవధరూప మయిన యింద్రునికృత్యమును వర్ణించెడి యీ సూక్తమందు, అహిశబ్దము మేఘపరముగాఁ గొన్నిచోట్లను, వృత్రపరముగా నొకచోటను గనవచ్చుచున్నది. ఎనిమిదవఋక్కులో. అహివృత్ర శబ్దములు రెండును బ్రయోగింపఁబడినవి. ఆ రెండును మేఘపరముగానే వ్యాఖ్యానము చేయఁబడినవి[1]. దీనినిబట్టియు నీసూక్తమందలి యహివృత్రశబ్దములకు భాష్య కారులు వ్రాసిన యర్థవివరణములనుబట్టియు వృత్రుఁ డనఁగా మేఘుఁ డనియు మేఘత్వమును బ్రచ్ఛన్నము గావించి యసురత్వమును గల్పించుట చమత్కార కారిణి యైన ప్రాచీనమహర్షులశైలి యనియుఁ దెలియవచ్చుచున్నది. మఱియు, వృత్రుఁ డసురుఁ డయినట్లును వాఁడు క్రూరకృత్యము లొనర్చినట్లును, ఇంద్రుఁడు దేవుఁ డయినట్లును శూరుఁ డయినయతఁడు వృత్రుని సంహరించినట్లును యజ్ఞాది రక్షకుఁ డయినట్లును దేవనాయకుఁ డయినట్లును వివిధవర్ణన లీవేదమందు లేక పోలేదు గాని, వైసూక్తమందలి విషయమును విమర్శింపఁగాఁ బౌరాణికుల యింద్రవృత్రులవలె వైదికర్షుల యింద్రవృత్రులు దేవాసురులు గా రని తెలియుచున్నది. ఇందుకు యాస్కముని యేమి చెప్పెనో చూతము.

"తత్కో వృత్రః ? మేఘ ఇతి నైరుక్తాః, త్వాష్ట్రో ఽసుర ఇత్యైతి హాసికాః, అపాం చ జ్యోతిష శ్చ మిశ్రీభావకర్మణో వర్షకర్మ జాయతే, త త్రోపమార్థేన యుద్ధవర్ణా భవంతి। అహివత్తు ఖలు మంత్రవర్ణా బ్రాహ్మణ వాదాశ్చ। వివృద్ధ్యా శరీరస్య స్రోతాంసి నివారయాంచకార। తస్మిన్ హతే ప్రసస్యందిర ఆపః"[2].

అట్లయిన వృత్రుఁ డెవఁడు ? మేఘుఁ డని నైరుక్తు లందురు. త్వష్టకొడు కైన యసురుఁ డని యైతిహాసికు లందురు. మేఘుఁడే వృత్రుఁ డయితే మంత్ర

1. అహి ర్వృత్రో మేఘ స్తాసా మపాం పత్నుతః నీః—ఋ. భా.

2. యాస్కనిరుక్తము. పుట 144-146.

ములవల్ల వినవచ్చుయుద్ధము మాట యేమి? చెప్పెద వినుము. మేఘోదరగతము లయిన జలములకును వైద్యుతజ్యోతిస్సునకును గలిగిన సంఘర్షణము వల్ల వర్షము పుట్టుచున్నది. మారుతావేష్టిత మైన యింద్రాఖ్య మగువైద్యుత జ్యోతిస్సుచే తాడ్యమానము లయినయుదకములు వర్షభావమునొందుచున్నవి. ఇట్లు పరస్పర ప్రతిద్వంద్వీభూతము లైన తేజో జలముల కింద్రవృత్రరూపకల్పనచే యుద్ధ కల్పనము చేయఁబడినది. అంతే కాని యిచ్చట నిజ మైన సంగ్రామము లేదు. ఇంద్రునకు శత్రువులే లే రని 'యదచరస్తన్వా' యనెడిఋక్కు చెప్పుచున్నది[1]. సరేకాని, యుద్ధకల్పనములు వృత్రుఁ డున్నట్లే కనఁబడుచున్నవా? వృత్రుఁ డున్నట్లును, అహి యున్నట్లునుగూడ మంత్రలింగములు కలవు. శాఖాంతరబ్రాహ్మణవచనములును గలవు. అందుచే నహివృత్రశబ్దములకు మేఘుఁ డర్థమగుట సముచిత మగుచున్నది. దానంజేసి మేఘరూపవృత్రుఁడు స్వశరీరాభివృద్ధిచే జలములను నివారించె ననియు, వైద్యుతజ్యోతిస్స్వరూపుఁ డైన యింద్రుఁడు వానిని గొట్టఁగానే యుదకములు స్రవించె ననియు స్పష్టమగుచున్నది. ఈ విషయమున, వైదికశబ్దార్థములకు వన్నెలు చిన్నెలు కల్పించి కథలల్లిన యైతిహాసికులకంటెఁ బ్రాచీన సంప్రదాయము ననుసరించి వానిని జక్కఁగా నిర్వచించిన నిరుక్తకారులే యెక్కువ ప్రామాణికు లగుదురు గావున, వైదికమహర్షులు జ్యోతిర్మేఘస్వరూపములను వర్షకారణములను జక్కఁగా నెఱిఁగియే ప్రరోచనార్థము లయిన యింద్రవృత్ర సంగ్రామకల్పనములు గావించి వర్ణించి యుండి రని గ్రహింపఁదగును.

సూర్యుఁడు:—ద్యుస్థాన దేవతలలోఁ బ్రధానుఁ డైన సూర్యదేవుని బూర్వర్షులు పెక్కురూపములతో వర్ణించియున్నారు. పృథివ్యంతరిక్ష ద్యులోకములకు మహోపకర్త యగు నీదేవుని వర్ణనము లనేకములు స్వాభావికములై యున్నవి. పౌరాణికసూర్యవర్ణనల కుపజీవ్యము లైన వర్ణనలును ఋక్సంహితలోఁ గనవచ్చుచున్నవి. అట్టి యాదిత్యసవితృమిత్రాది రూపముల వర్ణింపఁబడిన సూర్యుని మహత్త్వమునకుఁ గొన్ని యుదాహరణములు:—కుత్సమహర్షి సూర్యు నిట్లు వర్ణించెను.

"సకలదేవతా తేజః పుంజరూపమును విచిత్రము నైనసూర్యమండలముదయాచలము నధిష్ఠించినది. మిత్రాగ్ని వరుణలోకములకుఁ బ్రకాశకదివ్యనేత్ర మైన యీమండలము తన తేజః పుంజముచేఁ బృథివ్యంతరిక్షద్యులోకములను నిండించుచున్నది. ఇట్టి దివ్యమండలములోపల నున్నసూర్యుఁ డంతర్యామియై సర్వలోకప్రేరకుఁ డగుచు జంగమస్థావరాత్మకమై సకలజగమున కాత్మ

1. ఋ. 10-54-2.

యగుచు విలసిల్లుచున్నాఁడు "[1]. దీనినిబట్టి సకలస్థావరజంగమాత్మక మైన జగత్తునకుఁ గారణమై యఖిలప్రాణిజాతమునకు జీవాత్మ యైన సూర్యుఁ డుదయించినంతనే మృతప్రాయ మైనజగ త్తంతయు మరలఁ జైతన్యయుక్త మగుచున్నదని తెలియుచున్నది.

సూర్యోపాసనవలన సకలరోగములు శాంతించు ననెడి నమ్మకము ఋగ్వేదకాలమందే పుట్టిన దనుటకు మహర్షి యైనప్రస్కణ్వుఁడు తనకు సంభవించిన చర్మరోగము శాంతించుటకై సూర్యోపాసన చేసి రోగవిముక్తుఁ డయినట్లు తెలియవచ్చు ప్రాచీనసంప్రదాయమే తార్కాణము. ఆ ఋషి గావించిన మూఁడు మంత్రములతోడి యీ స్తుతి తృచ మనుపేర నేఁటికిని లోకప్రసిద్ధమై యాచరణములో నున్నది. సూర్యోపాసన విధానములలో, తృచవిధానమే మొదటిది. ఆస్తికు లయిన కొందఱీవిధానమున సూర్యనమస్కారము లొనర్చి యిపుడుగూడ నిష్టార్థసిద్ధిని గాంచుచున్నా రనుటకంటె దీని మహత్త్వమును వేఱుగాఁ బ్రశంసించుట యనావశ్యకము[2].

సూర్యుని సవితృరూపునిగాఁ గొందఱు ఋషులు వర్ణించియున్నారు. వారిలో విశ్వామిత్రమహర్షి కనిపెట్టినయొకఋక్కు ఛందోమాత యగు గాయత్రియందు నిబద్ధ మగుటచే గాయత్రి యనియు సవిత దేవత యగుటచే సావిత్రి యనియుఁ బ్రసిద్ధమై సంధ్యోపాసనసమయములందు జపింపఁదగినదివ్యమంత్రమై ప్రశంస కెక్కినది. ఆ మంత్ర మెపుడు పుట్టినదో యూహింపఁ జాలముకాని యెల్లవేదశాఖలవారును నాఁటినుండి నేఁటిదనుక దానిని నిత్యము త్రికాలములందు సభక్తినియమముగా జపించుచు వచ్చుట చూచినను,ఆమంత్రమందలి విషయము చూచినను, మంత్రద్రష్ట లైనఋషులు వేదారంభకాలమునందే తమకు నిర్మలబుద్ధిని బ్రసాదింప నామంత్రముచే సవితృతేజస్సును ధ్యానించుచుండెడివా రని చెప్పవచ్చును. 'నగాయత్ర్యాః పర మ్మంత్ర' మ్మనునభియుక్తోక్తికి గుఱి యైనయీమంత్రమందలియుపాసనీయ మైనతేజస్సును సవితృరూపసూర్యతేజస్సునుగాను బరబ్రహ్మాత్మక తేజస్సునుగాను భావించి భాష్యకర్తలు దాని కర్థములు వ్రాసియున్నారు. ప్రాతర్మధ్యాహ్నసాయాహ్నములయందు క్రమముగా గాయత్రీ సావిత్రీ సరస్వతీ సంజ్ఞల నావాహన మొనర్పఁదగిన సంధ్యాదేవత నుపాసింప వినియుక్త మగుచున్న యీగోప్యమంత్రమునుగూర్చి యింతకంటె వివరించుట యుచితము కాదు[3].

---

1. చిత్రందేవానామిత్యాది. ఋ. 1-125-1.

2. ఋ. 1-5-11, 12, 13, మంత్రములు మూఁడు.

3. ఋ. 3-62-10.

మఱియు సంధ్యోపాసనాపరులు నిత్యము పఠించు ప్రాతరుపస్థాన మంత్రములు మూఁడు విశ్వామిత్రమహర్షి సందర్శించిన మఱియొకసూక్తమున నున్నవి[1]. మిత్రరూపసూర్యుని వర్ణించు నామంత్రములభావ మిది:—

"వృష్టిప్రదానమున మనుష్యులను జీవింపఁజేయు మిత్రదేవుని సంబంధమయినయన్నమును భజనీయ మయినధనమును మిక్కిలి కీర్తియుక్తము లైనవి."

"వర్షప్రదానమున నందఱిని రక్షించునట్టియు స్తూయమానుఁడగునట్టియు మిత్రరూపసూర్యుఁడు కర్షకులచేఁ గృష్యాది కర్మప్రయత్నము చేయించుచున్నాఁడు. మఱియు నతఁడే, అన్నమును యాగములను గలిగించుచుఁ బృథివీద్యులోకములను ధరించుచున్నాఁడు. అతఁడే తెప్పపాటు లేనిదయామయదృష్టితో సకలకర్మప్రవృత్తు లగుమనుష్యులను జూచుచున్నాఁడు. ఓ ఋత్విజులారా! ఇదంతయు గ్రహించి ఘృతయుక్త మయినపురోడాశాదికహవిస్సు నతనికి సమర్పింపుఁడు."

"ఓ యాదిత్యా! వ్రతయజ్ఞాదిపరుఁ డగునేమనుష్యుఁడు నీకు హవిర్దానము చేయుచున్నాఁడో. అతఁ డన్నవంతుఁ డగుఁగాక. నీచే రక్షితుఁ డయినయతఁడు పరులచే బాధింపఁబడఁడు. అవమానింపఁబడఁడు. అతనిని దగ్గఱనుండి కాని దూరమునుండి కాని యేపాపమును బొందదు."

కుత్సమహర్షి సూర్యునిమహిమ నిట్లు వర్ణించెను[2].

"త త్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తోర్వితతం సంజభార।

య దేత దయుక్త హరితః సధస్థా దాద్రాత్రీ వాస స్తనుతే సి మస్మై॥"

జగత్ప్రేరకుఁ డయినసూర్యునిస్వాతంత్ర్యము గాని మహిమగాని యనన్యలభ్యములు. ఏ మనఁగా? మనుష్యు లారంభించినకృష్యాదికర్మలు సమాప్తి నొందకుండఁగానే సూర్యుఁ డస్తమించుచుఁ దనరశ్మిజాలము నీలోకమునుండి యుపసంహరించుకొని తనయందు దాఁచుకొనుచున్నాఁడు. అస్తమించుచున్న యతనిని జూచి కృష్యాదికర్మకారులును, అసమాప్తము లైనతమపనులు విడిచివెట్టుచున్నారు. ఇట్టి స్వాతంత్ర్యము గాని మహిమగాని సూర్యవ్యతిరిక్తుఁ డైనయేదేవునికిఁ గలదు? అతని కొక్కనికే యీరెండుగొప్పతనములు గలవనుట నిజము. అది

1. ఋ. 3-59-6, 1, 2, ఈమూఁడుమంత్రములును గొన్నిపదముల పాఠభేదముతో యజుస్సంహితలో నున్నవి. అవియే యజుశ్శాఖీయుల సంధ్యోపాస్తిమంత్రములుగా వచ్చుచున్నవి. సానసి-ద్యుమ్నం-బ్రువాణః-మిత్రాయ-జుహోత-అనుపదములు యజుస్సంహితలో, సానసిం సత్యం-ప్రజానన్-సత్యాయ-విధేమ-అనువిధములుగాఁ గ్రమముగా మాఱినవి. చూ. తై. సం. 3-2.

2. ఋ. 1-155-4.

గాక, సూర్యుఁ డెపుడు రసహరణశీల మైనతనరశ్మిజాలము నీ భూలోకమునుండి మరల్చి మఱియొకచోటికిఁ ద్రిప్పుచున్నాఁడో, లేక హరిద్వర్ణము లైనతనగుఱ్ఱములను రథమునుండి విడిపించుచున్నాఁడో, అపుడే లోక మంతటను జీఁకటి వ్యాపించుచున్నది. లేదా, పగటిని దొలఁగించి రాత్రి విస్తరించుచున్నది. ఈ మహిమ సూర్యునిది గాక మఱెవరిది?

భరద్వాజమహర్షి పూషరూపసూర్యు నిట్లు స్తుతించెను[1].

"శుక్రం తే అన్య ద్యజతం తే అన్య ద్విషురూపే అహనీద్యౌ రివాసి।
విశ్వాహి మాయా అవసి స్వధావో భద్రా తే పూష న్నిహ రాతి రస్తు॥"

ఓపూషా! నీవర్ణములలో నొకటి శుక్ల మయినది; అది పగటిని గలిగించునది. మఱియొకటి కృష్ణ మైనది, అది రాత్రిని గలిగించుచున్నది. అందుచేత నే దివారాత్రములు విషమరూపము లగుచున్నవి. అహోరాత్రనిర్మాత యగునాదిత్యునివలెనే నీవును సర్వమును బ్రకాశింపఁజేయుచున్నావు. అన్నవంతుఁడ వైన నీవు సకలజంతుజాలమును రక్షించుచున్నావు. కావున నీవు సూర్యుఁడవే యగుదువు. అట్టి నీవు మాకు శుభప్రదాత వగుదువు గాక.

ఋగ్వేద మంతట నిట్టిసూర్యవర్ణన లనేకములు కలవు. ఒక్కొక్కవర్ణనమున నొక్కొక్కవిశేషము గనవచ్చును. వాని నన్నిటిని బరిశీలించినచో వైదిక మహర్షులు దిక్కాలాదివిజ్ఞానమున కాధారభూతము సర్వలోకసంరక్షకము నగు సూర్యమండలమతత్త్వము చక్కఁగా గ్రహించినవా రని తెలియకపోదు. యోగదృష్టి కడ్డ మున్నదా?

ఋగ్వేదవర్ణనలలో సంస్కృతభాషాభిజ్ఞు లగు పాశ్చాత్యపండితులనుగూడ నాహా యనిపించిన వుషోవర్ణనములు. ఉషస్సును స్త్రీదేవతగా భావించి వర్ణించిన ఋక్కులు నునూరు రెండువంద లుండును. అందలికొన్నిటియర్థము చవిచూతము. ఆంగిరసుఁ డైనకుత్సమహర్షి యిట్లు వర్ణించెను[2].

"సకలజ్యోతిస్సులలో నుషస్సు శ్రేష్ఠ మైనది. నక్షత్రములు తమ్మ మాత్రమే ప్రకాశింపఁజేసికొనును గాని, ఉషస్సు చీఁకటిని దొలఁగించి సకల లోకము నొక్కమాఱుగాఁ బ్రకాశింపఁ జేయును. అట్టివెలుఁ గుదయించినది. అది సకల పదార్థములను దెలియఁజేయుచున్నది. సూర్యుఁ డుదయింప నీయుష స్సెట్లు కారణ మగుచున్నదో, అట్లే దీనియుత్పత్తికి రాత్రిపరభాగము కారణ మగుచున్నది."

1. ఋ. 6-58-1.

2. ఋ. 1-113-1, 2, 4, 8, 16.

"సూర్యుఁడనువత్సను వెనుక నిడుకొని శ్వేతవర్ణముతో వచ్చుచున్న యీయుషస్సునకు రాత్రి తనకడపటిభాగముచే నించుక నల్లరంగు కల్పించుచున్నది. రాత్ర్యుషస్సులు రెండును సూర్యునికిఁ జుట్టములు. రెండును నాశము లేనివి. సూర్యునిముందు వెనుకల ననుసరించి యుండునవి. నభోఽంతరిక్షమార్గముల సంచరించునవి".

"నరపశుపక్షిమృగాదులనోట శబ్దము పుట్టించునట్టియుషస్సు తమోద్వారములను దెఱచి తిరోహితమై యున్న సకలపదార్థసంతతిని వెలువరించుచున్నది".

"కడచిపోయినయుషస్సులమార్గము నీయుష స్సనుగమించుచు రాఁబోవునుషస్సుల కాద్యమై యొప్పుచున్నది. దీనివలెనే యుదయింపఁబోవునుషస్సులు నొనరించును. ఈయుషస్సు నిద్రించినవారి జీవాత్మలను బ్రేరించుచు మృతులయినట్లు పడుకొనియున్న వారిని సచేతనులఁ జేయుచున్నది".—ఈవర్ణన ముత్తరధ్రువమందలి ముప్పదిదినముల యుషస్సును సూచించుచున్నది.

"ఓరీ మనుష్యులారా! పడక విడిచి లేవండి. మనజీవాత్మ వచ్చినది. తమస్సు పోయినది. అదిగో! ఉషఃకాంతి సూర్యునిమార్గమును విశదపఱుచుచున్నది. మనయన్న మెక్కడ వర్ధిల్లునో యక్కడికిఁ బోవుదము రండి."

దీర్ఘతమః పుత్త్రుఁడగుకక్షీవంతుఁ డిట్లు వర్ణించి యున్నాఁడు[1].

"ఉషోదేవీ! నీ వాదిత్యునికిని సవితకును గూడ సహోదరివి. కావున నీవు పూజ్యురాల వైతివి."

ఈఋషియే, ఉషస్సును స్త్రీతోఁబోల్చి దానిబాల్యాద్యవస్థలను దెల్పుచు నుషోదేవి సూర్యునిప్రియురాలుగా వర్ణించియున్నాఁడు.

"ఉషోదేవీ! నీవు ముందుగా, నింటిలో దెసమొలతో సంచరించు చక్కని కన్యవలెనే సర్వాంగము స్పష్టముగాఁ గనఁబడునట్లు గోచరించుచున్నావు. తరువాతఁ బ్రగల్భురాలవై ప్రకాశమానుఁడు ప్రియుడు నగు సూర్యుని సమీపించుచున్నావు. పిదపఁ బ్రౌఢ యగు యువతివలెనే చిఱునవ్వు మొగముతో నీ మనోహరుఁ డైనసూర్యునియెదుటఁ గులుకు లొలుకఁ గౌఁగిలి యపేక్షించు దానివలె నురఃప్రదేశ మావిష్కరించుచున్నావు."

"ఉషోదేవీ! తల్లి జలకమార్చి యలంకరించిన నిర్మలాంగి యగుయువతి వలె విలసిల్లునీవు నీ శరీరలావణ్యము నందఱికిని జూపుచున్నావు, ఓకల్యాణశీల వగుదేవీ! ఈ యావరక మైనయంధకారమును దూరముగాఁ దఱిమి వేయుము."

---

1. ఋ. 1-123-5, 10, 11,—1. 124-3.

"ఏషా దివో దుహితా ప్రత్యదర్శి జ్యోతి ర్వసానా సమనా పురస్తాత్।
ఋతస్య పంథా మన్వేతి సాధు ప్రజానతీవ న దిశో మినాతి" ॥

ద్యులోకపుత్త్రి యైన యీయుషోదేవి తేజోరూప మైన తెల్లనికోక కట్టుకొని చక్కఁగా నటించుచు నఖిలజీవరాశి కొక్కమాఱుగా గోచరించుచు నెల్లప్రాణుల కభిముఖముగాఁ బ్రకాశించుచున్నది. అట్టియీయామె సూర్యునిమార్గ మైన మేరుప్రాంతప్రదేశమును మెల్లగా నెక్కుచున్నది. లోకములో ననురక్తురాలయిన భార్య భర్త నెట్లు విడువకయుండునో యట్లే యీయామె తనప్రియుఁడైన సూర్యుఁ డెక్కడికిఁ బోవునో యక్కడికి ముందు నడచుచున్న దని భావము. మఱియు నీమె దిగ్భ్రాంతి కలుగకుండఁ బ్రాచ్యాదిదిగ్వ్యవహారము కలిగించుచున్నది.—అనఁగా, ఉష నెక్కడఁ గనవచ్చునో యది తూర్పుదిక్కని తెలియవచ్చుననుట. భాష్యకర్తలు వ్రాసిన యీ భావమునుబట్టి కూడ నీ ఋక్కునందలి విషయ ముత్తరధ్రువలక్షణసూచక మని విశ్వసింపవచ్చును. కక్షీవన్మహర్షి యుషోవర్ణనము లొకటి రెం డుత్తరధ్రువవాద సందర్భమున నుదాహరింపఁబడినవి. ఈ వర్ణనములనుబట్టి యీ ఋషియుత్తరధ్రువమండలవాసి యని చెప్పరాదు గాని వీనియందలి విషయమునుబట్టి యితఁ డుత్తర ధ్రువలక్షణములను బెద్దలవలన వినియున్నవాఁ డని మాత్రము చెప్పవచ్చును. మఱియు నీఋషి యుషస్సును సూర్యునిదుహితఁగాను, దానికి ముందును వెనుకను జనించిన యుషస్సులు దానియప్పచెల్లెండ్రుగాను గల్పించి గావించినవర్ణనలలోఁ గూడఁ బూర్వోక్త లక్షణములసూచనలు కొంచెముగాఁ గనవచ్చును[1].

వసిష్ఠమహర్షి యుషస్సు నతిమనోహరముగా వర్ణించియున్నాఁడు. ఉత్తరధ్రువలక్షణబోధకము లగునితనిఋక్కు లట్టివి రెండు పూర్వ ముదాహరింపఁబడినవి[2]. ప్రాచీనచరిత్రబోధక మగువానితరువాతిఋక్కు నిం దుదాహరించెదను.

"త ఇ ద్దేవానాం సధమాద ఆస న్నృతావానః కవయః పూర్వ్యాసః।
గూళ్హం జ్యోతిః పితరో అన్వవిందన్ త్సత్యమంత్రా అజనయ న్నుషాసం॥",

పురాతనకాలమువారును సత్యవంతులును, కవులు ననఁగా ననూచానులును సర్వపాలకులు నగునేయంగిరసులు తమస్సుచే నావృత మయినసూర్యతేజస్సును మంత్రశక్తిచేఁ జూడఁగలిగిరో, వారు ఋషులలో నెల్ల దేవతలతోఁ గలసి యానందించువా రైరి. సత్యమంత్రశక్తి గలయీమహర్షులే ధ్యానమహిమచే నుషస్సును గలిగించిరి".—దీనినిబట్టి, యుత్తరధ్రువము మేరు వనియు, మేరువు

1. 1-124-7, 8, 9,—2. 7-76-2, 3, 4.

దేవనివాస మనియు, మన మింతకు మున్ను తెలిసికొన్నదాని కనుకూలముగా, సప్తర్షులలోనివాఁడగు వసిష్ఠమహర్షి కూడ బహుపురాతను లని పేర్కొన్నయంగిరసు లుత్తరధ్రువనివాసులై దేవసహవాసు లగుట విశ్వసనీయ మనియు (మేరువున నివసించువారు దేవత లనుట పురాణప్రసిద్ధము) వారు సూర్యదర్శనమునకై మహాతపస్సు చేయఁగా దానిమహిమవలనఁ గొంతకాలమున కుషస్సు కనఁబడె ననియుఁ దరువాత సూర్యుఁడు ప్రత్యక్ష మయ్యె ననియు, నిది యంతయు నుత్తరధ్రువమండలమందలి దీర్ఘరాత్రిదీర్ఘోషస్సులను దెలుపుచున్న దనియు గ్రహింపవచ్చును. ఇందుకు వసిష్ఠుని మఱియొకఋక్కుఁగూడఁ బరిశీలింతము.

"ఏషా స్యా నవ్యమాయు ర్దధానా గూఢ్వీ తమో జ్యోతి షోషా అబోధి।
అగ్ర ఏతి యువతి రహ్రయాణా ప్రాచికిత త్సూర్యం యజ్ఞ మగ్నిం'[1].

"కడచినరోజులలోఁ గనబడుచువచ్చుచున్న యీయుషోదేవి నవతరయౌవనము దాల్చి తనతేజస్సున గూఢమైనయంధకారమును నివారించుచు భర్తముంగట సిగ్గు విడిచియుండు యువతివలెనే సూర్యునిముందటఁ గనవచ్చుచున్నది. ఇట్టి యీమె సూర్యుని, యజ్ఞమును, అగ్నినిగూడఁ జక్కఁగా జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది."

ఇందు వర్ణింపఁ బడినయుషస్సు భరతవర్షమునఁ బ్రతిదినము సూర్యోదయమునకు ముందు కొన్నిగడియలు కనిపించునుషస్సే యైనయెడల 'స్యా - నవ్యమాయు ర్దధానా' అనెడి విశేషణములు రెండును సార్థకములు కాఁజాలవు. ఇది కొన్నిదినములనుండి యెడతెగకుండఁగ వచ్చుచున్నయుషస్సు కావుననే, దినములు గడచినకొలఁదిని, కాంతి హెచ్చుచుండుటయు సూర్యోదయము సమీపించుచుండుటయుఁ గనిపెట్టి, యాఋషి వైవిశేషణము లుపయోగించె ననుట తెల్లము. మఱియు నుషోదేవి పెక్కుదివసములనుండి తనభర్త నెపుడు చూతు నని యాత్రము చెందియున్నట్లు సిగ్గు విడిచి పతియెదుట సంచరించు జవ్వనివలెనే సూర్యుని ముందు నిర్లజ్జముగా సంచరించున్న దని యలంకరించి వర్ణించుటయు సముచిత మగుచున్నది. కావున నిది యుత్తరధ్రువదీర్ఘోష స్సూచకమైనవర్ణన మని తోఁచకపోదు. ఇట్టియుషస్సు సూర్యునికిఁ బత్నియై త్రివిధముగా నతని నాశ్రయించి యుండు ననియు నిదియే మధ్యాహ్నకాలమున సూర్య యను పేరను, సాయంకాలమున వృషాకపాయి యనుపేరను బరఁగుచున్న దనియు వర్ణింపఁబడినది[2].

1. 7-80-2.

2. ఉషా ఏషా త్రిధా త్మానం విభజ్య ప్రైతి గోపతిమ్, ఉషాః పురోదయా ద్భూత్వా సూర్యా మధ్యం దినే స్థితే, భూత్వా వృషాకపాయీ చ దినాంతే ప్యవగచ్ఛతి. బృహద్దే. 7-120.

మన మిపుడు సంస్కృతాంధ్రాదిభాషలలో రూపకాద్యలంకారములతోను గల్పనాచాతుర్యముతోను విలసిల్లునిట్టివర్ణనల కెక్కువగా నలవాటు పడియున్నాము కావునఁ బై వర్ణనలయందు ప్రత్యేకించి చెప్పఁదగినవిశేష మేమియు గోచరింపక పోయినను, ఆకాలమును స్మరించుకొన్నచో నట్టియుషస్సు నట్లు వన్నెలు చిన్నెలు పెట్టి మనోహరశైలిని వర్ణించినయానాఁటివైదికర్షులయమేయ ప్రతిభావిశేషము గోచరింపక పోదు. అదిగాక వేదమందలి యిట్టివర్ణనలే తరువాత బహువిధకావ్యవర్ణనలకును బీజములైన వనుట యంగీకార్యము కాకపోదు. అదే యిందలివిశేషము.

విష్ణువు:—అగ్నీంద్రాదులవలె విష్ణువధికసూక్తము లాక్రమింపలేదు కాని యీకాలమున దశావతారమూర్తి యగు లోకరక్షకుఁడుగా నారాధింపఁబడు శ్రీమహావిష్ణువే యాకాలమునఁ గూడ సకలలోకస్రష్టయైనపరమేశ్వరుఁడు గా ఋషులచే ధ్యానింపఁబడిన ట్లాకొలఁదిసూక్తములే చెప్పుచున్నవి. ఇందుకు దీర్ఘతమోమహర్షి వాక్యములు కొన్ని యాంధ్రీకరించి యుదాహరించుచున్నాను[1].

"ఓనరులారా ! విష్ణునివీరకృత్యములు చెప్పుచున్నాను, వినండి. అతఁడు పృథివ్యంతరిక్షద్యులోకాభిమానులైనయగ్నివాయ్వాదిత్యరూపము లగురంజనాత్మకరజస్సులను నిర్మించెను. మఱియు నతివిశాలమైనయంతరిక్షము నగ్న్యాదుల కాధారభూతముగా నిర్మించెను. అనఁగా లోకత్రయస్రష్ట యని భావము. సాయణాచార్యులవారు మఱియొక విధముగాఁ గూడ నర్థము వ్రాసిరి.—పృథివిక్రింది సప్తలోకములను భూమ్యాదిసప్తలోకములను సృజించెను—" "అక్షీయమాణము లమృతపూర్ణములునైనయావిష్ణునిత్రిపదములు తమ్మాశ్రయించినవారి నన్నముచే సంతోషపెట్టుచున్నవి. అతఁడు చతుర్దశభువనములను, అందలి భూతజాతములను బృథివ్యప్తేజోరూపము లగుమూఁడు ధాతువులతోఁ గూడినవానిగాఁ జేసి ధరించుచున్నాఁడు."

"అమ్మహావిష్ణుని ప్రియభూతమైనట్టి యవినశ్వరమైనట్టి యంతరిక్షము ననఁగా బ్రహ్మలోకమును గాంక్షించుచున్నాను. ఆలోకమునందు నివసించునట్టి యావిష్ణువును బొందఁగోరుచు నరులు యజ్ఞదానాదికృత్యము లొనర్చి తృప్తి నొందుచున్నారు. సర్వజగద్రూపమునఁ బరిణమించినవ్యాపనశీలుఁడయినయాపరమేశ్వరుని కేవలసుఖాత్మకమైనయాలోకపుం దమృతము స్రవించుచుండును. అది పునరావృత్తిరహితబ్రహ్మలోక నివాససిద్ధికి మూలము. మేధాతిథిమహర్షి యీక్రిందివిధముగా విష్ణుస్తుతి యొనరించి యున్నాఁడు[2].

1. 1-154-1, 4, 5,

2. 1-22-17, 18, 19, 20, 21,

ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదం।
సమూళ్హ[1]. మస్య పాంసురే ॥
త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపా అదాభ్యః।
అతో ధర్మాణి ధారయన్ ॥
విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే।
ఇంద్రస్య యుజ్యః సఖా ॥
తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః।
దివీవ చక్షు రాతతం ॥
తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే।
విష్ణో ర్య త్పరమం పదం ॥

అర్థము క్రమముగా:—"విష్ణుదేవుఁ డీ ప్రతీయమాన మైనసకలజగము నుద్దేశించి పాదవిక్షేప మొనర్చెను. తనపాదమును మూఁడుతెఱఁగుల విక్షేపించెను. ఆవిష్ణుని ధూళియుక్త మైన పాదస్థానమం దీజగ త్తంతయు నంతర్భూతమై యున్నది."

"ఇతరుల కబాధ్యుఁడును సకలజగద్రక్షకుఁడు నైన విష్ణువు, అగ్నిహోత్రాది సకలధర్మములు పోషించుచుఁ బృథివ్యాది స్థానములందు మూఁడడుగులు వెట్టెను" ఇతిహాస పురాణములలోని త్రివిక్రమావతారవర్ణన కీ ఋక్కులు రెండును మూల మనుట విస్పష్టము.

"ఓఋత్విజులారా! ఏవిష్ణువు నను గ్రహమువలన యజమానుఁ డగ్నిహోత్రాదికర్మ లాచరించుచున్నాఁడో, అతని పరిపాలనాది కృత్యములను జూడుఁడు. అతఁడే యింద్రుని కనుకూలుఁ డైన మిత్రుఁడు."

"చక్కఁగాఁ బ్రసరించిననేత్ర మాకాశమం దెట్లు చూచుచున్నదో, అట్లే విద్వాంసులు జ్ఞాననేత్రముచే నుత్కృష్ట మైన యా విష్ణునిస్థానమును జూచుచున్నారు."

---

1. అచ్చులమధ్య నుండు డకారమును ళకారముగాను, ఢకారమును ళ్హకారముగాను బహ్వృచులు పఠింతు రని కారిక—అజ్మధ్యస్థడకారస్య ళకారం బహ్వృచా జగుః। అజ్మధ్యస్థఢకారస్య ళ్హకారం వై యథాక్రమమ్ ॥

"శబ్దార్థ పరిజ్ఞాతలును స్తుతిప్రవీణులు నగు మేధావులా విష్ణుదేవుని పరమపదమును జక్కఁగాఁ బ్రకాశింపఁజేయుచున్నారు." పైవానిలోఁ గడపటి మంత్రములు రెండు నిత్య మీశ్వరారాధనసమయమున నుపయుక్తములగుట విదితము.

రుద్రుఁడు :— ఋగ్వేదీయ దేవతలలో విష్ణువువలెనే రుద్రుఁడుగూడ మహామహిమాన్వితుఁడుగాఁ గనవచ్చును. ఋగ్వేదములో రుద్రస్తుతిపరములైన సూక్తము లయిదుమాత్రమే ముఖ్యములై యున్నవి. ఋగ్వేదీయరుద్రుఁడే తరువాత బయలుదేఱిన శైవమతమున కాధారభూతుఁడైన శివుఁడని చెప్పఁ దగినట్లుగా నిందు వర్ణింపఁబడిన రుద్రలక్షణము లన్నియుఁ దరువాతి గ్రంథములలోని శివునికి సంక్రమించిన వని చెప్పవచ్చును. ఈ సంహితలోఁ గూడ రుద్రుఁ డింద్రాదిదేవతలకంటె విలక్షణమైన యుత్కృష్టగుణములు కలవాఁడుగానే వర్ణింపఁబడియున్నాఁడు. అయినను విష్ణురుద్రు లిరువురును వేఱయిన పరమేశ్వరు లనియే వైదికర్షులు భావించెడివా రనిమాత్రము తలంపరాదు. సృష్టిస్థితిలయకారణుఁ డయినపరమేశ్వరుఁ డొక్కఁడే యనెడి పరమార్థము వారివాక్కులం దెల్లెడ గోచరించుచునే యున్నది. "స్థిరధన్వుఁడు శీఘ్రగామి బాణుఁడు పరానభిభూతుఁడు శత్రుహింసకుఁడు విధాత నిశితాస్త్రుఁడు" అనునర్థ మిచ్చువిశేషణములతో నీక్రిందిఋక్కు రుద్రునిరూప మహత్త్వములను బ్రత్యక్షముగావించుచున్నది[1].

"ఇమా రుద్రాయ స్థిరధన్వనే గిరః క్షిప్రేషవే దేవాయ స్వధావ్నే ।
అషాళ్హాయ సహమానాయ వేధసే తిగ్మాయుధాయ భరతా శృణోతు నః"॥

ఇట్లు వర్ణించినవసిష్ఠమహర్షి మఱియుఁ దరువాతిఋక్కులలో—రుద్రదేవుఁడు భువిమీఁదివారికిని దివిలోనివారికిని గూడఁ బరమైశ్వర్యముచేఁ దెలియఁబడుచున్నాఁడు - ఓరుద్రదేవా! ద్యులోకమునుండి నీవు విడిచిన యేయాయుధము భూమిమీఁదఁ దిరుగుచున్నదో, అది మమ్ము విడిచిపెట్టుఁగాక. అనఁగా జ్వరాదిరోగభయములు మాకుఁ గలుగకుండుఁగాక యనిభావము. మఱియు నోయనుల్లంఘనీయశాసనా! నీభక్తులమైనమాకు రోగభయము లేకుండుటకై వేలకొలఁదిగా నున్న నీదివ్యౌషధములు మాకను గ్రహింపుము. మా బిడ్డలను హింసింపకుము - ఓ రుద్రదేవా! మమ్ముఁ జంపకుము. కాని మమ్ము విడిచిపెట్టకుము. కోపగించిన నీబంధనము నందు మాత్రము మే ముండఁజాలము. మాయజ్ఞమునకు రమ్ము. మమ్ము రక్షింపుము - అనుచు వర్ణించుటనుబట్టి

1. 7-46-1, 2, 3, 4.

చూడఁగా ఋగ్వేదకాలముననే రుద్రదేవుఁడు లయకారకుఁడుగా భావింపఁ బడెడివాఁడని తెలియవచ్చుచున్నది. మఱియు, నిగ్రహానుగ్రహసామర్థ్యసమేతుఁడు సకలైశ్వర్యసంపన్నుఁడు మహావీరుఁడు మహాబలశాలి మహోగ్రభయంకరుఁడు ధనుర్బాణపాణి మరుద్దేవతాజనకుఁడు దివ్యతేజోవిరాజమానుఁడు ధవళాంగుఁడు జటాజూటధారి రోగశాంతిప్రదుఁడు లోకరక్షకుఁడు భక్తప్రియుఁ డనుచు నిందు వర్ణింపఁబడినరుద్రుఁడే తరువాతఁ దైత్తిరీయసంహితలో[1]. సకల జగదాత్మక పరమేశ్వరుఁడుగా వర్ణింపఁబడె ననుట సత్యమే కాని యిందుమాత్ర మతఁ డిష్ట కామ్యార్థసిద్ధిప్రదుఁ డగునుత్తమదేవతగానే వర్ణింపఁబడెను.

ఋగ్వేదకాలమునుండియు నిత్యపారాయణమునఁ బ్రసిద్ధి కెక్కినకొన్ని సూక్తములలోఁ బంచరుద్రసూక్త మొకటి. ఋక్సంహితలో నందందు గనవచ్చురుద్రదేవతాకము లయినయైదుసూక్తములను సంపుటీకరించి వానికిఁ బంచరుద్రసూక్త మని యర్వాచీనమునులు పేరు పెట్టినట్లు కనఁబడుచున్నది. ఆసూక్తము లే యేమండలములలోనివో, అం దెన్నేసి ఋక్కులు కలవో, ఈ క్రింది పట్టికవలనఁ దెలియఁగలదు.

| మం. | సూ. | ఋక్కులు. | మం. | సూ. | ఋక్కులు. |
| --- | --- | --- | --- | --- | --- |
| ౧ | ౪౩ | ౯ | ౬ | ౭౪ | ౪ |
| ౧ | ౧౧౪ | ౧౧ | ౭ | ౪౬ | ౪ |
| ౨ | ౩౩ | ౧౫ | మొత్తము | | ౪౩ ఋక్కులు[2]. |

కణ్వుఁడు - కక్షీవంతుఁడు - గృత్సమదుఁడు - భరద్వాజుఁడు - వసిష్ఠుఁడు- అనుమహర్షులు క్రమముగా సందర్శించిన పైసూక్తములందు రుద్రదేవునిమహత్త్వము సంపూర్ణముగా వర్ణింపఁబడి యున్నది. ఈసూక్తములు రుద్రయాగాదులందు దిగాద్యుపస్థానపరము లని భాష్యకర్తలు వ్రాసియున్నారు. శౌనకుని పేరఁ గనవచ్చు ఋగ్విధాన మనుగ్రంథమందు పంచరుద్రసూక్తపఠనమున కీక్రిం దివిధముగా ఫలము చెప్పఁబడినది.

"ఇమా ఇతి జపే చ్ఛశ్వ ద్రుద్రసూక్తం ద్విజ శ్శుచిః
ఆయు ర్విద్యాం ధనం పుత్రాన్ గృహం శ్చాప్నో త్యనామయాన్[3]."

నిరుక్తకారులును భాష్యకారులును రుద్రశబ్దమునకు బహువిధము లైన వ్యుత్పత్తులువ్రాసియున్నారు. అందు గొన్ని:—

---

1. రుద్ర ప్రశ్నము. తై. 4.

2. రెండవమండలములోని 3౪ వ, సూక్తములోని మొదటి మూఁడు ఋక్కులు కలిపి ౪౬ ఋక్కు లని కొందఱు గణించినట్లు కనఁబడుచున్నది.

3. ఇది యొకసూక్తమునకు ఫలము. ఇట్లే తక్కినసూక్తములఫలములు వేఱుగా నున్నవి.

"ఉబుము కలిగించువాఁడు, మేఘోదరస్థుఁడై ధ్వని చేయుచు ద్రవించు వాఁడు, శత్రువులను దుఃఖింపఁజేయువాఁడు; అంతకాలమున దందటి నేడ్పించు వాఁడు, సంసారదుఃఖమును నశింపఁ జేయువాఁడు, శబ్దరూపోపనిషత్తులవలనఁ దెలియఁబడువాఁడు, ఉపాసకుల కుపనిషద్విద్య నిచ్చువాఁడు, అంధకారమును జీల్చు వాఁడు," ఇత్యాదికములు. ఇందలి కొన్నియర్థము లిటీవలివారు కల్పించిన వైనను, మొత్తముమీఁద ఋగ్వేదరుద్రుఁడు కొందఱు తలంచినట్లు కేవలము ప్రాకృత దేవతగా భావింపఁబడినవాఁడు గాఁ డనియు, అతఁడే ఋగ్వేదమందలి విశేషణములనుబట్టి తరువాతశైవమతమున కాలంబన మైనవాఁడుగాఁ గనవచ్చు చుండె ననియు విశ్వసింపవచ్చును.

వరుణుఁడు:—అంతరిక్షస్థాన దేవతలలో వరుణుఁడు ప్రధానుఁడు రాత్ర్య భిమాని బలపరాక్రమశాలి. ఇక్ష్వాకునియజ్ఞమందు యూపబద్ధుఁ డయినశున శ్శేఫఋషి కాందిశీకుఁడై నే నిపుడే దేవుని శరణు చొచ్చెద ననియాత్రము చెంది తొలుఁత ప్రజాపతిని, అతని యానతిచే నగ్నిని, అతనిచేఁ బ్రేరితుఁడై సవితను, అతనియాజ్ఞచేఁ వరుణుని స్తుతించి ప్రార్థించిన ట్లున్నఋగ్వేదములోని ఋక్కులనుబట్టియే యైతరేయబ్రాహ్మణములోని శౌనశ్శేఫాఖ్యాన ముదయించి నది. అజీగర్తపుత్రుఁ డయినయాఋషి గావించిన వరుణస్తుతి యి ట్లున్నది[1].

"వరుణుని కున్న బలవేగ పరాక్రమములు మ ఱెవ్వరికిని లేవు - వరుణ రాజు మూలరహిత మైనయంతరిక్షముననుండి తేజస్సమూహముల మొదళ్లను బైకిఁ బట్టుకొనుచున్నాఁడు. ఆ తేజఃకాంతులు క్రిందికిఁ బ్రసరించుచున్నవి — వరుణ రాజు సూర్యునిమార్గము విశాలము గావించెను. అతఁడు, చంద్రనక్షత్రములు రాత్రులయందు ప్రకాశించునట్లు చేయుచున్నాఁడు. అతనికృత్యము లమోఘ ములు - ఓ వరుణరాజా! చచ్చుటకు సిద్ధముగా నున్ననన్ను రక్షింపుము— అంతరిక్షగతుఁడై యాకాశమున నెగురుపక్షుల స్థానమును, సముద్రగతుఁడై యందు పోవునావలస్థానమును దెలిసికొనునట్టి వరుణుఁడు నాబంధములు విడి పించుఁగాక." ఇత్యాదికము.

నాభాగుఁడను ఋషి, "వరుణుఁడు సప్తసింధువులకు రాజు. అతఁడు తన రశ్మిజాలమును బగలు తెల్లగాను రాత్రి నల్లగాను జేయును. సూర్యుఁడు ద్యులోకమును ధరించినట్లే వరుణుఁడు ద్యావాభూములను ధరించియున్నాఁడు." అని వర్ణించెను[2].

వసిష్ఠమహర్షి, వరుణుఁడు ద్యావాభూములను నిలుపుచున్నాఁడు. అతఁడు దివాభాగమున సూర్యుని రాత్రిభాగమున నక్షత్రములను బ్రేరేపించుచున్నాఁ డని వర్ణించెను[3].

1. 1-24-6, 7, 8, 10, 11; 1-25-7. — 2. 8-41. — 3. 7-86-1.

ఇట్లే వరుణునిగూర్చి పెక్కండ్రు ఋషులు పెక్కువిధముల స్తోత్రములు గావించియున్నారు. అతని నింద్రునితోఁ గలిపియు మిత్రునితోఁ గలిపియుఁ గొందఱు స్తుతించియున్నారు. వరుణుఁడు సూర్యునివలెనే లోకహితకారి యనెడి భావము వరుణదేవతాకసూక్తములందు గనవచ్చును. వర్ష వాయువులను బ్రేరేపు వాఁడు వరుణుఁ డనియు నతఁడు జలాధిపతియనియుఁ బ్రాచీనులముఖ్యభావము.

నదులు :—ఇందలినదీవర్ణన లల్పసంఖ్యాకములే యైనను, ప్రాచీనార్యుల నివాసమును దెల్పుచున్న యివి చరిత్రదృష్టిచే ముఖ్యము లగుచున్నవి. ఉన్నంతలో సింధుసరస్వతీనదులస్తుతు లెక్కువగా నున్నవి. సింధుశబ్దము నదీవిశేష వాచకముగాను గంగాదినదీసామాన్యవాచకముగాను గూడ నిందు ప్రయోగింపఁబడినది. ఇందుకు "సింధుః - సప్తసింధూన్" ఇత్యాదిప్రయోగములే ప్రమాణము[1]. సప్తసింధుశబ్దము ఋగ్వేదమున సింధునదీప్రాంతదేశపరముగా నుపయోగింపఁబడిన సూచన గల దనియు, నిదియే తరువాత నార్యులతో విడిపోయిన పారశీకార్యులజెండవెస్తాలో 'హప్తహిందు' అని తూర్పుకాబూలు దేశపరముగాఁ బ్రయోగింపఁబడిన దనియుఁ గొందఱు చరిత్రకారు లూహించియున్నారు. ఆర్యులుత్తరధ్రువమండలమం దేడుమాసములసూర్యరశ్మి గలప్రదేశమందు నివసించినపుడు, అధోలోకమునందలిసముద్రమునుండి వెడలి పైకి వచ్చుదివ్యజలపూర్ణము లైనయేడుదివ్యవాహిను లేడుగురుసూర్యులను దమవెంటఁ గొని వచ్చుచున్నట్లు వర్ణించుచు వానికి సప్తసింధువు లనుపేరు పెట్టుకొని యుందురనియు, వారార్యావర్తమునకు వచ్చినవెనుక నిందలిప్రధానములయిన సప్తనదుల కాపేరే వాడుకొని యుందురనియు, అదియే జెండవెస్తాలో 'హప్తహిందు' అనుపేర దేశపరముగా నుపయోగింపఁబడియుండుననియు శ్రీతిలకుగారు తలంచిరి[2]. ఈ యభిప్రాయభేదము లెట్లున్నను, సింధుశబ్దము క్రమముగా దేశపరమయిన ట్లీక్రిందివిధముగాఁ దెలియవచ్చును.

తొలుత నార్యులు నివసించినచోటికిఁ బడమటిదిక్కునఁ బ్రవహించెడి యొకనది సింధు వని పిలువఁబడెడిది. దానినిబట్టి తత్ప్రాంతప్రదేశము సింధు సంజ్ఞ చెందినది. దానిని పారసీకులు 'హిందు' అని పిలిచిరి. గ్రీకులు 'ఇండోస్' అని పిలిచిరి. అర్వాచీన పారసీకులు సింధునది ప్రవహించిన వింధ్యహిమాచల మధ్యదేశమున కంతకును హిందుస్థాన మనుపేరు పెట్టిరి. అదియే, ఉరుదులో 'హిందూస్తాన్' అయినది. దేశవాచక మయిన యాహిందు శబ్దమే యాంగ్లేయుల వాడుకలో భరతఖండ మంతకును 'ఇండియా' అనుసంజ్ఞగా మాఱినది.

---

1. అదబ్ధా సింధు రపసాం - ౧౦-౭౫-౭.
సప్తసింధూన్. ౧-౩౨-౧౨; ౮-౨౪-౧, ఇత్యాది.

2. Arctic Home P. 289—296.

హిందూకుష్ పర్వతములోని హిందూశబ్దము కూడఁ బారసీకభాషలో మాఱిపోయిన సింధుశబ్దరూపాంతరమే యనుట తెల్లము. దీని నంతనుబట్టి బరిశీలించి నచో నార్యులు మొట్టమొదట భరతఖండము వాయవ్యభాగమందలి యొక పర్వతారణ్యముగుండా (హిందూకుష్) లోపలికి వచ్చినట్లును, తమ కచట ముందుగాఁ గనఁబడిననదిని వారు సింధు వని పిలిచినట్లును, అదియే యాపర్వత మునకును సింధుదేశమునకును, ఆర్యావర్తమునకును భరతఖండమునకును గూడ సంజ్ఞగా మాఱినట్లును బ్రాచీనచరిత్రవిషయ మొకటి గోచరింపకపోదు. అట్టి సింధునదిని ఋగ్వేదవర్ణితము లైన సప్తసింధువులను దక్కిననదులను గూర్చి వైదికర్షులవర్ణనము లెట్లున్నవో చూతము.

ప్రియమేధపుత్రుఁ డైనసింధుక్షిన్మహర్షి సింధునది నిట్లు స్తుతించు చున్నాఁడు[1].

“ఓజలములారా! మీమహిమను గొనియాడునట్టినేను యజమాన గృహమం దుండి యిట్లు పలుకుచున్నాను. మీరు భువియందు దేడునదులు గాను, అంతరిక్షమం దేడునదులుగాను దివియం దేడునదులు గాను, బ్రవహించు చున్నారు. ఇట్లు మూఁడు లోకములందు బ్రవహించు నేడేసినదులలోను సింధు నది మిక్కిలి యోజోవేగములు కలదియై తక్కినయెల్లనదుల నతిక్రమించి ప్రవహించుచున్నది.

“ఓసింధునదీ! వరుణుఁడు నీప్రయాణమున కనుకూలము లైనమార్గము లేర్పఱిచెను. నీవు ప్రాణులయన్నము నభిలక్షించి ప్రవహించుచున్నావు. మఱియు నోదేవీ! పర్వతములు భేదించుకొనివచ్చు నీవు మిక్కిలి దీర్ఘమార్గమునఁ బోవుచు భూమిమీఁది సమస్తప్రాణికోటికిఁ బ్రత్యక్ష మగుచున్నావు.”

సప్తసంఖ్యాకనదులు ముల్లోకములందు ప్రవహించుచున్న వనెడిమొదటి ఋక్కు భావము ననుసరించియే తిలకుగారు, సప్తసింధుసంజ్ఞ తొలుతనార్యులు ‘ఈథర్’ వలెనుండు దివ్యజలప్రవాహముల కిడి రనియు నదియే తరువాత నార్యావర్తమందలిసప్తప్రధాననదులకు సంభవించిన దనియు నభిప్రాయము విశదీకరించి యున్నారు. ఆసప్తనదులను సింధుక్షిన్మహర్షి యీక్రిందివిధముగాఁ బేర్కొని యుండెను.

గంగ యమున సరస్వతి శుతుద్రి మరుద్వృధ పరుష్ణి ఆర్జీకీయ యనునవి యేడును బ్రధాననదులు. వీనిలో మరుద్వృధ కసిక్నియు, ఆర్జీకీయకు వితస్తా సుషోమలు నుపనదులుగా నున్నవి[2].

1. ఋ. ౧౦-౭౫-౧, ౨.

2. ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా।
అసిక్న్యామరుద్వృధే వితస్తయార్జీకీయే శృణుహ్యాసుషోమయా॥ ౧౦-౭-౫-౫.

ఈపదినదుల నిట్లు పేర్కొని యీఋషియే సింధునదిలో సంగమించెడి యుపనదుల నిట్లు తెలిపియుండెను.

క్రుము గోమతి తృష్టామ సుసర్తు రస శ్వేత్య కుభ మేహత్ను, అనుసంజ్ఞలు కలనదులు సింధునదిలోఁ గలియుచున్నవి[1]. ఇక్కడికి మొత్తము పందొమ్మిది నదులు లెక్కకు వచ్చినవి. వీనిలో, పరుష్ణికి ఇరావతి యనియు, అర్జీకీయకు విపాట్, అనియు లోకవ్యవహార మున్నట్లు ఋజ్వర్థవ్యాఖ్య చెప్పుచున్నది. ఇరావతీసంజ్ఞ కలయీపరుష్ణి యీకాలమున రావీనది యనియు, మరుద్వృధ కుపనది యైనయసిక్నీ చంద్రభాగ యనియుఁ బిలువఁబడుచున్నవి. పై నుదాహరించిన నదులలో వితస్త అసిక్నీ పరుష్ణి విపాట్ (ఆర్జీకీయ) శుతుద్రి యనెడి యైదును బ్రవహించుదేశము పంచాపసంజ్ఞ చెందిన దనియు నదియే పారశీక భాషలో 'పంజాబ్' అని చెప్పఁబడుచున్న దనియుఁ దెలియవచ్చుచున్నది. ఈ యైదునదులును వేఱువేఱుగాఁ బ్రవహించి క్రమముగా నేకీభవించి తరువాత సింధునదిలో సంగమించుచున్నవి. అందుచే నివి దానియుపనదు లనఁ దగియున్నవి. ఈ యైదునదులను సింధుకుభానదులు రెంటినిబట్టి మొట్టమొదట సప్తసింధు సంజ్ఞ వెలసిన దనియు, తరువాతఁ గుభానదియే సరస్వతిగా వ్యవహరింపఁబడిన దనియు మేగ్డోనలుపండితుని తలంపు. సాయణాచార్యులవారు సప్తసింధు శబ్దము వచ్చినచోట్ల నెల్ల నింతకుఁ బూర్వ ముదాహరించిన గంగాయమునాది సప్తప్రధాననదులనే పరిగణించిరి కాని, అసిక్నీ వితస్తలను సింధుకుభానదులను గణించియుండ లేదు. ఋగ్వేదమున 'సప్తసింధవః' అనుశబ్దము పెక్కుచోట్లఁ బ్రయోగింపఁబడిన దనియు[2]. వృత్రవధచే విముక్తి గాంచిన గోవులు వెలుఁగు మొద లగువానివలెనే దివ్యజలప్రవాహములు విముక్తిగాంచినట్లుగా నాయా వర్ణనలవలనఁ దెలియవచ్చుచుండఁగాఁ జరిత్రకారులు కొందఱు పంజాబులోఁ బ్రవహించునైదు నదులకు మఱిరెండు సింధుశాఖలను జేర్చి సప్తసింధుశబ్దము నార్యావర్తనదీపరముగా సమన్వయించి రనియుఁ గాని యిది యెంతమాత్రము సరి గా దనియు, తిలకపండితులు వక్కాణించియున్నారు. మన కీచర్చ ప్రస్తుతము కాదు గాని యెట్లయినను సప్తసింధుశబ్దము ఋగ్వేదకాలమున నార్యా

---

1. తృష్టా మయా ప్రథమం యాతవే సజూః సుసర్త్వా రసయా శ్వేత్యా త్యా।
త్వం సింధో కుభయా గోమతీం క్రుముం మేహత్న్వా సరథం యాభి రీయసే॥

౧౦-౭౫-౬. ఇచ్చట సాయణాచార్యులు 'క్రుముం' అనుదానికి 'క్రమణశీలాం' అని యర్థము వ్రాసి దీనిని గోమతికి విశేషణము చేసియున్నారు. కాని చరిత్రకారు లనేకులు క్రుమునదిని వేఱుగా గణించియున్నారు.

2. ఋ. 4-28-1 ; 1-32-12 ; 1-102-2. ఇత్యాదులు.

వర్తమందలి సప్తనదులకును గొంతదేశమునకును సూచకముగా నున్న దనియుఁ దరువాత నదీవాచక మైనదనియు నంగీకరింపక తప్పదు.

ఇపుడు పంజా బనఁబడు పంచాపదేశములోని యైదునదులు జీలం-చెనాబ్ - రావి - బీయాస్ - శత్లుజ్ - అనునవి. వీని ఋగ్వేదీయ సంజ్ఞలు క్రమముగా వితస్త - అసిక్ని (చంద్రభాగ) పరుష్ణి (ఇరావతి) ఆర్జీకీయ (విపాట్) శుతుద్రి - అనునవి. వాజసనేయసంహితలో సరస్వతియే యైదువిధములుగాఁ బ్రవహించుచున్న దనియు, ఆయైదునదులును మరల సరస్వతీనదిలో సంగమించుచున్న వనియు నందుచే నాదేశము పంచనదమయిన దనియు వర్ణింపఁబడియున్నది[1]. దీనినిబట్టి పంజాబులోని యైదుపనదులకుఁ బ్రధానభూత మైన సింధునదియే సరస్వతి యను పవిత్రనామమునఁ గూడ వ్యవహరింపఁబడెడి దను కొందఱి వాదమునకుఁ గూడఁ గొంచె మవకాశము కలిగినది గాని, యమునా శుతుద్రీనదుల మధ్యప్రదేశమున సరస్వతి యను చిన్ననది యొకటి ప్రవహించుచున్నట్లు మఱికొన్ని ఋక్కులవలన సూచిత మగుటచేతను, ఇండ స్సనుపేర నిపుడు సింధునది సజీవ మగుటయు సరస్వతి యంతర్వాహిని యగుటయుఁ బ్రసిద్ధ మగుటచేతను ఋగ్వేదములోని సరస్వతీనదిగూడ సింధునదీ ప్రధాన శాఖలలో నొకటియై యుండు నని యూహించుట సముచిత మగుచున్నది.

వైదికార్యు లీపంచాపదేశమందును, సింధునది కావలిభాగమందు కుభానది ననుసరించి యుత్తరముగా సువాస్తునదీపర్యంతము దక్షిణముగా క్రుము గోమతీనదుల పర్యంతము గలప్రదేశమందును నివసించి యున్నట్లును ఋక్కులలోఁ జేర్కొనఁబడిన పైయెల్లనదులను బట్టి విదిత మగుచున్నది. ఈ కుభ కాబూ లనియు నీసువాస్తు స్వాటనియు నీక్రుము కురు మనియు నీగోమతి గోమా లనియు నిపుడు వాడఁబడుచున్నవి.

వైదికర్షులదృష్టిలో భీకర మగుమహాధ్వనితోఁ గూడిన జవాతిరేకమందు సింధునదివలెనే పావనత్వమునందు సరస్వతీనది పొగడ్త గాంచినది. తరువాతి కాలమునఁ గొందఱు గంగా యమునాతీరములఁగూడ నివసించి యున్నట్లుగా నానదుల నామములు ఋక్కులలోఁ గనవచ్చుటచేతఁ దెలియవచ్చుచున్నను, ఈ కాలమున వాని కున్నప్రఖ్యాతి యాకాలమున లే దని చెప్పవచ్చును. అందుకుఁ బ్రాచీనార్యులు తత్తీరముల నివసింపకపోవుటయే కారణ మగును. అందుచే ఋగ్వేదకాలమున మహత్త్వమునకు సింధునదియుఁ బవిత్రతకు సరస్వతియుఁ బ్రసిద్ధి కెక్కె ననుట స్పష్టము. పూర్వకాలమహర్షులు సరస్వతీ నదీతీరమందు యజ్ఞాదికర్మ లాచరించుచుండెడివా రనుటకుఁ 'ఋషయో వై సరస్వ

1. పంచనద్య స్సరస్వతీ మపి యన్తి సస్రోతసః ।
సరస్వతీ తు పంచధా సో దేశేఽ భవత్సరిత్. 34-2.

త్యాం నత్ర మానత ' యనెడినైతరేయవాక్యమే ప్రమాణము[1]. దీనివలెనే, ఆపయా దృషద్వతీ నదుల తీరభూములు గూడ మనుష్య సంచారయోగ్యములు యాగాచరణసమర్థములు నని భరతపుత్రు లైన దేవయాతదేవశ్రవసు లను మహర్షులు వర్ణించియున్నారు[2]. భరద్వాజమహర్షి, సరస్వతీనది పర్వతములను భేదించుకొని ప్రవహించుచున్న దనియు, దానిసాహాయ్యమున నింద్రుఁడు వృత్రాద్యసురులను వధించె ననియు, సస్యాద్యభివృద్ధికి హేతువై జనరక్షకముగా నున్న దనియు, అక్క చెల్లె ళ్లయినయేడునదుల కాశ్రయమై మహర్షిసేవిత మైన దనియు బహుభంగుల వర్ణించెను[3].

పర్వతములు:— వీని ప్రసక్తి ఋగ్వేదమున నందందు కనవచ్చును గాని ప్రత్యేకముగా వీనిని వర్ణించుసూక్తములు లేవు. హిమాలయములు ముంజ వంతము ఋజీకము మొదలగుకొన్నిగిరులు కొన్ని ఋక్కుల సూచితము లైనవి. కొండలు నదుల జన్మస్థానము లనియు మహౌషధులకు నిలయము లనియు వర్ణింపఁబడినది.

సింధు గంగాదినదులు హిమవద్గిరి భాగములనుండి ప్రవహించుచున్న ట్లుగా ఋజీకపర్వతమునుండి యార్జీకీయ జన్మించి ప్రవహించుచున్నట్లు తెలియ వచ్చుచున్నది. ముజవత్పుత్రుఁ డైన అక్షుఁ డనునొకఋషి, ముజవత్పర్వతము మీఁది సోమము మిక్కిలి యుత్తమ మైన దని వర్ణించియుండెను[4]. ఈ ముజవంత మునే మూజవంత మని ముంజవంత మని యాస్కుఁడు ద్వివిధముగా నిర్వచిం చెను. ఈ ముంజవంతము హిమాలయశిఖరములలో నొకటి యనియుఁ గాశ్మీర దేశమునకు వాయవ్యభాగమునందు కాబూలుదేశమునకు దగ్గఱగా నున్నశిఖర ములలో నొకటి యనియుఁ దెలియవచ్చుచున్నది. ఈ పర్వతముపేరే యీ ఋషి తండ్రి పేరుగాఁ గూడఁ గనవచ్చుటనుబట్టి దీని పరిసరమున వైదికార్యులు నివ సించి యుండి రనియు నిది వారి హృదయముల నాకర్షించినగిరి యనియుఁ దలంప వచ్చును. ఇట్లే వివిధలతాతరు వనమృగవిహాగలోహాదు లయ్యా ఋక్కుల వర్ణింపఁ బడియున్నవి. లోహములలో నినుమును బంగారమును వైదికర్షు లెక్కువగాఁ జూచినట్లును వానిని బహువిధముగా నుపయోగించినట్లును వానివివిధ వర్ణనల వలనఁ దెలియనగును. మఱియు వృక్షములలో నశ్వత్థము, లతలలో సోమలత, వనమృగములలో సింహము, పక్షులలో హంస, పెక్కుచోట్ల వర్ణింపఁబడినవి. అనఁగా వైదికర్షుల హృదయముల నాకర్షించినవానిలో నీపూర్వోక్తములు

1. ఐ. బ్రా. 2-19 ;
2. ఋ. 3-23-4 ;
3. ఋ. 6-61.
4. ఋ. 10-34-1.

ప్రధానము లని గ్రహింపఁ దగును గాని తక్కిన వానిని వారెఱుఁగ రని గ్రహింపరాదు.

సముద్రము:—వైదికార్యులు సముద్ర మెఱుఁగ రని కొందఱు విమర్శకులు చెప్పసాహసించిరి గాని యది పొరపాటు. సింధునదినే వారు గొప్పజలౌఘముగా భావించి రనుటయు సింధుశబ్దము నదీసామాన్యవాచకముగాను సింధునదీపరముగాను గూడఁ బెక్కుచోట్లఁ బ్రయోగింపఁబడుటయు సత్యమే కాని వారు సముద్రమునే చూడ లేదనుట సరికాదు. "సధ్రీచీః సింధు ముశతీ రివ" అనుఋక్కునందు[1]. కామయమాన లయినస్త్రీలు తమభర్తను వలెనే నదులు స్వపతి యగు సముద్రుని బొందుచున్న వని విస్పష్టముగా వర్ణింపఁబడియున్నది. ఇచ్చట సింధుశబ్దమునకు సముద్ర మనియే భాష్యకర్త లర్థమువ్రాసిరి. నదులు సముద్రమునఁ గలియుట సహజమే కదా! మఱియుఁ బర్వతములనుండి ప్రవహించుచున్న విపాట్ శుతుద్రీనదులు వాజిశాలనుండి విడువఁబడిన గుఱ్ఱముల వలెనే యతివేగమునఁ బరుగెత్తుచు సముద్రమును జేరుచున్న వనియు, 'ప్రయత్సింధవః ... సముద్రం రథ్యేవ జగ్ముః' నదులు కోరికతో సముద్రునిగూర్చి పోవుచున్న వనియు వర్ణింపఁబడెను[2]. మఱియు సమస్తజలాధిష్ఠానము సముద్ర మనియు దానికి వరుణుఁడు రాజనియు వసిష్ఠుఁడు వర్ణించెను[3]. ఇట్టి వానినిబట్టి సింధుసముద్రశబ్దములు సాగరపరముగాఁ గూడఁ బ్రయోగింపఁబడినట్లు విస్పష్టమగుచున్నది గావున వైదికర్షులు సరిత్పతి యగుసముద్రమును జక్కఁగా నెఱుఁగుదు రని విశ్వసించునది.

ఆర్యులవర్గములు-జాతులు:—సప్తసింధుదేశమందు, లేక యార్యావర్తమందు తొలుదొల్త నివసించినప్రాచీను లయిన యుత్తమజాతివారిని దెలిపెడి సామాన్యనామ మైన యార్యశబ్దమువలెనే వారి తెగలను బోధించెడి యదు - తుర్వశ - అను - ద్రుహ్యు - పూరు - శబ్దములును, ఈ యైదింటిని దెలిపెడి పంచజనశబ్దమును, ఆర్యవిశేషవాచకములుగా ఋక్కులలో నలుగడలఁ గనవచ్చుచున్నవి. ఇట్లే చతుర్వర్ణవాచకము లైన బ్రాహ్మణ రాజన్య వైశ్యశూద్ర శబ్దములును, పంచమ వర్ణ వాచక మగు నిషాదశబ్దమును, అనార్యవాచకము లైన అసుర - దస్యు - దాస - యాతుధాన - క్రవ్యాద - మూరదేవ - రక్షశ్శబ్దములును ఋక్సంహితలోఁ బ్రయోగింపఁబడి యున్నవి. పై వానిలో యదుతుర్వశాదిసంజ్ఞ లైదును యయాతి పుత్రుల నామములుగా మహాభారతాదు లైనయితిహాసాదులందు గనవచ్చుచున్నవి. యయాతిపేరు నతని

1. 10-112-10.
2. ఋ. 3-33-1; 3-36-6,7.
3. ఋ. 7-49-1,2,3,4.

తండ్రి యైన నహుషుని పేరుఁ గూడ ఋగ్వేదములో స్థలాంతరములఁ గనవచ్చు చున్నవి. ఇ దంతయు నెఱిఁగియు నితిహాసాదులలోని యదుతుర్వశాది సంజ్ఞలకును ఋగ్వేదములోని యీసంజ్ఞలకు నేకీభావము లేదని తలంచిరో లేక యదు తుర్వశాది నామము లార్యవర్గపరము లనెడి సంప్రదాయము తమనాఁడు లేమిం జేసి రో నిరుక్తకారులు యదుతుర్వశాది శబ్దములను బంచజన శబ్దమునుగూడ మనుష్యవాచకనామములలోఁ జేర్చిరి[1]. దానినిబట్టి వేదభాష్యకర్త లీశబ్దములు బహువచనాంతములుగాఁ గనఁబడినచోట్ల నెల్ల మనుష్యు లనెడియర్థమును, ఏక వచనములుగాఁ గనఁబడినచోట్ల యదుతుర్వశాదులు రాజర్షు లనెడియర్థమును వ్రాసిరి. మఱియు, పంచజనశబ్దమునకు నిరుక్తమునఁ గనవచ్చు "దేవ పితృ గంధర్వాసురరక్షస్సులు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర నిషాదులు, దేవ మనుష్య పితృ పశు పక్షులు[2]." అనెడి యర్థములలో నేదో యొకదానిని సంద ర్భోచితముగా వ్రాసిరి గాని యార్యవర్గము లనెడియర్థ మొక్కచోటను వ్రాయ లేదు. ఇది యిట్లుండ సంస్కృతవాఙ్మయ పరిశోధకులును బ్రాచీనచరిత్ర పరి శోధకులు నగు నాధునికప్రాచ్య పాశ్చాత్యపండితులు కొందఱు "ఆర్యావర్త నివాసు లైనపురాతనార్యులకాలమున జాతిభేదము లేదు.

బ్రాహ్మణో ఽస్య ముఖ మాసీ ద్బాహూ రాజన్యః కృతః ।

ఊరూ త దస్య య ద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥

అనెడి మంత్రము తోడి[3]. పురుషసూక్త మర్వాచీనఋషి దృష్టమై ఋగ్వేదమునఁ బ్రవేశించినది గాని యిది పూర్వమహర్షి దృష్టము గాదు, ఋగ్వేద మున నందందు బహువచనాంతములుగాఁ గనవచ్చు - యదవః - తుర్వశాః - అనవః - ద్రుహ్యవః - పూరవః - అనునవి సప్తసింధుదేశమున నందందు నివసించు నార్యవర్గములను బోధించుచున్నవనుట నిజము, పంచజనాదిశబ్దము లీ యైదువర్గములను దెల్పునవి గాని యన్యములు గావు[4]." అనుచు నిశ్చయించి యున్నారు. కావున నిం దేమతము గ్రాహ్య మని యిపుడు విచారణ చేయ వలసియున్నది.

---

1. అసురశబ్దము, బలవంతుఁడు తేజోవంతుఁ డనెడి యర్థముల నగ్నీంద్రాదులకుఁ గూడ విశేషణముగా వాఁడబడినది గాని యిది బహువచనాంతముగాఁ బెక్కుచోట్ల స్థానభ్రష్టులు చపలు లనెడియర్థముల రాక్షసపరముగానే ప్రయోగింపఁబడినది. చూ యాస్కనిరు. 188 పుట.

2. నిరు. 189 పుట.

3. ఋ. 10-90-12.

4. మేగ్డొనలు. San. Lit. P. 153; పార్గిటరు A. I. H. Jr. P. 87-88. అవినాశ చంద్రదాసు. R. V. I, Ch. VII.

భాష్యకారులు నిషాద పంచమ చతుర్వర్ణ పరముగాను విమర్శకులు పూర్వార్యవర్గపరముగాను సమన్వయించినపంచజనాది శబ్దము లన్ని మండలములలోను గలవు. అందు గొన్ని:—

"పంచక్షితీనాం - పంచకృష్టీః - పంచజన్యాసు కృష్టిషు - జనేషు పంచసు - పంచమానుషాన్ - పంచజనాన్ - పంచజనాః - పాంచజన్యయా విశా - ఇత్యాదులు. ఇందు కొన్ని రెండు మూఁడు సార్లు గూడఁ బ్రయోగింపఁ బడినవి. నిరుక్తకారులు మనుష్యనామములుగాఁ జేర్కొన్న ఋగ్వేదములోని శబ్దము లివి:—

| | | |
|---|---|---|
| మనుష్యాః | నహుషః | తస్థుషః |
| నరః | హరయః | వివస్వన్తః |
| ధవాః | మర్త్యాః | పృతనాః |
| జంతవః | మర్యాః | పంచజనాః |
| విశః | మర్తాః | తుర్వశాః |
| క్షితయః | వ్రాతాః | ద్రుహ్యవః |
| కృష్టయః | ఆయవః | యదవః |
| చర్షణ్యః | జగతః | అనవః |
| | | పూరవః |

ఈ యిరువదియైదు బహువచనాంతములు మనుష్యార్థమందే సమన్వయించుచున్నవి. పంచజనశబ్దము విశేషముగా నిషాదపంచమము లయిననాలుగు వర్ణములను జెప్పుచున్నది. మఱియు, క్షితి కృష్టి మొద లగుకొన్నిశబ్దములు పంచశబ్దముతోఁ గలసి పూర్వోక్తము లయినయైదువర్ణములను జెప్పుచున్నవి. కొన్నిచోట్ల నిట్టిపంచజ నాదిశబ్దములు మున్ను చెప్పినట్లుగా దేవగంధర్వాదులను జెప్పుచున్నవి. భాష్యకర్తలు నిర్ణయించినయీయర్థము లాయాఋక్కులయెడ ననుచితములుగా నున్న వని యెవరునుఁ జెప్పఁజాలరుగాని, మనుష్యవాచకముగాను మనుష్యసమూహవాచకముగాను గూడ జనశబ్దమే సరిపడుచుండఁగా నాయర్థమందే సంఖ్యావాచకమైనపంచశబ్దమును దానికిఁ జేర్చి మంత్రద్రష్టలు ప్రయోగించియుండ రనియు నట్లు ప్రయోగించుటలో నేదో యొకవిశేష ముండియుండవలె ననియుఁ జెప్పవచ్చును. నిషాదవర్ణముతోఁడి నాలుగువర్ణములను జెప్పుటయే యావిశేష మని తలంతు మేని వర్ణవాచకమైనపంచజనశబ్దమును నిరుక్తకారులు మనుష్యసామాన్యనామములలోఁ జేర్చుట యుచితము కాదేమో యని తోఁచకపోదు. మఱియు "త్వ మహో యదవే తుర్వశాయ" ఇత్యాదిస్థలము

1. ఋ. 1-7-9 ; 1-76-7 ; 6-46-7 ; 4-38-10 ; 3-53-16 ; 9-65-23 ; 8-9-2 ; 8-32-2 ; 9-92-3, 10-45-6 ; 8-63-7 ; 10-60-4. 10-53-5.

లందు[1]. యదు తుర్వశ శబ్దము లేకవచనములుగా నున్నపుడు 'యదునామకరాజు, తుర్వశనామకరాజు' అని భాష్యకర్త యర్థము వ్రాసి, యివియే 'యదవః-తుర్వశేషు[2].' అనురీతిని బహువచనాంతములుగా నున్నపుడు నిరుక్తమును బట్టి మనుష్యు లని యర్థము వ్రాసినను, ఆయర్థ మాస్థలముల సరిపడుచున్నను, ఆమనుష్యులు యదువునకు సంబంధించినవా రనియు, తుర్వశునకు సంబంధించినవా రనియు స్ఫురింపక పోదు, కావునఁ బై మనుష్యనామములలోని కడపటితుర్వశాది సంజ్ఞ లైదు నార్యవర్గవాచకము లనియు, పంచజనశబ్దము తద్వర్గపంచకవాచకమనియుఁ బరిశోధకులు తలంచుట సముచితమనియే తోఁచుచున్నది. కాని నిజముగా మంత్రకర్త లీశబ్దములను బ్రాచీనార్యవర్గపరములనుగానే ప్రయోగించియున్నచో వీనియర్థ మిట్లేల మాఱిపోవు ననెడి ప్రశ్న మిచట నుదయింపక పోదు. ఇందు కొక్కటే సమాధానము. వేదరచనోత్తరక్షణమునుండియు వేదము కర్త్రర్థ మనెడి దృఢవిశ్వాసను వైదికమతమున వేళ్లు నాటుకొనిపోవుటచే వేదగతచరిత్రసంప్రదాయము కొంత యడుగంటుటయే కొన్నిచరిత్రబోధకశబ్దముల యర్థము మాఱిపోవుటకుఁ గారణ మయ్యెను. అందుచేతనే మనుసహుష యయాత్యాదు లయినకొన్నిశబ్దములకు[3]. రాజర్షు లయిన మనునహుషాదు లనియర్థము వ్రాసినభాష్యకర్తలు:—

"పూరుః - పూరవః - అనవః[4]." ఇత్యాది శబ్దములు కొన్నిటి కాయా సందర్భములందు పూరునామకరాజు, అతనికిసంబంధించినవారు, అనునామకరాజునకు సంబంధించినవారు, అనెడియర్థములు సరిపడుచున్నను, మనుష్యుఁడు, మనుష్యు లనెడియర్థములను మాత్రమే వ్రాయుట తటస్థించినది. దానంజేసియే మంత్రకర్త లయినఋషులగాథల వలెనే మంత్రోదాహృతు లయినప్రాచీనవీరమహాపురుషులగాథలు నానోట నానోటఁ బడిపడి యతిమానుషములుగానో యమానుషములుగానో యద్భుతములుగానో మాఱిమాఱి యార్యవంశపరంపరలోఁ గర్ణాకర్ణికగా వచ్చివచ్చి తుద కితిహాసపురాణాదులం దేదో యొకరూపమున నిలచినవి. అవియే ప్రాచీనార్యచరిత్రమును బురాతనభరతవర్షచరిత్రమును బరిశోధించు పరిశోధకులకుఁ బ్రధానాధారము లైనవి. అందుచేతనే వేదములలోని పురుషసంజ్ఞలకును బురాణాదులలోని పురుషసంజ్ఞలకును ముడివెట్టుట తగ దని కొందఱును, అవియే యివి యని కొందఱును దలంపవలసి వచ్చినది. ఆయితిహాసాదులలోని కొన్నిరాజవంశక్రమము లొకదానితో నొకటి పోలక లోపభూయిష్ఠము లగుటచే నం దేది విశ్వాస్యమో యేది యవిశ్వాస్యమో

---

1. 5-31-8. 2. 8-4-19.
3. ఋ. 1-31-12, 17.
4. ఋ. 5-17-1; 1-59-6, 5-31-4.

నిర్ణయింప గత్యంతరము లేక చరిత్రకర్తలు యథేష్టమార్గములు త్రొక్కవలసి వచ్చినది. సత్యవిషయ మిట్లు నిగూఢమై యవ్యవస్థముగా నున్నను మన మిపుడు ఋగ్వేదములోని యదుతుర్వశాదిసంజ్ఞలు ప్రాచీనార్య కుటుంబవాచకము లని యంగీకరింపక తప్పదు. ఇట్లంగీకరించినను మనము వెనుకఁ దెలిసికొన్న వేద కాలమునకు మాత్రము భంగము వాటిల్ల దనుట నిజము. ఇఁక నీవిషయ మిట్లుంచి ప్రకృత మనుసరింతము.

వేదములోని పంచజనశబ్దమును సార్థకము గావించుటకై, అను-ద్రుహ్యు-తుర్వశ - యదు - పూరువులను గొందఱు గణించి రని యింతకు మున్నే చదివి యున్నాము. మఱికొంద ఱిందలి యదు పూరువులకు బదులుగా తృత్సుభరతు లను గణించిరి[1]. కాని వసిష్ఠుఁడు పురోహితుఁడు గాఁ గలతృత్సువంశరాజులే భరతులుఁగా వ్యవహరింపఁబడెడివా రని సాయణాచార్య లొకచో వ్రాసియు న్నారు[2]. మఱియొకచో విశ్వామిత్రుఁడు "ఓనదులారా! మదీయు లైన భర తులు మిమ్ము దాఁటి పోఁగలరు"[3]. అని చెప్పినవాక్యమున భరతులు గనవచ్చు చున్నారు. ఈరెండువిధము లైనభరతు లొకరో వేఱో, ఇది యొకసందిగ్ధవిష యము. ఇది యిట్లుండఁగా, సౌదాసులు క్షత్రియులు నైనభోజులు - కుశిక గోత్రజు లైనకుశికులును[4]. మత్స్యులును మొద లగుమఱి కొన్నిసంఘములును, మహర్షులనామములతో వసిష్ఠులు - అంగిరస్సులు - భృగువులు - కణ్వులు విశ్వామిత్రులు - జమదగ్నులు - అథర్వులు - మొదలగు సంఘములును గూడఁ గనవచ్చుచున్నవి. ఇం దేవర్గములు పంచజనశబ్దముచేఁ జెప్పఁదగిన వనుట మఱి యొకసందిగ్ధవిషయము. అయినను నిజముగాఁ బంచజనశబ్ద మార్యవర్గవాచక ముగా నెదుటఁ గనఁబడుచున్నది గావున నితరవర్గము లెన్ని యున్నను బ్రధా నము లైనయైదువర్గము లివి యని వాని నొక్కచోఁ జేర్చి చెప్పుచున్నయీక్రింది ఋక్కును బట్టి తెలియవచ్చును.

య దింద్రాగ్నీ యదుషు తుర్వశేషు యద్ద్రుహ్యుష్వనుషుపూరుషుస్థః ।[5]

దీనినిబట్టి యదువులు తుర్వశులు ద్రుహ్యులు అనువులు పూరువులు, అనునవి నైదును బంచజనశబ్దముచేఁ జెప్పఁదగిన వై దార్యవర్గము లనుట విది తము. ఇది సత్య మనితోఁచుచున్నను సాయణాచార్యులవా రీఋక్కునకు భాష్యము వ్రాయుచు:—

1. R. V. I. 118 పుట.
2. ఋ. 7-33-6.
3. ఋ. 3-33-11, 12.
4. ఋ. క్రమముగా - 3-53-7, 9; 10, 11.
5. ఋ, 1-108-8.

“యదుషు - అహింసకేషు మనుష్యేషు, తుర్వశేషు = హింసకేషు మనుష్యేషు, ద్రుహ్యుషు = ఉపద్రవ మిచ్ఛత్సు మనుష్యేషు, అనుషు = జ్ఞాతృష్వనుష్ఠాతృషు మనుష్యేషు, పూరుషు = కామైః పూరయితవ్యే ష్వన్యేషు స్తోతృజనేషు”.

అని యర్థము వ్రాయుటకు నిరుక్తసంప్రదాయమే కారణ మనుట స్పష్టము. అయినను, ఈవర్గముల మనుష్యు లిట్టిస్వభావములు కలవా రని తెలిసికొనుట కీయర్థములు తోడ్పడుచున్న వని తలంపవచ్చును. కాని ఋగ్వేదములోని రాజవంశములు సక్రమముగా నితిహాసాదులకు లభింపలే దనియు, ఋగ్వేదమునందే ప్రధానార్యవర్గములతోఁ బాటుగా నప్రధానార్యవర్గములు గూడ ననేకములు గనవచ్చుటంజేసి యిం దేవేవి యాప్రధాన వర్గములచీలికలో గ్రహింప నవకాశము తక్కువగా నున్న దనియు, ఋగ్వేదమునఁ గనవచ్చుయదు తుర్వశాదివంశము లవిచ్ఛిన్నములుగాఁ బురాణాదులకు లభింపమిచే నిందు లభించిన వంశక్రమములను బట్టియే వేదములోని వంశములను సరిపుచ్చి వేదకాల నిర్ణయము చేయుట సముచితము గా దనియుఁ గొందఱు తలంచుట మాత్రము యుక్తమని చెప్పవచ్చును. ఇందు కొక దృష్టాంతము.

“సుదాసుఁ డనురాజుచే వసిష్ఠపుత్త్రులు యజ్ఞము చేయించుచున్నారు. ఆసమయముననే మఱియొకచోటఁ బాశద్యుమ్నుఁ డనురాజు యాగము చేయుచుండెను. ఇంద్రుఁ డాజన్మమున నుండి సోమపానము చేయుచుండఁగా వసిష్ఠపుత్త్రులు మంత్రబలముచే నతనిని సుదాసునియజ్ఞమునకు రప్పించిరి. సుదాసునికిఁ బదిమందిరాజులతో యుద్ధము సంభవించినది. అపుడు వసిష్ఠులస్తుతి కానందించి యింద్రుఁడు సుదాసుని రక్షించెను.” ఇత్యాదిగా ఋగ్వేదమునఁ గొన్ని వర్ణనలు గలవు[1]. ఇందు పేర్కొనఁబడినసుదాసుఁ డేరాజవంశమునకుఁ జేరినవాఁడో యెప్పటివాఁడో యెక్కడఁ బదిమంది రాజులతోఁ బోరాడెనో యారాజు లెవరో తెలిసికొనుటకు ఋగ్వేదమున సరియగు నాధారములు గనరావు. అయినను ‘ఆర్యులు తొలుతఁ బంజాబు నాక్రమించునపు డచ్చటివారితో సుదాసునికిఁ బోరు సంభవించె’ నని కొందఱును, ‘ఆర్యావర్తమున నార్యులు స్థిరపడినతరువాతఁ జాలాకాలమున కుత్తరపాంచాలమునకు రా జయినసుదాసునికిఁ గొందఱార్యులతోను, అనార్యులతోను బోరాటము తటస్థించె నని మఱికొందఱు నూహించుచున్నారు[2]. నిరాధారము లయినయిట్టి యూహలే ఋగ్వేదములోని రాజవంశములు దురవగాహములుగా నున్న వనియు వానికిని బురాణాదులలోని వానికిని సంబంధ మత్యంత దురవగాహముగానున్న దనియుఁ జెప్పుచున్నవనుట

1. ఋ. 7-33-2, 3,

2. పార్గిటెరు A. I. H. Jr. P. 2

స్పష్టము కదా! దీనినిబట్టి యదుతుర్వశాదిశబ్దము లార్యవర్గబోధకము లన్నమాట సత్యమైనను, దానివలన మనకుఁ దెలియవచ్చెడి చరిత్రవిషయము మాత్రము సందిగ్ధమే కాని స్పష్టముకాదు 'సంస్కృత వాఙ్మయమందు సరియైన చరిత్రవిషయములు పూర్తిగా మఱుఁగుపడి యున్న'వని యిట్టి యభిప్రాయమునే మాక్డొనెలు పండితుఁడు మఱియొక సందర్భమున నావిష్కరించి యుండెను[1]. ఇఁక దీని నిట్లుంచి, ఆర్యులకు శత్రువులుగా వర్ణింపఁబడిన యనార్యులనుగూర్చి యించుక ప్రసంగింతము.

అనార్యులు:—పుణ్యకర్మహీనులును యజ్ఞాదిక్రియ లాచరించునార్యులకు బాధ కలిగించువారును దొంగలును మారణకర్మశీలురు నగుమనుష్యులు కొందఱు గుంపులుగుంపులుగా నార్యావర్తమున నందందు నివసించి యార్యులకుఁ బీడ గలిగించు చుండినట్లును వారి నింద్రుఁడు పరిమార్చుచుండినట్లును ఋగ్వేదము నలుఁగడలఁ గొన్నివర్ణనలు గనవచ్చుచున్నవి. అట్టివారినే చరిత్రకారు లనార్యులని వ్యవహరించుచున్నారు.

అట్టి క్రూరకర్ములను దెల్పుశబ్దములు. అసుర - దాస - దస్యు - యాతుధాన - క్రవ్యాద - మూరదేవ - రక్షస్సు లను నవి. ఇందు దాసాదిశబ్దములకు నాశకుఁడు చోరుఁడు మాంసభక్షకుఁడు మారకుఁడు మొద లగువ్యుత్పత్త్యర్థములు వ్రాయుచు వీని కన్నిటికి నసురు లనెడిముఖ్యార్థమునే భాష్యకర్తలు తెలిపియున్నారు. వై శబ్దములచేఁ జెప్పఁబడు నీమోటజాతి వారార్యులు సప్తసింధుదేశమునకు రాకమున్నే యందుండి రనియు నార్యు లందు ప్రవేశించి వారిని జయించి వశపఱుచుకొనియుఁ దఱిమి వైచియు నణఁగించియు, వారిని దాసులు లేక దస్యులనుపేరఁ బిలుచుచుండి రనియు వారే తరువాత నార్యులకు వ్యతిరిక్తధర్మములు కలవా రగుటచే ననార్యు లని వ్యవహరింపఁబడుచువచ్చి రనియుఁ గొందఱి యభిప్రాయము[2]. దాసులు లేక దస్యు లనఁబడువా రార్యులకంటె నితరులు గా రనియు, నార్యులలోనే యజ్ఞాదికర్మ లాచరింపక వైదికనిష్ఠకు వ్యతిరేకముగా నుండువా రార్యజాతినుండి బహిష్కృతులై క్రూరకర్మపరతంత్రులై దస్యుదాసాదిసంజ్ఞల వ్యవహరింపఁబడుచుండెడివా రనియు మఱికొందఱి యభిప్రాయము[3]. ఈ దాసదస్యు లార్యులకంటె నితరు లైనక్రూరు లన్నను వారి లోనివారే యై దుశ్చరితమున వేఱుపడినక్రూరు లన్నను ఋక్సంహితానిర్మాణకాలమునందే వీ రార్యులకుఁ బ్రబలశత్రువులు గా నుండి రనువిషయమునఁ బై యభిప్రాయములు రెండు నేకీభవింపక తప్పదు గావున నార్యు లార్యావర్త

1. Sans. Lit. P. 10.
2. Sans. Lit. P. 152.
3. R. V. I. Ch. VII.

మునకు వలసవచ్చినవారు గాక మొదటినుండియు నందున్నవారే యనెడియార్యావర్తవాదమును సమర్థించుట కుద్దేశింపఁబడిన రెండవయభిప్రాయ మింతకుఁ బూర్వమే గతార్థ మగుటచే దానింగూర్చి చర్చించుట యనావశ్యకము. ఆర్యులు సప్తసింధుదేశము చొచ్చునప్పటి కందాదిమనివాసులు కొంద ఱుండి రనుటయు వారితోఁ బోరాడి యార్యులు జయము గాంచి రనుటయు విశ్వసనీయములు లగును[1]. ఇఁక నార్యులవిజయములకుఁ గొన్నియుదాహరణములు.

గృత్సమదమహర్షి యిట్లు పలుకుచున్నాఁడు.

"అనాత్మజ్ఞులును దుష్టకర్ములు నగుబహుశత్రువుల నేదస్యుహంత యణఁగించెనో యతఁడే యింద్రుఁడు. దురితాత్ముఁ డయ్యుఁ దనపరాక్రమము నకు జడిసి పాఱిపోయి పర్వతగుహలలోఁ దాఁగియున్నమాయావి యగుశంబరాసురుని నలువది సంవత్సరములకు వెదకి పట్టుకొని యేమహాశూరుఁడు పరిమార్చెనో యతఁ డింద్రుఁడు[2].

వామదేవమహర్షి యిట్లు చెప్పుచున్నాఁడు.

"ఇంద్రా! కులితరాసురునిపుత్రుఁడును దాసుఁడు నగుశంబరాసురుని బర్వతముమీఁదఁ బట్టుకొని తలక్రిందుగాఁ బడఁగొట్టి చంపితివికదా! మఱియు దాసుఁడును వర్చినామకుఁడు నైనయసురునికి సంబంధించిన పదియేనువందలమంది హింసకులను హింసించితివి.—ఇంద్రుఁడు ఱాతికట్టడములతోఁ గూడిన శంబరాసురుని నూఱుపురములను దివోదాసుఁ డనుయజమానునకు వశపఱిచెను. మఱియు లోకాపకారు లైనముప్పది వేలమందిదాసజాతివారిని దభీతినామకార్యునికొఱకై వధించెను"[3].

ఆత్రేయుఁ డైనబభ్రుమహర్షి యింద్రునివిజయ మిట్లు పొగడుచున్నాఁడు.

"ఓయింద్రా! నీజన్మశత్రువైన వృత్రుని వానియనుచరు లగునసురలను హింసించి యీయుద్ధమందే దాసుఁ డయిన నముచిరాక్షసునితల చూర్ణము చేసితివి. ఈనముచి యింద్రునితోఁ బోరాడుటకు స్త్రీసేనలను సిద్ధపఱిచెను. అపు డింద్రుఁడు నముచికి మిక్కిలి ప్రియురాం డ్రగు నిద్దఱిని ముందుగా నొకయింటిలోఁ దాఁచి పిదపఁ బోరిలో నముచిని సంహరించెను[4]."

---

1. ఋ. 1-100-18,—1-103-3, 8,—1-133-2, 3.

2. ఋ. 2.12-10, 11.

3. ఋ. 4-30-14, 15, 20, 21.

4. ఋ. 5-30-7, 9.

 

వామదేవమహర్షి యిట్లనుచున్నాఁడు.

"ఓయింద్రా! నీవు పిప్రునామకుఁడును మృగయనామకుఁడు నైన యసురులనుగొట్టి, ఋజిశ్వరాజునకు వశపఱిచితివి. ఏఁబదివేలమంది నల్లని రాక్షసులను జంపితివి. శంబరాసురుని పురములు పగులఁగొట్టితివి[1]."

భారద్వాజుఁ డైనపాయుమహర్షి లోకహింసకు లయినరాక్షసులను నశింపఁజేయు మని యగ్నిదేవుని బ్రార్థించుచు నొకసూక్తము నిర్మించెను[2]. అం దొకఋక్కున నిజముగా నట్టివానిని జూచి చెప్పెనో లేక వాని దుశ్చేష్టలకుఁ దగినట్లు వానిరూపము గల్పించి చెప్పెనో చెప్పఁజాలము గాని 'మనుష్యులలో మిక్కిలి బాధకుఁడు గా నున్న యీరాక్షసుని జూచి వానిమూఁడుశిరస్సులను నఱకివేయు' మని యగ్నిని గోరెను. మఱియు రాక్షసులు ఘోరాకారులై తమస్త్రీలను వెంటఁబెట్టుకొని సంచరించు చుందు రనియు వర్ణించెను. ఇట్టివర్ణనలు చూడఁగా నార్యేతర జాతులవారు కొందఱు ఋగ్వేదకాలమున నార్యులకుఁ బ్రతిపక్షులుగా నుండి రని తోఁచకపోదు, అయినను, "అసుర దాస దస్యు శబ్దవాచ్యులు తొలుత నార్యజాతిలోనివారే కాని యన్యులుకారు. కర్మహీనులు దేవతారాధనదూరులు నగు నందలి కొందఱు జాతిబహిష్కృతులై నీచక్రూరజాతులుగాఁ బరిగణింపఁబడుచువచ్చిరి" అనెడి వాదమున కాధారము లయిన కొన్నిఋక్కులభావము గూడఁ బరిశీలింతము.

"ఓయింద్రా! ఆర్యు లెవరో దస్యు లెవరో తెలిసికొని కర్మవిరోధు లైన యీదస్యులను వధింపుము. లేక యజమానునికి వశపఱుపుము. దుష్టశిక్షకుఁడ వైననీవు యజ్ఞఘాతుకుల నణఁచి యజమానులచే యాగములను జక్కఁగాఁ జేయింపుము[3]."

"ఆర్యుఁ డెవఁడో దాసుఁ డెవఁడో తెలిసికొని వారిని వేఱుచేయుచు నేను యజ్ఞమును గూర్చి వచ్చి యజమానుని సోమమును ద్రాగుచున్నాను" అని యింద్రుఁ డనును[4].

ఇత్యాదిస్థలములలోని దాస దస్యుశబ్దము లార్యులలోని యపవ్రతులను వేఱుపఱుచుచు, "దాసు లైన యదుతుర్వశరాజులు సావర్ణిమనువునకుఁ బశువు లిచ్చిరి[5]." ఇత్యాదిస్థలములలోనున్న దాసశబ్దమును బోలుచున్నవి గాని వేఱు కాదు. అది గాక, యెవరు హవిస్సుల నింద్రాదుల నుద్దేశించి యగ్నిహోత్ర

1. ఋ. 4-16-13.
2. ఋ. 10-87.
3. ఋ. 1-51-8.
4. ఋ. 10-86-19.
5. ఋ. 10-62-10.

ములో హోమము చేయక తమనోళ్లలోనే యాహావిస్సులను బడవైచికొను చున్నారో వారసురు లనెడిభావము ఋగ్బ్రాహ్మణాదులవలనఁ దెలియవచ్చు చున్నది[1].

మఱియు, దివోదాస త్రసదస్యునామకు లయిన యార్యులనామములలోను దాసదస్యు శబ్దములు గనవచ్చుచున్నవి. కావున దాసాదిశబ్దము లార్యేతరబోధక ములు గావు. కర్మదూరులైనయార్యులే యట్లు పిలువఁబడుచువచ్చి రని యీ వాదము వారితలంపు[2].

అనిష్టపరిహర్త తేజశ్శాలి బలశాలి యిత్యాద్యర్థములం దసురశబ్దము దేవ విశేషణముగాఁ బెక్కుస్థలములఁ బ్రయోగింపఁ బడినమాట నిజము[3]. ప్రేష్యుఁడు లేక యుపచారకర్త యనెడి యర్థమందు దాసశబ్దము రాజవిశేషణ ముగాఁ బ్రయోగింపఁబడినమాటయు నిజము. ఆర్యులలోని వారగు పారసీకులు యజ్ఞదూరులై యసురు లని పిలువఁబడుచు వచ్చినమాటయు సత్యము. కాని యింతమాత్రమున నార్యులు రాకమున్ను సప్తసింధుదేశమం దనార్యజాతి యొకటి లే దని చెప్పుటకు వీలు కనఁబడదు. ఇట్లనుటచే నార్యులలోనివారు కొందఱు దురాచారులై యార్యులచేఁ బరిత్యక్తులై వేఱుపడ లే దని కాని, యట్టివారి సంతతివారు పూర్తిగా నార్యధర్మములను మఱచిపోయి మూఢజాతి వారుగాను నీచులుగాను మాఱిపోలే దని కాని చెప్పుట గాదు. వేదములకాలము నుండి యట్టివారును వేఱుగా వచ్చుచునేయున్నారు. ఋగ్వేదమునందు నట్టి యనార్యులసూచనలు గలవు.

“యయాతి యిచ్చినశాపమున నభిషేకదూరులై నవయుచున్నయదు తుర్వశు లనురాజుల వృత్తాంత మంతయుఁజక్కఁగాఁ దెలిసికొని యింద్రుఁడు వారిని మరల నభిషేకార్హులనుగా నొనర్చెను.” ఆర్యుల మని చెప్పుకొనుచు యాగదేవపూజా రహితులై సరయూనదీతీరమున వసించియున్న యర్ణ చిత్ర రథు లనురాజుల నింద్రుఁడు సంహరించెను[4].”

“ఇంద్రా! ఎవరు నీభక్తుల మైనమాకంటె వేఱై నిన్నుఁ బూజింపక కర్మరహితు లయిరో వారు నీవారు కారు. యాగాదు లొనర్చునట్టి ఋత్విగ్యజ మానులమైన మేమే నీవారము[5].”

---

1. ఋ. 1-51-5, 9, కౌషీతకివాజసనేయ బ్రాహ్మణములును.
2. R. V. I. Ch. VII. P. 127-136.
3. ఋ. 1-54-3, 1.24-14, 1.35-10.
4. ఋ. 4-30.17-18.
5. ఋ. 5-33-3, 5.

"ఇంద్రుని జూచినవాఁ డెవఁ డున్నాఁడు? ఒక్కఁడును లేఁడు. కనుక మన మెవని నే మని స్తుతింతుము? ఇంద్రుఁ డున్నాఁ డనుట వాదమాత్రమే కాని సత్యము కాదు[1]."

ఇత్యాది వర్ణనలనుబట్టియు, నందందు ప్రయోగింపఁబడిన - అయజ్వ - అవ్రత - అబ్రహ్మ - ఇత్యాది విశేషణములనుబట్టియు నార్యులనుండి వేఱుపడి యనార్యత్వము చెందినవారు కొంద ఱాకాలమున నుండి రనుట విస్పష్టము. విశ్వామిత్రశప్తు లయినయతనిపుత్రు లంధ్ర పుండ్ర శబర పులింద మూతిబ సంజ్ఞల నీచజాతివిశేషు లై రనియు వారిసంతతివారు దస్యులలో (దొంగలలో) నధికు లై రనియు నైతరేయబ్రాహ్మణమునఁ గనవచ్చువర్ణనముగూడఁ గొంద ఱార్య జాతివారు శాపదురాచారసత్కర్మ పరిత్యాగాదికారణముల నీచజాతులవారుగా మాఱిపోయినట్లు తెలుపుచున్నది. అట్టివారు దస్యుజాతివారికంటె వేఱై తరువాత వారిలో నంతర్భూతు లైరనుటకు "ఉదన్త్య బహవో వైశ్వామిత్రా దస్యూనాం భూయిష్ఠాః" అనువాక్యమే ప్రమాణ మగుచున్నది[2]. అది గాక, అసురదాసాదిశబ్దములు కొన్ని యర్థాంతరముల నార్యవిశేషణములుగాఁ గనవచ్చుచున్నను, ఎవరు బ్రహ్మద్వేషులు ఘోరచక్షుష్కులు పరుషభాషులు కృష్ణత్వక్కులు నరమాంసభక్షకులు మృధ్రవచస్కులు ఘోరరూపులు త్రిశిరస్కులు మొద లగువిశేషణముల నిరూపింపఁబడిరో యట్టిదుష్టులసంఘ మొకటి యార్యులకంటె వేఱై సప్తసింధుదేశమున ముందుగానే యున్నట్లుగా నాయావర్ణనలవల్ల విదిత మగుచుండ దీని కింత చింత యేల? అయినను దీనిని బలపఱుప నింకొకటి రెండుమాటలు చెప్పి యీప్రసంగము చాలింతము.

"కుయవుఁ డనుపేరు గలయసురుఁడు పరులధన మపహరించుకొని పోయి యితరులకు దురవగాహ మయినట్టిశిఫానదిలోని లోఁతుగుంటలో సకుటుంబముగా వసించుచున్నాఁడు. ఇంద్రా! వానినివధింపుము" మహాశూరుఁ డైన యాకుయవాసురుని, అంజసి కులిసి వీరపత్ని యనునదులు రక్షించుచున్నవి"[3].

ఇంద్రా! అనార్యనివాసము లై కీకటము లనెడిజనపదములం దున్నగోవులు నీ కేమి చేయుచున్నవి? సోమములోఁ బోసికొనుటకుఁ బా లిచ్చుచున్నవా? కర్మోపయుక్త మయినపాత్రమును దమపాలచే నలంకరించుచున్నవా? ఏమీ లేదు. ఆగోవులను దెచ్చి మా కిమ్ము. మఱియు కుసీదవృత్తిచే ధనము పెంచుచున్న మగందునిపుత్రుఁ డగుప్రమగందునివద్ద నున్నధనము తెచ్చి మా

1. ఋ. 8-100-3.
2. ఐ. బ్రా: అ. 33 ఖ 6.
3. ఋ. 1-104-3, 4.

కిమ్ము. ఇంకను నైచాశాఖ (నీచజాతివారి) సంబంధమైనధనము తెచ్చి మా కిమ్ము"[1].

"కృష్ణుఁడు (నల్లనివాఁడు) అనుపేరు గలయసురుఁడు పదివేలమందియను చరులతోఁ గూడి యంశుమతీ నదీ తీరమందు వసించియుండెను, ద్రుతగతియుఁ గ్రూరకర్ముఁడు నగువాని నింద్రుఁడు బృహస్పతి సహాయుఁడై పరిమార్చెను."[2].

ఇత్యాదివర్ణనలవల్ల ఋగ్వేదకాలమందనార్యజాతియొకటి యుండెనని స్పష్టముగాఁ దెలియవచ్చుటయే కాక, గంగానదికిఁ దూర్పుభాగమున నుండు కీకట మనెడియనార్యదేశ మానాఁటియార్యు లాక్రమించినది కాదని కూడ విదిత మగుచున్నది. మఱియు నార్యులు క్రొత్తగా సప్తసింధుదేశమునఁ బ్రవేశించునపుడో లేక యిందే యొకచోటినుండి మఱియొకచోటికిఁ బ్రయాణము చేయునపుడో, దారి కడ్డముగా వచ్చి తమధన మపహరించువారును దారి తప్పించి పెడదారికిఁ ద్రిప్ప యత్నించువారును బందిపోటు దొంగలును బాపాత్ములు నగుశత్రువులబారినుండి రక్షింపు మని పూషదేవుని బ్రార్థించుటయే[3]. యనార్యజాతి యొకటి యంతకు మున్నే యున్న దనుటకుఁ జాలును. ఆజాతివారు నల్లనివా రని కృష్ణవిశేషణమువల్లఁ దెలియుచున్నది. వారు దాస దస్యు లనక కొందఱు తలంచినట్లుగా నార్యులలో దురాచారభూయిష్ఠులై వేఱుపడిన దాసదస్యు లన్నచో నిది మఱియొక యనార్యజాతి యగు ననుట కాటంకము కలుగదు. కావున నిఁక వర్ణములనుగూర్చి కొంత పరిశీలింతము.

వర్ణములు:—దశమ మండలములో బ్రాహ్మణ రాజన్య వైశ్యశూద్ర శబ్దములు నాలుగు చతుర్వర్ణవాచకములుగా నొక్క ఋక్కున మాత్రము ప్రయోగింపఁబడి యున్నవి[4]. అందే బ్రహ్మశబ్దము మఱికొన్ని ఋక్కులలో బ్రాహ్మణవర్ణబోధకముగాఁ గనవచ్చుచున్నది[5]. తక్కిన మండలములలో సర్వత్ర యిది ఋత్విఙ్మంత్ర కర్మపరముగానే యున్న దని చెప్పనచ్చును. అట్లే రాజ శబ్దము గూడ నితరమండలములలో సంఘపాలకుఁడు ప్రభువు కులనాయకుఁడ నెడియర్థములను దెలుపుచున్నది గాని క్షత్రియవర్ణవాచకముగాఁ గనఁబడదు.

---

1. ఋ. 3-53-14. కీకటానామ, అనార్యనివాసో జనపదః. నిరుక్తము-పిబత ఖాద తాయ మేవ లోకో నపర ఇతి వదంతో నాస్తికాః కీకటాః - సాయణభా—(తేషాం నివాసో జనపదః కీకటాః).

2. ఋ. 8-96-13, 14.

3. ఋ. 1-42-1, 2, 3.

4. ఋ. 10.90-12,

5. ఋ. 10-85-3, 16, 29, 34, 35.

వైశ్యశూద్రశబ్దము లాయొకచోటఁ దప్ప మఱెక్కడను ఋగ్వేదములోఁ గనరా కున్నవి. కావున బ్రాహ్మణక్షత్రియాది చతుర్వర్ణవ్యవస్థ ఋగ్వేదకాలము కడపట నేర్పడినది గాని మొదటినుండియు నున్నది కాదని చరిత్రకారు లూహించుట యుచిత మనియే తోఁచుచున్నది. అందుచే వర్ణము లేర్పడినపిదప బయలుదేఱిన నిరుక్తము, ఋగ్వేదములో సర్వత్ర గనవచ్చుపంచజన పంచక్షితి శబ్దములకు నిషాదపంచమము లైనచతుర్వర్ణము లనునర్థమును నిరూపించుటనుబట్టి భాష్య కారు లాశబ్దముల కట్లర్థము వ్రాసినను దానినిబట్టి వైదికార్యులలో మొదటి నుండియు వర్ణభేద మున్న దని తలంపరాదు గాని ప్రథమమండలాదుల నితరా ర్థములందు ప్రయుక్తను లైన బ్రహ్మరాజశబ్దములే దశమమండలమునఁ గ్రమ ముగా బ్రాహ్మణక్షత్రియవాచకము లైనట్లు మాత్రము విశ్వసింపవచ్చును. మఱియు వృత్తిప్రవర్తనాదులనుబట్టి వర్ణభేదసూచకమైన యుత్తమ మధ్యమాధ మవివక్ష యించుక నడుమ వచ్చియుండు నని చెప్పవచ్చును గాని విద్యావివేకాదు లున్నచోట నదియును గణనీయముగా లే దన వచ్చును. ఇందుకుఁ జిన్నయుదా హరణములు రెండు.

ఆర్షసంప్రదాయమున బ్రహ్మర్షి యని ప్రసిద్ధి కెక్కినవాఁడు దీర్ఘత ముఁడు. ఇతఁడు రచియించిన పెక్కుసూక్తములలో నితనివృత్తాంతము సూచి తమైయున్నది.[1]. ఇతఁ డంగరాజమహిషికడ దాసిగా నున్న 'ఉశిక్క' అనుదాని యందు కక్షీవంతుఁ డనుసుతుని గనెను. ఈబాలుఁడు బీజమునుబట్టి దైర్ఘత మసుఁ డాంగిరసుఁడు నయ్యెను. క్షేత్రమునుబట్టి యాశిజుఁడు దాసుఁడు నయ్యెను. అయినను రూపసంపన్నుఁడు విద్యాపూర్ణుఁ డయినయితనికి భావయవ్యపుత్రుఁ డైన స్వనయుఁ డనురాజు తన తనయల నిచ్చి పెండ్లిగావించెను[2]. సూక్తద్రష్ట లయినమహర్షులలో నొకఁడై విఖ్యాతి గన్నయితఁడు రచియించిన సూక్తములు ప్రథమ నవమ మండలములలోఁ గలవు[3].

కవషుఁ డనుఋషి దర్శించిననాలుగు సూక్తములు ఋగ్వేదదశమమండల మున నున్నవి[4]. అందు మొదటిసూక్త మపోనప్త్రీయ మనుప్రసిద్ధి వహించినది. ఈ ఋషిమహత్త్వమును సూచించెడి యీ సూక్తమునుబట్టియు నార్షసంప్రదా యమునుబట్టియు నైతరేయకౌషీతకిబ్రాహ్మణములు రెండును గూడ నితనివృత్తాం తము నిట్లు వర్ణించియున్నవి.

ఋషు లందఱు కలిసి సరస్వతీనదీతీరమున సత్రయాగము చేయుచుండ నిలూషపుత్రుఁ డైనకవషుఁడు వచ్చి వారినడుమఁ గూర్చుండెను. వా రతనిని జూచి "నీవు దాసీపుత్రుఁడవు కితవుఁడవు. అబ్రాహ్మణుఁడవు. మానడుమఁ గూర్చుం

1. ఋ. 1-140-161.—2. బృహ-3-143-146.—3. ఋ. 1-116, 9-74.
4. ఋ. 10-30-34.—5. ఐ. బ్రా. 2-19, కౌషీ-11.

డఁదగవు" అని పలికి వానిని తీసికొనిపోయి నీళ్లు లేనిచోట విడిచి పెట్టిరి. అతఁడపుడు పిపాసార్దితుఁడై యబ్దేవతను బ్రార్థించుచు నొకసూక్తము రచియించెను. అదే యపోన ప్త్రీయము. ఆస్తుతికి సంతోషించి సరస్వతీనది యతఁ డున్నచోటికిఁ బ్రవహించెను. అది చూచి ఋషు లాశ్చర్యపడి యతనికిఁ గితవత్వదోషము లే దని నిర్ణయించి వెంటనే యచ్చటి కేగి కవషుని దోడ్కొనివచ్చి తమలోఁ గూర్చుండఁ బెట్టుకొని యతనిమంత్రములు వినియోగించి యాగము సాగించిరి. కవషుఁ డున్నచోటికి నలుఁగడల సరస్వతీనది పరిసరించుటంజేసి యాచోటికిఁ బరిసారక మనుపేరు వచ్చిన దఁట.

పై రెండుకథలనుబట్టి యాకాలమున బాటింపఁదగినవర్ణభేదము లే దని తెలియకపోదు. కాని ఋగ్వేదపరిసమాప్తికాలమం దాభేదము స్పష్టముగా నేర్పడె ననుట నిజము.

వృత్తులు:—ప్రాచీనార్యులవృత్తులలో నతిముఖ్యము లైనవి గోరక్షణము కృషి. అందు గోరక్షణము :—ఆకాలమున గోవుల కున్నప్రాధాన్యము మఱి దేనికిని లేదు. రాజు పురోహితుని కిచ్చుకానుక గోవు. యజమానుఁడు ఋత్విక్కుల కిచ్చుదక్షిణ గోవు. తండ్రి కూఁతురి కిచ్చునరణము గోవు. ఋషులు దేవతలకు మ్రొక్కి కోరునది గోవు. వారిప్రత్యక్షదేవత గోవు. వే యేల ? వారి జీవన మంతయు గోవుతోనే యున్నది. వారు గోవులయెడఁ జూపుభక్తి శ్రద్ధలు వర్ణనాతీతములు. వారు నిత్యము హోమము చేయునది గోఘృతము గోక్షీరము. వారియాహార మావునెయ్యి, ఆవుపాలు. అట్టియెడ వారు గోరక్షణ మం దతి జాగరూకులయి యుండి రనిన నాశ్చర్య మేమి ?

ఒకఋషి కృష్ణాసురుని సంహరించి యతనివద్ద నున్నగోవులను దెచ్చి యి మ్మని యింద్రుని బ్రార్థించును. మఱియొకఋషి పణినామకాసురుని జయించి తె మ్మని కోరును. మఱికొందఱు 'ఓయగ్నీ ! ఓయశ్విదేవతలారా ! ఓసోమా ! మాకు గోసంపద నొసఁగు' మని ప్రార్థింతురు. వా రుపమానముల యందుఁగూడ గోవులనే యెక్కువగా వాడుట చూచినచో వారికి గోవులయం దున్నమహాదరము గోచరించును. ఒకఋషి, యుషోదేవి యెఱ్ఱావులమందవలెఁ దూర్పున గోచరించుచున్న దని వర్ణించెను. మఱియొకఋషి తమదూడలకై పరుగెత్తుగోవులవలెనే నదులు సముద్రమునుగూర్చి యతివేగముగాఁ బోవుచున్న వని వర్ణించెను.

ముద్గలమహర్షిగోవులను దొంగలు తోలుకొనిపోయిరి. ఆచోరులను బట్టుకొని వారిని జయించి యావులను దీసికొని వచ్చుటకై ముద్గలుఁడు రథారూఢుఁడై బయలుదేఱెను. అతనికి సేనానిగాను సారథిగాను భార్య యగు ముద్గలాని కూడ వెళ్లి భర్తకు సహాయురాలై దొంగలతోఁ బోరు సలిపి

వారిని జయించి గోవులను మరల్చుకొని వచ్చె నని[1]. యొకసూక్తమున వర్ణింపఁ బడి యున్నది. దీనినిబట్టి చూచినచోఁ బూర్వకాలమున స్త్రీపురుషులు గోరక్షణమం దెంత పట్టుదల గలిగి గోవులే తమసర్వస్వ మని తలఁచుచుండెడివారో తెలియవచ్చును. ఇది గాక ప్రత్యేకముగా రెండుసూక్తములు గోదేవతాకములుగాఁగనవచ్చుటయే పూర్వులు గోవుల నెట్లు భావించుచుండిరో తెలుపఁగలదు. మథితుఁడు భృగువు చ్యవనుఁడు శబరుఁడు మొద లగుమహర్షు లనేకు లనేక విధముల గోవును ప్రశంసించియున్నారు. అందు కొన్నిమాటలు—

"ఓ సకలదేవతలారా! నే నొక్కఁడనే పాలు పెరుగు నెయ్యిత్రాగను. మీ కందఱికిని సమర్పింతును. మాకు గోధనము సమకూర్పుఁడు."

"ఇంద్రా! ఇటు రమ్ము. అటు పోవుచున్నమాగోవులను మళ్లింపుము. ఇంకను గోవులను మాకు దయచేయుము. నీ వనుగ్రహించునట్టివియుఁ జిరకాలము జీవించునట్టివియు నగుగోవులవలన మేము సుఖముగా జీవింతుము. నీవంటి దేవతలకుఁ బయోఘృతరూప మయినహవిస్సు నొసంగుదుము".

"తప్పిపోయినగోవులను వెదకఁబోయినవాఁడును గోవులకొఱ కడవికి వెళ్లినవాఁడును వనమునఁ దిరుగుగోవులవెంట నున్నవాఁడును వనమునుండి గోవుల నింటికిఁ దోలుకొనివచ్చువాఁడును నగుగోపాలుఁడు సుఖముగా గోవులతో నింటికి వచ్చుఁగాక"[2].

"మాగోవులకు మంచిగాలి వీచుఁగాక. ఆవులు మంచిబల మిచ్చుతృణాదికము మేయుఁగాక. నిర్మల మయినజలము త్రాగుఁగాక. ఓ రుద్రా! గోవులను బాధింపకుము."

"సమానరూపములు విభిన్నరూపములు నేకవర్ణములు నై నయీగోవుల నామము లగ్ని యెఱుఁగును. మహర్షు లై నయంగిరస్సులు పశుప్రాప్తిసాధన మైనయాగ మొనరించి యేగోవుల నీలోకమునకుఁ దెచ్చిరో, ఆగోవులకుఁ బర్జన్యుఁడు సుఖము కలిగించుఁగాక"[3].

ఇత్యాదిగోవర్ణనము లనేకములు గలవు. వీనినిబట్టి యార్యులు గోసంపాదనమునందును గోరక్షణమందును నెంతటియాదరము చూపుచుండెడివారో తెలియఁగలదు.

1. ఋ. 10-102.
2. ఋ. 10-19-7, 6, 5,
3. ఋ. 10-169-1-2.

కృషి:—ప్రాచీనార్యులు పొలము దున్ని సేద్యము చేయుట చక్కఁగా నెఱుఁగుదురు. యవలు గోధుమలు తిలలు శ్యామాకనీవారమాషములు మొదలగుధాన్యములు పండించునట్టివారు 'ధాన్యకృత్తు' లనఁబడుచుండెడివారు[1].

కక్షీవంతుఁ డనుఋషి కృషినిగూర్చి యిట్లు పలుకుచున్నాఁడు.

"ఓయశ్విదేవతలారా! ఆర్యుఁ డయినమనువునిమిత్తము కర్షకులు నాఁగళ్లతో నేల దున్ని యవాదిధాన్యముల విత్తనములు చల్లునట్లు చేసితిరి గదా!"[2].

బుధమహర్షి యిట్లు వర్ణించుచున్నాఁడు.

"మిత్రులారా! నాఁగళ్లు సిద్ధముచేయుఁడు. అఱకలు కట్టి పొలము దున్నుఁడు. నాఁగటిచాళ్లలో విత్తనములు చల్లుఁడు. మనమనోరథములతోఁ గూడఁ బంటలు పండుఁగాక. మనకొడవళ్లు పండినపైరు కోయుఁగాక.

సఖులారా! నీళ్లతొట్లు నిర్మింపుఁడు. తోలుమోకులు వానికిఁ గట్టుఁడు. తఱుఁగనిజెలతో వెలయు నూతులనుండి నీళ్లు తోడుదము.

మేధావులారా! గుఱ్ఱములకు లేక యెడ్లకుఁ గడుపునిండ మేఁత వేసి నీళ్లు పెట్టుడు. పైరుమోపులు లాగుటకుఁ దగినబండ్లు సిద్ధముచేయుఁడు. మోపులన్నియు నొకచోటికి లాగింపుఁడు"[3].

ఇత్యాదిగా నీసూక్తము కర్షకకృత్యములను జక్కఁగాఁ వర్ణించుచున్నది. పూర్వులు కఱ్ఱకుండ లొకదానిక్రింద నొకటిగాఁ బెద్దమోకునకుఁ గట్టి దానిని రాతిగిలకమీఁద నుంచి, అశ్మచక్ర మనఁబడునాగిలకను ద్రిప్పి యాకుండలతో నవిచ్ఛిన్నముగా నూతినీరు బయటికి వచ్చునట్లు చేయుచుండిరి. ఈదృశమైన జలాకర్షణసాధనము ఘటీయంత్ర మనఁబడును. ఉత్తర హిందూదేశమం దిప్పటికి నిట్టి ఘటీయంత్రములు వాడుకలో నున్నవఁట. మఱియు వర్షములవల్ల, కుభాక్రమునదులు పొంగినపుడు కృషికృత్యము లారంభించినట్లు కూడఁ గొన్ని వర్ణనలు తెలుపుచున్నవి[4].

వామదేవమహర్షి యిట్లు ప్రసంగించుచున్నాఁడు.

"వృషభములు చక్కఁగా మోయుఁగాక, కర్షకులు శ్రద్ధగాఁ బని చేయుదురుగాక. నాఁగలి తిన్నగా దున్నుఁగాక. పగ్గములు బాగా మోపులు బిగించుఁగాక. మునికోల విసరి గుఱ్ఱములను నడపింపుము:—

"ఓ నాఁగటిచాలా! నీకు వందనము లాచరించుచున్నాము. మాకను కూలురాలవు కమ్ము. చక్కనిధాన్యరూపఫలము నొసఁగుదానవు కమ్ము:—

---

1. వపంతో బీజ మివ ధాన్యకృతః పృంచంతి. ఋ. 10-94-13 ధాన్యం బీజం మహాధ్వే— 5-53-13.

2. యవం వృకే ణాశ్వినా వపంతేషం దుహంతా మనుషాయ దస్రా. 1-117-21.

3. ఋ. 10-101　4. ఋ. 5-53.

"ఇంద్రుఁడు మేడికోల పట్టుకొనుఁగాక. పూషదేవుఁడు నాఁగటిచాలు నియమించుఁగాక. ఏఁటేఁట నాకాశము సస్యానుకూలముగా వర్షించుఁ గాక.

"మననాఁగళ్లు పొలములను బాగా దున్నుఁగాక. పశువుల కాపరు లెద్దులతో సుఖముగా వత్తురు గాక. మేఘుఁడు తియ్యనిజలము కురియుఁగాక[1].

అగస్త్యుఁ డిట్లనుచున్నాఁడు.

"ఓమనసా! వర్షాధారభూతుఁ డయినయేయింద్రుఁడు వ్రీహియవాది బీజములను బొలములయం దంకురింపఁజేసి భుక్తి కలిగించుచున్నాఁడో, ఆ యింద్రుని స్తుతింపుము"[2].

అత్రిమహర్షి యిట్లు పలుకుచున్నాఁడు.

"కర్షకుఁడు యవధాన్యము నుద్దేశించి ప్రతిసంవత్సరము మరల మరల భూమిని దున్నునట్లే పూషదేవుఁడు ప్రతివర్షము నాఱుఋతువులను ద్రిప్పు చున్నాఁడు[3].

కవషుఁడు కృషిమహత్త్వ మిట్లు పొగడుచున్నాఁడు.

"ఓరీ జూదరీ! గౌరవబుద్ధితో నామాట నమ్ముము. ఎపుడును జూద మాడవద్దు. వ్యవసాయము చేసికొనుము. కృషివల్ల సంపాదించిన ధనముతో నానందింపుము. కృషి యనఁగా నే మనుకొనుచున్నావో! ఆవృత్తితో గోవు లును వృషభములును నీకుఁ గలుగును. కృషి ఫలించుచున్నచో నీకుఁ బెండ్లి యగును. భార్యవల్ల సుఖంతువు. ఈ ధర్మరహస్యము తెలిపిన మహానుభావుఁ డీదృష్టిగోచరుఁ డగుచున్న సవితృదేవుఁడే. కావునఁ గృషి చేసి సుఖంపుము[4].

కక్షీవత్పుత్రుఁ డైనసుకీర్తి యిట్లు చెప్పుచున్నాఁడు.

"కర్షకు లేపంట ముందు కోఁతకు వచ్చునో దానిని గోయుదురు[5].

దీనినిబట్టి పూర్వులు గోధూమవ్రీహియవాది ధాన్యములలో నేది ముందు పండునో దాని నెఱిఁగి వ్యవసాయము చేయుచుండెడివా రని తెలియ వచ్చును. ఇంక నిట్టి వర్ణన లనేకములు కలవు కాని, హైందవార్యులలో నేటి కిని నూటికిఁ దొంబదిమంది యేవృత్తివల్ల నుదరపోషణము గావింప యత్నించు చున్నారో, అట్టిసుఖప్రదము స్వతంత్రము నగువృత్తి మానవుని కుత్తమ మని కొన్ని వేలసంవత్సరముల క్రిందట వైదికార్యులు కనిపెట్టి దాని నాచరించు చుండెడివా రనుట కివి చాలును.

1. ఋ. 4-57-4, 6, 7, 8.
2. ఋ. 1-176-2.
3. ఋ. 1-23-15.
4. ఋ. 10-34-13.
5. ఋ. 10-131-2.

వాణిజ్యము:—వైదికార్యులనాఁడు, కొనుట యమ్మట నావలమీఁద దేశదేశములకుఁ బోయి సరకులు తెచ్చుట యిచ్చటి వస్తువులు విదేశములకుఁ గొనిపోవుట మొదలగు కృత్యములు విరివిగా జరుగుచుండెడి వనుటకు ఋగ్వేదమునఁ గొన్నివర్ణనలు తోడ్పడుచున్నవి.

నవ్యుఁ డనుఋషి స్తోతలను వణిజులతో బోల్చి యిట్లు వర్ణించుచున్నాఁడు.

"ధనసంపాదన మభిలషించువణిజులు దానికై సంచారము చేయ నిచ్చగించి యోడ లెక్కి సముద్రముమీఁదఁ బ్రయాణ మెట్లు సాగింతురో, అట్లే స్తోతలు స్వాభిమతధనలాభసిద్ధి కింద్రుని స్తుతింతురు"[1].

వామదేవమహర్షియు నిట్లే మఱియొకచోటఁ బలుకుచున్నాఁడు.

"ఓద్యావాభూములారా! ధనసంపాదనపరులు విదేశసంచారము చేయ దలఁచి సముద్రమధ్యమందలి ప్రదేశములకుఁ బోవుచు ముందుగా సముద్రము నెట్లు స్తుతింతురో, అట్లే మిమ్ము స్తోత్రముచేయుచున్నాను"[2].

పూర్వోక్తమైనవిదేశవాణిజ్యమును స్థిరపఱుచుట కీ క్రిందివసిష్ఠుని సముద్రయానవర్ణనము గూడఁ దోడ్పడుచున్నది.

"వరుణుఁడు ప్రసన్నుఁడు కాఁగానే యతఁడును నేనును నావ యెక్కితిమి. అట్లెక్కి మానావను మేము వడిగా సముద్రమధ్యమునకు నడపి మాకు ముందు పోయినయితరనావలను గలసికొనునంతలోఁ దరంగములవడి కిట్టటు నూఁగిపోయిననావలో నుయ్యాల లూఁగి పోయితిమి[3].

క్రయవిక్రయములలో వెలను గూర్చి వచ్చిన వివాదమును వామదేవమహర్షి యిట్లు తీర్చుచున్నాఁడు.

"ఒకఁ డొకవస్తువును మఱియొకనికి విక్రయించి నిర్ణయించుకొన్న వెల పుచ్చుకొని, తరువాతఁ గొన్నవానివద్దకు వెళ్లి దీనికిఁ దక్కువ వెల యిచ్చితివి. ఇంకను గొంత సొమ్ము రావలసి యున్నది. ఆలోటుపూర్తిచేయ వలసినదని యడిగినచోఁ గొన్నవాఁ డాలోటు పూర్తిచేయ నక్కఱ లేదు. వస్తువు విక్రయించి నపుడు వా రేర్పఱుచుకొన్నమూల్యమే యమ్మినవానికి నచ్చును గాని యంతకంటె నెక్కువ రాదు. అట్లుగాక 'దీనిమూల్యము తరువాత విచారించి నిర్ణయించుకొందు'మని సమయము జరిగినచో నపుడు విక్రయించిన వాఁ డడిగిన వెల కొన్నవాఁ డివ్వవలసియుండును"[4].

1. ఋ. 1-56-2.
2. ఋ. 4-55-6.
3. ఋ. 7-88-3.
4. ఋ. 4-24-9, 10.

ఈ ఋగ్భావమును బృహస్పత్యాచార్యులు శ్లోకములుగా రచియించిరి. సాయణులు దాహరించినయాశ్లోకము లివి:—

" అల్పం యః పరిగృహ్ణాతి మూల్యం పణ్యేన భూయసా
న క్రేతారం పున ర్గచ్ఛ న్నవిక్రీత స్త్వయం మయా.
ఇతి బ్రువ న్కామయతే పున ర్మూల్యస్య పూరణం
న విక్రేతా పున ర్మూల్యం భూయసా న ప్రపూరయేత్.
హీనం న లభతే వస్నం యదా విక్రీతవాన్ పురా
యథా సమయ మేవ స్యా త్తయో ర్న పున రన్యథా.
అయం విక్రయ ఏవేతి సమయ శ్చేత్కృతో భవేత్
అథ మూల్యార్థ మేత త్స్యా ద్విచా ర్యైవ తు నిర్ణయః.
ఇ త్యేవం సమయో ఒకారి తదా మూల్యం ప్రపూర్యతే."

ఇత్యాదిగా నందం దుపమానదృష్టాంతములుగాఁ గ్రయవిక్రయాదులను దెలుపుమాటలు ఋగ్వేదమునఁ గలవు, వీనినిబట్టి యార్యులు స్వదేశవాణిజ్యమే కాక, నౌకాయానమున విదేశమునకు వెళ్లి వ్యాపారము చేయుట కూడఁ గలదని తెలియుచున్నది. మఱియు నతిప్రాచీనకాలమం దార్యసంఘమందు వృత్తిభేదము కూడ లేదని చెప్పుట కవకాశము లేక పోలేదు గాని ఋగ్వేదాంత్యకాలమందు కొన్నివృత్తులు కొందఱు మాత్రమే చేయుచున్నట్లు కొన్నిసూచనలు కలవు. ఆంగిరసుఁ డయినశిశు వనుఋషి యప్పటివృత్తులయాచరణము నీక్రిందివిధముగా విశదీకరించెను. "ఓసోమమా! మాపనులు నానాజాతీయకములై యనేకములుగా నున్నవి. ఇతరజనులపనులును వివిధములుగా నున్నవి. కట్టెపనివాఁడు వడ్రము కోరుచున్నాఁడు. వైద్యుఁడు రోగము కోరుచున్నాఁడు. బ్రాహ్మణుఁడు సోమాభిషవ మొనర్చు యాగకర్తను గోరుచున్నాఁడు. నేను నీరసము కోరుచున్నాను. ఓసోమమా! ఎండు వెదురుజూకలు మొదలగువానితో నొకఁడు బాణములు చేయుచున్నాఁడు. మఱియొకఁ డాబాణములకు శకునపక్షుల యీఁకలతో ఱెక్కలు చేయుచున్నాఁడు. ఇంకొకఁడు బాణాగ్రములు నూఱు ఱాళ్లు చెక్కుచున్నాఁడు. అల్లే యినుపపనివాండ్రు బంగారుపనివాండ్రు మొదలగు కర్మకారులు ధనవంతు లగుపురుషులను గోరి వారిపనులు చేయుచున్నారు. నేను నీరసము వాంఛించుచున్నాను. నేను స్తుతిమంత్రములు రచియించువాఁడను. నాతండ్రి వైద్యము చేయువాఁడు. నాతల్లి పిండి విసరునది. ఇట్లు ధనకాములమై నానావిధము లైన కర్మము లాచరించుచున్నాము"[1].

పై వాక్యములనుబట్టి పూర్వులు బహువిధము లయినవృత్తు లాశ్రయించి క్రయవిక్రయము లాచరించుచుండెడివా రని తెలియనయ్యెడి.

1. ఋ. 9-112-1, 2, 3.

శస్త్రజీవిక :—ప్రాచీనార్యులు యుద్ధకార్యములయందు నిపుణు లనుటకు వా రొనర్చినయనేక సంగ్రామములే ప్రమాణము. వారిలో రథికులు సారథులు పదాతులు ఆశ్వికులు గలరు. స్త్రీలుగూడ సారథ్యము చేసినట్లును సేనానిగా నున్నట్లు ముద్గలాని యనుస్త్రీ చర్యయే సాక్ష్య మిచ్చుచున్నది. ఆనార్యుల నణంచుటకును వారిని బాఱఁదోలుటకును యాగవిఘాతుకు లైనక్రవ్యాదులను హింసించుటకును దొంగలను బరిమార్చుటకును దేశ మాక్రమించుటకును వారు పెక్కుపోరాటములు సలిపియున్నా రని యాయాసందర్భముల నింతకు మున్ను తెలిసికొనియున్నాము. వారివృత్తులలో శస్త్రజీవికగూడఁ బ్రధానవృత్తి యని ఋగ్వేదములో నెల్లెడఁ గనఁబడు వారి విజయములే చాటుచున్నవి. అట్లు మహాశూరులై యనార్యుల నణఁచి పెక్కువిజయములు గాంచినప్రాచీనులు గుఱ్ఱములయుపయోగము తొలుత నెఱుఁగ రని కొందఱు తలంచిరి గాని యది సరిగాదు. ప్రాచీనులు యజ్ఞములయం దశ్వాలంభము గూడఁ గావించి దాని మాంసమును దేవతల కర్పించి తాము తినుచున్నట్లు[1]. ఋక్కులు చెప్పుచుండ, వారు గుఱ్ఱముల నెఱుఁగరనుట యనుచితము. ఇది యిట్లుండ, పురుషుని దనపై నెక్కించుకొని యతివేగముగాఁ బోవుగుఱ్ఱము దధిక్రావ్య మనియు నశ్వరూపుఁడయినయగ్ని కావేరు చెల్లు ననియు[2]. కనఁబడువర్ణననుబట్టి గుఱ్ఱపుస్వారిచేయుట నాఁటివా రెఱుఁగుదు రనుట కాటంక ముండునా ? త్రసదస్యుఁ డనురాజర్షి యే మనుచున్నాఁడో చూడుఁడు.

“ గుఱ్ఱము లెక్కినయుద్ధభటులు సంగ్రామ మభిలషించుచు నావెంటవచ్చుచున్నారు. ధనవంతుఁడ నైననేను (ఇంద్రుఁడు) యుద్ధము చేయుచున్నాను”[3].

భరద్వాజపుత్రుఁ డయినగర్గుఁ డి ట్లనుచున్నాఁడు.

“ఓయింద్రా ! శత్రువుల చెంత నున్న మాగోవులను మళ్లింపుము. దుందుభి మ్రోఁగుచున్నది. మాయశ్వములు నాశ్వికపురుషులును యుద్ధమునకు సిద్ధముగా నున్నారు. మారథికులు శత్రువులను జయింతురుగాక[4].

వీనివలె నింక ననేకవర్ణనలు గలవు. వాని నన్నిటినిబట్టి యెక్కి స్వారి చేయుటకు శత్రువులతోఁ బోరుటకు రథములకు బండ్లకుఁ గట్టుటకు దున్నుటకుఁ బ్రాచీనులు గుఱ్ఱములను యథేచ్ఛముగా నుపయోగించుచుండెడివా రని తెల్లమగును.

---

1. ఋ. యే వాజినం పరిపశ్యంతి పక్వం 1-162-12.

2. ఋ. ఉత వాజినం పురునిష్షిధ్వానం దధిక్రాము. 4-38-2; 7-44-1, 2. దధిక్రావా. 7-44-3, 4, 5.

3. ఋ. 4-42-5; 4. ఋ. 6-47-31.

మృగయ :—మృగయావృత్తికిఁ గూడ వారెక్కువగా నలవాటు పడిన వారని కొన్ని వర్ణనలవల్లఁ దెలియుచున్నది. అరణ్యానీవర్ణనముతోఁడి సూక్తమొకటి యార్యులవనవిహారమును జాటుచున్నది[1]. అందు దేవముని యనుఋషి వాక్యము లిట్లున్నవి. "గవయాదిమృగము లందందు మేయుచున్నవి. లతా గుల్మాదులు గృహములవలెఁ గనఁబడుచున్నవి. ఈయడవి, కట్టెలు మోసికొని పోవుటకు వచ్చినబండ్లను సాయంకాలము విడిచి పెట్టుచున్నది." "సాయంకాలమందు వినవచ్చు నానావిధపక్షిమృగములకూఁతల కడవిలో నడచువారు దొంగల కేక లని భయపడుచున్నారు" అడవికి వచ్చినవారు సుఖముగా రసవంతము లైనఫలములు భక్షించుచున్నారు "ఫలమూలాదులతోఁ గూడిన యీమహారణ్యము బహువిధమృగములకుఁ దల్లిగా నున్నది."

'అవరుద్ధః పరిపదం న సింహః'[2], అనువాక్యమునుబట్టి ప్రాచీనులు వేటాడి సింహమును బట్టి తెచ్చి పంజరములో బంధించెడివా రని తెలియవచ్చును. ఇందుకుఁ దోడుగా వేటసాధనము లైనవాగురలను దెల్పుశబ్దములు గూడ నందందు గనవచ్చును[3]. మఱియు, పృషతీభిః - ఆంజనగంధిం - కృష్ణాః - గౌరః ఇత్యాది ప్రయోగములవలనఁ దెలియవచ్చు దుప్పి - కస్తూరిమృగము - కృష్ణసారము - గౌరమృగము మొద లగునడవిమృగములను వారు మృగయావ్యాపారమునఁ జూచి యుందు రనిభావింపవచ్చును[4]. ఒంటెలను దెల్పురజశ్శబ్దప్రయోగమునుబట్టి. పూర్వు లుష్ట్రములనుబట్టి తెచ్చి వానిచే బరువులు మోయించుచుండెడివా రనితోఁచుచున్నది. ఇప్పటికిని సింధుదేశమున నీయాచారము కలదు, మఱియు మహిష మృగములను వా రడవులనుండి గ్రామములకుఁ దీసికొని వచ్చి వానిని మందలుగాఁ బెంచి వానిమాంసము భుజించుచుండెడివా రని "ఇంద్రా! నీవు మూఁడువందల దున్నపోతుల మాంసము తింటివి" అని యర్థమిచ్చువాక్యమువలనఁ దెలియుచున్నది[6].

మఱియు గజవర్ణనముగూడ గొన్నిచోట్లఁ గనవచ్చుచున్నది. అట్టి వర్ణనలనుబట్టి చూడఁగా నార్యు లేనుఁగువేటలో నిపుణులై వానినిబట్టి గ్రామములకుఁ గొనివచ్చి యుద్ధములందు వినియోగించుచుండెడివా రనియు, నాయకు లగు వా రేనుఁగు నెక్కి వెళ్లుచుండెడివా రనియుఁ దెలియఁగలదు[7].

---

1. ఋ. 10-46.—2. ఋ. 10-28-10.—3. ఋ. ప్రసితిర్వాగురా. 4-4-1.
4. ఋ. 1-37-2; 10-146-6; 10-94-5;—5. ఋ. 8-46-28,—6. ఋ. 5-29-8; 6-17-11.

7. ఋ. మృగా ఇవ హస్తినః ఖాదథావనా. 1-64-7. రాజేవామవాఁ ఇభేన. 4-4-1. దానా మృగో న వారణః. 8-33-8. గిరా వప్రో న యోధిషత్. 8-45-5.

ఇట్లే వారు పెద్దపులివేఁట గూడ సలిపియుండి రని యొకబుక్కువలన గోచరించుచున్నది[1]. ఈ బుక్కులో వారణశబ్దమునకు శార్దూల మని సాయణుల వా రర్థము వ్రాసియున్నారు. మఱియు నడవిపందులను వేఁటకుక్కలచేఁ బట్టించుటయు, అసురులు గొనిపోయిన గోవులను వెదకుటకు శ్వానములను పంపుటయు[2], నాఁటికాలమునఁ గలదు. అట్టి వర్ణనలనుబట్టి యార్యులు గృహరక్షణమునకును వేఁటకునుగూడ శ్వానములను బెంచుచుండెడివా రని తెలియనగును. ఇట్లే వృషాకపి యనువాఁడు పెంచినకోఁతి యింద్రాణిచేతిలో నున్నహవిస్సులను లాగుకొని పోయిన దని[3] యున్నవర్ణననుబట్టి వానరములను బట్టి పెంచుటకూడ నాఁడు కల దని చెప్పవచ్చును. ఇట్లెన్నెని వనమృగములను బక్షులను వారు వేఁటాడినట్లు పెక్కువర్ణనలు ఋగ్వేదమునలుఁ గడల నాయాసందర్భములఁ గనపచ్చును.

లోహములు:—శత్రువిజయము కృషి వేఁట మొద లగునెల్ల వృత్తులలో నాఁటితేఱినవారు వివిధలోహముల నుపయోగించియుందు రని వేఱుగాఁ జెప్ప నక్కఱలేదు. అయిన నొకఁటి రెండు దాహరణములు.

శ్యావాశ్వమహర్షి యి ట్లనుచున్నాఁడు.

"ఓమరుత్తులారా! మీబుజములమీఁద వాడికత్తులు, మీ పాదముల వీర కటకములు మీ ఱొమ్ములపై హారములు మీ శిరస్సులపై బంగారుతలపాగాలు మిక్కిలి ప్రకాశించుచున్నవి"[4]. ఇట్లే ఆయస మైనవజ్రాయుధము హిరణ్మయము లైనయాభరణములు పెక్కుచోట్ల వర్ణింపఁబడినవి[5].

ఆహారము:—ప్రాచీనార్యు లావుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి త్రాగుచుండెడివారు. వీనినే దేవతల నుద్దేశించి యగ్నిలో హోమము చేయుచుండెడి వారు. యవబియ్యము విసరి యాపిండి నేతితోఁ గాని పాలతోఁ గాని కలిపి తినుచుండెడి వారు. యజ్ఞాదులం దిట్టిదే పురోడాశ మని పిలువఁబడుచుండెడిది. గోధుమలు గూడ వారి కాహారముగా నుండెడివి. వేఁపుడు బియ్యము పేలపిండి గూడ వారు భక్షించుచుండెడి వారు. వరిజాతిలో నివ్వరి బియ్యము వారి యాహారముగా నుండెడి దని చెప్పవచ్చును. ఇతరము లైనవడ్లు వారి కాలమున లేవేమో యని తోఁచుచున్నది. యవప్రశంస పెక్కుచోట్లఁ గనవచ్చుటచే యవధాన్యమే వా రెక్కువగాఁ బండించుకొనుచుండెడివా రనియు వానినే నిత్యభోజనమునకును యజ్ఞాదులయందు పురోడాశమునకును వాడుచుండెడివా రనియు

---

1. యువాం మృగేవ వారణా మృగణ్యవో—10-40-4.
2. 10-86-4.
3. 10-86-5; 3-31-5,6.
4. ఋ. 5-54-11—10-48-3.
5. ఋ. 9-112 1,2,3.

నిస్సంశయముగా విశ్వసింపవచ్చును. ఆయవలే యిపుడు బార్లీగింజ లనఁబడు చున్నవి. ధాన్యశబ్దము ఋగ్వేదమునఁ గనవచ్చుటచే వ్రీహిగోధూమ నీవార ములు గూడ వారియాహారపదార్థములుగాఁ బరిగణింపఁబడుచున్నవి గాని యీ శబ్దములు గనరాలేదు. కాని యింతమాత్రముచే వా రితరధాన్యజాతు లెఱుఁగ రని తలంపరాదు. ప్రసక్తానుప్రసక్తిగాఁ గొన్నివస్తువు లుదాహరింపఁబడినవి. అనేకము లుదాహరింపఁబడ లేదు. ముఖ్యముగా నుప్పను దెల్పుశబ్ద మొకటియు ఋగ్వేదమున లేదు. అందుచేఁ గొందఱు పాశ్చాత్యు లూహించినట్లుగా నాఁటి యార్యు లుప్పు చేయుట యెఱుఁగ రని కాని యుప్పు తినుట యెఱుఁగ రని కాని విశ్వసింపవలసినదే నా? ముఖ్యము లయిన ఫలజాతులు పేర్కొనఁబడ లేదు. అందుచే వారు పండ్లమొగ మెఱుఁగ రనిచెప్ప సాహసింపవలసినదేనా? సము ద్రముమీఁద యానముచేసిన వారు లవణము చూచి యుండ రనుటకం టెను వనముల విహారము సల్పినవారు వివిధఫలములు రుచిచూచియుండ రనుటకంటెను సాహసము వే ఉండునా? కావున యజుర్వేదమునఁ బేర్కొనఁబడిన సమస్త భోజ్యపదార్థములును ఋగ్వేదకాలమున నుండె ననియు వానిని బ్రాచీనార్యులు యథేచ్ఛముగా ననుభవించి రనియు నమ్మవచ్చును.

వారిపానీయములలో సోమరస మతిముఖ్యము. అది యాయుస్తేజోబల వర్ధక మనివారు విశ్వసించి దానిని సేవించుచుండెడివారు. సార్వత్రిక మైనదాని వివిధవర్ణనములనుబట్టి యజ్ఞాదులందే కాక యితరసమయములందు గూడ వారు సోమ మారగించుచుండెడివా రని తెలియఁగలదు. కురుక్షేత్రమునకు నడుమ నున్న శర్మణావంత మనుసరస్సుకడ నున్నసోమమును, ఆర్జీకజనపదమందలిసోమమును గొంద ఱార్యులు మిక్కిలి ప్రేమించినట్లు కనఁబడుచున్నది[1]. ప్రగాథుఁ డను ఋషి సోమమహత్త్వ మిట్లు పొగడుచున్నాఁడు.

"సోమమా! నీ వమృతస్వరూపమవు. నిన్నుఁ ద్రాగి మే మమృతుల మగుచున్నాము. దేవతలను దెలిసికొనుచున్నాము. ఇఁక మమ్ము శత్రు వేమి చేయఁగలఁడు?"

"సోమమా! తండ్రి కుమారునికి సౌఖ్యము గలిగించునట్లే నీవు మాయు దరములఁ బ్రవేశించి మాకు సుఖ మొనరింపుము."

"మేము త్రాగినసోమము మమ్మఁ గర్మాచరణసమర్థులనుగాఁ జేయుఁగాక. మాకు రోగములు రాకుండ రక్షించుఁగాక."

"తండ్రిసొత్తు కొడుకు కనుభవించునట్లే నిన్ను మే మనుభవించు చున్నాము. మాకు దీర్ఘాయు వొసంగుము[2].

1. ఋ. 9-113-1, 2.—2. ఋ. 8-48.

ఇట్లు ప్రశంస కెక్కినసుగుణములు గలసోమమును వారు ప్రత్యేకముగాఁ ద్రాగుటయే కాదు, పదార్థాంతరములతోఁ గలిపి కూడ దానిని భక్షించు చుండెడివారు. మేధాతిథి ప్రియమేధు లనుఋషులు సోమపానవిధానము నిట్లు వివరించియున్నారు. "ఇంద్రా! సోమరసమును క్షీరాదికమును గలుపుము. తరువాత ధానాకరంభాదిలక్షణ మైనపురోడాశమును సోమమును గలుపుము"[1].

ఇత్యాదివర్ణనలనుబట్టి వారు సోమమును బహువిధముగా సేవించుచుండెడివా రనుట స్పష్టము. ఇంక సురాపానము.

ఆర్యులు సురాపానము చేసెడివా రని చరిత్రకారు లందఱును దలంచుచున్నారు. రెండుమూఁడుచోట్ల సురాశబ్దము ఋగ్వేదమునఁ గనవచ్చుచున్నది. కాని సోమపానము చేయుచున్నా ననుసట్లు సురను ద్రాగుచున్నా నని యొక ఋషియుఁ బలికియుండలేదు. పైగా దానియెడ నిరసనభావమే చూపియుండిరి. ఇందుకు రెండుఋక్కులభావ మిం దుదాహరించెదను.

"ఇంద్రా! సుర త్రాగినవానికి మత్తెక్కించునట్లే నీవు త్రాగినసోమములు నీకడుపులో గుడగుడ లాడుచు నీకు మత్తెక్కింపఁ బరస్పరసంఘర్షణము గావించుచున్నవి"[2].

ఇందు సురాపానము మదహేతు వని మేధాతిథి యెఱిఁగినంతమాత్రమున నతఁడు సురాపాయి కావలెనా? త్రాగు డలవాటులేనివారికిఁ ద్రాగినవాని చేష్టలనుబట్టి సురా దుర్గుణములు తెలియకపోవునా? అట్టియెడ నిక్కడ సురవలెనే సోమముకూడ మదకారియగు ననుటకు దానిని దృష్టాంతముగా ఋషి గ్రహించినంత మాత్రమున నాఁటియార్యులు సుర కలవాటుపడినవా రని యూహించుట యెట్లు చితమగును? అయిన నీవిషయమున వసిష్ఠమహర్షి యేమి చెప్పుచున్నాఁడో చూతము.

"ఓవరుణా! సురారూపమును క్రోధరూపమును అక్ష (పాచికలు) రూపమును నైనదైవగతియే పురుషునిపాపప్రవృత్తికి మూల మగుచున్నది"[3].

దీనినిబట్టి యనర్థహేతు వైన సురాపాన మెట్లు నిషిద్ధ మైనదో తెలియకపోదు. అయినను, త్రాగు డాకాలమున నున్నదికావుననే యిట్లు నిందింపఁబడినదందు రేని యది యనార్యులలో నుండెడి దని యెందు కూహింపరాదు? అట్లు కాక యార్యులలోనే కొందఱికి దానియభ్యాసము కలిగియుండు నని సాధింపఁ జూతు రేని యట్లయిన సురాపాన మాకాలమునఁ బుట్టినవెంటనే నిషేధింపఁబడిన దని వైఋషులయభిప్రాయమున విదితము కాకపోదు. ఇంక మాంసాశనము.

ప్రాచీనార్యులు మాంసము నిరాక్షేపముగాఁ దినుచుండెడివా రని యింతకు మున్నే తెలిసికొనియుంటిమి. ఇతరసమయములందే కాదు, యజ్ఞము

1. ఋ. 8-2-11.—2. ఋ. 8-2-12.—3. ఋ. 7-86-6.

 

లందును యాగపశువులమాంసమును ఋత్విగ్యజమానులు దేవతల నుద్దేశించి హోమము చేయుటయుఁ దాము తినుటయు నాఁటికాలమునఁ గలదు.

ఇంద్రాణీంద్రవృషాకపులసంవాదసూక్తమం దింద్రునిమాట లిట్లున్నవి.

ఉక్ష్ణోహి మే పంచదశ సాకం పచంతి వింశతిం ఉతాహ మద్మి,

పీవ ఇదుభా కుక్షీ పృణంతి మే విశ్వస్మా దింద్ర ఉత్తరః"[1].

నాభార్య యైనయింద్రాణిచేఁ బ్రేరితులై యష్టలు పదియేనువృషభములను, ఇరువదియెద్దులను వండుచున్నారు. నేను వానిని భక్షించుచున్నాను. తిని బలియుచున్నాను. పైగా యాగకర్తలు సోమరసముచే నాడొక్కలు నిండించుచున్నారు. అందుచే లోకమంతటికంటె నేను గొప్పవాఁడ నగుచున్నాను.

ఇట్లే వృషాకపి వసుక్ర భరద్వాజ సోమాహుతి దీర్ఘతమః ప్రభృతులగుఋషులవాక్యములనుబట్టి యజ్ఞహవిస్సుగా మాంసమును భక్షించుట కలదని యీ క్రిందివిధముగాఁ దెలియవచ్చుచున్నది[2].

"అంగిరస్సు లింద్రునికొఱకు బలిసినమేషమును వండిరి."

"ఇంద్రుఁడు యజ్ఞపశువు లైనవృషభములను భక్షించుఁగాక."

"ఇంద్రా! నీనిమిత్తము యజమానులు వృషభపశువులను వండుచున్నారు. వాని నారగింపుము."

"అగ్నీ! ఋగ్రూప మయినహవిస్సు ఋషభవశామాంసరూపముగాఁ బరిణమించి నీభక్షణమున కగుఁగాక."

"ఓయగ్నీ! గొడ్డావులచేతను బలీవర్దములచేతను మీఁగండ్ల మెకములచేతను ఆరాధింపఁబడినవాఁడ వైతివి".

"ఋభువులలో నొకఁడు రక్తము తీసి యూవలఁ బెట్టుచున్నాఁడు. అది రక్షోభాగము. మఱియొకఁడు కత్తితో హృదయజిహ్వా వక్షస్స్థలములయందలి మాంసము కోయుచున్నాఁడు. ఇంకొకఁడు కుక్షిస్థమాంసమును వెలువరించుచున్నాఁడు. ఋత్విగ్రూపు లైన ఋభువు లిట్లు చేసినపిదప యజమాన దంపతులు చేయఁదగిన దింకే మున్నది?"

వీనినిబట్టి యగ్నీంద్రాదిదేవతల నుద్దేశించి హోమము చేయుమాంసరూపహవిస్సును వారుకూడ భక్షించెడివా రని విదిత మగును. ఆకాలమున నత్యంత శీతల మైన యాదేశమున మాంసాహారముగూడ నావశ్యక మయ్యెనేమో కాని రానురాను దేశమున శీతబాధ కొంచెము తగ్గుచువచ్చుటచేతనో లేక మాంసా

1. ఋ. 10-86-14.

2. క్రమముగా 10-27-17. 10-86-13; 10-28-3; 6-16-47; 1-161-10.

హార ముచితము గాదని తలంచుటచేతనో తరువాతివారు దానిని నిషేధించిరి కాని, సురాపానమువలె నది ఋగ్వేదకాలమందు నిషేధింపఁబడక చాలా కాలము వఱకు నాచరణలో నున్నట్లుగా నితరగ్రంథములలోని యతిథిపూజా కల్పములవల్లఁ గూడ గోచరించును. ఎట్లయిన నేమి? ఆర్యులు బౌద్ధమతారంభ కాలమున మాంసమును బూర్తిగా నిషేధించి రనుట నిజము.

సాంఘికాచారములు :—ఋగ్వేదారంభకాలమునం దార్యులలో జాతి భేదము లేకపోయినను, అందఱు నన్ని వృత్తులు సామాన్యముగా నాచరించు చున్నను, కాలక్రమమునఁ గొందఱు కొందఱు కొన్నికొన్ని వృత్తులయందు స్థిర పడి నట్లాయావర్ణనవలన గోచరింపకపోదు. అందు యజన యాజన మంత్రదర్శన మంత్రపఠన పాఠాదులు నియతముగా నాచరించువారు పురోహితవర్గముగాను సంఘపాలన దేశరక్షణ శత్రుహింసన జైత్రయాత్రాదు లాచరించువారు నాయకవర్గముగాను, కృషి గోరక్షణ వాణిజ్యాదు లాచరించువారు కృషీవల వర్గముగాను, పురోహితాదులకు ధర్మాచరణమునందును నాయకులకు యుద్ధకార్య నిర్వహణమునందును పరిచర్య లొనర్చుచుఁ బరిచారకులుగాను భటులుగాను నుండువారు దాసవర్గముగాను నేర్పడి పరస్పర మైకమత్యమున దేశహితములు సంఘహితములు నగుతమతమ కృత్యములు నిర్వహించుచువచ్చిరి. అట్లాయావృత్తుల యందు స్థిరపడినవారే కాలక్రమమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతులుగా విడివడి రని దశమమండలములోని యర్వాచీన ఋక్కులనుబట్టియుఁ దరువాత వెలువడిన బ్రాహ్మణేతిహాసాదులనుబట్టియు మనకు విదిత మగుచున్నది. అట్లేర్పడిన యీనాలుగువర్ణములు గాక మఱియొకటి నిషాదవర్ణ మను పేర నగపడుచున్నది. అందు దురాచారములపాల్పడి భ్రష్టులైనవారును, ఆర్యు లకు లోఁబడినయాదినివాసు లయినయనార్యులును జేరియుందు రని యూహింప నగును. ఆకాలమున నదియే పంచమజాతి. ఈకాలమందలి పంచమజాతివారి వలె నప్పటి పంచమవర్ణమువా రత్యంతగర్హ్యులు కాక పైజాతులవారి యాదర మునకుఁ బాత్రు లైనట్లుగా నిషాదపంచమము లైనచతుర్వర్ణములకు శ్రేయము గలిగింపుఁ డని యింద్రాదిదేవతలను బ్రార్థించిన ఋషులవాక్యములవల్లనే బోధ పడుచున్నది. దశమమండలములోని సాంఘికాచారవర్ణనలు గుణకర్మవిభాగమును బట్టి చతుర్వర్ణము లేర్పడినపిదపనే బయలువెడలిన వనుట కందందు పేర్కొనఁ బడిన బ్రహ్మక్షత్రశబ్దములు తోడ్పడుచున్నవి గాని వైశ్య శూద్రశబ్దము లెందును గంఠోక్తిగాఁ బేర్కొనఁబడినట్లు కనిపించకపోవుటచే నవి యన్ని జాతుల కును సంబంధించినవా? లేక పైజాతులు రెంటికే సంబంధించినవా? అట్లయి నచోఁ దరువాతికాలమున వెలువడిన ధర్మశాస్త్రాదులందు ద్విజశబ్దవాచ్యులుగాఁ గనఁబడుచున్న వైశ్యులకు వైదికాచారము లున్నట్లు తెలియవచ్చుచుండఁగాఁ

దొలుత లేకుండఁగఁ బోవునా ? యనెడి సందేహము లుదయించుచున్నను, వానిని దీర్ఘ నాధారము లందు లేమిం జేసి యవి యన్నియు నార్యుల ప్రాథమిక సాంఘికాచారములుగా గ్రహింపవలసియున్నది. అట్టివానిలోఁ గొన్నిటి నిం దుదాహరించుచున్నాను.

వివాహము:—దశమ మండలమున నలుఁబదియేడుఋక్కుల సూక్త మొకటి వివాహవిషయక మంత్రములతో నిండియున్నది[1]. అందు మొదటఁ గొన్ని ఋక్కులలో సవితృపుత్రి యగు సూర్యకును సోమునికిని జరిగిన వివాహము వర్ణింపఁబడినది. తరువాత మనుష్యవివాహవిధి వర్ణింపఁబడెను.

ప్రౌఢలై వరసమాగమకాంక్షిణు లగువధువులు మాత్రమే వివాహ యోగ్య లగుదురు. స్త్రీచిహ్నము లంకురింపక రజోవతులు కాక యుండు కన్యలుమాత్రమే పితృగృహమున నుండఁదగుదురు. వరుని మిత్రులు వధువు తండ్రివద్దకు వచ్చి కన్య నర్థింతురు. కన్యాదాత వరునిసుగుణములను దెలిసికొని యతనికిఁ దనకన్నె నియ్య వాగ్దానము చేయును. తరువాత శాల్మలీకింశుకద్రుమ ములచే నిర్మింపఁబడినదియుఁ జక్కఁగా నలంకరింపఁబడినదియు రెండెడ్లను బూన్చి నదియు నగురథమమీఁద వధువును గూర్చుండఁబెట్టి పతిగృహమునకుఁ బంపును. తండ్రి కూఁతురి కిచ్చుగోవులను దక్షిణవస్తువుల నాబండి వెంటఁ బంపును.

వివాహము కన్యయింటఁ గాని వరునియింటఁగాని జరిగెడిది. దానికి నియ మము లేదు. పెండ్లికి బంధుమిత్రాదు లందఱును విచ్చేయుట కలదు. వివాహ సూచకముగా వరుఁడు వధువుహస్తము పట్టుకొనును. అదియే పాణిగ్రహణ మని వివాహనామాంతరముగా నేఁటికిని వాడఁబడుచున్నది. వరుఁ డట్లు కన్యచేయి పట్టుకొని "కళ్యాణీ ! నీకు సౌభాగ్యమును నాకు గార్హపత్యమును గలుగుటకును, నీవు నాతో వార్ధకము గడచునట్లు కడవఱకు నుండుటకును, నీపాణి గ్రహించు చున్నా'నని పల్కును. పెద్దలు వధూవరుల నాశీర్వదింతురు. అగ్నిలో సమంత్రక ముగా వరుఁ డాజ్యాదిహోమములు చేయును.

వివాహానంతరము వధువును రథముపై నెక్కించి పతిగృహమునకుఁ బ్రయాణము చేయింతురు. "నీవు భర్తృగృహమున స్వామినివై ప్రజావతివై నీభర్త కనుకూలురాలవై యుండు'మని వధూబంధువు లాశీర్వచన పూర్వక ముగా హితోక్తులు చెప్పుదురు.

వధూప్రయాణమందు మార్గమధ్యమునఁ బొలిమేరలు తోఁటలు చతు ష్పథములు వచ్చినచోట్లఁ గొన్నిమంత్రములు జపింతురు. వధువు పతిగృహ మునకు వచ్చినపిదప గృహప్రవేశాంగహోమములు చేయుదురు.

1. ఋ. 10.85.

నూతనవధువు ధరియించిన వస్త్రము కృత్యారూప మైనది. దానిని విడిపింతురు. ఆవస్త్రమును వరుఁడు స్పృశింపరాదు. ఇత్యాదిగా నున్నవివాహతంత్రమంతయు నించుమించుగా నాఁడు జరిగినట్లే నేఁడును యథోక్తముగా బ్రాహ్మణులలో మాత్ర మన్ని దేశములందును జరుగుచున్నది. ఆవిధానములోని కొంత కొంత తక్కినజాతులందు క్రమముగా లోపించినది.

ఇపుడు వివాహసమయమునఁ బఠించు ప్రధానమంత్రము లన్నియు నీసూక్తములోనివే. అందు వరుఁడు వధువునుగూర్చి పల్కు కొన్ని మాటలు.

"అర్ధాంగీ! శుభప్రద మైననడవడి కలిగి సంచరింపుము. ఎన్నఁడును, కోపదృష్టితో నుండకుము. పతికిఁ గీడు తలంపకుము. మంచిమనస్సుతోను మంచి రూపముతోను శుచిగా నుండుము. మనపశువుల హితము కోరుచుండుము—వీరు లయినపుత్రులను గనుము. అత్తమామలను బరిచర్యచే రంజింపఁజేయుము. మఱఁదుల నాదరమున రంజింపఁజేయుము. ఆఁడుబిడ్డల నాదరింపుము."

స్వయంవరము:—ఇది ప్రాచీనకాలమున నాచరణలో నున్నట్లు పెక్కువర్ణనలు కనరావుగాని యొక బుక్కులోని యుత్తరార్ధము మాత్రము విస్పష్టముగా దీనిని దెలుపుచున్నది.

"భద్రా వధూ ర్భవతి య త్సుపేశాః స్వయం సా మిత్రం వనుతే జనే చిత్[1]."

కల్యాణియు సౌందర్యోపేతయు నగువధువు జనమధ్యమందు కూర్చుండి యుండునట్టియుఁ దనకిష్టుఁడైనట్టియు నొకని భర్తనుగాఁ గోరుచున్న దని యీమంత్రమునర్థము. సాయణాచార్యులు దీనికి భాష్యము వ్రాయుచు 'స్వయంవరధర్మేణ ప్రార్థయతే' యని భావము వ్రాసియున్నారు. కాని యిది సర్వజాతిసామాన్యముగా నుండెడిదో, లేక క్షత్రియజాతియందు మాత్రమే యుండెడిదో నిర్ణయించుట కవకాశము లేదు గాని తరువాత నిది రాజకన్యలకు మాత్రమే విహిత మైన దనుట ధర్మశాస్త్రప్రసిద్ధము.

అనులోమవివాహము ఋగ్వేదకాలమున నాచరణలో నుండెడి దనుటకు రథవీతి యనురాజర్షి కూఁతురిని శ్యావాశ్వుఁ డనుబ్రహ్మర్షి పరిణయమగుట మొదలుగా ననేకోదాహరణములు కలవు. విలోమవివాహములకు యయాతి దేవయానిని బెండ్లాడుట యనునది యుదాహరణ మగునుగాని యీవిషయము ఋగ్వేదమున వర్ణింపఁబడలేదు. కాని యయాతిపేరును, అతని పుత్రులుగా నితిహాసాదులఁ గనవచ్చు యదుతుర్వశాదులపేళ్లును ఋగ్వేదమునఁ గలవు. అందుచే నా

1. ఋ. 10-27-12.

కాలమందు క్వాచిత్కముగా విలోమవివాహ ముండెనేమో యని యూహింప వలసియున్నది కాని వేదములోని యయాత్యాదులును బురాణములలోనివారు నొక్క రేయని నిర్ణయించుట కష్టసాధ్య మగును.

దాయార్హత:—ఒకగృహస్థు పుత్రులు లేనివాఁ డయినచో నతనికూఁతురు దాయాద యగును. ఆకూఁతురికొడు కతనికిఁ బుత్రతుల్యుఁ డగును. అన్న దమ్ములు లేనికన్యను దానముచేయునపుడు "నేను సాలంకృత నైనకన్యను నీకు దానముచేయుచున్నాను. దీనియందు నీకు జన్మించినవాఁడు నాకుఁ బుత్రుఁ డగు'నని ముందుగా వరునితోఁ జెప్పి వివాహము జరిగించును. అట్టిదౌహిత్రుఁడు పుత్రప్రాయుఁడై మాతామహులపరలోకక్రియలకుఁ గర్త యగును. పుత్రులు లేనిచోటనే పుత్రిక దాయాద యగును గాని పుత్రు లుదయించినచో నామెకు దాయార్హత లేదు[1].

అంత్యక్రియాచారములు:—[2]. ఋగ్వేదకాలమందు శవఖననము తొలుత నున్నను వెంటనే దహనాచారము ప్రబలినది. మృతకళేబరమును శ్మశానవాటికకుఁ గొనుపోవునపుడు బంధుమిత్రాదులు దానివెంటఁ బోవుట గలదు. భర్త మృతుఁ డయినపుడు భార్యకూడ ననుయాయినియై శ్మశానమునకుఁ బోవుట యాచారము. సహగమనమున కుద్యుక్తురా లయినయట్టిస్త్రీని మఱఁదిగాని యంతేవాసిగాని ముసలిసేవకుఁడుగాని సమీపించి నీపుత్రాదులను జూచుకొని యీస్థలము విడిచి రమ్మ, అని మెల్లగా బోధించి యచ్చటినుండి లేవఁదీసికొని వచ్చును. దీనినిబట్టియే యీకాలమున సహగమనము కల దని కొంద ఱూహించు చున్నారు. మృతుని జ్ఞాతులను సంబోధించి 'మీ పెద్ద లందఱును పితృయాణ మార్గమును విడిచి యీ దేవయానమార్గమునఁ బరలోకమున కేగిరి. కావున మీరు చిరకాలజీవులై యజ్ఞాది క్రతువు లాచరించి పుత్రపౌత్రాదులతో నభివృద్ధిచెంది సకల దురితక్షయమునఁ బరిపూతులై యుండుఁ' డనియొక పెద్ద బోధించును. ఆశౌచము తొలఁగిపోయినదినమున దేవాహ్వానరూప మైనపితృమేధము జరుగును.

మృతునిపుత్రాదులకు శీఘ్రమరణము సంభవింపకుండుటకును, వారు సుఖజీవులై శతవత్సరములు భూమిపై నుండుటకును మృత్యుపరిధానభూత మైన యొకపాషాణమును స్థాపించుట నాఁటియాచారము. దాని ననుసరించి కర్మజ్యేష్ఠుఁ డగువాఁడు మృత్యుదేవతను గప్పిపుచ్చుటకై యొకఱాతిని సమంత్రకముగా స్థాపించును.

1. ఋ. 3-31-1, 2.—2. ఋ. 10-18.

క్షత్త్రియుఁడు మృతుఁడయినపు డతనిచేతిలోని ధనుస్సును గర్మజ్యేష్ఠుఁ డగువాఁడు గ్రహించి 'నీ వీస్థానమున నుండుము. మేము సువీరులమై పుత్ర పౌత్త్రాదియుక్తులమై యీలోకమున శత్రువులను జయింతు' మని పలుకును.

దీక్షితమరణమునందు మృతసంస్కారాది క్రియాకలాపము జరిగినపిదప నతని యస్థు లొకచోఁ బాతిపెట్టుచుఁ గొన్నిమంత్రములు పఠించుట యాచారము[1]. ఆతంత్ర మిపుడు నద్యాదులలో విడిచిపెట్టుటగాఁ బరిణమించినది. మొత్తముమీఁదఁ బితృమేధప్రక్రియ యంతయు ననుస్యూతముగా నాఁటినుండి నేఁటివఱకు నల్లే వచ్చుచున్న దనుటయే వైదిక కర్మమార్గమందలి మహత్త్వము తెలుపఁజాలును. పితృయజ్ఞము పితృదేవతాత్వము నత్యంత మొకసూక్తమున వర్ణింపఁబడినవి[2].

ధర్మాచరణము:—[3] అన్నదాన మత్యుత్తమము. ఆఁకలి గొన్నవాని కన్నము పెట్టనివాఁడు మృతప్రాయుఁడు. అతని నిహమందు బంధువు లాదరింపరు. పరమందు దేవత లాదరింపరు. క్షుధార్తున కన్నదానము చేయువాఁడును దరిద్రునకు ధనదానము చేయువాఁడును బుణ్యలోకము గాంతురు. అది గాక ధన మొక్కచోట నిలుచునది కాదు. అది రథచక్రమువలెనే తిరిగి పోవుచుండును. కావున నది యున్నపుడే దానము చేసి ఫలము గాంచుట యుచితము. అనురీతిని దాన మెంతేని పొగడఁబడినది.

ఆకాలమందలి ప్రజలు సత్యసంధులు న్యాయబద్ధులు సత్కర్మాచరణపరతంత్రులు నకుటిలవర్తనులు నై జీవయాత్ర యొనరించుచుండెడివా రనుటకు ఋగ్వేదములో నెల్లెడ నుదాహరణములు లభించును. 'సా మా సత్యోక్తిః పరి పాతు విశ్వతః' సత్యవచనము నన్ను సర్వవిధముల రక్షించుఁగాక యనెడి యా నాఁటివిశ్వాసము వారిసత్యప్రియత్వమును వేనోళ్లఁ జాటుచున్నది[4]. మఱియు నాంగిరసుఁ డయిన బృహస్పతిమహర్షి రచియించినవిద్యాసూక్త మొకటి[5] నాఁటి విద్యావివేకపద్ధతి నెంతయు విశదీకరించుచున్నది. అందలి వాక్యము లొకటి రెండు.—

"జల్లెడతోఁ బిండి జల్లించునట్లుగా నెవరు శబ్దార్థములను మనస్సునఁ బరిశోధించి సభలో సంభాషింతురో, అట్టి బుద్ధిమంతు లగువిద్వాంసులు సమాన శాస్త్రప్రతిపత్తికలవారై పరస్పరము సఖ్యమును బొందుచున్నారు. అట్టివారి వాక్కులందు శుభప్రదమైనవిజ్ఞానలక్ష్మి నివసించు నని తెలియనగును" "ఎవఁడు మనస్సుచేఁ బర్యాలోచనచేయుచునే మాటలభావము కనిపెట్టఁడో, ఎవఁడు విను

1. దీనినిబట్టి నాఁడు శవఖననము గల దని కొందఱు తలంచిరి కాని యది పొరపాటు. అది సంచితాస్థిఖనన మని సాయణులవారు వ్రాసియున్నారు. 10-18-10.

2. ఋ. 10-14.—3. ఋ. 10-117.—4. ఋ. 10-37-2.—5. ఋ. 10-71.

చునే మాటలు వినిన ట్లుండఁడో, అట్టివాఁడు తెలివిమాలినవాఁడు. బుద్ధిమంతుఁడగుఁవిద్వాంసుఁడో, అట్లుగాక, మంచిచీర కట్టుకొని శయనసమయమునఁ దన ప్రక్కఁ జేరినయనురక్తురా లగుభార్యను భర్త విస్పష్టముగాఁ జూచి యానందించునట్లే మాటలను జక్కఁగాఁ గనిపెట్టును, సరిగా వినును, బాగుగాఁ దెలిసికొనును."

ఇట్లు వాగ్విజ్ఞానమును బ్రశంసించు నీవిద్యాసూక్త మంతయు వేదము చదివి వేదార్థ మెఱిఁగి సభలలో సంభాషింపఁదగిన వేత్తృత్వ మార్జింపఁదగునని బోధించుచు నతిమనోహరముగా నున్నది. ఇందలి వేదార్థానభిజ్ఞనిందాపరమయిన కడపటివాక్యము లిట్లున్నవి.

"వేదజ్ఞులతో సంచరింపక దేవతల నారాధింపక యుండునట్టి విద్యావివేకశూన్యులు బ్రాహ్మణులు కారు, ఋత్విక్కులును గారు. కేవలలౌకికవాక్కు నాశ్రయించినయట్టివారు హాలికులై వ్యవసాయము చేసికొనుచు నుందురు."

స్త్రీ—ప్రాచీనకాలమందు సంఘమునస్త్రీకత్యంతగౌరవ మున్నట్లు ఋగ్వేదము విశదీకరించుచున్నమాట నిజము. యఁజ్ఞాదులయందు పురుషులట్లు యాజమాన్యము వహించి భాగస్వామిను లగుదురు. వారును విద్యాభ్యాస మొనర్తురు. గృహములందు స్వతంత్రలై గృహిణీ ధర్మములు నిర్వహింతురు. పురుషులతోఁ గూడఁ బోరాటముల కేగి వారికి సహాయపడుదురు. వేయేల? పురుషుల యైహికాముష్మికములకు స్త్రీలే సాధనభూతురాం డ్రగుదురు. ఈ స్త్రీధర్మములన్నియు నందు సర్వత్ర వర్ణింపఁబడియున్నవి. కాని యర్వాచీనకాలమందు కాఁబోలు, స్త్రీనింద గూడ నించుక కొన్ని ఋక్కులలోఁ దలచూపినది[1].

"స్త్రీహృదయము ప్రబల మగుటచేఁ బురుషునికి శాసింప శక్యముకానిదగును."

"స్త్రీలసఖ్యములు స్థిరములు కావు. అవి సాలావృకముల హృదయములవంటివి." ఇత్యాదులు కొన్ని సందర్భవిశేషములఁ గలవు.

తత్వజ్ఞానము:—ఋగ్వేదము యజ్ఞక్రియార్థ మైనస్తుతిరూపమంత్రరాశి యని యాజ్ఞికపక్షము చెప్పుచున్నను, పరిశీలించినచోఁ దరువాత వెలువడిన సకలశాస్త్రేతిహాసపురాణాదులకు బీజభూతము లైనవాక్యము లన్నియు నందు గోచరించును. మఱియు నర్వాచీనము లైనవివిధవేదాంతములకు నాధారభూతములైన ఋక్కులు నందు వెదకినకొలఁదిని బయల్పడును. అట్టి మహాక్షీరవారాశి యగుఋగామ్నాయమును శ్రద్ధాభక్తి సమన్విత మైన ప్రజ్ఞావిశేషమునఁ దరిచి యందలి వివేకామృతము గ్రోలవలసినదే కాని యందలి బిందువులు కొన్ని

1. స్త్రియా అశాస్యం మనః, 8-33-17-న వై స్త్రైణాని సఖ్యాని సంతి సాలావృకాణాం హృదయాన్యేతా. 10.95-15.

రుచిచూచినంతమాత్రమునఁ దనివి తీఱదు. అయినను ఋగ్వేదమునాఁటి తత్త్వ విచారణ మిట్టి దనుటకుఁ గొన్ని ఋక్కులభావ మిందు తెలిపెదను.

దీర్ఘతమోమహర్షి సృష్టిపూర్వావస్థను జీవేశ్వరులనుగూర్చి యిట్లు విచారణ గావించియుండెను[1].

"కాలాధీన మైనప్రపంచమునకుఁ బరమేశ్వరుఁడు కారణభూతుఁడు. జాయమాన మైనయీప్రపంచ మంతయు సృష్టికిఁ బూర్వ మీశ్వరాయత్త మైనమాయయం దిమిడి యున్నది. కావున దానియవ్యాకృతావస్థనుగాని సృష్టికిఁ గారణభూతుఁ డైనయీశ్వరునిగాని చూచినవాఁ డెవఁడును లేఁడు. అది గాక, పంచభూతాత్మక మైనశరీరమునఁ బ్రవేశించినపురుషుఁ డీశ్వరునికంటె నన్యుఁడు కాని యపుడు ద్రష్ట వేఱుగా నెక్కడ నుండును ?

"ఏకవిధ మైనగమనము నేకవిధ మైనరూపమును గలరెండుపక్షు లొక్క వృక్ష మాశ్రయించి నట్లుగా నైకాత్మ్యసంబంధము గలక్షేత్రజ్ఞపరమాత్ము లిద్దఱు నొక్కదేహము నాశ్రయించి యుండిరి. వారిలో జీవాత్మ కర్మఫల మనుభవించుచున్నాఁడు. పరమాత్మ కర్మఫలము ననుభవింపక యూరక చూచుచున్నాఁడు." ఈఋగర్థము జీవేశ్వరభేదము తెలుపునది గా దని సాయణాచార్యులద్వైతపరముగా దీనిని సమన్వయించి యున్నారు.

"నిజముగా శరీరము నధిష్ఠించియున్నవాఁడు పరమాత్మ యొకఁడే. పక్షిద్వయదృష్టాంతమునుబట్టి జీవేశ్వరులు వే ఱని తలంపరాదు. అది యౌపాధికభేదము కాని వాస్తవము కాదు. 'సఖాయా' అనుటచేఁ బరమాత్మకేఖ్యానము కలదో, అదియే జీవాత్మకుఁ గూడఁ గల దని తెలియవచ్చుచున్నది గావున నేకరూపప్రకాశు లగువా రిరువురికి నైకాత్మ్య ముపపన్న మగుచున్నది. అందుచే జీవేశ్వరులకు వాస్తవభేదము కూడఁ దొలఁగిపోవుచున్నది. శరీరమందు నిగూఢుఁడై యున్నపరమాత్మ తా నీశ్వరుఁ డయ్యు ననీశత్వబుద్ధిచే మోహము చెంది నేను కర్తను నేను సుఖిని నేను దుఃఖి ననుచు జననమరణము లనుభవించుచున్నాఁడు. తా నెపుడు తన్నుఁ దెలిసికొనుచున్నాఁడో యపుడు వీతశోకుఁడై దేహవ్యతిరిక్తుఁడై సర్వాత్మత్వసర్వజ్ఞత్వాదిమహిమలను గాంచుచున్నాఁడు. లౌకిక దశయందు కర్మఫల మనుభవించెడి యీపరమాత్మయే పారమార్థికదశయందు తనయం దధ్యస్త మైనజగత్తును సాక్షిత్వముచే నీక్షించుచున్నాఁడు. కావున నిజముగాఁ బరమేశ్వరుఁ డొక్కఁడే. భేదము మోహాకృత మనుట ప్రసిద్ధము." సకలోపనిషద్భాష్యములందును గ్రోడీకరింపఁబడినయీ ఋక్కిది.

---

1. ఋ. 1-164-4, 20, 38, 39.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానంవృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥

మఱియును ఋషి యిట్లు వివరించుచున్నాఁడు.

"ఆత్మ మరణధర్మమైన దేహముతోఁ గలిసి దేహాత్మత్వభ్రాంతిని జెంది సుకృతదుష్కృతము లాచరించుచుఁ దత్తత్ఫలము లనుభవించుచున్నాఁడు. స్థూలసూక్ష్మోభయశరీర పరిగ్రహమున గుణత్రయాన్వితుఁడై సంసారమునఁ బరిభ్రమించునతఁడు పరమాత్మయే కాని యన్యుఁడు కాఁడు. అయినను, కర్మవాసనా పరీతుఁడై తన్ను దేహాతిరిక్తునిగాఁ దెలియఁజాలకున్నాఁడు. సోపాధికుఁడైన యతఁడే వివేకమున దేహాతిరిక్తుఁడైనయాత్మ కలఁడని భావించుచున్నాడు. కాని దేహవ్యతిరిక్తుఁడైనయాత్మ తానే యని తెలిసికొనఁ జాలకున్నాఁడు. అందుచే నాత్మజ్ఞానము దుర్లభ మగుచున్నది. కాని జీవాత్మకుఁ బారమార్థిక రూపము కలదు.

ఋగాదివేదవేద్యుఁడు ననశ్వరుఁడు సర్వాధిష్ఠానరూపుఁడు సర్వవ్యాపకుఁడు నయినపరమాత్మయందు సకలదేవతలు సకలవేదములు నధివసించియున్నవి. ఎవఁ డట్టియక్షరరూపుఁ డయినపరమాత్మను దెలియఁజాలఁడో వాఁడు ఋగాదివేదములచేఁ గాని తదుక్తకర్మలచేఁ గాని యేమిచేయును? ఎవరు నిత్యుఁ డయిన యా వేదవేద్యుని దెలిసికొందురో వారే జ్ఞాతలై పునరావృత్తి రహితమైనబ్రహ్మత్వమును బొందుచున్నారు."

ఇత్యాదిగా నీసూక్త మంతయు జీవాత్మపరమాత్మస్వరూపమును, తదైక్యమును బోధించుచున్నది. ఇందలి కొన్నిఋక్కులకు సాయణులవారాయా మతములవారియభిప్రాయములను గూడ వివరించుచు భాష్యము వ్రాసియున్నారు. భువనపుత్రుఁడైన విశ్వకర్మ యనుఋషి సృష్ట్యాదుల నిట్లువర్ణించుచున్నాఁడు.

ప్రలయకాలమునఁ బరమేశ్వరుఁడు సకలప్రపంచ ముపసంహరించి తరువాత మరల సృజింపఁదలఁచి సర్వము సృజించి యందు ప్రవిష్టుఁడై యుండెను." అని సృష్టిని నిరూపించి 'ఈశ్వరుఁడు జగదాశ్రయభూమ్యాకాశముల కుపాదాన కారణమైనసమయమం దధిష్ఠాన మేది? ఆరంభణ మేది? యని శంకించుకొని "విశ్వతోముఖుఁడు విశ్వవ్యాపకుఁడు విశ్వరూపుఁడునైనపరమేశ్వరుఁడు తనయందే త్రైలోక్య ముత్పాదించె'ననుచుఁ బ్రశ్నోత్తరరూపమున నద్వితీయపరమేశ్వరత్వమును సాధించెను.

1. ఋ. 10-81.1, 2, 3, 4.

పరమేష్ఠి యను ప్రజాపతిమహర్షి వియదాదిభావము లయినసృష్టిస్థితిలయములకుఁ బరమేశ్వరుఁడే కర్త యని నిరూపించియున్నాఁడు. ఏడు ఋక్కులతోఁడి యీసూక్త మంతయు "ఈసృష్టికిఁ బూర్వము సృష్టి యున్నది. తత్సంహారమునకును పునస్సృష్టికిని బరమేశ్వరుఁడే కారణము. అనుచు నత్యంతము భావగంభీరము లగుఋక్కులచేఁ దత్త్వ మావిష్కరించియుండెను. మతత్త్రయమున కవకాశము గలిగించెడియీవాక్యముల భావమును బాఠకలోకము భాష్యములవల్లఁ దెలిసికొనునుగాక యని యందలిముఖ్యము లైనకొన్నిఋక్కులు మాత్రముక్రింద నుదాహరించితిని[1].

ఇట్లే సృష్టిక్రమము పూర్వజన్మను మరణానంతరజీవుఁడు పరమేశ్వరోపాసనము కైవల్యము మొద లగుతాత్త్వికవిషయములను, బహువిధము లైన నైహికవిషయములను బోధించెడిఋక్కు లెన్నేని యందందు గలవు. గ్రంథవిస్తరభీతిచే వాని నెల్ల నిం దుదాహరింపఁజాలక, ఖండాంతరవాసులు గూడఁ దమభాషలలోని కనువదింపఁబడిన ఋగ్వేదమును బఠించి ప్రాచీనభారతీయార్యులవిజ్ఞానసంపదకు వాశ్చర్యపరీతమానసు లగుచున్నారనుట యెఱిఁగియైనను మనవారు ఋగ్వేదవిషయములు గ్రహించి యానందింతురుగాక యని వారికి విఙ్ఞచుచున్నాను.

ఇఁక శక్తికొలఁదిఁ బరిశీలించిన ఋక్సంహితాచరిత్రము ముగించుచు మంగళాంతముగా నైకమత్యము బోధించెడి కడపటిఋక్కు నుదాహరించుచున్నాను.

సమానీవ ఆకూతిః సమానా హృదయాని వః ।
సమాన మస్తు వో మనో యథావః సుసహాసతి ॥

ఇది ఋత్విగ్యజమానులను సంబోధించి చెప్పఁబడినదిగా భాష్యకర్త లర్థమువ్రాసినను, ఈ మంత్ర మందఱికి సన్నికార్యములం దుపదేశింపఁదగిన దివ్యనీతి యని భావింపవచ్చును. దీనియర్థ మిది:—

---

1. ఋ. 10-129.

"నాసదాసీ న్నోసదాసీ త్తదానీం నాసీ ద్రజో నో వ్యోమాపరో యత్ ।
కి మావరీవః కుహ కస్య శర్మ న్నంభః కి మాసీ ద్గహనం గభీరం ॥"
కో అద్ధా వేద క ఇహ ప్రవోచ త్కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః ।
అర్వా గ్దేవా అస్య విసర్జనేనాథా కో వేద యత ఆబభూవ ॥
ఇయం విసృష్టి ర్యత ఆబభూవ యదివా దధే యది వాన ।
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ త్సో అంగ వేద యదివా నవేద ॥"

ఆర్యులారా ! ఎట్లు మీ యందఱికిని శుభప్రదమైన కూడిక సంభవించునో, అట్లు మీ సంకల్ప మేకవిధ మగుఁ గాక. మీహృదయము లేక మగుఁ గాక. మీ యంతఃకరణము లేకీభవించుఁ గాక.

ఇది హారితసగోత్రపవిత్ర మల్లాది శ్రీ వెంకమాంబా శ్రీ రామావధాని
పుత్ర సూర్యనారాయణశాస్త్రి ప్రణీతమైన సంస్కృతవాఙ్మయ
చరిత్ర యందలి ప్రథమభాగమగు వైదికవాఙ్మయమునఁ
బంచమాధ్యాయము.

---

# షష్ఠాధ్యాయము.

## సామసంహిత.

దీనినిగూర్చి చతుర్థాధ్యాయమున నించుక ముచ్చటించి యున్నాము. వేద సంహితలలో నిది రెండవదిగాఁ బరిగణింపఁబడుటకు ఋగ్వేదముతో దీని కెక్కువగా నున్న తాద్రూప్యసంబంధమే ముఖ్యకారణము. ఇందలి మంత్రములలో ౭౫ తప్పఁ దక్కిన వన్నియు ఋక్సంహితలోనివే కాని క్రొత్తవి కావు. ఇందు ఋగ్వేదాష్టమ నవమమండలములలోనిఋక్కు లెక్కువగాను, తక్కిన కొన్ని మండలములలోని ఋక్కులు తక్కువగాను ఋషిచ్ఛందో దైవతములతోఁ గూడ సరిగా నట్లే కనఁబడుచున్నవి. కావున సోమయాగమునఁ బఠింపఁ దగినక్రమము ననుసరించి వేఱుగాఁ గూర్పఁబడిన కొన్నిఋక్సంహితా మంత్రములే సామసంహిత యని చరిత్రకారుఁడు చెప్పకతప్పదు కాని, ఋగ్వేదమంత్రములు సంహితా రూపము తాల్చక ముందే యందలి కొన్నిమంత్రములు గానరూపము దాల్చి సామసంహితలోని పూర్వార్చిక మయ్యె నేమో యని తోఁచుచున్నది. ఎట్లయిన నేమి ? ఋఙ్మంత్రస్వరముకంటె విలక్షణమును శ్రావ్యమును మనోహరము నైన గానస్వరమును దానినిబట్టివచ్చిన యుచ్చారణభేదమును, ప్రవచనభేదమును బట్టి వచ్చినకొన్నిపాఠభేదములును యాగమునందు ప్రత్యేకోపయోగమును, దాని నుండి వేఱుపఱిచి దీనిప్రత్యేకతను స్థాపించినవి. అందుచే నిది ప్రత్యేకసంహిత యైనను ఋక్సంహితవలెఁ జరిత్రదృష్టిలోఁ బ్రాధాన్యము వహింపలేదు. అయినను గేయధర్మమున మహామహత్త్వము వహించినయిది యనేకశాఖోపశాఖలై వైదికవాఙ్మయమున నగ్రస్థాన మధిష్ఠించియున్నది. తరువాత వెలువడిన సంగీత శాస్త్రమునకు మార్గదర్శక మైనదీనిగానలక్షణమే దీనిగొప్ప కంతకును గారణ మనుట విదితము. ఈశ్వరుఁడు సామగానలోలుఁ డనుట ప్రసిద్ధముగదా! అనఁగాఁ బ్రాచీనమహర్షులు సకలజగదాత్మకుఁ డగుపరమేశ్వరుని యనుగ్రహమునకుఁ బాత్రు లగుటకై గానస్వరము కల్పించి యీ ఋక్కులను యాగములందు గానముచేయుచుఁ దద్రసాస్వాదపరవశులై యాత్మానంద మనుభవించెడివా రనుట. సామసంహితా మహత్త్వమున కింతకంటె వేఱేమి కావలెను ?

## సామసంహితా విభాగము.

దీనివిభాగములు మిక్కిలి గజిబిజిగా నున్నవి. కావున నిందలి భాగములను రెండుపద్ధతులుగాఁ జూపుచున్నాను. ఈ రెండు పద్ధతులుగూడఁ బ్రాచీనములే కాని యందు రెండవపద్ధతి యించుక సులభముగాఁ గనవచ్చుచున్నది.

౧. సామసంహిత, పూర్వార్చిక ఉత్తరార్చిక యని రెండుప్రధాన భాగములుగా నున్నది. అందు పూర్వార్చిక ౫ అధ్యాయములు ౫౯ ఖండములు. అనఁగా మొదటి నాలు గధ్యాయము లొక్కొకటి పండ్రెండేసి ఖండములు. అయిదవయధ్యాయము పదునొకండు ఖండములు. పూర్వార్చికకు - ఛందస్సు ఛంద ఆర్చికము - అని నామాంతరములు కలవు.

ఉత్తరార్చిక ౨౧ అధ్యాయములు. ౧౨౦ ఖండములు. ఇం దధ్యాయముల ఖండముల లెక్క నియతముగా లేదు. కడపటియధ్యాయ మొక్కటే ఖండము. తక్కినవానిలో నాలుగుమొదలుగాఁ బన్నెండువఱకు ఖండములు యథేష్టముగా నున్నవి. ఉత్తరార్చిక కుత్తర యని నామాంతరము.

౨. పూర్వార్చిక ౬ ప్రపాఠకములు. అం దొక్కొకటి రెండేసి యర్ధములు. అర్ధ మనఁగా నర్ధప్రపాఠక మని యర్థము. ఒక్కొక్కయర్థమున నైదేసి దశతు లున్నవి. పన్నెండవ యర్ధమున మాత్రము నాలుగుదశతులే యున్నవి. దశతి యనఁగాఁ బదిబుక్కుల సముదాయ మని యర్థము. కాని కొన్నిదశతులలోఁ బదేసిబుక్కులు కనరా కున్నవి. ఎనిమిది, తొమ్మిది, పన్నెండు, చొప్పున బుక్కులు గలదశతులు గూడఁ గొన్నిగలవు. దశతి శబ్దార్థమునకు భంగము కలిగించెడి యీభేద మెట్లువచ్చినదో చెప్పఁజాలము గాని మొత్తము ౬౦౦ బుక్కు లుండవలసియుండఁగా ౫౮౫ బుక్కులుమాత్రమే లెక్కకు వచ్చుచున్నవి.

ఉత్తరార్చిక ౮ ప్రపాఠకములు. మొదటియైదు ప్రపాఠకములు రెండేసి యర్ధములు. తక్కిననాలుగుప్రపాఠకములు మూఁడేసి యర్ధములు, ఒక్కొక యర్ధమున ననియతసంఖ్య గలసూక్తములు గలవు. అవి ౪౦౨ లెక్కకు వచ్చినవి. వానిలో నొక్కొకసూక్తము మూఁడుబుక్కులతో నిబద్ధమై యున్నది. ఆ బుక్కుల మొత్తము ౧౨౦౬.

పై లెక్కలనుబట్టి రెండుభాగములలోని బుక్కులు ౧౭౯౧ అని తేలినది[1]. ఇందు ౨౬౧ బుక్కులు పునరుక్తములు. వాని నొక్కమాఱే గణించుట యుచితముగావున సామసంహితలోని బుక్కులసంఖ్య ౧౫౩౦ అగుచున్నది[2]. కాని వీబరుపండితుఁడు ౧౫౪౯ అని వచియించెను. లేఖనముద్రణాది ప్రమాదమున ౧౯ బుక్కులు పోవుటయో పెరుఁగుటయో సంభవించియుండును. అముద్రితగ్రంథములలో గ్రంథాంతమున నధికముగా వ్రాయఁబడిన కొన్నిబుక్కు

1. వీబరుపండితుఁ డిచ్చినలెక్కప్రకారము ౧౮౧౦ బుక్కుల మొత్తము.

2. ౨౪౯ బుక్కులు పూర్వార్చికలోనివి మరల నుత్తరార్చికలోఁ బఠింపఁబడినవి. వానిలో మూఁడు బుక్కులు రెండుసార్లు పఠింపఁబడినవి. ఉత్తరార్చికలోని తొమ్మిది బుక్కులు రెండుసార్లు వచ్చినవి. మొత్తము ౨౬౧.

లందందు గనవచ్చుచున్నవి. అట్టివి కలసినను మంత్రసంఖ్య యించుక పెరుఁగ వచ్చును. ఇది యిట్లుండ నీక సంహితా విశేషములు:—

పూర్వార్చికలోని మొదటియధ్యాయము పండ్రెండుఖండము లాగ్నేయ కాండముగాను, రెండుమూఁడునాలు గధ్యాయముల ముప్పదియాఱుఖండము లైంద్రకాండముగాను, అయిదవయధ్యాయము పదునొకండుకాండములు పవమానకాండముగాను, పేర్కొనఁబడినవి. అందు మొదటికాండ మగ్నిని రెండవది చాలవఱ కింద్రుని మూఁడవది సోమమును స్తుతింప వినియుక్తము లగుచున్నవి. కాండమునకుఁ బర్వ మనునామాంతరమును వాడఁబడినది. పవమానపర్వమునకు సౌమ్యపర్వ మనియుఁ బేరు కలదు. నాకు లభించిన కలకత్తాముద్రితపుస్తకమం దీమూఁడుకాండముల గ్రంథముమాత్రమే పూర్వార్చికగాఁ గనవచ్చినది గాని, చెన్నపురితంజావూరు పుస్తకభాండాగారములలోని యముద్రితసామసంహితా పుస్తకములవలన - ఆరుణము - శుక్రియము - మహానామ్ని - అను మఱిమూఁడు భాగములు పూర్వార్చికకు సంబంధించినవి గాఁ దెలియుచున్నది. అందును మహానామ్నీభాగమును గొన్నిపుస్తకములు పూర్వార్చికకుఁ జేర్చినవి. కొన్ని చేర్చ లేదు. దానినిబట్టి యది వేఱుభాగముగాఁ గనఁబడు చున్నది. కాని సామవేద గాన పుస్తకములలోఁ బూర్వార్చికకు సంబంధించిన ప్రకృతిసామములలో నారుణశుక్రియములవలెనే మహానామ్నియుఁ జేరినట్లు పెక్కుప్రతులలోఁ గనఁబడుచున్నది. దీనినిబట్టి యీమూఁడుభాగములును సంహితలో గణింపఁబడక ప్రకృతిలో గణింపఁబడిన వని తెలియుచున్నది. ఇందుకు భాష్యకర్త యగు భారతస్వామి వచనముగూడఁ బ్రమాణ మగుచున్నది.

"ఆగ్నేయ మాద్యం పరైవైంద్ర పవమానే తతః పరే।
త్రిపర్వసామవేదస్య సంహితైవ మధీయతే॥"

ఇట్లీయన మూఁడుపర్వములే సంహిత యని వచించియు నారుణ శుక్రియ మహానామ్నీభాగములనుగూడఁ బూర్వార్చికతోఁ జేర్చియే భాష్యము వ్రాసెను. మహానామ్నికి శక్వరి యనునామాంతరము కలదు.

ఉత్తరార్చిక పూర్వార్చికకు సమకాలికము కాక యర్వాచీన మనుట నిజము. భగవద్గీతల కుత్తరగీతలు తరువాత వెడలినట్లుగా ఛందస్సునకుఁ దరువాతఁ గొంతకాలమున కుత్తరభాగము వెలువడినది. ఇది బయలుదేఱినపిదప ఛందస్సు లేక ఛందఆర్చికకుఁ బూర్వార్చికయనుపేరు వచ్చినది. నిజముగా మొదటిసంహిత యాగ్నేయైంద్రపవమాన కాండములు మాత్రమే యని పూర్వోక్తభారతస్వామివచనముగూడ సాక్ష్య మిచ్చుచున్నది. కాని దానికి వెనువెంట బయలుదేఱిన యారుణశుక్రియములు ముందుగాను, తరువాత వెలువడిన మహానామ్ని తరువాతను బూర్వార్చిక కనుబంధము లైనవి. వీనికి సమకాలిక

ముగా నో యించుక తరువాతనో యుత్తరభాగ ముదయించినది. ఇందుకుఁ బూర్వార్చికలోని ఋక్కు లనేకము లట్లే యిందు మరలఁ బఠింపఁబడుటయు, ఋగ్వేదమునుండి గ్రహింపఁబడిన ఋక్కులు విశేషపాఠభేదము చెందక యట్లే యిందు గనవచ్చుటయుఁ దార్కాణ మగుచున్నవి. ఈయర్చికలో విశేషముగా సోమయాగప్రధానము లయిన యగ్నీంద్రసూర్యాదిదేవతాస్తుతి రూపమంత్రములు గలవు. అట్టి యీరెండుభాగములలోని సామములును గానపద్ధతి ననుసరించి బహువిధములుగా నున్నవి.

౧. పూర్వార్చిక - ప్రకృతితంత్రములు.—ఆగ్నేయము - బహుసామి-ఏకసామి - బృహతి - త్రిష్టుపు - అనుష్టుపు - ఇంద్రపుచ్ఛము-పవమానము - ఆరుణము[1]. శుక్రియము - మహానామ్ని - అనునవి. ఇవియే ప్రకృతిసామములు.

౨. ఉత్తరార్చిక - ఊహతంత్రములు, రహస్యతంత్రములు.—దశరాత్రము-సంవత్సరము - ఏకాహము - అహీనము - సత్రము - ప్రాయశ్చిత్తము-క్షుద్రము - అనునవి. ఇవియే విషయభేదమునుబట్టి యూహసామములు రహస్యసామము లని ద్వివిధము లైనవి.

మొదటిదానిలోని యాగ్నేయాది పవమానాంతము లైనప్రకృతి తంత్రములందలి శ్రౌతోపయోగులైనసామము లితరసామములతోఁ గలిసి త్రిగుణితములై యూహసామము లగుచున్నవి. అట్లే, ఆరుణశుక్రియములందలి శ్రౌతోపయోగిసామము లితరసామములతోఁ గలసి మూఁడురెట్లై రహస్యసామము లగుచున్నవి[2]. ఊహరహస్యసామములకువలెఁ బ్రకృతి సామములకు సమానసంఖ్యానియమము లేదు, ఆగ్నేయాది శుక్రియాంతము లైనప్రకృతి సామఖండములు ౭౮ లోను ౧౮౮౬ సామము లున్నవి. మఱిమూఁడు భారుండ సామములు గూడ వానికిఁ జేరినవి[3].

దశరాత్రాదిక్షుద్రాంతము లైనయూహతంత్రములం దిరువదేసి సామములు చొప్పున నేర్పడిన ౭౮ ఖండములలో ౯౬౦ సామము లున్నవి. అట్లే దశరాత్రాదిక్షుద్రాంతము లైనరహస్యతంత్రములందు పదేసిసామములు చొప్పున నేర్పడిన ౨౦ ఖండములలో ౨౦౦ సామము లున్నవి. దీనినిబట్టి సామసంహితామంత్రములకంటె గేయము లయినమంత్రములసంఖ్య సుమా రొకసహస్ర

1. ఆరణ మని కొన్నిచోట్ల నున్నది.

2. ఆగ్నేయాది పవమానాన్తేషు తంత్రేషు యాని సామాని శ్రౌతోపయోగీని తాన్యన్యై స్సామభి ర్మిళిత్వా త్రిగుణితా న్యూహసామాని, ఆరుణశుక్రియయో శ్శ్రౌతోపయోగీని సామాని యాని తాన్యన్యై స్సామభి ర్మిళిత్వా త్రిగుణితాని రహస్యసామాని - అనుక్రమణి—ఇందు మహానామ్ని చేరకపోవుటచేఁ గూడ నది భాగాంతర మని తెలియుచున్నది.

3. తంజాపూరు 482 నంబరు సామవేదపుస్తకము.

మధిక మయినట్లు తెలియవచ్చును. ఇది యారుణ శుక్రియ మహానామ్నీ భాగములకు సంబంధించిన దనుట స్పష్టము. కాని, చరణ వ్యూహము సామసంఖ్య ౮౮౧౪ అనియు, ఇది గాక యన్యశాఖాసంఖ్య ౯౦౦ అనియుఁ జెప్పుచున్నది[1].

సామసంహితలోని ఋక్కులపాఠము ద్వివిధము. ఒకటి, ఉదాత్తానుదాత్తస్వరితస్వరములతో ఋక్సంహితాదులలో నున్నట్లే యుండును. కాని స్వరసూచనపద్ధతి వేఱుగా నుండును. మఱియు నిందు గ్రహింపఁబడినఋక్సంహితలోని మంత్రముల స్వరము కొన్నిచోట్ల నట్లే యుండును. కొన్నిచోట్ల భిన్నముగా నుండును[2]. ఎట్లయినను ఋఙ్మంత్రము సామమంత్రమై స్వరోచ్చారణములలో నించుక మార్పు చెందినమాట సత్యము. ఇందుకు మొదటి మంత్రములోనిభాగ ముదాహరణము.

అగ్న ఆయాహివీ తయే—ఋక్సంహిత

అగ్న ఆయా హి వీతయే—సామసంహిత.

రెండవదిగాన పాఠము. ఇది సంహితాపాఠముకంటె మిక్కిలి విలక్షణముగా నుండును. సంహితలోని ఋక్కు గానమందు గుర్తుపట్టుటకు వీలులేనంతగా మాఱిపోవును. గానలక్షణమునుబట్టి కొన్నివర్ణము లధికముగాఁ జేరును. ఇందు కొక యుదాహరణము:—

'అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే'

'ఓతగ్నాఇ। ఆఛోయాహీఁణరో ఇతోయాప్రే ఇ।

తోకాయాప్రేఇ। గృకాణానోహ। వ్యచోదాతో

యాప్రేఇ। తోకాయాప్రేఇ॥'

ఋషులు:—సామసంహితలోని ఋక్కులలో ఋగ్వేదమునుండి గ్రహింపఁబడినవాని కందలివారే ఋషులుగా నున్నారు. స్వల్పముగా నున్నక్రొత్తఋక్కులకు - శ్రుతర్షి - తృణపాణి - వార్షహవ్యుఁడు - ముక్తవాహోద్వితుఁడు-ఆయుజ్ఞ్వాహి - మొద లగుఋషులు సుమారు ముప్పదిమంది యున్నారు. ఋగ్వేదఋషులలో సప్తమహర్షులు రచించినవియు, అందును భరద్వాజ వసిష్ఠ గోత్రములు రచించినవియు నధికముగా నున్నవి. ఇతరర్షులలో వామదేవుఁడు నిర్మించిన వెక్కువగా నున్నవి. ఇందుకు భాష్యకర్త యగుభారతస్వామి యుదాహరించిన యీక్రిందిశౌనకోక్తికూడఁ బ్రమాణ మగుచున్నది.

---

1. అష్టౌ సామసహస్రాణి సామానిచ చతుర్దశ, అష్టౌశతాని; నవతి ర్దశతి ర్వాలఖిల్యకమ్.

2. ముద్రిత గ్రంథములలోని స్వరసూచనపద్ధతి చూడనగును.

"న స్మర్యన్త ఋచాం యాసా మృషయః క్వాపి కేచన !
వామదేవ ఋషి స్తాసాం జ్ఞేయ ఇత్యాహ శౌనకః ॥"

దీనినిబట్టి సంహితర్షులలో వామదేవుని కెక్కువ ప్రాధాన్యము గల దని విదిత మగును. మఱియు ఋక్సంహితాకర్తల నూతనమంత్రములు కూడా కొన్ని యిందు కలవు. ఇందు కొక యుదాహరణము:—కవషుఁ డనుఋషి ఋగ్వేదదశమమండలమున నైదుసూక్తములకు ద్రష్టగా నున్నాఁడు. అందు లేనిఋ కొక్కటి యిట్లున్నది.

"విస్రుతయో యథా పథా ఇంద్ర త్వ ద్యన్తు రాతయః[1]".

ఓ యింద్రా ! రాచబాటనుండి చిన్నత్రోవలు బయలువెడలునట్లుగా నీవలన వివిధము లైన ధనములు బయలువెడలివచ్చుఁ గాక యని దీనియర్థము.

ఇఁక సంప్రదాయప్రవర్తకు లైనఋషు లనేకులు గలరు. వంశబ్రాహ్మణ మనుగ్రంథము వారి పరంపరను రెండుపట్టికలుగాఁ జూపియున్నది[2]. ఆపట్టికలు రెండును గూడ శిష్యగురుక్రమమున వెనుకకు నడచినవి. సులభముగాఁ దెలియుటకై వాని నిందుగురుశిష్యక్రమమునఁ జూపుచున్నాను.

సామవేదసంప్రదాయ ప్రవర్తకపట్టిక. ౧.

౧. బ్రహ్మ - స్వయంభువు.
౨. ప్రజాపతి.
౩. మృత్యువు.
౪. వాయువు.
౫. ఇంద్రుఁడు.
౬. అగ్ని.
౭. కశ్యపుఁడు.
౮. ఋశ్యశృంగుఁడు-కాశ్యపుఁడు.
౯. విభండకుఁడు. ,,
౧౦. మిత్రభువు. ,,
౧౧. ఇంద్రభువు. ,,
౧౨. అగ్నిభువు. ,,
౧౩. శవసుఁడు. ,,
౧౪. దేవతరసుఁడు-శావసాయనుఁడు.
౧౫. ప్రతిథి-దైవతరసుఁడు.
౧౬. నికోథకుఁడు-భాయజాత్యుఁడు.
౧౭. వృషశుష్ణుఁడు-వాతావతుఁడు.
౧౮. ఇంద్రోతుఁడు-శౌనకుఁడు.
౧౯. దృతి-ఐంద్రోతుఁడు.
౨౦. దరాలుఁడు-దార్తేయుఁడు.
౨౧. శూషుఁడు - వాహ్నేయుఁడు, భారద్వాజుఁడు.
౨౨. సుమంతుఁడు-బాభ్రవుఁడు,గౌతముఁడు.
౨౩. ఆరైహణ్యుఁడు - వాసిష్ఠుఁడు, రాజ్యనుఁడు.
౨౪. చైకితానేయుఁడు - వాసిష్ఠుఁడు.
౨౫. స్థిరకుఁడు-గార్గ్యుఁడు.

1. సా. అ ౪-౫ ౧౧-ఋ. ౭.

2. ఏవం సామవేదప్రవర్తకా మేకా మృషిపరంపరాం దర్శయిత్వా, అపరా మపి దర్శయితుం తత్కీర్తనే కించి న్నియమం దర్శయతి. వం.బ్రా.భా.

౨౬. మశకుఁడు-స్థైరకుఁడు.
౨౭. అతిధన్వుఁడు-శౌనకుఁడు
౨౮. ఉదరశాండిల్యుఁడు.
౨౯. శాండిల్యాయనుఁడు-ఔదరశాండిల్యుఁడు, గర్దభీముఖుఁడు.
3౦. విచక్షణుఁడు-తాండ్యుఁడు.
3౧. శాకదాసుఁడు - భాండితాయనుఁడు.
3౨. సంవర్గజిత్తు-లామకాయనుఁడు.
33. గాత - గౌతముఁడు.
3౪. రాధుఁడు-గాతృపుత్త్రుఁడు గౌతముఁడు.
3౫. అమావాస్యుఁడు - శాండిల్యాయనుఁడు.
3౬. అంశువు-ధానంజయ్యుఁడు.
3౭. సుతేమనుఁడు - శాండిల్యాయనుఁడు.
3౮. సునీథుఁడు-కాపటవుఁడు.
3౯. మిత్రవిందుఁడు-కౌహాలుఁడు.
౪౦. కేతువు-వాజ్యుఁడు.
౪౧. ప్రాతరహ్ణుఁడు-కౌహాలుఁడు.
౪౨. సుశ్రవుఁడు-వార్షగణ్యుఁడు.
౪3. సాతి-ఔష్ట్రాక్షి.
౪౪. మద్రగారుఁడు-శౌంగాయని
౪౫. కాంబోజుఁడు-ఔపమన్యవుఁడు.
౪౬. శాంబుఁడు-శార్కరాక్ష్యుఁడు.
౪౭. ఆనందుఁడు-చాంధనాయనుఁడు.
౪౮. భానుమంతుఁడు-ఔపమన్యవుఁడు
౪౯. ఊర్జయంతుఁడు ,,
౫౦. సుశారదుఁడు - శాలంకాయనుఁడు.
౫౧. శ్రవణదత్తుఁడు-కౌహాలుఁడు.
౫౨. కుస్తుకుఁడు-శార్కరాక్ష్యుఁడు.
౫3. భవత్రాతుఁడు-శాయస్తి.
౫౪. బృహస్పతి-శాయస్తి, గుప్తుఁడు.
౫౫. సుప్రతీతుఁడు-ఔలుండ్యుఁడు.
౫౬. మిత్రవర్చసుఁడు-స్థైరకాయనుఁడు
౫౭. బ్రహ్మవిద్ధి-ఛందోగమాహకి
౫౮. గిరిశర్మ-కాంశేవిద్ధి.
౫౯. నిగడుఁడు-పార్ణవల్కి.
౬౦. త్రాతుఁడు-ఐషుమతుఁడు.
౬౧. రుద్రభూతి-ద్రాహ్యాయణుఁడు.
౬౨. శర్వదత్తుఁడు-గార్గ్యుఁడు.

బ్రహ్మ ప్రజాపతి మొదలగువారు ఋగ్వేదసంహితలోఁ గూడా ఋషులుగానే కనఁబడుచున్నారు. కావునఁ బై పట్టిక యందలి మొదటియాఱును బ్రహ్మర్షి నామము లనియే విశ్వసింపఁదగియున్నది. దీనినిబట్టి బ్రహ్మ ప్రజాపతికి నతఁడు మృత్యువునకు నతఁడు వాయువునకు నిట్లే క్రమముగా సామవేదోపదేశమున గురువు లగుచు వచ్చి రని విదిత మగుచున్నది.

పట్టిక - ౨.

మొదటిపట్టికలోని ముప్పదినాల్గవఋషి యగురాధునికిఁ బైనున్నముప్పది ముగ్గురుఋషులను గ్రమముగా నట్లే గ్రహింపఁ దగునని వంశబ్రాహ్మణము చెప్పుచున్నది[1]. కావున నాముప్పదిమూఁడు నామములను మరల నిందుచూపక

1. గోభిలో రాధాచ్చ గౌతమా త్సమానం పరమ్.

రాధర్షి వద్దనుండి చూపుచున్నాను. ఈ రెండవ సామవేద సంప్రదాయశాఖకు రాధర్షి మొదటివాఁడని తెలియఁదగును. అనఁగా నతని శిష్యులలో, అమావాస్యునిశిష్యపరంపర యొకటి గోభిలునిశిష్యపరంపర యొకటి వేఱుపడి సామవేదమును లోకమునఁ బ్రవర్తింపఁజేసె ననుట.

౧. రాధుఁడు-గౌతముఁడు.
౨. గోభిలుఁడు.
౩. బృహద్వసుగోభిలుఁడు
౪. గౌల్గలవీపుత్రగోభిలుఁడు.
౫. వత్సమిత్రగోభిలుఁడు
౬. మూలమిత్రగోభిలుఁడు.
౭. వరుణమిత్రగోభిలుఁడు.
౮. అశ్వమిత్రగోభిలుఁడు.
౯. పూషమిత్రగోభిలుఁడు.
౧౦. అర్యమరాధగౌతముఁడు.
౧౧. సంకరగౌతముఁడు.
౧౨. పుష్యయశుఁడు-ఔదవ్రజి
౧౩. భద్రశర్మ-కౌశికుఁడు.
౧౪. అర్యమభూతి-కాలబవుఁడు.
౧౫. నయంతుఁడు - [1].

పై పట్టికలలో, పితాపుత్ర క్రమముకూడ నక్కడక్కడఁ గనవచ్చుచున్నను, ఇవి విద్యావంశక్రమమును దెలుపునవే యని మూలభావమును భాష్యకర్త లావిష్కరించియున్నారు[2]. మఱియు సామగాచార్యపరంపర యొకటియు, సామగానప్రవచన కర్తృపరంపర యొకటియు, చరణవ్యూహ పరిశిష్టసూత్ర వ్యాఖ్యలో నిట్లు కనవచ్చుచున్నవి[3].

౧. సామగాచార్య పరంపర.

౧. రాణాయని.
౨. సాత్యముగ్రి.
౩. దుర్వాసుఁడు.
౪. భాగురి.
౫. భౌరుండుఁడు.
౬. గౌల్గులవి.
౭. ఔపమన్యవుఁడు (భగవాన్)
౮. దరాలుఁడు.
౯. గార్గ్యసావర్ణి.
౧౦. వార్షగణ్యుఁడు.
౧౧. కుథుముఁడు.
౧౨. శాలిహోత్రుఁడు.
౧౩. జైమిని.

1. ఈపట్టికలోని ఋషులక్రమమున మదరాసుప్రతియు, కలకత్తాప్రతియు నించుక భేదించుచున్నవి.

2. ద్వితీయఁతు విద్యాజన్మ—ఉపజాయత = సామవేద మన్త్రై శ్లిష్ట.

3. ఈగ్రంథము 1888 లో, కాశీపురమున ముద్రిత మైనది. ఇది యంతనిర్దుష్ట మైనది కాదు.

౨. సామగానప్రవచనకర్తృ పరంపర.

౧. సుమంతుఁడు-జైమినిపుత్త్రుఁడు,
౨. సుమన్వంతుఁడు-జైమినిపౌత్త్రుడు
3. సుకర్ముఁడు-జైమినిశిష్యుఁడు.
౪. హిరణ్యనాభుఁడు, ౫ పౌష్యంజి, ౬. అవంత్యుఁడు — సుకర్మ శిష్యులు.
౭. ఉదీచ్యులు-౫ వందలమంది.
౮. లోగాక్షి, ౯. లాంగలి, ౧౦. కుల్యుఁడు, ౧౧. కుసీదుఁడు, ౧౨. కుక్షి — పౌష్యంజిశిష్యులు.
౧3. కృతుఁడు-హిరణ్యనాభశిష్యుఁడు
౧౪. ఉదీచ్యులు - అవంత్యపౌష్యంజుల శిష్యులు ౫ వందల మంది.

మొదటి పట్టికలోనిగాల్లులవి స్త్రీ. ఈమె పుత్త్రుఁడు గోభిలుఁడొకఁడు వెనుకటి రెండవపట్టికలో నున్నాఁడు. ఇట్లే యీ రెండు పరంపరలోనివారికిని వెనుకటి రెండుపరంపరలోనివారికిని సంబంధము చాలావఱకుఁ గనఁబడుచున్నది.

రెండవపట్టిక సామగానప్రవర్తకులవరుసను వారిసంఖ్యను దెలుపుచున్నది. దీనినిబట్టి 'సహస్రాధ్వాసామవేదః' అను సర్వానుక్రమణీవృత్తియు, సామవేదస్య కిల సహస్రభేదా భవంతి, యనుపరిశిష్టసూత్రమును దెలుపునట్టి వేయి శాఖలనెడిప్రతీతి ప్రవర్తకులసంఖ్యనుబట్టి కలిగిన దని విదిత మగుచున్నది. మఱియుఁ జైపరిశిష్టసూత్రమే సామశాఖావ్యాప్తి నిట్లు తెలుపుచున్నది.

సామశాఖావ్యాప్తి.—"ఆసురాయణీయ - వాసురాయణీయ - వార్తాన్తరేయ - ప్రాంజల - ఋగ్వైనవిధ - ప్రాచీనయోగ్య - రాణాయనీయ - సంజ్ఞల సామశాఖ లేడువిధములు-వీనిలోఁగడపటిది - రాణాయనీయ-శాట్యాయనీయ - శాట్యముగ్ర - ఖల్వల - మహాఖల్వల - లాంగల - కౌథుమ-గౌతమ-జైమినీయ సంజ్ఞలఁ దొమ్మిదివిధములు. ప్రకారాంతరమున-రాణాయనీయ-సాత్యముగ్ర - కాలేయ - మహాకాలేయ - లాంగలాయన - శార్దూల - కౌథుమ - భేదమున సప్తవిధము. ఇందు కడపటిది - కౌథుమ - ఆసురాయణ - వాతాయన-ప్రాంజలిద్వైనిభృత్[1] ప్రాచీనయోగ్య-నైగమీయ-భేదమున షడ్విధము.

ఇందు మొదటివిధమున వచ్చిన పదునాఱు శాఖలలోను, ఘూర్జరదేశమందు కాథుమీశాఖయు, కర్ణాటకదేశమందు జైమినీయశాఖయు, మహారాష్ట్రదేశమున రాణాయనీయశాఖయుఁ బ్రసిద్ధములు."

రాణాయనీయశాఖ వంగదేశమందును హైదరాబాదుదేశమందునుగూడ వ్యాపించినట్లు తెలియవచ్చును. ఆంధ్రదేశమం దీశాఖ. తొలుతవ్యాపించినట్లుగా

1. ఈశబ్దము సందిగ్ధముగా నున్నది.

సామవేదము వారనఁబడు బ్రాహ్మణు లుండుటనుబట్టి యూహింపవచ్చునుగాని ఋగ్వేదమువలెనే యిదియును మన దేశమునఁ గొనయూపిరితో నున్న దని చెప్పవచ్చును. కౌథుమశాఖనుండియే నైగమీయశాఖ విడివడినట్లు తెలియ వచ్చునుగాని యందు ద్వితీయార్చికలోని సప్తమ ప్రపాఠకము ప్రథమార్చి కలోఁ జేరుట తప్ప భేద మేమియు లే దని ముద్రిత పుస్తకమువల్లఁ తెలియు చున్నది[1].

సామగానపద్ధతి.—[2]. సామగానము స్వరనియమము ననుసరించి యుండు టచే మిక్కిలి శ్రావ్యముగా నుండును. ఇందలి సప్తస్వరములు తరువాత బయలు దేఱిన భారతసంగీతశాస్త్రమందలి సప్తస్వరములకు సరిపడుచున్న వని నారద శిక్షలోని యీ క్రిందిశ్లోకములవలనఁ దెలియుచున్నది.

"య స్సామగానాం ప్రథమ స్స వేణో ర్మధ్యమ స్స్మృతః ।
యో ఽసౌ ద్వితీయో గాంధార స్తృతీయ స్త్వృషభ స్స్మృతః ।
చతుర్థ ష్షడ్జ ఇత్యాహుః పంచమో ధైవతో భవేత్ ।
షష్ఠో నిషాదో విజ్ఞేయ స్సప్తమః పంచమ స్స్మృతః ॥"

పై శ్లోకములనుబట్టి సామభారతగాన స్వరము లిట్లుండును.

| సామ స్వరములు. | భారతగాన స్వరములు. | |
|---|---|---|
| ౧. ప్రథమము. | మధ్యమము. | మ |
| ౨. ద్వితీయము. | గాంధారము. | గ |
| ౩. తృతీయము. | ఋషభము. | రి |
| ౪. చతుర్థము. | షడ్జము. | స |
| ౫. పంచమము. | ధైవతము | ధ |
| ౬. షష్ఠము. | నిషాదము | ని |
| ౭. సప్తమము | పంచమము | ప |

దీనినిబట్టి సామగానములోని ప్రథమాది స్వరములకు భారతస్వరము లిట్లు సరిపడు నని గ్రహింపనగును.

౧ - ౨ - ౩ - ౪ - ౫ - ౬ - ౭.

మ - గ - రి - స - ధ - ని - ప.

సామము హైందవగానపద్ధతి ననుసరించి పాడుట కనువుగా నుండు ననుట కొక యుదాహరణము.

ఓగ్నాఇ । ఆయాహి ఇవో ఇతో యా ఆఇ । తోయా ఆ ఇ ।

సాసాస । గాగాగరిమామమామాగాగ । మామాగాగ ।

---

1. వీబరు H. I. L. 65.

2. డాక్టరు బర్నెలు, ప్రొ. శేషగిరిశాస్త్రిగార్ల ననుసరించి.

గేయసామ విశేషములు.—ప్రథమభాగములోని మొదటి పదియేడు ప్రపాఠకముల గేయగ్రంథము గ్రామగేయగాన మనియుఁ దరువాతియాఱుప్రపాఠకములలోని దారణ్యాగాన మనియు నొకప్రాచీనానుక్రమణిక చెప్పుచున్నదఁట[1]. ఆభాగములు ప్రపాఠకము లగుట సంశయాస్పదమే కాని, ఆసంజ్ఞలు తొల్లి వాడుకలో నుండెనని యొకగ్రంథాక్షరముద్రిత పుస్తకమందు గేయగాన మనుటకు బదులుగా 'వేయగానమ్ సమాప్తమ్' అని యున్నమాటనుబట్టి యూహింపఁ బడుచున్నది[2]. ఆగుణమునకుఁ బెక్కుప్రతులలో 'ఆరణ'మను సంజ్ఞ గనవచ్చుచున్నది. అది యారణ్యాగానముగా మున్ను వాడఁబడిన దేమో! కాని యీ సంజ్ఞలు నేను జూచిన ముద్రితాముద్రితగ్రంథములలోఁ గనఁబడలేదు.

గేయసామములలోఁ గొన్నిటికి మంత్రద్రష్టలనుబట్టియుఁ గొన్నిటికి గానస్వరకర్తలనుబట్టియుఁ గొన్నిటికి విషయమునుబట్టియు విశేషసంజ్ఞలు వాడుకలో నున్నవి. గ్రంథములందును గనఁబడుచున్నవి. నౌధసము వామదేవ్యము కాలేయము మొద లగునవి మంత్రకర్తలనుబట్టి వచ్చినవి. అగ్న ఆయాహి ఇత్యాది మంత్రమునకు భరద్వాజుఁడు కర్త - గానములో నున్న 'గౌతమస్య పర్కః' అనుమాటనుబట్టి గానస్వరకర్త యగుగౌతమునిపేర దీనికి వ్యవహారమున్నట్లు కనఁబడుచున్నది. కశ్యపదృష్ట మయిన 'పునానః సోమధారయాపోవసానో అర్షసి' ఇత్యాదిమంత్రము 'కాశ్యప' మని పిలువఁబడుచున్నది. ఇట్లెన్నో సామములు ఋషీతరనామముల నొప్పుచున్నవి. దీక్షణీయేష్టి మొద లగుకర్మవిశేషములందు గానము చేయఁబడు - అగ్నేవ్రత - లోకద్వార - బహిష్పవమాన - ధేను - జ్యోతిర్గాన - ఆశ్వినవ్రతాదు లగుసామములు విషయప్రధానములుగా నున్నవి. ఆంధ్రదేశమున నిపుడు సామవేదము పఠనపాఠనములలో మిక్కిలి తక్కువగా నున్నను యాగములందు శ్రౌతోపయోగిసామములు గానవ్యవహారమున నున్నవి.

## యజుర్వేదము.

దీనికాలమునుగూర్చియు సంహితలలో దీని స్థానమును గూర్చియు ద్వితీయ చతుర్థాధ్యాయములలోఁ గొంత తెలిసికొనియున్నాము గావునఁ గొందఱుపాశ్చాత్యులు వ్రాసినదానినిబట్టి యిది క్రీస్తుపూర్వము వేయిసంవత్సరములనాఁటి దని భ్రాంతిపడవలదు. యాగాచరణ మెపు డారంభ మయ్యెనో నాఁడే యజ్ఞార్థములయినఋక్కులతోఁ గూడ యజుస్సులు వెలసిన వని యంగీకరింపక తప్పదు. ఇందుకు యజుర్మంత్రములు లేనియజ్ఞ మాచరణసాధ్యము కాకపోవుటయే కారణము. ఇది యధ్వర్యువేదము. అధ్వర్యుఁ డభిషవగ్రహణాదిక్రియచే యజ్ఞశరీ

1. వీబరు H.I.L. 64—2. మద్రాసు సంస్కృత గ్రంథపట్టిక Vol. 1 P. 74.

రము నిర్మించుచున్నాఁ డని ఋగ్వేదమే చెప్పుచున్నది[1]. 'అధ్వరం యునక్తీత్యధ్వరయుః' అకారలోపమున నధ్వర్యుఁడు - అనఁగా యజ్ఞమునకు నేత యని యర్థము. యాస్కాచార్యులుగూడ నధ్వర్యువేదము యజ్ఞనిష్పాదక మని వ్రాసి యున్నారు. బ్రహ్మయజ్ఞజపాదులందు ఋగ్వేదమునకుఁ బ్రాధాన్య మున్నను, యజ్ఞార్థ మైనయర్థజ్ఞానమందు యజుర్వేదమునకే ప్రాధాన్యము కల దనియు, అధ్వర్యువేదము ఋక్సామవేదముల కుపజీవ్య మనియు సాయణులు వ్రాసిరి[2]. 'యజుర్వేదో యజ్ఞోపయోగిత్వసూపయోగాత్సర్వోఽపి వేదో యజుర్వేద ఇత్యుచ్యతే' అనివ్రాసి, దీని కుపోద్బలకముగా 'ఏకఏవ యజుర్వేద స్తం చతుర్ధా వ్యకల్పయత్' అను విష్ణుపురాణోక్తిని మహిదాసబుధుఁ డుదాహరించి యున్నాఁడు[3]. వీనినిబట్టి యజుర్వేద మనాదిగా యజ్ఞోపయోగి యనెడిప్రాచీన సంప్రదాయమే కాక దీనియతిప్రాచీనత గూడ విదిత మగుచున్నది. కావున నార్యులు యజ్ఞము లాచరింప నారంభించిన నాఁటినుండియు ఘనత కెక్కి భరత ఖండమంతట ఋక్సామవేదములకంటె వేయిరెట్లెక్కువగా నేఁటికిని నిత్యపఠన పాఠవ్యవహారమం దున్నయీవేదము విధివిహిత మైన సకలకర్మకలాపమున కాధారభూతమై యున్న దనుటకంటె దీనిమహత్త్వమును వేఱుగాఁ బ్రశంసింప నక్కఱలేదు. అట్టి ప్రాచీన మైనయీవేదమునుండి పెక్కుశాఖలు వెడలినట్లు తెలియుచున్నది గావునఁ గృష్ణయజుస్సు, లేక తైత్తిరీయ సంహిత యనుదానిని గూర్చి తెలిసికొనుటకు ముందుగా యజుశ్శాఖలనుగూర్చి తెలిసికొనవలసి యున్నది.

## యజుశ్శాఖలు.

ఋగ్వేదము సామవేదము, అని యాయాసంహితలకుఁగూడ వేదసంజ్ఞ గ్రంథములందును వ్యవహారమందును గనఁబడుచున్నను 'మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయమ్ - మంత్రబ్రాహ్మణాత్మకో హి వేదః' అనెడియాపస్తంబపరిభాషాదులలోనిలక్షణములనుబట్టి మంత్రరూప మైనసంహితకును దానికి సంబంధించిన వ్యాఖ్యానరూప మైనబ్రాహ్మణమునకును గలిపియే వేదసంజ్ఞ యుచిత మగుచున్నది. మంత్రబ్రాహ్మణములు వేఱువేఱుగా నున్న యితరవేదములకంటె నవి రెండును పరస్పరము మిశ్రమై యున్నయజుర్వేదమున కత్యంతము సరిపడుటచే నీలక్షణము యజుర్వేదము ననుసరించియే పుట్టిన దని తోఁచుచున్నది. ఏ మనఁగా, నిందు సంహితలోను మంత్రముతో బ్రాహ్మణము కలసియున్నది. వేఱుగా నున్నబ్రాహ్మణమందును, ఆరణ్యకమందునుగూడ మంత్రముతో బ్రాహ్మ

1. యజ్ఞస్య మాత్రాం విమిమీత ఉత్వః. ఋ. 10-71-11.
2. ఋగ్వేదభాష్యావతారిక.
3. చరణవ్యూహపరిశిష్ట భాష్యము.

ణము కలసియున్నది. అట్టి మంత్రబ్రాహ్మణాత్మక మైనయీవేదము తొలుత నొకటిగానే యున్నట్లు "యజు స్తస్మా దజాయత - యద్వై యజ్ఞస్య సామ్నా యజుషా - యజుర్వేదో వాయోః - తస్య యజు రేవ శిరః ఋ గ్దక్షిణః పక్షః - ఋచ స్సామాని యజూంషి"—ఇత్యాది ఋగాదివాక్యములు తెలుపుచున్నను, అర్వాచీనము లైనయుపనిషత్పురాణేతి హాసాదులు కొన్ని వైశంపాయనయాజ్ఞ వల్క్యులకు సంబంధించిన యొకగాథతో నిది కృష్ణశుక్లభేదమున ద్వివిధ మైనట్లు తెలుపుచున్నవి. యజుస్సునుండి విడిపోయినశాఖలలో శుక్లయజుశ్శాఖ మొదటిది యని తెలుపుటకు సహాయపడుచున్నయాగాథలో యాజ్ఞవల్క్యుఁడు వాజసనేయ శాఖాప్రవర్తకుఁ డయ్యె ననుట తప్పఁ దక్కినవిషయము విశ్వసనీయము గాకు న్నను, దాని నిందు సంగ్రహముగా నుదాహరించుచున్నాను.

"వేదవ్యాసుఁడు కలసిపోయి యున్నవేదరాశిని నాలుగు సంహితలుగా వేఱుపఱిచి పైలునికి బహ్వృచసంహితను వైశంపాయనునికి యజుస్సంహితను జైమినికి సామసంహితను సుమంతుని కథర్వసంహితను బంచి యిచ్చి వానిని వ్యాపింపఁజేయుఁ డని వారి కానతిచ్చెను. వైశంపాయనునివద్దఁ బెక్కండ్రు చర కాదులు యజుర్వేద మభ్యసించుచుండిరి. వారిలో[1] వాజసనిపుత్త్రుఁ డైన యాజ్ఞవల్క్యుఁ డొకనాఁడు గురువుమాట కెదురు చెప్పఁగా నతఁడు కోపగించి తనవద్ద నేర్చినవిద్యను విడిచిపెట్టు మని శపించెను. అంత యాజ్ఞవల్క్యుఁడు చదివిన దంతయుఁ గక్కెను. దాని నచ్చట నున్నమునులు తిత్తిరిపక్షిరూపమున వచ్చి భక్షించిరి. అందుచే నది తైత్తిరీయ మయ్యెను.

తరువాత యాజ్ఞవల్క్యుఁడు సూర్యునిగూర్చి తపస్సు చేసి వైశంపాయ నునికి రానివేదము తనకుఁ బ్రసాదింపు మని ప్రార్థించెను. సూర్యుఁ డతని స్తుతికి మెచ్చి వాజిరూపమున వచ్చి యాతయామనులు గాని యజుస్సు లతనికిఁ బ్రసాదించెను. అది వాజసనేయీసంజ్ఞ గలసంహిత యయ్యెను"[2]. ఈకథ భాగవతాది పురాణములలో నీషద్భేదముతోఁ గనవచ్చుచున్నది[3].

---

1. మహీధరాచార్యమంత్రభాష్యమున యాజ్ఞవల్క్యునితండ్రి 'వాజసని' యని యున్నది. భాగవతవిష్ణుపురాణాదులందు దేవరాతుఁ డనియున్నది. మహీధరులు 'వాజ మన్నం తస్య సని ర్దాన మ స్త్యస్తీతి వాజసనిః' అని వ్యుత్పత్తి వ్రాయుటనుబట్టి చూడఁగా దేవరాతుని కన్నదాత యగుటచే 'వాజసని'యను బిరుదనామము వచ్చియుండు నని తోఁచుచున్నది.—ప్రతిజ్ఞాసూత్ర పరిశిష్టభాష్యము.

2. వాజిరూపేణ సూర్యేణ వాజేభ్యః కేసరేభ్యః సన్యస్తాః పరిత్యక్తాః (మంత్రాః) సా శాఖా వాజసనేయీ సంజ్ఞా—వాజసనః సూర్యః, తత ఆగతా శాఖా—అని చరణవ్యూహపరిశిష్ట భాష్యము.

3. భాగవతము ద్వాదశస్కంధము.

పరిశీలింపఁగాఁ దైత్తిరీయ వాజసనేయ సంహితలలోని మంత్రభాగ ములు చాలావఱకొకటిగానే కనఁబడుచుండుటచే వాజసనేయుఁడు సూర్యుని యనుగ్రహమువలనఁ గ్రొత్తగా సంపాదించిన యజుర్మంత్రములు లేవనియుఁ బైకథ యెట్లో పుక్కిటిపురాణమై పోక్కి వాజసనేయ సంహితామహత్త్వము చాటించునదియై పురాణముల కెక్కిన దనియు, నందుచే నది విశ్వసనీయము కా దనియుఁ దెలియక పోదు. కాని దీనివల్ల నొకవిషయముమాత్రము తెలియ వచ్చుచున్నది.

మంత్రబ్రాహ్మణాత్మక మైనయజుర్వేద పాఠము పుట్టిననాఁటినుండి యెట్లు సంప్రదాయసిద్ధమై వచ్చుచున్నదో, అట్లే దానిని బ్రవర్తింపఁజేసినవాఁడు తిత్తిరి మహర్షి. ఆపాఠమున కిష్టపడక సంహితనుండి బ్రాహ్మణమును వేఱుపఱిచి కేవల మంత్రభాగ మైనసంహితను, అట్లే కేవల మైనబ్రాహ్మణమును బ్రవర్తింపఁజేసిన వాఁడు వాజసనేయమహర్షి. ఇట్లు యజుర్వేదమునుండి తొలుత విడిపోయిన దగుటచే వాజసనేయశాఖ ప్రథమశాఖ యనియు, దాని నవలంబించినవారు ప్రథమశాఖీయు లనియుఁ బిలువఁ బడుచువచ్చిరి. యథాపూర్వముగా యథా స్థితముగా నున్నయజుర్వేదమే తిత్తిరిప్రోక్తమైనను, వాజసనేయప్రోక్తము వేఱుగాఁ గనవచ్చుటంజేసి దానికిఁ దైత్తిరీయశాఖ యనుపేరు వచ్చినది. అంతే కాని యాద్యమహర్షి దృష్ట మైనయజుర్వేదమునకుఁ దైత్తిరీయ మన్యము కాదు. అది శాఖ కాదు. మంత్రబ్రాహ్మణములు సంకీర్ణములై యుండఁగా వైశద్యము కొఱకు వాని వేఱుచేయ యత్నించుట నైజము గాని వేఱుగా నున్నవానికి సాంకర్యము గలిగింప యత్నించుట నైజముకాదు గదా! అందుచే మంత్ర బ్రాహ్మణమిశ్రమై యనాదిగా వచ్చుచున్న యజుర్వేదపాఠమును వేఱుచేసికొని విడిపోయినవాజసనేయము ప్రథమశాఖ కావచ్చును గాని యథాపూర్వముగా నున్నపాఠముతో నుండు తైత్తిరీయము తరువాతిశాఖ యెట్లగును? కావునఁ దైత్తిరీయము ప్రాచీనపాఠ మనియు, వాజసనేయము దానినుండి విడిపోయిన యర్వాచీనపాఠ మనియుఁ జరిత్రకారులు కొందఱూహించుట యుచితమే యగుచున్నది. ఇట్లు విడిపోయిన వాజసనేయసంహిత తరువాతఁ దనకుఁ గావలసిన యంగము లన్నియు సంపాదించుకొని స్వతంత్రశాఖ యైనది. ఇది యిట్లుండ నీరెంటికిని, కృష్ణ శుక్ల సంజ్ఞలు క్రమముగాఁ గనవచ్చుచున్నవి. వానిమాట యొకింత పరిశీలింతము.

మధ్యాహ్నకాలమున శుక్లవర్ణుఁ డైనసూర్యునిచే దత్త మైనది శుక్లయజు స్సని యొకనిర్వచనము కలదు గాని యది యుచితము గాదు. వేదోపక్రమణ మందు చతుర్దశీప్రయుక్త పౌర్ణమాసిని గ్రహించునది శుక్లయజుస్సు, ప్రతి

పత్ప్రియుక్తపౌర్ణమాసిని గ్రహించునది కృష్ణయజుస్సు ; అనియు[1], బ్రాహ్మణముచే సంకీర్ణము గాక శుద్ధముగా నున్నది శుక్లయజుస్సు, మంత్రబ్రాహ్మణమిశ్రమై తదన్యమైనది కృష్ణయజుస్సు, అనియు మఱిరెండు నిర్వచనములు గలవు[2]. ఇందును మొదటిది యంత సముచితము గాదు. ఉపాకర్మకు శుద్ధచతుర్దశికలిసిన శ్రావణపూర్ణిమ, కృష్ణపాడ్యమి కలసిన శ్రావణపూర్ణిమ ప్రధానములైనంతమాత్రమున సంహితలకుఁ బఱుములపేర శుక్లకృష్ణసంజ్ఞలు వచ్చె ననుట భావ్యము గా లేదు. ఇఁకనొకడపటిది యుక్తమే కాని యందలి శుక్లకృష్ణశబ్దములకు, తెలుపునలుపు లర్థ మని తలంపరాదు. ఆ విశేషణములనుబట్టి శుద్ధయజుస్సులు, బ్రాహ్మణములచే సంకీర్ణము లయినయజుస్సులు, అని గ్రహింపనగును. ప్రకరణసంకీర్ణత్వాదులచే బుద్ధిమాలిన్యహేతువైనది కృష్ణ మనియు, ప్రకరణముల యేర్పాటు విశదముగా నున్నది శుక్లమనియు శుక్లయజుః ప్రాతిశాఖ్య పరిశిష్టభాష్యకారుఁడు మఱియొకనిర్వచనము చెప్పియున్నాఁడు[3]. ఇట్లు ద్వివిధమైనయజుర్వేదము ప్రవర్తకప్రవచన భేదాదులనుబట్టి బహుశాఖలైనది.

యజుశ్శాఖలను గూర్చియు వానియుత్పత్తిని గూర్చియు వానివ్యాప్తిని గూర్చియు భేదాభిప్రాయము లనేకములు కనఁబడుచున్నవి. ఈ విషయమునఁ జరిత్రకారులును భిన్నమార్గములు త్రొక్కిరి. ఇందుకు నిరాక్షేపమయిన శాఖాబోధక గ్రంథము లభింపకపోవుటయే కారణము. లభించినంతలోఁ గొంతవఱకుఁ బ్రమాణ మనఁ దగినది చరణవ్యూహమే కాని యది శాఖాచరిత్రము సమగ్రముగాఁ దెలుపఁబూనినగ్రంథము కాదు. దానిపరిశిష్ట మొకటి సభాష్యముగా ముద్రితమై యున్నది గాని యది నిర్దుష్టమైనది గాదు. అయినను దానిని బట్టియు నితరానుక్రమణికాదులలోని యందందలి వాక్యములనుబట్టియు యజుశ్శాఖల నెఱుంగ యత్నింతము.

యజుర్వేదమునకుఁ దొలుత ౨౭ శాఖ లేర్పడినవి. అందు ౧౨ కృష్ణయజుశ్శాఖలు. ౧౫ శుక్లయజుశ్శాఖలు. కృష్ణయజుశ్శాఖ లుపశాఖలతోఁ గలిసి క్రమముగా ౮౬ అయినవి. అందుచే యజుశ్శాఖల మొత్తము ౧౦౧ అగుచున్నది. ఇందుకు 'యజుర్వేదతరో రాసన్ శాఖా ఏకోత్తరం శతమ్. యజుర్యేక శతాధ్వగమ్' అనెడి యర్వాచీనవచనములే కాదు, 'ఏకశత మధ్వర్యు

1. చతుర్దశితోఁ గూడిన శ్రావణపౌర్ణమాసినాఁ డుపాకర్మ వేదోపక్రమణములు చేయుట వాజసనేయుల యాచారము.

2. శుక్లయజుః ప్రాతిశాఖ్యాపరిశిష్టచరణ వ్యూహాపరిశిష్ట భాష్యములు.

3. బుద్ధిమాలిన్యహేతుత్వా త్త ద్యజుః కృష్ణ మీర్యతే
వ్యవస్థితప్రకరణం త ద్యజు శ్శుక్ల మీర్యతే.

శాఖాః' అనెడి పతంజలి వాక్యముగూడఁ బ్రమాణ మగు చున్నది[1]. అయినను ఇందు సంహితాపాఠభేదమున నేర్పడిన రెండుశాఖలు తప్పఁ దక్కిన వన్నియుఁ బ్రవ_ర్తకులనామముల వెలసినవే యనుట సత్యము. వీనిలోఁ గొన్ని బ్రాహ్మణార ణ్యకసూత్ర కల్పాదులభేదమునుబట్టి వచ్చినవి. కొన్ని యాచారభేదమున సంభ వించినవి. అందుచేతనే సుప్రసిద్ధప్రవ_ర్తకులు మాత్రమే కొందఱు గ్రంథములఁ గనవచ్చుట సంభవించినది. వారిలోఁ గృష్ణయజుశ్శాఖాప్రవ_ర్తకులు చరకులు. వారివలన నేర్పడిన శాఖాభేదములు ౧౨.

చరక - ఆహ్వారక - కఠ - ప్రాచ్యకఠ - కపిష్ఠలకఠ - చారాయణీయ - వారాయణీయ - వార్తాన్తవీయ[2]. శ్వేతాశ్వతర - ఔపమన్యవ - పాతాండ నీయ - మైత్రాయణీయ - అనునవి.

శుక్లయజుశ్శాఖా ప్రవ_ర్తకులు వాజసనేయులు. ప్రాచ్యోదీచ్యనైరృత్యు లయినవారివల్ల నేర్పడినశాఖాభేదములు ౧౫.

వాజసనేయ - జాబాల - బౌద్ధాయన - కాణ్వ - మాధ్యందిన - శాఫేయ - తాపనీయ - కపోల - పౌండరవత్స - ఆవటిక - పరమావటిక - పారాశర - వైణేయ - అద్ధ - బౌధేయ - అనునవి. మొత్త మీయిరువది యేడును యజుర్వేదమునకు సంబంధించిన ప్రధానశాఖ లని యీపరిశిష్టము నభిప్రాయము. మఱియు—

ద్వాదశకృష్ణయజుశ్శాఖలలోఁ గడపటి దగుమైత్రాయణీయశాఖ, మైత్రా యణీయ - మానవ - వారాహ - దుందుభ - ఛాగలేయ - హారిద్రవీయ - శ్యామాయనీయ - భేదమున స_ప్తవిధ మయిన దనియు, మైత్రాయణీయుఁడు వాజసనేయ శాఖాధ్యాయి యనియుఁ దెలుపుచున్నది. కాని మైత్రాయణీయ సంహిత యన్నివిధములఁ దై_త్తిరీయ సంహితను బోలియున్న దనుట సత్యమగు టచేఁ బరిశిష్టభాష్యము చెప్పినది సరిగాదు. ఇది యిట్లుండ—

వ్యాసుఁడు వైశంపాయనునికిని, అతఁడు పైంగి యైన యాస్కునికిని[3]. అతఁడు తి_త్తిరికిని, అతఁ డుఖునికిని, అతఁ డాత్రేయునికిని, క్రమముగా యజు స్సంహిత నుపదేశించుచు వచ్చి రనియు, ఈ యాత్రేయుఁడు దానికిఁ బదపాఠ మను పేరఁ బదవిభాగము రచియించె ననియు, దానంజేసి యది యాత్రేయీ

1. చరణవ్యూహము - సర్వానుక్రమణీ వృ_త్తి—మహా. 1-1-1.

2. ఇది, వారత_న్తవీయ, అయి యుండవచ్చును.

3. వైశంపాయనుఁడు యాజ్ఞవల్క్యునికిఁ జెప్పెనని మఱికొన్ని ప్రతులలో నున్నది. కాని భట్టభాస్కరులు పైపాఠమే గ్రహించుటచే నదియే సముచిత మని తోఁచినది. యస్కుఁ డని కొన్నిప్రతులలో నున్నది. ఎట్లున్నను, పైంగియాస్కుఁడు నిరు_క్తకారయాస్కుఁడు కాఁ డనుట నిజము. కీతుపండితుని మతముకూడ నిదే.

నామమున విలసిల్లె ననియుఁ గాండానుక్రమణిక చెప్పుచున్నది. వైశంపాయన శిష్యుఁడు యాస్కుఁడనక, పాఠాంతరమునుబట్టి యాజ్ఞవల్క్యుఁడే యన్నను, యథాస్థితయజుర్వేద ప్రవక్త యగుతిత్తిరి యాజ్ఞవల్క్యునిశిష్యుఁడనుట పొసఁగదు. దీనినిబట్టి చూడఁగాఁ గృష్ణశుక్లయజుశ్శాఖలకు వైషమ్యము హెచ్చిన కాలమందు పుట్టిన యాతిత్తిరిపిట్టకట్టుకథ నుదాహరించిన చరణవ్యూహపరిశిష్టము చూపిన యజుశ్శాఖాప్రచారకక్రమముగాని, కాండానుక్రమణి చూపిన గురుశిష్యపరంపరగాని యథార్థము లనుట కవకాశము కనఁబడకున్నది సరిగదా పైగా నీగ్రంథములు రెండును బరస్పరవిరుద్ధములుగాఁ గూడఁ గనఁబడుచున్నవి. ఈ పరిశిష్టమే మఱియొకచోట:—

తైత్తిరీయశాఖ, ఔఖీయ-ఖాండికీయ-భేదమున ద్వివిధము. అందు ఖాండికీయ, కాలేత - శాట్యాయని - హైరణ్యకేశి - భారద్వాజి - ఆపస్తంబి - అని పంచవిధము. అని చెప్పఁగా, దీనివ్యాఖ్యానము - కాలేతశాట్యాయనీశాఖల స్థానములందు బౌధాయనీశాఖను ఔఖీయశాఖను గ్రహింపఁదగు నని బోధించుచున్నది. ఇట్లు మూలవ్యాఖ్యానములు రెండు నిక్కడ తిత్తిరిని మొదటఁ జేర్చినవి. వెనుకఁ జరకుని మొదటఁ జేర్చినవి. ఆపట్టికలోఁ దిత్తిరి లేఁడు. ఈపట్టికలోఁ జరకుఁడు లేఁడు. వీ రిద్దఱిలో నెవఁడు ప్రాచీనుఁడో, ఎవఁ డర్వాచీనుఁడో యీగ్రంథమునుబట్టి తెలియరాదు. కృష్ణయజుశ్శాఖాప్రవర్తకవిషయ మిట్లుండ నీపరిశిష్టమే మఱియొకచోట శుక్లయజుశ్శాఖలు పదియేనింటిలోను కాణ్వశాఖ ముఖ్యమైన దని చెప్పుచున్నది. వెనుక వాజసనేయశాఖకుఁ బ్రాధాన్య మిచ్చినది. వాజసనిపుత్రుఁ డయినయాజ్ఞవల్క్యుఁడు శుక్లయజుర్వేదమునకుఁ బ్రధానకారణ మని చెప్పినది. లోకములోఁ గూడ వాజసనేయసంహితయే ప్రాచుర్యము చెంది యున్న దనుటయు సత్యము. అయినను వాజసనేయసంహితను బ్రవర్తింపఁజేసినవారిలోఁ బ్రధానుఁడు కాణ్వుఁ డగుటచే నది కాణ్వశాఖ యనఁ బరఁగిన దని సమాధానము చెప్పుకొనవచ్చును గాని, కాణ్వాచార్యుని[1], అతనిశాఖలో నధికముగానున్నమంత్రములను నడుమ నడుమఁ జేర్కొనుచున్నను, కాత్యాయనముని ముఖ్యముగా మాధ్యందినశాఖ ననుసరించియే శుక్లయజుఃప్రాతిశాఖ్యము రచియించె ననియు, యాజ్ఞవల్క్యునివల్ల మధ్యందినమహర్షికి లభించినశాఖ మాధ్యందినీసంజ్ఞ నొప్పుచున్నదనియు, తత్పరిశిష్టభాష్యము చెప్పుచున్నది. ఇపుడీరెండుశాఖలలో నేది మొదటి దనఁ గలము? ఇట్లీవిషయము గజిబిజిగానున్నను తైత్తిరీయ వారతన్తవీయ ఖాండికీయ ఔఖీయ కఠ చరక కాలాప ఛాగలేయి మొద లగుయాజుషశాఖలు పాణినినాఁటికే వ్యాప్తిలో నున్నట్లష్టాధ్యాయివల్లఁ

1. అనుదాత్తం చే త్పూర్వం తిర్య క్త్విహత్య కాణ్వస్య. శు. ప్రా. 5-123.

దెలియుచున్నది[1]. కాని, అందలి 'పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు' అను సూత్రమును వివరించుచు భట్టోజీదీక్షితులు, భల్లుశాట్యాయనులను బురాతన మునులనుగా గణించి యాజ్ఞవల్క్యు నట్లు గణింపక పోవుట చూడఁగా వైయాకరణసంప్రదాయమునుబట్టి యితఁడు శాట్యాయనునికి సమకాలికుఁడు కాఁడని విదిత మగుచున్నది[2]. అతనికే సమకాలికుఁడు కాని యాజ్ఞవల్క్యుఁడు శాట్యాయనశాఖకాధారభూతుఁ డైనతిత్తిరికి సమకాలికుఁ డనుట యసంభవము కదా! అట్టియెడ నితని కతఁడు గురు వగుట యెట్లు పొసఁగును ?

పోనీ! కాండానుక్రమణినిబట్టి వైశంపాయనశిష్యుఁడు యాస్కుఁ డనియే యనుకొందము. అట్లయినఁ బాణిన్యాచార్యులు ప్రోక్తాధికారమునందు తిత్తిర్యాదుల నెందఱినో పేర్కొని తిత్తిరికి గురువై యాజుషప్రవక్తలలో నగ్రేసరుఁ డన నొప్పుయాస్కుని బేర్కొనకుండునా ? ఇంతకును యాస్కుఁడు నిరుక్తకారుఁ డనుప్రసిద్ధియే కాని వేదప్రవర్తకుఁ డన్నప్రసిద్ధి యెందును గనరాదు. పోనిండు ఇతనిమాట యటుంచి వైశంపాయనునిగూర్చి యాలోచింతము. ఇతనిని బాణిన్యాచార్యు లొకసూత్రమునఁ బేర్కొనిరి గాని, ప్రాచీనసంప్రదాయమును బట్టి దీక్షితు లతనిశిష్యులనుగా నాలంబులను బేర్కొనెను గాని, యాస్కయాజ్ఞవల్క్యులను గాని తుదకుఁ దిత్తిర్యాదులనుగాని వక్కాణింపలేదు[3]. నిజముగా నితఁడు యజుర్వేదపాఠమునకు మొదటియాచార్యుఁడే యైనచోఁ దైత్తిరీయములో నెందైన నతనిపేరు లేకుండునా ? కఠప్రోక్త మైనయారణ్యకమున నొకచోట వైశంపాయనుఁడు కనవచ్చునుగాని యం దతఁడుగొప్ప వేదప్రవక్తగాఁ గనఁబడఁడు. కఠాచార్యుఁడు, తనకు సమకాలికుఁడో లేక యించుకపూర్వుఁడో యైనవైశంపాయనుని యభిప్రాయమును సూచించినట్లుగా నాసందర్భము తెలుపుచున్నది[4]. కావున నెట్లయినను జరణవ్యూహము చెప్పినశాఖా క్రమముగాని కాండానుక్రమణి చూపినగురుశిష్యక్రమముగాని వాస్తవము గా దనియు, ఏమయినను వాజసనేయశాఖ తైత్తిరీయశాఖ కెంతో తరువాత బయలు దేఱిన దనియు నమ్మవచ్చును.

ఇట్లు కొన్నిశాఖలపేళ్లు తెలిసినను, అనేకశాఖలపేళ్లు దెలియ రాకున్నవి. తెలిసినవానిలో నైనను, అన్నియు సంహితాపాఠభేదమున నేర్పడినవి కావు. అందు శాట్యాయని హారిద్రవీయ ఛాగలేయి మొద లయినవి బ్రాహ్మణభేదమున

1. అష్టా—4-3-102, 107, 108, 109.

2. అష్టా 4-3-105, పురాణేన చిరంతనేన మునినా ప్రోక్తాః భాల్లవినః - శాట్యాయనినః- పురాణేతి కిమ్, యాజ్ఞవల్క్యాని బ్రాహ్మణాని-వ్యాఖ్య.

3. కలాపి వైశంపాయనాన్తేవాసిభ్యశ్చ-అష్టా. 4-3-104.

4. ఏతద్వైవాఽఽవృతాఽఽసహస్రసూర్యతాయా ఇతి వైశంపాయనః. ఆర. 1-7-5.

నేర్పడినవి. ఆపస్తంబి బౌధాయని సత్యాషాఢి హైరణ్యకేశి భారద్వాజి మొదలయినవి సూత్రభేదమున నేర్పడినవి. అయినను సంహితాపాఠభేదమున లోకమున వ్యాపించిన కొన్నిప్రధానశాఖలు గలవు. వానిచరిత్ర మించుక గ్రహింతము.

యజుస్సంహిత రూపమున నొకటి యయ్యు, నామమున 'కాఠక కాలాప తైత్తిరీయ వాజసనేయ' భేదమునఁ జతుర్విధమై భరతఖండమున వ్యాపించినది. వీనిలో మొదటిరెండును బ్రాచీనములు తరువాతిరెండు నర్వాచీనము లని యొకరు, తరువాతివానిలోఁ దైత్తిరీయముకూడఁ బ్రాచీనమే యని మఱియొకరు, తరువాతివిరెండే ప్రధానశాఖ లనియింకొకరు, ఈవిధముగాఁ బాశ్చాత్యపండితులు వివిధాభిప్రాయములు తెల్పి యుండిరి. వారి యభిప్రాయము లన్నియుఁ జర్చించి తైత్తిరీయము ప్రాచీనశాఖ యనెడియభిప్రాయము తేల్చియు, అది క్రీస్తుపూర్వము ౬౦౦ నాఁటి దని కీతుపండితుఁడు వ్రాసి యుండెను[1]. మన కిపుడు వారు గావించిన కాలనిర్ణయముతోఁ బని లేదు గాని పైశాఖలపౌర్వాపర్య మెట్టిదో విచారింతము.

"పతంజలిమహాభాష్యము, కాఠకకాలాపములు ప్రతిగ్రామమందును బఠనపాఠవ్యవహారమున వినఁబడుచుండె నని చెప్పెను గావునను, అయోధ్యలో నీరెండుశాఖలవారు గొప్పగా గౌరవింపఁబడుచుండి రని రామాయణము చెప్పెను గావునను, ఈశాఖలు రెండును క్రీస్తుశకారంభమునకుఁ బూర్వమే యెక్కువ వ్యాప్తిని బెందిన వని చెప్పవచ్చునుగాని తరువాత బయలుదేఱినతైత్తిరీయ వాజసనేయశాఖలు వీని నణఁచివైచినవి" అని మేగ్డోనలుపండితుఁడు వ్రాసెను[2]. పైరెండు గ్రంథములే శాఖల ప్రాచీనతకును వానివ్యాప్తికిని బ్రమాణము లయినచోఁ దైత్తిరీయమునకుఁ గూడ నట్టి భాగ్యము పట్టకపోలేదు.

"తిత్తిరి వరతన్తు ఖండి కో ఖాచ్ఛణ్" అనుపాణినిసూత్రమునకు భాష్యము వ్రాయుచుఁ బతంజలి తిత్తిరిణా ప్రోక్తః శ్లోకః'[3]. అనుటచే నతఁడు తైత్తిరీయసంహితావ్యాప్తినే కాదు, తైత్తిరీయారణ్యకవ్యాప్తిని గూడ నెఱిఁగి యుండె నని తెలియుచున్నది. తిత్తిరి ప్రోక్తమైన శ్లోకము లారణ్యకమునందు మాత్రమే కల వనుట విదితము, మఱియు, రామాయణములో శ్రీరాముఁడు, కఠకాలాపులను గౌరవించు మని చెప్పుటకు ముందే తైత్తిరీయులయాచార్యుని

1. ఆంగ్లీకృత కృష్ణయజుర్వేదపీఠిక. H. O. S. Vol. 18.

2. Sans. Lit P. 175, 176.

3. అష్టా, 4-3-102, భాష్యము.

సత్కరింపు మని సౌమిత్రితోఁ జెప్పినట్లు కనఁబడుచున్నది[1]. కావున నీరెంటిని బట్టి కఠకాలాపములకంటెఁ దైత్తిరీయ మర్వాచీన మనుట యుచితము కాదు గదా! ఇంక వీబరుపండితుఁడు, 'యజుర్వేదమునకుఁ దొలుత నధ్వర్యుశాఖ యనెడిపే రుండెడిది, తరువాతఁ గృష్ణయజుర్వేదమునకుఁ దైత్తిరీయశాఖ యనెడి పేరు వచ్చినది. అని చెప్పుచుఁ, గాండానుక్రమణిక చెప్పినవైశంపాయనాది గురుశిష్యక్రమ మసందర్భముగా నున్న దని ఖండించుచు, కృష్ణయజుర్వేదభాగ ములు మిక్కిలి భిన్నభిన్నములై సంకీర్ణములై సులభముగా గ్రహింప వీలులేని రూపముతో నుండుటనుబట్టి చూడఁగా దీనికిఁ దిత్తిరిపక్షిపోలికనుబట్టి తైత్తిరీయ మనుపేరు వచ్చియుండును గాని తిత్తిరినామకమహర్షిప్రోక్త మగుటచేఁ గా దని నిజాభిప్రాయ మావిష్కరించియుండెను[2]. దీనికిఁ గారణ మేమి? యాజ్ఞవల్క్య తిత్తిరిగాథ సత్యము గాకపోయినను, కృష్ణయజుస్సు తిత్తిరిపక్షిరూపమున నున్న దనుటయే దానియుద్దేశ మఁట! చూచితిరా యెట్లున్నదో! భారతీయు లయిన పాణిన్యాదులు మహర్షి యని భావించినవాఁడును వేదప్రవక్తలలో నగ్రగణ్యుఁడు నైనతిత్తిరిమహర్షి పాశ్చాత్యుల దృష్టిలో మానవుఁ డయినఁగాకుండఁ బోయెను. కావున ఖండాంతరవాసులు మన వేదశాస్త్రములు చదివి తెలిసినంతవఱకు వాని చరిత్రములు బయటఁ బెట్టి మనకు మార్గదర్శకు లైనందుకు సంతోషింపవలసి నదే కాని, వారు వ్రాసినదే వేద మని మాత్రము విశ్వసింపరా దని తెలుపు టకుఁ బై యుదాహరణములు రెండును జూపితిని.

మనదేశమునందు 'కాఠకము 'లని వాడఁబడుచున్న తైత్తిరీయ బ్రాహ్మ ణారణ్యకములలోని యెనిమిదిభాగములు మాత్రమే కఠప్రోక్తములు కావు. కృష్ణయజుర్వేదసంహితయంతయు, కఠసంహిత యనుపేర నొకకాలమున వ్యాపించి యుండె ననుట నిజము[3]. అది తొలుతఁ బంచాపదేశమందును దరువాతఁ గాశ్మీర దేశమందును విస్తరించెను. ఇప్పటికిని, కఠశాఖీయులు కాశ్మీరమం దున్నారఁట. దానినుండి కపిష్ఠల యనుపేర మఱియొకశాఖ బయలువెడలినది. దానినే కపిష్ఠల కఠశాఖ యని చరణవ్యూహము పేర్కొన్నది. 'కపిష్ఠలో గోత్రే.' యను

1. ఆచార్య స్తైత్తిరీయాణా మభిరూపశ్చ వేదవిత్. 15. రా. అయో. 32 సర్గ.
తస్య యానంచ దాసీశ్చ సౌమిత్రే సంప్రదాపయ।
కౌశేయాని చ వస్త్రాణి యావ త్తుష్యతి సద్విజః ॥ 16.
పశుకాభిశ్చ సర్వాభి ర్గవాం దశశతేనచ।
యే చే మే కఠకాలాపా బహవో దండమాణవాః ॥ 18.....

2, H. I. Lit. P. 87, 88.

3. ఋగ్వేదమునకుఁగూడ ; కఠశాఖ యున్నది.
బహ్వృచానా మప్యస్తి కఠశాఖా ఇత్యాది. అష్టా 7-4-38 వ్యాఖ్య.

సూత్రమునుబట్టి[1]. పాణినినాఁటి కిది యున్న దనుట విదితము. ఈ శాఖవారు తొల్లి కాశ్మీరమం దున్నట్లును, ఇపుడు వారిపే రంతరించినట్లును దెలియవచ్చు చున్నది గాని కపిష్ఠలసంహితమాత్రము కొంత ముద్రితమై యున్నది. 'దేవ సుమ్నయో ర్యజుషి కాఠకే' అను సూత్రమునుబట్టి[2]. కాఠకయజుశ్శాఖయు, 'కలా పినోఽణ్' అను సూత్రమునుబట్టి[3]. కాలాపయజుశ్శాఖయుఁ బాణినినాఁటికే ప్రాచీనము లనుట స్పష్టమేకాని, రెండవది మైత్రాయణీయశాఖగా మాఱి పోయిన దనియు, మైత్రాయణీయులు పూర్వము నర్మదానదీముఖద్వారము మొద లుగా నాసికాదేశపర్యంతము సముద్రమున కిరువదియామడదూరమందు నర్మదా నదీతీరమున నివసించియుండి రనియుఁ గొందఱు వ్రాసిరి[4]. వెనుకఁ జదివినట్లుగా మైత్రాయణీయశాఖను, దానిభేదము లైనమానవాదిశాఖలను జరణవ్యూహము చూపుచున్నది గాని, కాలాపము మైత్రాయణీయముగా మాఱిన ట్లందు గన రాదు. అయినను, పాణినీయ సంప్రదాయమునుబట్టి కలాపిశిష్యుఁ డైన హారి ద్రువు ప్రవక్తగాఁ దెలియుచున్నది[5] కాని, మైత్రాయణీయుఁడు కలాపుఁ డయి నట్లు తెలియరాదు. కాని, హారిద్రవము మైత్రాయణీయుల శాఖాభేద మని నిరుక్తవ్యాఖ్య చెప్పుటనుబట్టి కాలాపనామాంతరమో లేక కాలాపరూపాం తరమో మైత్రాయణీయ మగు నని యూహింపవచ్చును. ఈకాఠక కాలాప (మైత్రాయణీయ) సంహితలు మొన్న మొన్నటివఱకును బ్రచారములో నున్నట్లు వీని వ్రాఁత ప్రతులవలనఁ దెలియుచున్నది. ఇపు డివి ముద్రితములు నైనవి. కావున నివి తైత్తిరీయ వాజసనేయసంహితలవలె దేశమంతట వ్యాపింపక పోయి నను, ప్రాచీనము లనుట నిర్వివాదము. అందుచే నీ నాల్గింటి పౌర్వాపర్యమును వీనిస్వరూపమును గ్రంథవిస్తరము గాకుండ సంగ్రహముగానైన విమర్శించుట యావశ్యక మగుచున్నది.

### యజుశ్శాఖల పౌర్వాపర్యాదివిచారణ.

ఋక్శాఖీయులకు బహ్వృచులనియు సామశాఖీయులకు ఛందోగులనియు సామాన్యసంజ్ఞ లున్నట్లు యజుశ్శాఖీయులకు 'అధ్వర్యు'లనెడి వైదికసంజ్ఞ యనాదిసిద్ధ మైనది. తరువాత వారికిఁ బ్రవర్తకులనుబట్టి బాష్కలరాణాయనీ యాది విశేషసంజ్ఞలు వచ్చినట్లే తిత్తిరిమహర్షి ప్రవక్తగా వీరికిఁ దైత్తిరీయు లను

---

1. అష్టా. 8-3-91.
2. అష్టా. 7-4-38.
3. 4-3-108.
4. San. Lit P. 175.
5. కలాప్యన్తేవాసిభ్యశ్చ. హారిద్రుణా ప్రోక్త మధీయతే హారిద్రవిణః. సి. కౌ.
6. హారిద్రవో నామ మైత్రాయణీయానాం శాఖాభేదః. నిరు—10-5.

పేరు వచ్చినది. ఇది యెపుడు వచ్చినదో చెప్పుట యెవరికిని సాధ్యము కాదు గాని, కాఠకకాలాపసంజ్ఞలకంటె ముందుగా వచ్చిన దని మాత్రము చెప్ప వచ్చును. ఇందుకుఁ గొన్ని కారణములు.

౧. తైత్తిరీయసంహిత తైత్తిరీయబ్రాహ్మణము తైత్తిరీయారణ్యకము నను మూఁడు భాగములకుఁ దైత్తిరీయ విశేషణము వేఱువేఱుగా వ్యవహారమం దున్నను, మొత్తముగా వేదమున కంతకును, కృష్ణయజుర్వేద మనువ్యవహార మున్నట్లుగాఁ దైత్తిరీయవేద మనెడి వ్యవహార మెన్నఁడు నున్నట్లు కనఁబడదు. అందుచే బ్రాహ్మణ ముదయింపకమున్నే యజుస్సంహిత తిత్తిరిమహర్షి ప్రవక్తగాఁ దైత్తిరీయ సంజ్ఞఁ జెందిన దనుట కెక్కువయవకాశ మేర్పడుచున్నది.

౨. పాణిన్యాచార్యులు ప్రోక్తాధికారమందు యాజుషప్రవక్తల ననేకులను బేర్కొనుచు నందఱికంటె ముందు తిత్తిరిమహర్షిని బేర్కొని, యాసూత్రమునందే యతనితరువాతి ప్రవక్త యగు వరతన్తుని, తైత్తిరీయశాఖను విస్తరింపఁజేసిన – ఉఖ ఖాండికేయులను గూర్చియున్నాఁడు. పాణిని తెలిపిన యీ క్రమము వైదికసంప్రదాయసిద్ధ మనుటకుఁ జరణవ్యూహ మిచ్చిన తైత్తిరీయార్ష క్రమమును, కాండానుక్రమణిక యిచ్చిన యార్షానుక్రమమును నిదర్శనము లగుచున్నవి.

3. కఠకాలాప (మైత్రాయణీయ) ములకు వేఱుగా బ్రాహ్మణారణ్యకాత్మక మైనగ్రంథము లేదు. తైత్తిరీయసంహితలోఁ గలిసియున్నమంత్ర బ్రాహ్మణభాగములు మాత్రమే యక్కడక్కడఁ గొంచెము లోపించియు నందందు కొంచెము పాఠభేదము చెందియు నెడనెడ నించుక ముందువెనుకలయ్యు నున్నంత వఱకు సరిగాఁ దైత్తిరీయసంహితలో నున్నట్లే కఠకలాపసంహితలందు గనవచ్చుచున్నవి. అందుచే నివి రెండును దైత్తిరీయముకంటె భిన్నములు కానివయ్యుఁ బ్రవర్తకులనామములనుబట్టి కాఠకకాలాపసంజ్ఞలు చెందినవనియు, అందుచేతనే యివి యస్వతంత్రములై సంహితాభాగముతోనే నిలిచిపోయిన వనియుఁ దెల్లమగుచున్నది.

౪. కఠముని దృష్టములు[1] లేక కఠప్రోక్తము లని యెనిమిది చిన్నభాగములను దరువాతఁ గఠసంహిత వేఱుగా నార్జించినది. స్వతంత్రమును బురాతనము నైన తైత్తిరీయమునకుఁ గఠశాఖ యనుబంధశాఖ గావుననే యాయెనిమిదిభాగములు నైదుప్రపాఠకములుగాఁ దైత్తిరీయబ్రాహ్మణారణ్యకములందు ప్రవేశింపఁగలిగినవి. నిజముగాఁ గఠశాఖ తైత్తిరీయమునకు లోఁబడినది కానిచో నాభాగము లిందు చేరుటకుఁ దైత్తిరీయులు నంగీకరింపకుండెడివారు. కఠులును సమ్మతింపకుండెడివారు.

---

1. కఠేన మునినా దృష్టం (ప్రోక్తం) కాఠకం పరికీర్త్యతే. తై. సం. భాష్యము.

౫. ఆ యెనిమిదిభాగములకే తప్పఁ దక్కిన బ్రాహ్మణాది గ్రంథమునకుఁ గాఠక మనుపేరు లేకుండుటచేతను, ఆభాగముల కాఱు రెట్లెక్కువగా నున్న ముప్పదిమూఁడు ప్రపాఠకములకుఁ దైత్తిరీయ బ్రాహ్మణారణ్యకము లనుపేరుండుటచేతను, కఠశాఖకుఁ దైత్తిరీయశాఖ లోఁబడిన దనుటకు వీలు లేదు. ఇది ప్రాచీనతమము గావుననే కఠాదులకంటె నూఱురెట్లెక్కువగా భరతఖండమంతట వ్యాపించి నాఁటివివిధదేశార్యుల యాదరమునకుఁ బాత్రమైనది.

౬. మైత్రాయణీయసంహితను బ్రకటించిన ష్రోడరుపండితుఁడు, పైంగి యాస్కుఁడు తిత్తిరికి గురు వనెడికాండానుక్రమవచనము విశ్వసించి, ఆయాస్కునినిరుక్తమందు కాఠకహారిద్రవ (కాలాపమైత్రాయణీయ)ములు పేర్కొనఁబడెనుగాని తైత్తిరీయము పేర్కొనఁబడలేదు గావున వానికంటె నిది యర్వాచీన మని యొకయభిప్రాయము ప్రకటించెను[1] గాని యిది యనాదరణీయ మనుట కనేకహేతువు లున్నవి. కాండానుక్రమణిలోని గురుశిష్యక్రమము సరియైనది కా దని యింతకుమున్నే తెలిసికొనియున్నాము. పైంగియాస్కుఁడు తిత్తిరిగురువు కాఁడు, నిరుక్తకారుఁడు కాఁడు. గైరిక్షితు లైనయాస్కులు వేదోపాధ్యాయు లైనట్లుగా, కాఠకము చెప్పుచున్నది[2]. కఠశాఖీయుఁ డైన యాస్కుఁడు గైరిక్షితయాస్కగోత్రమునకుఁ జెందినవాఁ డగుటచేఁ గఠసంహిత లోనిమంత్ర ముదాహరించెను. ఇంతకు నామంత్రము కఠసంహితలోని దానికంటెఁ దైత్తిరీయములోని దానినే యెక్కువగాఁ బోలియున్నది. ఆయుదాహరణ మిది.

'య దరుద త్తద్రుద్రస్య రుద్రత్వమ్' ఇతి కాఠకమ్,
'యదరోదీ త్తద్రుద్రస్య రుద్రత్వమ్' ఇతి హారిద్రవికమ్[3].

ఇది, కాఠకములో 'యత్ సమరుజ త్తద్రుద్రస్యరుద్రత్వమ్' అని కనఁబడుచున్నది[4]. రెండవది యైనహారిద్రవికపాఠము సరిగా నట్లే తైత్తిరీయమునఁ గనవచ్చుచున్నది[5]. రెండుసంహితలలో నొకటిగాఁ గనఁబడుచున్నది మొదటిపాఠ మనుట యుచితము గావునఁ గాఠకములోనిది మాఱినపాఠ మని తలంచుట యుక్తము. అది గాక నిరుక్తము తైత్తిరీయము నుదాహరింపకపోయినంత మాత్రమున నిది యర్వాచీన మనుట తగదు గావున నతఁ డున్నచోటఁ గాఠకహారిద్రవములకుఁ బ్రచార మెక్కువగా నుండుటచే నతఁడు వాని నొక్కచోట నుదాహరించినను దైత్తిరీయ మెఱుఁగనివాఁడు కాఁ డని భావింపవచ్చును. పైకారణములనుబట్టి తక్కినయజుశ్శాఖ లన్నిటికిని దైత్తిరీయశాఖ తల్లి యని నాయభిప్రాయము. వాజసనేయశాఖ కఠకాలాపములకంటె నర్వాచీన మనుట

1. కేతు యజుర్వేదపీఠిక—2. కాఠకసంహిత, 13-12.—3. నిరు - 10-5.—4. 25-1. 5. 1-5-1-1.

నిజము. ఈ నాలుగు సంహితలయందలి మంత్రభాగము సమానరూపము. వాజసనేయ సంహితలో బ్రాహ్మణము లేదు. ఆ భాగము వేఱుచేయఁబడినది. తక్కిన మూఁడింటిలోను బ్రాహ్మణముకూడ సమానముగానే యున్నది. వాజసనేయ సంహితనుగూర్చి ప్రత్యేకముగాఁ గొంత వ్రాయఁబడునుగాని యిపుడు సంహితైక్యము తెలుపుటకై యొకటి రెండు పోలికలు చూపఁబడుచున్నవి. ఈ సంహితల యేకీభావము చూపుచు, ఏ. బి. కీతుపండితుఁడు పెద్దపట్టిక యొకటి తన యాంగ్లీకృతయజుర్వేదపీఠికలోఁ జూపియున్నాఁడు. విశేషములు దానివల్ల గ్రహింపనగును.

కఠసంహిత నాలుగుకాండములు, ఏఁబదినాలుగు ప్రపాఠకములు. కాండములలోఁ గడపటిది ఖిలకాండ మని వ్యవహరింపఁబడుచున్నది. (కాలాప) మైత్రాయణీయసంహిత ముప్పదితొమ్మిది ప్రపాఠకములు. ఈ రెండు సంహితలను స్కో్రిడరుపండితుఁడు ప్రకటించియుండెను. ఈ రెండు సంహితలలోని భాషయు సమానముగానే యుండి తైత్తిరీయసంహితాభాషను బోలియున్నది. వాజసనేయ సంహితలోని స్వరరీతి వీనిస్వరరీతికంటె మాఱినది. అక్కడక్కడ మంత్రములలోని కొన్నిశబ్దములలో నించించుక మార్పు కనవచ్చుచుండును.

'ఇషేత్వా' యనెడి యనువాకము నాలుగుసంహితలలోను సమానముగా మొదటనే యున్నది. కాని యందు కొంచెము మార్పుకలదు.

ఇషేత్వోర్జేత్వా వాయవస్థోపాయవస్థ దేవోవః సవితా ప్రార్పయతు - తైత్తిరీయము.

ఇషేత్వాసుభూతాయ వాయవస్థదేవోవః సవితా - మైత్రాయణీయము.

ఇషేత్వోర్జేత్వా వాయవస్థ దేవో వః సవితా-వాజసనేయము.

'కఠసంహిత నాకు లభింపలేదు గాని యందలిపాఠము చాలావఱకు మైత్రాయణీయపాఠమునే పోలియుండు నని కొందఱు వ్రాసిరి. ఇట్లు తైత్తిరీయములోని కొన్నిశబ్దములు తక్కినవానిలో లేకుండుటయు నందు లేనిశబ్దములు కొన్ని యిం దుండుటయు నచ్చటచ్చటఁ గనవచ్చునుగాని, తైత్తిరీయములో నున్నపౌరోడాశికాధ్వరదక్షిణాపునరాధే యాదివిషయము లన్నియుఁ దక్కినసంహితలందు గలవు. ఇందు కొకయుదాహరణము. రాజసూయము తైత్తిరీయము మొదటికాండమెనిమిదవ ప్రపాఠకము మొదటియనువాకము. అదే కాఠకమునఁ బదియేనవప్రపాఠకము మొదటి యనువాకము. అదే మైత్రాయణీయమున రెండవకాండమాఱవ ప్రపాఠకము మొదటి రెండనువాకములు.

ఇట్లు పెక్కుశాఖలు గనవచ్చుచున్నను దొలుతఁ జెప్పినట్లుగా గణింపఁదగిన శాఖలు తైత్తిరీయవాజసనేయములు రెండే. కృష్ణయజుర్వేదమునకు సంబం-

ధించినకఠాదిశాఖ లన్నియుఁ దైత్తిరీయమురూపాంతరములు గాని యన్యశాఖ లనఁదగవు. ఇట్లే కాణ్వమాధ్యందినాదిశాఖ లన్నియు శుక్లయజుర్వేదమునకు సంబంధించినవాజసనేయమురూపాంతరములే కాని యన్యములు కావు. అందుచేఁ దక్కినవన్నియుఁ గూడ శాఖలుగా వాడఁబడుచున్నను, తొలుతఁ జెప్పినట్లుగా యథాస్థితయజుస్సంహిత తైత్తిరీయ మనియు దానినుండి విడిపోయిన వాజసనేయ సంహితమాత్రమే శాఖగా గణింపఁదగిన దనియుఁ దెలియనగును. కావుననే మఱి యేదనికిని ద్వితీయశాఖ తృతీయశాఖ యనెడివ్యవహారము లోకములో నెన్నఁడు నెక్కడను లేకపోయినను వాజసనేయమునకు మాత్రమే మనదేశమునఁ బ్రథమ శాఖ యనుపే రెట్లో వచ్చినది.

ఇట్టియజుర్వేదము సరస్వతీదృషద్వతీ శుతుద్రీయమునాతీరముల మహర్షి దృష్టమై వెలసి కురుపాంచాలదేశములందును గంగాతీరభూములందును నర్మదా దక్షిణోత్తరములందును జక్కఁగా వ్యాపించి క్రమముగా ఘూర్జరమహారాష్ట్ర ద్రవిడకర్ణాటాంధ్రములందు విస్తరించెను. అందు, ఆంధ్రదేశమున నాగ్నేయ దిశను గోదావరిమొదలుగా సముద్రపర్యంతము తైత్తిరీయ మాపస్తంబి యను పేరను, నైరృతిదిశను సహ్యాద్రి మొదలుగా సముద్రపర్యంతము హైరణ్యకేశి యనుపేరను, వాయవ్యదిశను మయూరపర్వతము మొదలుగా గూర్జరదేశపర్యం తము మైత్రాయణీయ మనుపేరను వ్యాపించినది. వాజసనేయము మాధ్యందిని యనుపేర నంగవంగ కళింగగూర్జరదేశములందును, కాణ్వశాఖ యనుపేర నఖల దేశములందును వ్యాపించినది. భరతఖండమందలి పుస్తకభాండాగారములలోని వ్రాఁత పుస్తకముల పట్టికలనుబట్టి చూడఁగా నీ రెండుశాఖలు భరతఖండమంత టను జక్కఁగా వ్యాపించినట్లు కనఁబడును గాని, రానురా నుత్తరహిందూదేశ మున వాజసనేయశాఖ యెక్కువగాను, తైత్తిరీయశాఖ తక్కువగాను, దక్షిణ హిందూదేశమునఁ దైత్తిరీయ మెక్కువగాను వాజసనేయము తక్కువగాను బఠన పాఠవ్యవహారముల నిలచినట్లు తెలియవచ్చుచున్నది. ఇట్లు బహునామ రూపముల దిగంతములవఱకును వ్యాపించిన యజుర్వేద యథాస్థితరూప మగు తైత్తిరీయ సంహితను ముందుగా గ్రహింతము.

## తైత్తిరీయసంహితావిభాగము.

ఈ సంహితయందలి ప్రధానభాగములు కాండములు లేక, అష్టకములు. ఒక్కొక్కయష్టకము, ప్రపాఠకములు లేక ప్రశ్నములుగాను; ఒక్కొక్కప్రశ్న మనువాకములు గాను ; ఒక్కొక్కయనువాకము, కండికలు లేక పంచాశత్తులు గాను ; విభజింపఁబడినవి.

| అష్టకము. | ప్రశ్నలు. | అనువాకములు. |
|---|---|---|
| ౧ | ౮ | ౧౪౬ |
| ౨ | ౬ | ౭౫ |
| ౩ | ౫ | ౫౫ |
| ౪ | ౭ | ౮౨ |
| ౫ | ౭ | ౧౨౦ |
| ౬ | ౬ | ౬౬ |
| ౭ | ౫ | ౧౦౭ |
| | ౪౪ | ౬౫౧ |

పై ౬౫౧ అనువాకములలోను ౨౧౯౮ కండికలు లేక పంచాశత్తులు కలవు. ఏఁబదిపదముల సమూహము పంచాశత్తనఁబడును. ఇది తెలుఁగుదేశమునందు పనస యని చెప్పఁబడుచున్నది. పదపాఠమునుబట్టి వచ్చినపదములసంఖ్య ౧౯౨౯౦. అక్షరముల సంఖ్య ౨౫౩౮౬౮ శాఖావాక్యముల సంఖ్య ౧౯౪౮౮.

పైని జూపిన ౪౪ ప్రశ్నలు సంహిత యనఁబడుచున్నను, అది యంతయు మంత్రము కాదు. అందు మంత్రమునకు వ్యాఖ్యానరూప మైనబ్రాహ్మణము గూడ మిళితమై యున్నది. మఱియు బ్రాహ్మణ మని చెప్పఁబడు నితరకాండములు మూఁడింటియందును కేవలము బ్రాహ్మణమే లేదు. అందును మంత్రభాగము కలదు. అందలి మంత్రభాగమున కందే బ్రాహ్మణ ముండుటయే కాదు, బ్రాహ్మణములోని కొంతమంత్రభాగమునకు సంహితలోని కొంతభాగము బ్రాహ్మణముగాఁగూడ నున్నది. అట్లే యారణ్యకమందును గొంత మంత్రము కొంత బ్రాహ్మణము కూడ నున్నది. అందలిమంత్రమునకు బ్రాహ్మణములోఁ గొంత బ్రాహ్మణముగా నున్నది[1]. ఇట్లున్న యీసంహితా బ్రాహ్మణారణ్యకములలాయా క్రతువిశేషములందును వ్రతాదులందును వినియోగపడుచున్నను, ఆవినియోగము ననుసరించినమంత్రక్రమ మిందు గనరాదు. అట్టి యీ మూఁడింటిలోని మంత్రబ్రాహ్మణములు కర్మవినియోగమునుబట్టి యేఁబదిరెండు కాండములుగా విభజింపఁబడినవి. ప్రజాపత్యాది ఋషులు దర్శించిన యీకాండము

1. సం - 1·6 ప్ర. సగమునకు 7. ప్ర. లో. సగము బ్రాహ్మణము—1·7 ప్ర. లో, సగమునకు 1·4 ప్ర. అంతయు బ్రాహ్మణము—4·7 ప్రశ్నలకు 5·4 ప్రశ్నలు బ్రాహ్మణము—3.అష్టములో మంత్రము బ్రాహ్మణము కలసియున్నవి. బ్రా. 3·5, ప్రశ్నకు, సం. 2·5,6. ప్రశ్నలు బ్రాహ్మణము. ఆర. చిత్తిస్స్రుగిత్యాదిమంత్రములకు, బ్రా. 2.2,3, ప్రశ్నలు బ్రాహ్మణము—ఆర. 4 ప్రశ్నకు 5 ప్ర. బ్రాహ్మణము. సం - 5·7 ప్రశ్నలతుదియనువాకములకు. బ్రా. 3. 8,9. ప్రశ్నలు బ్రాహ్మణము. ఇట్లు సర్వత్ర మంత్రబ్రాహ్మణములకలయిక కనవచ్చును.

లీమూఁడింటియందు గూడ నందందు గనవచ్చుటంజేసి ఋషులనుబట్టి కాండములు నిర్ణయించుటకై బ్రాహ్మణారణ్యకములలోని భాగములను గూడ నిక్కడఁ జూపుట యావశ్యక మగుచున్నది. బ్రాహ్మణము మూఁడుకాండములు. అవి యష్టకములుగాను, అష్టకము, ప్రపాఠకములు లేక ప్రశ్నములుగాను, ప్రశ్న మనువాకములుగాను విభజింపఁబడినవి. ఆరణ్యకము, ప్రపాఠకములుగాను, అనువాకములుగాను విభజింపఁబడినది. ఆవిభాగ మిట్లు.

తైత్తిరీయ బ్రాహ్మణవిభాగము.

| అష్టకము. | ప్రశ్నలు. | అనువాకములు. |
|---|---|---|
| ౧ | ౮ | ౭౮ |
| ౨ | ౮ | ౯౬ |
| ౩ | ౧౨ | ౧౬౪ |
| | ౨౮ | ౩౩౮ |
| ఆరణ్యకమున ... | ౧౦ | ౨౧౮ |
| పరిశిష్టదశమ ప్రపాఠకమున ... ... | | ౮౦ |

సంహితలోని ౪౪ ప్రశ్నలును, బ్రాహ్మణారణ్యకముల ౩౮ ప్రశ్నలును గలసి మొత్తము ౮౨ ప్రశ్నలు. ఈ మొత్తము కృష్ణయజుర్వేద మనఁబడుచున్నది. ఆర్షక్రమమునుబట్టి కాండానుక్రమణిక యీ ౮౨ ప్రశ్నలను ౫౨ కాండములనుగా విభజించినది. అందుచేఁ జెప్పఁబోవుకాండము లాయాఋషులు దర్శించినవేదభాగములగుంపు లని యెఱుంగునది. అట్టి సంహితా బ్రాహ్మణారణ్యకములలోని యేయేకాండము లేయేఋషులపేరఁ బ్రసిద్ధి కెక్కెనో యీక్రింది విధముగాఁ దెలియనగును.

కాండములు – ఋషులు[1].

ప్రాజాపత్యకాండములు ౯ – పౌరోడాశికమంత్రములు – యాజమానమంత్రములు – యాజమానవిధి – దార్శికహౌత్రవిధి – దార్శికహౌత్రమంత్రములు – పౌరోడాశికవిధి – హోతృవిధి – హోతృమంత్రములు – పితృమేధము – అనునవి. వీనికిఁ బ్రజాపతి ఋషి. ఇందు మొదటి నాలుగును సంహితలోనివి. తరువాతిమూఁడును బ్రాహ్మణములోనివి. కడపటిరెండు నారణ్యకములోనివి[2].

1. క్రిందఁ జూపుచున్న సంహితా బ్రాహ్మణముల భాగములలోని యంకెలు అష్టకప్రశ్నానువాకక్రమమునను, ఆరణ్యభాగములయంకెలు ప్రపాఠ కానువాక క్రమమున నుండును. ఒకటియే యంకె యున్నచో మొదటిభాగమే యగును. విశేష మున్నచోట అక్షరము గుర్తుగా నుండును. చిల్లరగా నున్నయనువాకములు చూపఁబడ లేదు.

2. 1·1; 1·6; 1·7·2·5-6 ప్ర:—3·5, 3·2-3 ప్ర; 2·2-3 ప్ర;—3; 6;

సౌమ్యకాండములు ౯ - ఆధ్వరము - గ్రహములు - దక్షిణలు-అధ్వర విధి గ్రహవిధి దక్షిణావిధులు - వాజపేయమంత్రములు - వాజపేయవిధి - సవములు - ప్రవర్గ్యము - ప్రవర్గ్యవిధి - అనునవి. వీనికి సోముఁడు ఋషి, ఇందు మొదటినైదును సంహితలోనివి. తరువాతి రెండును బ్రాహ్మణములోనివి. కడపటి రెండు నారణ్యకములోనివి[1].

అగ్నేయకాండములు ౭.—పునరాధేయమంత్రములు పునరాధేయవిధి-అగ్న్యుపస్థానమంత్రములు తద్విధులు - అగ్ని లేక చయనమంత్రములు - చయనవిధులు - చయనోపానువాక్యములు - అగ్న్యాధేయమంత్రములు తద్విధులు - అగ్నిహోత్రవిధి - అనునవి. వీని కగ్నిఋషి. ఇందు మొదటినైదును సంహితలోనివి. తక్కిన రెండును బ్రాహ్మణములోనివి[2].

వైశ్వదేవకాండములు ౧౮—రాజసూయము - రాజసూయ బ్రాహ్మణానుబ్రాహ్మణములు - కామ్యపశువులు - కామ్యేష్టులు - ఉపానువాక్యములు - యాజ్యలు - అశ్వమేధ మంత్రములు - సాత్రాయణము - అశ్వమేధవిధి - సాత్రాయణవిధి - ఉపహోమములు - కౌకిలి, లేక సౌత్రామణి - సూక్తములు - నక్షత్రేష్టి - అచ్ఛిద్రములు - పాశుకహౌత్రము - నృమేధము - అనునవి. వీనికి విశ్వేదేవులు ఋషులు. ఇందు మొదటియేడును సంహితలోనివి. తక్కిన తొమ్మిది బ్రాహ్మణములోనివి[3].

ఉపనిషత్కాండములు ౩—ఆరణ్యకములోని సప్తమప్రపాఠకము సాంహితీయము. దీనికి సాంహిత్యుపనిషత్తు ఋషి.

ఆరణ్యకములోని యష్టమనవమప్రపాఠకములు వారుణీయము. దీనికి వారుణ్యుపనిషత్తు ఋషి.

ఆరణ్యకములోని దశమప్రపాఠకము యాజ్ఞికీయము. దీనికి యాజ్ఞిక్యుపనిషత్తు ఋషి.

ఇట్లు పైని జూపిన ౪౪ కాండములును, తిత్తిరిశాఖాకాండము లనఁబడును. ఇంక—

కాఠకములు ౮—అందు సావిత్రము - నాచికేతము - చాతుర్హోత్రము-వైశ్వసృజము - అను నాలుగును హవ్యవాహీయము లనఁబడును. వీనికి హవ్యవాహుఁడు ఋషి. ఇవి బ్రాహ్మణములోనివి[4].

1. 1·2-3 ప్ర; 1·4; 1-4; 6; 1.7·7-13;—1·3; 2·7;—7; 8;

2. 1·5·1—4; 1·5·5—11; 4; 5·1-4 ప్ర, 5·5—7 ప్ర;—1·1,2, ప్ర; 2,1.

3. 1·8, 1·6—8 ప్ర, 2·1; 2·2—4 ప్ర; 3; 1·1 ప్రశ్న మొదలుగా 4·3 ప్రశ్నాంతిమానువాకమువఱకును 4·4·7, ప్రశ్నల తుదియనువాకములు; 5·7; 7;—3·8-9 ప్ర· 1·2-4 ప్ర; 2·4-5 ప్ర: 2·6: 2·8; 3.1; 3–7; 3·6; 3·4;

4. తై. బ్రా. 3·10.11. ప్ర; 12 ప్ర·5-9 అనువాకములు.

ఆరణ్యకములోని మొదటిప్రపాఠక మారుణకేతుచిత్య మనఁబడును. దీని కరుణులు ఋషులు.

దివశ్శ్యేనేష్టులు - అపాఘేష్టులు - అనునవి వైశ్వదేవకాండ మనఁబడును. దీనికి విశ్వేదేవులు ఋషులు[1].

ఆరణ్యకము ద్వితీయప్రపాఠకము స్వాయంభువకాండము. దీనికి స్వయంభువు ఋషి.

ఇట్లు చూపిన ౫-౯ కాండములు గాక, ప్రస్నగ్మ నైతిప్రశ్నద్వయమును గొన్ని వైశ్వదేవమంత్రములును, ఏకాగ్నికాండ మనఁబడుచున్నవి. ఈ కాండమునకు విశ్వేదేవులు ఋషులు.

ఇట్లు ప్రజాపత్యాదులపేరఁ గనవచ్చుకాండములు సంహితాబ్రాహ్మణారణ్యకములందు సంకీర్ణములై యున్నను, ఈపాఠము సరస్వతీదేవి తనపుత్త్రునికిఁ జెప్పిన దగుటచే సర్వవిద్యానిధి యైన యాసారస్వతుఁడు పఠించినక్రమముననే యీవేద మధ్యయనము చేయవలెను గాని దాని నతిక్రమింపరాదు. ప్రజాపత్యాది కాండర్షులకు బ్రాహ్మణుఁడు శుచియై నిత్యము తర్పణము చేయవలెను. అని కాండానుక్రమణిక శాసించియున్నది. ఈ కాండర్షితర్పణమును సూత్రములును విధించుచున్నవి[2]. కావునఁ దై కాండములకును బ్రజాపత్యాదులకును గలసంబంధము తెలిసికొన యత్నింతము.

బ్రహ్మయజ్ఞాంగ తర్పణవ్రతహోమాదులందు "ప్రజాపతిం కాండర్షిం తర్పయామి - సోమం కాండర్షిమ్ - అగ్నిం కాండర్షిమ్ - విశ్వాన్ దేవాన్ కాండర్షీన్ - సాంహితీ ర్దేవతా ఉపనిషదః - యాజ్ఞికీ ర్దేవతా ఉపనిషదః - వారుణీ ర్దేవతా ఉపనిషదః - బ్రహ్మాణం స్వయంభువమ్ - సదసస్పతిమ్-" అని తొమ్మండుగురు పేర్కొనఁబడుచున్నారు. వీరిలో మొదటి నలుగురికిని సర్వత్ర కాండర్షిసంజ్ఞ కనవచ్చుచున్నది. స్వయంభువునకు వ్రతహోమాదులందు మాత్రము కాండర్షిసంజ్ఞ యొప్పుచున్నది. ఉపనిషత్తులు సర్వత్ర దేవతలుగానే చెప్పఁబడుచున్నారు. వీ రెనమండుగురికి మాత్రమే పూర్వోక్త కాండములతో సంబంధము కనఁబడుచున్నది. సదసస్పతికి వానితో సంబంధము లేక పోయినను, కాండర్షి తర్పణహోమాదులందు సర్వత్ర యతఁడు పేర్కొనఁ బడుచున్నాఁడు. హవ్యవాహీయకాండములకు హవ్యవాహుఁడు ఋషి యైనట్లు చెప్పఁబడినను, అతఁడు కాండర్షితర్పణమునఁ గనరాఁడు. అట్లే, ఆరుణకేతు చిత్యమున కరుణులు

1. తై. బ్రా. 3-1 2 ప్ర. 1-4 అనువాకములు.

2. బౌధాయనగృహ్యసూత్రము.

ఋషు లైనట్లున్నను "అరుణాః కాండఋషయః"[1]. అని యారణ్యకము చెప్పుచున్నను, వారును గాండర్షితర్పణమునఁ గనరారు. ఇదంతయుఁ జూడఁగాఁ గాండముల యేర్పాటు మిక్కిలి గజిబిజిగా నున్నట్లే కాండర్షుల విషయ మగమ్యగోచరముగానున్నది. దీనినిబట్టియు, పూర్వోక్తకాండములయందు ప్రజాపతి సో మాగ్ని విశ్వేదేవ స్వయంభువు లనుదేవవిశేషుల ప్రశంస యధికముగా నుండుటను బట్టియుఁ జూడఁగాఁ గాండర్షు లనఁబడువారు యాగవ్రతాదులందు స్తుతింపఁబడుదేవతలే కాని యాజుషమంత్రద్రష్టలు కారేమో యని సంశయింపవలసివచ్చుచున్నది. ఇందుకు మఱికొన్ని హేతువులు :—

వందలకొలఁదిగా నున్నఋక్సంహితా ద్రష్టలాయాసూక్తములతో నను క్రమణికలకు లభించినట్లుగా, యాజుషకాండములఋషు లనఁబడువారు లెక్కకెనమండుగురే యైనను వారిలో ముగ్గురిపేళ్లు కాండానుక్రమణికకు లభింపలేదు. అందుచేతనే సాంహిత్యాదు లైనయుపనిషత్తులకు సాంహితీయాజ్ఞికీవారుణీనామకోపనిషత్తులే ఋషు లని చెప్పవలసివచ్చినది. సంహితాధ్యాయరూప మైనది సాంహితి, అది శీక్షావల్లి. వరుణునిచేఁ బ్రవర్తింపఁజేయఁబడినది వారుణి, అది యానందల్లీభృగువల్లులు. యజ్ఞోపయుక్తమంత్రములు కొన్ని కలది యాజ్ఞికి, అది నారాయణము. ఉపనిషత్తులస్థితి యిది యని విషయమునుబట్టియు భాష్యాదులను బట్టియుఁ గూడఁ దెలియవచ్చుచుండఁగా సాంహిత్యాదుల కవియే ఋషు లనుటకుఁ గారణ మేమి? తద్ద్రష్టల నామములు లభింపకపోవుటయే కదా! దీని నిట్లుంచి తక్కిన కాండర్షి నామములలోఁ గూడ నొక దానిని గైకొని పరిశీలింతము.

సౌమ్యకాండములందు ప్రధానవిషయము సోమయాగము. "ప్రపాఠకత్రయే ఽథ సోమయాగః ప్రవక్ష్యతే" అని సాయణాచార్యు లాకాండము మొదటనే యందలివిషయ మిది యని వక్కాణించి యున్నారు. భట్టభాస్కర మిశ్రులు నీయభిప్రాయమే యావిష్కరించిరి. నిజముగా నాకాండములందు సోమ సోమయాగవిధానములే వివరింపఁబడినవి. అయినను, సోముఁ డనునొక మహర్షియే సోమయాగము నట్లు వర్ణించె నని చెప్పినఁ జెప్పవచ్చును గాని, ద్రష్టలనామములు తెలియక యుపనిషత్తుల కుపనిషత్తులు ఋషు లన్నట్లే సోమమునకు సోముఁడు ఋషి యని కాండానుక్రమణిక భావించినట్లు మాత్రము స్ఫురింపపోదు. ఇట్లే తక్కినఋషులనామములు గూడఁ దత్తత్కాండ విషయ ప్రధానములై కనవచ్చుచున్నవి. ప్రజాపతికాండములలో నొకచోట - ఆశ్రావయ - అస్తుశ్రౌషట్ - యజ - యే యజామహే - వౌషట్ అనెడిపదియే

1. ఆర. 1-31,

డక్షరముల నైదుమంత్రములును బ్రజాపతిసృష్టము లని కనవచ్చుచున్నను[1]. ఆమంత్రములభావముగాని ప్రకరణోద్దేశముగాని చూచినచో మంత్రద్రష్ట యైన యొకానొకఋషి, పై పంచమంత్రములును లోకస్రష్ట యగుప్రజాపతి వల్ల నావిర్భవించి సకలయజ్ఞానుగతములై నవని తన్మంత్రమహిమను దెలుపుచున్నట్లు కనవచ్చునుగాని యాకాండము ప్రజాపతిమహర్షిదృష్ట మనెడిభావము కనరాదు. ఇది యిట్లుండ మఱియొక విషయము:—

ఈ సంహితలోని నాల్గవయష్టక మగ్నికాండ మనఁబడుచున్నది. అతఁడు కాండర్షి యగుటచే దానికి ద్రష్ట యతఁ డని చెప్పవలసినదే. అందలిమంత్రములు చయనమందలి యగ్నిని బ్రతిపాదించుచున్న వనుట సత్యము. అయినను, ఋగ్వేదమందలి యగ్నిఋషివలెనే యతఁడును ఋషి యని యంగీకరింతము. ఈ యష్టకము మొదటి ప్రపాఠకమున నెనిమిదవ యనువాకమున నిరువదిఋక్కులున్నవి. అందు కడపటి యెనిమిదిఋక్కులు ఋగ్వేదము ౧౦_౧౨౧ సూక్తమున సరిగా నొకయక్షరమైన భేదము లేకుండ నట్లే కనఁబడుచున్నవి. అవి 'హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే' ఇత్యాదికములు. ఇవు డీఋక్కులను దర్శించిన ఋషి యజుర్వేదసంప్రదాయమునుబట్టి యగ్నియనమా ? లేక, ఋగ్వేదసంప్రదాయమునుబట్టి ప్రజాపతిపుత్రుఁ డయినహిరణ్యగర్భుఁ డనమా ? హిరణ్యగర్భరూపుఁడును స్వయంభువును సృష్టికర్తయు నగుప్రజాపతిని వర్ణించునాసూక్తమును బట్టి చూచినను, అగ్నివర్ణనముతో నారంభ మయిన యాయనువాకమును బట్టి చూచినను వీరిద్దఱును గూడ మంత్రద్రష్టలు గాక యందలివిషయభూతులైనదేవవిశేషులే యట్లు ఋషులుగాఁ బేర్కొనఁబడి రని తోఁచుచున్నను, అగ్నియే తొలుత నామంత్రములను దర్శించె నని యాజుషు లనవచ్చును, హిరణ్యగర్భుఁడే తొలుతఁ జూచె నని బహ్వృచు లనవచ్చును. ఒకరిమంత్రములు మఱియొకరు చూడలేదు. ఎవరికి వారే యట్లామంత్రములు దర్శించియుందు రని మధ్యవర్తు లనవచ్చును. ఎట్లయినను సమానశబ్దార్థములైనమంత్రములకు ద్వివిధార్షేయత్వము తప్పదు. మఱియు నిట్లే యీసంహితలోని "అగ్నేత్వం పారయా - అగ్నేనయసుపథారాయే-"[2]. అనుమంత్రములకుఁ బ్రజాపతి ద్రష్ట యైనట్లు కాండానుక్రమణిక చెప్పుచున్నది. ఋగ్వేదములో సరిగా నిట్లే యున్నయీమంత్రములకు నగస్త్యుఁడు ఋషి యని ఋగ్వేదానుక్రమణిక చెప్పుచున్నది. ఇం దేమతము గ్రాహ్యము ? ఏ దయినను, వీని

---

1. ఆశ్రావ యే తి చతు రక్షర మస్తు శ్రౌషడితి చతురక్షరం యజేతి ద్వ్యక్షరం యేయజామహ ఇతి పంచాక్షరం ద్వ్యక్షరో వషట్కార ఏష వై సప్తదశః ప్రజాపతి ర్యజ్ఞమన్వాయత్తో య ఏవం వేద—తై. సం. 1-6-11.

2. తై. సం. 1-1-14.—ఋ. సం. 10-189.

కిద్దఱు ద్రష్టలున్నా రనక తప్పదు. ఇట్లన్నికాండములందును సిద్ధ మగుచున్న యార్షవైవిధ్యము వారించుటకై యీ ఋక్కులను ఋగ్వేదమునుండి యజుర్వేదమో యజుర్వేదమునుండి ఋగ్వేదమో గ్రహించియుండు నని చెప్పవల యున్న నిందు మొదటిదానికి వైదికసంప్రదాయ మంగీకరింపదు, రెండవదానికిఁ జరిత్రసంప్రదాయ మంగీకరింపదు. ఏమయినను మొదటిపక్ష ముచిత మని తలంత మన్న ఋగ్వేదసూక్తద్రష్టలవిషయము గూడ సందిగ్ధముగానే యున్నది గాని నిర్వివాదముగాఁ గనఁబడదు. వారిలో గోతమాత్రి భరద్వాజ విశ్వామిత్ర వసిష్ఠాదిమహర్షులు పెక్కండ్రు మర్త్యులైనసూక్తద్రష్టలుగాఁ గనవచ్చుచున్నను, కొన్నికొన్నియెడలఁ బరమేష్ఠి యైనప్రజాపతియు, పావకుఁడైన యగ్నియు, దేవశుని యైనసరమయు, పక్షిరాజపుత్త్రుఁడైన సుపర్ణుఁడును,సూక్తద్రష్ట లగుటయు, మఱికొన్నియెడల సూక్తవిషయభూతదేవతలే సూక్తద్రష్ట లగుటయుఁ గనరాకపోదు. ఇంతకును ద్రష్టలవిషయమున వాస్తవపరిశీలనము గావించినచో ఋగ్వేదద్రష్టలలో నేపదిమందియో దేవతాదిలక్షణములు గలవారుగాఁ గనిపింతురుగాని యజుర్వేదద్రష్ట లందఱుగూడఁ గాండవిషయభూతులైన దేవతావిశేషములుగానే కనిపింతురు. దానం జేసి తార్కికమైనచరిత్రసంప్రదాయమును గాదని రెండవపక్షము గ్రహింతుమేని, యజుర్వేదమన్నిటికంటెఁ బ్రాచీన మగుటచేతనే దానికాండములను దర్శించినవారియథార్థవిషయము తెలియరాకపోయిన దనియు, బ్రాహ్మణము చెప్పినఋక్సామ యజుర్మంత్రములరాశి[1] యజుర్వేద మనియు, నిందలి ఋక్కులు ఋగ్వేదసూక్తములలోఁ బ్రవేశించిన వనియుఁ జెప్పవచ్చునుగాని, యితరవేదవాక్యములచే నిది ప్రతిహతము కాకపోదు. ఎటుచూచినను, ఇద మిత్థ మనుటకు వీలు లేక విషయ మిట్లజ్ఞేయముగా నున్నది గావునను, 'కఠేన మునినా దృష్టం కాఠకం పరికీర్త్యతే' అని యేసంప్రదాయమునుబట్టియో సాయణులు చెప్పినను, కఠతిత్తిర్యాదులు ప్రవక్తలే కాని ద్రష్టలు కారని మఱియొక ప్రాచీనసంప్రదాయము వైదిక వాఙ్మయమున స్థిరపడియున్నది కావునను యాజుషకాండముల సత్యమైనయార్షసంప్రదాయము తెలుపునితరాధారములు లభింపకున్నవి కావునను, ప్రజాపత్యాదులు తత్తత్కాండ విషయభూతులైనదేవతావిశేషులే యైనను[2] వారే కాండద్రష్టలైనకాండర్షు లని విశ్వసింపవలసి వచ్చినది.

---

1. తై. బ్రా. 1-2-1-26.

2. ప్రజాపతి ర్యజ్ఞ మతనుత - ప్రజాపతి ర్యజ్ఞా నతనుత - ప్రజాపతే ర్విభా న్నామ లోకః - ప్రజాపతిః ప్రథమజా ఋతస్య - ప్రజాపతి ర్వైకః - ప్రజాపతిః పరమాం. ప్రజాపతే ర్భాగః - ప్రజాపతికాండములలో నిట్టి వనేకములు.—సోఽగ్ని రబ్రవీత్ - అగ్ని రాహిత ఇచ్ఛమానః - తదగ్ని ర్న్యకామయత - యోఽగ్ని ముద్వాసతే - సప్తతే అగ్నే సమిధః -

## సంహితావిషయము.

ఇందలి ప్రధానవిషయము యాగము. అది, ఏకాహము అహీనము సత్త్రము నని త్రివిధము. అందు, ఒకదినముతో సమాప్త మగునట్టియాగము లేకాహములు. అవి జ్యోతిష్టోమభేదము లైనయగ్నిష్టోమము అత్యగ్ని ఉక్థ్యము షోడశి అతిరాత్రము వాజపేయము అప్తోర్యామము మొద లయినప్రకృతి యాగములు. రెండురోజులు మొదలుగాఁ బన్నెండురోజులవఱకు జరగుసుత్యలు వికృతియాగము లనఁబడును. ద్వాదశసుత్యాకము పౌండరీకము. అది సత్త్ర యాగమునకుఁ బ్రకృతి. సత్త్రయాగము పన్నెండురోజులు మొదలుగాఁ గొన్ని సంవత్సరములవఱకును జరుగునట్టిది. అవి గవామయనాదులు. మఱియుఁ గర్మ జ్ఞానభేదమునఁ గాండద్వయాత్మక మైనయీవేదమందీభాగము కర్మకాండ మనఁ బడుచున్నది. ఇందు నిత్యకర్మలు నైమిత్తికకర్మలు కామ్యకర్మలు నిషిద్ధకర్మలు ప్రతిపాదింపఁబడును. కావుననే కర్మకాండవిషయమున యజుర్వేదము ప్రాధా న్యము వహించినది. ఆనుపూర్విగాఁ గర్మస్వరూపము తెల్పునది యజుర్వేదము కావుననే యిది భిత్తిస్థానీయముగాను దీని నాధారముఁగాఁ జేసికొన్న ఋక్సామ వేదములు చిత్రస్థానీయములుగాను జెప్పఁబడుచున్నవి. నిరపేక్షము లైనదర్శ పూర్ణమాసేష్టులు మొదటి వగుటచేతను, అవి ఋక్సామములందు చెప్పఁబడక యజుర్వేదమునందు మాత్రమే చెప్పఁబడుటచేతను, కర్మవిషయమున యజుర్వే దము భిత్తిస్థానీయ మయిన దని సూత్రకర్తలు భాష్యకర్తలు గూడ నేకగ్రీవ ముగాఁ జెప్పుచున్నారు. అట్టి దీనియందలిమంత్రములు ఋక్కులు సామములు యజుస్సులు నని త్రివిధములు. అధ్వర్యువేద మని యనాదిసిద్ధ మైనఖ్యాతి వహించినదీనియందు కొన్నిఋక్కు లున్నను, యజుస్సులే బహుళముగా నుండు టచే దీనికి యజుర్వేద మనుపేరు వచ్చినది. ఇందు సమామ్నాతము లైనదర్శ పూర్ణమాసేష్టి మంత్రములు, ఆధ్వర్యవములు యాజమానములు హౌత్ర ములు నని మూఁడువిధములు. యజ్ఞమందు, అధ్వర్యుఁడు పఠించున వాధ్వర్య వములు. యజమానుఁడు పఠించునవి యాజమానములు. హోత యనెడి ఋత్విక్కు పఠించునవి హౌత్రములు.

---

ఇత్యాదు లగ్నికాండములలో. ఇంద్ర మరుత్వ ఇహ పాహి సోమం - సోమస్య తనూ రసి - సోమ విక్రయిణి తమః - సోమస్యాఽఽతిథ్య మసి విష్ణవే త్వా - ఇట్లనేకములు.

విశ్వేదేవా ఇహ మాదయన్తా మిత్యాహ - విశ్వేదేవా స్సజోషసం - యచ్ఛ విశ్వేదేవాః - విశ్వానేవ దేవాన్ త్స్వేన భాగధేయే నోపధావతి - వైశ్వదేవీం బహురూపా మాలభేత - ఇట్ల నేకములు.

అజాన్హవై పృశ్నీఁస్తపస్యమానాన్ బ్రహ్మ స్వయంభ్వభ్యానర్ష త్త ఋషయోఽ భవ న్తదృషీణా మృషిత్వమ్ - ఇత్యాది.

మఱియు నీవేదము విధ్యర్థవాదమంత్రభేదమునఁ ద్రివిధము. చోదనా రూపము లైనవి విధులు. స్తుతిరూపము లైన వర్థవాదములు. అనుష్ఠేయార్థ ప్రకాశకములు మంత్రములు. ఇట్లు త్రివిధమైయున్న యిందలి యజుస్సులు కొన్ని ఋగ్వేదమందును సామవేదమందును గూడఁ గనఁబడుచున్నవి. అందలి ఋక్కులును సామములును గొన్ని యిందును గనఁబడుచున్నవి. ఇట్లు ఋక్సామ ములు సంకీర్ణములై యున్నను, ఇందు కొలఁదిగా నున్నఋక్కులు ఋగ్వేదము నుండియు సామములు సామవేదమునుండియు వచ్చి యిందు ప్రవేశించిన వని వైదికసంప్రదాయ మంగీకరింపదు. అందుచేతనే వృత్తబద్ధ మంత్రములు ఋక్కు లనియు గీత్యుపేతములు సామము లనియు వృత్తగీతివర్జితములు యజుస్సు లనియు నిందలి మంత్రములకు లక్షణ మేర్పడినది. అట్టివానికి సాయణాచా ర్యులు చూపిన యుదాహరణము లివి.

'దేవోవ స్సవి తోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్య రశ్మిభిః' అనుమంత్రము యజుర్వేదమం దున్నది. ఇది ఋక్కే కాని యజుస్సు కా దని బ్రాహ్మణము నిర్ధారణచేసినది.

"అగ్నయే మథ్యమానా యానుబ్రూహి, హవిర్ధానాభ్యాం ప్రోహ్యమా ణాభ్యా మనుబ్రూహి" ఇత్యాదియజుస్సులు ఋగ్వేదమందు పఠింపఁబడియున్నవి.

'ఏతత్సామ గాయ న్నాస్తే'—"హా 3 వు హా 3 వు హా 3 వు." ఇత్యా దిసామములు యజుర్వేదమందు కలవు.

"అక్షిత మసి - అచ్యుత మసి - ప్రాణసంశిత మసి-"ఇత్యాదియజు స్సులు సామవేదమం దున్నవి[1].

ఋగ్వేదసూక్తములు యజ్ఞార్థములుగా యాజ్ఞికులచే వినియోగింపఁబడు చున్నను,ఇంద్రాగ్నివరుణాది వివిధదేవతాస్తుతి పరములుగా నున్నయవి దేని కదే వేఱుగా నున్నట్లు కనఁబడునుగాని వానికిఁ బూర్వోత్తరసంబంధముతోఁ గూడిన సమన్వయైక్యము కనరాదు. యాజుషమంత్రము లట్లు గాక యొక్కొక్క ప్రధాన విషయమందు సమన్వయైక్యము గలిగి పూర్వోత్తరసంబంధముతో విరాజిల్లుచు నఖండ మైనయేకాకారముతోఁ గనవచ్చును. అందుచేతనే వైదికప్రపంచ మందితరవేదములకు లేనిమహామహత్త్వము దీనికి సంభవించినది. ఇందు ప్రతి పాదింపఁబడిన కర్మకాండ మంతయు బ్రాహ్మణుఁడు వేదాధ్యయనము చేసి తదర్థ మెఱిఁగి కర్మానుష్ఠానపరుఁడై సాధనచతుష్టయసంపన్నుఁడు కావలె నని ప్రేరేపిం చుచు, శ్రద్ధాభక్తి సమన్వితుఁడై కర్మనిరతుఁ డగువానికిఁ జిత్తశుద్ధిని ధీవైశద్య మును గలిగించి వానిమూలమున నాముష్మికజ్ఞాన ముదయింపఁ జేయును. అదే కదా వేదముల ముఖ్యోద్దేశము! అందుకే మానవజన్మ మెత్తినవాఁడు కర్మద్వార

1. తై. సం. భాష్యావతారిక.

మున జ్ఞానమును జ్ఞానద్వారమున మోక్షమును జెంది యద్వితీయపరబ్రహ్మైక్యము బడయుఁగాక యను తలంపుతోఁ త్రికాలవేత్త లగుపురాతనమహర్షులు వేద మంత్రములు సందర్శించి లోకమున కనుగ్రహించిరి. ఇదే వేదమందలి ముఖ్య విషయము. ఇఁక—

## పశుమేధము - నరమేధము.

యజుర్వేదము యజ్ఞశరీరమనుట విస్పష్టమే కావునఁ గొన్నికర్మవిశేష ములనుగూర్చి మాత్రమే ప్రసంగింతము. జీవహింస చేయరా దని నిషేధ శ్రుతివచన మున్నను, యజ్ఞార్థ మయినపశువును హింసింపవచ్చు నని విశేష విధివచనము మఱియొకటి కలదు[1]. ఈ రెండు వచనములుగూడ ఋక్సామ యజుస్సంహితలకుఁ దరువాతివే యైనను వానియందు గూడ నీ రెండర్థము లిచ్చువాక్యము లనేకములు లేకపోలేదు. కావున యాగములయందు పశువధ యొనరించెడి యాచారము ఋగ్వేదకాలమునుండియు నట్లే వచ్చుచున్నది. కాని యార్యులు స్వేచ్ఛగా మాంసభక్షణము చేయుకాలమందు మేఁకలు గొఱ్ఱెలు బఱ్ఱెలు గోవులు గుఱ్ఱములు మొదలగువివిధమృగములను జంపి చేయుయజ్ఞము లలో గోమేధాశ్వమేధాదియాగము లంతరించినను, నాఁటినుండి నేఁటికిని ఛాగ పశ్వాలంభము మాత్రము యాగవిహిత మై కనవచ్చుచున్నది. మఱియు ఋక్సా మయజుస్సంహితలు నరమేధమును విధింప కున్నను, యజుస్సంహితలో బురుష మేధప్రసంగము కనిపించుచున్నది. తైత్తిరీయ బ్రాహ్మణములోఁ బురుషాలంభ విధియుఁ గనిపించుచున్నది. వీనినిబట్టి గోమే ధాశ్వమేధములవలెనే నరమేధ మొకకాలమున నాచరణలో నుండి వెంటనే యణఁగిపోయినదని యూహింప వలసి వచ్చుచున్నది. అందుచే నరమేధ పశుమేధముల స్వరూప మెట్టిదో కొంత తెలిసికొందము.

ప్రాజాపత్య హవిర్నిష్పాదనమునకై 'ఏకవింశత్యామూసైః పురుషశీర్ష' మిత్యాదిమంత్రములందు[2], పురుషశిరస్సంపాదనవిధాన మి ట్లున్నది.

" యాగకర్త యిరువదియొక్క మినుపగింజలు చేతఁ బుచ్చుకొని బయలు దేఱి వెళ్లి బాణముచేతనో పిడుగుచేతనో హతుఁడై పడియున్న వైశ్యుని గాని క్షత్రియునిగాని సమీపించి యతనితలపై నాగింజ లుంచి దానిని దెగఁగొట్టి యేడుచిల్లులు గలపుట్టమట్టిగడ్డ యొకటి యా శిరస్థానమునఁ బెట్టి యా క్రియ వలన యాగయోగ్య మైన యాశిరస్సును దెచ్చి యజ్ఞక్రియ జరిగింపఁదగును '

1. నహింస్యా త్సర్వభూతాని - అగ్నీషోమీయం పశు మాలభేత.
2. తై. సం. 5-1-8

సంహితలోని యీవాక్యములనుబట్టి యాకస్మికముగా హతుఁడైనవాని శిరస్సు యజ్ఞయోగ్యము గావించుకొని దానితో యాగము జరుపుటకూడఁ గల దని తెలియవచ్చునుగాని సజీవపురుషుఁడు యజ్ఞపశువుగా నుపయోగింపఁబడినట్లు లే దని స్పష్టమగును. అమృతునిశిరస్సు నైనను, ఏదో యొకయపూర్వ ఫలము కలుగు నని తలంచి యట్లు హవిస్సుగా సమర్పించెడివారు గాని యందలిహుత శేషమును భక్షించుటకుఁగా దని యు విదిత మగును. కాని తైత్తిరీయ బ్రాహ్మణమందు—

"బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే, క్షత్త్రాయ రాజన్యమ్, మరుద్భ్యో వైశ్యమ్, తపసే శూద్రమ్ - ఇత్యాదిగా, ప్రతీక్షాయై కుమారీమ్" అనునంత వఱకు[1]. ౧౮౯ మనుష్యరూపపశువులు చెప్పఁబడినవి. బ్రాహ్మణాది కుమార్యంతము లైన యీనరపశువులు పంచాహ మైనసోమయాగవిశేషమందు మధ్య దినమున నవనీయపశువులతో నాలంభనీయము లగు నని బ్రాహ్మణాభిప్రాయ మును సూత్ర మావిష్కరించుచున్నది. దీనినిబట్టి నరమేధ మొకానొకకాల మున నుండె ననుట విశ్వసనీయ మగుచున్నది. ఈ యంశమును సాయణాచార్యు లిట్లు తేటపఱిచియున్నారు.

"ప్రాపాఠకే చతుర్థేతు మేధః పురుషపూర్వకః।
ఉచ్యతే సూత్రకారేణ సవిస్పష్ట ముదాహృతః॥"

నరమేధ మనునది యైదుదినములు చేయునట్టిసోమయాగవిశేషము. బ్రాహ్మణుఁడు గాని క్షత్త్రియుఁడు గాని యిట్టియాగ మొనరించి గొప్పతేజస్సును మహావీర్యమును బొందు నని యీయాగమువలనిఫలమును సూత్రము నిరూపించుచున్నది. ఈనరపశువులలో బ్రాహ్మణాది చండాలపర్యంతము పదునెనిమిది జాతులవారును గలరు. అందు పండితుఁడు పామరుఁడు వీరుఁడు భీరువు కన్య బ్రహ్మచారి సంసారిణి కులట గాయకుఁడు నటుఁడు కర్షకుఁడు వణిజుఁడు గూని వాఁడు కుంటివాఁడు తెల్లనివాఁడు నల్లనివాఁడు పచ్చనివాఁడు పిల్లికళ్లవాఁడు వీరు వా రననేల మానవజాతిలోఁ గనవచ్చు నన్నితెగలవారును గలరు. బ్రహ్మ మొదలుగా లాభప్రతీక్షణాభిమాని దేవతవఱకును గలయుత్తమమధ్యమాధమదేవతలు ౧౮౯ గురిలోను, ఆయా దేవతయోగ్యతనుబట్టి యాయాజాతి పురుషుఁడో స్త్రీయో పశువుగా విధింపఁబడెను. మఱియు నిందే వాగ్దేవతకొఱకు స్థూలశరీరుఁడైన పురుషుని బశువుఁగా నుపయోగించి యతనిప్రాణపంచకమును వాయుదేవునికి, నేత్రములను సూర్యునికి, మనస్సును చంద్రునికి,

1. తై. బ్రా. 3. 4. 1—19. దీనిని, తెలుఁగుదేశములోని వైదికులు సున్నాలపన్న మందురు.

శ్రోత్రములను దిక్కులకు, జీవాత్మను ప్రజాపతికి, సమర్పింపవలె నని యొక యనువాకము చెప్పుచున్నది. ఇచ్చటఁ బ్రాణచక్షురాదీంద్రియములకు వాయు సూర్యాదు లధిష్ఠానదేవత లగుటచే మృతుఁడైనవాని యాసూక్ష్మేంద్రియము లాదేవతలను జెందిన వనెడియర్థము చెప్పవచ్చును గాని, యీయర్థము భాష్య కర్తలు వ్రాయలేదు. పైగా వాగ్దేవికై స్థూలపురుషుని వధించుట యనుదాని కర్థాంతర మేదియు సరి గాదు. అందుచే సంహితలలో సూచిత మైనసరమేధాచా రము బ్రాహ్మణముల కాలమున వచ్చిన దని యంగీకరింపక తప్పదు. ఇందు కైత రేయబ్రాహ్మణములోని శునశ్శేఫవృత్తాంతము గూడ నిదర్శన మగుచున్నది. ఆ కథ నరమేధమును స్తుతించునది కాకపోయినను, ఈ దురాచారము కల దనుట కుదాహరణము కాఁగలదు. పెద్దదిగా నున్నదాని నిందు సంగ్రహించి చూపుచున్నాను.

"ఇక్ష్వాకువంశరాజయిన హరిశ్చంద్రుఁడు తనకుఁ బుత్రుఁడు పుట్టినచో వానిని వరుణుని కర్పించి యజ్ఞము చేయుదు నని ప్రతిజ్ఞ చేసెను. వరుణప్రసా దమున నతనికి రోహితుఁ డనుకుమారుఁడు పుట్టెను. కాని, రాజు ప్రతినచొప్పున యాగము చేయలేదు. రోహితుఁడు యావరాజ్యాభిషిక్తుఁ డైన తఱి వరుణుఁడు వచ్చి ప్రతిజ్ఞ నిర్వహింపు మని హరిశ్చంద్రుని నిర్బంధించెను. అందుచే నతఁడు యాగము చేయ నుద్యుక్తుఁడు కాఁగానే రోహితుఁ డది తెలిసికొని యడవికిఁ బాఱిపోయెను. అంత వరుణుఁడు జలోదరరోగముచే బాధపడు మని హరిశ్చం ద్రుని శపించెను. హరిశ్చంద్రుఁడు రోగముచే నవయుచుండెను. వనములో నున్న రోహితుఁ డావార్త విని విచారించి తనకు బదు లొకముని పుత్రుని బురమునకుఁ గొనిపోయి తండ్రి కియ్యఁదలంచి యడవిలోఁ దిరుగుచు నొకచోట నాఁకటి బాధచేఁ గృశించి యున్నయజీగర్తుఁ డను ఋషిని జూచెను. ఆ ఋషికి ముగ్గురు కొడుకులు కలరు. వారిలో నొకపుత్రు నిచ్చినచో నూఱుగోవుల నిచ్చెద నని రాజపుత్రుఁడు పల్కెను. మధ్యముఁ డైన శునశ్శేపు నిచ్చుట కతనితల్లిదండ్రు లంగీకరించిరి. ఆ ప్రకారము రాజపుత్రుఁ డామునిపుత్రుని దండ్రివద్దకుఁ గొని వచ్చి యావృత్తాంతము దెలిపెను. అపుడు హరిశ్చంద్రుఁడు వరుణుని చెంత కేగి నీ కీమునిబాలు నుపయోగించి యజ్ఞము చేయుదు ననుగ్రహింపు మని వేఁడు కొనెను. అందుకు వరుణుఁ డంగీకరించి రాజసూయము చేయు మని సెలవిచ్చెను.

హరిశ్చంద్రుఁడు రాజసూయ మారంభించెను. విశ్వామిత్రాదిమహర్షు లందఱు వచ్చిరి. శునశ్శేఫునితండ్రియు వచ్చెను. విశ్వామిత్ర జమదగ్న్యాదులు ఋత్విక్కులై యాగము సాగించుచుండిరి. అధ్వర్యుఁ డైన జమదగ్ని యాగపశు వైన శునశ్శేఫుని మంత్రపూతుని గావించి యతనిని యూపమునకు బంధింపఁ బూనకుండెను. ఆక్రూరకర్మమున కాసభలోనివా రెవరును సిద్ధము కాలేదు.

అపుడు వానితండ్రి యజీగర్తుఁడు లేచి నాకు మఱినూఱుగోవుల నిచ్చినచో నేను బంధింతు ననెను. రా జట్లే యిచ్చెను. ఆఋషియు నట్లే పుత్త్రుని బంధించెను.

అనంతర మతనిని హింసింపవలసి వచ్చినది. ఆ ఘోరకర్మ కెవ్వరు నిష్టపడ లేదు. అపు డజీగర్తుఁడు మరల లేచి యింకొకగోశత మిచ్చినయెడల నేను జంపెద ననెను. అట్లే రాజు గోవుల నిచ్చెను. అంత నతఁడు కత్తి నూఱుకొని కొడుకును సమీపించెను. అపుడు శునశ్శేపుఁడు గత్యంతరము లేక ప్రజాపత్యగ్నిసవితృవరుణాదిదేవతలను సమంత్రకముగాఁ బ్రార్థించెను. అంత వారియనుగ్రహమున నతనిబంధములు విడిపోయినవి. హరిశ్చంద్రు నిరోగమును శాంతించినది. విశ్వామిత్త్రాదు లతనిఁ బ్రశంసించిరి[1]."

ఐతరేయ బ్రాహ్మణమునాఁటికే యితిహాస మయినయీకథ విశ్వసనీయ మైనను గాకపోయినను, నరమేధాచార మంతకు మున్నున్నట్లును దానికి మహర్షులనేకు లిష్టపడకుండినట్లును దీనివలనఁ దెలియకపోదు. కాని, యజుస్సంహితాకాలమందును దానికిఁ బూర్వమందును, తరువాత నైతరేయ బ్రాహ్మణకాలమందును గూడ ఋషిసమ్మతము గానిసజీవనరమేధ మొక్కతైత్తిరీయబ్రాహ్మణమందు మాత్రమే కనవచ్చుటనుబట్టి చూడఁగా నిజముగా నిట్టియాచార మాకాలమున నున్నదో, లేక యాగపశ్వాలంభమున కిష్టపడనివా రెవరయిన నట్టియాచారము నెడ రోఁత పుట్టించునట్లుగా నతినింద్య మయిననరమేధప్రకరణము నందు ప్రక్షిప్తము గావించిరో యూహింపనలవి కా కున్నది. ఎట్లయినను, కాళికాదేవికి నరబలి యిచ్చెడి దురాచారము నిన్న మొన్నటివఱకును, రహస్యముగా నేఁటివఱకును గూడ నుత్తరహిందూదేశమున నుండుటనుబట్టి తుచ్ఛలాభాభిలాషు లగుహృదయశూన్యులు కొందఱాకాలమునఁ గూడఁ దోడిమానవులను యాగములందు హింసించుచుండిరేమో యని తోఁచుచున్నది. ఏమయిన నీదుష్టపిశాచనీచాచారము పుట్టినవెంటనే యణఁగిపోయిన దనుట నిజము. ఇదియే కాదు, గోమేధాశ్వమేధములు గూడ నెంతోకాలము నిలవక నమసిపోయినవి. ఇందుకుఁ దైత్తిరీయసంహితలోని యీక్రింది ఛాగపశుప్రశంసయే తార్కాణము.

"సర్వాణి వా ఏ షరూపాణి పశూనాం ప్రత్యాలభ్యతే య చ్ఛ్మశ్రుణ స్తత్ పురుషాణా౨ం రూపంయ త్తూపర స్తదశ్వానాం యదన్యతోద న్త ద్గవాం యదవ్యా ఇవ శఫా స్తదవీనాం యద జ స్త ద జా నామ్"[2].

'ద్విపాదచతుష్పాదపశువుల కేరూపములు కలవో యవి యన్నియు నుండుటచే ఛాగపశువు యాగములందు వధింపఁబడుచున్నది. అది గడ్డ ముందు

1. ఐ|బ్రా. 33 అధ్యా—2. తై. సం. 5-5-1.

టచేఁ బురుషుని బోలియున్నది. కొమ్ములు లేకుండుటచే గుఱ్ఱమును బోలి యున్నది. నోటిలోఁ గ్రిందిభాగమునమాత్రమే పళ్లుండుటచే గోవును బోలి యున్నది. చిన్నగిట్టలు రెండుండుటచే గొఱ్ఱెను బోలియున్నది. అజ జాతినిబట్టి యెల్లమేఁకలను బోలియున్నది."

దీనిచే గోహయమేధములవలెనే నరమేధముకూడ నీసంహితకు మున్నే యొకప్పు డుండె ననుట కవకాశ మేర్పడుచున్నదిగాని, వానిస్థానమందు మేఁకను బ్రవేశపెట్టి వానిలక్షణములు గలయజమే యజ్ఞపశు వగుట కర్హ మని ప్రశంసించుటనుబట్టి నరమేధ మీసంహిత కెంతమాత్ర మిష్టముకా దనియు ఛాగ పశ్వాలంభమే దీనికి సమ్మత మనియుఁ దెలియవచ్చును. ఇట్లీసంహిత ప్రశంసించిన ఛాగపశువే సర్వసమ్మతమై మాంసభక్షణాచార మున్నయానాఁటినుండి మాంసము పరిత్యజించిన నేఁటివఱకును గూడ యజ్ఞములందు వధింపఁబడుచున్నది. ఈ తత్త్వమెఱిఁగియే కాఁబోలు ద్వైతమతమువారు దీనినిగూడఁ బరిత్యజించి పిష్టపశువుతోనే యాగము లాచరింప నారంభించినారు! ఇఁక నీ సందర్భమున నొక్కమాట:—

వాజసనేయసంహిత 30-31 అధ్యాయములలోఁ బురుషమేధవిధి కన వచ్చుచున్నది గాని, యీసంహిత తైత్తిరీయసంహితతో విడిపోయినతరువాతఁ దైత్తిరీయ బ్రాహ్మణమునకుఁ బూర్వమందో లేకపరమందో యీ యధ్యాయములు రెండును దానికిఁ జేర్పఁబడిన వని తెలియనగును. అందుచేతనే యివి ఖిలాధ్యాయములలోఁ గణింపఁబడుచున్నవి. ఈ విషయముకూడ వాజసనేయ సంహిత తైత్తిరీయ సంహితకంటె నర్వాచీన మనుట కొకకారణ మగుచున్నది.

## దేవతాచ్ఛందస్సులు.

ఋగ్వేదమునందువలెనే యిందును మంత్ర ప్రతిపాదితార్థమే దేవత యనెడినియమమునుబట్టి యాయామంత్రములకు భూమ్యంతరిక్షద్యు లోక దేవతలగు నగ్నీంద్ర సోమవరుణాదిత్య వాయునక్షత్ర విష్ణురుద్రాదులు దేవతా విశేషులై స్తుతింపఁబడుచున్నారు. మఱియు నాయాకర్మ విశేషములందు చేయు హోమవిశేషములబట్టి యోషధీవనస్పతి సరీసృపాదిచరాచరము లన్నియు దేవతా విశేషము లగుచుండును.

యజుర్వేదమం దున్నఋక్కులకు ఋగ్వేదఋక్కులకు వలెనే గాయత్రి త్రిష్టుపు అనుష్టుపు' మొద లయినఛందస్సులు కలవుకాని యిందలియజుస్సులకు ఛందస్సు లేదు. ఋక్కులకు వలెనే, అక్షరమాత్రాసంఖ్య ననుసరించి యజుస్సు

---

1. తూపరశబ్దమునకు శృంగరహిత మని సాయణు లర్థము వ్రాసిరి. దీనినిబట్టి కొమ్ములు రానిమేఁకపిల్ల యజ్ఞపశువుగా నర్హ మని తెలియుచున్నది.

లకుఁ గూడ ఛందస్సు కల్పింపరాదా యన్నచో నది శ్రుతివిరుద్ధ మగును. బ్రాహ్మణము యజుర్మంత్రములకు ఛందస్సు నిషేధించియున్నది కావున వానికి ఛందఃకల్పన మశక్య మని భాష్యకర్తలు ప్రాచీనాభిప్రాయ మావిష్కరించి యున్నారు. స్వరమును వర్ణానుపూర్వియు దానిజీవము. వర్ణముల కెక్కువ దగ్గ అగా నిబద్ధ మైనయజుర్మంత్రముల యుదాత్తానుదాత్తస్వరిత స్వరకల్పనము రసవత్తరమై శ్రోత్రపేయమై పఠించునపుడు గాని వినునపుడుగాని హాయి గొలుపుచుండును. వేద మింతకాలము చెక్కుచెదరకుండఁగా యథాపూర్వముగా భూమిపై నిలుచుటకు దాని స్వరవర్ణానుపూర్వులే కారణము. అవియే దాని గౌరవమహత్త్వములకు మూలము. అందుచేతనే మంత్రోచ్చారణమున స్వరవర్ణ విపర్యాస మెంతమాత్రము కూడ దని నిషేధించుచు, నట్లుచ్చరించుటవలన హాని కలుగు నని పూర్వు లొకగాథ నుదాహరించియున్నారు.

"పూర్వ మింద్రుఁ డొకప్పుడు త్వష్టకొడుకైనవిశ్వరూపుని హింసించెను. అందుచేఁ ద్వష్ట కుపితుఁడై యుండి తా నొనరించు సోమయాగమున కింద్రుని బిలువలేదు. అయినను శక్రుఁడు దానిని గణింపక యతనిజన్నమునకు వెళ్ళి సోమము త్రాగి యాగమునకు విఘ్నము కలిగించి వచ్చెను. అపుడు త్వష్ట యింద్రునికి హాని కలుగునట్లు గాఁ దక్కినసోమరసముతో నభిచారహోమము చేయఁ దలఁచినవాఁడై 'స్వాహేంద్రశత్రు ర్వర్ధస్వ' అను మంత్ర ముచ్చరించి హోమముచేసెను. 'ఓ పుట్టఁబోవుపురుషుఁడా! ఇంద్రునికి ఘాతుకుఁడవై వర్ధిల్లుము' అని త్వష్టయభిప్రాయము. అపు డింద్రశత్రుపదము తత్పురుష సమాస మగును గావున నంతోదాత్తము కావలసి యున్నది. కాని ప్రమాద వశమునఁ ద్వష్ట దాని నాద్యుదాత్తముగాఁ బ్రయోగించెను. ఆద్యుదాత్త స్వరము బహువ్రీహిసమాసమున లభ్యమగుటంజేసి యాపదమున కింద్రుఁడు ఘాతుకుఁడుగాఁగలవాఁ డనెడి యర్థము సిద్ధమై నది. అందుచే నింద్రునిచేఁ జంపఁబడఁదగిన వృత్రుఁ డుదయించెను[1]."

దీనినిబట్టి స్వరవిపర్యాసమువలన హాని కలుగుననియే కాదు, అర్థము కూడ మాఱిపోవు నని తెలియవచ్చును. అందుచేతనే యర్వాచీనులు వేదస్వర వర్ణము లుచ్చారణమందు విపర్యాసము నొందకుండుటకును లోపింపకుండుట కును బహువిధము లైన లక్షణములు రచియించి వేదములను సంరక్షించుచు వచ్చిరి.

---

1. మంత్రో హీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తదర్థ మాహ, స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుః స్వరతోఽపరాధాత్.

## సంహితలోని వర్ణనలు.

యజుర్వేదకాలమునాఁటి యార్యులు భూమి చక్కఁగా దున్ని వ్యవసాయముచేయుట బహువిధము లైనవిత్తులు చల్లి పండించుట, మళ్లకు నీరు పెట్టుటకై నూతులు త్రవ్వుట ఏతాములు ఘటీయంత్రములు నుపయోగించి నీరు తోడుట మొదలగుకృషికార్యము లన్నియు నెఱుఁగుదు రని వేలువేలుస్థలముల యందలి ప్రశంసావాక్యములవల్లనే కాక చతుర్థకాండ ద్వితీయప్రపాఠకము లోని నైదాఱనువాకములయందలి విశేషవర్ణనవలనఁ గూడ విస్పష్టమగును. అందు:—

లాఙ్గలం పవీరవఀ సుశేవఀ సుమతి త్సరు।
ఉదిత్కృ షతి గా మవిం ప్రఫర్వ్యంచ పీవరీమ్।
ప్రస్థావ ద్రథ వాహనమ్।

ఈనాఁగలి పెద్దబెడ్డలు పెల్లగిల్లునట్లు దున్నుఁగాక. ఇది యెట్టిది?— వజ్రమువలె వాఁడి యైనది. కర్షకుల కాయాసము గలుగకుండ నేలను భేదించునది. మెఱకపల్లములం దడ్డము లేక సమానముగా నడచునది. సేద్యగాండ్రు మంచినాఁగలి యని మెచ్చుకొనఁదగినది. దీనివలన భూమి ఫలించెనేని యజమానునికి మంచియావులు, ఆవుపెయ్యలు గొఱ్ఱెలు గుఱ్ఱములు లభించును. అనఁగాఁ గృషి ఫలించినచో గృహస్థు దానినిబట్టి గవాదిజీవధనము నార్జించునని భావము. మఱియు దున్ని సిద్ధముచేసినక్షేత్రమందు బహువిధము లైన యోషధులవిత్తనములు చల్లుట పదునాలుగు మంత్రములచే వర్ణింపఁబడినది. ఇచ్చట, ఓషధిశబ్దమునకు క్షుత్పిపాసాదిశాంతికర మైనమొక్క లనియర్థము. అవి బహువిధములు:—[1].

పువ్వులు మాత్రమే పూచునవి. పూచి కాచునవి. పుష్పించకుండ, కాయలు కాచి ఫలించునవి పువ్వులు కాయలు కూడ లేకుండ నుండునవి. తీఁగలుగా నుండునవి.

నే నన్నము కోరుచు నీయోషధులను జేతఁ బట్టినంతనే వేఁటకానిఁ జూచి చెవులపిల్లులు భయపడి చెవులతోఁ గన్నులు మూసికొని భూవివరముల నణఁగి పోవునట్లే క్షుత్పిపాసాదిరోగము లణఁగి పోవుచున్నవి.

ఈ యోషధు లన్నియు, ప్రతిపక్షమందలి శత్రువులను జయించుట కనుకూలపక్షమందలిరాజు లందఱు సమకూడినట్లే క్షేత్రములందు సమకూడి ఫలదానమునకు సిద్ధముగా నున్నవి.

1. తై. సం. 4-2-6.

ఈయోషధులలో నొకటి యశ్వలాభమునకుఁ గారణ మైనది. మఱి యొకటి సోమయాగము చేయుటకై ధాన్యసమృద్ధికి మూల మైనది. ఇంకొకటి బలవృద్ధికర మైనది. వేఱొకటి ధాతుపుష్టికర మైనది.

సోముఁడు రాజుగాఁ గలయోషధులు భూమిని బ్రవేశించి యున్నవి. ఇత్యాదిగా నోషధివర్ణనము కలదు. ఓషధులలో, తిల మాష యవ వ్రీహి ప్రియంగు గోధూ మాణువు లేడును గ్రామ్యములు. వేణు శ్యామాక నీవార జర్తిల గవీధుక మర్కటక గార్ముతము లేడు నారణ్యకములు. ఇవియే కాదు, ఇంకను గొన్ని ధాన్యజాతులు చతుర్థకాండసప్తమప్రపాఠకమున వర్ణింపఁబడినవి. ఈప్రపాఠకమునకు 'చమక'మను ప్రసిద్ధి కలదు. ఇందు—

విభు ప్రభు బహు భూయః పూర్ణ పూర్ణత రాశీతు లనఁబడు నేడు నొకదానికంటె నొకటి క్రమముగాఁ బండుట కెక్కువకాలము పట్టునట్టి పెద్ద ధాన్యజాతులు. ఇవియు నింతకుఁ బూర్వము చెప్పఁబడినవియుఁ గాక తక్కువ కాలములో ఫలించునట్టి మఱికొన్ని ధాన్యములు కలవు. అవి, కూయుపలు (చిన్న యవలు) ముద్గములు ఖల్వములు మసురములు[1]. మొదలయినవి. దీనినిబట్టి చూడఁగాఁ బ్రాచీనార్యు లీసకలవిధము లయినధాన్యజాతుల నాహారమునకై పండించుకొనుచుండెడివా రని తెలియఁగలదు. కాని యీధాన్యజాతులలో ననేకముల నామములు క్రమముగా మాఱిపోయినవి. కొన్నిజాతులు నామమాత్రావశిష్టము లైనవి. విభుప్రభుప్రముఖము లైనసప్తధాన్యజాతులెట్టివో! అవియే కొన్ని పెద్దవరు లను పేర వాడఁబడుచున్న వేమో!

మఱియుఁ బూర్వోక్తమైన 'చమక' ప్రపాఠకమందలి పదార్థాదుల పట్టికలను జూచినచో నాఁటి యార్యావర్తము కన్నులకుఁ గట్టిన ట్లుండును. ఆర్యులు వాడనిలోహము లేదు. చూడని చెట్టు లేదు. మెట్టనిమెట్ట లేదు. ముట్టని ముత్యము లేదు. పట్టనిఫలము లేదు. కాంచనికాననము లేదు. క్రుంకనినది లేదు. కోరని కోరిక లేదు. వేఁడనివేల్పు లేఁడు. చేయనిజన్నము లేదు. ఎఱుఁగని మృగఖగములు లేవు. అనిపించెడి యాప్రశ్న మంతయు వారిప్రపంచజ్ఞానమునకుఁ బుట్టినిల్లై యున్నది.

మఱియు గోవు, ఇడాదేవీరూప మయిన దనెడి యర్థవాదమునుబట్టి[2]. యానాఁటివారికి గోవునందు గలభక్తిశ్రద్ధలును దానిరక్షణమందలి యాదరము నెట్టివో తేటపడఁగలవు.

"పూర్వకాలమందు మను వొకనాఁడు యజ్ఞమున కుపయోగించుద్రవ్యమే దయిన భూమిమీఁద దొరకునేమో యని వెదకుచుఁ బోవుచుండఁగా నొక

1. ముద్గములు = పెసలు, ఖల్వమసురములు పెసలవంటి పప్పుగింజలు.
2. తై. సం. 2-6-7.

చోట గోపాదాంకిత మైననేలమీఁద నెయ్యి కనవచ్చినది. దానిని దీసికొని యతఁడు దేవసభకు వెళ్లి, 'ఆవు నడచినయడుగులజాడలో నున్నయీఘృతము లౌకికభోజనమున కుపయోగపడునట్లుగా యాగమున కుపయోగించు నట్లవ లైనఁ జేయఁగలరా!' యని ప్రశ్నించెను. అది విని మిత్రావరుణులు 'గోఘృతమునకే కాదు, గోవునకే యజ్ఞాంగభావము గల్పింప మేము సమర్థుల' మనుచు నిడారూప మైనధేనువును భూమికిఁ దీసికొనివచ్చిరి. అపు డాధేను వడుగు వెట్టినచోట నెల్ల నెయ్యి కాఱుచుండెను. అందుచే గోవునకు ఘృతపది యనుపేరు వచ్చినది. ఈవిధముగా నిడాదేవికి యజ్ఞభూమియందు జన్మ సంపన్న మైనది." దీనినిబట్టి ప్రాచీనులు గోవు నెట్టి పవిత్రమూర్తిఁగా భావించెడివారో తెలియఁగలదు. ఇఁక సకలధర్మములకు నుత్తమసాంఘికాచారములకునాస్థాన మైనయజుస్సంహితలో నిట్టివర్ణనలు కల వనుటకంటె వైదికవాఙ్మయమున వెలసిన వివిధగృహ్యసూత్రములకును సామయాచారిక సూత్రములకును ధర్మశాస్త్రములకును నిది పునాది యని యొక్కమాట చెప్పినఁ జాలును. కాని యాసేతుహిమాచలము గలయెల్ల గ్రామములలో నూరి కొకబ్రాహ్మణుఁ డైన రుద్రాభిషేకమంత్రసులు రానివాఁ డుండఁ డనుట యతిశయోక్తి కాదు గావునఁ జతుర్థకాండ పంచమప్రపాఠకమునుగూర్చి కొంచె మైనవ్రాయకుండ నీప్రకరణము సమాప్తము చేయఁజాలను.

## రుద్రప్రశ్న ప్రశస్తి.

స్థితినిబట్టి యీసంహితకు నాభిస్థాన మైన యీప్రపాఠకము విషయమును బట్టి దీనికి శిరోభూషణముగానున్నది. యాజ్ఞికులు దీనిని యజ్ఞోపయోగి కాండముగాను, ఉపాసకు లుపాసనాకాండముగాను, తత్త్వజిజ్ఞాసువులు జ్ఞానకాండముగాను గ్రహింపఁదగిన యింపలివిషయ మమూల్యము. భక్తిమూలము. ముక్తికారణము. వేయేల ? మహర్షు లెల్లరు నేమహామంత్రము జపించి తరించిరో యాదివ్య మైన పంచాక్షరీమంత్రమున కిది పుట్టిల్లు. ఈ ప్రపాఠకముప్రశస్తి కంతకు నామంత్రమే నిదాన మనుట నిర్వివాదము.

ఈప్రశ్న మంతయు నమశ్శబ్దభూయిష్ఠ మగుటచే దీనికి 'నమక'మనెడిపేరు దేశమునఁ బ్రసిద్ధికెక్కినది కాని రుద్రాధ్యాయ మనునది దీనివైదికసంజ్ఞ. ఇది కర్మకాండమునఁ బఠింపఁబడుటచే దీనికిఁ గర్మాంగత్వము సమ్మత మైనను సర్వోపనిషత్తులు నిది జ్ఞానకారణ మనియే ప్రశంసించుచున్నవి. మునులు దీనికి శతరుద్రీయ మనునామ కరణ మొనర్చిరి. శతరుద్రీయజపముచే నమృతత్వము సిద్ధించు నని జాబాలమహర్షి తలంచియుండెను. స్మృత్యాగమపురాణములయందు రుద్రాధ్యాయప్రశంస యధికముగాఁ గనవచ్చుచున్నది. అది రుద్ర

కల్పమందు సవిస్తరముగాఁ జెప్పఁబడుచున్న దని సాయణాచార్యులు పల్కి యున్నారు. ఇంతకంటె దీనిమహత్త్వ మిట్టిదని తెలుప నక్కఱలేదు.

ఈ యధ్యాయమందు పదకొం డనువాకములు కలవు. ఇందు వర్ణిరపఁ బడినరుద్రుని ఘోరరూపశరీరము శివరూపశరీరము శరీరావయవములు ధనుశ్శ రాదిసాధనములు దుష్టశిక్షణము శిష్టరక్షణము మొద లయినవి సగుణోపాసకు లగుశైవులయభీష్టసిద్ధి కాలవాలమై యుండెను. ఇందలి శివరూపవర్ణనములే తరువాతఁ బురాణములలోని శివకథలుగాను శైవపురాణములుగాను వెలసిన వనుట సత్యము. మఱియు నిందు వర్ణింపఁబడినశివుని విశ్వరూపత్వము విశ్వ వ్యాపకత్వము విశ్వకారణత్వము మొద లయిన వేకేశ్వరత్వ విజ్ఞానమును, క్రమ ముగా జీవేశ్వరైక్యజ్ఞానమును గలిగించునదియై యద్వైతభావమున కాలవాల మగుచున్నవి. ఇదే యిందలివిశేషము.

నమశ్శంభవేచ మయోభవేచ నమశ్శంకరాయచ ।
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ ॥

## వాజసనేయ సంహిత.

శుక్లయజుస్సంహిత యనఁబడువీనినిగూర్చి యింతకు మున్ను కొంత చదివి యున్నాము. ఇఁక విశేషవిషయము లిందు తెలిసికొందము.

ఈ సంహిత నలువదియధ్యాయములుగా విభజింపఁబడినది. అందు మొదటి యిరువదియైదధ్యాయములలోను సామాన్యముగా యజ్ఞవిధులు చెప్పఁబడినవి. అందును, మొదటిదానియందును ద్వితీయాధ్యాయములోని యిరువదియెనిమిది కండికలయందును దర్శపూర్ణమాసమంత్రములు కలవు. రెండవదాని కడపటి కండిక లాఱింటియందును బితృయజ్ఞమంత్రము లున్నవి. తృతీయమునం దగ్న్యా ధానాగ్నిహోత్రాగ్న్యుపస్థానచాతుర్మాస్యమంత్రము లున్నవి. నాల్గవది మొద లుగా నెనిమిదవ యధ్యాయము కడపటివఱకు నగ్నిష్టోమతత్ప్రాసంగిక తృతీయ సవనాదిత్యగ్రహాదిమంత్రములు కలవు. నవమములో వాజపేయరాజసూయ కర్మ లించుక చెప్పఁబడినవి. దశమాధ్యాయమునందు రాజసూయశేషమును, అభిషేకజలాదానాదులును సౌత్రామణియుఁ గలవు. ఏకాదశద్వాదశములందు, అగ్నిచయన - ఉఖాసంభరణ - ఉఖాధారణ - గార్హపత్యచయన-క్షేత్రకర్షణ - ఓషధివాపాదిమంత్రము లున్నవి. పదమూఁడవదానిలోఁ బ్రథమ చితిమంత్రము లును, పదునాల్గవ దానిలో ద్వితీయ తృతీయ చతుర్థ చితిమంత్రములనుగలవు. పదియేనవదానిలోఁ బంచమచితిమంత్రములును, పదునాఱవదానిలో శతరుద్రీ యహోమమంత్రములును, పదియేడవదానిలో చిత్యపరిషేకాదిమంత్రములును,

పదునెనిమిదవదానిలో వసుధారామంత్రములును గలవు. పందొమ్మిదియిరువది యిరువదియొకటి యధ్యాయములందు సౌత్రామణీయాగమంత్రములును, తరువాతి నాలుగధ్యాయములందు నశ్వమేధమంత్రములు నున్నవి. ఇంకఁ బదియేనధ్యాయము లున్నవి. వీనికి ఖిలము లనెడివ్యవహారము కలదు. వీనిలోని విషయములు సాధారణముగా వెనుకటి యధ్యాయములలోని విషయములకు సంబంధించియే యుండును. ఇందు :—

౨౬-వ, యధ్యాయమం దనుక్తమంత్రకథనము, ౨౭ లోఁ బంచచితి, ౨౮ లో సౌత్రామణి, ౨౯ లో నశ్వమేధము, 30-3౧ లోఁ బురుషమేధవిధి, 3౨-33-3౪ లో సర్వమేధవిధి, 3౫ లోఁ బితృమేధము, చెప్పఁబడినవి. తక్కినవి శుక్రియము లనఁబడును. అందు 3౬ లో శాంతిపాఠము, 3౭ లో నగ్న్యాది రోహిణాంతవిషయము, 3౮ లో మహావీరనిరూపణము, 3౯ లో ధర్మాదినిష్కృతి నిరూపణమును గలవు. నలువదియవ యధ్యాయము పరమాత్మ నిరూపణపరము. ఉపనిషద్రూప మైనయిది జ్ఞానకాండ మనఁబడుచున్నది.

ఇట్లు నలువదియధ్యాయములుగాఁ గనవచ్చెడి యీసంహితలో మొదటి పదునెనిమిదియధ్యాయములలోని గ్రంథమే ప్రాచీన మనియుఁ దరువాతి యధ్యాయములలోనిది యర్వాచీన మనియుఁ గొందఱి యభిప్రాయము[1]. మొదటి పదునెనిమిదింటిలో నున్నఋక్కులు యజుస్సులు గూడ మంత్రశబ్దవాచ్యములగుచుఁ దైత్తిరీయసంహితనుండి యుద్ధరింపఁబడినట్లు కనవచ్చుచున్నవి. ౨౨-౨3-౨౪-౨౫-అధ్యాయములలోని మంత్రములు సరిగాఁ దైత్తిరీయమునుండి యుద్ధరింపఁబడినవిగానే యున్నవి. మఱియు మొత్తముమీఁదఁ బరిశీలింపఁగా నీసంహితలోని కడపటి యిరువదిరెండధ్యాయములలోను వర్ణింపఁబడిన విషయము లన్నియుఁ దైత్తిరీయబ్రాహ్మణారణ్యకములందు గనవచ్చుచున్నవిగాని వాజసనేయ బ్రాహ్మణారణ్యకములందు గనరావు. అదిగాక, వాజసనేయ బ్రాహ్మణము మొదటి తొమ్మిదికాండములును సంహితలోని మొదటి పదునెనిమిది యధ్యాయములకు వ్యాఖ్యానముగాఁ గనవచ్చును. తరువాతి పదియేడధ్యాయములలోని మంత్రములు కొన్ని బ్రాహ్మణమున నందందు గ్రహింపఁబడినవి. కాని కడపటి యైదధ్యాయములలోని మంత్రములప్రసక్తి బ్రాహ్మణమున నెందును గనరాదు. దీనినిబట్టి చూడఁగా నే యధ్యాయములయందలి మంత్రములకు బ్రాహ్మణము ప్రతిపదార్థరూపమున నున్నదో, ఆపదునెనిమిదియధ్యాయములే ప్రాచీనము లని తెలియవచ్చుచున్నది. ఇందుకుఁ గాత్యాయనునిశుక్ల యజుర్వేదానుక్రమణి, సంహితలోని ౨౬—3౫ వఱకుఁ గల పదియధ్యాయములును ఖిలము లని చెప్పటగూడఁ బ్రమాణ మగుచున్నది. ఇది యిట్లుండ—

1. చూ. మేక్డో. San. Lit. P. 177.

ఇంతకు మున్ను చూపినట్లుగా ౨౬—౨౯ వఱకుఁ గలనాలుగధ్యాయములలోని విషయములును వెనుకటి యధ్యాయములందు విహిత మైనయజ్ఞక్రియయందు సమన్వయించుట మాత్రముననే సార్థకము కాఁదగి యుండుట కూడ వీనియర్వాచీనతను జాటుచున్నది. ౩౦—౩౯ వఱకుఁ గల పదియధ్యాయములలో వర్ణింపఁబడిన నరమేధపితృయజ్ఞ విశ్వజిద్యాగాదు లైన నూతనక్రియ లీయధ్యాయముల యర్వాచీనత్వమునకుఁ దోడ్పడుచున్న వనుట నిర్వివాదము. ఇంకఁ గడపటియధ్యాయ మందుమా, యాగక్రియతో నెట్టిసంబంధమును లేనియది సంహితచివర నెట్లు చేరినదో కాని యది తరువాత వెలువడిన యుపనిషత్తులకు సంబంధించిన దగుటచేఁ దప్పక యర్వాచీనమే యగుచున్నది.

పై విభాగమునుబట్టి చూచినచో నీసంహిత యందలి మొదటి ౧౮ అధ్యాయములను దొలుతఁ దైత్తిరీయ సంహితనుండి వేఱుపడిన మంత్రార్థవాదరూపమయిన వాజసనేయసంహిత యనియుఁ దరువాతి యధ్యాయములు ౨౨ ను, తైత్తిరీయ బ్రాహ్మణారణ్యకములు వెలసిన పిదప నావిర్భవించి యాసంహితకుఁ గాలక్రమమునఁ జేరిన వనియు గోచరించుచున్నది. ఏతాదృశమై కాణ్వమాధ్యందినభేదమునఁ బ్రధానముగా రెండుశాఖ లైన యీసంహితలోని ఋఙ్మంత్రములు ౧౯—౨౧ అనియు, యజుర్మంత్రములు ౮౮—౨౮ అనియుఁ దెలియుచున్నది[1].

## అథర్వసంహిత.

దీని ప్రామాణ్యాదికమునుగూర్చి చతుర్థాధ్యాయమునఁ గొంత చదివియున్నాము. తైత్తిరీయారణ్యకాదులఁ బ్రశంసింపఁబడి యజ్ఞోపయోగియై బ్రహ్మవేద మనుఖ్యాతి గాంచినయిది తక్కిన సంహితలకంటె నర్వాచీన మైనను గొందఱు పాశ్చాత్యులు తలఁచిన ట్లత్యంత మర్వాచీనము కాదు. దీనికిఁ దొమ్మిది శాఖ లున్న వనియు, పదియేనుశాఖలు గల వనియు రెండుపాఠము లున్నవి[2]. ప్రవర్తకులనుబట్టి వచ్చిన యాశాఖాభేదములను గూర్చి ముందు కొంత తెలిసియుదము.

## ఆథర్వణ శాఖలు.

“అథర్వసంహితను వ్యాపింపఁజేయు మని వేదవ్యాసుఁడు సుమంతుని కిచ్చినట్లు విష్ణుభాగవతాది పురాణములు చెప్పుచున్నవి. ఆ సుమంతుఁడు దానిని రెండుభాగములు చేసి కబంధుని కిచ్చెను, అతఁ డందొక భాగము పథ్యునికిని

1. చరణవ్యూహ పరిశిష్టము.

2. నవాధ్యాథర్వణోఽన్యేతు ప్రాహుః పంచదశాధ్వగమ్. సర్వా - వృత్తి. అథర్వవేదస్య నవభేదా భవంతి. చరణవ్యూ.

మఱియొకభాగము వేదస్పర్శునికి నిచ్చెను. వేదస్పర్శుఁడు దానిని నాలుగుభాగములు చేసి మోదుఁడు పిప్పలాదుఁడు శౌక్వాయని తపనుఁడు, అను నలుగురి కిచ్చెను. పథ్యుఁడు తనభాగమును మూఁడుగా విభజించి, జాజిలి కుముదాది శౌనకుఁడు నను ముగ్గురి కిచ్చెను. శౌనకుఁడు తనభాగమును రెండుచేసి బభ్రువు సైంధవుఁడు ననువారి కొసంగెను. సైంధవుఁడు ముంజకేశుని కిచ్చెను. అది మరల రెండుశాఖ లైనది." అని వాయుపురాణము చెప్పుచున్నది[1]. ముంజకేశుని వల్ల గ్రహించినయిద్దఱిపేళ్ల నది పేర్కొనకపోయినను, ఈ సందర్భమందే యొక చోట "ఏత దంగిరసా ప్రోక్త'మ్మనియు, దాని క్రిందనే 'తథా చరణవిద్యానా' మనియుఁ జెప్పుటనుబట్టి, అంగిరసుఁడు చరణవిద్యుఁడు ననువా రిరువురును శాఖాప్రవర్తకు లని తెలియనయ్యెడి. ఋగ్వేద యజుర్వేదముల ప్రథమ ప్రవక్త లగుపైలవైశంపాయనులు శాఖాప్రవర్తకులలో గణనకు రానట్లే వైవారిలో సుమంతుఁడు గణనకు రామింజేసి కబంధాదులు పదియేనుమందియు శాఖా ప్రవర్తకు లైనట్లు తెలియవచ్చును. ఈపద్ధతినిబట్టి పదియేనుశాఖలనెడిపాఠాంతరము గూడ సార్థక మగుచున్నది గాని చరణవ్యూహము తొమ్మండుగురు ప్రవర్తకులనే పేర్కొనుచున్నది. ఇది యన్నివేదముల ప్రవర్తకుల పేళ్లను బురాణములనుండియే గ్రహించినది గాని దీనివ్రాఁతప్రతులు నచ్చుప్రతులుఁ గూడ లేఖనముద్రణాది దోషదూషితము లగుటంజేసి యిందు వైవానిలోఁ గొన్నినామము లపపాఠములుగానున్నవి.మఱికొన్ని క్రొత్తవిగా నున్నవి. చరణవ్యూహములోని కొన్నితప్పులను సవరించుచు దానివ్యాఖ్యానము మఱికొన్ని తప్పులు చూపుచున్నది. వాని నెల్ల దిద్దివాయుపురాణపాఠముతో సరిచూడఁగా, మోద - వేదస్పర్శ - పిప్పలాద - తపన - జాజిలి - కుమదాది - శౌనక - అంగిర - శ్చరణ విద్యులు తొమ్మండుగురు శాఖాప్రవర్తకు లనెడిపాఠము సార్థక మగుచున్నది. వీనిలో శౌనకపైప్పలాదశాఖలు రెండుమాత్రమే ముద్రితాముద్రిత సంహితాపుస్తకరూపమునఁ గనఁబడుచున్నవి. ఈ రెండును దొలుత నొకమూలమే యాధారముగా విడిపోయిన వైనను, తరువాతఁ బ్రవర్తకపాఠభేదమునుబట్టి గ్రంథము ముందువెనుక లగుటవలనను నూతనగ్రంథము చేరుటవలనను బరస్పరము విభిన్నముగాఁ గనవచ్చుచున్నవి. ఈ రెంటిలోను దొల్లి దేశము నలుఁగడల వ్యాపించి సాయణభాష్యమునకు గుఱియై ఖ్యాతి కెక్కినది శౌనకశాఖ యనుట యసంశయము. కావున దీనినిబట్టి యథర్వసంహితయందలి విభాగాదులను ముందుగాఁ దెలిసికొందము.

శౌనకసంహిత ౨౦ కాండములు. అందు ప్రతికాండము కొన్ని ప్రపాఠకములుగాను, ప్రతిప్రపాఠకము కొన్ని యనువాకములుగాను, ప్రత్యను

1. వాయుపు - పూర్వ. 61. అధ్యా.

వాకము కొన్నిసూక్తములుగాను విభజింపఁబడినవి. ప్రతిసూక్తమందు ననియత సంఖ్య గలఋక్కులు లేక, మంత్రము లుండును. ఇట్లున్న యీవిభాగముల స్వరూప మీక్రిందిపట్టిక తెలుపును.

శౌనకీయాథర్వ సంహిత.

| కాం. | ప్రప. | అ. | సూక్త. | ఋక్కులు. |
|---|---|---|---|---|
| ౧ | ౧-౨ | ౬ | ౩౫ | ౧౫౩ |
| ౨ | ౩-౪ | ౬ | ౩౬ | ౨౦౭ |
| ౩ | ౫-౬ | ౬ | ౩౧ | ౨౩౦ |
| ౪ | ౭-౮-౯ | ౮ | ౪౦ | ౩౨౪ |
| ౫ | ౧౦-౧౧-౧౨ | ౬ | ౩౧ | ౩౭౬ |
| ౬ | ౧౩-౧౪-౧౫ | ౧౩ | ౧౪౨ | ౪౫౪ |
| ౭ | ౧౬-౧౭ | ౧౦ | ౧౧౮ | ౨౮౬ |
| ౮ | ౧౮-౧౯ | ౫ | ౧౦ | ౨౫౯ |
| ౯ | ౨౦-౨౧ | ౫ | ౧౦ | ౩౦౨ |
| ౧౦ | ౨౨-౨౩ | ౫ | ౧౦ | ౩౫౦ |
| ౧౧ | ౨౪-౨౫ | ౫ | ౧౦ | ౩౧౩ |
| ౧౨ | ౨౬-౨౭ | ౫ | ౫ | ౩౦౪ |
| ౧౩ | ౨౮ | ౪ | ౪ | ౧౮౮ |
| ౧౪ | ౨౯ | ౨ | ౨ | ౧౩౯ |
| ౧౫ | ౩౦ | ౨ | ౧౮ | ౨౨౦ |
| ౧౬ | ౩౧ | ౨ | ౯ | ౯౩ |
| ౧౭ | ౩౨ | ౧ | ౧ | ౩౦ |
| ౧౮ | ౩౩-౩౪ | ౪ | ౪ | ౨౮౩ |
| ౧౯ | ... | ౭ | ౭౨ | ౪౫౬ |
| ౨౦ | ... | ౯ | ౧౪౩ | ౯౬౭ |
| -౨౦ | ౩౪ | ౧౧౧ | ౭౩౧ | ౫౯౩౪ |

పై మొత్తములు సేనకలాలపండితుఁడు ప్రకటించిన ప్రతినిబట్టి యుదాహరింపఁబడినవి[1]. రాథ్‌విట్నీపండితులు ప్రకటించిన బర్లిన్‌ప్రతియు[2]. శంకర

1. బొంబాయి. క్రీ. 1884 సం.—2. బర్లిన్ 1856 సం.

పాండురంగ పండితుఁడు సాయణభాష్యముతోఁ బ్రకటించిన ప్రతియు[1]. బొంబాయి తంజావూరుపుస్తకభాండాగారములలోని వ్రాఁతప్రతులును పైమొత్తములలో ముఖ్యముగా బుక్కలమొత్తమునెడ నించించుక వేఱుపడుచున్నవి గాని యాభేదము చాలవఱకుఁ బర్యాయసూక్తము లనఁబడు నర్థసూక్తముల యందలి బుక్కలను గణించుటలో వచ్చినది గాని గ్రంథభేదమునుబట్టి వచ్చినది కా దనుట నిజము. హిందూదేశమందలి ముద్రితాముద్రితప్రతులన్నియుఁ బైని జూపినబుక్కల మొత్తమునే యీషద్వైషమ్యముగా జూపుచున్నవి గాని బర్లిౝప్రతిమాత్రము మిక్కిలి భేదమును ౨౦-వ కాండమునందు చూపుచున్నది. ఆప్రతిలో ౨౦-వ, కాండమున ౧౫౦ బుక్కలు మాత్రమే కలవు. దీనినిబట్టి యీకాండ మాప్రతికిఁ బూర్తిగా లభింపలే దని స్పష్ట మగుచున్నది. ౧౯ కాండములవఱకును సకలవిధముల బర్లిన్ప్రతి సేవకలాలప్రతిని బోలియున్న దని యీరెండుప్రతులలోని మొత్తములను సరిగాఁ బరిశీలించుటవలనఁ దెలియవచ్చినది. విట్నీపండితుని యాంగ్లీకృతాథర్వవేద మందలి పీఠికయు[2], బర్లిన్ప్రతిలోని బుక్కలను శంకరపాండురంగప్రతిలోని బుక్కలను, అనుక్రమణికావచనములనుబట్టి పోల్చి ౧౯ కాండములవఱకుఁ గలయీషద్భేదము పర్యాయసూక్తగణనభేదమున వచ్చిన దనియే తేల్చినది, ౨౦-వ, కాండమును విట్నీ యాంగ్లీకరింపలేదు గాని యందలి బుక్కలు ౧౫౦ అనియుఁ జెప్పినది. అందుచే బుక్కలమొత్తములు మూఁడువిధములుగాఁ గనవచ్చుచున్నవి.

| సేవకలాప్రతి | పాండురంగప్రతి | బర్లిన్ప్రతి |
|---|---|---|
| ౫౯౩౮ | ౬౦౧౭ | ౫౦౩౭ |

ఇందు మొదటిదానికిని రెండవదానికిని వచ్చిన ౭౮ బుక్కలభేదము పర్యాయసూక్తమంత్రగణనభేదమున వచ్చినది కొంత, ౨౦-వ కాండమందలి బుక్కల హెచ్చుతగ్గులనుబట్టి వచ్చినది కొంత. అందు ౫౭ బుక్కలగణన భేదము తీసివేసినచో ౨౬ బుక్కలు మొదటిప్రతి ౨౦-వ, కాండమున నెక్కువగా నుండును[3]. ఇంక మొదటిదానికిని మూఁడవదానికిని ౭౯౬ బుక్కలభేదమున్నది. ఇది చాలావఱకు ౨౦-వ, కాండమునుబట్టి వచ్చినదే. కాని, యిట్లున్న మూఁడుమొత్తములను గూడఁ గొంచె మెచ్చుతక్కువగా సమర్థించు ప్రమాణవచనములు గనఁబడుచున్నవి. వాయుపురాణములో :—

1. బొంబాయి 1895. ముద్రణము
2. H. O. S. Lannan. Vol. 7.
3. శం. పా. ప్రతి ౨౦-వ, కాండములోని బుక్కు ౯౮౧.

"ఋచా మథర్వణాం పంచ సహస్రాణి వినిశ్చయః,
సహస్ర మన్య ద్విజ్ఞేయ మృషిభి ర్వింశతిం వినా.
ఏత దంగిరసా ప్రోక్తమ్.—
తథా చరణవిద్యానాం ప్రమాణం సంహితాం శృణు,
షట్సహస్ర మృచా ముక్త మృచ షడ్వింశతిః పునః"[1].

అని రెండుశ్లోకము లున్నవి. ఇందు మొదటిదానినిబట్టి యంగిరశ్శాఖా ప్రమాణము ౫౯౮౦ అనియు, రెండవదానినిబట్టి చరణవిద్యశాఖా ప్రమాణము ౬౦౨౬ అనియుఁ దెలియుచున్నది. ఈ రెండు మొత్తములును గొంచెె మించు మించుగా మన మొదటి రెండు ప్రతుల మొత్తములకును సరిపడుచున్నవి. మఱియు, మొదటిశ్లోకములోని "అయిదువేలు నిశ్చయము. ఇరువది తక్కనగా వేయిఋక్కులు వే ఱని తెలియఁదగును" అనునర్థ మిచ్చుపదములనుబట్టి కడపటి కాండములోని గ్రంథము ప్రాచీనము కా దనియు, బర్లిన్ ముద్రితప్రతి కది పూర్తిగా లభింపలే దనియు, అందుచేఁ బ్రాచీనఋక్సంఖ్యనుబట్టి మనమూఁడవ మొత్తముగూడ సరిపడుచున్న దనియుఁ దెలియుచున్నది. కాని, యనేకులు తలఁచినట్లుగా నిరువదవకాండ మర్వాచీనమే యైనను, అందలి మంత్రసంఖ్య బర్లిన్ప్రతిలోఁ దప్ప మనదేశమందలి వ్రాతప్రతులలో నెల్లఁ దొమ్మిదివందలకుఁ బైగానే కనఁబడుచున్నది[2]. ఇది యిట్లుండ, చరణవ్యూహ మథర్వమంత్ర ప్రమాణము ౧౨ వేలని చెప్పుచున్నది. ఈ ప్రమాణ మెపు డైన నున్నదో లేక యిది శౌనకపైప్పలాదసంహితలను గలిపి చెప్పినదో యూహించుట కేమియు నవకాశములే కున్నది. కావున నిఁక సంహితాస్వరూప స్వభావములనుగూర్చి యించుక విచారింతము.

ఈ సంహిత స్వరూప స్వభావములనుబట్టి నాలుగుభాగము లగుచున్నది. అందు ౧—౭ వఱకు నేడుకాండములు ప్రథమభాగము. ౮—౧౨ వఱకు నైదు కాండములు. ద్వితీయభాగము. ౧౩—౧౮ వఱకు నాఱుకాండములు తృతీయ భాగము. ౧౯, ౨౦, కాండములు రెండును జతుర్థభాగము. ఇందు మొదటి భాగము మొదటికాండములో సూక్తమునకు నాలుగుచొప్పున, రెండవదానిలో నల్లే నైదు చొప్పున, మూఁడవదానిలో నాఱుచొప్పున, నాల్గవదానిలో నేడు చొప్పున, అయిదవదానిలో నెనిమిది మొదలుగాఁ బదునెనిమిదివఱకును, ఆఱవ దానిలో మూఁడుచొప్పున,ఏడవదానిలోఁ జాలవఱ కొకటిచొప్పునను, రెండు మొద

1. వా. పు. పూ. 61 అధ్యా.

2. బొంబాయి దొరతనమువారి ప్రాచ్యపుస్తకభాండాగారములోని నంబర్లు 362-377. తంజావూరు మహారాజ పుస్తకాలయము. నం-594.

లుగాఁ దొమ్మిదివఱకును, మంత్రములు గలవు. సూక్తముల ననుసరించిన ఋక్కుల నియమమే యీభాగమందలి యొకవిశేషము. రెండవభాగములో నన్నికాండములందును, అయి దేసిచొప్పున ననువాకములు సమానముగా నుండుట యొకవిశేషము. సూక్తసంఖ్య కూడ నీభాగమునఁ గడపటికాండమందు తప్పఁ దక్కిన యన్నిటియందు నొక్కరీతి నున్నది. మూఁడవభాగమందలి కాండములు వివిధరూపస్వభావములు కలవి యైనను, అవి యొక్కొక్కవిషయము ననుసరించి యుండుట విశేషము. ఇఁక నాల్గవభాగములో మొదటి దగుపందొమ్మిదవకాండ మేవిషయమునకును బ్రత్యేకముగా సంబంధింపక పూర్వకాండములకుఁ బరిశిష్టముగా నున్నది. మఱియు నందలి మంత్రములు నిర్దుష్టములు గాక యర్వాచీనతను జాటుచున్నవి. ఇరువదియవకాండ మథర్వమంత్రస్పర్శయే లేకుండ ముప్పాతిక మువ్వీసము సోమయాగమునకు సంబంధించిన ఋగ్వేదమందలి ఋక్కులతో నిండి యున్నది. ఇది యీభాగమందలి ముఖ్యవిశేషము. అందుచేతనే యిది యర్వాచీనభాగ మనఁబడుచున్నది. స్వరూపమునుబట్టి ౧౬, ౧౭, కాండములు మిక్కిలి చిన్న వైనను, ఆథర్వణ స్వభావము గలిగియున్నవి. అందుచే నథర్వసంహిత యనుసంజ్ఞ మొదటి పదునెనిమిదికాండములకే చెల్లు నని పెక్కండ్రు విమర్శకుల యభిప్రాయము.

## సంహితా విషయ విచారము.

విషయమునుబట్టి చూచినచో మొదటిపదమూఁడు కాండములలోని మంత్రములును బూర్వోత్తరసంబంధము లేక యవ్యవస్థముగాఁ గనిపించునుగాని తక్కిన యైదింటిలోని విషయ మట్లుకాదు. ౧౪-వ, కాండ మంతయు వివాహమంత్రభూయిష్ఠము. ౧౫-వ, కాండము వ్రాత్య మనఁబడును. ఇది యంతయు వ్రాత్యనామకుఁ డైన పరమాత్మస్తుతికి వినియుక్త మైనది. ౧౬, ౧౭, కాండములు వశీకరణమంత్రపరములు. ౧౮-వ, కాండ మంత్యసంస్కారపరము. ఇట్లు తొలుత ౧౮, కాండములుగా నున్నయీసంహితకు వివిధము లైనక్షుద్రసూక్తములతో ౧౯-వ, కాండము పరిశిష్టముగాఁ జేరినది. కాని యిది యుయజ్ఞోపయోగి కాదు. అందుచే నీసంహిత యిట్లు యాగార్థము కాకుండుట కనిపెట్టి తరువాత నథర్వసంహితాభిమానులు ఋగ్వేదమునుండి యెట్టిమార్పు లేకుండఁగా సోమయాగోపయుక్తము లైన కొన్నిసూక్తములను దీనికిఁ జేర్చిరి. అదియే ౨౦-వ కాండము. ఈకాండము చేరినపిదప నిది బ్రహ్మవేద మనుఖ్యాతి వహించి యజ్ఞోపయోగియై ప్రామాణ్యమును జెంది వేదములలోఁ జేరినది. అదియే వేదములు నాలు గనుటకు మొదలు. చతుర్థాధ్యాయములోఁ జెప్పినట్లుగాఁ దైత్తిరీయైతరేయబ్రాహ్మణముల నాఁటికిఁ గూడ యజ్ఞోపయోగి కానియీవేదము తర్వ

వాత నట్టిస్థితికి వచ్చిన దని దీనికి సంబంధించినగోపథ బ్రాహ్మణములోని యీక్రింది వాక్యములవల్లఁ దెలియనగును.

"అథహ ప్రజాపతిః సోమేన యక్ష్యమాణో వేదా నువాచ ॥
కం వో హోతారం వృణీయాం క మధ్వర్యుం, క ముద్గాతారం,
కం బ్రహ్మాణ మితి, త ఊచు ర్ఋగ్విద మేవ హోతారం వృణీష్వ,
యజుర్విద మధ్వర్యుం,సామవిద ముద్గాతార,మథర్వాఙ్గిరోవిదం బ్రహ్మాణమ్."

దీనినిబట్టి యజ్ఞమునందు ఋగ్యజుస్సామవేదజ్ఞులు క్రమముగా హోత - అధ్వర్యుఁడు - ఉద్గాత - యగునట్లు, అథర్వవేదజ్ఞుఁడు బ్రహ్మయగు నని తెలియు చున్నది. ఇందుచేతనే యిది బ్రహ్మవేద మనఁబడుచు వచ్చినది. పురాణముల కాలమున దీనిమహిమ మఱియు హెచ్చినది. కావున దీనిఖ్యాతి కిరువదియవ కాండమే మూల మనియు నది యర్వాచీనులు దీనికిఁ జేర్చిన దనియు భావింప నగును.

ద్వితీయాధ్యాయమున వేదకాలనిర్ణయసందర్భమునందు కృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రముగా గణించిన తైత్తిరీయబ్రాహ్మణాదులలోని కొన్నివాక్య ములు చదివియున్నాము. అట్టివాక్యమే యీసంహితలో "సుహవం మే కృత్తికా రోహిణీ చాస్తు భద్రం మృగశిరః శమార్ద్రా, పునర్వసూ సూనృతా". ఇత్యాది గాఁగనఁబడుచున్నది[1]. దీనినిబట్టి కృత్తిక ప్రథమనక్షత్రముగా నున్నకాలమున నీసంహిత పుట్టియుండు నని కొందఱు తలంచిరిగాని యది సరికాదు. అనేకహేతు వులనుబట్టి యీసంహిత యర్వాచీన మనియు, అందును గడపటికాండములు మిక్కిలి యర్వాచీనము లనియు విదిత మగుచుండఁగాఁ దైత్తిరీయబ్రాహ్మణా ణాదులలోని వాక్యముల ననుకరించిన పందొమ్మిదవకాండములోని యీవాక్య మునుబట్టి యీసంహిత తైత్తిరీయబ్రాహ్మణాదులకు సమకాలిక మనుట ప్రమా ణసిద్ధము కాఁజాల దనుటకంటె నీవిషయము నీసందర్భమున మరలఁ జర్చించుట యావశ్యకము కాదు. కావున నిరువదియవకాండము మిక్కిలి యర్వాచీన మనుటకుఁ గొన్నికారణములు తెలిసికొందము.

౧. తక్కిన కాండములలో నక్కడక్కడ నొకటిరెండు యాగోపయోగి సూక్తము లున్నను, మొత్తము మీఁద నవి యాగసంబంధము కలవి కావు. ఇది మాత్రమే సోమయాగమునకు సంబంధించినది. ఇది దీనియపూర్వలక్షణము.

౨. తక్కినకాండములలో నందందు ఋగ్వేదములోని ఋక్కు లున్నవి గాని యవి యించించుక మాఱురూపమునఁ గనవచ్చును. ఇందలి సూక్తములు ఋగ్వేదములో నున్నట్లే యేమియు మార్పులేక యట్లే యున్నవి. ఇది దీనియభి నవలక్షణము.

1. అథ. సం. 19-1-7-2.

3. మొదటి ౧౮ కాండములలోను, ప్రపాఠకవిభాగము కలదు. ౧౯-వ కాండమందును, ఇందును నట్టివిభాగము కనరాదు.

౪. అథర్వప్రాతిశాఖ్యము ౧౯-వ, కాండమును దీనినిగూడఁ బేర్కొన లేదు.

౫. ఇందు స్వతంత్రములుగాఁ గనవచ్చు దానస్తుతిపరము లయినకుంతాప సూక్తములకు పదపాఠము కూడఁ గనరాదు.

ఇంక నిట్టిహేతువులు కలవు గాని, దీనియర్వాచీనతను స్థాపించుట కివి చాలును. ఈదృశలక్షణలక్షిత మైనశౌనకసంహితలోని విశేషములు పరిశీలించుటకు ముందు దీనిసోదరి యగుపైప్పలాదసంహితస్వరూపము తెలిసికొనుట యావశ్యకము.

## పైప్పలాద సంహితాచరిత్ర.

యజుస్సంహిత తైత్తిరీయవాజసనేయ భేదమున విడివడినట్లే యథర్వసంహిత తొలుత శౌనకపైప్పలాదభేదమున విడిపోయె నని చెప్పవచ్చును. ఈ రెంటిలో నేది ముందో చెప్పుటకుఁ దగిన సదాధారము లేవియు నిపుడు లభింపకున్నవికాని శౌనకశాఖ కున్నవ్యాప్తిలో సహస్రాంశ మైనను బైప్పలాదశాఖకు లే దని మాత్రము చెప్పక తప్పదు. ఎచ్చటనో యొకమాఱుమూల నొక్కవ్రాఁతప్రతి నాశ్రయించి యణఁగిపోయి దైవవశమున నెట్లో యిది సజీవమై యుండుటచే నిట్లు చెప్పవలసివచ్చినదిగాని యింతమాత్రమునఁ దొల్లి వైదికలోకము దీని నెఱుగఁ దని తలంపరాదు. బ్రహ్మయజ్ఞపాఠ మేమంత్రము నథర్వవేదప్రథమమంత్రమునుగాఁ దెలుపుచుండెనో, "శం నో దేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే శం యో రభి స్రవన్తు నః" అనెడి యామంత్రము దీనిమొదట మాత్రమే యున్నది[1]. అథర్వవేదసంబంధి యగు గోపథబ్రాహ్మణముగూడఁ బైమంత్రమే మొదలు చేసికొని యథర్వవేదము పఠింతు రని చెప్పుచున్నది[2]. హలాయుధునిబ్రాహ్మణ సర్వస్వమును, అథర్వవేద పరిశిష్టమును గూడ నీమంత్రమే యథర్వవేదప్రథమమంత్ర మని చెప్పుచున్నవి. మఱియు శౌనకసంహితను బ్రకటించిన రాథవిట్నీపండితులును, శంకరపాండురంగపండితుఁడును సంపాదించిన వ్రాఁతప్రతులలో నొకటిరెండింటియం దీమంత్రము మొదట నున్న దని వారు వ్రాసియున్నారు[3]. కాని వారు పెక్కుప్రతులు శోధించి శౌనక

1. చూ. బ్లూంఫీల్డు కౌశికసూత్ర పీఠిక.
2. శంనోదేవీరభిష్టయ ఇత్యేవ మాదిం కృత్వా అథర్వవేద మధీయతే. గో. బ్రా. 1-29.
3. చూ. ఆంగ్లీకృతాథర్వ వేదపీఠిక. పుట. 116.
బొంబాయి సభాష్యా థర్వవేదపీఠిక.

సంహితమొదటిమంత్రము "యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః వాచస్పతి ర్బలా తేషాం తన్వో అద్యదధాతు మే" అనునది ప్రథమమంత్రమని పరిష్కరించుటచేతను, సాయణాచార్యులు దీనినే ప్రథమముగాఁ గ్రహించి భాష్యము వ్రాయుటచేతను, శౌనకసంహిత "శంనో దేవీ" రిత్యాదిమంత్రముతో నారంభము కా లేదనుట నిశ్చయము. ఈమంత్ర మీసంహితలో మొదటికాండ మాఱవసూక్తము మొదటఁ జెక్కువ్రాత ప్రతులందు గనవచ్చుటనుబట్టియు, సాయణాచార్యు లీమంత్రమును మొదటిదానినిగా గ్రహించి భాష్యము వ్రాయక పోవుటనుబట్టియుఁ బరిష్కర్తలును బ్రకాశకులును గూడ శౌనక సంహితాద్య మంత్రము శంనోదేవీరిత్యాదికము కా దనియు, యేత్రిషప్త ఇత్యాదికమే యనియు నిశ్చయించి రనుట స్పష్టము.

ఇట్లు శౌనకసంహితాద్యమంత్రము 'శంనోదేవీ' రిత్యాదికము కా దని ధ్రువపడుటచేతను, దీని యొకటి రెండు వ్రాతప్రతులలో నిది మొదట నుండుటకు బ్రహ్మయజ్ఞాది సంప్రదాయమునుబట్టి లేఖకుఁడు చేసిన ప్రమాదమే కారణ మనుట విదిత మగుటచేతను, పూర్వోక్త సత్ప్రమాణములనుబట్టి 'శంనోదేవీ' రిత్యాదిమంత్ర మథర్వప్రథమమంత్ర మని వైదికసంప్రదాయము ఘోషించుటచేతను, అది యేదో యొకశాఖలో మొదటిమంత్రముగా నుండియుండవలె ననుట నిశ్చయము గావున, లభించిన వైప్పలాదసంహిత వ్రాతప్రతిలో మొదటిపత్రము లేకపోయినను, అందలి మొదటిమంత్రము 'శంనోదేవీ' రిత్యాదికమే యని దానిస్వరూప స్వభావము లెఱిఁగిన రాథవిట్నీ పండితులు మొదలగువారు నిశ్చయించియున్నారు[1]. అనాదిగా బ్రహ్మయజ్ఞాదులందు ప్రథమమంత్రముగాఁ బఠింపఁబడుచు వచ్చుచున్న యీమంత్రము దేశమందు వ్యాపించిన శౌనక సంహితమొదట లేనపుడును, వైప్పలాదసంహితకంటె మఱియొక యథర్వసంహిత యున్న దనుట కాధారములు లేనపుడును, శంనోదేవీరిత్యాది మంత్రము వైప్పలాదసంహితలో మొదటిమంత్రమే యని యూహించి నిశ్చయించుట సముచితమే. దీనినిబట్టి శౌనకసంహితకంటె నిదియే ముం దని చెప్పఁదగియున్న వైప్పలాదసంహిత చిరకాలముక్రిందటనే యణఁగి పోయినను హృదయము కరఁగించునట్లు దీని చరిత్రము మాత్ర మతివిచిత్రముగా నిట్లు తెలియవచ్చుచున్నది.

---

1. చూ. విట్నీయాఁగ్లీ కృతాథర్వ వేదపీఠిక పు. 116.

**"In 1875, Roth, in his A. V. in Kashmir P. 16. remarks upon the general agreement in the tradition according to which '*cam no*' etc was the initial stanza of Pipp, and not '*ye*' *trishapta* as in Vulgate, and regrets all the more on that account that the first leaf of the Pippa. ms. is lost.**

భూర్జపత్రములపైఁ గాశ్మీరదేశలిపిలో వ్రాయఁబడిన పైప్పలాదసంహిత ప్రతి యొకటి తొల్లి కాశ్మీరదేశమం దుండెను. ఇది క్రీ. 1870 ప్రాంతమున రా ననుపేరు గల యాంగ్లేయునికి దొరకునప్పటికి దాదాపు మూఁడువందల పత్రములు గల యీ ప్రతిలో రెండుపత్రములు పోయినవి. ఎనిమిదిపత్రములు తూట్లు పడి నలఁగియున్నవి. ఇది సంవతు ౯౫ లో వ్రాయఁబడినట్లు దీనియం దున్నది. ఇది తరువాతఁ గాశ్మీర రాజధాని యగు శ్రీనగరమునకుఁ జేరినది. దీనినే భూర్జపత్రప్రతి యనియు, కాశ్మీరప్రతి యనియుఁ జరిత్రకారులు వ్యవహరించుచున్నారు.

కాశ్మీరప్రతి వృత్తాంతము తెలిసి జర్మనీలోని రాథపండితుఁడు 1873 లో శ్రీనగరమున నాగరలిపిలో దీనికి నకలు వ్రాయించి తెప్పించుకొని చదివి దాని మీఁద నొకవ్యాసము 1875 లోఁ బ్రకటించెను. ఈసమయమునందే బొంబాయి రాజధానిలో రాజకీయోద్యోగిగా నున్న బుహ్లారుపండితుఁడు శ్రీనగరములోని భూర్జ పత్రప్రతికి నాగరలిపిలో మఱియొకనకలు వ్రాయించెను. అదియే 1875-76 లో సంపాదింపఁబడినవ్రాఁతప్రతిగా 378 గ్రంథసంఖ్యతో నిపుడు పూనా దక్కన్ కాలేజీలోని లిఖితపుస్తక భాండాగారమున నున్నది. మనదేశమున మన యథర్వవేదశాఖ యగు పైప్పలాదసంహిత సజీవమై యున్న దనుటకు బుహ్లారు పండితుఁడు వ్రాయించిన యీప్రతియే యాధారము కాని యిదిగూడఁ బోయినట్లే కనఁబడుచున్నది[1].

రాథపండితుఁడు తాను వ్రాయించి తెప్పించుకొన్నప్రతిలోఁ దప్పు లెక్కువగా నున్న వని తలంచి కాశ్మీరప్రతినే సంపాదింప దీక్ష వహించెను. ఇండియా దొరతనమువారీప్రతిని సంగ్రహించి యతనికి 1876 లో నెరవుగాఁ బంపిరి. అతఁడు దీనినిబట్టి మఱియొకప్రతి వ్రాసికొని పాఠపరిష్కారము గావించి, యథర్వవేద శౌనకసంహిత నాంగ్లీకరించుచున్న విట్నీపండితునికి 1884 లో నందఁజేసెను. తరువాతఁ గాశ్మీరప్రతి జర్మనీలోని 'టుబింజెన్' విశ్వవిద్యాలయములోనిపుస్తక భాండాగారమునఁ బ్రవేశించెను. పిదప నిది యూరపు ఖండమందలిపండితుల కుపయోగించుటకై బ్లూంఫీల్డు, గార్బు, పండితు లిరువురును 1901 లో రూపగ్రాహక యంత్రసాహాయ్యమున దీని ప్రతిరూపప్రతిని దీసి బాల్టిమోరుపురమునఁ బ్రకటించిరి. సర్వవిధములఁ గాశ్మీరప్రతియే యనఁదగిన యీప్రతిరూపప్రతియే తరువాత వైదికవాఙ్మయమును బరిశోధించు పాశ్చాత్య

---

1. అముద్రిత గ్రంథపట్టికనుబట్టి తెలియవచ్చిన యీ గ్రంథ మొకసారి యెరవుగాఁ బంపుఁడని దక్కన్ కాలేజీ ప్రిన్సిపాలుగారి కాంధ్ర విశ్వకలా పరిషత్తువారిచే వ్రాయింపఁగా గ్రంథము కనఁబడలే దని జవాబు వచ్చినది.

పండితులకు సహాయపడుచున్నది[1]. అప్పటి భారతీయ ప్రభుత్వము రాథపండితుని కెర విచ్చిన యీభూర్జపత్రప్రతి మరల శ్రీనగరమునకు వచ్చిన జైచ్చటను గనఁబడదు: దీనినిబట్టి భరతఖండహస్తమునుండి యూరపుఖండ హస్తగతములైన విట్టి వెన్నిగ్రంథములు గలవో మన మూహింపఁ జాలముగదా! ఇట్లీకాశ్మీర ప్రతి శ్రీనగరమునుండి టుబింజెన్పురముఁ జేరుట మంచికే యయ్యెనో చెడ్డకే యయ్యెనో యిపుడు విచారించినలాభము లేదు గాని, బుహ్లారుపండితుఁడు వెట్టినదిభిక్షగా, పూనాకాలేజీలో నున్నదను దీనిపుత్రిక గూడఁ గనరాక పోయెను గదా యని మాత్రము విచారింపక తప్పదు. భరతమాత గన్న వేదసంహితలలో నొకటి యగుపైప్పలాద సంహితగతి యిట్లయ్యెఁగదా యని వాఙ్మయప్రియులహృదయ మీచరిత్రము విన్నతఱి నొక్కమాఱు భగ్గు మనక మానదు. ఇఁకఁ గాశ్మీరప్రతి యాశ వదలుకొని పూనాప్రతి యెట్టిదో చూతము.

"ఇది కాగితములపుస్తకము. వ్రాఁతచక్కఁగానే యున్నది గాని నిర్దుష్టము కాదు. లిపి దేవనాగరియే కాని కాశ్మీరదేశపు కత్తు. మొదటిపత్రము పోయి నది గాని తక్కినగ్రంథము పూర్తిగా నున్నది. ఇరువదికాండములు నున్నవి. ఇందు పంక్తికి ౩౮, అక్షరములు చొప్పునఁ బత్రమునకు ౨౮ పంక్తులు కలవు. అట్టి పత్రములు ౨౫౧ కలవు. ఇది బొంబాయిలోను బర్లిన్నగరములోను ముద్రితమైనశౌనకసంహితకంటె వేఱుగాఁ గనవచ్చుచున్నది." అని లిఖితపుస్తకపట్టికా నిర్మాతలు వ్రాసియున్నారు. దీనినిబట్టి. ౩౨ అక్షరము లొకగ్రంథ మనుసూత్రముచే, బూనాప్రతిలోని పైప్పలాదసంహితాగ్రంథము సుమారు ౭౧౫౦ ఉన్నట్లు తెలియవచ్చుచున్నది. శౌనకసంహితలోని ఋక్కులు ౬౦౦౦ అన్నను, అందు వందలకొలఁది ఋక్కులు "పాకబలిః - వ్యాప్తః పురుషః" ఇత్యాదిగా నాలుగైదాఱేసి యక్షరములు కలవి యగుటచే ౩౨ అక్షరము లొకగ్రంథ మను సూత్రమునుబట్టి యాఱువేల ఋక్కులను గ్రంథములలోనికి మార్చినచో మూఁడువేలగ్రంథము కూడఁ గా దేమో యనితోఁచుచున్నది. కాని తంజావూరు లిఖితపుస్తకపట్టిక, శౌనకీయాథర్వసంహితలోని గ్రంథము ౬౭౦౦ అని చెప్పుచున్నది[2]. ఈ లెక్క నిజమే యైనచో శౌనకసంహితాముద్రణమునకు సంపూర్ణగ్రంథము లభింపలే దనుట నిశ్చయ మని విశ్వసింపవచ్చును. ఇదంతయుఁ జూడఁగా నథర్వవేదమంత్ర ప్రమాణము ౧౨ వేలని చెప్పెడి చరణవ్యూహవచనము సత్యమేమో యనియు, అక్కడక్కడ లుప్తభాగములు గా వ్యాపిం

1. ఈవిషయ మాంగ్లీకృతాథర్వవేదపీఠికనుబట్టియు, పూనాదక్కన్ కాలేజివ్రాఁత ప్రతుల పట్టికనుబట్టియు సంగ్రహముగా వ్రాయఁబడినది.

2. D. C. San. ms. P. 372.

చినవ్రాత ప్రతులనుబట్టి మంత్రసంఖ్యాపాఠములు వేఱువేఱుగా బయలువెడలి యుండె ననియు నూహింపవలసివచ్చుచున్నది. ఇఁక రెండుసంహితలకుఁ గలసంబంధ మెట్టిదో చూతము[1].

కొన్నిసూక్తములును మంత్రములును వేఱువేఱుగానున్నను, పెక్కుసూక్తములు తాఱుమాఱుగా నున్నను మొత్తముమీఁదఁ జాలవఱకీరెండు సంహితలలోని మొదటి నాలుగుకాండములును బరస్పరము పోలియున్నవి. మఱియు శౌనక మాఱేడుకాండములలోని కొంతగ్రంథము క్రమముగాఁ బైప్పలాదము పందొమ్మిది యిరువది కాండములలోఁ గనవచ్చుచున్నది. ఎనిమిది మొదలు పన్నెండువఱకుఁగల కాండములలోని కొంతకొంత గ్రంథము పైప్పలాదము పదునాఱు పదియేడుకాండములలో నున్నది. పదుమూఁడు మొదలు పదునెనిమిదివఱకును శౌనకకాండములలోఁ గనవచ్చు గ్రంథము చాలవఱకుఁ బదునెనిమిదవ పైప్పలాదకాండమున నిమిడి యున్నది. ఇట్లు మూఁడువంతులగ్రంథ మీరెంటియందు నేకీభవించియున్నట్లు కనఁబడుచున్నను, పాఠభేదములుమాత్ర మమితముగా నున్నవి. అందుచే ననేకమంత్రములు స్వభావముచే నొకటియైనను స్వరూపముచే వే ఱయి కనఁబడును. కొన్ని యర్థముచే నొకటియైనను శబ్దముచే వే ఱయి కనఁబడును. మఱియు శౌనక మేడవకాండమందలి కొంత గ్రంథము పైప్పల మిరువదవకాండములో నున్నను, తక్కిన యందలిగ్రంథమును, శౌనకమిరువదవకాండమందలి గ్రంథమును మిక్కిలి వేఱుగాఁ గనవచ్చును. అంతే కాదు. ఈరెంటిలో నేకాండమందైనను, మొదటిమంత్రములు గాని కడపటిమంత్రములు గాని యొకటిగా నుండవు. ఋగ్వేదమునుండి వచ్చిన ఋక్కులైనను వీనిలో నొకచోట నున్నట్లింకొకచోట నుండవు. అందుచే సూక్ష్మదృష్టి కీరెండుసంహితలసంబంధము దగ్గఱగాఁ గనిపించినను స్థూలదృష్టికి దూరముగానే కనిపించును. కావుననే యివి తైత్తిరీయవాజసనేయసంహితల నెక్కువగాఁబోలియుండు నని వెనుకఁ జెప్పితిని. ఇఁక నాది నొకటి యయ్యుఁ దరువాత ద్విరూప మైనయథర్వవేదమునితరవిషయములను విశ్వవ్యాప్త మైన శౌనకసంహితనుబట్టి తెలిసికొందము.

## అథర్వసంహిత - మంత్రద్రష్టలు.

ఈసంహిత కథర్వవేదము - అథర్వాంగిరస్సులు-భృగ్వంగిరస్సులు - బ్రహ్మవేదము - నని నాలుగునామము లున్నవి. ఇందు మొదటిమూఁడుసంజ్ఞ లాయాఋషులు ప్రవక్త లగుటనుబట్టియు, కడపటిది యాగములం దీవేదము బ్రహ్మయనుఋత్విక్కు పఠింపఁదగిన దగుటనుబట్టియు వచ్చినవి. అథర్వవేదోత్పత్తిని గూర్చి గోపథబ్రాహ్మణ విష్ణుపురాణాదులు చెప్పెడికథలయందలి ముఖ్యభావమును

1. H. O. S. Vol. 8. P. 1013-15.

బట్టి చూచినచో, భృగుమహర్షియు నథర్వమహర్షియు నభిన్ను లనియు, అథర్వాంగిరో మహర్షులును వారివారును ప్రధానులుగా నీ వేదమావిర్భవించె ననియుఁ దెలియవచ్చును. అయినను, అథర్వమహర్షియు నతని సంతతివారును దర్శించినసూక్తము లధికముగా నుండుటచే దీని కథర్వవేద మనెడిసంజ్ఞ లోకమున నెక్కువ విఖ్యాతి కెక్కినది. పై విషయమున కీసంహితయందలి యీక్రింది మంత్రములే ప్రమాణము.

"సోఽఙ్గిరసాం పాశా న్మా మోచి।
స ఆఙ్గిరసానాం పాశా న్మా మోచి।
సో ఽథర్వణాం పాశా న్మా మోచి।
స ఆథర్వణానాం పాశా న్మా మోచి॥[1].

ఆఙ్గిరసానా మాద్యైః పఞ్చానువాకైః స్వాహా।
సప్తమాష్టమాభ్యాం స్వాహా।
ఆథర్వణానాం చతుర్ఋచేభ్యః స్వాహా... ఏకోనవింశతిః స్వాహా।
వింశతిః స్వాహా, మహాత్కాండాయ స్వాహా॥[2].

దీనినిబట్టి, అంగిరసుఁడును, ఆంగిరసులును; అథర్వుఁడును ఆథర్వణులును, దర్శించిన యనువాకములును సూక్తములును గల వని తెలియుటయే కాక, ఆథర్వణు లొకటి మొదలుగా నిరువదివఱకు ఋక్కులు గలపెక్కుసూక్తములను గొప్పకాండమును దర్శించినట్లు కూడఁ దెలియవచ్చును. ఇట్లు ద్వివిధసంజ్ఞల కాధారభూతు లైనయథర్వాంగిరసులేకాక యింకను పెక్కండ్రు సూక్తద్రష్టలు కలరని యనుక్రమణికాదులవల్లఁ దెలియుచున్నది. కాని, వారిలో ననేకులు ఋగ్వేదసూక్తద్రష్టలే. వారుగాక తక్కినవారు సుమారు ముప్పదిమంది మాత్రమున్నారు. పంచదశకాండమునకు వ్రాత్య మనిపేరు. అందు వ్రాత్యుఁడు లేక, పరమాత్మదేవతయని యనుక్రమణిక చెప్పుచున్నది. ఇరువదవకాండమున - ౪౮-౪౯-సూక్తములును, ౧౨౭-౧౩౬ వఱకుఁ గల పది సూక్తములును దప్పఁ దక్కిన సూక్తములన్నియు ఋగ్వేదమునుండి యిందు ప్రవేశించిన వగుటచే నందలి విశ్వామిత్రగోతమసవ్యాదులే యిందలి సూక్తములకును ద్రష్ట లగుచున్నారు. ఆయాసూక్తములనుబట్టి యాఋషులను దెలిసికొనవచ్చునుగావున ననుబంధమందలి పట్టికలో వారినామములఁ బేర్కొనలేదు.

ఇరువదవకాండము నవీన మనుట స్పష్టము. ఇది తొలుతఁ బైప్పలాద సంహితకే యనుబంధముగా నుండెడిదనియుఁ దరువాత శౌనకసంహితయందు

---

1. అ- సం. 16-9.—2. 19-22, 23.

3. చూ. అథర్వవేదఋషిసూక్తపట్టిక - అనుబంధము. ౨.

ప్రక్షిప్త మయ్యె ననియు రాథవిట్నీ పండితు లభిప్రాయపడియున్నారు. ఇందు పూర్వోక్తము లైనపన్నెండు చిన్నసూక్తములు తప్పఁ దక్కిన విందలివి కావను నుద్దేశముతోనే బర్లిన్ ప్రతి యీకాండమున ౧౧౦ మంత్రములను మాత్రమే చూపినది. ఈకాండము శౌనకసంహితలోనిది కాదనుతలంపుతోనే విట్నీ పండితుఁడు దీని నాంగ్లీకరింపక విడిచిపెట్టెను. ఇందలి సూక్తములు సోమయాగోపయోగు లింద్రదేవతాకములు ఋగ్వేదనిష్ఠములు, కావున నీకాండమునుగూర్చి వేఱుగాఁ బ్రసంగింపఁబని లేదు.

## ఆర్షవిచారణ – ఛందోదేవతాదులు.

సర్వానుక్రమణినిబట్టి పట్టికలోనివా రథర్వవేదసూక్తద్రష్టలుగా నున్నను బృహదనుక్రమణినిబట్టి - బ్రహ్మ - అథర్వుఁడు - భృగువు - అంగిరసుఁడు - శంతాతి-చాతనుఁడు-శుక్రుఁడు - మాతృనాముఁడు-యముఁడు - అనుతొమ్మండుగురు మాత్రమే యథర్వవేదద్రష్ట లగుఋషు లని తెలియవచ్చుచున్నది. అందుచే దీనిఋషులవిషయ మిద మిత్థ మనుటకు వీలు గాకున్నది. ఇందుకు మఱియొకకారణము గూడఁ గలదు.

కడపటికాండమందే కాక తక్కిన కాండములందును ఋగ్వేదములోని పెక్కుసూక్తములు కనవచ్చును. అట్టిసూక్తములద్రష్టలు ఋగ్వేదానుక్రమణిలో నున్నట్లుగా నిందు గనరారు, ఇందు కొకయుదాహరణము. ఋగ్వేదము ౪-౫౭-౪ లో 'శునంవాహాః శునంనరః' ఇత్యాదిగాఁ గృషివిషయక మైనయొక మంత్రమున్నది. అది వామదేవనిర్మిత మని యం దున్నది. ఆమంత్రమే యథర్వవేదము 3-౧౭ లో నున్నది. ఇచ్చట నిది విశ్వామిత్రనిర్మితముగా నున్నది. ఇట్లే యీసూక్తములోని ఋక్కు లన్నియు ఋగ్వేదమున నందందు వివిధమహర్షులు రచించినట్లు కనఁబడుచుండఁగా నీసూక్త మంతయు విశ్వామిత్రదృష్టమే యని యథర్వ వేదానుక్రమణి చెప్పుచున్నది. ఇట్టి యుదాహరణము లెన్నేని కనవచ్చును. దీనినిబట్టి చూచినచోఁ బట్టికలోనిఋషు లందఱును వేఱువేఱుగా నథర్వమంత్రములు రచియించినవారు గా రనియు నిందలి స్వతంత్రసూక్తములను బృహదనుక్రమణి చెప్పినట్లుగా నథర్వాదిఋషులు నిర్మించి యుందు రనియు ఋగ్వేదమునుండి యిందు ప్రవేశించిన సూక్తములకు ననుక్రమణి యథేష్టముఁగా ఋషుల నంటఁ గట్టియుండు ననియు మొత్తముమీఁద నీవేదమున కథర్వాంగిరో బ్రహ్మభృగువులే ప్రధానకారణభూతు లనియు నొకవిధముగాఁ దెలిసికొనవచ్చును. ఇందుకు ముఖ్యము లైన ౧౯ కాండములలోని ౫౮౭ సూక్తములలో, అథర్వమహర్షి రచించినవి ౧౭౭, బ్రహ్మర్షి నిర్మించినవి ౯౨, భృగుమహర్షి రచియించినవి ౨౭, అంగిరోమహర్షి దర్శించినవి ౧౬, భృగ్వంగిరసులు కలసి రచియించినవి ౨౭, అథర్వాంగిరసులు కలసి రచించినవి ౧౩, బ్రహ్మాంగిర

నులుకలసి రచించినది ౧, మొత్తము ౩౪౩ సూక్తములు. తక్కిన ౨౩౫ సూక్తములు నితరఋషులపేరఁ గనవచ్చుచున్నవి గాని యం దధికసంఖ్యాకములు ఋగ్వేదములోనివే. అందుచే బ్రహ్మవేదము, అథర్వాంగిరోవేదము, భృగ్వాంగిరోవేదము నని దీని కితరనామములు వాఙ్మయమం దున్నను, అథర్వనిసూక్తము లత్యధికముగా నుండుటచే నథర్వవేద మని యిది లోకమున ఖ్యాతి చెందినది. పూర్వోక్తులైననలుగురిలో నథర్వుఁడు తక్కఁ దక్కినవా రేదో యొకవిధముగా ఋగ్వేదమునఁ గనవత్తురు. అందుచే నథర్వుఁడు వారికి సమకాలికుఁ డనియు, ఈవేదము ఋగ్వేదమునకు సమకాలిక మనియు భావింపరాదు. బ్రహ్మాంగిరో భృగువులు వేఱువేఱుగాను బరస్పరము కలసియు రచియించినసూక్తము లిందున్న వనుటకు రెండువిధము లయినప్రమాణములు కనఁబడుచున్నవి. అనుక్రమణీకారునిమాట యొకటి. ఈ వేదములోని కొన్నిమంత్రములలో వీరినామములు గనవచ్చుట మఱి యొకటి. ఇందు రెండవది మొదటిదానికి హేతు వైనను గావచ్చును. అందుచే రెండవదియే ప్రబలప్రమాణ మగును, కాని, యీ మువ్వురును ఋగ్వేదము నాఁటివారో, లేక యాపేళ్లు గలయితరమహర్షులో తెలిసికొన నాధారములు లేవు. అది గాక, యాగప్రవర్తకులలోఁ బ్రధానద్రష్టగా బ్రహ్మ యను పేరు గల ఋత్విజుఁ డుండుటను గనిపెట్టి యీవేదమునకు యజ్ఞసంబంధము గలిగింపఁ దలపెట్టి యిందలిపెక్కుసూక్తములు బ్రహ్మదర్శించినట్లుగా నథర్వవేదాభిమానులు కల్పించి యుండఁగా నాసంప్రదాయమునుబట్టి యనుక్రమణి బ్రహ్మను జేర్చిన దేమో! పోనీ! అట్లుగాక, నాఁటివారే యని యూహించినను, ఇందలిసూక్తములను నిర్మించినఋషులు వారి నిందు పేర్కొనినంతమాత్రమున వారు సూక్తద్రష్ట లని చెప్పుటకుఁ దగిన యాధారము లభింపదు. అందుచేతను, ఈవేదము మిక్కిలి యవ్యవస్థరూపముగాఁ గనవచ్చుటచేతను, జక్కఁగాఁ బరిశీలింపఁగా నథర్వుఁడును ఋగ్వేదసంబంధములేని యంగిరసుఁడును, వారి సంతతివారు నీవేదము ౧౮ కాండములు రచియించి యుందురనియు, అందు గొన్ని సూక్తములును గడపటిరెండుకాండములును దరువాత నెవరో నిర్మించియుందు రనియు, అట్టియిందలి కొన్నిపేళ్లనుబట్టియుఁ దననాఁటికి వాడుకలో నున్నసంప్రదాయమునుబట్టియు దీనిని ఋగ్వేదాదులతోఁ బోల్చుటకై యనుక్రమణిక, సూక్తములకు వేఱువేఱు ఋషులను నిర్ణయించియుండు ననియుఁ దోఁచుచున్నది. ఎట్లయిన నిది యన్నిసంహితలకంటె నర్వాచీన మనుట నిస్సంశయము.

అట్టి యీవేదమందలి ఋక్కుల మొత్తములో సుమారు పన్నెండువందలు ఋగ్వేదములోనివి. అందు సుమా రెనిమిదివంద లేమార్పును లేకయే యిరువదవకాండమున నున్నవి. తక్కిన నాలుగువందలు కొన్నికొన్ని మార్పులతో మిగిలినకాండములం దున్నవి. పదునాఱవకాండము చాలవఱకు గద్యమయము.

దీనివలె ౧౭-వ, కాండము పరిమాణమందు మిక్కిలి చిన్నది. ఇరువదవకాండ మును దీనికిఁ జేర్చినట్లే యథర్వవేదీయులు దీనియాఱవకాండమందు సోమయాగ ప్రశంసగల ౪౭, ౪౮, సూక్తములను, ప్రాయశ్చిత్తేష్టులను బ్రతిపాదించు ౧౧౪ సూక్తమును జేర్చియున్నారు.

మఱియు ఋగ్వేదమందువలెనే యిందును, ఇంద్రాగ్ని చంద్రవరుణాదిత్య రుద్రాదులు దేవతలుగా నాయాసూక్తములందు వర్ణింపఁబడియున్నారు. ఋగ్వే దమం దున్నఛందస్సులుకాక నూతనచ్ఛందస్సులు కూడ నిందు మఱికొన్ని కన వచ్చును. అవి, విరాట్గాయత్రి - ప్రస్తారపంక్తి - బార్హతగర్భత్రిష్టుపు - విరా డతిజగతి - అస్తారపంక్తి - విపరీతపాదలక్ష్మపంక్తి - పురస్తాద్బృహతి - బార్హ తవై రాజగర్భజగతి - మొదలయినవి. దీనినిబట్టి ఛందశ్శాస్త్రము దీనినాఁటికి మిక్కిలి విపుల మైన దని చెప్పవచ్చును. ఇందలి ఛందోబద్ధమంత్రములకు ఋగ్వేదఋక్కులకు వలెను, గద్యరూపమంత్రములకు యజుర్మంత్రములకు వలెను, ఉదాత్తాదిస్వరనియమము శౌనకసంహితయందు కనవచ్చును. పైప్పలాద సంహితాపుస్తకమునందు స్వరచిహ్నములు సూచింపఁబడలేదుగాని యందలి మంత్రములు మూఁడువంతులు శౌనకసంహితలోఁ గనవచ్చుచున్నవి కావునను, ఇరువదవకాండము మూఁడువంతులు పైగా ఋగ్వేదములోనిదే కావునను, దానికిని స్వరనియమము పూర్తిగా నున్న దనుట స్పష్టము. ఇది యాథర్వణ సంగ్రహచరిత్ర. ఇఁక దీని యాంతరవిషయము.

### అథర్వమంత్రవిశేషములు.

ఈవేదము తరువాత బయలువెడలిన మంత్రశాస్త్రవైద్యశాస్త్రములకు మార్గదర్శకమును జ్యోతిశ్శాస్త్రమున కభివృద్ధి సూచకమును విశేషముగా నైహిక సుఖమార్గముల కుపదేశకమును గొలఁదిగా నాముష్మికసుఖబోధక మును నై వెలయుచున్నది. తక్కిన వేదములకంటె విలక్షణ మైనయిది తన నాఁటి వివిధసాంఘికాచారములను గరతలామలకము గావించుచు మంత్ర ప్రభావమును బ్రత్యక్షముఁ గావించు చున్నట్లుండును. రాజపురోహితుఁ డథర్వవేదజ్ఞుఁడుగా నుండవలె నన్నకొన్నిపురాణవచనములనుబట్టి యొకకాల మున రాజులకుఁ బ్రభుమంత్రోత్సాహశక్తులతో నథర్వమంత్రశక్తికూడ సహాయ పడె నని విశ్వసింపక తప్పదు[1]. రాజులకుఁ గావలసిన శత్రుస్తంభనము శత్రుపీడ నము శత్రుబలదమనము శత్రుసంపన్నాశనము శత్రుమారణము మొద లగు నవి మంత్రమహిమసాధ్యము లైనట్లు తెలుపుచున్నయిందలిమంత్ర విశేషములే యిందుకుఁ బ్రమాణము. ఇది యట్టిది కావుననే నాఁడు మంత్ర ప్రభావమును బ్రత్యక్షముగా నెఱిఁగినరాజు లథర్వమంత్రవేత్త లగువారిని బురోహితులనుగాఁ

1. పురోహితం తథాథర్వమంత్ర బ్రాహ్మణపారగమ్. మత్స్య.

ధవ యాస్థానములం దుంచుకొని వారివలన నభీష్టసిద్ధిని బడయుచుండెడి వారు. నిజముగా మంత్రములం దట్టిశక్తియే లేనిచోఁ బ్రభువు లట్టిమంత్రపాఠకులను గౌరవించియుండరు. నేఁడు గూడఁ బాముమంత్రము తేలుమంత్రము చప్పి మంత్రము మొదలైనవి విషమును విషక్రిమిబాధను హరించుచున్నట్లు మనము కన్నులారఁ గనుచున్నాము, వీనులార వినుచున్నాము. పిశాచములున్నట్లిపు డంద ఱును నమ్ముచున్నారు. భూతవైద్యముచేఁ గొన్నిచోట్ల వానిబాధ తొలఁగుచు న్నట్లును గనుచున్నాము. అట్టిమెడ నాకాలమునందు స్థిరచిత్తులై యుద్దిష్ట విష యమున బుద్ధి నిలిపి మంత్రజపము గావించి మానసికశక్తి మహిమచే నాఁటివా రిష్టార్థమును సాధించెడివా రనుట కాశ్చర్య మేమి? ఇపు డిది మూఢవిశ్వాస మని కొంద ఱనుచున్నారు. కాని యిప్పటిదేశ కాలపాత్రములనుబట్టి నాఁటిమంత్ర విషయము నిట్లు నిరసించుట తగదు. ఇది యిపుడు మూఢవిశ్వాసముగాఁ బరిణ మించినను, దొల్లి యిందలివిషయము ప్రాజ్ఞవిశ్వాసమునకు గుఱియగుటచేతనే యీ యాథర్వణము వేదత్వమును నార్జించి యుపనిషత్పురాణేతిహాసాదులఁ బ్రశంస కెక్కిన దనుట నిజము. కావున నథర్వవేదము కొంతకాలము దేశమున రాజ్యము చేసియుండు నని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఇందలిమంత్రములు బహువిధములై యనేక విషయములకు సంబంధించి యున్నవి. అందు కొన్ని జ్వరాదివివిధరోగములు గ్రహములు పిశాచములు బ్రహ్మరక్షస్సులు మొద లగువానిపీడలను దొలఁగించునవి. కొన్ని వ్రణములు కత్తిపోట్లు మొద లైనవానిబాధను మల్లించునవి. కొన్ని యాయుస్సును యశ స్సును వర్చస్సును ధనకనకవస్తువాహనములను వృద్ధిపొందించునవి. కొన్ని శత్రు వులయాయురాదుల నపహరించునవి. కొన్ని వైరులకు హాని కలిగించునవి. కొన్ని విరోధులు చేయుకీడును బరిహరించునవి. కొన్ని స్త్రీలను బురుషులను వశపఱుచునవి. కొన్ని వ్యవసాయమునకుఁ బనికివచ్చునవి. కొన్ని గృహారామాది నిర్మాణమున కుపకరించునవి. మఱికొన్ని వివాహాదులను, గృహ్యాసంస్కారములను, అంత్యసంస్కారములను, పృథివ్యాదిమహాభూతములను సృష్టివైచిత్ర్యములను ఇంద్రియనిగ్రహమును జీవాత్మపరమాత్మస్వరూపమును వర్ణించునవి. ఇట్లిది యైహికాముష్మికము లైన యనేకవిషయములను బోధించుచున్నను, దయ్యాల పోతు కట్టుఁబోతు చేతబడి మంత్రముల కథర్వవేద మాటపట్టనెడి యపఖ్యాతి మాత్రము క్రమముగా లోకమున వ్యాపించినది. అట్టి మంత్రములు గూడఁ గొన్ని యుండుటచే నది నిర్హేతుక మనఁజాలము. ఇఁకఁ బూర్వోక్తవిషయములకు సంబంధించిన కొన్నిమంత్రము లెట్లున్నవో చవిచూతము.

శీతజ్వరాదులు - వానిప్రతిక్రియలు:—ప్రతిదినముగాని రోజు విడిచి రోజుగాని, మూఁడవరోజుగాని వచ్చునట్టి శీతజ్వరసంతతజ్వర వేలాజ్వరములు

శాంతించుటకు గొడ్డలి యెఱ్ఱగాఁ గాల్చి నీళలోముంచి యావేఁడినీళ్లు మంత్రించి రోగిమీఁదఁ జల్లుచు 'యదగ్నిరాపో అదహత్ప్రవిశ్య' ఇత్యాది సూక్తము[1] జపించవలసిన దని కౌశికసూత్రాదులు చెప్పుచున్నవి. అందలి రెండుమంత్రములు:—

యది శోకో యది వాభిశోకో యదివా రాజ్ఞో వరుణ స్యాసి పుత్రః।
హ్రూడు ర్నామాసి హరితస్య దేవ స నః సం విద్వా న్పరి వృఙ్ధి తక్మన్[2]॥
నమః శీతాయ తక్మనే నమో రూరాయ శోచిషే కృణోమి।
యో అన్యేద్యు రుభయద్యు రభ్యేతి తృతీయకాయ నమో అస్తు తక్మనే॥

హ్రూడునామకుఁడవైన యోపచ్చని జ్వరదేవా! (తక్మన్) నీవు శరీరము కాఁచువాఁడవు, మిక్కిలి వేఁచువాఁడవు. పైగా రాజయిన వరుణదేవుని పుత్త్రుఁడవు. అట్టి నీవు మాయెడ దయదలఁచి యుపకారబుద్ధితో మమ్ము విడిచిపెట్టుము. ఓ శీతజ్వరమా! నీకు నమస్కారము. ఓ తాపజ్వరమా! నమస్కారము. రోజు విడిచి వచ్చునట్టియు, నేఁడును రేపును వచ్చునట్టియు, లేక మూఁడవనాఁడు వచ్చునట్టియు నీకు నమస్కారము.

ఇంకొకసూక్తమందలి జ్వరమంత్రముల యర్థమికొంత:—[3]."ఓజ్వరమా! వగర్పు దగ్గు ఎక్కిళ్లు, అను రోగములతో మైత్రి చేయవద్దు. నీ విక్కడినుండి వెనుకకు రావద్దు. ఇదే నీకుఁ జెప్పుచున్నాను:—ఓజ్వరమా! నీ యన్న యగు వగర్పుతోను నీయప్ప యగుదగ్గుతోను నీయన్నకొడు కగు నెక్కిలితోను మమ్ము విడిచిపెట్టి యితరులవద్దకుఁ బొమ్ము:—

కత్తిదెబ్బతగిలినపుడు కాఱునెత్తు రాఁపుటకు మంత్రతంత్రములు. అయిదుకణుపులకఱ్ఱతో రక్తము స్రవించుచోట నభిమంత్రించి నఱుకుమీఁద వీథిలోని మెత్తనియిసుక దుమ్ము చల్లవలెను. గట్టిపడినవండుమట్టి దానిమీఁద వేసి కట్టవలెను. అని కౌశికసూత్రము చెప్పుచున్నది. ఇందలిమంత్రముల యర్థము.

క్రిందినాడీ! ఆఁగిపొమ్ము. మీఁదినాడీ! ఆఁగిపో. మధ్యనాడీ! నీవుకూడ నాఁగిపో. చిన్ననాడి నిలిచిపోయినచోఁ బెద్దనాడి యాఁగిపోఁగలదు. రక్తము ప్రవహించునట్టి నూఱుధమనులలోను వేయిసిరలలోను మధ్యనాడు లాఁగిపోయినవి. వీనితోఁ దక్కిన వన్నియు నిలిచిపోయినవి.

---

1 అథ. 1-25. 1-4.

2. పై. సం. లో—భిశోకోరుద్రస్యప్రాణోయది వారుణోఽసి—అనియున్నది. హ్రూడు పాఠాంతరములు. హూడు, హ్రుడు, హ్రూదు, హ్రూధు, హ్రూఢు-రూఢు-ఇత్యా.—

3. అథ. 5. 22, 11, 12.

ఆయుష్యసూక్తము లీవేదమున రెండువందలవఱకు నున్నవి. అందాయుర్వృద్ధికరము లగుసాధనములలో సువర్ణధారణ ముత్తమ మని చెప్పఁబడినది. 'బంగారురక్షరేకులు బంగారుతాయెతులు బంగారునగలు పిల్లలకు మేలు కలుగఁజేయును. నూఱుసంవత్సరముల యాయుర్దాయ మిచ్చును. దేహమునకు వర్చస్సును బలమును గలుగఁజేయును. బంగారము ధరించినవారికి రక్షఃపిశాచబాధ కలుగదు'[1]. ఇత్యాదిగా ననేకము లున్నవి. మఱియు.

'ఓవార్ధకమా! నీకొఱకీబాలుఁడు వర్ధిల్లుఁగాక. ఇతరము లైననూఱు మృత్యువులు నితనిఁ జేరకుండుఁగాక. తల్లి తన కుమారునివలెనే, ఉదారహృదయుఁడైన మిత్రదేవుఁ డీబాలు నాపదలు రాకుండ రక్షించుఁగాక'[2].

అగ్నీ! నీ వీకుమారునికి సంపూర్ణాయు విమ్ము. త్వష్టా! నీ వితనికి సంతాన మిమ్ము. సవితా! నీ వితనికి ధనసంపద నొసఁగుము. ఈబాలుఁడు నూఱేండ్లు జీవించుగాక[3].

ఆభిచారిక పిశాచోచ్చాటనాది మంత్రతంత్రములు.

ఇందు గనవచ్చెడియాభిచారికము లైనమంత్రతంత్ర హోమాదులు కొన్ని యానాఁటిసంఘమందలి దౌర్జన్యమును దెలుపుచు హృదయమున కావేగము గలిగించున ట్లుండును. శత్రువులను, పిశాచములనువలెనే, అన్నకొడుకులను గూడ వెళ్లఁగొట్టు మనియు, పాడుచేయు మనియు, నశింపఁజేయు మనియు[4] కోరుచుఁ జేయునట్టి దుష్టహోమతంత్రములు కూడ నొకప్పుడు సంఘమందు వ్యాపించెనుగదా యని యామంత్రములు చదువునపు డొడలు జలదరింపకపోదు. ఇది యుపదేశించిన యీక్రూరతంత్రమే నేటికి నక్కడక్కడ 'చేతబడి' యను పేర వినవచ్చుచున్నది. దీనిస్మరణమే భయంకర మగుచుండ దీనివలని కార్యసిద్ధి యెంతటిభయంకరమో, ఊహింపవలసినదే, ఇట్టివానిలో శత్రువినాశపరము లైనకొన్నిసూక్తములభావము:—

ఓయగ్ని వాయు సూర్యచంద్రజలములారా! మ మ్మెవఁడు ద్వేషించుచున్నాఁడో, ఎవ్వని మేము ద్వేషించుచున్నామో, అట్టివానిని మీతాపశక్తిచే దపింపఁజేయుఁడు మీహరణశక్తిచే క్షీణింపఁజేయుఁడు. మీదీప్తిశక్తిచే మండింపఁజేయుఁడు. మీదుఃఖదాయకశక్తిచే శోకింపఁజేయుఁడు. మీతేజశ్శక్తిచే నిస్తేజస్కునిగాఁ జేయుఁడు"[5].

---

1. అథ. 1-35.
2. అథ. 2. 28-1.
3. 2-29-2.
4. అథ. 2-18.
5. అథ. 2.19—22,

ఇతరులు చేసినప్రయోగము త్రిప్పుటకును, శత్రువు చేసినయపకారమునకుఁ బ్రతిక్రియ యొనరించుటకును బ్రత్యభిచారమంత్రములు పెక్కు గనవచ్చును. అందు కొన్ని—

ఉపప్రాగా త్సహస్రాక్షో యుక్త్వా శపథో రథమ్,
శప్తార మన్విచ్ఛ న్మమ వృక ఇవావి మతోగృహమ్.
పరిణో వృఙ్ధి శపథ హ్రద మగ్ని రివాదహన్,
శప్తార మత్ర నో జహి దివ్యో వృక్షమివా శనిః[1].
యథా సూర్యో నక్షత్రాణా ముద్యం స్తేజాం స్యాదదే.
ఏ వాస్త్రీణాంచ పుంసాంచ ద్విషతాం వర్చ ఆదదే[2].

పైమంత్రములభావను క్రమముగా.—

"వేయికన్నులు కలయీశపథము రథ మెక్కి వేగముగా వెళ్లి, గొఱ్ఱెల వానియిల్లు తోడేలు వెదకి పట్టుకొన్నట్లే నాకు శాపము పెట్టివానిని వెదకిపట్టుకొని వానిని హింసించి శీఘ్రముగా నిక్కడికిఁ దిరిగివచ్చుఁగాక.

ఓశపథమా ! మండుచున్ననిప్పు మడుగును విడుచునట్లు మమ్ము దహింపక విడిచిపెట్టుము. ఆకసమునుండి పడునట్టిపిడుగు చెట్టు కాల్చునట్లే నాకు శాపము పెట్టినవానిని గాల్చివేయుము. వానిని విడిచిపెట్టకు.

ఈశాపము, ఉదయించునట్టి సూర్యుఁడు నక్షత్రముల తేజస్సు లాగివేయునట్లే నాశత్రువు లైన స్త్రీపురుషుల వర్చస్సును లాగివేయుఁగాక.—"

బ్రాహ్మణులను ద్వేషింపరాదు, బ్రాహ్మణస్త్రీ నవమానింపరాదు. బ్రాహ్మణగోవును దొంగిలింపరాదు. బ్రాహ్మణుఁడు కోరినవస్తువు లివ్వవలెను. బ్రాహ్మణులను గౌరవింపవలె ననుచు బ్రాహ్మణప్రభావము వర్ణించుసూక్తము లనేకము లున్నవి[3].

అందు బ్రాహ్మణస్త్రీవిషయకములైన కొన్నిమాటలు.

అపహృతురాలయిన బ్రాహ్మణభార్య భయంకరరూపయై యపహరించిన వారిని బరలోకమున బహుబాధలు పెట్టు నని దేవతలు చెప్పిరి. తపోనిష్ఠు లైన

1. అథ. 6·37. 1,2.

2. అథ. 7·13·1.

3. అథ - 5-17-19,—3-19,—7-103,—11-1, 19, ఇత్యాదులు.

సప్తమహర్షులు చెప్పిరి. గర్భపాతములు సంభవించుటకును జీవరాశి క్లేశపడుటకును వీరులు పరస్పరము కలహించి మడియుటకును బ్రాహ్మణపత్నియే కారణము. [అనఁగా బ్రాహ్మణస్త్రీ నపహరించినచోట నిట్టివిపత్తులు సంభవించునని భావము.] అంతకు మున్నొకస్త్రీకి బ్రాహ్మణులు కానివారు పదిమంది భర్తలుగా నుండనీ! దాని హస్తమును బ్రాహ్మణుఁడు పరిగ్రహించెనేని నాఁటినుండి దాని కతఁడే పతి యగును. అట్టి స్త్రీకి బ్రాహ్మణుఁడే పతియగునుగాని క్షత్రియుఁడును వైశ్యుఁడును గాఁజాలరని సూర్యదేవుఁడు పంచజాతిమనుష్యుల కుద్ఘోషించుచుఁ బోవుచున్నాఁడు. ఎవనిరాష్ట్రమందు బ్రాహ్మణపత్ని నిరోధింపఁబడునో, ఆరాజునకు భార్యాసౌఖ్యము నశించును. ఎవనిరాజ్యమందు విప్రుఁ డపహృతభార్యుఁడై యొక్కరాత్రియేని గడపునో వానిదేశమునం దావులు పాలియ్యవు. ఎడ్లు నేలదున్నవు.'' ఇత్యాదిగా నున్నవి. వీనినిబట్టి చూడ నాకాలమందు కన్యలు తక్కువగాను బురుషులు మిక్కిలి యెక్కువగాను నుండుటచే నొక్కస్త్రీని బెక్కం డ్రాసించుచుండి రనియుఁ వివాహితులు గాని పురుషులసంఖ్య యధిక మగుటచేఁ బరదారాపహరణము సర్వజాతిసాధారణ మైనదురాచారమై యుండెడి దనియు, అందుచే నుత్తమజాతివా రగు బ్రాహ్మణులు బ్రాహ్మణదారాపహరణము నరకహేతువు దేశనాశకము రాజ్యహానికర మని పైవిధముగా సంఘమున కుపదేశించుచువచ్చి రనియుఁ దెలియవచ్చును.

మఱియు - భృగుమహర్షిని హింసపెట్టి పరాభవించిన సృంజయులును వైతహవ్యులును వృద్ధికి రాలేదు. ఉత్తమలోకమును జెందలేదు. బ్రాహ్మణునిపై నుమ్మిమొద లగునశుచిపదార్థములు పడునట్లు చేయువారు నెత్తుటికాలువలోఁ గేశభక్షణము చేయుచుఁ బడియుందురు. బ్రాహ్మణధేను వేదేశమునఁ జంపివండఁ బడునో యాదేశము తేజోహీనమై యణఁగిపోవును. అందు వీరుఁడు పుట్టఁడు - రాజు బ్రాహ్మణుని హింసించెనేని పగిలిపోయిన పడవను నీళ్లు ముంచివేయునట్లుగా నతని రాష్ట్రమును దౌర్భాగ్య మణఁచివేయును, విప్రహింసకుని మానీడను జేరవద్దని వృక్షములు గూడఁ దఱిమివేయును. బ్రాహ్మణధనము దేవకృత మైనవిష మని వరుణుఁడు చెప్పియున్నాఁడు[1]. ఇత్యాది భావములతోడి యిందలి యనేక మంత్రములు చూడఁగా, ఆకాలమందు గూడ బ్రహ్మద్వేషము సంఘమునఁ గల దనియు, అయినను స్వప్రభావముచే బ్రాహ్మణజాతి తమ్ము హింసించువారి నణఁగించుచు వచ్చె ననియు విదిత మగును.

ఇందలికొన్నిసూక్తములు పిశాచోచ్చాటన పరములు. ఈమంత్రములును, ఇవి బోధించు తంత్రములును గలసి తరువాత భూతవైద్యమున కాధారము లైనవి. పిశాచములు బహువిధములుగా నున్నవి. అందు నిస్సాల ధిష్ణ్య మొద

1. అథ. 5-19.

లగు పిశాచులు చండుని కూఁతుళ్లు. కొందఱు ముగుంది యను పిశాచి పుత్రి కలు. దయ్యమునకు సదాన్వసంజ్ఞ సామాన్యముగా వాడఁబడినది. కొన్ని మంత్రములయర్థము:—

"ఓ దయ్యములారా! మిమ్ము గోశాలనుండి ధాన్యపుకొట్లనుండి యింటి నుండి వెడలఁగొట్టుచున్నాను - భూతపతి యిచ్చటినుండి పిశాచములను వెడలఁ గొట్టుఁగాక. ఇంటి పునాదుల నాశ్రయించియున్న పిశాచుల నింద్రుఁడు వజ్రాయుధముతోఁ గొట్టి తఱిమివేయుఁగాక - ఓ సదాన్వలారా! మీ రీదేశమువారే కానీ, యితరులు పంపినవారు కానీ, దస్యులవల్లఁ బుట్టినవారు కానీ, యిచ్చట నుండి లేచి పొండు. ఎక్కడ ను గనఁబడవద్దు"[1].

సర్పవృశ్చికాదులవిషము హరించుట కుపయోగించుమంత్రము లిందు సుమా రిరువది యున్నవి. అందు కొన్నిటి భావము[2].

ఓ విషమా! గరుత్మంతుఁడు నిన్నుఁ బూర్వము భక్షించెను. అందుచే నీ శక్తి హరించినది. నీ వాశ్రయించిన మనుష్యుని మత్తునిగాఁ జేయఁజాలవు, వానికి స్మృతి లేకుండఁ జేయలేవు. నీవు వానిలో నన్నమువలె జీర్ణమై పోవుదువు గాక.

విషజంతువు తనహస్తమువంటి సాధనముతో మనుష్యదేహమున నెక్కించినవిషమును మంత్రముచే నిర్వీర్యముఁగాఁ జేయుచున్నాను. విషము దిగిపోఁ గాక.

నలుదిక్కుల నున్నవిషము నిర్వీర్య మగుఁగాక. ఈ మంత్రముతో విషము నశించిపోవుఁగాక.

ఇంద్రాదులును సూర్యద్యులోకభూసరస్వత్యాదులును మనసార నీవిషము హరించు నౌషధము దయచేయుదురు గాక.

ఈ క్రిందిమంత్రముతో మంత్రించినపుట్టమన్ను విష మున్నస్థలమునఁ బట్టించినయెడల విషము విఱిగిపోవును.

"అసురాణాం దుహితాసి సా దేవానా మసి స్వసా
దివస్పృథివ్యాః సంభూతా సా చ కర్థార నంవిషమ్"

సాంఘిక లక్షణములు.

ఇంక నిట్టివే కాక, మాతాపితృభక్తిని సోదరుల మైకమత్యమును దంపతులయనురాగమును, మైత్రిని సత్యమును ధర్మప్రవర్తనమును బోధించునట్టి సూక్తములు ననేకములు కలవు. ఇట్టి వానినెల్లఁ జూచినపు డథర్వవేదము నాఁటి

1. అథ. 2 - 14. 2—5.

2. 4 - 6 - 3, 4; 4. 7 - 1 - 2,

సంఘస్థితి గన్నులకుఁగట్టినట్లు కనఁబడును. పృథివిని దానిగుణములను దానియుపయోగమును వర్ణించునట్టి సూక్తమును, వరుణునిమహత్త్వమును బోధించు సూక్తమును, కోపోపశమన ముపదేశించుసూక్తమును, నాఁటివారి ప్రపంచజ్ఞానము వెల్లడించుచుండును. తృతీయచతుర్థకాండములలోని పెక్కుసూక్తములు గృహనిర్మాణపద్ధతులను, కృషివిధానమును బహువిధధాన్యములు పండించుటను, గోరక్షణదీక్షను, చేసినతప్పులకుఁ బ్రాయశ్చిత్తములను, వివరించుచు నాఁటిజనుల సాంసారిక పావనజీవనము నుగ్గడించుచుండును. మఱియు నుషస్సు సూర్యుఁడు ద్యులోకము మొదలగువాని వర్ణనలు నాఁటి విద్వాంసులసృష్టివిషయక జ్ఞానమును దెలుపుచుండును. కాని, యన్నిటిని మించి 'మాశత్రువులకు హాని కలుగవలెను, మాకు మేలు కలుగవలెను ' అనుమాటలు మాత్రము సర్వవ్యాపకములై కనిపించును. ప్రతిపనియందును బ్రతికోరికయందును నై యభిప్రాయము గోచరించుచునే యుండును. దీనినిబట్టి యథర్వసూక్తములను దొలుత రచియింప నారంభించినవారియుద్దేశము పవిత్ర మైనదే యైనను, పరోపకారపరాయణులును స్వోపకారపారీణులు నగువారు కొంద అపుడపుడు రచించినసూక్తములు గూడ నిందు చేరుటచే నిది తుద కిట్టిఘోరాఘోరరూపము తాల్చియుండు నని యూహింపవలసివచ్చుచున్నది. ఇందు కాత్మలాభ పరహానిపరము లైనయితర సూక్తముల మాట యటుంచి జ్ఞానబోధకముగాఁ గనవచ్చువ్రాత్యకాండమునే యుదాహరణముగాఁ గైకొందము.

## కతిపయకాండవిశేషములు.

ఈవేదమందలి పదియేనవకాండవమునకు వ్రాత్యకాండ మనిపేరు. వ్రాత్యమహత్త్వ మెక్కువగానుండుటచే దీని కీపేరువచ్చిన దనుట నిజము. ఇందలి సూక్తములు కడపటిరెండుకాండములలోని వానివలె నత్యంత మర్వాచీనము లనుటకు వీలులేదు. ఇందలిమంత్రములు గద్యమయము లని కొందఱుభావించిరి గాని యది సరిగాదు. ఇందలి ప్రతిమంత్రము ఛందోబద్ధ మైనదే యని యనుక్రమణిక యిందలిమంత్రములకు నిర్దేశించినసామ్నీపంక్తి - విరాడ్గాయత్రి - బ్రాహ్మీగాయత్రి - దైవీజగతి మొద లగుఛందస్సులవలనను, తదనుగుణమైన స్వరచిహ్నాదికమునను దెలియవచ్చుచున్నది. కాని యిందలివిషయ మథర్వవేద స్వభావమున కెక్కువగా సంబంధించినది గాక యిది యొకప్రత్యేకోద్దేశముతో నిందు ప్రవేశించినట్లు కనఁబడును. ఇందుకుఁ దోడుగా నీకాండమందలి పదునెనిమిది పర్యాయసూక్తములలోను మొదటిసూక్త మొకటిమాత్రమే పైప్పలాదసంహిత పదునెనిమిదవకాండములోఁ గనవచ్చుచున్నది[1]. తక్కినసూక్తము లాసంహిత విడిపోవునాఁటికి లేవో, ఉన్నను వాని నద్దిగ్రహింపలేదో, తెలియ

1. చూ. H. O. S. Vol. 8, P. 772.

రాదు కాని, యెట్లైన నిది సర్వానుక్రమణీకాలమున కథర్వాంతఃపాతియై ప్రాచీనత గాంచిన దనుట సత్యము. అట్టియీ కాండమునకు సాయణాచార్యులు భాష్యము వ్రాసిరో లేదో, వ్రాసినది నష్టమైనదో, చెప్పఁజాలము కాని దీనిభాష్యము మాత్రము కనరాదు ఇది యిట్లుండఁ బరిశోధకులు విమర్శకులుఁ గూడ దీనిని గూర్చి పలు తెఱంగుల నభిప్రాయపడియున్నారు. వారిలో శంకరపాండురంగ పండితులయభిప్రాయమును[1] సంగ్రహించి తెలుఁగునఁ జూపుచున్నాను.

'ఈకాండమున వ్రాత్యమహిమ వర్ణింపఁబడినది. ఉపనయనాది సంస్కారహీనుఁడు వ్రాత్యుఁ డనఁబడును. వాఁడు వేదవిహితక్రియ లాచరింప నధికారి కాఁడు, సవ్యవహారయోగ్యుఁడు కాఁడు, అనెడిలోకాభిప్రాయమును మనసులో నుంచుకొని, వ్రాత్యుఁడు సర్వాధికారి సర్వోత్తముఁడు మహాత్ముఁడు దేవాదిదేవుఁ డనెడియభిప్రాయము లోకమున వ్యాపింపఁజేయుటకై యెవరో యిట్లు వ్రాత్యమహిమ వర్ణించియుందురు. ఈవిశ్వ మంతయు వ్రాత్యునిలోనే యున్న దనెడి యుత్తమప్రశంస యిందు గనవచ్చునుగాని, యిది వ్రాత్యుల నందఱి నుద్దేశించి చెప్పినది కాదు. ఎవఁడో యొకగొప్పవిద్వాంసుఁడును మహానుభావుఁడు పావనుఁడు నగు పూజ్యుఁడై నవ్రాత్యుని వేదోక్తకర్మనిష్ఠు లగుబ్రాహ్మణులు నిరసించుట గని యతనిభక్తు లెవరో యీవ్రాత్యమహిమ వర్ణించియుందురు'.

ఇత్యాదికముగా నున్న వీరియభిప్రాయ మాధునికమే యైనను, ఇది యుక్తియుక్తము గానే కనఁబడుచున్నది. లోకైక పూజ్యుఁ డన్నయర్థమందు వ్రాత్యశబ్ద మెందును గనరాదు. మనుస్మృతి, తాండ్యబ్రాహ్మణము మొదలయినవి, ఉపనయనసంస్కార రహితుఁడు వ్రాత్యుఁ డని చెప్పుచున్నవి. దీనినిబట్టి యార్యులలోనే వేదోక్తకర్మ లాచరింపని యొకతెగ క్రమముగా వెలసె ననియు, ఆతెగవారిని వైదికులు వ్రాత్యు లని నిరసించుచువచ్చి రనియు వారిలో విజ్ఞానులు కొందఱు బయలుదేఱి సర్వోత్కృష్ట మయిన వ్రాత్యవర్ణనము చేసియుండ నదియే కాలక్రమమున నథర్వవేదమునఁ బ్రవేశించె ననియుఁ దెలియవచ్చును. ఈ కాండ మధ్యాత్మదైవత్య మగుటచే నార్యజనాదరణీయమై యీవేదమున కలంకారముగా నున్న దనుట సత్యము. జ్ఞానబోధక మైన యీకాండమును, యజ్ఞపర మైనకడపటి కాండమును దీని గౌరవమునకుఁ బరమహేతువు లనుట నిస్సంశయము. "వ్రాత్యుని కుడికన్ను సూర్యుఁడు, ఎడమకన్ను చంద్రుఁడు, కుడిచెవి యగ్నిహోత్రుఁడు, ఎడమచెవి వాయువు. ముక్కు లహోరాత్రములు, శీర్షకపాలములు దిత్యదితులు. శిరస్సు సంవత్సరము; అట్టివ్రాత్యునికి నమస్కారము" అనెడి యర్థ మిచ్చు కడపటిమంత్రములు వ్రాత్యుఁడు పరమే

---

1. అథర్వసంహిత సభాష్యము, సంపుటము 4. బొంబాయి.

శ్వరస్వరూపుఁ డని తెలుపుచున్నవి. దీనినిబట్టి యీకాండ మధ్యాత్మజ్ఞాన బోధక మనుట స్పష్టము. కావున నీకాండము, వ్రాత్యనింద తోఁగుటకై వ్రాత్యజాతి మహాపురుషు లెవరో వ్రాత్యుఁడు సర్వజగద్రూపుఁ డనెడి భావము వచ్చునట్లు వర్ణించిన దైనను, లేక తక్కిన వేదములవలె నిది యాముష్మికబోధకము గాకున్న దనుతలంపుతో నార్యజాతివారు రచియించిన దైనను, మొత్తముమీఁద నిది యర్వాచీన మనుటకు మాత్రము సంశయము లేదు.

పదుమూఁడవకాండమునకు రోహితకాండ మనిపేరు. ఇందలిమంత్రములలో సుమారు సగము పైప్పలాదసంహిత పదునెనిమిదవ కాండమున నున్నవి. రోహితవర్ణుఁ డైనసూర్యదేవుని వర్ణించు నీ కాండము రోహితరూపుఁ డైన సవిత సకల జగన్నిర్మాణకారణ మనియు, సర్వప్రాణిరక్షకుఁ డనియు, భూమ్యాకాశములనియంత యనియు వర్ణించుచు, సృష్టితత్త్వమును బోధించుచు, నతిమనోహరముగా నున్నది. ఇట్లనేకము లైనవర్ణనలతోఁ గూడిన యీసంహితలోఁ బామరరంజకములును, పరహింసా ప్రతిపాదకములు నగుసూక్తములు కొన్ని యున్నను; నీతిజ్ఞానదాయకములును, చతుర్వర్గసాధకములు నగు సూక్తములు ననేకములు లేకపోలేదు. అందుచేతనే యిది చతుర్వేదములలో గణన కెక్కినది. కావుననే సకల సంహితలకు భాష్యము రచియించిన శ్రీసాయణార్యులవారు తక్కిన వేదములువలెనే యిదియును బ్రమాణ మని నిరూపించుచు దీనికి భాష్యము వ్రాసియున్నారు. ఇట్లు చతుర్వేదసంహితలచరిత్ర మెఱింగిన మనము వేదవిజ్ఞానమువలనిఫలము నీక్రిందిశ్లోకమునఁ దెలిసికొని యీప్రకరణము ముగింతము.

"ఛన్దస్స్కన్ధ శ్శాఖాశాఖో బ్రాహ్మో వృక్ష స్సనాతనో దేవః ।
య స్తం విద్యా త్స ఋషి ర్విప్ర స్స స్వ ర్గచ్ఛే దాప్త్వా కీ ర్తిమ్."

ఇది, ఆంధ్రభాషానుశాసనాంధ్రదశరూపకాంధ్ర భవిష్య పర్వాద్యనేక కృతికర్తయగు మల్లాది సూర్యనారాయణ శాస్త్రి రచియించిన సంస్కృత వాఙ్మయ చరిత్రమందలి వైదికవాఙ్మయమున షష్ఠాధ్యాయము.

---

# సప్తమాధ్యాయము.

## బ్రాహ్మణములు.

మంత్రాత్మకమైనవేదము బ్రహ్మ మనఁబడును. దానికి సంబంధించినది బ్రాహ్మణము. అనఁగా, మంత్రములను యజ్ఞాదిక్రియలకు సమన్వయింపఁజేయు వ్యాఖ్యానరూపమైనవాక్య గ్రంథము బ్రాహ్మణ మని భావము. దీనిని బట్టియే మంత్రబ్రాహ్మణాత్మకము వేద మనెడి లక్షణము సిద్ధమైనది. ఇదియే మంత్రము ముందును బ్రాహ్మణము తరువాతను బుట్టిన దని తెలుపఁగలదు. బ్రాహ్మణములు వివిధములైన క్రతువులు విస్తరించినకాలమందు ప్రబలియజమానకుల మాశ్ర యముగాఁ బ్రతిష్ఠ గాంచినవి, సాధారణముగా బ్రాహ్మణములందు విధి అర్థవాదము ఉపనిషత్తు అనుమూఁడుభాగము లుండును. కర్మప్రతిపాదకములు కర్మ విధాయకములు కర్మస్వరూపబోధకములు నగు వాక్యములు విధులు. కర్మ ప్రరోచనాపరము లయిన వాక్యము లర్థవాదములు. ఇతిహాసరూపములు సంవాదాత్మకములు తత్వవిచారపరములు బ్రహ్మప్రతిపాదకములు నగు భాగము లుపనిషత్తులు.

పైభాగము లన్నియు సమకాలికములుగాఁ గానరావు, ధర్మజిజ్ఞాస వెచ్చు పెరిగిన కాలమున బ్రాహ్మణములు జనించినవి. బ్రహ్మజిజ్ఞాస విస్తరించినకాలమున నుపనిషద్భాగ మావిర్భవించినది. ఇట్లు త్రివిధములైన బ్రాహ్మణములు మంత్రముల యర్థము కర్మపరముగా వివరించుటయే కాక తరువాత వెలువడిన వివిధ ధర్మబ్రహ్మసూత్రములకు మార్గదర్శకములు కూడ నయినవి. బ్రాహ్మణములలో నందం దర్వాచీనము లనఁదగిన భాగములు కొన్ని యున్నను, కర్మప్రతిపాదకమైనయందలి విజ్ఞాన మంతయు సంహితలనాఁటిదై ఋషిపరంపరనుండి క్రమముగా వచ్చినదే కాని యన్యము కాదు. మఱియు నిందలి యుపనిషద్భాగములు కూడ సంహితలలోని బ్రహ్మజ్ఞానబీజమును మొలకెత్తించి పెంచినవి గాని దానిని క్రొత్తగా సృజింప లేదని సంహితలలో నందందు గనవచ్చు బ్రహ్మప్రతిపాదక మంత్రములే చెప్పక చెప్పుచున్నవి. అయినను గర్మకాండము నాముష్మికచింతయు నతిశయించిన కొలఁదిని నూతనవిజ్ఞానముతోడి గ్రంథము కూడఁ గొంత బ్రాహ్మణములలో నవతరింపక పోలేదు. ఈ విషయమును "పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు" అను పాణిని సూత్రము గూడ బలపఱుచుచున్నది. పాణిని నాఁటికి బహుపురాతనము లని కొన్నిటికిని, అర్వాచీనము లని కొన్నిటికిని వ్యవహారము కలదు కావుననే పురాణమహర్షిప్రోక్తబ్రాహ్మణము లని యతఁడు ప్రత్యేకించి

వక్కాణింపవలసివచ్చినది. దీనినిబట్టి ప్రాచీనబ్రాహ్మణములు కొన్ని గల వని విదిత మగును. అయినను బ్రాహ్మణములలో నందందు గనిపించు మనోరంజకము లయిన కొన్నియుపాఖ్యానములును గాథలును, కర్మాచరణమునందు భేదభావము సూచించు చర్చలును, తమతమమతము స్థాపింప ఋషు లొనర్చిన ట్లున్నవాదప్రతివాదములును, అర్వాచీనము లని యంగీకరింపక తప్పదు.

బ్రాహ్మణములు కేవలము కర్మోపయోగిమంత్రభావమును దెలుపునవియే కావు. అవి తత్తత్కాలములందలి మతధర్మములను వర్ణవ్యవస్థలను సాంఘికాచారములను గూడఁ దెలియఁజేయుచున్నవి. వేదములవలె బ్రాహ్మణములు ఛందోబద్ధములుకావు. ఇవి గద్యరూపములు. అయినను మంత్రములువలెనే పఠనపాఠవ్యవహారసిద్ధము లైనవి. అందును దక్కినబ్రాహ్మణములకంటెఁ దైత్తిరీయబ్రాహ్మణమును శతపథబ్రాహ్మణము నెక్కువగా మంత్రసదృశములే యై వన్నెగాంచినవి. ఆయాయాగములం దాయాఋక్కుల యుపయోగము ప్రతిపాదించు ఋగ్వేదబ్రాహ్మణము హోత చేయుకృత్యములను బోధించుచున్నది, అట్లే సామవేదబ్రాహ్మణ ముద్గాతృకృత్యములను, యజుర్వేదబ్రాహ్మణ మధ్వర్యుకార్యములను అథర్వబ్రాహ్మణము బ్రహ్మకార్యములను బోధించుచున్నవి. అందుచే బ్రాహ్మణములకును యాగములకును, అఙ్గాఙ్గిభావము సిద్ధ మగుచున్నది. అట్టి యీ బ్రాహ్మణముల పౌర్వాపర్య మొకింత విచారింతము.

విషయ విషయక్రమ విషయ వివరణాదులనుబట్టియు ముఖోద్దిష్ట మైన యజ్ఞసంబంధమునుబట్టియు సంహితోక్తవిషయముతో నేకీభవించుట యను ప్రధానగుణమునుబట్టియు భాషాశైలినిబట్టియు విభిన్నకాలికము లైనవర్ణనలను బట్టియు విచారింపఁగా బ్రాహ్మణము లన్నియు నొకకాలమున జనించినవి కావనియే కాక తైత్తిరీయబ్రాహ్మణ మన్నిటికంటెఁ బ్రాచీన మని తెలియవచ్చుచున్నది. ఇందుకు, దీని కున్నస్వరనియమమును, ఇందలి ప్రాచీనప్రయోగబాహుళ్యమును, ప్రౌఢ మైన గద్యశైలియుఁ బ్రధానకారణములు. ఇంతకంటెను సత్యుత్తమ మైనకారణము దీనియజ్ఞ జీవత్వము. తైత్తిరీయబ్రాహ్మణము లేనిచో యజ్ఞము లే దనియే చెప్పవచ్చు నన్నంత యాత్యంతికసంబంధము యాగముతో దీని కున్నట్లుగా నితరబ్రాహ్మణములకు లే దనుట యతిశయోక్తి కాదు. అందుచే సంహితాత్రయితరువాతఁ దత్తుల్యమై యావిర్భవించినదియు నియతస్వరభాసుర మైనదియుఁ దైత్తిరీయమే యనుట యసంశయము. తక్కిన బ్రాహ్మణములలో సామవేదబ్రాహ్మణ మైన తాండ్యము స్వరయుక్త మైనట్లు కొందఱు తలంచిరి గాని యాలక్షణము దానిలిఖిత ముద్రితపుస్తకములం దెందును గనరాదు. అయినను భాషారీతినిబట్టి యిది బ్రాహ్మణములలో రెండవ దని చెప్పవచ్చును. ఇఁకఁ దక్కిన మైతరేయాదు లన్నియు వీనియనంతర మాయాకాలములం దుదయించిన వనుట

నిర్వివాదము. తైత్తిరీయేతరములకు విహితమైనస్వరము లేకున్నను, వానినిగూడ వైదికలోకమేదోయొక విలక్షణమును శ్రుతిరమ్యము నైనస్వరముతోనే పఠించుచుండును గాని యది సహజమును స్వరలక్షణబద్ధమును గాదనుట నిజము. ఇట్టి బ్రాహ్మణములలోఁ దైత్తిరీయ మాద్య మగుట ముందు గ్రహింపఁదగిన దైనను, అభ్యస్తమైన సంహితాక్రమమున కనుగుణముగా బ్రాహ్మణక్రమమును మార్చుకొని పరిశీలింతము.

ఋగ్వేదబ్రాహ్మణములు:—వీనిలో మొదట గణింపఁదగిన దైతరేయ బ్రాహ్మణము. ఇది యెనిమిదిపంచికలుగా విభజింపఁబడినది. ఒక్కొక్కపంచిక కైదుచొప్పున నిందు నలువది యధ్యాయములు గలవు. శాకల్యశాఖ కెక్కువగా సంబంధించినదీనికి బహ్వృచబ్రాహ్మణ మనియుఁ బేరు గలదు. దీని కైతరేయ మనుపేరు వచ్చుటకుఁ గారణ మైనసంప్రదాయవిదులయాఖ్యాయికను సాయణాచార్యులు దీనిభాష్యము నవతారికలో నుదాహరించి యున్నారు. దాని భావమిది.

"ఒకానొకమహర్షికిఁ బెక్కండ్రు భార్యలు కలరు. వారిలో, ఇతర యనుపేరు గలధర్మపత్నియందు మహీదాసుఁ డనుపుత్త్రుఁ డుదయించెను. కాని యామహర్షికిఁ దక్కిన భార్యల పుత్త్రులయం దున్నట్లుగా నీకుమారునియందు ప్రేమ లేదు. దీనికిఁ దగినట్లుగా నొకనాఁటియాగసభలో నతఁడు మిగిలిన కొడుకులను దనయొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని మహీదాసుని దనచెంత కైనఁ బిలువక యవమానపఱిచెను. అపు డితరాదేవి ఖిన్నవదనుఁడై యున్నమహీదాసు నెత్తుకొని లాలనచేసి తనకులదేవత యైనభూదేవిని స్మరించెను. అంత భూదేవి దివ్యాంగనారూపముతోఁ బ్రత్యక్షమై మహీదాసుని కొకదివ్యసింహాసన మిచ్చి యందతనిఁ గూర్చుండఁబెట్టి సర్వాతిశాయి యైనపాండిత్యము కలుగునట్లు వర మిచ్చెను. ఆవరమునుబట్టి యామహీదాసుని నోటనుండి 'అగ్ని ర్వై దేవానా మవమః - ఇత్యాదిగా, 'ఏనం స్తృణుతే స్తృణుతే' ఇత్యంత మగుచత్వారింశదధ్యాయాత్మక మైనగ్రంథ మావిర్భవించెను. మఱియు, మహావ్రత మిత్యాదికమును ఆచార్యాఇత్యన్తము నైనయారణ్యక వ్రతరూపగ్రంథము నావిర్భవించెను."

ఇట్లు మహత్త్వప్రశంసాపరముగా నున్నయీయాఖ్యాయికను బట్టి యితరాపుత్త్రుఁ డైనమహీదాసమహర్షి కర్తగా, ఐతరేయబ్రాహ్మణమును, ఐతరేయారణ్యకమును వెలసినట్లు తెలియవచ్చుచున్నది. ఈ బ్రాహ్మణము ననుసరించి యాగాదు లొనరించుబహ్వృచు లైతరేయు లనెడివాడుక తరువాత లోకమున వ్యాపించినది.

ఈబ్రాహ్మణమందలి మొదటిపదునా అధ్యాయములును సోమయాగ విషయకములు. ఇం దేకాహసాధ్య మైనయగ్నిష్టోమమును, హోతృకృత్యములును,

అగ్నిష్టోమవిచారణ, ఉక్థ్యము షోడశి యనుజ్యోతిష్టోమభేదములును దెలుపఁబడి నవి. తరువాతి రెండింటిలో నతిరాత్రములతోఁ గూడినగవామయనము వర్ణింపఁ బడినది. తరువాతియాఱింటిలో ద్వాదశాహక్రతువిశేషములు వర్ణింపఁబడినవి. అటుపిదప నెనిమిదింటిలో, అగ్నిహోత్రము యజమాన బ్రహ్మ కర్తవ్యము లును, గ్రావస్తుత్తు సుబ్రహ్మణ్యుఁడు మైత్రావరుణుఁడు బ్రాహ్మణాచ్ఛంసి అచ్ఛా వాకుఁడు ననుఋత్విక్కులకృత్యములును మొద లయినవి వర్ణింపఁబడెను. కడపటి యెనిమిదింటిలో రాజసూయము మహారాజపట్టాభిషేకము రాజపురోహితప్రశంస మొద లయినవి కలవు.

ఇట్లున్ననలువదియధ్యాయములలోను గడపటియాధ్యాయములు పదియు నర్వాచీనములు గాఁ గనఁబడుచున్నవి. ఇందుకుఁ గొన్ని కారణములు. ఇందలి మొదటిముప్పదియధ్యాయములలోనివిషయము ననువదించిన శాంఖాయనబ్రాహ్మ ణము దీనికడపటిదశాధ్యాయిలోని విషయము నించుకయు సంగ్రహింపలేదు. కాని శాంఖాయనసూత్రమునందు దానిప్రసక్తి కలదు. అందుచే శాంఖాయన బ్రాహ్మణమునాఁటి కైతరేయములోనితుదిదశాధ్యాయి లే దనియు దాని సూత్రమునాఁటి కది యుదయించి యుండు ననియుఁ దెలియవచ్చును. మఱియు ౩౧–౩౨ - అధ్యాయములలోని పశువిభాగము, ప్రాయశ్చిత్తము తద్విషయక ప్రశ్నోత్తరములు, మొద లయినవి పూర్వాధ్యాయములలోనివిషయములకుఁ బరి శిష్టములుగా నున్నవి కాని ప్రత్యేకవిషయములుగా లేవు. తరువాతి యధ్యాయ ములలోని శౌనశ్శేఫాద్యాఖ్యానములును రాజకర్తృకక్రియలప్రత్యేకవర్ణనము లును రాజాభిషేకోత్సవములును రాజపురోహితాధికారములును, విషయమును బట్టియు భాషాగతినిబట్టియుఁ గూడ నర్వాచీనములుగానే కనఁబడుచున్నవి. అందుచే నీబ్రాహ్మణమందలి చతుర్థభాగము తక్కిన మూఁడుభాగములకు సమ కాలికము కా దని తోఁచుచున్నది.

మంత్రబ్రాహ్మణము - ఈపేర ఋగ్వేదమునకు సంబంధించిన బ్రాహ్మణ మొకటి యున్నది. ఇది యెందును వ్యాపించినట్లు కనరాదు కాని పూనాదక్కక్ కాలేజీలోనిలిఖితపుస్తకభాండాగారమున దీనివ్రాతప్రతి యొకటి యున్నది. ఇం దైతరేయబ్రాహ్మణములోనికొన్నియధ్యాయములయందలిగ్రంథ మట్లే యున్నది. అందలికొన్నియధ్యాయములగ్రంథ మిందు కనరాదు. అందుచే నెవరో యైత రేయములోని కొంతగ్రంథమును వేఱుచేసి యీ పేరు పెట్టి యుందు రని యూహింపవచ్చును గాని, యిందు మొదటిమూఁడుపంచికలలో నక్కడక్కడ నాఱుఖండికలం దున్నగ్రంథ మైతరేయములో నెక్కడను గనరాకున్నది. అందుచే నైతరేయమునుండి యేర్చి కూర్చినకొంతగ్రంథమును నూతన మైన యీ గ్రంథ మును గలసి మంత్రబ్రాహ్మణసంజ్ఞతోఁ గొంత దేశమున నొకప్పుడు వ్యవహార

ములో నున్నట్లు విశ్వసింపవలసివచ్చుచున్నది. ఇందును మొదటివాక్య మైతరేయ ములో నున్నట్లే 'అగ్ని ర్వై దేవానా మవమః' ఇత్యాదికముగానే యున్నది. ఇందలి మొత్తము గ్రంథము సుమారు నాలుగువేలు.

కౌషీతకిబ్రాహ్మణము—ఇది శాంఖాయన మనుమాఱుపేర లోకమునఁ బ్రసిద్ధి కెక్కినది. ఇది ముప్పదియధ్యాయముల గ్రంథము. ఇందు మొదటిపదియే నధ్యాయములు పూర్వార్థము. తక్కినవి పదియే నుత్తరార్థము. ఈబ్రాహ్మణము ఋగ్వేదశాంఖాయనబాష్కలశాఖలకు సంబంధించినది. ఐతరేయములోనిముఖ్య విషయములే యిందు సవిస్తరముగా వర్ణింపఁబడినవి. కావున నిది యును సోమ యాగములకుఁ గావలసినహౌత్రాదికృత్యములను దెలుపుచున్న దనుట సత్యము. కాని యిందలివిషయక్రమము విభిన్నముగా నున్నది. ఇందు అగ్న్యాధానము అగ్నిహోత్రము దర్శపూర్ణమాసములు కామ్యేష్టులు చాతుర్మాస్యములు మొద లగువిషయములు క్రమముగాఁ గనవచ్చును. విశదముగా వివరముగా నున్న యిందలివిషయములయేర్పాటే యిది మైతరేయమునకుఁ దరువాతఁ బుట్టిన దనుటకు నిదర్శన మగుచున్నది. ఇందలి గ్రంథసంఖ్య సుమారుమూఁడు వేలుండును.

ఈశాంఖాయన బ్రాహ్మణమున నందందు విషయచర్చ వచ్చినచోట్లఁ గౌషీ తకపైంగ్యమతములు రెండును గూడఁ గ్రోడీకరింపఁబడుటయు[1]. అందు కౌషీ తకమతమే గ్రహింపఁబడుటయుఁ గనవచ్చును. దీనినిబట్టి కౌషీతకమతానుసారి యైనదీనికిఁ గౌషీతకి యనుపేరు వచ్చిన దనియే కాక, పైంగ్య మనుపేర మఱి యొక బ్రాహ్మణము కలదేమో యని సందేహము కలుగుచున్నది. ఇందుకు సాయ ణాదివ్యాఖ్యాత లక్కడక్కడ 'ఇతి కౌషీతకమ్' అనునట్లే 'ఇతి పైంగ్యమ్' అనుట కూడఁ దోడ్పడుచున్నది. కాని, పాణినీయమతమునుబట్టి 'పైంగీకల్పః' అని పింగమునిప్రోక్త మైనకల్పసూత్ర మున్నట్లు తెలియవచ్చుచున్నది కాని పైంగ్యబ్రాహ్మణ మున్నట్లు తెలియరాదు. అందుచే నందందు వచ్చుచర్చలలో నుదాహరింపఁబడినది పింగమునిమతమే కాని, ఆ మతము గ్రంథరూపము దాల్చిన బ్రాహ్మణము కాదేమో యని తోఁచుచున్నది. ఎట్లయినను, బ్రాహ్మణ విషయమునఁ బైంగిమత మొకటి పురాతన మైనది కల దని విశ్వసింపవచ్చును. ఈకౌషీతకిపైంగ్యనామములు రెండును గూడ నైతరేయమున నొకచోటఁ గన వచ్చునుగాని యవి తరువాత నెవరో యందు చేర్చిన వనుట నిర్వివాదము గావున నంతమాత్రమున శాంఖాయన మైతరేయమునకుఁ బూర్వ మని కాని సమకాలిక మని తలంపరాదు.

---

1. బహ్వృచపదే వైన్దవ్రీ ఇతి త్వేవ పైఙ్గ్యస్య స్థితి రా పైన్ద్రాగ్న ఇతి కౌషీతకిః— కౌషీ. బ్రా. 16, అధ్యా. ఇతి పైంగ్యమ్. ఇతిహ స్మాహ కౌషీతకిః. 24 అధ్యా.

ఈ బ్రాహ్మణమునఁ బెక్కుచోట్లఁ గనవచ్చు 'ఇతి హ స్మాహ కౌషీతకిః' అనువాక్యమునుబట్టి కౌషీతకిమహర్షియే పరమతము లుద్ఘాటించుచు సత్యనిర్ణయముగా స్వమత మావిష్కరించినట్లు తెలియవచ్చుచున్నది గావున నతఁడే యీబ్రాహ్మణమును రచియించినఋషి యని తోఁచుచున్నది. ఇది శాంఖాయన శాఖకుఁ గూడ సంబంధించిన దగుటచే శాంఖాయన మను పేరు గూడ దీనికి వచ్చినను, కర్త యతఁడే యని గ్రంథవిషయ నిర్ణయమునుబట్టి గ్రహింపవచ్చును, ఇందలి మొదటివాక్యము - అస్మిన్ వై లోక ఉభయే దేవమనుష్యా ఆసు స్తే దేవాః స్వర్గంలోకం యన్తో ఽగ్ని మూచుః'—ఇత్యాదిగా నున్నది.

ఇట్లున్న నైతరేయకౌషీతకి బ్రాహ్మణములు రెండును యాగవర్ణనలకంటె నెక్కువగా నుపాఖ్యానముల వల్లనే వాఙ్మయప్రియులహృదయ మాకర్షించుచున్న వనుట సత్యము. అం దైతరేయములోని శౌనశ్శేఫాఖ్యాన మింతకు మున్నుకొంత యుదాహరింపఁబడినది. దాని శేష మిది.

"హరిశ్చంద్రుని యాగమందు యూపబద్ధుఁడై తండ్రియైనయజీగర్తునిచే హింసింపఁబడుటకు సిద్ధుఁడు గా నున్నశునశ్శేఫుడు ప్రజాపత్యాదిదేవతలను బ్రార్థించి వారి యనుగ్రహమువలన బంధవిముక్తుఁ డయ్యెను. అపుడు విశ్వామిత్రాదు లతనిమహత్త్వమున కచ్చెరువొంది యాయజ్ఞము సమాప్తి గావింపుమని యతనిని గోరిరి. అతఁ డట్లే యొనరించిన పిదప నీకమీఁద నీ వెవరిపుత్త్రుడవు గా నుందు వని ఋషు లడిగిరి. అపుడు శునశ్శేఫుఁడు చక్కఁగా నాలోచించి వచ్చి విశ్వామిత్రుని తొడమీఁదఁ గూర్చుండెను. దానినిబట్టి యతఁడు విశ్వామిత్రునికొడు కనిపించుకొనుట కిష్టపడె నని తెల్ల మైనది. అంత నజీగర్తుడు విశ్వామిత్రుని జూచి, మునీంద్రా! ఇతఁడు నా పుత్త్రుఁడు వీనిని మరల నా కిమ్మని కోరెను. అపుడు విశ్వామిత్రుఁ 'డయ్యా! ఈ బాలుని ప్రజాపత్యాది దేవతలు రక్షించి నా కిచ్చినారు. కావున నే నితని నివ్వ నని పలికెను. శునశ్శేఫుఁడు దేవతలచే నియ్యఁబడినవాఁడు గావున నాఁటినుండి దేవరాతుఁ డను సంజ్ఞ చెందెను.

అనంతర మజీగర్తుఁడు శునశ్శేఫుని జూచి 'నాయనా! మనయింటికిఁ బోవుదము లేచిరా. నీవు జన్మచే నాంగిరసగోత్త్రుఁడవు. అజీగర్తపుత్త్రుఁడవు. విద్వాంసుఁడవు. మంత్రదర్శనమున ఋషివై పొగడ్త గాంచితివి. కావునఁ బుట్టినగోత్రము విడిచి యితరగోత్రమునకుఁ బోవలదు. నామాట మన్నింపుము రమ్ము! అనెను. అంత దేవరాతుఁడు' అయ్యా! నన్నుఁ జంపుటకు నీవు కత్తి యెత్తుట యందఱు చూచి యున్నారు. శూద్రజాతిలోఁ గూడఁ గనవినరాని క్రూరకృత్యమున కీ వొడి గట్టితివి. నన్ను విక్రయించి మూఁడువందల గోవుల నార్జించితివి. ఇది యొకనీచకృత్యము. కావున నేను నీతో రాను' అని స్పష్ట

ముగాఁ జెప్పెను. అపుడు తండ్రి 'కుమారా! నేను జేసినతప్పులు నామనస్సును దహించుచున్నవి. నేను పుచ్చుకొన్నగోవుల నెల్ల నీకుఁ బ్రత్యేకముగా నిచ్చివేయుచున్నాను. రమ్ము' అని పలికెను. ఆమాటలు విని పుత్రుఁడు 'ఓయీ! ఒకపురుషుఁడు ధర్మశాస్త్రభీతిని, పాపభీతిని విడిచి పాపము చేసెనేని వాఁడు మరల నభ్యాసవశమునఁ బాపము చేయుచునే యుండును. నీవు నీచజాతివానికంటెను గనిష్ఠుఁడవై చేసినఘోరకార్యము నేను నీవద్దకు మరల రాఁదగినదికాదు. ఆపాపము ప్రతిసమాధేయము కాదు కావున నన్ను వదలుకొను'మని తండ్రికోర్కె నిరాకరించెను. అంత విశ్వామిత్రుఁడు దేవరాతా! నీవు చెప్పినది నిజము. ఇతఁడు చేసినపాపము ప్రతిసమాధేయము కాదు. నీవు వెళ్లవద్దు. నాకుఁ బుత్రుఁడవై నాయొద్దనే యుండు' మనెను. అపు డాఋషిబాలుఁడు "మహర్షీ నీవు పూర్వము నీక్షత్రియత్వమును బ్రాహ్మణ్యముఁగా మార్చుకొని యుంటివి. ఇపుడు నాయాంగిరసత్వమును వైశ్వామిత్రముగాఁ మార్ప నీవే యర్హుఁడవు. నీకొడుకు లందఱితోను నన్నుఁ దమజ్యేష్ఠభ్రాతనుగాఁ జూడవలె నని చెప్పుము.' అని పలికెను. అంత విశ్వామిత్రుఁడు మధుచ్ఛందనుఁడు మొదలగుకొడుకుల నందఱిని బిలిచి 'ఓరీ! మీ రెల్లరు నీదేవరాతుని జ్యేష్ఠభ్రాతను గాఁ జూడవలసిన దని యాజ్ఞాపించెను.

విశ్వామిత్రుని కేకశతపుత్రులు గలరు. వారిలో మధుచ్ఛందనుఁడు నడిమివాఁడు. వానికంటెఁ బెద్దవా రేఁబదిమంది. చిన్నవా ళ్లేఁబదిమంది. అందు పెద్దవాం డ్రేఁబదిమందియుఁ దండ్రిశాసన ముచితము గా దని నిరాకరించిరి. అంత నమ్మహర్షి కోపగించి 'తా ననువ్యాజహా రాన్తా న్వః ప్రజా భక్షీష్టేతి' ఓరీ! మీపుత్రాదులు నీచ జాతివిశేషులలోఁ గలసి పోవుదురుగాక యని శపించెను. అట్లు శపింపఁబడినవారు, అంధ్రులు పుండ్రులు శబరులు పుళిందులు మూతిబులు ననుపంచవిధనీచజాతివిశేషు లైరి. బహువిధులైన యావిశ్వామిత్ర సంతతిజాతులే తస్కరు లైనదస్యులలో నత్యధికు లైరి.

అట్లు తమ యన్నలకు సంభవించినశాపము తెలిసికొని మధుచ్ఛందనుఁడు మొదలగుతక్కినవైశ్వామిత్రు లందఱును జనకునియానతి తలఁ దాల్చి శునశ్శేపుఁడు తమజ్యేష్ఠసోదరుఁడుగా నుండుట కంగీకరించిరి. విశ్వామిత్రుఁడును సంతోషించి వారికి హిత ముపదేశించెను."

ఇట్లున్న యీకథయందలి తుదిభాగమునుబట్టి తొలుత నార్యజాతివారయిన విశ్వామిత్రపుత్రసంతతివారు శాపముచే నంధ్రాది పంచవిధనీచజాతులవా రయినట్లును, అందలియంధ్రులసంతతివారే మనదేశమందలి ప్రాచీననివాసులైనయాంధ్రు లయినట్లును గొందఱు చరిత్రకారు లూహించియున్నారు. అంధ్రు లనెడియొకజాతి యున్న దనుటకు మొదటియాధార మయినవైవాక్య

మునుబట్టియు, అంధ్రులకు నివాస మయినయాజనపద మంధ్రసంజ్ఞ చెందినట్లు కనఁబడుటనుబట్టియుఁ బైయూహ యుచిత మనిభావింపవచ్చునుగాని, వైశ్వామిత్ర సంతత్యంధ్రు లప్పటికి దేశమం దున్ననీచ జాతులలోఁ గలసిపోయినట్లు వైశాపమువల్లఁ దెలియవచ్చుటచే వారిజాతి నీచజాతి మిశ్ర మైన దనియు వారియార్యత్వము శాపముచేతనే కాక సాంకర్యముచేఁ గూడ నిర్మూల మైన దనియుఁ జెప్పకతప్పదు.

భరతాభిషేకమాహాత్మ్యవర్ణనలో, "దుష్యంతపుత్రుఁ డైనభరతచక్రవర్తి మష్ణారదేశమం దసంఖ్యాకము లైనగజములను, సాచిగుణదేశమం దగ్నిచయన మనుయాగ మాచరించి వేలకొలఁదిబ్రాహ్మణులకు లెక్కలేనిగోవులను దానముచేసె ననియు, యమునాతీరమందు డెబ్బదియెనిమి దశ్వమేధయాగములును గంగాతీరమందు యేఁబదియైదు హయమేధములును జేసె ననియుఁ గలదు."

"వసిష్ఠగోత్రుఁ డైనసాత్యహవ్యుఁ డనుఋషి జనంపతిపుత్రుఁ డైనయత్యరాతి యనుబ్రాహ్మణున కైంద్రమహాభిషేకవిద్య నుపదేశించెను. దానిమహిమ వలన నతఁడు క్షత్రియుఁడు కాకపోయినను బెక్కండ్రురాజులను జయించి దేశము లార్జించెను. అంత గురు వొకనాఁడు శిష్యునియొద్దకు వచ్చి నావిద్యవలన భూమి యార్జించితివి కావున నా కైశ్వర్యము కలుగఁజేయు మని కోరెను. అంత నత్యరాతి 'గురువర్యా! ఉత్తరకురుభూములను జయించినపిదప నిన్నుఁ బృథివికి రాజును జేసి నేను సేనానాయకుఁడ నయ్యెద' నని బదులు చెప్పెను. అది విని గురువు 'ఓయీ! మేరువున కుత్తరభాగము దేవక్షేత్ర మనఁబడును. దానిని మనుష్యులు జయింపఁజాలరు. నాకు ద్రోహము తలఁచి యేదో యొకనెపము వెట్టి నాకోరిక వ్యర్థము చేసితివిగావున నీకిచ్చినవిద్యాశక్తిని మరల నాకర్షించుచున్నా" నని చెప్పి వెడలిపోయెను. అపుడు శక్తిహీనుఁ డైనయరాతిని శిబిపుత్రుఁ డైనశుష్మిణుఁ డనురాజు సులభముగా నోడించి యతనిరాజ్యము తీసికొనెను[1]." ఇత్యాదికముగా నభిషేకమాహాత్మ్యమును బురోహితప్రభావమును దెలుపుగాథ లెన్నో కలవు.

కౌషీతకిబ్రాహ్మణములోనికవమగాథ పూర్వముదాహరింపఁబడినది. ఇందలి షష్ఠాధ్యాయమునకు సరస్వతీకాండ మను పేరు గలదు. అందు ప్రజాపతి తపశ్శక్తివలన నగ్నివాయుసూర్యచంద్రాదు లుదయించినట్లును,భవశర్వపశుపతి మహాదేవాదిసంజ్ఞలు గలదివ్యమూర్తి కతఁడే మూలకారణ మయినట్లును, జెప్పెడి చిన్నచిన్నకథ లనేకము లున్నవి.

సామవేదబ్రాహ్మణములు :—ఇవి యెనిమిదివిధములు. "అష్టౌహి బ్రాహ్మణాగ్రంథాః ప్రౌఢం బ్రాహ్మణ మాదిమం। షడ్వింశాఖ్యం ద్వితీయం స్యా త్తతః

1. ఐ. బ్రా.—39·9·—2. కౌ. బ్రా. 12· అధ్యా.

సామవిధి ర్భవేత్ । ఆర్షేయం దేవతాధ్యాయో భవే దుపనిష త్తతః। సంహితోప నిష ద్వంశో గ్రంథా అష్టా వి తీరితాః ॥

అనెడివంశబ్రాహ్మణవ్యాఖ్యానములోని శ్లోకములనుబట్టి, ప్రౌఢము - షడ్వింశము - సామవిధి - ఆర్షేయము - దేవతాధ్యాయము - ఉపనిషత్తు - సంహితోపనిషత్తు - వంశము - అనునెనిమిదియు సామబ్రాహ్మణము లని విదిత మగుచున్నది. వీని కొకనియతస్వరము లేద ని తంత్రవార్తికమునఁ గనఁబడు చున్నది[1]. వీనిలోఁ బ్రౌఢబ్రాహ్మణమునకు మహాబ్రాహ్మణము తాండ్యబ్రాహ్మణము పంచవింశబ్రాహ్మణము ననునామాంతరములు కలవు. ఇది యన్నిటిలోను గ్రంథ పరిమాణముచేతనే కాక గుణముచేతను విషయముచేతను గూడ నుత్తమమై మహాబ్రాహ్మణ మనెడి నామాంతరమును సార్థకము గావించుచున్నది. ఇది యిరు వదియైదధ్యాయముల గ్రంథము. ఇందు ౩౪౦ ఖండములు గలవు. ఇందలి గ్రంథ సంఖ్య సుమారు నాలుగువేలు.

దీని కనుబంధముగాఁ దరువాత బయలుదేరిన యిరువదియాఱవ యధ్యా యమే షడ్వింశబ్రాహ్మణ మనఁబడుచున్నది. అందు ౬ ప్రపాఠకములు ౬౮ ఖండములు ౫౨౦ గ్రంథమును గలవు. వాస్తవముగా నిందలిప్రపాఠకము లైదే కాని కొన్నిప్రతులలోఁ గడపటిఖండములు రెండును (౪౭-౪౮) అద్భుత బ్రాహ్మణ మనుపేర వేఱొకప్రపాఠకముగాఁ గనవచ్చుచున్నవి.

మహాబ్రాహ్మణమునందలి ౧—౧౦ అధ్యాయములు దశరాత్రకాండ మనియు, ౧౧—౧౫ అధ్యాయములు ద్వాదశాహ కాండమనియు, ౧౬—౧౯ అధ్యాయము లేకాహకాండ మనియు, ౨౦—౨౨ అధ్యాయము లహీనకాండ మనియు, ౨౩-౨౫ అధ్యాయములు సత్రకాండ మనియుఁ జెప్పఁబడుచున్నవి. కాని కొన్నివ్రాతప్రతులయందు గనవచ్చెడి యీసంజ్ఞలు భాష్యమునఁ గనరావు. ఇందు ప్రథమాధ్యాయమున నౌద్గాత్రస్తుతియు ద్వితీయ తృతీయాధ్యాయముల స్తోమప్రకారములును, చతుర్థాధ్యాయము మొదలుగా గవామయనాదులును వర్ణింపఁబడినవి. ఈబ్రాహ్మణమున నితరయాగముల ప్రశంసకూడ నున్నను గవా మయనమే యిందు ప్రధాన మైనది. కడపటిమూఁడధ్యాయములందు మాత్రము ద్వాదశరాత్ర సత్రము మొదలుగా సహస్రసంవత్సరసత్రము వఱకుఁ గల వివిధ సత్రయాగములు వివరింపఁబడినవి. ఐతరేయాదులందువలెనే యిందును కురు పాంచాలదేశముల ప్రసక్తి యందందు గనవచ్చును. పైగా సరస్వతీదృషద్వతీ నదుల మధ్యదేశమున బహుయాగము లాచరింపఁబడిన ట్లుపాఖ్యానములవల్లఁ దెలియవచ్చును.

1. బ్రాహ్మణానిహి యా న్యష్టౌ సరహస్యా న్యధీయతే
ఛందోగా స్తేషు సర్వేషు న కశ్చి న్నియతస్వరః. తం. వా. 1-3.1.

సామబ్రాహ్మణములలో, తాండ్యము ప్రధాన మైనది. సామవిధి బ్రాహ్మణములో, ఈ బ్రాహ్మణమును బ్రజాపతి బృహస్పతికిని, అతఁడు నారదునికిని, అతఁడు విష్వక్సేనునికిని, అతఁడు పారాశర్యవ్యాసునికిని, అతఁడు జైమినికిని, అతఁడు పౌష్పింద్యునికిని, అతఁడు పారాశర్యాయణునికిని, అతఁడు బాదరాయణునకును, అతఁడు తాండి శాట్యాయనులకును, వారు తరువాతఁ బెక్కండ్రకుఁ జెప్పిన ట్లారసంప్రదాయము కనవచ్చుచున్నది, దీనినిబట్టి తాండిమహర్షి ప్రోక్తమైనయిది తాండ్య మనుపేరు చెందినట్లు తెలియవచ్చును. దీనికిఁ దోడుగా బ్రాహ్మణ ప్రవచనకర్తలలో శటి - భాల్లవి - తాండి - మొద లగువారిని వంశబ్రాహ్మణము చూపుచున్నది. కాని, బ్రాహ్మణ ప్రవక్త లైన పురాణమునులను గా భల్లుశాట్యాయనులను బాణినీయసంప్రదాయము దెలుపుచున్నది. దీనినిబట్టి చూడఁగా సామబ్రాహ్మణమున భాల్లవి శాట్యాయనశాఖ లున్నట్లు విదితమగును. ఒకచోటఁ దాండ్యబ్రాహ్మణమున భాల్లవిశాఖుల మతముగూడఁ గనవచ్చుచున్నది. కాని, పాణినీయసంప్రదాయము పేర్కొనిన యీభల్లుశాట్యాయనులపేర సామబ్రాహ్మణ మెందును గనరాదు. ఇది యంతయుఁ బరిశీలింపఁగా బ్రాహ్మణప్రవక్తలు భల్లుశట్యాయనులే యనియు, దానిని బ్రవర్తింపఁ జేసినభాల్లవి తాండి మొద లగువారిని వంశబ్రాహ్మణము ప్రవక్తలలోఁ జేర్చియుండు ననియు, ప్రవర్తకులలోఁ దాండి ప్రసిద్ధుఁ డగుటచే నతనిపేర నిది ప్రసిద్ధి కెక్కె ననియుఁ బ్రవర్తకాంతరు లయినభాల్లవులమతముగూడ నందందు తాండ్యబ్రాహ్మణము చూపుచు వచ్చె ననియుఁ దోఁచుచున్నది. ఎట్లయినను భల్లుశాట్యాయనులు విశేషముగా సామబ్రాహ్మణమునకు సంబంధించినట్లు కనవచ్చుచుండఁగా నీరు కృష్ణయజుర్వేద బ్రాహ్మణమునకు సంబంధించినవా రని వీబరుపండితుఁ డూహించుట యైన నెట్టిదో విచారణీయము.

ఈపంచవింశబ్రాహ్మణమున కనుబంధముగా నున్నషడ్వింశబ్రాహ్మణము కూడ యజ్ఞార్థముగా నున్నను, ఇం దొకవిశేషము కలదు. సూర్యుఁడు సుబ్రహ్మశబ్దవాచ్యుఁ డని ప్రారంభించినదీనిలో నాదిత్యవిషయకస్తుతి యధికముగాఁ గలదు. కడపటి దగునద్భుతప్రపాఠకమునందు దేవతావిశేషులు నవ్వుచు నేడ్చుచుఁ బాడుచు నాడుచు వివిధావస్థ లనుభవించుచున్నట్లు వర్ణింపఁబడియున్నది. ఇవి యన్నియు సూర్యదేవతాసంబంధము లయినయద్భుతకృత్యము లైనట్లు గా నిందలి "తా న్యేతాని సర్వాణి సూర్యదైవత్యా న్యద్భుతాని ప్రాయశ్చిత్తాని భవంతి" ఇత్యాదివాక్యములవలనఁ దెలియనగును. సర్వపాపశమనుఁడు సర్వగ్రహాధిపతి యగునీశ్వరుఁడు సూర్యుఁడే యని యిది బోధించును.

మూఁడవది యగుసామవిధానబ్రాహ్మణము మూఁడుప్రపాఠకముల చిన్న గ్రంథము. 'ముందు బ్రహ్మ యుండెను. తత్తేజమే బ్రహ్మ యయ్యెను. అతఁ

దూరక మనస్సున ధ్యానించెను. దానివలనఁ బ్రజాపతి యుదయించెను.' అని యారంభించి యిది ప్రాజాపత్యవిధి నత్యంతము వర్ణించెను. ఇది యాగక్రియాదులను బోధించుటకంటె నభిచారకర్మానుష్ఠేయము లైనమంత్రముల నెక్కువగా నుపదేశించుచున్నది. ఇందలివిషయమునుబట్టి చూడఁగా నిది మిక్కిలి యర్వాచీనమని విదిత మగుచున్నది.

నాల్గవది యార్షేయ బ్రాహ్మణము. ఇంతకు మున్నుదాహరించిన భాష్య శ్లోక మీపేరే గణించినను, ఇది దీని మొదటిపేరు గాదు, ఇది సంపూర్ణ మైన గ్రంథము కాదు. దీనినిజచరిత్ర మిది :—

ఆర్షేయబ్రాహ్మణము కౌథుమ మనియు, జైమినీయము లేక, తలవకార మనియు ద్వివిధముగా వ్యవహరింపఁబడెడిది. ఈ రెంటికిని గూడ నార్షేయము లేక, ఆర్షబ్రాహ్మణ మనుపే రున్నట్లు కనఁబడుచున్నది. ఇందు కౌథుమార్ష బ్రాహ్మణము మూఁడుప్రపాఠకముల గ్రంథము, దీనిని బర్నెలుపండితుఁడు 1876 లోఁ బ్రకటించెను. తరువాత నతనికి జైమినీయము లేక తలవకార మనెడియార్షేయబ్రాహ్మణము లభించినది. దీనినిగూడ నతఁడే 1878 లోఁ బ్రకటించెను. ఇది యైదు ప్రపాఠకములగ్రంథము. కేవల మార్షేయబ్రాహ్మణముతో నున్నదీనివ్రాఁతప్రతులు తంజావూరు పుస్తకాలయమందును, పూనా కాలేజిపుస్తకాలయమందును గలవు గాని, యీ రెంటిలోనివానియందలి ప్రపాఠకసంఖ్యయు, విషయముః గూడ భేదించుచున్నవి. విషయవిచారణ చేయఁగాఁ బై మూఁడింటిలోను విశేషముగాఁ గర్మప్రతిపాదకమై యాగములకు సంబంధించినది జైమినీయ మనెడి తలవకార బ్రాహ్మణమే యనియు, అందలి కడపటి కాండము సామవేదర్షులను దెలుపున దగుటచే నార్షేయబ్రాహ్మణ మనుపేర వేఱుగా ఖ్యాతి కెక్కె ననియుఁ దెలియవచ్చినది. బర్నెలుపండితుఁడు రెండవ సారి ప్రకటించిన తలవకారార్ష బ్రాహ్మణము తంజావూరుప్రతి ననుసరించి నదే కాని యన్యము కాదు. కావునఁ గేవలము ఋషులను దెలుపునార్షేయ బ్రాహ్మణము దానిభాగ మనుట స్పష్టము.

తలవకార బ్రాహ్మణమందలి, ఆగ్నేయ - ఐంద్ర - పవమాన - ఆరుణ - శుక్రియ - సంజ్ఞల నొప్పునైదుకాండములందు నెనుబదియొక్క ఖండములు గలవు. అందు మొదటి మూఁడుకాండములందును వివిధము లైనయాగకర్మలు ప్రతిపాదింపఁబడినవి. నాల్గవకాండమున సామగాచార్యానుక్రమణికలు సావిత్రీ మంత్రవిచారమును, ప్రాణముయొక్క పూర్వావస్థయు వర్ణింపఁబడినవి. పంచమ కాండమున సామవేదద్రష్టల వంశానుక్రమణి తెలుపఁబడినది. ఈ విషయము నిందలి "అథఖల్వార్షప్రదేశో భవ త్యృషీణా న్నామధేయ గోత్రోపధారణ'

మ్మను మొదటివాక్యమే తెలుపుచున్నది[1]. పూర్వోక్తములైన యిందలి విషయములనుబట్టి చూడఁగా యాగసంబంధ మధికముగాఁ గలయిదియును, తాండ్య బ్రాహ్మణమువలెనే ప్రాచీన మని గోచరించుచున్నది. ఇందలి కడపటి కాండ మయిన శుక్రియకాండమే యార్షేయబ్రాహ్మణ మనుపేర మూఁడు ప్రపాఠకములతో వేఱుగా విలసిల్లుచున్నది. కావున నార్షేయము తలవకారములోని భాగ మనుట సిద్ధము. ఈతలవకార మనుపేరు వచ్చుటకుఁ గారణము తెలియరాదు కాని దీనియపరనామమునకుఁ గారణ మయినజైమినిబుషి మాత్రము వంశబ్రాహ్మణములో సామగాచార్యులలోఁ గనవచ్చుచున్నాఁడు. జైమిని ప్రవర్తిత మైనదీని నతని ముఖ్యశిష్యుఁ డగు తలవకారుఁడు ప్రవర్తింపఁజేయుటచే దీని కతనిపేరు గూడఁ దరువాత సంభవించెనేమో చెప్పఁజాలము. ఎట్లయినను జైమిని తలవకారనామములు రెండును గూడ భాష్యకర్తలనాఁటికి మఱుఁగుపడి యార్షేయ నామమే ప్రసిద్ధ మయ్యె ననుట నిజము.

అయిదవది దేవతాధ్యాయబ్రాహ్మణము, దీనికగ్నిబ్రాహ్మణ మనునామాంతరము కలదు. ఇది మిక్కిలి చిన్నగ్రంథము. ఇది మొదలుగాఁ గలనాలుగును బ్రాహ్మణము లని వ్యవహరింపఁబడుచున్నను వీనికి యాగసంబంధమేమియు లే దనుట సత్యము. ఈగ్రంథమున సామనిధనములు సామదేవతలు ఛందోవర్ణములు ఛందోదేవతలు మొద లగువిషయములు వర్ణింపఁబడినవి. "స్వస్తి దేవ ఋషిభ్యశ్చ బ్రహ్మ సత్యఞ్చ పాతు మామ్" అనువాక్యముతో నిది సమాప్తి నొందుచున్నది.

ఆఱవది, ఉపనిషద్బ్రాహ్మణము. ఇదియే ఛాందోగ్యోపనిషత్తని చెప్పఁబడుచున్నది. ఇందలియత్యల్పభాగము మాత్రమే యజ్ఞప్రతిపాదకము గాని, తక్కినది కొంత వివాహవిధులను దేవతాస్తుతులను దెలుపుచున్నది. మిగిలిన దంతయు బ్రహ్మప్రతిపాదక మైనయుపనిషత్తే.

ఏడవది సంహితోపనిషద్బ్రాహ్మణము, ఇది యైదనువాకముల చిన్న గ్రంథము. బ్రహ్మవిద్యకు ముఖ్యమైన దుపనిషత్తు. అట్టి బ్రహ్మప్రతిపాదక మయినదీనినే యధ్యాపకులు సంహితాశబ్దముతోఁ జేర్చుటచేఁ బైసంజ్ఞ వచ్చినది. ఇందు వర్జనీయము లవర్జనీయములు సంహితాపఠన ఫలాదులును జెప్పఁబడినవి.

ఎనిమిదవది వంశబ్రాహ్మణము, ఇదియు మిక్కిలి చిన్నది. సామసంహితా సందర్భమున దీని ప్రసక్తి వచ్చియున్నది. ఇందు సామవేద సంప్రదాయ ప్రవర్తకుల వంశపరంపరలు వక్కాణింపఁబడినవి. ఇట్లు గణన కెనిమిది వచ్చినను, తాండ్యబ్రాహ్మణమును, తలవకారబ్రాహ్మణములోని సగభాగమును దప్పఁ

---

1. ఈవిషయమున నాకు లభింపని బ్రాహ్మణగ్రంథముల వృత్తాంతము నితరగ్రంథముల నుండి సంగ్రహించితిని.

దక్కినవి బ్రాహ్మణము లనెడిఖ్యాతికిఁ దగినవికావు. అందును మొదటి దొక్కటియే యత్యుత్తమమై సర్వవిధముల బ్రాహ్మణ మనఁదగి యున్నది.

కృష్ణయజుర్వేద బ్రాహ్మణములు:—కృష్ణయజుర్వేదమునకుఁ గలమూఁడు శాఖలలోఁ గఠశాఖకు సంబంధించిన సావిత్రనాచికేతాదు లనఁబడు నెనిమిది భాగముల గ్రంథము తైత్తిరీయ బ్రాహ్మణారణ్యకములలో నంతర్భూత మైనదని తైత్తిరీయ సంహితా విభాగసందర్భమునఁ గనియున్నాము. ఆయెనిమిది భాగములు కఠసంహితకే సంబంధించిన వనుటకు వానికిఁ గాఠకము లనుపే రుండుటయే కాక మఱియొక కారణము గూడఁ గన్పట్టుచున్నది.

"గౌతమగోత్రుఁడు వాజశ్రవఃపుత్రుఁడు నైనవాజశ్రవసుఁ డనునుద్దాలక మహర్షి యొకప్పుడు విశ్వజిద్యాగ మాచరించి తనసర్వస్వమును ఋత్విక్కులకు దక్షిణగా నొసంగెను. అతని కుపనయన యోగ్యవయస్కుఁడైన నచికేతుఁ డనుకుమారుఁ డుండెను. అపు డాబాలుఁడు, సర్వస్వదక్షిణాక మైనయాయాగ మందు తనసొత్తైననన్నుఁ గూడ నాతండ్రి ఋత్విక్కులకు దక్షిణగా నిచ్చుట యుచిత మగు నని యాలోచించి తండ్రిని సమీపించి, నాయనా! నన్నే ఋత్విక్కున కిచ్చెద వని యని యడిగెను. పిల్లవాఁడు తెలియక యిట్లడిగె నని యూహించి యుద్దాలకుఁ డూరకుండెను. నచికేతుఁడు మరల నట్లే రెండుసారు లడిగెను. అంత నుద్దాలకుఁడు కోపగించి, నిన్ను మృత్యువున కిచ్చితి నని పలికెను. అపుడు నచికేతుఁడు తండ్రి యభిప్రాయము సరిగా గ్రహింప లేక పోయియుఁ ద న్నెవరికో దానముచేసినట్లు భావించి యితరస్థలమునకుఁ బోవ నుద్యుక్తుఁడై లేచెను. అపు డశరీరవాణి యాపిల్లవానికిఁ బ్రత్యక్షమై నీతండ్రియభిప్రాయ మిది యని తెలిపి, 'నీవు యముఁ డింట లేనిసమయము తెలిసికొని యతనిగృహమున కరిగి మూఁడుదినములు నిరాహారుఁడవై యుండుము. అంత యముఁడు వచ్చి యీమూఁడుదినము లేమి భక్షించి యిచ్చట నుంటి వని యడిగినపుడు, మొదటినాఁడు నీపిల్లలను, రెండవనాఁడు నీపశువులను, మూఁడవనాఁడు నీసుకృతమును భక్షించి యుంటి నని చెప్పుము.' అని యుపదేశించెను.

నచికేతుఁ డట్లే యమమందిరమున కేగి యట్లే యుండెను. తరువాత వచ్చినయముని ప్రశ్నలకు నట్లే బదులుచెప్పెను, అంత యముఁడు "అతిథి భోజన హీనుఁడై పడి యుండెనేని గృహయజమానుని ప్రజాదికము క్రమముగా క్షీణించు ననెడిశాస్త్రమునుబట్టి యీబాలుఁ డిట్లు పలికె"నని నిజము గ్రహించి, తనదోషము పోఁగొట్టుకొనఁ దలఁచి, మూఁడువరములు కోరుకొను మని యాబాలునితో ననెను. అపు డాబాలుఁడు మూఁడువరము లడిగి గ్రహించి జీవముతోఁ

దిరిగి వచ్చెను" ఇత్యాదిగాఁ దైత్తిరీయ బ్రాహ్మణమున నొక యుపాఖ్యాన మున్నది[1]. ఈ యుపాఖ్యానము మొదట—

ఉశన్హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ

తస్యహ నచికేతా నామ పుత్ర ఆస

తగ్ం హ కుమారగ్ం సన్తమ్

దక్షిణాసు నీయమానాసు శ్రద్ధా ఽఽవివేశ

అనురెండుమంత్రము లున్నవి. సరిగా నీరెండుమంత్రములు కఠోపనిషత్తు మొదటఁ గనఁబడుచున్నవి. పూర్వోక్త మయినయుపాఖ్యానము కాఠకములోని దగుటయు నందలియీమంత్రములు కఠోపనిషత్తులో నుండుటయు, వెనుకఁ జూపినకాఠకము లనెడియెనిమిదిభాగములును కఠశాఖకు సంబంధించిన బ్రాహ్మణ మయ్యుఁ దరువాతఁ దైత్తిరీయ బ్రాహ్మణారణ్యకములలోఁ బ్రవేశించె ననెడి సత్యమును దెలుపుచున్నవి.

మైత్రాయణీయశాఖకును వేఱుగా బ్రాహ్మణము కనఁబడదు. ఖిలనామక మైనయందలి చతుర్థకాండమే దానిబ్రాహ్మణముగా నున్నది. విధిరూపముగా నున్నయాకాండము దానిపరిశిష్ట మని యింతకుమున్నే తెలిసికొని యున్నాము. ఇంకఁ దైత్తిరీయము—

కేవలము యాగార్థమును సస్వరమునై నిజముగా సంహితకు వ్యాఖ్యానముగా నున్నబ్రాహ్మణము తైత్తిరీయమే యనుట సుప్రసిద్ధము. సంహితకు వలె దీనికి, పదక్రమజటాదులు లేవు కాని తక్కినయెల్లవిషయములందు నిది సంహితతోఁ దులఁదూఁగుచున్నది. అత్యంతప్రాచీన మైనయీబ్రాహ్మణమే వివిధ యాగములకు నుపజీవ్యమై యాధ్వర్యవమును బూర్తిగావించిన దనుట విస్పష్టము. మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయ మ్మనులక్షణము తక్కినసంహితాబ్రాహ్మణములకు నామమాత్రముగా సమన్వయించుచున్నను, అది తైత్తిరీయసంహితాబ్రాహ్మణముల నుద్దేశించియే పుట్టిన దనుట నిజము. కావుననే యీరెంటిలోని యెనుబదిరెండుప్రశ్న లేకముగాఁ గృష్ణయజుర్వేద మని పిలువఁ బడుచున్నవి గాని ఋక్సంహిత ఋగ్వేద మనఁబడునట్లుగా, తైత్తిరీయసంహిత ప్రత్యేకము కృష్ణయజుర్వేద మనఁబడుట లేదు.

ఈబ్రాహ్మణము సంహితలోఁ జెప్పఁబడనివిషయములను జెప్పుచు, అది వర్ణించిన వానియర్థము వివరించుచు, క్రియాకలాపమునకుఁ బూర్ణత్వ మాపా

1. తై. బ్రా. 3-11-8,

దించుచున్నది. ఇది విస్తరించి వివరించిన యనేక ముఖ్యవిషయములలో నశ్వమేధ మొకటి. రాజన్యుం డాచరింపందగిన యీయాగమున వివిధాచారములు వర్ణింపంబడినవి. అం దొకవిలక్షణ మైనయాచార మి ట్లున్నది.

"దర్భతాళ్లతో బంధించినమేధ్యాశ్వమును స్నానము చేయింప నేటికిం గొనిపోవలెను. అచ్చోటికి దానితోం గూడ నొకమగకుక్కను దీసికొనిపోవలెను. ఆకుక్క కన్నులపై భాగములందు చుక్క లున్నది కావలెను. అట్టిది చతురక్షమనంబడును. రెండుకన్నులవంటి రెండుచుక్క లుండుటచే నది చతురక్ష మగును. దాని నడ్డి కొకతాడు గట్టి దాని యొకకొన చేతంబుచ్చుకొని యజమానుం డయిన రాజన్యునిమేనత్తకొడుకు ముందు నడవవలెను. రెండవకొన చేతంబట్టి యజమానుని పినతల్లికొడుకు వెనుక నడవవలెను. అతనివెనుక మంచిచేవకఱ్ఱతోం జేసిన రోంకలి బుజమున వైచుకొని యొకజారిణీపుత్త్రుండు పోవలెను.

ఇట్లు ఋత్విగాదులు యజమానునితో నేటికి వత్తురు. గుఱ్ఱమును శునకమును స్నానము చేయింతురు. అనంతర మాకుక్కను దానికాళ్లకు నేల తగులని లోంతు నీళ్లలోనికిం గొనిపోవుదురు. (అపు డది నిలవలేక యీందిపోలేక గిజగిజలాడుచుండు నన్నమాట) అంత నధ్వర్యుండు మంత్త్రము పఠించి దానిని జంపుటకు జారిణీపుత్త్రుని నియమించును. వాండు రోంకలి యెత్తి దానినడినెత్తి పగులంగొట్టి చంపును, ఆచచ్చినకుక్కను గుఱ్ఱముకాళ్ల క్రిందికి లాగి దానికుడివైపున విడిచిపెట్టుదురు." ఇత్యాదికము[1].

ఈయాచారము నభిప్రాయము గూడ నిదియే యిట్లు తెలుపుచున్నది. "పాప మొకశత్త్రువు. అది కుక్కవంటిది. యజమానుండు పాపరహితుండై యాగమాచరింపవలెను. అందుచేం బాపరూప మయిన శునకమును వధించినయెడల యజమానుని పాపరూపశత్త్రువు నశించిన ట్లగును." ఇంక నితర మైన దేమున్నను ఇంతకంటె నీకృత్యమునకు ముఖ్యఫలము కనరాదు. ఈవిధముగాం గుక్కను జంపితే యజమానునిపాపము నశించు ననెడి విశ్వాసమునకు గుఱి యైనశ్వమేధ మశ్వమేధంమున కంగమై యాకాలమున నుచిత మయ్యెంగదా యనుటకంటె దీనిని విమర్శింపంజాలను.

నిత్యబ్రహ్మయజ్ఞమందు చతుస్సంహితల యాద్యమంత్త్రములవలెనే దీని యాద్యమంత్త్రమును బఠింపంబడు నాచారము సనాతన మైనది. దీని సంహితాప్రాయత్వము దెలుపుట కది యొకనిదర్శనము. ఆ మంత్త్రము 'బ్రహ్మసంధత్తం తన్మే జిన్వతమ్ క్షత్త్రగ్ సంధత్తం తన్మే జిన్వతమ్' ఇత్యాదికము. ఇందలి బ్రహ్మశబ్దము పరబ్రహ్మవాచకమై, తత్ప్రతిపాదక మైనవేదమును జెప్పునదై, తదధ్యయనాధ్యాపనాధికారిణి యగు బ్రాహ్మణజాతిని జెప్పునదియై, ప్రతిపాద్య

1. తై. బ్రా. 3-8-4.

బ్రహ్మరూప వేదపురుషుని స్మరింపఁజేయునదియై గ్రంథాదియందు మంగళా చరణ మగుచున్నది. అధ్వర్యుప్రతిప్రస్థాత లిద్దఱును గ్రమముగా శుక్రమంథి పాత్రములు చేతఁ బుచ్చుకొని యుత్తరవేదివెనుక నిలిచి తమచేతులలోని పాత్రము లొకదాని కొకటి తగుల్చుచుఁ బఠించునట్టిపై మంత్రమునకు "ఓ గ్రహములారా! మీరు యజమానునకిని మాకును సంబంధించిన బ్రాహ్మణ జాతి స్వధర్మరహితము కాకుండునట్లు చేయుఁడు. దేశాధిపతికిని బ్రజల మైన మాకును సంబంధించినపాలక మైనక్షత్రజాతి స్వధర్మహీనము కాకుండునట్లు చేయుఁడు' ఇత్యాదిగా యజ్ఞపర మైనయర్థము. ఇట్టిపవిత్రభావముతోఁ గూడిన యిందలి బ్రహ్మశబ్దము తరువాత వెలువడిన 'ప్రజ్ఞానం బ్రహ్మ - సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - విజ్ఞాన మానందం బ్రహ్మ - ఇత్యాది సకలవేదాంతవాక్య ములు ప్రతిపాదించు పరబ్రహ్మమును దెలుపుచుఁ గర్మజ్ఞానములసంబంధ మెఱిఁ గించుచుఁ దైత్తిరీయబ్రాహ్మణము ఘనత కలంకారమై యొప్పుచున్నది.

కృత్తికాదినక్షత్ర విజ్ఞానము, నక్షత్రదేవతలు, పంచసంవత్సరాత్మకయుగ ములు, సంవత్సర పరివత్సరేదావత్స రానువత్సరేద్వత్సరసంజ్ఞలు, నక్షత్రజ్ఞాన మూలకకాలవిజ్ఞానము, మొదలగుఖగోళజ్ఞానవిషయము లెన్నేని యిందు వర్ణింపఁ బడినవి. తరువాత వెలువడిన జ్యోతిశ్శాస్త్రమున కిందలివర్ణనములే యాధారము లయిన వనుట సర్వసమ్మతము. వానిలో నభిజిన్నక్షత్రనిరూపణ మిట్లున్నది.

అభిజిన్నామ నక్షత్రమ్। ఉపరిష్టా దషాఢానామ్।
అవస్తా చ్ఛ్రోణాయై। దేవాసురాః సంయత్తా ఆసన్॥ ఇత్యాది—1.

ఉత్తరాషాఢానక్షత్రము నాల్గవపాదమును, శ్రవణనక్షత్ర ప్రథమపాద మును గలిసిననక్షత్రసంధి యభిజిత్తనఁబడుచున్నది. పూర్వకాలమందు సురా సురులకు యుద్ధము పొసఁగినపుడు దేవత లీసంధికాలములో సంగ్రామమునకు వెడలి పోరాడి యసురులను జయించిరి. అందుచే దీని కభిజిత్తనుపేరు వచ్చినది. లోకములో జయము కాంక్షించురా జీనక్షత్రమునఁ బోరికి వెడలెనేని తప్పక శత్రువుల నోర్చి జయము కాంచును. ఇత్యాదికముగా నీమంత్రము చెప్పు చున్నది. దీనినిబట్టి యీబ్రాహ్మణము కేవలము యజ్ఞపర మైనదే కాక యైహికా ముష్మికరూప మైనసకలప్రపంచవిజ్ఞానమున కాలవాలమై వెలయుచున్న దని గ్రహింపవచ్చును. వివిధవిజ్ఞానఖని యగునీబ్రాహ్మణరాజమును జదివి యిందలి విషయము లెఱిఁగి యానందింపవలసిన దేకాని యొకటిరెం డుదాహరించినంత మాత్రమునఁ దనివి తీఱదు.

శుక్లయజుర్వేద బ్రాహ్మణము:—శతపథ మనుపేర వెలయుచున్న యీ బ్రాహ్మణము గుణమునందును బరిమాణమందును గూడ గొప్పదియై ఖ్యాతి

1. తై. బ్రా. 1-5-2.

కెక్కినది. దీనికి మాధ్యందిన మనియు, కాణ్వ మనియు రెండుపాఠములు కలవు. అందందు కొన్నిమాటలు కొంచెము భేదించినను మొత్తముమీఁద నీరెండుపాఠములందును జాలవఱకు గ్రంథ మొక్కటేకాని ప్రవర్తకభేదమునుబట్టి మాధ్యందినము పదునాల్గుకాండములుగాను, కాణ్వము పదియేడుకాండములుగాను వ్యాపించినవి. మాధ్యందినపాఠమునుబట్టి యున్నవానిలో ప్రథమ పంచమ చతుర్దశ కాండములు మూఁడును, కాణ్వపాఠమున రెండేసికాండములగుటచే నిందలికాండసంఖ్య పదియే డయినది. ఇదియే యీరెంటిలోనికాండ సంఖ్యయందలి భేదమునకుఁ గారణము. ఈభేదము ననుసరించియే కండికల మొత్తమునందుగూడ భేదము కనిపించును గాని దానినిబట్టి గ్రంథమునందు మిక్కిలి యెచ్చుతగ్గు కల దనుటకు వీలులేదు. మాధ్యందినమందలి కండికల కంటెఁ గాణ్వమందలికండిక లించించుక పెద్దవి. అందుచే నందు ౭౬౨౪ కండికలు కనిపించుచుండఁగా నిందు సుమారాఱు వేలకండికలు మాత్రమే యున్నట్లు కనఁబడుచున్నది. కాని యెట్లయినను దానిలోని కొన్నిపాఠము లిందు మాఱి నట్లే యందలిగ్రంథము కూడఁ గొంచె మిందు తగ్గిన దని యంగీకరింపక తప్పదు. ఇట్లు గ్రంథమునందు విశేషతారతమ్యము లేకపోవుటచేతనే సాయణాచార్యులు మాధ్యందినపాఠము ననుసరించి శతపథబ్రాహ్మణమునకు భాష్యము రచియించి నట్లు కనఁబడుచున్నది. ఈభాష్యమందలి కొన్ని ముఖ్యభాగములతోను ద్వివేద గంగపండితుని యారణ్యక వ్యాఖ్యానముతోను వీబరుపండితుఁడు శతపథబ్రాహ్మణమును బ్రకటించెను. ఇది మూలమాత్రము గాను గూడఁ బ్రకటితమై యున్నది. కావున విశేషవ్యాప్తి చెందియున్న మాధ్యందిన పాఠమును బట్టియే శతపథబ్రాహ్మణమందలి విశేషములు తెలిసికొందము.

ఈబ్రాహ్మణమందలి మొదటి తొమ్మిదికాండములును వాజసనేయసంహిత మొదటి పదునెనిమిది యధ్యాయములలోని విషయమున కెక్కువగా సంబంధించి యాగక్రియలను వివరించుచున్నవి. మఱియుఁ దైత్తిరీయసంహితలో నుండి, దాని సోదరి యగువాజసనేయ సంహితలో లేని బ్రాహ్మణగ్రంథము కొంతకొంత యీకాండములందు గనవచ్చుచున్నది. అందును దైత్తిరీయ సంహితా షష్ఠ కాండమందలి గ్రంథము నిందలి తృతీయచతుర్థకాండము లెక్కువగా గ్రహించినవి. ఇక నిందలిదశమాదికాండము లగ్నిరహస్యమును, పూర్వకాండోక్త విషయములను, మిక్కిలి యనువదించినవి గాని యిందు పేర్కొనఁదగిననూతన విషయ మంతగాఁ గనరాదు. కడపటిదిమాత్ర మారణ్యక మను పేర నొప్పుచుఁ గొంత నూతనవిషయము దెలుపుచున్నది. అందును గడపటియధ్యాయములు జ్ఞానబోధకము లగుచు బృహదారణ్యకోపనిషత్తను పేర లోకవిఖ్యాతి గాంచి ముముక్షువులహృదయ మాకర్షించుచున్నవి. మఱియు మొదటి తొమ్మిదికాండ

ములందును యాజ్ఞవల్క్యమతము ప్రమాణముగా గ్రహింపఁబడినది. కురు పాంచాల కోసలవిదేహసృంజయాది ప్రాగ్దేశీయులును మధ్యదేశీయులును దదను యాయులుగా నిర్దేశింపఁబడిరి. దశమకాండమందు శాండిల్యమతము ప్రమాణ ముగాఁ జెప్పఁబడినది. గాంధారసాల్వకేక యాదిపశ్చిమోత్తరదేశీయులు తదను యాయులుగా నిరూపింపఁబడిరి. అందుచే మొదటి నవకాండగ్రంథము ప్రాచీన మనియుఁ దరువాతి పంచకాండగ్రంథ మర్వాచీన మనియు నూహింపఁబడు చున్నది. అయినను పాణినీయమున[1] శతపథశబ్దము కనవచ్చుటంబట్టి యిది దానికిఁ బూర్వమే కాని పరము కా దనుట నిశ్చయము.

ఈ బ్రాహ్మణమందలి కాండములు క్రమముగా నీక్రింది విశేషనామ ములఁ బేర్కొనఁబడుచున్నవి.

హవిర్యజ్ఞము - ఏకపదిక - అధ్వరము - గ్రహము - సవము - ఉఖా సంభరణము - హస్తిఘటశతము - చితి - సంచితి - అగ్నిరహస్యము - అష్టా ధ్యాయి - మధ్యమము - అశ్వమేధము - ఆరణ్యకము.

కాణ్వపాఠమందు కాండములకుఁ గ్రమముగా హవ్యవాహము - ఏక వాయువు - ఉద్ధరము - అధ్వరము - గ్రహము - వాజపేయము-రాజసూయము ఉఖాసంభరణము - హస్తిఘటము - చితి - శతరుద్రీయము - అష్టాధ్యాయి - మధ్యమము - అశ్వమేధము - అగ్నిరహస్యము - ఆరణ్యము - అను నామములు కలవు. వీనినిబట్టి యాయాకర్మవిశేషములు జ్ఞేయము లగును.

ఇందలి "తస్మా దాహుః కురుక్షేత్రం దేవానాం దేవయజన మితి" ఇత్యాది బహువాక్యములనుబట్టి కురుక్షేత్రమునకు దేవయజనసంజ్ఞ యున్నట్లు విదిత మగును. మఱియు, జనమేజయుఁడు కురురాజనియు, విదేహరాజగుజన కునిసభలో మహాయాజ్ఞికుఁ డైనయారుణికి శిష్యుఁ డగుయాజ్ఞవల్క్యుఁడు సభా పతిగా నుండె ననియు, ఆసభకుఁ గురుపాంచాలదేశీయు లగుబ్రాహ్మణులు వచ్చి వాదప్రతివాదములు సలిపి రనియుఁ గడపటివైదుకాండములలో నందందు గన వచ్చువాక్యములనుబట్టి యిది తొలుతఁ గురుపాంచాలదేశముల నావిర్భవించి కోసలవిదేహాదిదేశములఁ గ్రమముగా వ్యాపించి యుండుననియే కాక, ఆరుణి శిష్యయాజ్ఞవల్క్యమతమునకును శాండిల్యమతమునకును వైరుధ్యము కల దనియు మొదటిమతమును బ్రతిఘటించిన రెండవ మతము తరువాత బయలువెడలిన దనియు గోచరించుచున్నది.

ఇందు పెక్కుపౌరాణికగాథలకు బీజభూతము లైనయుపాఖ్యానములు చిన్నచిన్న వనేకములు కలవు. పెక్కండ్రు రాజులును ఋషులును బేర్కొనఁ

---

1. అష్టా-4-2-60 సూత్రముక్రింద-శతషష్టే ష్ఠికన్ పథః—5-3-100. దేవపథాదిభ్యశ్చ- శతపథాది.

బడిరి. కాని యిందలివారే పురాణోపపురాణములలో వర్ణింపఁబడినవా రని నామసామ్యమును బట్టి భ్రాంతి పడరాదు. కురురా జని చెప్పఁబడిన జనమేజయుఁడు పార్థుని ప్రపౌత్త్రుఁ డనికాని పాండవవంశ్యుఁ డనికాని యెందును గనరాదు. ఒకటిరెండుచోట్లఁ బ్రయోగింపఁబడిన యర్జునపద మింద్రపరముగా నున్నది గాని పాండురాజపుత్త్రపరముగా లేదు అందుచే నీజనమేజయుఁ డెవఁడో యెప్పటివాఁడో నిర్ణయించుట సులభ మైనపని గాదు.

ఋగ్వేదమున సంగ్రహముగా వర్ణింపఁబడిన యూర్వశీపురూరవస్సులకథ యిందు సవిస్తరముగా వర్ణింపఁబడినది. శకుంతలాదుష్యంతుల పుత్త్రుఁ డగు భరతునికథ యు నిందు గనవచ్చుచున్నది. ఇంక నిట్టి వెన్నేని కలవు. వానిలో ముఖ్య మైనదియు మనుపురాకను దెల్పునదియు నగుగాథ యార్యుల నివాసమును దెల్పుపట్టునఁ బ్రథమాధ్యాయమున నుదాహరింపఁబడినది. అట్టివే మఱి యొకటి రెండు.

ఒకనాఁడు విదేఘ (విదేహ) రాజయినమాథవుఁడు తనపురోహితుఁ డగు గోతమరాహూగణునితోఁ గూడి సరస్వతీనదీతీరమునఁ గూర్చుండెను. అపుడు వైశ్వానరుఁ డయినయగ్ని భూమి మండించుచుఁ దూర్పుదెస పోవుచుండెను. వారు నాయగ్ని ననుసరించి వెళ్లిరి. వైశ్వానరుఁడు పడమటికొండల నుండి పుట్టి ప్రవహించుచున్న సదానీర యనునదివఱకును దహించుకొనుచుఁ బోయి యా యేటిని మాత్రము దహింపలేదు. అగ్నిదేవుఁడు తాఁకి పవిత్రముచేయ లేదని యచ్చటిజను లానదిని ముట్టుకొనక దానిని దాఁటక బహిష్కరించిరి. ఆకాలమున దానితూర్పుతీర మంతయు సేద్యము లేక యుండెడిది. అగ్నిచే నాప్రదేశ మంతయుఁ బవిత్రీకరింపఁబడిన దని తలఁచి బ్రాహ్మణు లచ్చట నివాసము లేర్పఱుచుకొని కృషి చేయ నారంభించిరి. ఆసమయమున విదేఘరాజు వైశ్వానరుని జూచి నన్నెక్కడ నివసింపు మనెద వని యడిగెను. ఈనది తూర్పుతీరమున నివసింపు మని యగ్ని బదులుచెప్పెను. ఆనదియే కోసలవిదేహదేశములకు నడుమ సరిహద్దుగాఁ బ్రవహించుచున్నది. ఈకథనుబట్టి యార్యులు సదానీరానదీతీరమును దరువాత నాక్రమించి రని తెలియఁగలదు.

ఇందు చతుర్థకాండమున నున్న సుకన్యాచ్యవనులకథయే మహాభారతమున నించుక మార్పుతో సాకన్యాఖ్యాన మైనది.

సంవత్సరస్వరూపమును బహువిధముగా వర్ణించిన యిందలి దశమకాండమున సంవత్సరమే మృత్యు వని యిట్లు నిరూపింపఁబడినది.

“ఏది సంవత్సర మనఁబడుచున్నదో, అదే మృత్యువు. అదియే, అహోరాత్త్రములచే మర్త్యులయాయువును క్షీణింపఁజేయుచున్నది. ఇందుచేతనే మనుష్యులు మృతిచెందుచున్నారు. సంవత్సరమే, అంతకుఁడు. అదియే ముదిమి తెచ్చి

జీవితకాలమును నశింపఁ జేయుచున్నది. దేవతలు ప్రజాపతివద్దకుఁ బోయి, సంవత్సర మహోరాత్రములచే మాయాయుస్సు క్షీణింపఁజేయ కుండఁ జేయవలసిన దని విన్నవించుకొనిరి. యజ్ఞములు క్రతువులు నొనరించిరి." ఇత్యాదిగా నున్నది. మఱియు నిందు దశమకాండముచివర గురుశిష్యపరంపరారూప మయిన వంశక్రమ మిట్లున్నది.

స్వయంభుబ్రహ్మ ప్రజాపతి కావషేయుఁడు తురుఁడు తాంబాయనుఁడు యజ్ఞవచనుఁడు కుశ్రి శాండిల్యుఁడు వాత్స్యుఁడు వామకక్షాయణుఁడు మాహిత్థి కౌత్సుఁడు మాండవ్యుఁడు మాండూకాయని సాంజీవీపుత్రుఁడు.

ఇట్టి వంశక్రమములు దీని యారణ్యకమున నింకను గలవు. ఇట్టి యుత్తమ బ్రాహ్మణము సంపూర్ణ భాష్యముతో ముద్రింపఁబడకపోవుట వాఙ్మయమున కొక లోపము.

అథర్వణబ్రాహ్మణము గోపథము. దీని కథర్వసంహితతో నెట్టిసంబంధము లేకపోయినను, అథర్వాదిమహర్షులయుత్పత్తిని, అథర్వాంగిర స్సంహితోత్పత్తిని, యాగస్వరూపమును దెల్పుచు నిది యథర్వవేదమునకు బ్రాహ్మణ మనిపించుకొను చున్నది. ఇది పూర్వభాగము, ఉత్తరభాగము నని ద్వివిధముగా నున్నది. ఇందు మొదటిదానియం దైదును, రెండవదానియం దాఱును బ్రపాఠకములు కలవు. ఇది ఋగ్యజుస్సామములలోని మంత్రములను గ్రోడీకరించుచు నందందు యజ్ఞమును, అగ్నీంద్రాదిదేవతలను బ్రశంసించినను దీనికి యాగక్రియలతో నిజమైనసంబంధము గనిపించదు. బ్రహ్మచర్యము గాయత్రీ మంత్రోపాసనము మొద లగువేదవిహితధర్మముల నిది వివరించుచున్నది. భాషనుబట్టి చూచినను శైలినిబట్టి పరికించినను విషయమునుబట్టి పరిశీలించినను గోపథబ్రాహ్మణము తక్కిన బ్రాహ్మణములకంటెఁ గాదు, ముఖ్యము లయినయనేకోపనిషత్తులకంటెఁ గూడ నర్వాచీన మని చెప్పవచ్చును.

అథర్వవేదవేత్త యగువాఁడు యజ్ఞములందు బ్రహ్మగా నుండఁదగు నన్నవిషయ మిందలి ప్రథమభాగమునఁ బ్రధానముగా వర్ణింపఁబడినది. ఇతర బ్రాహ్మణములందు వర్ణింపఁబడిన యజ్ఞతంత్రమే కొంత యిందు గూడ నను వదింపఁబడినది గాని యాగములందు దీనినిగూడ ననుసరించెడి యాచారము పూర్వ మున్నదేమో కాని యిపుడు కానరాదు. ఇది బ్రహ్మకృత్యములను బ్రహ్మప్రాధాన్యమును, చాతుర్మాస్యదర్శపూర్ణమాసాదికర్మవిశేషములను వివరించినది గాని యిందు స్వతంత్ర మయిన నూతనవిషయ మంతగా లేదు. కాని యాగములందలి లోపములను వానికిఁ దగిన ప్రాయశ్చిత్తములను దెలుపు చున్న యిది బ్రహ్మ సకలయాగలోపములను బూర్తి గావించు నని బ్రహ్మకృత్య ప్రాధాన్యము నిట్లు వెల్లడించుచున్నది.

"ప్రాయశ్చిత్తై రనుధ్యానై రనుజ్ఞానానుమంత్రణైః హోమైశ్చ యజ్ఞ విభ్రంశం సర్వం బ్రహ్మా ప్రపూరయేత్"

'పురుషో వావ సంవత్సరః' అను ప్రధానవాక్యమాదిగా మూఁడుఖండము లందు[1] పురుషుని సంవత్సరముతోఁ బోల్చుచుఁ గావించినవర్ణనము నాఁటిశారీరక తత్త్వశాస్త్రజ్ఞానము నెంతయు నావిష్కరించుచున్నది. అందలివి కొన్నిమాటలు.

"పురుషుఁడొక్కఁడు. సంవత్సర మొకటి. కావునఁ బురుషునికిని సంవత్సర మునకు నేకత్వము సమము (ఇట్లే సమత్వము ముందు విషయములలో నెఱుంగు నది) సంవత్సరమున కహోరాత్రములు రెండుభాగములు. పురుషునియందు ప్రాణములు రెండువిధములు. అందు ఋతువులు మూఁడు. పురుషశరీరమందు ప్రాణములు మూఁడు. అందు ఋతువు లాఱు, లేక యేడు. ఇందు నట్లే ప్రాణ ములు కలవు. అందు పన్నెండు లేక పదమూఁడు మాసములు కలవు. ఇందు నాసంఖ్యలకుఁ దగినప్రాణములు కలవు. అం దిరువదినాలుగు పక్షములు కలవు. ఇందు రెండుపాదములు రెండుహస్తములు, ఇరువదివ్రేళ్లు కలవు. అందు ౩౬౦ అహోరాత్రములు, ఇం దన్నిప్రాణములు. అందు ౭౨౦ అహస్సులు రాత్రులు నున్నవి, ఇం దన్ని యెముకలు మజ్జలు నున్నవి. అందు ౧౪౪౦ దివసార్ధభాగ ములు రాత్ర్యర్ధభాగములు కలవు. ఇం దన్నిస్థూలమాంసములు కలవు. అందు ౨౮౮౦ అహఃపాదములు రాత్రిపాదములు కలవు. ఇం దన్ని స్నావాబంధ్యలు కలవు. అందు ౧౦౮౦౦ ముహూర్తము లున్నవి, ఇం దన్ని పేశీశమరము లున్నవి. ఈముహూర్తములు ౧౫ పెట్టి గుణించిన నెన్ని యగునో, అన్నిప్రాణములు పురుషదేహమం దున్నవి. ఈప్రాణములకుఁ బదియేనురెట్లపానములు. వానికిఁ బదియేనురెట్లు వ్యానములు, వానికిఁ బదియేనురెట్లు సమానములు, వానికిఁ బదియేనురెట్లుదానములు, వానికిఁ బదియేనురెట్లేతాదులు, వానియన్ని యేత ర్షాలు, వానియన్ని స్వేదాయనములు, వానియన్నిక్షిప్రాయణములు, వానియన్ని రోమకూపములు, వానికిఁ బదియేనురెట్లు వర్షించుధారలు కలవు. ఇది యంతయుఁ గలిసి నూఱుక్రోసుల పరిమాణ మగును."

ఇది యథర్వవేదమునకు సంబంధించిన వైతానశ్రౌతసూత్రమునకుఁ దరు వాతఁ బుట్టిన దని మేగ్లోనలు పండితుఁడు తలంచెను గాని యది సమీచీన ముగాఁ దోఁపదు. ఇందలి పూర్వభాగపంచమ ప్రపాఠకమున నుత్తరోత్తర ముత్తమ మనెడియభిప్రాయమును సూచించెడియజ్ఞక్రమ మిట్లున్నది.—అగ్న్యా ధేయము, దానికంటెఁ బూర్ణాహుతి, దానికన్న నగ్నిహోత్రము, దానికంటె దర్శపూర్ణమాసములు, వానికంటె నాగ్రయణము, అంతకంటె, చాతుర్మాస్యలు, వానికంటెఁ బశుబంధము, దానికన్న నగ్నిష్టోమము, దానికంటె రాజసూయము,

1. గో. బ్రా. పూ. 5-3-5.

దానికన్న వాజపేయము, అంతకంటె నశ్వమేధము, అంతకన్నఁ బురుషమేధము, అంతకంటె సర్వమేధము, దానికన్న దక్షిణావంతములు, వానికన్న దక్షిణలు, అదక్షిణలు సహస్రదక్షిణము. ఇది యజ్ఞక్రమము. వైతానసూత్రమీ యజ్ఞక్రమమునే సరిగా గ్రహించి యే కోరికతో నే యజ్ఞము చేయవలెనో నిర్ణయించుచుఁ గడపట 'యజ్ఞక్రమో బ్రాహ్మణాత్' ఈ యజ్ఞక్రమము బ్రాహ్మణమునుండి గ్రహింపఁబడిన దని తెలిపినది[1]. ఈ బ్రాహ్మణమేది యన్న నవచ్చును గాని పూర్వోక్తయజ్ఞ మిందు గాక యితరబ్రాహ్మణములలో నీరీతిని లేదు, వైగా నథర్వశ్రౌతసూత్ర మథర్వ బ్రాహ్మణమును గాక మఱియొకదాని ననుసరించిన దనుట కుచిత మైనకారణమును గనఁబడదు. మఱియు నిట్లే వైతానసూత్రమున 'బ్రాహ్మణోక్తమ్' అనుమాట రెండు మూడుచోట్లఁ గనవచ్చుచున్నది. అందుచే నీసూత్రము పేర్కొన్న బ్రాహ్మణము గోపథమే యనుట సముచిత మగును గావున గోపథము వైతానముకంటె సర్వాచీనము గా దని విశ్వసింపవచ్చును. ఇందుకుఁ బ్రాచీనవైదికప్రయోగసంపర్కము వైతానసూత్రమునకన్న గోపథబ్రాహ్మణమునకే యెక్కువగాఁ గనఁబడుట గూడ నొకముఖ్యకారణము.

## ఆరణ్యకములు.

కొన్నియారణ్యకగ్రంథములు వేఱుగాఁ గనవచ్చుచున్నను, అవి బ్రాహ్మణములయనుబంధములే కాని యన్యములు కావు. అట్టియనుబంధగ్రంథ మైనను, అథర్వబ్రాహ్మణమునకు లేదు. సామబ్రాహ్మణమునఁ గడపట నున్నశుక్రియకాండమే సామవేదారణ్యకము గా గణింపఁబడుచున్న దని యింతకుఁ బూర్వము చదివియున్నాము. శుక్లయజుశ్శాఖకు శతపథబ్రాహ్మణాంతిమకాండ మారణ్యక మని యింతకు మున్నె తెలిసికొనియున్నాము. కఠమైత్రాయణీయాదిశాఖలకు బ్రాహ్మణమువలెనే వేఱుగా నారణ్యకమును లేదు. కౌషీతకారణ్యము పేరు వినవచ్చుచున్నది గాని గ్రంథము లభింపలేదు. ఇఁకఁ దైత్తిరీయైతరేయారణ్యకములున్నవి. వీనిలోఁ దైత్తిరీయసంహితావిభాగసందర్భమునఁ దైత్తిరీయారణ్యకములోనివిభాగములును వానినామములును దెలిసికొని యుంటిమి. ఇపు డందలి విశేషము లించుక తెలిసికొందము.

తైత్తిరీయబ్రాహ్మణమువలెఁ దైత్తిరీయారణ్యకమును దక్కినబ్రాహ్మణారణ్యకములకంటెఁ బ్రాచీనము. 'అరణ్యే ఽధీయీరన్' అనునిందలివాక్యమును బట్టి యిది యడవిలో నధ్యయనము చేయఁదగిన దని తెలియుచున్నను, ఇందలి సావిత్ర నాచికేత చాతుర్హోత్ర వైశ్వసృజ భాగముల కీనియమము లే దని

1. వై. సూ. 8-45,

పూర్వాచార్యులు వక్కాణించియున్నారు. ఇందు పది ప్రపాఠకములు కలవు. అందు కడపటిది నారాయణోపనిషత్తు. ఈప్రపాఠకము ఖిల మని ప్రాచీనులు వ్యవహరించియున్నారు. అందుచే నిందలి మొదటితొమ్మిది ప్రపాఠకములు ప్రాచీనము లనియు నంతిమ మర్వాచీన మనియుఁ దెలియుచున్నది. యాజ్ఞికపక్షమున నీయారణ్యక మంతయు యజ్ఞోపయోగిగాఁ గనవచ్చుచున్నను, జీవేశ్వరతత్త్వబోధకము లగునుపనిషత్తులే కాక వివిధజ్ఞానదాయకము లగునితరవిషయములు గూడ నిం దనేకములు కలవు. ఛందోబద్ధమై సస్వరమై సరసపదఘటిత మైన యిది చదువుటకు వినుటకుఁ గూడ నింపు పుట్టించుచు నొక మహాపురాణమువలె నుండును.

ఇందలి మొదటి ప్రపాఠక మారుణకేతుక మనఁబడును. సూర్యోపాసకులు దీనినే యరుణ మని వ్యవహరింతురు. సకలరోగనివారక ములయినయిందలి మంత్రములను బఠించుచు నుపాసకులు సూర్యనమస్కారములు గావించునట్టి యాచారము నేటికిని భరతఖండమంతటను గలదు. ఇది నిజ మైనయారణ్యక భాగములలోని దగుటచే సూర్యోపాసకులు దీనిని దేవాలయములందు గాని యూరికడ నుండుతోటలలోఁ గాని గోష్ఠములందు గాని పఠించుచుందురు. గర్భవతు లైనస్త్రీలు వినరాని మంత్రములు గూడఁ గొన్ని యిందు గలవు. దీనిని బఠించి దీని ననుసరించి సూర్యనమస్కారము లాచరించు వారు రోగపరిత్యక్తులై యారోగ్యము గాంచుచున్నా రనుట నేటికి ననుభవసిద్ధము. ఈ యారణ్యకమునఁ బురాత నార్యవిజ్ఞానము కల దనుట కిందలి మేరుగతసూర్యవర్ణనమే ప్రమాణ మని ప్రథమాధ్యాయమునఁ గొంత తెలిసికొనియున్నాము. అందు ప్రశంసింపఁ బడినయుత్తరధ్రువగోచర మగుసూర్యవిషయకవిజ్ఞాన మార్యపరంపరాప్రాప్తమై యీ యారణ్యకమునఁ గూడఁ గనవచ్చును. ఇందు మేరుగతకశ్యపుఁడు సప్తసూర్యులు సూర్యమహత్త్వము సంవత్సరస్వరూపము మొద లగునుత్తమవిషయములనేకములు వర్ణింపఁబడినవి. ఇందు సంవత్సరగర్భము లైనవసంతాదిఋతువుల స్వభావవర్ణన మతిమనోహరముగా నున్నది. ఇదియే తరువాత మహాకవులు గావించిన ఋతువర్ణనలకు మార్గదర్శక మని చెప్పవచ్చును. ఇందలి యామంత్రములభావము నిందు సంగ్రహముగాఁ దెలుపుచున్నాను.

"ముప్పదిముహూర్తము లొక యహోరాత్రము. అట్టి పదునది యొక ఋతువు. ఒకఋతువు మఱియొకఋతువును వెనువెంటనే ప్రేరేపించుచుండును. ఋతువులకుఁ బ్రభువు సంవత్సరము. సంవత్సరరూపుఁ డైన కాలపురుషుని యాజ్ఞను ఋతువులు నిర్వర్తించుచుండును. వానిలో ముఖ్యము వసంతము. ఇందు జల మతినిర్మలముగా నుండును. బ్రాహ్మణు లుపనయన వివాహయజ్ఞాది కర్మము లాచరించుచు బంధుమిత్రులను రావింతురు. వైదేశికు లయినయతిథులకు సత్కా

రము లాచరింతురు. మృష్టాన్నభోజనాదులఁ బ్రజ లానందింతురు. గ్రీష్మ స్వభావము వసంతస్వభావముకంటె నసాధారణముగా నుండును. శుక్లవస్త్రధారియై యేకాదశ రుద్రగణము గ్రీష్మముతో నుండును. ఈ గ్రీష్మర్తువు నిరుపమాన మయిన జ్యోతిస్సుచే భూమిని దపింపఁజేయుచుండును. తాపాధిక్యము దీని యసాధారణ ధర్మము. వర్షర్తువు ప్రాణికోటికి వ్రీహ్యాదిరూప మైన కృష్యాదిఫలము నను కూర్చునది. దీని కాదిత్యులు ప్రభువులు. వారియనుగ్రహమువల్లనే మరల వర్షర్తువు వచ్చువఱకును ప్రాణికోటికి సరిపడునట్టి వివిధసస్యఫలములు లభించుచుండును. ఈఋతువు నైజముగా దుఃఖసహితము గాకున్నను, ప్రాణులకు నేత్రరోగము కలిగించున దగుటచే దుఃఖచక్షువుగాఁ గనిపించును. స్వయముగా నిది పీతవర్ణము గాకున్నను, ప్రజలకుఁ గామిలాదిరోగములు కలిగించున దగుటచేఁ గామిలరోగమునఁ బచ్చపడినట్లు కనఁబడును. వానచేతను గాలిచేతను శీతల మయిన యీ ఋతువునందు కంబలాది ప్రావరణముచేతను, అగ్నిసేవచేతను శీతబాధ నివృత్తమగును. ఈకాలమున రురుమృగము లరణ్యములందు సమృద్ధిగాఁ బెరిఁగినతృణము భక్షించి వృద్ధి నందును. కర్షకులు నాఁగళ్లచేతఁ బూని భూమి దున్ని విత్తనములు చల్లి సస్యములు పోషింతురు. సస్యఫలసందర్శనమునఁ బ్రజలకన్నులు సుఖించును. ఈ ఋతువున సేద్యము చేయనివానికి సంవత్సర మంతయు నన్నము దుర్లభమే యగును. దీనివెంటనే శరదృతువు వచ్చును. ఈకాలమున నక్షిరోగములు శాంతించును. లోక మంతయుఁ నిష్పంకమై ప్రసన్నముగాఁ గనవచ్చును. ఈ ఋతువునకు ఋభువులు ప్రభువులు. వారియనుగ్రహమున దృష్టివిరోధి యగు నీహారాదిక మణఁగిపోవును. ఈకాలమునఁ బ్రజలు పుష్కలముగా భక్షించి సుఖముగా జీవింతురు. అంగలేపాదుల శరీరసంరక్షణము గావించుకొందురు. అంత హేమంతము సంభవించును. ఇందు మరుద్గణములు విజృంభించును. చలి హెచ్చుగును. వాయులోకమునుండి యుద్ధసన్నద్ధమై వచ్చినయోధసంఘమువలె వాయుగణము తీవ్రముగాఁ గనిపించును. వాయువులతోఁ బోరాడ సిద్ధపడుచున్నట్లుగాఁ గంచుక కంబలశిరోవేష్టనాదులు ధరించి ప్రజలు కనిపింతురు. హేమంతపురుషుఁడు క్రుద్ధుఁడు కాకున్నను, అతనికన్న లెజ్జవాటి యుండును. అతని వెనుక శిశిరర్తువు వచ్చును. ఈకాలమున దేవలోకములందు త్రాగుటకు నీళ్లు దొరకవు. మనుష్యలోకమం దైనను మార్గమధ్యమున జలము లభింపదు. బాటసారులు నీ రెక్కడ దొరకునో యని పరితపించుచుఁ బ్రయాణము చేయుచుందురు.''

కేవలము స్వభావసిద్ధ మైన యీ ఋతువర్ణన మానాఁటి సంవత్సరపరివర్తనమును నాఁటిసాంఘిక జీవనమును విశదీకరించుచున్నది. ఈవర్ణనము కావ్యములఁ గనిపించు ఋతువర్ణనమువలెఁ గల్పనాచాతుర్యమును, ఉత్ప్రేక్షాద్యలంకారములను జూపి పాఠకహృదయ మాకర్షించునట్టు లేకున్నను, స్వభావమధురమై

తరువాత వెలువడిన వర్ణనలకు బీజభూతమై యున్న దనుట యతిశయోక్తి కాదు.

ద్వితీయ ప్రపాఠకము స్వాధ్యాయ బ్రాహ్మణము. ఇందు యజ్ఞోపవీత ధారణవిధానము తదావశ్యకత తత్ఫలము, అర్ఘ్యప్రదానము, కూష్మాండహోమ ములు, స్వాధ్యాయవిధానము, దేవయజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ మనుష్యయజ్ఞ బ్రహ్మయజ్ఞము లనుపంచమహాయజ్ఞములు మొదలగువిషయములు వర్ణింపఁబడి నవి. ఇందు బ్రహ్మయజ్ఞ సమాచరణవిధి మిక్కిలి చక్కఁగా నుపదేశింపఁబడినది. అగ్నీంద్రవాక్పూషాది దేవతాస్తుతులతోఁ గూడిన 3-౪-౫. ప్రపాఠకములు సాధారణముగాఁ గర్మపరములు. షష్ఠప్రపాఠకము పితృమేధము. ఇందు మృతు లైన యాహితాగ్నుల కాచరించు నపరక్రియలస్వరూపము వివరింపఁబడినది. ౭-౮-౯, ప్రపాఠకములు, శీక్షావల్లి ఆనందవల్లి భృగువల్లి యని ఖ్యాతికెక్కిన యుపనిషత్తులు. కృష్ణయజుర్వేదమున నివి కడపటి వగుటచే వేదాంతము లనియు, శాఖపేరఁ దైత్తరీయోపనిషత్తు లనియుఁ జెప్పఁబడుచున్నవి. ఈ మూఁడును గేవలము బ్రహ్మప్రతిపాదకములై బ్రహ్మానందరస మొలికించుచు నూరక పారాయణము చేయువారి హృదయములను గూడ రంజింపఁజేయుచుం డును. ఆత్మైకత్వవిజ్ఞానమున కాధారము లైనయివియే యద్వితీయ పురుషుని యావాస మనుటకంటె వీనిం గూర్చి యిప్పట్టున వేఱుగాఁ బ్రశంసింపఁ జాలను.

బృహదారణ్యమందలి సప్తమాష్టమాధ్యాయముల మాడ్కి నిందలి దశమప్రపాఠకము ఖల మనఁబడుచున్నది. కర్మోపాసనబ్రహ్మకాండములలోఁ జెప్పఁగా మిగిలినదానిని బూర్తిగాఁ జెప్పునట్టి ప్రకీర్ణరూప మైన గ్రంథము ఖల మనఁబడును. అట్లే యిది పైమూఁడు విషయములకు సంబంధించిన యవ శిష్ట విషయములను జెప్పునదియై ఖలసంజ్ఞను జెందినది. దీనికిఁ గూడ నుపనిష త్తనుపేరు గలదు గాని యిది వల్లీత్రయమువలె శుద్ధముగా బ్రహ్మప్రతిపాద కము కాదు. అయినను, దీనికిని వైదికవాఙ్మయమున నుత్తమ గౌరవము కలదు. దీనికి యాజ్ఞిక్యుపనిష త్తనెడిసంజ్ఞ వైదికవాఙ్మయ ప్రసిద్ధము. ఇది 'అంభస్య పారే' ఇత్యాదిమంత్రములఁ బ్రహ్మతత్త్వమును, ఆదిత్యో వా ఏషఏతన్మం డలం తపతి' ఇత్యాదిమంత్రముల నుపాసనమును, 'భూ రన్న మగ్నయే పృథివ్యై స్వాహా' ఇత్యాదిమంత్రముల యాగకర్మను జెప్పుచున్నది. ఇందు కర్మవాచిమంత్రము లెక్కువగా నుండుటనుబట్టి దీనికి యాజ్ఞికి యను పేరు మొదట వచ్చినది. 'నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానంపరాయణమ్' ఇత్యాదిమంత్రముల సకల జగదాత్మకుఁ డైన నారాయణుఁడు వర్ణింపఁబడుటను బట్టి దీనికి నారాయణోపనిష త్తనెడి పేరు వ్యాప్త మైనది.

దీని పాఠసంప్రదాయము దేశవిశేషములందు బహువిధముగా నున్నది. ద్రావిడపాఠమునుబట్టి యిందు ౬౪ అనువాకములును, కర్ణాటకపాఠమునుబట్టి కొన్నిచోట్ల ౭౪ అనువాకములును, మఱికొందఱి పాఠమునుబట్టి ౮౦ అనువాకములును గనఁబడుచున్నవి. సాయణాచార్యులు దీనికి భాష్యము వ్రాయుచు ౬౪ అనువాకముల పాఠమునే ప్రధానముగా గ్రహించి పాఠభేదములను గూడ నాయాసందర్భముల సూచించుచునచ్చిరి. ఈదృశమైన పాఠభేదము గూడ దీనియర్వాచీనతను బలపఱుచుచున్నది.

ఐతరేయబ్రాహ్మణమున కనుబంధమైనయేకారణ్యకాండమం దైదు భాగములు కలవు. వానికిని బ్రథమారణ్యకము ద్వితీయారణ్యక మనురీతి నారణ్యకసంజ్ఞయే కలదు. అందు ప్రథమ ద్వితీయారణ్యకముల నైదేసియధ్యాయములును, తృతీయారణ్యకమున రెండధ్యాయములును, చతుర్థమున నొకటియు, పంచమమున మూఁడు నధ్యాయములు కలవు. ప్రతియధ్యాయమందు ననియత సంఖ్య గలఖండము లున్నవి.

మొదటికాండమందు సంవత్సరసత్త్రయాగశేషము పూరించుతలంపుతో మహావ్రతకర్మను వర్ణింపఁబడినది. ఇంద్రుఁడు వృత్రాసురుని సంహరించి (మహాన్) మహచ్ఛబ్దవాచ్యుఁడయ్యెను. అట్టి వానినిమిత్తము చేయఁబడు సోమపానవిశేషాత్మకమైనకర్మ మహావ్రత మయ్యెను. అని యిందలి మొదటివాక్యము తెలుపుచున్నది. ఈశబ్దమునకుఁ దైత్తిరీయులు మూఁడువిధములైన నిర్వచనములు చూపియున్నారు. ఈవ్రతము చేసినవాఁడు గొప్పవాఁ డగునుగావున నిది మహావ్రతము. గొప్పవాఁ డయినదేవునిగూర్చి చేయునది గావున మహావ్రతము. గొప్పది యైనవ్రతము కావున మహావ్రతము.

ద్వితీయ తృతీయ కాండములు జ్ఞానబోధకములు. అందుచే నివి యైతరేయోపనిష త్తనఁబడుచున్నవి. ఇందలివిషయ మద్వైతమైనయాత్మతత్త్వము. సోదాహరణముగా సోపాఖ్యానముగా నిందు బ్రహ్మతత్త్వ ముపదేశింపఁబడినది. అందును, ఉత్తమ మధ్య మాధమ భేదమున విద్యాధికారులైనముువ్వురిలో నుత్తమునికి బ్రహ్మవిద్యయు మధ్యమునికిఁ బ్రాణవిద్యయు రెండవకాండమున విధింపఁబడినవి. అధమునకు సంహితోపాసనమే గతి యని మూఁడవకాండమునఁ దెలుపఁబడినది. పాఠకాభిరుచికై ద్వితీయకాండమందలి రెండువాక్యముల భావ మిందు తెలుపుచున్నాను.

"మనము నిత్య ముపాసనచేయునట్టియాత్మ సోపాధికుఁడా? నిరుపాధికుఁడా? - లౌకికపురుషుఁడు దేనిచేఁ జూచుచున్నాఁడో, అట్టి చాక్షుషచైతన్యమా, లేక శబ్దము వినఁజేయు శ్రోత్రాభివ్యక్తచైతన్యమా, లేక వాగాదీంద్రియాభివ్యక్తచైతన్యమా, లేక హృదయమా, లేక మనస్సా, కాక సంజ్ఞానమా,

అజ్ఞానమా, విజ్ఞానమా, ప్రజ్ఞానమా, కాక మేధా దృష్టి ధృతి మనీషలలో నే దయిన నొకటియా, అట్లు కాక వేగస్మృతి సంకల్పాదులలో నేదేని యొకటియా, ఎవఁడాత్మ ?" అను సంశయమును దొలఁగించునిర్ణయ మిది.

"పూర్వోక్తము లయిన వన్నియుఁ బ్రజ్ఞాన నామధేయములు. నిరుపాధికము సాక్షిచైతన్యము నగు ప్రజ్ఞానమే యాత్మ. అతఁడే పరబ్రహ్మము. అతఁడే ప్రజాపతీంద్రాది సకలదేవతలు. పంచమహాభూతములు. సకలసృష్టి."

పై శంకాసమాధానములనుబట్టి యీ యారణ్యకోపనిషత్తు శుద్ధాద్వైత ప్రతిపాదక మని విదిత మగును.

మిక్కిలి చిన్నది యగునాల్గవకాండమున నరణ్యమునం దధ్యయనము చేయవలసిన మహానామ్నీనామకమంత్రములు చెప్పఁబడినవి. అయిదవకాండమున మహావ్రతప్రయోగము వివరింపఁబడినది. ప్రథమకాండమందు చెప్పఁబడినవిషయమే మరల నిందు గ్రహింపఁబడుటనుబట్టి యీకడపటికాండము ప్రథమకాండ వివరణరూప మైన యర్వాచీనకాండ మని తెలియుచున్నది. దీనిని "పంచమారణ్యక మృషిప్రోక్తం సూత్రమ్, ప్రథమారణ్యకం త్వపౌరుషేయం బ్రాహ్మణమ్" అనెడి సాయణాచార్యవచనము గూడ బలపఱుచుచున్నది. ప్రథమకాండ మపౌరుషేయమా పౌరుషేయమా యనెడి విచారణతో మన కిపుడు పని లేదు, "పంచమకాండము ప్రథమకాండముతో డిది గాదు, ఇది ఋషిప్రోక్తము" అనెడి వారివిశ్వాసముకూడ నిది యైతరేయారణ్యకమునఁ దరువాతఁ జేరిన దనుటకుఁ జాలును.

## ఉపనిషత్తులు.

ఇది యగాధ మపారము నైనగొప్పవిషయము. ప్రతివేదమునకును, దానికి సంబంధించిన బ్రాహ్మణమందో యారణ్యకమందో, కొంచెము గానో గొప్పగానో యుపనిషద్భాగము గూడఁ జేరియున్నట్లు మనము తెలిసికొనియున్నాము. నిజముగా నవి కర్మప్రతిపాదకములు కాకపోయినను వానిలో నెందుకుఁ జేరినవో మన మిపుడు చర్చింపఁజాలము. కర్మము జ్ఞానార్థమే కావునఁ గర్మనిష్ఠులగువారికి జ్ఞాన మార్గ ముపదేశించుట యావశ్యక మనుతలంపుతో నవి యందు చేరియుండును. అది సముచితమే కాని, యజ్ఞాదికర్మలు చేయనీ చేయకపోనీ, వానితోఁ బనిలేకయే సాధనచతుష్టయసంపల్లబ్ధ మైనజ్ఞానమున ముక్తి గాంచ వచ్చు నని బోధించెడియుపనిషత్తులు, యాగములలో ముంచి తేల్చునట్టికేవల కర్మప్రతిపాదకగ్రంథమునకు సంబంధించినవి కావని మాత్రము తోఁచకపోదు. ఇట్లు బ్రాహ్మణారణ్యకములలో నిమిడియున్నవి కాక, ఆయా వేదములకు సంబంధించినవి గాఁ బేరు గాంచిన యుపనిషత్తులును, ఆ యా దేవతలపేరను ఋషులపే

రను వెలసినయుపనిషత్తులును మఱికొన్ని కలవు. ఈవిధమున లోకమందు వ్యాపించినయుపనిషత్తులు సుమారు రెండువందలుండును. వానిలో నిజముగా వేదాంతము లనఁదగినవి దశోపనిషత్తులు మాత్రమే. అవియే శంకరాచార్యాదుల వాక్కులకు గుఱియై భాష్యభాగ్యము గాంచినవి. తక్కిన వన్నియు నాయాకాలములందు మతాభిమాను లగువిద్వాంసులు రచించిన వని వానిస్వరూపస్వభావములే చెప్పుచున్నవి. కాని, యవియును భక్తినో జ్ఞానమునో బోధింప సహాయపడుచున్నవే కాని నిరర్థకములు కావు. అందనేకములకు వ్యాఖ్యానములు గూడఁ గలవు. ఇట్లున్నవానిలో నేవి యేవేదమునకుఁ జెందినవో లభించినంతవఱకుఁ దెలిసికొనుటకు ముందుగా నొక్కవిషయ మాలోచింపవలసి యున్నది.

పర్ణితవిషయమునుబట్టి, ఈయుపనిషత్తీవేదమునకు సంబంధించిన దని నిర్ణయించుట కవకాశ మెక్కువ కనఁబడదుగాని, ఆయావేదశాఖలకు సంబంధించినయార్ష సంప్రదాయమునుబట్టియు, నుపనిషత్తులలో నందందు గనవచ్చుఋషుల నామములను బట్టియు, అక్కడక్కడ నుదాహరింపఁబడినమంత్రమంత్రార్థములను బట్టియు, ఇది యీవేదమునకు సంబంధించిన దని యొకవిధముగా నిర్ణయింపవచ్చును. ఇట్లుండఁగా, ఆనందాశ్రమాధికారులు క్రొత్తగాఁ బ్రకటించినయుపనిషత్సముచ్చయ మనుగ్రంథమున నథర్వవేదమునకు సంబంధించినవిగా సవ్యాఖ్యానము లైన ముప్పదిరెం డుపనిషత్తులు కనఁబడుచున్నవి. వారే సంప్రదాయమునుబట్టి యవి యెల్ల నథర్వవేదీయము లని నిరూపించిరో తెలియదుగాని, అందలి కొన్ని యుపనిషత్తులు ఋక్సామ కృష్ణ శుక్ల యజుశ్శాఖలకు సంబంధించినవిగా వానియందలి ఋషినామాదులవలనఁ దెలియవచ్చుచున్నది. ఇందు కొకటి రెండుదాహరణములు.

జాబాలోపనిషత్తు శుక్లయజుశ్శాఖకు సంబంధించిన దనుటకు దానియందలి 'అథహ జనకో హవైదేహో యాజ్ఞవల్క్య ముపసమేత్యోవాచ' ఇత్యాది వాక్యములు ప్రమాణ మగుచున్నవి. ద్రావిడాంధ్రదేశము లందలి సంప్రదాయముగూడ నిది శుక్లయజు శ్శాఖాసంబంధియే యని తెలుపుచున్నది. కైవల్యోపనిషత్తు కృష్ణయజుశ్శాఖీయ మనియు ఋక్శాఖీయ మనియు ద్వివిధ మైనసంప్రదాయమును దేశమునఁ గలదు. అందలి "అథా ఽఽశ్వలాయనో భగవన్తం పరమేష్ఠిన ముపసమేత్యోవాచ" అను ప్రథమవాక్యమునుబట్టి యిది ఋక్శాఖీయముగాఁ గనవచ్చుచున్నది గాని యజుర్వేదీయ మని ముక్తికోపనిషత్తు చెప్పుచున్నది. ఇట్లుండ నీరెంటినిగూడ వా రథర్వవేదమునకుఁ జేర్చుటకుఁ గారణమేమో విచారణీయము. ఇట్లు సందేహాస్పదము లయిన వీగ్రంథమున నింకను గలవు. కావున దీనిని బ్రధానముగాఁ గైకొనక ముక్తికోపనిషత్తు చూపిన మార్గము ననుసరించి యాయావేదములకు సంబంధించిన యష్టోత్తరశతోపనిష

త్తుల నిందు పేర్కొనుచున్నాను. ' ఋక్శాఖలు ౨౧, యజుశ్శాఖలు ౧౦౯, సామశాఖలు ౧౦౦౦, అథర్వశాఖలు ౫౦, వీని కన్నిటికి నొక్కొక్క యుపనిషత్తు కల దని చెప్పుచు ముక్తికోపనిషత్తు ౧౦౮, ఉపనిషత్తులను మాత్రము చూపినది. ఇవి యన్నియు సజీవములు. ఇం దనేకములు ముద్రితములు, సభాష్యములు సవ్యాఖ్యానములు. లోకములోఁ గూడ నష్టోత్తరశతోపనిషత్తు లనెడి ప్రతీతి యధికముగాఁ గలదు.

వాఙ్మేమనసీత్యాదిశాంతి గల యీక్రింది పది యుపనిషత్తులును ఋక్శాఖలకు సంబంధించినవి. అవి—

* ఐతరేయ కౌషీతకీ ఆత్మప్రబోధ నాదబిందు నిర్వాణ ముద్గల అక్షమాలికా త్రిపురా సౌభాగ్య బహ్వృచ నామకములు.

ఆప్యాయన్త్విత్యాది శాంతి గలయీక్రింది పదియా ఉపనిషత్తులును సామశాఖలకు సంబంధించినవి. అవి—

* కేన * ఛాందోగ్య ఆరుణి మైత్రాయణీ మైత్రేయీ వజ్రసూచీ యోగచూడామణి వాసుదేవ సన్యాస అవ్యక్త సావిత్రీ రుద్రాక్షజాబాల దర్శన జాబాలి కుండికా మహోపనిష న్నామకములు.

సహనావవత్విత్యాది శాంతి గలయీక్రిందిముప్పదిరెండును, కృష్ణయజుశ్శాఖలకు సంబంధించినవి. అవి:—

* [1]కఠవల్లీ * తైత్తిరీయ నారాయణ బ్రహ్మ కైవల్య శ్వేతాశ్వతర గర్భ అమృతబిందు అమృతనాద కాలాగ్నిరుద్ర క్షురికా సర్వసార శుకరహస్య తేజోబిందు ధ్యానబిందు బ్రహ్మవిద్యా యోగతత్త్వ దక్షిణామూర్తి కఠ[2] స్కంద శారీరక వరాహ యోగశిఖా ఏకాక్షర అక్షి అవధూత రుద్రహృదయ యోగకుండలినీ పంచబ్రహ్మ కలిసంతరణ ప్రాణాగ్నిహోత్ర సరస్వతీరహస్య నామకములు,

పూర్ణమదః పూర్ణమిత్యాదిశాంతి గల యీక్రింది పందొమ్మిదియు శుక్లయజుశ్శాఖలకు సంబంధించినవి. అవి:—

* ఈశావాస్య * బృహదారణ్య జాబాల సుబాల హంస పరమహంస మంత్రికానిరాలంబ తారసార త్రిశిఖీబ్రాహ్మణ మండలబ్రాహ్మణ అద్వయతారక పైంగలభిక్షుకా తురీయాతీత అధ్యాత్మ ముక్తికా శాట్యాయనీ యాజ్ఞవల్క్య నామకములు.

---

1. ఇది యే కఠోపనిషత్తనియు, కాఠకోపనిషత్తనియుఁ జెప్పఁబడుచున్నది. ఇదియే దశోపనిషత్తులలోనిది. వాడుకలో నిది కఠోపనిషత్తనఁబడుచున్నది.

2. ఇది కఠవల్లికంటె వేఱయినది, 'దేవాహవై భగవన్త మబ్రువన్' అని దీనిమొదలు.

భద్రంకర్ణేభి రిత్యాదిశాంతి గలయీక్రింది ముప్పదియొకటియు నథర్వ శాఖలకు సంబంధించినవి. అవి:—

*ప్రశ్న *ముండక *మాండూక్య బృహజ్జాబాల నృసింహతాపినీ నారద పరివ్రాజక సీతా శరభ మహానారాయణ రామరహస్య రామతాపినీ శాండిల్య పరమహంస పరివ్రాజక అన్నపూర్ణా సూర్య ఆత్మ పరంబ్రహ్మ పాశుపత త్రిపురతాపినీ దేవీ భావనా భస్మజాబాల గణపతి మహావాక్య గోపాలతాపినీ కృష్ణ హయగ్రీవ గరుడ దత్తాత్రేయ అథర్వశిఖా అథర్వశిరో నామకములు.

పైవానిలో, పువ్వుగుర్తు కలవి దశోపనిషత్తు లని ఖ్యాతి కెక్కినవి. ఇవి గాక, ఇతిహాస తత్త్వ పంచీకరణ వృద్ధజాబాల మఠామ్నాయ విద్యాతారక నామ నీలరుద్ర చిత్తి గాయత్రీ పిండ సూర్యతాపినీ చూలికాదు లయినయుప నిషత్తు లింకను శతాధికముగాఁ గలవు, కాని పైవానిలోను వీనిలోను గూడ ననేకము లష్టకములను శతకములను బోలియున్నవి. అనుష్టుప్ఛందోబద్ధములై ఖండకావ్యములవలె నున్నవీనిలో ముప్పాతికమువ్వీస మత్యంత మర్వాచీనము లనుట విదితము. అయినను బరమాత్మవిజ్ఞానబోధకము లయినయివి యుపనిష న్నామమున వ్యవహరింపఁ బడుచున్నవి. పూర్వోక్తము లయిన యష్టోత్తరశతోప నిషత్తుల మహత్త్వమును శ్రీరాముఁడు మారుతికిఁ జెప్పినట్లుగా ముక్తికోపనిష త్తీక్రింది విధముగాఁ జెప్పుచున్నది,

ఇయం కైవల్యముక్తి స్తు కే నోపాయేన సిద్ధ్యతి ?
మాండూక్య మేక మే వాలం ముముక్షూణాం విముక్తయే ॥
తథాఽ ప్యసిద్ధం చే జ్జ్ఞానం దశోపనిషదం పఠ ।
జ్ఞానం లబ్ధ్వా ఽచిరా దేవ మామకం ధామ యాస్యసి ॥
తథాఽపి దృఢతా నో చే ద్విజ్ఞాన స్యాంజనానుత ।
ద్వాత్రింశాఖ్యోపనిషదం సమభ్యస్య నివర్తయ ॥
విదేహముక్తా విచ్ఛా చే దష్టోత్తరశతం పఠ ।
తాసాం క్రమం సశాంతించ శృణు వక్ష్యామి తత్త్వతః ॥

దీనినిబట్టి కైవల్యముక్తికి మాండూక్యము దశోపనిషత్తులు ఆత్మోపనిషత్తు క్రమముగాఁ బ్రధానము లనియు, మొత్తము ౧౦౮ ఉపనిషత్తులుగూడ విదేహ ముక్తికి సాధనము లనియుఁ దెలియుచున్నది.

ఉపనిషద్విషయము.

ఉపనిషత్తులందలి ముఖ్యవిషయము పరమాత్మతత్త్వము. సత్యజ్ఞానానం తరూపుఁ డగుపరమేశ్వరుఁ డొకఁడు కలఁ డనియు, అతనిచిద్విలాసమే యీసకల చరాచరప్రపంచ మనియు,అతఁడే పరమాత్మ పరబ్రహ్మాదిశబ్దవాచ్యుఁ డనియు

జీవాత్మ పరమాత్మప్రతిబింబమే యనియు, దృశ్య మయినసకలజగత్తు నశించు నదే యనియు, అదృశ్యమై సర్వవ్యాపకమై యున్నపరబ్రహ్మ మొకటియే నిత్య మనియు, వీనిముఖ్యమతము. జగత్తనాది. మాయయందు ప్రతిఫలించినపరమే శ్వరునిప్రతిబింబమే జీవుఁడు. అవిద్యామగ్నుఁ డయినయాజీవుఁడు పూర్వపూర్వ జన్మకృతపుణ్యాపాపఫలము నుత్తరోత్తర జన్మములం దనుభవించుచు జననమరణ ప్రవాహరూప మైనసంసారమున మునిఁగి తేలుచుండును. దానికిఁ గారణ మవిద్య. అవిద్యావినాశకము జ్ఞానము. అదియే, ఆత్మజ్ఞానము. జీవుఁ డాత్మజ్ఞానమున సమ స్తబంధముల నెడఁబాసి ముక్తుఁ డగును. అదియే జీవన్ముక్తి. సంసారబంధము నుండి విడివడుటయే ముక్తి. ముక్తునకుఁ బునరావృత్తి లేదు. కావున జీవున కాత్మ జ్ఞాన మావశ్యకము.

దేనిచే నోరు మాటాడుచున్నదో మనస్సు తలఁచుచున్నదో కన్ను చూచు చున్నదో చెవి వినుచున్నదో తక్కిన యెల్లయవయవములును దమతమపనులు చేయుచున్నవో, అదే బ్రహ్మ మని తెలిసికొనుము. అనెడికేనవాక్యముల భావ మునుబట్టి సర్వేంద్రియాధిష్ఠాన చైతన్యస్వరూపమే పరబ్రహ్మ మని యవగత మగును.

జాగ్రదవస్థయందు కర్మఫలము ప్రత్యక్షముగా ననుభవించునట్టి యాత్మ బహిఃప్రజ్ఞుఁడు. స్వప్నావస్థయందు తేజోరూపుఁడై సుఖదుఃఖము లనుభవించు వాఁ డంతఃప్రజ్ఞుఁడు. సుషుప్త్యవస్థయందు ప్రజ్ఞానఘనుఁ డేకీభూతుఁ డానంద మయుఁడు నై యానంద మనుభవించువాఁడు ప్రజ్ఞుఁడు. అతఁడే సర్వజ్ఞుఁడు సర్వేశ్వరుఁడు సర్వాంతర్యామి సర్వకారణుఁడు. ఎవఁ డీమూఁడవస్థలలోని తన స్వరూపమును దురువాతియవస్థయందు శాంతము శివ మద్వైత మచింత్య మగ్రాహ్య మవ్యవహార్యముఁగాఁ దలఁచునో యతఁడే యాత్మ, పరమాత్మ, పర బ్రహ్మము. అనెడి మాండూక్యవాక్యముల భావమును బట్టి జీవాత్మపరమాత్మల యభేదము గోచరించుచున్నది.

సంహితాబ్రాహ్మణములందు సగుణుఁ డైనప్రజాపతిచే సిర్మింపఁబడినట్లు వర్ణింపఁబడినయీసృష్టి యుపనిషత్తులం దవిద్యాపరికల్పిత మయినదిగా వర్ణింపఁ బడినది. మన కీద్వివిధ మైనసృష్టివర్ణనలు పరస్పరవిరుద్ధములు గాఁ గనఁబడును గాని యది వ్యావహారికదృష్టితోఁ గావింపఁబడినది, ఇది పరమార్థికదృష్టితోఁ గావింపఁబడినది, అది తలఁచినచో నావిరోధము తొలఁగిపోవును. మఱియు, ఋగ్వే దలకాలమందే, పరమేశ్వరుఁడు జగదభిన్ననిమిత్తోపాదానకారణమనెడి పారమార్థిక మయినయాత్మతత్త్వజ్ఞాన మంకురించిన దని యందలి 'నాసదాసీ న్నోసదాసీ' దిత్యాది ఋక్కులవల్లఁ దెలియవచ్చును. ఆవిజ్ఞానాంకురమే యజురాదిసంహితా దులందు విస్తరించి తుద కుపనిషద్రూపమునఁ బరిణమించి వైదికవాఙ్మయశిఖ

రత్నమై సకలలోకమున కాత్మతత్త్వము దెలియఁజేయుదివ్యజ్యోతియై వెలుంగుచున్న దనుట విదితము. విశేషప్రతిభాశాలు లైనవిద్వాంసులవాక్కులకు గుఱియైనయీయుపనిషత్తులు తరువాత వెలువడిన వివిధవేదాంత శాస్త్రములకును విభిన్నమతములకు నవలంబనము లైనట్లు కనఁబడుచున్నను, సుప్రసిద్ధము లైన యీశకేనకఠతైత్తిరీయాదు లన్నియు జీవేశ్వరాభేదవాదమునే చాటుచున్న వని తదర్థతత్త్వవిచారణచే గోచరింపకపోదు.

ఛాందోగ్యమునం దారుణి యైనయుద్దాలకుఁడు తనపుత్త్రుఁ డైన శ్వేతకేతువునకుఁ దత్త్వ ముపదేశించుచుఁ బల్కిన "స య ఏషో ఽణి మైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" ఇత్యాదివాక్యములును, బృహదారణ్యములోని "బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీ త్తదాత్మాన మే వావే దహం బ్రహ్మాస్మీతి తస్మా త్సర్వ మభవత్ య ఏవం వే దాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి" ఇత్యాదివాక్యములును, ఇంక నిట్లే యితరోపనిషద్వాక్యములును బూర్వోక్త మైనజీవేశ్వరాద్వైతమునే బోధించుచున్న వనుట స్పష్టము. ఈయర్థమునే "పాలలో నెయ్యివలె నాత్మ సర్వజగత్తునందు వ్యాపించియున్న" దని భంగ్యంతరముగా శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పినది.

మొత్తముమీఁద నుపనిషత్తు లన్నియు నజ్ఞానము జననమరణ ప్రవాహరూపసంసారదుఃఖకారణము, ఆత్మజ్ఞానము ముక్తిహేతువు ననువిషయములను సోపపత్తికముగా సప్రమాణముగా నిరూపించునవే యైనను, ఒక్కొక్కదాని యం దొక్కొక్క విశేషలక్షణము గూడ లేకపోలేదు. పూర్వోత్తరజన్మసద్భావమును ఛాందోగ్యము చక్కఁగా వర్ణించినది. మరణానంతర జీవవిషయకసంశయమును కఠవల్లి తీర్చినది. పరమేశ్వరుఁడు మాయి యనియు, జగము మాయ యనియు శ్వేతాశ్వతరము నిరూపించినది. ఉత్తమలోక ప్రాప్తిని దన్మార్గములను బృహదారణ్యాదులు వివరించినవి. ఈవిశ్వమంతయుఁ బరబ్రహ్మమే యని ముండకోపనిషత్తు వక్కాణించినది. సమస్తభూతములను దనయందును, తన్ను సమస్తభూతములందును జూచునాఁడు జ్ఞాని యని యీశావాస్యము చెప్పినది. ఉపనిషద్రాజ మగుతైత్తిరీయము 'బ్రహ్మ విదాప్నోతి పర' మిత్యాదివాక్యములచే బ్రహ్మజ్ఞానమున ముక్తి కలుగు నని నిరూపించుచు బ్రహ్మతత్త్వ ముపదేశించినది. ఇట్లే యాయా విశేషము లందందు గనవచ్చుచున్నను మొత్తముమీఁద నుపనిషత్తు లన్నియు జీవేశ్వరుల యద్వైతమునందే సమన్వయము గాంచుచున్న వనుట నిర్వివాదము. ఆత్మ తత్త్వ విషయకప్రశ్న లన్నిటికి యుక్తిప్రమాణానుభవసిద్ధముగా సమాధానము లిచ్చినప్రశ్నోపనిషత్తే యైయభిప్రాయము ధ్రువపఱుపఁ బరమప్రమాణ మగును. కౌసల్యాశ్వలాయన వైదర్భిభార్గవ శైబ్య సత్యకామ సుకేశో భర

ద్వాజ ప్రభృతులైన మహామునులు పరబ్రహ్మము నన్వేషింపఁ గోరినవారై తన్మార్గ ముపదేశింప సమర్థుఁ డగుపిప్పలాదమహర్షిని సందర్శించి కొన్నిప్రశ్నలు వేయఁగా నతఁ డన్నిటికి సదుత్తరము లిచ్చి తుదకు "అహమేతత్పరం బ్రహ్మ వేద నాతః పర మస్తి' అని సమాధానము చెప్పి వారికిఁ దత్త్వ ముపదేశించి నట్లు వర్ణింపఁబడినది. ఇదియే సకలోపనిషత్తులందలి ముఖ్యవిషయము. ఏతాదృశసత్యవిషయము భారతలోకమును బావనముఁ గావించుచుఁ దత్త్వజిజ్ఞాసువులకుఁ దరణోపాయ మగుటకుఁ గారణము ప్రాచీనమహర్షుల తపఃఫలము గాక మఱేమి ?

సుప్రసిద్ధములైనయుపనిషత్తులలోఁ గొన్ని ప్రాచీనతమము లనఁగా బౌద్ధమతప్రాగ్భవము లని పాశ్చాత్యవిమర్శకులు కొంద ఱూహించుట యుచితమే కాని యందలికొన్నిటిప్రాచీనత తావన్మాత్రమే కాదు. భాషారీతినిబట్టి చూచి నచో నారణ్యకములం దంతర్భూతములైనతైత్తిరీయబృహదారణ్యకోపనిషత్తులు రెండును వానిబ్రాహ్మణములయవ్యవహితోత్తరకాలములందే యావిర్భవించిన వని యంగీకరింపక తప్పదు. వానిగద్యశైలిగూడ నీవిషయమునే దృఢపఱుచుచున్నది. అట్టిదే ఛాందోగ్యమును. కాని యది సామవేదబ్రాహ్మణములలో నాఱవది యగునుపనిషద్బ్రాహ్మణముకంటె నన్యముగాక పోయినను గొంచెము సరళమైనదానిగద్యశైలి పై రెండింటికంటె దానిని ముందుకు లాగుచున్నది. ఐతరేయకౌషీతక్యుపనిషత్తు లీమూఁడింటితరువాతి వని వీనిబ్రాహ్మణములయర్వాచీనతయే తెలుపుచున్నది. అయినను మొత్తమీఁదైదు నుపనిషద్వాఙ్మయమునఁ బ్రథమము లనుట నిరాక్షేపము. గద్యమయములైనవీనికిని, పద్యమయములైన కఠాదులకును మధ్యకాలమునందు కేనోపనిషత్తు పుట్టియుండు నని దానిగద్యపద్యమయత్వమే తెలుపుచున్నది. ముప్పదినాలుగు మంత్రములచిన్నగ్రంథమగు నది విషయమునందు ప్రథమకాలికములనే యనుసరించియున్నది.

తరువాత నుదయించినవి, ఈశావాస్యకఠవల్లీశ్వేతాశ్వతరముండకోపనిషత్తులు. విషయసంపదచేఁ బైవానిని బోలియున్నయివి కవిత్వసంపదచే వానినుండి వేఱుపడి యతిమనోహరములై ద్వితీయకాలికము లనఁదగియున్నవి. ఇందు మొదటిది పదునెనిమిదిమంత్రములచిన్నయుపనిషత్తు. పిదపఁ దృతీయకాలికములుగా గణింపఁదగినవి ప్రశ్నమైత్రాయణీ మాండూక్యోపనిషత్తులు. వీనియందలి భాష వైదికభాష నించుకస్మరింపఁ జేయుచుండియు నెక్కువగా లౌకికభాషనుఁ జేరియున్నది. వీనిలో మాండూక్యము మిక్కిలి చిన్నది. ఇందు పండ్రెండు మంత్రములు మాత్రమే కలవు. ఇట్లు భిన్నభిన్నకాలముల నవతరించినవానిలో నథర్వవేదసంబంధము లగుముండకప్రశ్నమాండూక్యములు దశోపనిషత్తులలోఁ జేరుటనుబట్టి చూడఁగా నథర్వవేదోపనిషత్తు లుదయించినపిదప దశోపనిషత్ప్రరి

గణనము సంభవించినట్లు తెలియవచ్చును. మఱియు నాయాకాలములం దాయా వేదములకు సంబంధించిన యితరోపనిషత్తులు గూడ మఱికొన్ని పుట్టియున్నను, పూర్వులదృష్టి నీపదినూాత్రమే యాకర్షించె ననియు నూహింపవచ్చును. అయినను, గుణమునందు కౌషీతకీ మైత్రాయణీశ్వేతాశ్వతరములు దశోపనిషత్తుల కీడుకా వని మాత్రము తలంపరాదు. భాష్యకర్తలు పెక్కుసందర్భముల వీనిలోనివాక్యము లుదాహరించుటయే యిందుకుఁ దార్కాణము. ఇఁకనో యష్టోత్తరశతములోని తక్కిన వన్నియుఁ జతుర్థకాలికములుగా గణింపఁదగిన వని చెప్పవచ్చును: వానిలో—

మహానారాయణోపనిషత్తు విశిష్టాద్వైత మంకురించినకాలమున జనియించిన దని యందలివిషయవివరణమునుబట్టి తెలిసికొనవచ్చును. అందు, పరబ్రహ్మసాకారనిరాకారస్వరూపము మూలావిద్యాప్రలయస్వరూపము పరమాత్మతత్త్వము సంసారతరణోపాయము పరమ మోక్షమార్గము పరమేశ్వరస్వరూపము పరమసాయుజ్యముక్తస్వరూపము మొదలగు విషయములు నిరూపింపఁబడినవి. బహ్వృచోపనిషత్తు మిక్కిలి చిన్నది. ఇది శాక్త మత మంకురించిన కాలమున జనించినది. 'యత్ప్రియ మానన్దం త దేత త్సర్వాకారా మహాత్రిపురసుందరీ' ఇత్యాదివాక్యములే యిందుకుఁ బ్రమాణము. ఇట్లే రుద్రహృదయాదులు కొన్ని శైవమతావలంబనములు, సూర్యోపనిషదాదులు కొన్ని సౌరమత ప్రధానములు, గణపత్యాదులు గాణాపత్యమతమూలములునై వెలసినవి. అయినను, ఈకాలమందలి వానిలోఁ గూడఁ గైవల్యాద్యుపనిషత్తులు కొన్ని ప్రథమ ద్వితీయకాలములందలి యుపనిషత్తులవలెఁ బరతత్త్వవివణమున సమర్థములు కాకపోలేదు. కైవల్యోపనిషత్తునందలి యిరువది నాలుగుశ్లోకములు ను సకలోపనిషత్సారభూతములై పరతత్త్వమును సులభముగా బోధించుచున్నవి. అందలివి రెండుశ్లోకములు.

యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్ ।
సూక్ష్మాత్ సూక్ష్మతరం నిత్యం తత్త్వ మేవ త్వ మేవ తత్ ।
జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।
తద్బ్రహ్మాహ మితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥

విశ్వరూపము సకలజగదధిష్ఠానము నైనపరబ్రహ్మము నీవే. జాగ్రదాద్యవస్థలయం దేది యేకాకారమై ప్రకాశించుచున్నదో. ఆపరబ్రహ్మము నేనే యని తెలిసికొనువాఁడు సర్వబంధవిముక్తుఁ డగు నని వీనిభావము. ఇట్లే, అధ్యాత్మోపనిషత్తు మహావాక్యోపనిషత్తు మొదలగునవి కూడ సర్వాచీనము

లలో సహృదయరంజకములై పరతత్త్వబోధకము లగుచున్నవి కాని, యద్వైతబోధకము లయినయట్టి వానియందలి ముఖ్యవిషయ మంతయుఁ దైత్తిరీయ బృహదారణ్యాది ప్రధానోపనిషత్తులలోనిదానికంటె నన్యము కాదు. అయినను పద్ధతులు వేఱుగా నుండును. ఇంక రామతాపినీ గోపాలతాపినీ హయగ్రీవరుద్రాక్షజాబాలాదులు వివిధము లైనపౌరాణికమతములు వెలసినపిదప బయలు వెడలిన వనుట విస్పష్టము. ఇట్లు పురాణకాలమున నంకురించిన యుపనిషద్రచనావేశము తుదకు మహమ్మదీయమతబోధక మైనయల్లోపనిషత్తు వఱకును వచ్చిన దనుటచే నుపనిషత్ప్రపంచ మెంతవఱకు విస్తరించెనో తెలిసికొనవచ్చును.

ఇది, బ్రహ్మసూత్రార్థ దీపికారజోఽనన్తరవివాహ సంస్కృత కృతి
కర్తయు, ఉత్తర రామచరిత భీష్మప్రతిజ్ఞా ప్రేమతత్త్వా
ద్యాంధ్ర కృతికర్తయు నగు మల్లాది సూర్య
నారాయణశాస్త్రి నిర్మించిన సంస్కృత
వాఙ్మయచరిత్ర ప్రథమభాగ
వైదికవాఙ్మయమున
సప్తమాధ్యాయము.

———

# అష్టమాధ్యాయము.

## వేదాఙ్గములు.

వేదములకు సంబంధించిన శిక్షాద్యంగములు సూత్రవాఙ్మయములోఁ జేరఁదగిన వైనను, ఇవి ప్రత్యేకనామమునఁ బ్రసిద్ధి వహించియున్నవి కావున వేఱుగా వీనిస్వరూప మొకింత పరిశీలింతము.

'శిక్షా వ్యాకరణం ఛన్దో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడఙ్గాని వేద స్యాహుర్మనీషిణః'

అను ప్రసిద్ధశ్లోకమునఁ గనవచ్చు షడంగము లనుమాటయు, వానినామ ములును బహుగ్రంథములందు గలవు[1]. పాణినీయమునకుఁ బూర్వమైన యాప స్తంబధర్మసూత్రమందు "షడఙ్గో వేదః, ఛందః కల్పో వ్యాకరణం జ్యోతిషం నిరుక్తం శిక్షా ఛందో విచితి రితి' అనియు, దానికంటెను బూర్వమైన ముండ కోపనిషత్తునందు 'శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష' మ్మనియు, షడంగసంజ్ఞలు కనవచ్చుచున్నవి. మఱియు నాపస్తంబునిచేఁ జేర్కొనఁబడిన మనుస్మృతి పంక్తిపావను లైనబ్రాహ్మణులను గణించుచు, 'అగ్ర్యా స్సర్వేషు వేదేషు సర్వప్రవచనేషు చ' అని వక్కాణించినది. చతుర్వేదము లెఱిఁగిన వారును సకలప్రవచనము లెఱిఁగినవారును శ్రేష్ఠు లని దీనిభావము. ఇందలి ప్రవచనశబ్దమునకు 'వేనిచే వేదార్థము చక్కఁగాఁ జెప్పఁబడునో యవి ప్రవచన ములు, అవియే వేదాంగము' లనెడియర్థమును కుల్లూకభట్టు వివరించెను. ప్రవ చనశబ్దమునకు బ్రాహ్మణ మనియు, వేదము నితరులకుఁ జెప్పుట యనియు నితరా ర్థము లున్నను, వేదాంగము లనెడియర్థము కూడఁ గల దని సంప్రదాయసిద్ధ మైన కుల్లూకభట్టవచనము తెలుపక పోదు. అదిగాక యీయర్థమందే ప్రయో గింపఁబడిన మనుస్మృతిలోని దీనితరువాతి శ్లోకమందలి 'షడఙ్గవిత్' అను ప్రయోగము కూడ దీనిని బలపఱుచుచున్నది[2]. ఇది యిట్లుండ షడ్వింశ బ్రాహ్మణ ములో 'చత్వారో ఽస్యై వేదాః శరీరం షడఙ్గా న్యఙ్గాని' అనువాక్యము కన వచ్చుచున్నది. కావునఁ గొన్ని బ్రాహ్మణముల కాలమందే వేదములయర్థము వివరింప సహాయపడునంగభూతము లైనగ్రంథము లాఱును గల వని నిశ్చయింప వచ్చును. కాని, ఆవేదాంగము లెట్టివి? ఆగ్రంథము లేవి? అనువిషయము లిపుడు విచారణీయము లగును.

1. నిరు. 1-20. ముండకో 1-1
2. మను. 3. 184, 185.

౧. వర్ణస్వరస్థానప్రయత్నాదులను శిక్షించునది శిక్ష.

౨. ప్రకృతిప్రత్యయ పదస్వరూపతదర్థాదులు వివరించునది వ్యాకరణము.

3. మంత్రముల వృత్తలక్షణములను నిరూపించునది ఛందస్సు.

౪. శబ్దములయర్థములను నిరపేక్షముగా నిర్వచించునది నిరుక్తము.

౫. యాగాదుల యాచరణమునకును, తదర్థసిద్ధికిని దగినగ్రహనక్షత్రాదుల యుదయాస్తమయాదులను దెలుపునది జ్యోతిషము.

౬. యాగప్రయోగమును సమర్థించునది కల్పము.

ఏతాదృశలక్షణలక్షితములై వేదముల కంగము లనఁబడుచున్న వానిలో నొక్కొక్కదానినే గ్రహించి పరీక్షింతము.

౧. శిక్ష:—తైత్తిరీయ లుపనిషదారంభమందు 'శీక్షాం వ్యాఖ్యాస్యామః। వర్ణః స్వరః। మాత్రా బలమ్। సామ సంతానః। ఇత్యుక్తః శీక్షాధ్యాయః' అనువాక్యములను బఠింతురు. కాని యీయనువాకముతరువాతి యనువాకములం దుపాసనాధ్యాత్మాది విషయములు చెప్పఁబడినవి కాని వర్ణస్వరోచ్చారణాదివిషయము చెప్పఁబడలేదు. సాయణాచార్యులు పైయనువాకమున కర్థము వివరించుచు "అకారాదికము వర్ణము, ఉదాత్తాదికము స్వరము, హ్రస్వదీర్ఘాదిక మాత్ర, స్పృష్ట్యాదికప్రయత్నము బలము, తొందరగాని యాలస్యము గాని లేకుండ యుక్తకాలమందు విహితమైనస్వరాద్యుచ్చారణసామ్యము సమము, పూర్వోత్తరవర్ణములసంహిత సంతానము. ఈవర్ణాదు లాఱును, తత్తల్లక్షణలక్షితములై పఠనీయము లగును. ఇది శిక్షారూపమైనయధ్యాయము" అని తెలిపి, మఱియొకచోట 'స చాఙ్గభూతశిక్షాగ్రంథే స్పష్ట ముదీరితః' వర్ణాదికము వేదాంగశిక్షలో స్పష్టముగాఁ జెప్పఁబడినది, అని వ్రాయుటనుబట్టి యింతకుము న్నుదాహరించినతైత్తిరీయానువాకము శిక్ష కాదనియు, పాణినీయశిక్ష యనుపేరఁ బ్రసిద్ధమైనశిక్షాగ్రంథమే వేదాంగశిక్ష యనియు వైదికసంప్రదాయ మనుసరించినవారి మతమునఁ దెలియుచున్నది. ఇది యిట్లుండ విద్యలు పదునాలు గనియు, పదునెనిమిది యనియు రెండుపాఠములు పురాణాదిప్రసిద్ధములై యున్నవి. ఇందు మొదటి దానియందు నాలుగువేదములు నాఱువేదాంగములు మీమాంసా న్యాయ విస్తర పురాణ ధర్మశాస్త్రములును జేరినవి. రెండవపాఠమున నవియును, ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వార్థ శాస్త్రములును జేరినవి[1], ఛాందోగ్యోపనిషత్తుసప్తమ ప్రపాఠకమున నీయష్టాదశవిద్యలు నిట్లు కనఁబడుచున్నవి.

---

1. గాంధర్వమునకు బదులు నీతిశాస్త్రము కొన్నిటిలో నున్నది.

ఋగాదివేదములు నాలుగు, ఇతిహాసపురాణము వేదములవేదము— పిత్ర్యము రాశి దైవము నిధి వాకోవాక్యము ఏకాయనము దేవవిద్య బ్రహ్మ విద్య భూతవిద్య క్షత్రవిద్య నక్షత్రవిద్య సర్పదేవజనవిద్య[1].

వీనిలో వేదములవేద మనఁగా వేదములపదవిభాగాది జ్ఞానము కలిగించు వ్యాకరణ మనియు[2]. రాశి దైవ నిధులు మూఁడును గణితోత్పాతమహాకాలాది విజ్ఞానము కలిగించుశాస్త్రము లనియును, దేవవిద్య నిరుక్త మనియు, బ్రహ్మ విద్య యనఁగా వేదములకు సంబంధించినశిక్షా కల్ప ఛందస్సు లనియు, నక్షత్ర విద్య జ్యోతిష మనియు, శంకరభగవత్పాదులు విశదీకరించియున్నారు. దీనినిబట్టి శిక్షాదివేదాంగములు షడ్వింశబ్రాహ్మణమునకుఁ బూర్వము బ్రహ్మవిద్యాది రూపమున నుండె నని యూహింపవచ్చును. ఇది యిట్లుండ ఛాందోగ్యమునకుఁ బూర్వ మైనబృహదారణ్యకోపనిషత్తుచతుర్థాధ్యాయమున, ఋగ్వేదాదులు నాలుగు ఇతిహాసము పురాణము విద్య ఉపనిషత్తులు శ్లోకములు సూత్రములు అనువ్యాఖ్యానములు వ్యాఖ్యానములు, అనునవి పరమేశ్వరనిశ్వసితము లని చెప్పఁ బడినది. ఇందితిహాసాదు లెనిమిదియు మంత్రబ్రహ్మణాత్మకవేదాంతర్గతము లైన యష్టవిధబ్రాహ్మణభాగము లని శంకరాచార్యులు సెల విచ్చియున్నారు. దీనినిబట్టి చూడఁగా బృహదారణ్యకమునాఁటికి వేదాంగసంజ్ఞ కాని శిక్షావ్యాకరణాదిసం జ్ఞలుగాని యాసంజ్ఞలతోడి గ్రంథములుగాని లేవేమో యని సంశయింపవలసి వచ్చుచున్నది. సూత్రము లనెడిమాట యొకటి యున్నది గాని వేదమందలివస్తు సంగ్రహవాక్యములే సూత్రము లని యాచార్యులవా రర్థము వ్రాసియుండు టచే నది వేదాంగసూత్రపరముకా దని విదిత మగుచున్నది. అందుచే వేద శబ్దార్థాది విజ్ఞానమున కందలియష్టవిధబ్రాహ్మణభాగములే తొల్లి తోడ్పడుచుండె నని భావింపవలసి యున్నది. దీనినిబట్టి మన మిపుడు శిక్షావ్యాకరణాదులు వేదాంగము లని తలఁచుచున్నామో, అవి బృహదారణ్యకాలమునఁ గనరా వనియు, ఛాందోగ్యకాలమున షడంగము లనుపేరు లేకుండ నవి నుతియొకవిధ మునఁ గనవచ్చుచున్న వనియు, షడ్వింశబ్రాహ్మణకాలమున షడంగసంజ్ఞ కనఁబడు చున్న దనియు, ముండకోపనిషదాదులకాలమున శిక్షాదిషడంగము లేర్పడి యుండు ననియు గోచరించుచున్నది. కావున శిక్ష యనునది తైత్తిరీయోపనిషత్తు లోనియేకానువాకము మాత్రము కాక, పాణినీయశిక్ష యనుపేర విదిత మైనదే

1. ఛాం. ఉ. 7. 2. శంకరభాష్యము - పిత్ర్యము - శ్రాద్ధకల్పము, వాకోవాక్యము=తర్క శాస్త్రము, ఏకాయనము=నీతిశాస్త్రము, భూతవిద్య=భూతతంత్రము, క్షత్రవిద్య=ధనుర్వేదము, సర్పవిద్య=గారుడము, దేవజనవిద్య=నృత్తగీత వాద్యశిల్పాదులు.

2. ఛాం. వేదానాం వేదం.—వ్యాకరణేన హి పదాదివిభాగశ ఋగ్వేదాదయో జ్ఞాయంతే శం. భా.—వేదానాం వేదం ప్రకృతిప్రత్యయవిభాగావేదకం వ్యాకరణ మిత్యర్థః. ఆనందగిరి.—

వేదాంగశిక్ష యని పెద్దలవ్రాఁతలను బట్టి విశ్వసింపవలసియున్నది. కాని, యిందొకవిప్రతిపత్తిమాత్రము పొడగట్టుచున్నది.

షడ్వింశబ్రాహ్మణము పాణినీయమునకుఁ బూర్వ మగుటచే నది పేర్కొన్న షడంగములలోనిశిక్ష పాణినిశిక్ష కాదనుట నిజము సరిగదా, యిది పాణినికృతము కూడఁ గాదు. సిద్ధాంతకౌముదీపరిశిష్టముగా ముద్రిత మైన యఱువదిశ్లోకముల యీచిన్నగ్రంథము పాణినినిర్మిత మని కొందఱు తలఁచుచున్నారు గాని, యది సరి యనరాదు. పాణినీయమతము ననుసరించి యీశిక్ష వచియించుచున్నానని గ్రంథకర్త మొదటఁ జేసినప్రతిజ్ఞయు, త్రినయనముఖనిఃసృత మైనదీనిని బఠించు బ్రాహ్మణుఁడు సకలశుభములు పొందు నని కడపటఁ జెప్పినఫలశ్రుతియు 'తస్మై పాణినయే నమః' అని పాణికిని సమర్పించిన నమస్కారమును, ఇది పాణిని కృతము కా దని చాటుచున్నవి. త్రినయనుఁ డను విద్వాంసుఁడు వీనిని రచించెనో లేక, ఒకానొకపండితుఁడు దీనిని రచియించి 'అఇఉణ్' మొద లగు మాహేశ్వరసూత్రము లాధారముగాఁ బాణినీయము వెలయుటం జేసి యిది మహేశ్వరకృత మనెడివిశ్వాసము లోకమునఁ గలిగించుటకై యిది త్రినయన కృత మనెనో సరిగాఁ జెప్పఁ జాలము. ఇది యిట్లుండ మఱియొకవిశేషము.

ఈ పాణినీయశిక్ష, ఉదాత్తానుదాత్తస్వరిత స్వరకల్పనముతో వారాణసీ పురమున ముద్రిత మైనది. దీని కీస్వర మెట్లు వచ్చెనో చెప్పఁజాలము. శిక్షా ప్రకాశ మనెడివ్యాఖ్యగూడ దీనితోనే ముద్రితమై యున్నది. వ్యాఖ్యాతపేరు కనఁబడదు గాని, అతఁడు వ్యాఖ్యానారంభమందలి యుపోద్ఘాతములో, ఛంద స్సూత్రకర్త యగుపింగళాచార్యుఁడు పాణినీయమతము ననుసరించి యీశిక్ష రచియించె నని తెలిపియున్నాఁడు. కాని కడపటనున్న 'త్రినయనముఖనిఃసృతా' మిత్యాదిశ్లోక మెత్తియు నీపదమునకు మాత్ర మర్థము వ్రాయలేదు. ఈవ్యాఖ్యాత మతమునుబట్టి పింగళాచార్యుఁడు పాణినీయశిక్షాకర్త యని తలంత మన్న నతనికిఁ త్రినయనుఁ డనునామాంతరమో లేక బిరుదనామమో యున్న ట్లూహింపవలసియుండును గాని యతని కీరెండును గూడఁ బ్రసిద్ధములు గావు. ఇది యెట్లున్నను, దీనినిబట్టి పూర్వోక్తశిక్ష పాణినికృతము కా దనిమాత్రము నిశ్చయముగా వక్కాణింపవచ్చును.

మనకంటి కిపుడు గోచరించు శిక్షాగ్రంథము పాణినికృతము గాకపోయి నను, ఇందలి విషయముమాత్రము పాణినికి మున్నే యేరూపముననో షడ్వింశాదులు పేర్కొన్నషడంగములలో నుండెడి దనియు, అదియే పాణినీయమున నంతర్భూతమై తరువాతఁ బాణినిభక్తునిముఖమున నీగ్రంథరూపము దాల్చి పాణినీయశిక్ష యను పేర విదిత మయ్యె ననియు విశ్వసింపవచ్చును. తక్కినయంగముల సంగతి గూడ నిట్టిదే. ఇందు కొకచిన్న దృష్టాంతము.

 

వైదికసంప్రదాయమునుబట్టి షడ్వింశాదులు పేర్కొన్న షడంగములలో నిరుక్తముకూడ నుండె ననుట యుచితముగదా! అప్పటి కేదో యొకరూపమున నిరుక్తమే లేనిచో యాస్కుఁడు నిరుక్త మారంభించుచు 'వేదాంగాని' యని బహువచనముగా వేదాంగముల నెట్లు స్మరింపఁగలుగును? నిరుక్తము గాక తక్కిన యంగము లుండు నందుమేని షడ్వింశముండకాదులు షడంగము లెట్లనఁ గలిగినవి? కావున వెనుక ఛాందోగ్యములోని బ్రహ్మవిద్యాదులకు శంకరాచార్యు లర్థము చెప్పినట్లుగా, అష్టవిధ బ్రాహ్మణములే మంత్రార్థ వివరణాదులకుఁ దోడ్పడుచుండె ననియు నవియే కొన్ని కలసియుఁ గొన్ని వేఱుపడియు షడంగ సంజ్ఞను జెందె ననియు, అవియే క్రమముగా శిక్షాదిరూపము తాల్చె ననియు నూహింపవలసియున్నది. ఇట్లు తెలియవచ్చిన యీశిక్ష లోకమునందును వేదము నందును గూడ నున్న శబ్దములను శాసించున దై నను వేదమునకుఁ గూడ నుద్దేశింపఁ బడినదగుటచే వేదాంగశిక్షయై ఖ్యాతి కెక్కినది. ఇఁక నీసందర్భమునఁ దక్కిన శిక్షాగ్రంథములనుగూర్చి కూడ నించుక ప్రసంగింతము.

వేదాంగశిక్ష యనుపేరు లే కున్నను వేదస్వరవర్ణోచ్చారణసంధ్యాది లక్షణములను వివరించునట్టి శిక్ష లనేకము లున్నవి. అందు కొన్ని నవశిక్ష లను ఖ్యాతి గాంచినవి కాని, వానినిగూర్చి పాఠభేదములు కలవు. ఆనవశిక్షలతోఁ గూడ నిపుడు ముద్రితములు నముద్రితములు నైనశిక్షలు రమారమి యేఁబది గనఁబడుచున్నవి. అందు కొన్ని ప్రాచీనమహర్షులపేర నున్నవి. కొన్ని యర్వాచీన విద్వాంసులు రచించినట్లున్నవి. అం దనేకములు పద్యమయములు. కొన్ని మాత్రము గద్యమయములు. అవి యన్నియుఁ గూడ స్వరవర్ణ పదక్రమ జటాఘనాదులలో నేదేని యొకవిషయమును బోధించుచు వేదములకు సంబంధించిన వనుట సత్యము. పరిశీలింపఁగా నవి యన్నియుఁ బ్రాతిశాఖ్యగ్రంథములు విస్తరించినపిదపఁ దత్తల్లక్షణసంగ్రహములుగా బయలుదేఱినయర్వాచీనలక్షణము లని తెలియవచ్చును. పరిమాణమునందు మిక్కిలి చిన్నవయ్యుఁ బ్రాతిశాఖ్యలవలె వివిధవేదశాఖలకు సంబంధించినవిగాఁ గనవచ్చునట్టి శిక్షారూపలక్షణములఁ దెలిసికొనుట కిదియే యదను గావునఁ దెలిసినంతవఱకు వాని నెల్ల నిందు శాఖాక్రమమునఁ బేర్కొనుచున్నాను.

పాణిని - వ్యాస - భరద్వాజ - వ్యాళ - వ్యాళి - వాల్మీకి - కాహల - కాలనిర్ణయ - బోధాయన - సర్వసమ్మత - సిద్ధాంత - ఆరణ్య - హారిత - నామకము లైన పదుమూఁడుశిక్షలు నెల్ల వేదశాఖలకు సంబంధించినవి. పాణినిశిక్ష ఋక్శాఖకు సంబంధించిన దని యొక రనిరి గాని, యది సర్వవేదసంబంధమే యని వెక్కంద్రయాశయము. అందలి విషయముగూడ సర్వసాధారణ మైనది గాని యొకవేదమునకే చెందినది కాదు.

శమానశిక్ష ఋక్శాఖాసంబంధముగాఁ గనవచ్చుచున్నది.

నారద గౌతమ లోమశ శిక్షలు మూఁడును సామశాఖాసంబంధములు.

ఆపిశలి శంభు స్వర ఆత్రేయ శిక్షలు నాలుగు కృష్ణయజుశ్శాఖకుఁ జెందినవి.

యాజ్ఞవల్క్య వసిష్ఠ కాత్యాయన పరాశర మాండవ్య అమోఘనందినీ లఘ్వమోఘనందినీ అమరేశమాధ్యందినీ లఘుమాధ్యందినీ కేశవ కేశవకారికా మల్లశర్మ స్వరాంకుశ స్వరభక్తి స్వరాష్టక షోడశశ్లోకీ అవసాననిర్ణయ క్రమ సంధాన గళదృక్ మనస్స్వర ప్రాతిశాఖ్యప్రదీప వేదసూత్రపరిభాషా వేద పరిభాషాకారికా యజుర్విధాన క్రమకారికా శిక్ష లిరువది యాఱును శుక్ల యజుశ్శాఖకుఁ జేరినవి. కాని యిందు యజుర్విధాన క్రమసంధాన క్రమకారి కాదులు కొన్ని కృష్ణయజుస్సునకును, స్వరభక్తి స్వరాష్టకాదులు కొన్ని యన్ని శాఖలకును సంబంధించినవిగాఁ గనవచ్చును. ఎట్లయినను శుక్లయజుశ్శాఖీయ శిక్షాలక్షణము లెక్కువ యనుట నిజము.

మాండూకశిక్ష యథర్వవేదశాఖకుఁ జేరినది. ఇట్లు తెలియవచ్చినశిక్షల మొత్తము ౩౧. ఇవిగాక లక్ష్మీ కపిల కాలాదిశిక్షలు మఱికొన్ని యున్నట్లు విన వచ్చుచున్నది. ఇన్నెన్ని యున్నను వేదాంగ మనెడిఖ్యాతి పాణినీయశిక్షకే వచ్చి యుండుటచే వీనిలో నెల్ల నదియే మొదటి దని నమ్మవచ్చును. ఋక్సామ శుక్ల యజు శ్శాఖీయశిక్షలను, శిక్షాసంగ్రహము ప్రకటించినవారు వైవిధముగా విభ జించినను, వీనిలోఁ గొన్ని సర్వశాఖలకును సంబంధించినవిధులు గూడ లేక పోలేదు. ఇందు కొకయుదాహరణము.

సామశాఖీయ మనఁబడిననారదీయశిక్షలో స్వరనిర్ణయము చేయుచు 'కఠ కాలాప తైత్తిరీ యాహ్వరక శాఖలందును ఋగ్వేద సామవేదములందును, ప్రథమస్వరమే చెప్పవలెను' అనెడియర్థము చెప్పుచున్నయొకశ్లోక మున్నది[1]. ఇట్లే తక్కినశిక్షలలోఁ గొన్నిటియందును, త్రయీశాఖలకు సంబంధించినవిధు లందందు గనిపించును. మఱియు సామగానస్వరములను నిర్ణయించునీనారదశిక్ష' ఋషభ - షడ్జ - గాంధార - పంచమ - ధైవత - నిషాద - మధ్యమ - స్వర ములనువానివర్ణములను వానిపలుకుబడివిశేషములను వర్ణించుట చూడఁగా నిది సంగీతశాస్త్రారంభకాలమం దుదయించె నని తోఁచుచున్నది[2]. పిల్లనగ్రోవిలో గానము చేయునపుడు పలికించుషడ్జాదిస్వరములను గొన్నిమృగవిహంగములకంఠ స్వనములకుఁ బోల్చుచు నిది యిట్లు వర్ణించినది[3].

1. నారదశిక్ష. 1-9.—2. 4-1,2,3,—3. 5-1,2,3.

షడ్జం మయూరో వదతి గావో రమ్భన్తి చర్షభమ్ ।
అజావికే తు గాన్ధారం క్రౌఞ్చో వదతి మధ్యమమ్ ।
పుష్పసాధారణే కాలే కోకిలా వక్తి పఞ్చమమ్ ।
అశ్వస్తు ధైవతం వక్తి నిషాదం వక్తి కుఞ్జరః ॥

ఇట్లున్న స్వరవిజ్ఞానము పాణినీయశిక్షకు మున్నే యుదయించినదనుట కందలివాక్యములు గూడఁ బ్రమాణ మగుచున్నవి. పాణినీయశిక్షలో—

ఉదాత్తశ్చానుదత్తశ్చ స్వరితశ్చ స్వరాస్త్రయః ।
హ్రస్వో దీర్ఘః ప్లుత ఇతి కాలతో నియమా అచి ॥
ఉదాత్తే నిషాదగాంధారా వనుదాత్తఋషభధైవతౌ ।
స్వరితప్రభవా హ్యేతే షడ్జమధ్యమ పఞ్చమాః ॥

హ్రస్వదీర్ఘప్లుతసంజ్ఞలు గలయచ్చు నాశ్రయించి యున్నమూఁడుస్వరములలో నుదాత్తమునుండి నిషాదగాంధారములును, అనుదాత్తమునుండి ఋషభధైవతములును, స్వరితమునుండి షడ్జమధ్యమపంచమములును, పుట్టిన వనిభావము. దీనినిబట్టి సంగీతశాస్త్రమునకు జీవము లయినషడ్జాదిసప్తస్వరములు సామగానము నుండి యేర్పడిన వనియు, అవి యేర్పడినపిదపనే ప్రథమశిక్షగా గణింపఁబడుపాణినీయశిక్ష యుదయించి యుండు ననియు భావింపవచ్చును.

౨. వ్యాకరణము:—లౌకికశబ్దములనువలెనే కొన్నివైదికశబ్దములనుగూడ ననుశాసించుటచేతను, విశేషించి స్వరవైదికప్రక్రియోపయోగిసూత్రము లుండుట చేతను, బ్రహ్మయజ్ఞమునందు వేదాంగముల మొదటివాక్యములు పఠించుటలో 'వృద్ధిరాదైచ్' సూత్రము చేరుటచేతను, పాణినీయాష్టాధ్యాయియే వేదాంగ వ్యాకరణ మని తలంచుచున్నారు కాని, యది యసంగతము. పాణినికిఁ బూర్వుఁడైనయాపస్తంబుఁడు పేర్కొన్న షడంగములలోనివ్యాకరణ మతనితరువాతఁ బుట్టినపాణినీయ మగుట యసంభవముకదా! అందుచే వెనుకఁ జెప్పినట్లు ఛాందోగ్యోపనిషత్తు పేర్కొన్నవేదవేదమే వేదాంగవ్యాకరణ మనుట సముచిత మగుచున్నది, అదియే వేదమునకుఁ బ్రత్యేకముగా ననుశాసన మగుప్రాతిశాఖ్య ముగాఁ బరిణమించినది. తొలుత సూక్ష్మాకృతితో నున్నయది ప్రతివేదశాఖకును దరువాత స్థూలరూపమును దాల్చుటచే 'ప్రతిశాఖం భవంప్రాతిశాఖ్య'మ్మను వ్యుత్పత్తి కనుగుణముగాఁ బ్రాతిశాఖ్య మను పేరు గాంచినది. పిదప వెలువడిన శిక్షాగ్రంథముల కాధారభూతములై సంహితాపాఠపదపాఠముల కెక్కువగా సంబంధించిన వగుచు స్వరసంధివర్ణోచ్చారణాదివివిధవిషయములు బోధించుచుండుటయే ప్రాతిశాఖ్యలవ్యాకరణరూపవేదాంగత్వమునకుఁ బ్రబలప్రమాణము. కాని—

"వేదాంగములందు శిక్షావ్యాకరణములు పఠింపఁబడినవి కాని ప్రాతిశాఖ్యము పేర్కొనఁబడలేదు. విషయవిమర్శనుబట్టి చూడఁగా నిందలివిషయము శిక్షావ్యాకరణములలోనివిషయముకంటె భిన్నము కాదు. కాత్యాయనప్రాతిశాఖ్యమందలి 'వృద్ధంవృద్ధిః' అనుసూత్రమున కర్థము వ్రాయుచు నువ్వటుఁడు శిక్షావిహితము వ్యాకరణవిహితము నైనవిషయమును వివరించునట్టి యీ శాస్త్రము పాఠకు లగుశిష్యులకు వృద్ధిహేతు వగు నని చెప్పియుండెను. వైదికాభరణకర్త యీప్రాతిశాఖ్యము శిక్షావ్యాకరణములవివరణ మని చెప్పియుండెను. గ్రంథాంతమునం దితఁడే ప్రాతిశాఖ్యము వ్యాకరణప్రధాన మని వక్కాణించియుండెను. కావునఁ బాణినీయము గాకున్న మఱియొక వ్యాకరణము వేదాంగ మగును గాని ప్రాతిశాఖ్యము కా"దని కొంద ఱూహింపవచ్చును. సత్యమే. సంస్కృతవాఙ్మయమందు శబ్దశాస్త్ర మనఁబడువ్యాకరణ మతిప్రాచీనమైనయొకమహాశాస్త్ర మగుటయు, వైదికశబ్దజాలమునకుఁ గూడ నది యనుశాసన మగుటయు, అందలివిషయముకొంత ప్రాతిశాఖ్యములఁ గనవచ్చుచుండుటయు నిజము. తక్కినవానిమాట యెట్లున్నను శుక్లయజురథర్వప్రాతిశాఖ్యలు పాణిన్యష్టాధ్యాయికంటెఁ బరము లగుటయు నిక్కము. పాణిన్యాచార్యులకుఁ బూర్వము వ్యాకరణ మున్న దనుటయు నిరాక్షేపము. కాని, శబ్దశాస్త్రవిహితము కాని వైదికసంధిలక్షణము లిం దుండుటచేతను, ఇవి ప్రత్యేకము వేదముకొఱకే జనించిన వగుటచేతను, ఛాందోగ్యోపనిషత్తులోఁ బేర్కొనఁబడిన వేదవేదము వైదికవ్యాకరణ మనఁదగియున్నది గావున, దానివివరణములై దానిరూపాంతరములై వెలసిన ప్రాతిశాఖ్యలే వేదాంగవ్యాకరణ మనుట సముచిత మగుచున్నది. ఐన నీసందర్భమున వేదాంగములనుగూర్చి కుమారిలభట్టమి తెలివెనో కొంచెము చూతము.

'బ్రాహ్మణుఁడు షడంగమైనవేద మధ్యయనముచేయవలె నన్నస్మృతివచనమునకు వైదికము లైనయర్థవాదములం దంతర్గతములై యున్ననిరుక్తవ్యాకరణాదు లధ్యయనము చేయవలె నని యభిప్రాయము కాని బాహ్యవ్యాకరణాదులు స్వాధ్యాయమువలె నధ్యేయము లనికాదు ... పాణినీయాది వ్యాకరణములు వేదస్వరూపవర్జిత పదసంస్కారపరములు. ప్రాతిశాఖ్యములు వేదసంహితాధ్యయనానుగత స్వరసంధ్యాద్యనుసరణము లగుటచే వానికి వేదాంగత్వమావిష్కృత మగుచున్నది[1]. ఇత్యాది తంత్రవార్తికవచనముల యభిప్రాయమునుబట్టి వేదాంతర్గతము లైనవేదాంగముల వివరణములే శిక్షాది బాహ్యవేదాంగము లనియు, ప్రాతిశాఖ్యమునకు వేదాంగత్వము పూర్వసమ్మతమే

1. తం. వా. 1. 3.

యనియు విశ్వసింపవచ్చును. కావున నిఁక నీప్రాతిశాఖ్యలలో నేది యేవేద శాఖకు సంబంధించినదో క్రమముగాఁ దెలిసికొందము.

ఋగ్వేదప్రాతిశాఖ్య.—ఇందలి మంగళాచరణ శ్లోకములోని 'ప్రణమ్యర్చాం లక్షణ మాహ శౌనకః' అనువాక్యమువలన నిది శౌనకవిరచిత మని తెలియుచున్నది. ఇది పదునెనిమిది పటలముల గ్రంథము. ఇందు స్వరాదివిషయకము లైనభిన్నమతము లుద్ఘాటించు సందర్భములం దీక్రింది పూర్వాచార్యులు పేర్కొనఁబడియున్నారు.

శాకల్యుఁడు - స్థవిరుఁడు - మాండూకేయుఁడు - వ్యాళి - గార్గ్యుఁడు - యాస్కుఁడు - వేదమిత్రుఁడు - శాకటాయనుఁడు - బాభ్రవ్యుఁడు ననువారు. వీరిలో శాకల్యుఁడు ఋగ్వేదమునకు, పదపాఠమును, బాభ్రవ్యుఁడు క్రమపాఠమును రచియించినవారు వత్సగోత్రసంజాతుఁడును, చంపాపురవాసియు నగుదేవమిత్రునిపుత్రుఁడు విష్ణుమిత్రుఁడు తొలుత దీనికి వృత్తి వ్రాసెను. తరువాత, దీని కువ్వటాచార్యుఁడు భాష్యము రచియించెను. ఇందలి సూత్రములు కొన్ని పద్యమయములుగాఁ గూడ నున్నవి. ఇందుకు "ఉదాత్తపూర్వం స్వరిత మనుదాత్తం పదేఽక్షరం, అతో ఽన్య త్స్వరితం స్వార' మిత్యాదు లుదాహరణము.

సామవేదప్రాతిశాఖ్యము.—పుష్పనామకముని దీనిని రచియించిన ట్లొకరు వ్రాసిరి గాని యీగ్రంథ మెందును గనరాదు.

కృష్ణయజుర్వేద ప్రాతిశాఖ్యము.— తైత్తిరీయప్రాతిశాఖ్య మనుపేర నిది లోకప్రసిద్ధమై యున్నది కాని దీని నెవరు రచియించిరో తెలియరాదు. ఇది యిరువదినాలుగధ్యాయముల మహాగ్రంథము. ఇందు నీక్రింది యాచార్యుల మతము లుదాహరింపఁబడినవి.

ఆత్రేయుఁడు - కౌండిన్యుఁడు - గౌతముఁడు - పౌష్కరసాది - ప్లాక్షి - భరద్వాజుఁడు - వాల్మీకి - శైత్యాయనుఁడు - స్థవిరకౌండిన్యుఁడు - అగ్నివేశ్యుఁడు - అగ్నివేశ్యాయనుఁడు - ఉఖ్యుఁడు - ఉత్తమోత్తరీయుఁడు - ప్లాక్షాయణుఁడు - బాడబీకారుఁడు - భారద్వాజుఁడు - మాచికాయుఁడు - వాత్సప్రుఁడు - శాంఖాయనుఁడు - సాంకృత్యుఁడు - కాండమాయనుఁడు - హారీతుఁడు - అనువారు. వీరిలో, భరద్వాజగౌతమాదులు కొందఱు ఋగ్వేదసూక్తద్రష్టలుగాను, వాత్సప్రుఁడు మొదలగు కొందఱు సూక్తద్రష్టల సంతతివారుగాను, ఉఖ్యుఁడు మొదలగు కొందఱు యజురాదిశాఖా ప్రవర్తకులవంశమువారుగాను, కనవచ్చుచున్నారు. మొత్తముమీఁద వీరందఱును ఋక్ప్రాతిశాఖ్యములోని పూర్వు లనఁదగిన కొందఱికంటెఁ గూడఁ బ్రాచీనులనుట సాహసము కాఁజాలదు. మఱియు వీరిలోని యాత్రేయుఁడే దీనికిఁ దొలుత భాష్యము

రచియించినట్లు కనఁబడుచున్నది. ఇ దంతయుఁ జూడఁగా శౌనక ఋక్ప్రాతిశాఖ్య ముకంటె నిది ప్రాచీన మని తోఁచుచున్నది.

దీనికి మొదట నాత్రేయుఁడు వరరుచి మాహిషేయుఁడు ననువారు భాష్యములు రచియించినట్లుగా నీమూఁడింటిని జూచి త్రిభాష్యరత్న మను పేర వ్యాఖ్యానము వ్రాసినసోమయార్యుని యీ క్రిందివాక్యమువలనఁ దెలియుచున్నది.

వ్యాఖ్యానం ప్రాతిశాఖ్యస్య వీక్ష్య వారరుచాదికమ్ ।
కృతం త్రిభాష్యరత్నం య ద్భాసతే భూసురప్రియమ్ ॥

ఇం దాత్రేయమాహిషేయులు పేర్కొనఁబడకపోయినను, ఆదిశబ్దమును బట్టియు, వ్యాఖ్యానమం దాత్రేయమాహిషేయమతము లుల్లేఖించుటనుబట్టియు[1], సంప్రదాయమునుబట్టియు వీ రిద్దఱును వరరుచివలెనే దీనికి భాష్యకర్త లని భావింపఁబడుచున్నది. ఈ త్రిభాష్యరత్నమునకుఁ బ్రాతిశాఖ్యవివరణ మను నామాంతరము కలదు. ఇందు మహాభారత పాణినీయాది ప్రాచీనగ్రంథములే కాక, అమరకోశముగూడ నుదాహరింపఁబడినది. రెండవవ్యాఖ్యానము వైదికాభరణము. ఇది యాచార్యగార్గ్యగోపాలస్వామి విరచితము. ఈ ప్రాతిశాఖ్యలోఁ దక్కినవానియందువలె వర్ణసమామ్నాయస్థానప్రయత్న సంహితా సంధి స్వర సవర్ణదీర్ఘాదులే వివరింపఁబడినవి కాని, యిందలిపద్ధతి ప్రకరణక్రమమున మిక్కిలి సులభముగా నున్నది.

శుక్లయజుర్వేదప్రాతిశాఖ్యము - ఇది కాత్యాయనముని ప్రణీతము, ఎనిమిదియధ్యాయముల గ్రంథము. కాత్యాయనకృతముగానే ప్రతిజ్ఞాపరిశిష్ట సూత్ర మను పేర మూఁడుకండికల చిన్నగ్రంథము దీని కనుబంధముగా ముద్రితమై యున్నది. తక్కిన వివిధపరిశిష్టములవలెనే యిదియు నర్వాచీనమే కాని కాత్యాయనకృతము గాదని చెప్పవలసియున్నది. ఋక్ప్రాతిశాఖ్యమునకు వ్యాఖ్య రచియించిన యువ్వటాచార్యుఁడే యీ ప్రాతిశాఖ్యకు మాతృమోద మను పేర భాష్యము రచియించెను. ఉవ్వటుఁ డానందపురవాస్తవ్యుఁడు వజ్రటపుత్త్రుఁడు. ఇతఁడు ప్రతిజ్ఞాసూత్రపరిశిష్టమునకుఁ గూడ వ్యాఖ్య వ్రాయుచు నది కాత్యాయనకృత మైనట్లు ప్రశంసించుటచూడఁ బరిశిష్టముగూడఁ గాత్యాయనుఁడు రచియించెనేమో యని సంశయము గలుగకపోదు కాని యతనినాఁటికే స్థిరపడినయట్టిలోకప్రతీతియే యీ ప్రశంసకుఁ గారణ మనుట సముచితము. ఇందు పేర్కొనఁబడిన యాచార్యులు:—

కణ్వుఁడు - శాకటాయనుఁడు - శాకల్యుఁడు - కాశ్యపుఁడు - జౌపశలి - శౌనకుఁడు - దాల్భ్యుఁడు - జాతుకర్ణ్యుఁడు - గార్గ్యుఁడు - అనువారు. పాణిని పేరు కనఁబడదు గాని యతని యష్టాధ్యాయిలోని 'ఉచ్చై రుదాత్తః నీచై

1. తై. ప్రా. 5-1 ; 4·40, ఇత్యాదులు.

రనుదాత్తః ' ఇత్యాదిసూత్రములు గొన్ని యిందుగలవు. అష్టాధ్యాయి సాధిం పనియనేకశబ్దముల సాధుత్వమునకు వార్తికములు రచియించి పాణినీయము పూరించిన యీకాత్యాయనముని పాణిన్యాచార్యులకుఁ బరుఁ డనుట విదితమే కదా! ఇతఁడు పెక్కుస్థలములందు వ్యాకరణకార్యములకై శాకటాయనమతము గ్రహించియున్నాఁడు. ఇతఁడు పదములకు గోత్రములను దేవతలను నిర్ణయిం చుచు, భరద్వాజదృష్టము లైన యాఖ్యాతములు భారద్వాజగోత్రములు లేక భారద్వాజనగోత్రములు ననునట్లు ద్వివిధముగా, ఆఖ్యాతము భారద్వాజన గోత్రము - నామము భార్గవసగోత్రము - ఉపసర్గము వసిష్ఠసగోత్రము - నిపాతము కాశ్యపసగోత్రము - అని నిర్వచించెను[1]. ఈప్రాతిశాఖ్యము మాధ్యం దినశాఖ కెక్కువగా సంబంధించిన దని, ఉవ్వటాచార్యుఁడు సమర్థించి యుండెను. కాని, యీప్రాతిశాఖ్యకే కాణ్వశాఖీయ సమ్మతముగా భాగీరథీనాగదేవ భట్టుల పుత్రుఁడైన యనంతభట్టు మఱియొకభాష్యము రచియించియుండెను. పరిమాణ మునఁ బెద్ద దయ్యు నర్వాచీన మైన యీభాష్యము ముద్రిత మైనదిగాఁ గనఁ బడదు. ఆఖ్యాతనామోపసర్గనిపాతములు క్రమముగా సోమవాయ్వగ్ని వరుణ దేవతాకము లనుచు, వేదశబ్దము లుపాసించుపురుషుఁడు తదర్థ మెఱుఁగక పోయి నను ఫలము గాంచు నని యితనిమతము. దీనినిబట్టియే యితఁడు మిక్కిలి యర్వాచీనుఁ డని తెలియుచున్నది. ఇతఁడు కాణ్వశాఖుల కిట్లు విన్నవించు చున్నాఁడు.

'అసాధు సాధు వా పద్యం గ్రంథే ఽస్మిన్యన్మ యోదితమ్
తత్సర్వం క్షమ్యతాం సన్తః శ్రీమన్తః కాణ్వశాఖినః'

తక్కినప్రాతిశాఖ్యలవలె స్వరవర్ణసంధ్యాదులనే యిది వివరించినను, ఇందలి విషయోపదేశము విస్పష్టమై కనవచ్చును.

అథర్వప్రాతిశాఖ్యము—ఇది కూడ శౌనకకృత మని యొక రనిరి గాని యుపలభ్యమానము లైనవ్రాతప్రతులనుబట్టి యతఁడు కర్తగాఁ గనరాఁడు. ఇది మూఁడుప్రపాఠకముల గ్రంథము. ఇందు ౨౨౧ సూత్రములు కలవు. ఇందు పదవిధి వర్ణలింగ స్వర విభక్తి వాక్య వర్ణలోప వర్ణాగమ హ్రస్వ దీర్ఘ ప్లుత చ్ఛందః ప్రభృతివిషయములు వివరింపఁబడినవి. ఇది గాక చతురధ్యాయిక యను మఱియొకగ్రంథము శౌనకీయముగా నున్నది. ఇం దొక్కొకటి నాలుగు పాదములు చొప్పున నాలుగధ్యాయములు కలవు. వివిధము లైనవ్యాకరణకార్య ములు తెలుపుచున్న యిది శౌనకవిరచిత మనియే కొందఱిమతము. ప్రాతిశాఖ్య ములకు 'పార్షదము' లను నామాంతరము కలదు.

1. శు. ప్రా. 8-50, 51.

3. ఛందస్సు—పింగళకృత మయినయిది పాణినీయ శిక్షాదులవలెనే వేదాంగముగా గణింపఁబడుచున్నట్లు దీని మొదటివాక్యమును బ్రహ్మయజ్ఞమునందు పఠించునట్టి సంప్రదాయమే చెప్పుచున్నది.

మ య ర స త జ భ న లగ సమ్మితం
భ్రమతి వాఙ్మయం జగతి యస్య
స జయతి పింగళనాగః
శివప్రసాదా ద్విశుద్ధమతిః।

ఇందలి మొదటిపాదము బ్రహ్మయజ్ఞమునఁ బఠింపఁబడుచున్నది. ఇందు మొదటి మకారాద్యక్షరము లెనిమిదియు మగణాదిసూచకములు. తరువాతివి రెండును లఘు గురు సూచకములు. ఏతాదృశ మైన ఛందోగ్రంథము రచియించినవాఁడు పింగళనాగుఁ డని తృతీయపాదమున గోచరించుచున్నది. దీనినిబట్టి పింగళచ్ఛంద స్సనెడిప్రతీతి కలిగినది. నిజ మరయఁగా నిందలివిషయము పాణినీయవిషయమువలెనే వైదికలౌకికములకు రెంటికిని సంబంధించినది గాని కేవలము వైదికచ్ఛందస్సులనే యనుసరించినది గాదు. అయినను, ఛందోగ్రంథములలో మొదటిదై వైదికవాఙ్మయసమనంతర మావిర్భవించిన దగుటచే నిది వేదాంగత్వము నార్జించుకొనఁ గలిగినది. నిజముగా వేదమునకు సంబంధించిన ఛందోలక్షణములు ఋక్ప్రాతిశాఖ్యము కడపటి మూఁడుపటలములందును, అథర్వప్రాతిశాఖ్యము తుదను, సామవేదీయనిదానసూత్రమందును, కాత్యాయనానుక్రమణియందును గూడఁ గనవచ్చుచున్నవి. మఱియు, ఏత త్సర్వంతు విజ్ఞేయం ఛందోభాషా మధీయతా' అనెడి తైత్తిరీయప్రాతిశాఖ్యతుది వాక్యమువలనఁ గూడ నానాఁటికే వైదికచ్ఛందస్సు సిద్ధమైనది కల దని విదిత మగును. ఇది యిట్లుండఁ బ్రాతిశాఖ్యలకు మున్ను ఛందోవిషయము బ్రాహ్మణములలో నందందు సూక్ష్మరూపమున నున్నట్లు ఛాందోగ్యములోని బ్రహ్మవిద్యాశబ్దమే చెప్పుచున్నది. ఛంద స్తత్త్వ మిట్టి దైనను వేదాంగ మనెడి యశస్సు పింగళచ్ఛందస్సునకు సంభవించిన దనుట సత్యము. పతంజలిమహర్షి దృష్టినిగూడ నాకర్షించిన యిది తొల్లి గొప్ప గౌరవము గాంచినట్లుగా నొకపరిశిష్టములోని:—

"బ్రాహ్మణా త్తండిన శ్చైవ పింగళా చ్చ మహాత్మనః
నిదానా దుక్థ్యశాస్త్రాచ్చ ఛందసాం జ్ఞాన ముద్ధృతం"

అను శ్లోకమువలనఁ దెలియుచున్నది. తండిబ్రాహ్మణమునుండియు, సామవేదీయ మైన నిదానసూత్రమునుండియు, పింగలచ్ఛందస్సునుండియు, ఛందోజ్ఞాన ముద్ధరింపఁబడిన దనుదీనిభావమునుబట్టి బ్రాహ్మణకాలమున ఛందోలక్షణము గల దనియే కాక, పింగళచ్ఛందస్సునకు, తాండ్యబ్రాహ్మణగత ఛందస్సుతోను

నిదానసూత్రగతచ్ఛందస్సుతోను సమానప్రతిపత్తి కల దని కూడ స్పష్ట మగు చున్నది. ఆగౌరవమే దీనిని వేదాంగముఁగా గణింపఁజేసిన దనుట నిజము.

ఇది యెనిమిదధ్యాయముల చిన్నసూత్ర గ్రంథము. ఇందలి విషయ మంతయుఁ బదునెనిమిదివర్గములుగా విభజింపఁబడినది. తరువాత వెలువడిన ఛందశ్శాస్త్రమందలి యెల్లవిషయములకు నిందలి సూత్రములే ప్రధానబీజము లని యంగీకరింపవచ్చును. గణస్వరూపమును విశదీకరించుచు లోకప్రసిద్ధ మైన యాక్రిందిశ్లోకములు దీని యవతారికలోఁ గనవచ్చుచున్నవి.

దీర్ఘం సంయోగపరం తథా ప్లుతం వ్యంజనాన్త మూష్మాన్తమ్ ।
సానుస్వారం చ గురుం క్వచి దవసానేఽ పి లఘ్వన్త్యమ్ ॥
ఆది మధ్యావసానేషు య ర తా యాన్తి లాఘవమ్ ।
భ జ సా గౌరవం యాన్తి మనౌ తు గురులాఘవమ్ ॥

'త్రిగురుం విద్ధి మకార' మిత్యాదిగా నున్న యీ యవతారికలోని యాఱుశ్లోకములును దీనికి వ్యాఖ్యానము రచియించిన హలాయుధునివేమో యని సవ్యాఖ్యముగా దీనిని బ్రకటించినవీబరుపండితుఁడు సంశయించెను. అదియే నిజమైతే, అవతారిక మొదటిమాట యగు 'మయరసతజభనలగసమ్మిత'మ్మను దానిని జేర్చుకొన్నబ్రహ్మయజ్ఞపాఠ సంప్రదాయను హలాయుధవ్యాఖ్యకుఁ దరువాత బయలువెడలె నని చెప్పవలసివచ్చును. అది గాక కొన్నిప్రతులలో నధ్యాయవిభాగ మైనను గనరాదు గాని, అన్నిటియందును బదునెనిమిదివర్గముల విభాగము ప్రత్యక్ష మగుచున్నది. అం దీయవతారికయాఱుశ్లోకములు ప్రథమ వర్గముగా గణింపఁబడుచున్నట్లు 'మయుద్వాదశ - ధీఃపఞ్చదశ -' ఇత్యాది గ్రంథాంతానుక్రమణి తెలుపుచున్నది. కావునఁ బ్రథమవర్గ మైన యవతారిక మూలకర్తదే కాని వ్యాఖ్యాతది కా దని విశ్వసింపవచ్చును.

౪. నిరుక్తము - ఇది యాస్కముని ప్రణీత మైనమహాగ్రంథము. వేదాంగముగాఁ జేర్కొనఁబడునిరుక్తము దీనికంటె మఱియొకటి లేదు. వెనుకఁ జెప్పినట్లుగా బ్రాహ్మణములకాలమున దేవవిద్య యనుపేర సూత్రాకారముగా నున్ననిరుక్తమే యీ మహానిరుక్తమునకు మూలాధార మగుటచేఁ దద్వ్యాఖ్యరూప మైనయిది వేదాంగసంజ్ఞ చెందినది. దీని మొదటిసూత్రమగు 'సమామ్నాయః సమామ్నాతః' అనునది బ్రహ్మయజ్ఞమునఁ బఠింపఁబడు చున్నది. కశ్యపప్రజాపతి వేదములందలి దురూహము లైననపదముల నెల్ల నొకనిఘంటువుగాఁ గూర్చియుండ దానికి భాష్యముగా యాస్కమునీంద్రుఁ డీనిరుక్తము

రచియించినట్లు మహాభారతము చెప్పుచున్నది[1]. కాని, దీనిని బలపఱుచునట్టి ప్రమాణాంతరము గనరామిం జేసి యిది ప్రక్షిప్త మనఁదగియున్నను, యాస్కునిపేరు మాత్రము కొన్ని ప్రాచీనగ్రంథములందు గలదు.

బృహదారణ్యమందును[2] శతపథబ్రాహ్మణమందును గూడ వంశక్రమములలో "ఆసురాయణాచ్చ యాస్కాత్" అనుమాట లున్నవి. ఇందు మొదటిది విశేషణ మగుటను బట్టి యాస్కుఁ డాసురిమునీంద్రుని పుత్రుఁ డనీ తోఁచుచున్నది. నిరుక్తపరిశిష్టాంతమందలి 'పారస్కరాయ నమోయాస్కాయ' అనుపదములలోని మొదటిది యాస్కుఁడు పారస్కరదేశీయుఁ డని తెలుపుచున్నది. పాణినిసూత్రమందు గూడఁ గనిపించునీపదము[3] దేశపర మని భగవత్పతంజలియు భట్టోజీదీక్షితులును గూడ వ్రాసియున్నారు. 'ఉరో బృహతీ యాస్కస్య' అనుఛందస్సూత్రమునుబట్టి యాస్కుఁడు పింగళాచార్యునికి సమకాలికుఁడో పూర్వుఁడో యని యూహింపవచ్చునుగాని, ఇం దుదాహృతుఁ డైన యాస్కుఁడు మననిరుక్తము రచియించినవాఁడు కాఁ డేమో యని సంశయింపవలసియున్నది. ఇది యిట్లుండ నిరుక్తకారయాస్కుఁడు పాణినికిఁ బూర్వుఁడా పరుఁడా యని రాధ్ - గోల్డుస్టక్కరు - వీబరు - మాక్సు ముల్లరు - మొదలగు పండితులు చర్చించి తుదకుఁ బాణినికంటెఁ బూర్వుఁడే యని సిద్ధాంతీకరించి యున్నారు. 'పాణిని' అనుగ్రంథము ప్రకటించిన వీబరుపండితుఁడు పాణినికంటె యాస్కుఁడు పరుఁ డని నిర్ణయించి యున్నాఁడు. ఎ. బి. కీతుపండితుఁడు, పాణిని శౌనకులకంటె యాస్కుఁడు పూర్వుఁడని నిర్ణయించెను[4]. ఇందు నెక్కుండ్రమత మంగీకార్య మనఁదగునుగాని యెట్లయిన నిది సందిగ్ధముగానే యున్నది. ఇవుడు వీరిపౌర్వాపర్యమును జర్చింపఁ బూనితి మేని గ్రంథవిస్తర మగును గావున సందిగ్ధాంశములు గొన్ని మాత్రము చూపెదను.

శాకటాయనాదివైయాకరణుల నుదాహరించిన నిరుక్తము పాణినిపేరెత్తలేదు. వారిని బేర్కొన్నయష్టాధ్యాయి యాస్కుని జూపలేదు. 'యస్కాదిభ్యో గోత్రే' అనుసూత్రమందు[5] యస్కశబ్దము గనవచ్చునుగాని యిది

1. తస్మా ద్వ్రైపాకపిం ప్రాహ కశ్యపో మాం ప్రజాపతిః।
స్తుత్వా మాం శిపివిష్టేతి యాస్కఋషి రుదారధీః।
మత్ప్రసాదా దధో నష్టం నిరుక్త మభిజగ్మివాన్. శాం. ప. 342. అ.
2. బృ. ఉ. 6-3.
3. పారస్కర ప్రభృతీనిచ సంజ్ఞాయామ్. అష్టా-6-1-157.
పారస్కరో. దేశః. మ - భాష్య - పారస్కరః కిష్కిన్ధా. సి. కౌ.
4. ఐ. ఆరణ్యక పీఠిక.
5. అష్టా 2-4-63.

నిరుక్తకారయాస్కు నుద్దేశించినదగునో కాదో! పర స్సన్నికర్ష సంహితా' యనెడి యష్టాధ్యాయిలోని సూత్రము[1] నిరుక్తములోఁ గనవచ్చును గాని[2], యిది దానినుండి దీనిలోనికి వచ్చెనో దీనినుండి దానిలోనికి వెళ్ళెనో లేక, రెంటిలోనికిఁ గూడ మఱియొక దానినుండి వచ్చెనో! పాణినిసూత్రములు కొన్ని కాత్యాయన ప్రాతిశాఖ్యలోఁ బాణినిపేరు లేకుండఁ గాత్యాయనుఁడు రచియించినట్లే యున్నవి. అయితే, కాత్యాయనుఁడు పాణిని తరువాతివాఁ డని విస్పష్టముగాఁ దెలియుచున్నది కావున నక్కడ సందేహింపవలసినపని లేకపోయినది గాని యిక్కడ నట్టి నిర్ధారణ లేదు. పాణినికిఁ బూర్వ మనేకులు వ్యాకరణ కర్తలున్నట్లు తెలియవచ్చుటచే నీసూత్రము వారిలో నెవరి దైన నై యుండ వచ్చును. ఇది యిట్లుండ, ఉపసర్గనిరూపణమును, తదర్థనిర్వచనమును, నిరుక్తమందు సంకుచితముగా నున్నవి[3]. అష్టాధ్యాయియందు విపులముగా నున్నవి. ఈ భేదమును బురస్కరించుకొని పాశ్చాత్యవిమర్శకులు, నిరుక్తకాలముకంటె నష్టాధ్యాయికాలమున నుపసర్గతత్త్వజ్ఞాన మభివృద్ధి చెందినది గావునఁ బాణిన్యాచార్యుఁడే పరుఁ డని నిర్ణయించిరి. తక్కినవానికంటె నిది కొంచెము ప్రబలహేతు వగును గాని, యిందు నొకవిశేషము కలదు. కేవలము వైదికములైనక్లిష్ట శబ్దములయర్థము నిర్వచింపఁబూనినవాఁడు యాస్కుఁడు. లౌకికవైదిక సామాన్యముగా నెల్లశబ్దముల కనుశాసనము చేయఁ బూనినవాఁడు పాణిని. కావున నుపసర్గ నిరూపణము సంకుచితముగానున్న దనుకారణమునుబట్టి యాస్కుఁడు పూర్వుఁడనుట యుచితము కా దని తోఁచుచున్నది. ఎట్లయినను, పూర్వులను గొందఱిని బేర్కొని కొందఱిని బేర్కొనక పోవుటయు, నొకదానిలోని వచనము లింకొకదానిలోఁ గనఁబడుటయు, శైలి కఠినముగానో సరళముగానో యుండుటయు, ప్రయోగముల వివిధరూపము లొకదానిలో నుండి యింకొక దానిలో నుండకపోవుటయు మొదలుగాఁ గల దుర్బల ప్రమాణములనుబట్టి పూర్వగ్రంథకర్తల పౌర్వాపర్యము నిర్ణయించుట సమంజసము కా దనక తప్పదు. ప్రకృత మైన యాస్కపాణినుల విషయ మట్టిది. కావున వీ రిరువురు వైయాకరణులై యాకాలముననే ప్రసిద్ధి కెక్కినవా రయ్యు నొకరి నొకరు పేర్కొనక పోవుటను బట్టి కొంచె మెచ్చుతక్కువగా సమకాలికులని నే నభిప్రాయపడుచున్నాను.

నిరుక్తము పన్నెం డధ్యాయముల గ్రంథము. అందు మొదటియాఱధ్యాయములు పూర్వషట్క మనియు, తరువాతి వుత్తరషట్క మనియుఁ బిలువఁబడుచున్నవి. ప్రత్యధ్యాయ మనియతసంఖ్య గల ఖండములుగా విభజింపఁబడినది. ఇందలి వన్నియు గద్యరూపసూత్రములు. దీనికి రెండధ్యాయముల

1. అష్టా 1-1-109.—2. నిరు 1-17.—3. నిరు. 1-3.

గ్రంథము పరిశిష్ట మనుపేర ననుబంధముగా ముద్రితమై యున్నది. ఈపదు నాలు గధ్యాయములకును భగవద్దుర్గాచార్యులు నిరుక్తవృత్తి యనుపేర ఋజ్వర్థ వ్యాఖ్య రచియించిరి. పరిశిష్టమునుగూడ యాస్కుఁడు రచించినట్లే కొందఱు భావింతురు గాని, దానికడపట నున్న 'నమః పారస్కరాయ నమో యాస్కాయ,' యనుదానినిబట్టి యతని శిష్యుఁడో లేక భక్తుఁడో దానిని నిర్మించియుండు నని నిశ్చయింపవచ్చును. ఈ నిరుక్తమున నీ క్రింది మునీంద్రులు పేర్కొనఁబడి యున్నారు.

శాకటాయనుఁడు - గార్గ్యుఁడు - కౌత్సుఁడు - ఔపమన్యవుఁడు - కాశి కుఁడు - పౌజవనుఁడు - శాకపూణి - స్థౌలాష్ఠీవి - ఔదుంబరాయణుఁడు - ఆగ్రా యణుఁడు - ఔర్ణనాభుఁడు - గాలవుఁడు - క్రౌష్టుకి - కాత్థక్యుఁడు-చర్మశిరుఁడు- తైత్తికి - వార్ష్యాయణి - శతబలాక్షుఁడు - మౌద్గల్యుఁడు - అనువారు

ఇందు మొదటిమూఁడధ్యాయములు నామాఖ్యాతోపసర్గనిపాతాదుల వివ రణముతోఁ గూడిననైఘంటుక కాండము. వేదములందలిక్లిష్టశబ్దములను వాని పర్యాయపదముల నొక్కొక్కసూత్రమునఁ జేర్చి వానియర్థములు నిర్వచించు నట్టి దగుటచే దీని కీపేరు పెట్టఁబడినది. ఇందు కొకయుదాహరణము. గౌః-గ్మా - జ్మా-క్ష్మా-క్షా-క్షమా-క్షోణిః-క్షితిః-మొద లగు నిరువదియొక్క పృథివీవాచక శబ్దము లొక్కచోఁ జేర్పఁబడినవి. 'దూరం గతా భవతి' దూరమును బొందినది కావున 'గౌః' లేక భూతజాతము దీనియందు నడచుచున్నది గావున 'గౌః' భూమి. ఇత్యాదిగా నిర్వచనము లుండును. ఇట్లే, ఏకార్థము గలయనేక శబ్దము లిందు చూపఁబడెను.

నాలుగైదాఱధ్యాయములు మూఁడును నైగమకాండ మనఁబడును. ఇం దనేకార్థకము లైనశబ్దములు చూపఁబడినవి. ఇందు కొకయుదాహరణము.

వృకశబ్దమునకు, చంద్రుఁడు వికృతజ్యోతిష్కుఁడు వివృతజ్యోతిష్కుఁడు ఆదిత్యుఁడు శ్వానము మొద లగు నర్థములు చూపఁబడినవి. పూర్వోక్తము లైన పర్యాయశబ్దములకును, ఈయనేకార్థములకును గూడ వేదమునుండి యుదాహర ణలు చూపఁబడెను. ఇది పూర్వపట్కము.

ఉత్తరషట్క మాఱధ్యాయములు దైవతకాండ మనఁబడును. ఇందు, ఇంద్రాగ్నివరుణాదిత్యాదిశబ్దముల వ్యుత్పత్తులు విశదీకరింపఁబడినవి. మొత్త మీ మూఁడుకాండములలో నుదాహరింపఁబడినవానిలోఁ బెక్కుమంత్రములు ఋగ్వే దములోనివి. మఱియుఁ గొన్నియుపాఖ్యానములు నితిహాసములును ఋగ్వేదాదు లనుండి యుదాహరింపఁబడినవి. వేదములందు గోప్యములుగా నున్నయనేకవిష యము లీనిరుక్తమున స్పష్టీకరింపఁబడినవి. ఇందు కొకయుదాహరణము.

ఋగ్వేదప్రథమమండల సప్తమానువాకమునందలి ద్వితీయసూక్తమునం దెక్కువగా నింద్రవృత్రవ్యాపారము వర్ణింపఁబడియున్నది. అందలి యింద్ర వృత్రశబ్దములకు బహువిధము లైనవ్యుత్పత్తులు చెప్పుచు నాఋక్కులయర్థము విడఁగొట్టుచు నీనిరుక్త మావిషయ మిట్లు వర్ణించినది[1].

"అయితే, వృత్రుఁడెవఁడు? మేఘుఁ డని నైరుక్తులందురు. త్వష్టకొడు కైనయసురుఁ డని నైతిహాసికు లందురు, నీళ్లును జ్యోతిస్సును గలియుటచే వర్షము పుట్టుచున్నది. వాటికి రూపకల్పన చేయుటచే నింద్రవృత్రులయుద్ధవర్ణనలు సంభవించినవి" అనఁగా జలరూపుఁ డైనమేఘునకు వృత్రరూపమును వైద్యుతజ్యోతిస్సున కింద్రరూపమును గల్పించి వా రిద్దఱికి యుద్ధము జరిగినట్లుగా నైతిహాసికులు వర్ణించి రని భావము. మారుతావేష్టిత మైనయింద్రాఖ్యవైద్యుతజ్యోతిస్సుచే వృత్రాఖ్యుఁ డైనమేఘునియుదరమందలి జలములు తాడ్యమానములై వర్షభావము పొందుచున్నవి గాని యిక్కడ నిజ మైనయుద్ధము లేదు. కావున వృత్రుఁ డనఁగా మేఘుఁడే యనియు నింద్రుఁ డనఁగా జ్యోతి స్సనియు నిక్కడ సర్థ మని ఋజ్వర్థవ్యాఖ్య వివరించినది. ఇట్లనేకసందర్భములం దిట్టివిశేషము లెన్నో యిందు గనిపించును. బ్రాహ్మణములు కొంత సహాయపడినను, వేదమునకు వ్యాకరణముగాను నిఘంటువుగాను భాష్యముగాను గూడ నున్నయీనిరుక్తము మిక్కిలి చేదోడు వాదోడు నగుటచేతనే భాష్యకర్తలు వేదములయర్థము వివరింపఁ గలిగి రనుటకంటె దీని మహత్త్వమును వేఱుగాఁ బొగడఁజాలము. ఈసందర్భమున దీని యర్థము తేటతెల్లము గావించినఋజ్వర్థవ్యాఖ్యగూడ నత్యంతము ప్రశంసనీయ మగును.

౬. జ్యోతిషము.—లగధుఁ డనుముని రచియించినట్లుగా నలువదిమూఁడు శ్లోకములపరిమితి గల చిన్నగ్రంథ మొకటి వేదాఙ్గజ్యోతిష మనుపేర గణింపఁబడుచున్నది. ఇందుకు బ్రహ్మయజ్ఞమందు దీనిమొదటిదగు 'పఞ్చసంవత్సరమయ' మ్మనుమాట పఠింపఁబడుట యొకతార్కాణము, కాని, జ్యోతిశ్శాస్త్రవిజ్ఞాన మనునది సంహితాబ్రాహ్మణముల కాలములందే యంకురించి క్రమముగా విస్తృతి చెందిన దనియు, ఛాందోగ్యములోఁ జెప్పినట్లుగా నిది రాశి దైవ నక్షత్ర విద్య లనుపేరఁ బరఁగుచుండెడి దనియు మనము చదివియున్నాము. దాని ప్రత్యేకరూపమే యీచిన్నగ్రంథము. అయినను, జ్యోతిషగ్రంథములలో మొటటి దగుటచే నిది వేదాంగములలోఁ గణనీయ మైనది. తరువాత నిందలి విజ్ఞానమే వరాహ మిహిరాది మహాప్రతిభాశాలులవల్ల మహాశాస్త్రరూపము దాల్చినది. దీని వ్రాఁతప్రతులలో.

---

1. నిరు. 2-16.

'ప్రణమ్య శిరసా కాల మభివాద్య సరస్వతీమ్ ।
కాలజ్ఞానం ప్రవక్ష్యామి లగధస్య మహాత్మనః'

అనుశ్లోకము కనవచ్చుచున్నది గాని, యన్యుఁడు చెప్పినట్లుగా నున్న యిది సభాష్యముగా ముద్రిత మైనయాజుష గ్రంథమున లేదు. ముద్రిత మైన యార్చజ్యోతిషమం దున్నది గాని, దీనియచ్చటిస్థితి ప్రామాదిక మని స్పష్టపడు చున్నది. లగధుని కాలజ్ఞానమును జెప్పుచున్నా ననుటయే యీ శ్లోకము లగధు నిది కా దనుట కవకాశ మిచ్చుచున్నది. ఇట్టి ప్రక్షిప్తము లీ చిన్న గ్రంథమున నింకను గలవు.

'వేదములు యజ్ఞములకొఱకు కుత్పన్నము లైనవి. యజ్ఞము లాయా యుక్తకాలములందు విహితము లగుచున్నవి. కావున, కాలవిధానశాస్త్ర మైన యీజ్యోతిష మెఱిఁగినవాఁడు యజ్ఞ మెఱిఁగినవాఁడే' అని దీనిఫలము చెప్పిన యీగ్రంథము దిన మాసాయన నక్షత్ర సంవత్సరాది విజ్ఞాన ముపదేశింపఁ బూనిన దని యీకడపటి శ్లోకమునఁ దెలియుచున్నది.

ఇ త్యేతన్మాస వర్షాణాం ముహూర్తోదయపర్వణామ్ ।
దిన ర్త్వయనమాసానాం వ్యాఖ్యానం లగధోఽబ్రవీత్ ॥"

ఇట్టి యీ గ్రంథమును యజుర్వేదీయులు యజుర్వేదాంగముఁగాను, బహ్వృచులు ఋగ్వేదాంగముఁగాను భావించియున్నారు. అందుచే దీనికి యాజు షజ్యోతిష మనియు, ఆర్చజ్యోతిష మనియు, ద్వివిధ మైనవ్యవహారము కలిగినది. ఇందు మొదటిదానికి సోమాకరుఁడు సుధాకరుఁడు ననువారు భాష్యములు రచించిరి. రెండవదానికి సుధాకరుఁడు మాత్రము భాష్యము రచించెను. సుధాకరుఁడు వ్రాసినయాజుషార్చజ్యోతిష భాష్యముల కతని శిష్యుఁడు మురలీధరుఁడు లఘు వివరణము వ్రాసెను. ఈవ్యాఖ్యానము లన్నిటితోఁ గూడినయీగ్రంథము కాశీ నగరమున ముద్రి మైనది. అయనములను దెల్పునిందలి శ్లోక మొకటి యుదా హరించుచున్నాను.

'ప్రపద్యేతే శ్రవిష్ఠాదౌ సూర్యాచంద్రమసా వుదక్,
సార్పార్ధే దక్షిణార్క స్తు మాఘ శ్రావణయో స్సదా'

సుధాకరుఁడు వ్రాసిన దీనిముఖ్యతాత్పర్యమిది. "మాఘమున ధనిష్ఠా గతుఁ డగుటచే సూర్యుని కుత్తరాయణమును, ఆశ్లేషార్ధగతుఁడై కర్కిరాశిగతుఁ డగుటచే శ్రావణమాసమున దక్షిణాయనమును గలుగును" ఇట్లున్న యీగ్రం

థము తరువాత విస్తరించిన శాస్త్రమునకుఁ గావలసిన బీజము లన్నియు నాటిన దనుట వాస్తవము.

౬. కల్పము.—కల్పసూత్రము లనఁబడు నీవేదాఙ్గము వైదికవాఙ్మయమున విశేషస్థల మాక్రమించి యున్నది. వేదోక్తము లయినయజ్ఞ యాగాది వివిధకర్మముల యాచరణమును ససాకల్యముగా విశదీకరించుచున్నయిది యాజ్ఞికుల కత్యంతోపయోగకారియై వైదికకర్మస్వరూప సందర్శనమున కాదర్శమై వెలయుచున్నది. అట్టి యీకల్పసూత్రములనుగూర్చి సూత్రము లనుశీర్షిక క్రిందఁ బరిశీలింతము.

## సూత్రములు.

వైదికవాఙ్మయమునకు సంబంధించినసూత్రములు కల్పసూత్రము లనియు గృహ్యసూత్రము లనియు ధర్మసూత్రము లనియుఁ ద్రివిధముగా నున్నవి. అన్నిటికిని గూడ మొత్తముగాఁ గల్పసూత్రము లనుపే రున్నను, ఈ పేరు శ్రౌతసూత్రము లకు స్థిరపడినది. ఈశ్రౌతసూత్రములు ఋక్సామకృష్ణ శుక్లయజు రథర్వశాఖాభేదమున నన్నివేదశాఖలకు సంబంధించి యైదువిధములుగా నున్నవి.

సంహితాబ్రాహ్మణములందలిజ్ఞానకాండ మును బ్రతిపాదించునుపనిషత్తులు శ్రుతిసంజ్ఞను జెంది యపౌరుషేయములలోఁ జేరినవిగాని వీనివలెనే వేదముల యంశలికర్మకాండమును బ్రతిపాదించునవి యైనను, శ్రుతిసంజ్ఞను జెందక శ్రుత్యుక్తధర్మాధర్మములను వివరించుచున్నయీసూత్రములు శ్రౌతములై పౌరుషేయము లైనవి. నాస్తిక మైనబౌద్ధమత మావిర్భవించినకాలమందు వైదికమతావలంబు లగువిద్వాంసులు మేల్కొని బౌద్ధమతము వ్యాపింపకుండుటకును వైదికమతము సంరక్షించుటకును గర్మకాండమును జక్కఁగా విశదీకరించుచు శ్రౌతసూత్రములు రచించి యుందు రని మాక్డొనలు మొదలగుపాశ్చాత్యు లూహించియున్నారు. వేదోక్తయాగాదికర్మాచరణము బౌద్ధమతావిర్భావకాలమందే తల యెత్తె నని నిశ్చయింపఁగలిగినచో వారియూహ సముచితమై యుండెడిదిగాని యది సాధ్య మైనదిగాదు. ఋగ్వేదసంహితకు మున్నె యార్యులు క్రతువు లాచరించెడివా రని ఋక్సంహితవల్లఁ దెలియుచున్నది సామయజుస్సంహిత లత్యంతము యాగబోధకములే కాని యన్యములు కావు. బ్రాహ్మణము లన్నియుఁ గర్మకాండమునే ప్రతిపాదించుచున్న వని వారే యంగీకరించుచున్నారు. అట్టియెడ బౌద్ధమత మంకురించిన దనుభయముతో నంతకు మున్ను లేనియేకర్మకాండమును గ్రొత్తగా శ్రౌతసూత్రములు తెచ్చి పెట్టినవో యూహింప నలవి గాకున్నది. నిజ మరయఁగా వైదికమతమునకుఁ బ్రతిపక్షిగా

బౌద్ధమతము బయలుదేఱినది కాని, దాని నణఁగించుటకు వైదికమతము గావించిననూతనప్రయత్న మేమియు నాకాలమునఁ గనిపించదు. ఇఁకనో మంత్రములందు చెల్లాచెదరుగా నున్న యాగాదికర్మ విషయమును బ్రాహ్మణములు కొంతవఱకు విశదపఱిచినవి. అందు నింకను దురవగాహములుగా నున్న విషయములతో యాజ్ఞికప్రయోగము నంతను సక్రమముగా సూత్రములు నిరూపించినవి. ఈ పద్ధతి వైదికవాఙ్మయములందు సర్వవిషయములకు సాధారణమైనదే. నిజమిదియై యుండఁగా వైదికవాఙ్మయమందలి వివిధగ్రంథములకాలములను గ్రమముగాఁ గ్రిందికి దిగలాగుయత్నమునకు సరిపుచ్చునుద్దేశముతోఁ గల్పసూత్రములకును బౌద్ధమతమునకును ముడిపెట్టిన వారి యూహలు సందర్భోచితములెట్లగును ?

కల్పసూత్రము లన్నియు నాయాశాఖల బ్రాహ్మణముల ననుసరించి యావిర్భవించినవి. ఇవి యజ్ఞములందు హోత ఉద్గాత అధ్వర్యుఁడు మొదలగు ఋత్విజులు చేయుకార్యములను బోధించు ప్రయోగశాస్త్రములు. "కల్పసూత్రములు ప్రతిశాఖకు వేఱుగాకపోయినను, కొన్ని శాఖలయెడ నధ్యయనాదిభేదమున వేఱుగాఁ గనవచ్చుచున్న' వని హిరణ్యకేశిసూత్ర వ్యాఖ్యానమున మహాదేవ పండితుఁడు చెప్పినట్లుగా వీనియందలి ముఖ్యవిషయ మంతయు సర్వసాధారణముగానే యుండును. అయినను, శాఖాభేదమునుబట్టి సూత్రభేదమును వ్యాప్తి గాంచినది. అట్లయ్యును, శాకలబాష్కలశాఖలు రెంటికి నాశ్వలాయనసూత్ర మొకటే యనియు, కాణ్వమాధ్యందినశాఖలు రెంటికిని కాత్యాయనసూత్ర మొకటే యనియు, తైత్తిరీయశాఖయందు మాత్రము నానాసూత్రములు గలవనియు, సూత్రభేదశాఖాభేదములు పరస్పరాశ్రయములై యున్న వనియు నీమహాదేవపండితుఁడే వచించి యున్నాఁడు. ఆశ్వలాయన సూత్రవృత్తికారుఁడగు నారాయణగార్గ్యుఁడు కూడ నారంభమందు 'నివి త్ప్రైషపురోరుక్కున్తాప వాలఖిల్య మహానామ్న్యైతరేయ బ్రాహ్మణ సహితములైన శాకల బాష్కలామ్నాయములు రెంటికి నాశ్వలాయనసూత్రమే ప్రయోగశాస్త్ర మని వచించియున్నాఁడు[1]. వీరిమాటలనుబట్టి బ్రాహ్మణముల ననుసరించి సూత్రములావిర్భవించిన వనియు, ఒక్కొక్కవేదమునకు సంబంధించిన కొన్నికొన్ని శాఖల కొక్కటియే సూత్ర మన్నదనియు తైత్తిరీయమున నధికముగాఁ గల వనియుఁ దెలియుటయే కాక, గార్గ్యునిమాటవల్ల ఋక్శాఖలకు మన మెఱుఁగని బ్రాహ్మణములు గూడఁ గల వని తెలియుచున్నది.

శ్రౌతసూత్రముల పౌర్వాపర్యనిర్ణయము సులభము కాదు. ఈవిషయమునఁ బాశ్చాత్య పరిశోధకులును సందిగ్ధాభిప్రాయములే యిచ్చియున్నారు.

---

1. ఆ. శ్రౌ. వృ. 1-1-1.

ఋగ్వేదసర్వానుక్రమణీవృత్తి వ్రాసిన షడ్గురుశిష్యుఁడు దాని యవతారికలో "శౌనకస్యతు శిష్యో ఒభూ ద్భగవా నాశ్వలాయనః" అని పలికియున్నాఁడు. ఇది యాధారముగా, ఆశ్వలాయనుఁడు శౌనకునిశిష్యుఁ డని యొకప్రతీతియు, ఐతరేయారణ్యకములోని పదియేనువాక్యముల నాల్గవయధ్యాయము నాశ్వలాయనుఁడు రచియించె నని మఱియొక ప్రతీతియు బయలుదేఱినవి. కాత్యాయనముని ప్రశంస కవతరించిన షడ్గురుశిష్యుని యవతారికలోని విషయ మేమాత్రము విశ్వసనీయ మన్నను, శౌనకాశ్వలాయనకాత్యాయనులు ముగ్గురును గొంచెమెచ్చుతక్కువగా సమకాలికు లనిచెప్పవలసివచ్చును. ఇది మిక్కిలి యసంగతము. మాక్సిముల్లరుపండితుఁడు గూడ నీయవతారికా విషయము చర్చించి యిది యసంగత మనెడి యభిప్రాయమే తేల్చెను[1]. ఇది గాక, ఆశ్వలాయనుఁడు తన సూత్రము కడపటియధ్యాయమున "అపి నానా గోత్రా స్స్యు రితి శౌనకః" అని శౌనకుని పే రెత్తుచు, గురుత్వసూచక మైనయాచార్యపద మయినఁ బ్రయోగింపలేదు. సూత్రాదిగ్రంథకర్త లందఱును గురువుమతము తెల్పునపుడు 'ఇత్యాచార్యాః' అనుచు వచ్చిరి గాని, గురువుపే రెవరును గ్రహించి యుండలేదు. ఇతఁడు పే రెత్తియుఁ బైగా నాచార్యపద మైన నుపయోగింపలేదు. కావున మొదటిప్రతీతి నమ్మఁదగినది కాదు. ఇదియే యిటు లుండ మిక్కిలి నిరాధార మైన రెండవప్రతీతి విశ్వసనీయము కా దని వేఱుగాఁ జెప్ప నేల? అయినను శౌనకుని బేర్కొన్న యాశ్వలాయనుఁ డతనికంటె నర్వాచీనుఁ డనుట సమ్మతమే యగును. ఇఁక నీ శౌనకుఁ డెప్పటివాఁ డనువిషయ మూహాలమీఁదనే నిలిచి యున్నది గాని సునిశ్చితము కాలేదు. ఎట్లయినను, ఆపస్తంబాశ్వలాయన బౌధాయనకాత్యాయనాది ప్రధానసూత్రకర్తలు క్రీస్తుపూర్వ మైదవశతాబ్ది కావలివారే కాని యీవలివారు కా రనుట సత్యము. ఇందాపస్తంబకాలమును జర్చించి సిద్ధాంతీకరించిన కొందఱి యభిప్రాయములను సంగ్రహించి చూపెదను.

పాశ్చాత్యపరిశోధకులలో డాక్టరుబుహ్లరు విశేషపరిశోధన చేసి, ఆపస్తంబుఁడు క్రీస్తుపూర్వము పంచమశతాబ్దికిఁ గూడఁ బరుఁడు గాఁ డనవచ్చు నని నిశ్చయించెను[2]. దానినే, సుదర్శనభాష్యముతో నీసూత్రము ప్రకటించినమహాదేవశాస్త్రిగారు బలపఱిచియున్నారు. హరదత్తసుదర్శనవ్యాఖ్యలతో నీసూత్రము ప్రకటించిన చిన్నస్వామిశాస్త్రిగారు పైమత మంగీకరించుచు నింకను వెనుకకుఁ బోఁదగినసూచనలు చేసియున్నారు.

అపాణినీయము లైనయార్షప్రయోగము లాశ్వలాయన బోధాయనాది సూత్రములలోఁ గూడఁ గొన్ని కలవు గాని యాపస్తంబసూత్రమున నట్టి

1. A. Sam. L. 122. P.

2. S. B. E. Vol II.

వెక్కువగాఁ గనవచ్చుచున్నవి. ఆపస్తంబుఁడు పాణినికిఁ దరువాతివాఁడే యైనచో "రాజా - వృషనామ్నాః - త్రిస్నాత్రైః - పుంస్వః" ఇత్యాదిపాణినీయవిరుద్ధప్రయోగములు[1] గావించి యుండఁ డనుట విశ్వసనీయము గావున నితఁడు పాణినికిఁ బూర్వుఁ డని యూహింపవచ్చును. పాణిని సప్తమశతాబ్దికిఁ దరువాతివాఁడు కాఁ డనుట వెక్కండ్రువిమర్శకుల యభిమతము గావున నంతకు మున్నే యాపస్తంబుఁ డుండె ననుట భావ్య మగుచున్నది.

ఇది యిట్లుండ, ఆపస్తంబుఁడు బోధాయనశిష్యుఁడని వైదికసంప్రదాయ మొకటి ప్రసిద్ధమై యున్నది. దీని కాధారములు కనరావుగాని, గృహ్యసూత్రములో బోధాయనుఁడు చెప్పని నాకబలి మొదలగు కొన్నిటి నాపస్తంబుఁడు చెప్పుటయు, శ్రౌతసూత్రములో బోధాయనుఁడు 'ఇషే త్వోర్జే త్వా, శాఖా మాచ్ఛినత్తి' అనిచెప్పి యుండ, ఆపస్తంబుఁడు "ఇషేత్వా, శాఖా మాచ్ఛినత్తి" అని మంత్రమును విభజించుటయు నతనికంటె నితఁడు పరుఁ డగుటకు హేతు వఁట. కాని యీమతభేదము వీరి పౌర్వాపర్యము నిర్ణయింప ననుకూలము కాదు సరిగదా, ఇదియే వీరిగురుశిష్యభావమున కెంతయుఁ బ్రతికూల మగుచున్నది. ఇంతకును బోధాయనుఁ డాపస్తంబుని తరువాతివాఁ డని ముందు తెలియఁ గలదు గాని, ఎట్లయినను, ఆశ్వలాయన శాంఖాయనులలో నెవరు పూర్వు లనుటయు, శ్రౌతసూత్రకర్త లందఱిలో నెవరు మొదటివా రనుటయు, సందిగ్ధములుగానే యున్నవి.

ఈశ్రౌతసూత్రములవ్యాఖ్యానములలో నొకవంతు ముద్రితము లైనవి. మూఁడువంతు లముద్రితము లై ప్రచారము లేక దేశమున యజ్ఞయాగాదులు క్షీణించుచున్నట్లే క్షీణించుచు, తంజావూరు మదరాసు పుస్తకభాండాగారములలో నణఁగియున్నవి. శ్రౌతగ్రంథము లన్నియు సంహితాబ్రాహ్మణములు ప్రతిపాదించిన యాగములందు మంత్రవినియోగ ముపదేశించు ప్రయోగ శాస్త్రము లని ముందే తెలిసికొనియున్నాము గావున నిఁక వానిస్వరూపము సంగ్రహముగాఁ బరిశీలింతము.

ఋగ్వేదీయశ్రౌతసూత్రములు:—శౌనకుఁ డొకసూత్రము రచియించి నట్లు వినిపించును గాని యది కనిపించదు. ఈశాఖకు సంబంధించినవి, ఆశ్వలాయననిర్మితమును, శాంఖాయనకృతమును బ్రసిద్ధములై యున్నవి. ఇందు మొదటి దైతరేయబ్రాహ్మణము ననుసరించినది. అది పండ్రెండధ్యాయములు. రెండవది కౌషీతకి బ్రాహ్మణము ననుసరించినది. అది పదునెనిమిదధ్యాయములు. అందు కడపటియధ్యాయములు తరువాత నెవరో చేర్చినవి గాని శాంఖాయనకృతములుగా వని యూహింపఁదగియున్నది. ప్రయోగవిషయమున నీ రెండుసూత్రములు

1. ఆ. గృ. ఖం. 3.12 ; 3-13 : 9.5, 6-11 ;

సమానముగానే యున్నవి కాని, శాంఖాయనసూత్రములో క్షత్రియోచిత యాగములు సవిస్తరముగాఁ బ్రతిపాదింపఁబడినవి. శౌనకాయనసూత్రము మఱి యొకటి యున్నట్లు మాక్సిముల్లరు వ్రాసియుండెను గాని, అది నాకు లభింపలేదు.

ఆశ్వలాయనశ్రౌతసూత్రమునకుఁ దొలుత దేవస్వామి, అనాకుల మను పేరు గలభాష్యముఁ రచియించినట్లును, దాని ననుసరించి తాను వృత్తి నిర్మించి నట్లును నారాయణగార్గ్యుఁ డిట్లు చెప్పియున్నాఁడు.

"ఆశ్వలాయనసూత్రస్య భాష్యం భగవతా కృతమ్
దేవస్వామి సమాఖ్యేన విస్తీర్ణం స దనాకులమ్
తత్ప్రసాదా న్మ యేదానీం క్రియతే వృత్తి రీదృశీ
నారాయణేన గార్గ్యేణ నరసింహస్య సూనునా"

వీరు గాక, యీ సూత్రమునకు సిద్ధాంతి, మద్గురుశిష్యుఁడు నను వారు వ్యాఖ్యలు రచియించిరి. తరువాత నీసూత్రమునకు విష్ణుభట్టు తాలవృంతనివాసి త్రైవిద్యవృద్ధుఁడు ననువారు ప్రయోగవృత్తులు వేఱుగా రచియించిరి. ఈ రెండవ యతఁడు శ్రౌతవిషయమున వివిధసూత్రములకుఁ బ్రయోగవృత్తులు ప్రయోగ దీపికలు రచియించినవాఁడు. ఇతఁ డన్ని గ్రంథములలోను:—

"ఏషా త్రైవిద్యవృద్ధేన తాళవృంత నివాసినా
సోమపేన కృతా వృత్తిః"

అని వ్రాసికొనెను. కొన్నిలిఖితపుస్తకములలో, 'తాళబృందనివాసినా' అని యున్నది. ఎట్లయిన నిందలి మొదటిమూఁడుపదములు విశేషణములుగానే కనవచ్చుచున్నవి గాని, యం దొకటి విశేష్య మనుట నిశ్చయము. కొందఱువ్యాఖ్యాతపేరు తాళవృంతనివాసి యని నిర్ణయించిరి గాని తాళవృంతశబ్దము గ్రామపరముగాఁ గనఁబడుచున్నది. సోమపశబ్దము సోమయాజి యనిమాత్రమే చెప్పును. కావున మూఁడువేదము లెఱిఁగిన వాఁ డగుటచే వచ్చిన త్రైవిద్యవృద్ధుఁ డనుబిరుదనామమే యతనిపేరుగా స్థిరపడుటచే నతఁడు దానినే వాడుకొనె నని తోఁచినది.

ఇఁక నీసూత్ర మాధారముగా బయలుదేఱిన శ్రౌతగ్రంథము లసంఖ్య ముగా నున్నవి. తెలిసినంతవఱకు వాని నిందు పేర్కొనుచున్నాను.

ఆధానాదిప్రయోగము ఆధానపశాత్రప్రయోగము బ్రహ్మత్వ ప్రయోగము ప్రవాసవిధిప్రయోగముఁ ప్రాయశ్చిత్తప్రయోగము ప్రాయశ్చిత్తికుతూహలము అగ్నిష్టోమప్రాయశ్చిత్తము ప్రయోగదీపిక ప్రవాసోపస్థానహవిర్యజ్ఞ ప్రాయశ్చిత్తము సర్వపృష్ఠాప్తోర్యామ సత్త్రపశాత్ర ప్రయోగము సర్వపృష్ఠాప్తోర్యామాద్గాత్రప్రయోగము శ్రౌతప్రయోగవృత్తి శ్రౌతప్రాయశ్చిత్తియోగము

కూష్మాండహోమప్రయోగము గణహోమ ప్రయోగము కుండలేష్టిప్రయోగము జాతేష్టిప్రయోగము తైత్తిరిధాతవీయేష్టి ప్రయోగము పౌండరీక హౌత్రప్రయోగము మొదలయినవి. శాంఖాయనుఁడు మహాకౌషీతకిమతము ననుసరించి జ్యోతిష్టోమ పద్ధతి యను గ్రంథము రచియించిన ట్లొకచోటఁ గనవచ్చుచున్నది.

శాంఖాయనసూత్ర ప్రయోగమునెడ బ్రహ్మదత్తమత మొకటి ప్రాచీన మైనది కలదని, దానిని విని యీసూత్రమునకుఁ బద్ధతి వ్రాసిన శివపురగ్రామ నివాసి యగు పూర్వోక్తనారాయణ గార్గ్యుని యీక్రింది వచనము చెప్పుచున్నది.

బ్రహ్మదత్తమతం సర్వం సంప్రదాయ పురస్సరమ్
శ్రుత్వానారాయణాఖ్యేన పద్ధతిః కథ్యతే స్ఫుటమ్ '

శాంఖాయనద్వాదశాహపద్ధతి యను మఱియొకవ్యాఖ్య రఘునాథాధ్వరి రచియించినది కనఁబడుచున్నది. ఇది పెద్దవ్యాఖ్య. దీనిమొదల నీశ్లోక మున్నది. "కౌషీతకిం ప్రణమ్యాదౌ మునిం శాంఖాయనం గురూన్, క్రియతే రఘునాథేన ద్వాదశాహస్య పద్ధతిః".

దీనినిబట్టి కౌషితకి శాంఖాయనుఁడని విదిత మగును. ఇందు ద్వాదశస్తుత్యాహదీక్షలు వివరింపఁబడినవి. ఇతరవ్యాఖ్యలింకే మయిన నుండవచ్చును.

సామవేదీయ శ్రౌతసూత్రములు.—ఇందు మశకాచార్యకృత మైన యార్షేయకల్పము మొదటిదని తోఁచుచున్నది. దీనివలెనే ద్రాహ్యాయణ లాట్యాయన కృతము లైన సూత్రములు రెండు ప్రసిద్ధములై యున్నవి. వీరు పెక్కండ్రు వ్యాఖ్యాతలస్తుతికిఁ బాత్రులైరి. ఇందు మొదటిదానికి వరదరాజును, రెండవదానికి ధన్వియు, మూఁడవదానికి అగ్నిస్వామియు వ్యాఖ్యానములు రచియించిరి.

ఈమూఁడుసూత్రములుగూడఁ దాండ్యబ్రాహ్మణమును, పంచవింశబ్రాహ్మణము ననుసరించినవే కాని యాగప్రయోగములను వివరించుటలో ద్రాహ్యాయణ సూత్రము రాణాయణీయశాఖను, లాట్యాయనసూత్రము కౌథుమశాఖ నాశ్రయించినవి. ఆర్షేయకల్పమందలి విషయము నీరెండుసూత్రము లనుసరించినట్లు వ్యాఖ్యాతలవాక్యసరణిని దెలియుచుండుట గూడ దానియాద్యత్వమును బలపఱుచుచున్నది. ద్రాహ్యాయణ లాట్యాయనములలోని కొన్నిపండల సూత్రములు సమానముగా నుండుటచే నిందేది ముందో చెప్పుటకు సందేహము గలుగుచున్నది గాని, లాట్యాయనములో నొక్కొకటిగా నున్నకొన్నిసూత్రములు ద్రాహ్యాయణములో రెండేసి చొప్పున విడిపోవుటయు నందలి మఱికొన్ని

సూత్రము లిందు సవిశేషముగా నుండుటయు లాట్యాయనమే ముందనుట కవకాశ మిచ్చుచున్నవి. ఇందు గౌతమ శాండిల్య ధానంజప్య భాండితాయన లామకాయన శాండిల్యాయన శౌచివృక్షి రాణాయనీ పుత్త్రాదులు పేర్కొనఁబడియున్నారు.

ఆర్షేయకల్పము పదునొకం డధ్యాయముల గ్రంథము. దీనికి వరదరాజు వ్యాఖ్యానము రచియించెను. ద్రాహ్యాయణము ముప్పది రెండుపటములు. దీనికి ధన్వి యనుపండితుఁడు దీప మనుపేర వ్యాఖ్య వ్రాసెను. లాట్యాయనము పదిప్రపాఠకములు, దీని కగ్నిస్వామి భాష్యము నిర్మించెను. ఇవి గాక యితర గ్రంథములు.

ప్రతిహార నిధాన సూత్ర మనుపేర పదియేను ఖండికల గ్రంథ మొకటి కలదు దీనికి వృత్తి వ్రాసిన వరదరాజపండితుఁ డీసూత్రము కాత్యాయనుఁడు రచించినట్లుగా "అథ భగవాన్ కాత్యాయనో వక్ష్యమాణాం వస్తు నిర్దిశతి" అనువాక్యమునఁ దెలుపుచున్నాఁడు. జైమిని నిర్మించిన ప్రతిహార లక్షణమునకు వివరణముగా, ఆహిశ్రేణ్యుఁ డనునాచార్యుఁడు నాలుగుపటలముల ప్రతిహారసూత్రము రచియించెను. దీనికి వైనతేయుఁ డనుపండితుఁడు భాష్యము వ్రాసెను. ఈవిషయ మీక్రిందివాక్యములవల్లఁ దెలియవచ్చును.

"భగవదాచార్యేణ జైమినినా ప్రతిహారలక్షణం సామాన్యరూపేణ ప్రతిపాదితమ్ ... ... తావతా గ్రంథే నాధునాతనానా మల్పమేధసాం ... సామ ప్రతిహారావగతి రశక్యేతి మత్వా భగవా నాహిశ్రేణ్యో నా మాచార్యః ... సామ్నాం వ్యక్తతరం ప్రతిహారా నాచిఖ్యాసు రేవ మారబ్ధవాన్ "

ఇట్లే ఫుల్లసూత్ర మను ౧౩౭ ఖండముల గ్రంథమును వరరుచి రచియించినట్లుగా వ్యాఖ్యాత యైన ఉపాధ్యాయాజాత శత్రుపండితుఁడు తెలుపుచున్నాఁడు. ఇవి గాక, ప్రస్తావసూత్రము ఉపగ్రంథసూత్రము క్షుద్రకల్పము మొదలగు మఱికొన్నిసూత్రగ్రంథములును, సామప్రయోగ వృత్తి మొదలగువ్యాఖ్యలును గలవు. కాని, యిచ్చట నొక్కవిశేషము. తాను రచియించిన కాత్యాయనప్రాతిశాఖ్యవ్యాఖ్యలో వరదరాజపండితుఁడు కల్పసూత్రములు పది యని రెండుశ్లోకములఁ జెప్పియున్నాఁడు.

"లాట్యాయన మనుపదం నిదానం కల్ప మేవచ।
ఉప గ్రంథాశ్చ క్షుద్రాశ్చ తండిలక్షణ మేవచ।
సూత్రం పంచవిధేయంచ కల్పానుపద మేవచ।
అనుస్తోత్రంచ విజ్ఞేయం దశసూత్రప్రకీర్తనం॥"

వీనిలో, కల్ప మనునది యార్షేయకల్పము. ఇవి యన్నియు సామవేదమునకు సంబంధించినకల్పము లనెడి యభిప్రాయము గనవచ్చుచున్నది గాని,

యిం దనేకములు, ఆగ్నేయకల్ప లాట్యాయన ద్రాహ్యాయణములచే గతార్థము లయిన యల్పగ్రంథము లని తెలియనగును.

కృష్ణయజుర్వేదీయ శ్రౌతసూత్రములు. ఇవియును వీనివ్యాఖ్యానములును, అమితముగా నున్నవి. వీనిలో నాపస్తంబము మొదటిదిగాఁ గనవచ్చుచున్నది. ఇందుకు దీని మొదటి దయిన 'అథాతో దర్శపూర్ణమాసౌ వ్యాఖ్యాస్యామః' అనుసూత్రము బ్రహ్మయజ్ఞపాఠమునఁ జేరుట యొకనిదర్శనము. ఇది ముప్పది ప్రపాఠకముల గ్రంథము. ఇది యంతయు శ్రౌతపరమే యని కొంద అభిప్రాయ పడిరి కాని, యిందు మొదటి యిరువదినాలుగు ప్రశ్నలును కడపటి శుల్బ ప్రశ్నయు మాత్రమే శ్రౌతమునకు సంబంధించినవి. తక్కిన యైదుప్రశ్నలలో ౨౫-౨౬-౨౭ ప్రశ్నలు గృహ్యసూత్రాత్మకములు ౨౮-౨౯ ప్రశ్నలు ధర్మసూత్రాత్మకములు. ఈ రెండువిధము లైనభాగములును ఖండము లను విభాగములతో వేఱువేఱుగా ముద్రితములై యున్నది. అందుచే ౨౪ ప్రపాఠకములే యీ శ్రౌతసూత్ర మనుట నిజము. ఇందు ౨౪-వ, ప్రశ్న పరిభాషా ప్రవరఖండ హౌత్రమంత్రములను దెలుపుచున్నది.

దీని కనేకులు వ్యాఖ్యలు వ్రాసిరిగాని, యం దొకటియుఁ బూర్తిగా లేదు. రుద్రదత్తుఁడు పూర్తిగా రచియించియుండును గాని, సూత్ర దీపిక యను పేరు గలయీవ్యాఖ్య మొదటి పదియేను ప్రశ్నలకు మాత్రమే లభించిన దని గార్బ్బపండితుఁడు వ్రాసియుండెను. ధూర్తస్వామి రచించిన సామాన్యసూత్ర భాష్య మైనను, పరిభాషకు సంబంధించినది మాత్రమే కనవచ్చుచున్నది. అట్లే కపర్దిస్వామి వ్రాసినది శుల్బభాష్యము మాత్రమే కనఁబడుచున్నది. ఇట్లే తక్కి నవిగూడ నసంపూర్ణములుగా నున్నవి.

పై వారు ముగ్గురు గాక, యీసూత్రమునకు, గురుదేవస్వామి కరవింద స్వామి చౌండపాచార్యుఁడు అహోబలసూరి సుందరరాజు, అను నైదుగురును వ్యాఖ్యలు వ్రాసియున్నారు. ఇందు గురుదేవస్వామి కృతము ప్రాచీన మని కొందఱు తలంచిరి. ఈవ్యాఖ్యలలో, మూలమును సక్రమముగా వివరించినది చౌండపాచార్యుని ప్రయోగరత్నమాల. ఇందలి యవతారికలో విజయనగర సామ్రాజ్యప్రభువుల వంశావళి కనవచ్చుచున్నది. కాని, యది రెండువ్రాత ప్రతులలో రెండువిధములు గా నున్నది. ఇం దొకదానిలోని రాజక్రమము తరువాతిక్రమమే రెండవప్రతిలో నున్నది గాని యీరెండును, చౌండపా చార్యుఁడు నిర్మించినవేనా? లేక, రెండవదానికి మొదటివంశక్రమము నితరు లెవరైనఁ జేర్చియుందురా? యని సంశయము గలుగుచున్నది. ఇందుకు సాయణమాధవులిద్దఱు నొకరే యని తెలుపువాక్యమే నిదర్శనము. ఇది, సాయణా చార్యులు సర్వశ్రౌతసూత్రసారముగా బౌధాయనమతమును గరతలామలకము

గావించునట్టి యజ్ఞతంత్రసుధానిధి యను గ్రంథము రచించి యందు తాను మాధవాచార్యుని తమ్ముఁడ నని చెప్పికొన్నదానికి వ్యతిరిక్తముగా నున్నది. ఇది ప్రసక్తము గాక పోయినను, పాఠకప్రతిపత్తికై పై మూఁడువిధముల వంశక్రమములను జూపుచున్నాను.

చౌండపాచార్యుని కృతిలోనున్నవి.—

"క్షీరసముద్రమునుండి చంద్రుఁడు పుట్టెను అతనివలన యాదవకులము పుట్టెను. అందు సంగముఁడు, అతనికి హర్యప - బుక్కేశ - కంప - మద్దప - మారప - నామకపుత్రులు నుదయించిరి. వీరిలో హర్యపరాజుమాధవాచార్యుని వలన నభ్యుదయము గాంచెను."

"సాయణాచార్యవపుర్ధరుఁడును వేదవ్యాఖ్యాతయు నగుమాధవార్యుని వలన హరిహరేశ్వరుఁడు లోకప్రసిద్ధి గాంచెను. అతనిపుత్రుఁడు యువబుక్కభూపతి. ఇతనికి తృప్యంబ (తిప్పాంబ) యందు భూపతిరాజుదయించెను. ఇతనికి, పద్మాంబామల్లాంబలయందు హర్యపేశ - సముద్రేశ - బుక్కభూప - గధీతములు పుట్టిరి. భూపతిరాజుమంత్రి చౌండపాచార్యుఁడు. అతఁడు ప్రయోగరత్నమాల యనువ్యాఖ్య రచియించెను"[1].

సాయణాచార్యునికృతిలో నున్నది.—

"చంద్రవంశమందు సంగమరాజుదయించెను. అతనికొడుకు బుక్కరాజు. అతనికొడుకు హరిహరరాజు. అతనికులగురువు సాయణాచార్యుఁడు. అతఁడు మాయణార్యుని కుమారుఁడు, మాధవార్యునిసోదరుఁడు. యజ్ఞతంత్రసుధానిధికర్త."

ఈ మూఁడింటిలోని రాజక్రమములను దేశచరిత్రకారులు సరిపుచ్చి యున్నారు. ఆచరిత్రగ్రంథములను బాఠకు లవలోకింతురుగాక.

పూర్వోక్తవ్యాఖ్యాతలలోని రుద్రదత్తుఁడే మంత్రప్రశ్నభాష్యకర్త యగు హరదత్తుఁ డని కొందఱియభిప్రాయము. రెండుగ్రంథములలోను రెండు విధము లయిననామములను గ్రంథకర్త వ్రాసికొనియుండఁడు గాని, వైదికగ్రంథవ్యాఖ్యాతలలో హరదత్తుఁడు ప్రసిద్ధి కెక్కియుండుటచేతను, ప్రధానకల్పసూత్రమున కతఁడు వ్యాఖ్య వ్రాయక విడువఁ డనుట విశ్వాస్య మగుటచేతను వీ రిరువు రొకరే యని భావింపఁబడుచున్నది.

శ్రౌతసూత్రములలో నాపస్తంబముకంటెఁ గూడ బౌధాయన మెక్కువ ప్రమాణముగా నుండెడి దనుట నిరాక్షేపము. ఇందుకు 'బోధాయనుని శ్రౌతసూత్రరూప మైననావ నెక్కివిద్వాంసు లధ్వరసముద్రమునావలియొడ్డు గాంచు

1. తంజా. సం. భా. 2049. 2048. 2599. నంబర్లు.

చున్నా'రనెడి సాయణాచార్య ప్రశంసయే పరమప్రమాణము[1]. అట్టి యీ సూత్ర మాద్య మని మహాదేవయజ్వ రచియించిన యత్యంతార్వాచీన మైన శ్రౌతచంద్రిక యవతారికలోని—

'అస్తి బౌధాయనం సూత్ర మాద్య మాధ్వర్యవాశ్రయమ్' అనువాక్యమును బట్టి తలంత మన్న—

'ఆదిమం బ్రాహ్మణం శేష మధ్యస్థితపరాపరమ్
అపాస్తాశేషపాప్మాన మాపస్తంబమునిం స్తుమః'[2].

అనుభట్టరుద్రదత్తుని సూత్రదీపికావతారికలోని వాక్యమునుబట్టి బ్రాహ్మణులలో నెల్ల నాపస్తంబుఁ డాద్యుఁ డని తలంపవలసివచ్చును. ఇవి రెండును నిజముగా సూత్రకర్తల మహత్త్వమును బ్రశంసించునవి యగుటచే వీరిపౌర్వాపర్యనిర్ణయమున కుపకరించునవిగాఁ గనఁబడవు. కాని శ్రౌతసూత్రపరిగణనమున బౌధాయనము నెక్కువగా గణించుట మాత్ర మధికముగాఁ గనవచ్చును.

ఈసూత్రము ముప్పదిప్రశ్నలగ్రంథము. దీని కనేకవ్యాఖ్యలు కలవుగాని యన్నియు నసంపూర్ణములు గానే కనఁబడుచున్నవి. వానిలో, భావస్వామి నవహస్త శేషనారాయణ ద్వారకానాథయజ్వ మహాదేవయజ్వ యజ్ఞేశ్వరబాలదీక్షిత వాసుదేవదీక్షిత వేంకటేశాధ్వరి గోపా లానంతదేవ సింగణసాయణాచార్యకృతములు పదునొకండు నిలిచియున్నవి. ప్రతివ్యాఖ్యాతయు బౌధాయనసూత్రప్రయోజనము నెక్కువగాఁ గొనియాడియుండెను. అందు కల్పవివరణకర్త యగు భావస్వామి 'ఒక్కొక్కశాఖకు బ్రాహ్మణము లధికము లగుటచేతను, వానియర్థము దుర్బోధ మగుటచేతను, దాని నంత నొకచోటఁ జేర్చి చక్కఁగా వివరించినయెడల, యియుక్షువు లెల్లరు సుఖముగాఁ గర్మము లాచరించుకొందురనుతలంపుతో బోధాయనముని యీకల్ప మారంభించె' ననుటనుబట్టి దీనిగొప్ప గోచరించును.

తంజాపురీ పరిపాలకుఁడును భోసలవంశసంజాతుఁడు నగుశరభేంద్ర భూపాలునిపుత్త్రుఁ డగుశివాజీమహీపాలుని యాస్థానమం దున్నమహావిద్వాంసులలో నొకఁ డగు బాలదీక్షితులు బోధాయనసూత్రములోఁ గొంతకు, కర్మాన్తపరిభాషాదిసంగ్రహ మనుపేర వ్యాఖ్య వ్రాయుచు నవతారికలో వ్రాసిన—

1. "సత్సూత్రాన్విత శాశ్వతాగమ మహారత్నం విధానం గిరాం, ప్రత్యక్చిత్త ముపాస్మహే వయ మమీ బోధాయ బౌధాయనం, య ద్వ్యాఖ్యార్ణవ మబంధ్య బంధ మహతీం ప్రా ప్యాధ్వరాంభోనిధేః, పారం యాన్తి మనీషిణో బహువిధై స్తంత్రస్య తస్యోర్మిభిః" యజ్ఞతంత్రసుధానిధి.

2. గార్బ్బపండితుఁడు ప్రకటించిన ప్రతిలో.—'ఆదిమం బ్రహ్మణః శేశ మధ్యస్థితపరాపర' మ్మనుపాఠము కనఁబడుచున్నది.

"బోధాయనాయ మునివందితపాదపద్మ
ద్వంద్వాయ కణ్వతనయాయ నమో ఽస్తు తస్మై."

అను మాటలనుబట్టి బోధాయనునితండ్రి కణ్వుఁడని తెలియుచున్నది. కణ్వసంజ్ఞ గలమహర్షి ఋగ్వేదద్రష్టలలోను సామగాచార్యులలోను శుక్లయజుశ్శాఖాప్రవర్తకులలోను గూడఁ గనవచ్చుచున్నాఁడు. ఇట్లు కనవచ్చు ముగ్గురు నొకఁడే యనుటకుఁ గాని, యీముగ్గురిలో నొకఁడు బోధాయను జనకుఁ డనుటకుఁ గాని యవకాశము కనిపించదు. ఆధారమును లభించదు, అందుచే నీకణ్వముని యెక్కడివాఁడో యెప్పటివాఁడో యూహింపరాకున్నది. కాని, మొన్న మొన్నటివా రగుబాల దీక్షితాదుల యిట్టి వచనములుగూడఁ బరిశోధకులు తమ యభిప్రాయమున కనుకూలముగాఁ గొందఱిని వెనుకకుఁ ద్రోయుటకును మఱికొందఱిని ముందుకు లాగుటకును సహాయపడకపోవు. శతాధికములైన బోధాయన సూత్ర వ్యాఖ్యలు పరికించి శ్రౌతసర్వస్వ మనునాలుగు పరిచ్ఛేదముల వ్యాఖ్యాగ్రంథము వ్రాసిన శేషనారాయణుఁడు గూడ[1] బోధాయనుని తండ్రిని బేర్కొనలేదు. ఇఁక నీసందర్భమునఁ బ్రధానశ్రౌతసూత్రము లన్నియుఁ దొలుత సర్వశాఖాసామాన్యము లనుట కొక్కయుదాహరణము.

"ఆశ్వలాయనశాఖినో యజమానస్య బోధాయన సోమప్రయోగః, తత్రాఽఽధానం" ఇత్యాదిగా బోధాయనసోమప్రయోగ మనుగ్రంథము రచియించినరుద్రదేవుఁడు పలికియుండెను. దీనినిబట్టి సర్వశాఖీయులు శ్రౌతసూత్రము లన్నిటి ననుసరించి యాగము లాచరించుచుండి రనియు, కాలక్రమమున నయ్యాశాఖీయులయాచారము లించుక మాఱుటచేతఁ గృష్ణయజుర్వేదీయ మనఁబడు బోధాయనసూత్రము ననుసరించి యాశ్వలాయనుల సోమయాగవిశేషములు బోధించునీప్రయోగము రచియింపవలసివచ్చె ననియుఁ దెలియఁగలదు. తరువాత-

భారద్వాజశ్రౌతసూత్రము — సప్తమహర్షు లందఱుగూడ సూత్రమో లేక స్మృతియో రచియించినవారే యని వైదికలోకప్రతీతి యొకటి గలదు. ఆపద్ధతినిబట్టి యిది భరద్వాజమహర్షి రచియించె ననవలసివచ్చును గాని గ్రంథరీతినిబట్టి భరద్వాజగోత్రమందలి యొకానొక భారద్వాజుఁడు నిర్మించినదిగాఁ గనఁబడుచున్నది. ఇందలిభాగములును, ప్రశ్నలుగానే యున్నవి. ఇదియు దర్శపూర్ణమాసములవివరణముతోనే యారంభమైనది.

హిరణ్యకేశిశ్రౌతసూత్రము. దీనికి సత్యాషాఢ మనియు వాడుక కలదు. ఇది మైత్రాయణీయశాఖకు సంబంధించినది. దీనికి వాంఛేశ్వరసుధి వ్యాఖ్యానము రచియించెను. అంతకుఁ బూర్వము మాతృదత్తవిరచితప్రయోగ ముండెను గాని

---

1. బోధాయనస్య సూత్రస్య వ్యాఖ్యా స్సంతి పరశ్శతాః, శేషోఽ ప్యహ మశేషా స్తాః పరికృత్య బ్రవీమ్యహమ్.

యది సూత్రార్థసమ్మతముగా లేదని యితఁడే వచియించుచు నాపస్తంబమతము నందందు క్రోడీకరించియున్నాఁడు. సప్తసోమపద్ధతి, మానవసూత్రము గూడ నీ శాఖకుఁ జేరినవే. రెండవది హిరణ్యకేశిసూత్రమువలెఁ బ్రాచీనసూత్రములలో గణింపఁదగియున్నది. ఇవి గాక, వాధూనసూత్రము లౌగాక్షిసూత్రము మైత్ర సూత్రము కఠసూత్రము వరాహసూత్రము వైశాఖానససూత్ర మనునవి కృష్ణ యజుశ్శాఖలకు సంబంధించినవి వినఁబడుచున్నవి. ఇవి యన్నియు నాపస్తంబ బోధాయనాది ప్రధానసూత్రముల కర్వాచీనములు. ఇందు వైఖానససూత్రము శ్రీనివాసదీక్షితవ్యాఖ్యతోఁ గనవచ్చుచున్నది. ఔఖేయశాఖకు సంబంధించిన యీసూత్రమును విఖనసుఁడు రచియించినట్లుగా 'ప్రణీతం సూత్ర మౌఖేయం తస్మై విఖనసేనమః' అనువాక్యమున వ్యాఖ్యాత తెలిపియున్నాఁడు. ఇఁక నాపస్తం బాశ్వలాయన బోధాయనసూత్రము లాధారములుగా వెలసిన శ్రౌతసూత్ర ప్రయోగగ్రంథము లపరిమితముగా నున్నవి. వానిలో నజీవము లైనకొన్నిటి నిందు పేర్కొనుచున్నాను.

ఆపస్తంబాగ్నిహోత్రప్రయోగము అగ్నిహోత్రవిధిప్రయోగము ఆధా నాది ప్రయోగము ఆధానహౌత్రప్రయోగము అగ్నిహోత్రచూడామణి ఆపస్తంబ సూత్రార్థధ్వనితార్థకారిక ఆపస్తంబనక్షత్రేష్టిప్రయోగము దర్శపూర్ణమాస ప్రయోగము బోధాయన దర్శపూర్ణమాస పంచప్రయోగము చాతుర్మాస్య ప్రయోగము ఆశ్వలాయన పశుబంధ మైత్రావరుణప్రయోగము ఆపస్తంబ బోధాయనపశుబంధప్రయోగములు అగ్నిష్టోమపద్ధతి జ్యోతిష్టోమపద్ధతి వాజ పేయపద్ధతి మొదలయినవి[1]. ఇట్టి వన్నియు శ్రౌతసూత్రముల ననుసరించి యొక్కొక్కక్రియను వర్ణించుచు వచ్చినవి గాని సంపూర్ణములు కావు.

శుక్లయజుర్వేదీయశ్రౌతసూత్రము - కాత్యాయనముని నిర్మించినశ్రౌత సూత్రము ప్రసిద్ధమై యున్నది. ఇది యధికముగా శతపథ బ్రాహ్మణము ననుస రించి యున్నది. ఇరువదియాఱధ్యాయముల యీగ్రంథమునకు, కర్కోపా ధ్యాయుఁడు భాష్యము రచియించెను గాని యదియును సూత్రప్రాయముగానే యున్నది. కాత్యాయనుఁడు హౌత్ర మనుపేర మఱియొకసూత్రము రచియించి నట్లుగా నీక్రిందివాక్యములవల్లఁ దెలియవచ్చుచున్నది.

"కాతీయం కల్పసూత్రంచ హౌత్రం కాతీయ మేవచ
అనయోః కర్కభాష్యంచ సంప్రదాయాది నిర్ణయాన్.
ఏతా నాలోచ్య యత్నేన శివం సాంబం ప్రణమ్యచ
పదార్థాదర్శసంజ్ఞం తు గ్రంథం కుర్వే గురూక్తితః"

1. ఇట్టిగ్రంథము లసంఖ్యముగా, తంజావూరులైబ్రరీలో నున్నవి.

ఈపదార్థాదర్శము రచియించినవారిపేరు తెలియదు గాని, యీశ్లోకముల వలనఁ గాత్యాయనసూత్రమునకు సంప్రదాయము మొదలగుప్రాచీనవ్యాఖ్యలు గూడఁ గలవని తెలియుచున్నది. ఇందుకు నిదర్శనముగా, కర్కభాష్యములో 'సంప్రదాయేతు' అనెడి యుద్ఘాటనముగూడఁ గనవచ్చుచున్నది. ఇదిగూడఁ బూర్వసూత్రములంబోలి దర్శపూర్ణమాసాదియాగముల నిరూపించుచున్నది. ఇందలి ప్రథమాధ్యాయమునఁ బేర్కొనఁబడిన వాత్స్యకార్ష్ణాజిన్యాది పూర్వాచార్యులలో లౌగాక్షిభారద్వాజులు కనఁబడుచున్నారు, అందుచే శ్రౌతసూత్ర కర్తలైనవీ రిరువురికంటెఁ గాత్యాయనుఁడు బరుఁ డని విదిత మగుచున్నది.

అథర్వణశ్రౌత సూత్రములు:—కౌశికసూత్రము వైతానసూత్రము. అనునవి యథర్వశాఖలకు సంబంధించియున్నవి. ఇవి రెండును క్రమముగా బ్లూంఫీల్డు, గార్బపండితులచేఁ బ్రకటింపఁబడినవి. వీనికి వ్యాఖ్యానము లున్నట్లు కనరాదు. ఇవి రెండును యాగక్రియాచరణమునఁ బ్రమాణములుగా గ్రహింపబడుచున్నట్లిందును గనఁబడదు. ఇందు కౌశికసూత్రము, అథర్వవేదమందలి మంత్రముల నెత్తికొని యాయాకర్మలను బ్రతిపాదించుచు వచ్చినది. కౌశిక మతము నుదాహరించుచు వచ్చినవైతానసూత్రము దీనికంటె నర్వాచీన మనుట స్పష్టము.

శ్రౌతసూత్రము లన్నియు, అగ్న్యాధా నాగ్నిహోత్ర దర్శపూర్ణమాసాది సప్తహవిస్సంస్థలను, అగ్నిష్టోమ వాజపేయాతిరాత్రాది సప్తసోమసంస్థలను బ్రతిపాదించునవి. హవిర్యజ్ఞములందు పయోదధ్యాజ్యవ్రీహ్యాదిద్రవ్యములు ముఖ్యముగా హోమయోగ్యములు. ఈ యాగములలో నగ్నిహోత్రకర్మము ప్రతిదినము ప్రాతస్సాయంకాలముల నాచరింపఁదగినది. తక్కినవి స్వర్గాదిక వివిధ ఫలాపేక్షచే నాచరింపఁదగినవి. సోమయాగములు సాధారణముగా నొకరోజు మొదలుగాఁ బన్నెండు రోజులవఱకుఁ జేయవలసినవి శేషకర్మలు. అవి హోత్రాది ఋత్విక్కులసాహాయ్యము నపేక్షించి యజమానుఁ డొనరించునవి. అందు సత్రయాగము సంవత్సరములకొలఁది కాల మాచరించు నత్యుత్తమయాగము. ఈ దృశమయిన యాగపద్ధతి కేవలము స్వర్గాదిఫలాపేక్షచేఁ గల్పింపఁబడిన దని తలంపరాదు. కర్మాచరణము చిత్తశుద్ధికిని వైరాగ్యమునకును గారణమై జ్ఞానోత్పత్తికిఁ బరమసాధన మగు ననియే ప్రాచీనమహర్షుల నమ్మిక. జనకాదులు కేవల కర్మముల వలనఁ గూడ సిద్ధి గాంచి రని యుపనిషత్పురాణములు చెప్పుచున్నవి. అయినను, కర్మోపాసనాజ్ఞానకాండాత్మక మైనవేదరాశియందు మొదటి దగు కర్మకాండము జ్ఞానమునకు ద్వార మనుట నిర్వివాదము. అట్టి కర్మకాండమును వర్ణించు

నీశ్రౌతసూత్రము లన్నియు సాధారణముగా ఋషులగోత్రప్రవరలనుగూడ విశదీకరించుచు వచ్చినవి. అట్టివాని నెల్లనొక్కచో సవిస్తరముగాఁ జూపించునట్టి గోత్రప్రవరనిబంధకదంబ మను గ్రంథము మైసూరుపురమున ముద్రితమై యున్నది. అం దన్నిగోత్రముల వారి ప్రవరలును సవిశేషముగా లభించుచున్నవి. మఱియు, భృగ్వాంగిరోమరీచ్యత్రిమహర్షులవలన నుత్పన్నము లైన యార్షగోత్రములపట్టిక యొకటి దాని కనుబంధముగా నున్నది. దానినిబట్టి ఋషులపరస్పర సంబంధ స్వరూపము చక్కఁగా గోచరించును. ఇట్లు వేదవేదాఙ్గములచరిత్ర మొకింత తెలిసికొంటిమి. ఇఁకఁ దక్కినసూత్రాదులు.

ఇది శ్రీచర్లబ్రహ్మశాస్త్రి గురువరకరుణాధీత పాణినీయుఁడును, శ్రీమంథా
చెన్నయశాస్త్రి గురువరకరుణాధీతోత్తరమీమాంసాదర్శనుఁడును,
ఋగ్వేదప్రథమమండలాంధ్రీకర్తయు, సంస్కృతకవిజీవి
తాంధ్రమహావీరచరిత శంకరవిజయాది కృతికర్తయు
నగు మల్లాది సూర్యనారాయణశాస్త్రి నిర్మించిన
సంస్కృతవాఙ్మయచరిత్ర ప్రథమభాగ వైదిక
వాఙ్మయమునం దష్టమాధ్యాయము.

---

# నవమాధ్యాయము.

## గృహ్యసూత్రములు.

శ్రౌతసూత్రములవలెనే గృహ్యసూత్రములును, ఆపస్తంబాది మునులు నిర్మించిన వనేకములు కలవు. ఇఁక వానివ్యాఖ్యానములును వాని ననుసరించి బయలువెడలినస్మార్తగ్రంథములు నపారములు. గృహ్యసూత్రములును వివిధవేద శాఖలకుఁ సంబంధించి భరతఖండము నలుఁగడల వ్యాపించియున్నవి. వీనిలో నాపస్తంబసూత్రము దక్షిణహిందూదేశమున, నందును నాంధ్రదేశమున ననాదిగా నెక్కువప్రచారములో నున్నది. ఆపస్తంబుని శ్రౌతసూత్రము ప్రకటించిన గార్బపండితుఁడును, ఇతని ధర్మసూత్రము ప్రకటించిన బుహ్లరుపండితుఁడుఁగూడ, ఆపస్తంబుఁ డాంధ్రదేశనివాసి యని తమపీఠికలలో వ్రాసియున్నారు. భారతీయులు కానియిద్దఱుపరిశోధకులసాక్ష్యమును బట్టి, వైదికసూత్రకర్తలలో నగ్రగణ్యుఁ డనఁదగినయాపస్తంబుఁడు మనయాంధ్రుఁ డని తెలిసికొనుటకంటె నాంధ్రుల కానందహేతువు మ ఱేమి కలదు ?

గృహ్యసూత్రములలో, "బోధాయనము ఆపస్తంబము సత్యాషాఢము ద్రాహ్యాయణము ఆగస్త్యము శాండిల్యము ఆశ్వలాయనము శాంభవము కాత్యాయనము, అనుతొమ్మిదియుఁ బూర్వసూత్రములు. వైఖానసము శౌనకీయము భారద్వాజము ఆగ్నివైశ్యము జైమినీయము వాధూలము మాధ్యందినము కౌండిన్యము కౌషీతకము, అనుతొమ్మిదియుఁ బరసూత్రములు." అని యాగ్నివైశ్యసూత్రము చెప్పుచున్నది. ఇం దథర్వశాఖీయసూత్రములు చేరలేదుగాని, తక్కినశాఖలలోని వనేకములు చేరినవి. దీనినిబట్టి యీగణనమునాఁటి కథర్వశాఖీయ కౌశికగృహ్యసూత్రము పుట్టలేదో, లేక యాకాలమున నది ప్రమాణముగా గ్రహింపఁబడలేదో చెప్పఁజాలము. పూర్వోక్తములైనపదునెని మిదిమాత్రమే కాక యింకను గొన్ని సూత్రములు గలవు.

గర్భాధానము పుంసవనము జాతకర్మము మొదలుగా మరణానంతరకర్మ పఱకుఁ గలగృహ్యములైనకర్మలను బ్రతిపాదించునవి యగుటచే నివి గృహ్యసూత్రము లనఁబరఁగినవి. వీనియందు మొత్తము నలువదికర్మలు చెప్పఁబడినవి. అందు పదునెనిమిది గర్భాధానము మొదలుగా వివాహపర్యంతము గలకర్మలు. ఇవి, అష్టాదశశరీరసంస్కారము లనఁబడుచున్నవి. తక్కినవానిలో నైదు పంచమహాయజ్ఞము లనియు, మూఁడు పాకయజ్ఞము లనియుఁ బిలువఁబడుచున్నవి.

ఇవి నిత్యానుష్ఠేయము లైనగృహ్యకర్మలు. తక్కినపదునాలుగును శ్రౌతము లైనయజ్ఞకర్మలు.

ఏతాదృశము లైనసూత్రములలో, ఆశ్వలాయనము-కౌషీతకాపరనామ మైనశాంఖాయనము - శాంభవము, అనుమూఁడును ఋక్శాఖీయములు. ఇందు మొదటి దాశ్వలాయనశ్రౌతసూత్రమున కనుబంధ మైనది. ఇది నాలుగుకాండ ముల గ్రంథము, రెండవది కౌషీతకిబ్రాహ్మణోక్తము లైనయాయాగృహ్యకర్మల నొక్కచోఁ జేర్చి వానిని సవిస్తరముగా వర్ణించినగ్రంథము. దీనితరువాత బయలు దేఱినశాంభవసూత్రము దీనిలోనికర్మలనే వివరించునది యైనను విశేషముగాఁ బితృయజ్ఞమును వర్ణించినది. ఈమూఁడింటిలోను, ఆశ్వలాయసూత్రమే యెక్కువ ప్రమాణమై యాచరణలో నున్నది. దీని ననుసరించి శుక్లవిశ్రామపుత్రుఁ డైన శివరామపండితుఁడు బహ్వృచాహ్నికము రచియించెను. "శాకలోఽహం ప్రయోగంచ వక్ష్యే బహ్వృచకర్మణాం" అనుదానినిబట్టి శాకలుఁడు తనపేర నొకకారిక రచియించినట్లు కనఁబడుచున్నది. ఇది గాక, ఆశ్వలాయనసూత్రప్రదీపిక యను పేర భట్టకుమారిలస్వామి మఱియొకకారిక రచియించెను. ఈకారిక, ఆశ్వలాయన గృహ్యసూత్రవృత్తికి సంగ్రహమైనట్లు-

ఆశ్వలాయన మాచార్యం నత్వా తద్గృహ్యకర్మణామ్
ప్రయోగం వచ్మి సంక్షేపాత్ వృత్తికారేణ భాషితమ్"

అనుదానివల్లఁ దెలియుచున్నది. ఇంక నిట్లే సంస్థాప్రయోగాదిగ్రంథము లనేకములు కలవు.

సామశాఖీయ గృహ్యసూత్రములలో లాట్యాయనమతానుసారి యైన గోభిలీయసూత్రము మొదటిదిగాఁ గనవచ్చుచున్నది. ఇది నాలుగుప్రపాఠకముల గ్రంథము. ఇందు స్మార్తాగ్న్యాధానము పంచమహాయజ్ఞములు పశుపాదిస్థాలీ పాకము దర్శపూర్ణమాస స్వరూపము పిండపితృయజ్ఞము మొదలయిన గృహ్యవిష యము లన్నియు విశదీకరింపఁబడినవి. దీనికి ఛాందోగ్యగృహ్య మనియుఁ బేరు గలదు. దీనికి నారాయణపండితుఁడు వృత్తి రచియించెను. మఱియు శివరామ పండితుఁ డను నతఁ డిందలివిషయ మంతయు సుబోధకమగునట్లు కృత్యచింతా మణి రచియించెను. నారాయణపద్ధతితోఁ గూడిన యీగ్రంథము కలకత్తా ప్రాచీన పుస్తకభాండాగారమున నున్నది.

ఖాదిరగృహ్యసూత్ర మనునది రాణాయనీయశాఖకుఁ జెందినది మఱి యొకటి కలదు. ఇది ద్రాహ్యాయణమతము ననుసరించినది. కాని విషయమునం దిది గోభిలసూత్రమునే పోలియుండి దానిసంగ్రహముగా నున్న దని ఖాదిరసూత్ర ప్రకాశకులు తెలుపుచున్నారు. ఇది నాలుగుపటలముల గ్రంథము. రెంటిని

ఖోల్చి చూచితి మన్న నాకు గోభిలసూత్రము లభింపలేదు. ఖాదిరసూత్రమందు దర్శపూర్ణమాసాగ్నేయస్థాలీపాక పుంసవనాది కర్మలు ప్రతిపాదింపఁబడినవి. పై గోభిలసూత్ర మాధారముగా నుదయించినది ఛందోగపరిశిష్టము. దీనికర్త కేశవమిశ్రుఁడు. ఈ పరిశిష్టమునకుఁ బ్రకాశ మనువ్యాఖ్య వ్రాసిన నారాణయణపండితుఁ డిట్లు చెప్పియున్నాఁడు.

"అథాతో గోభిలోక్తానా మన్యేషాం చైవ కర్మణామ్
అస్పష్టానాం విధిం సమ్య గ్దర్శయిష్యే ప్రదీపవత్"[1].

ఈపరిశిష్టప్రకాశమునకు సారమంజరి యనువ్యాఖ్యను శ్రీనాథాచార్యుఁడు వ్రాసెను, అతని ప్రతిజ్ఞ యిది.

" శ్రీకరాచార్యపుత్రేణ శ్రీమచ్ఛ్రీనాధశర్మణా
పరిశిష్టప్రకాశస్య క్రియతే సారమంజరీ ".

ఇది యంతయుఁ జూడ గోభిలసూత్రము సామశాఖీయసూత్రములలోఁ బ్రధానమైన దని విదితమగును. మఱియు జైమినిగృహ్యసూత్రము ద్రాహ్యాయణగృహ్యసూత్రమును గూడ నున్నట్లు వాని ననుసరించి పుట్టినగ్రంథములను బట్టి తెలియవచ్చుచున్నది. జైమినిగృహ్యసూత్రకారిక జైమినిగృహ్యసూత్రవ్యాఖ్య యను లిఖితగ్రంథములు చెన్నపురి దొరతనమువారి పుస్తకభాండాగారమున నున్నవి. ద్రాహ్యాయణ గృహ్యపరిశిష్టము గూడ నందే కలదు. ఇది యెవరు రచియించినదో సరిగాఁ దెలియరాదు కాని, గ్రంథారంభమందలి శౌచవిధివాక్యములచివర 'ఇత్యాహ భగవాన్ రాణాయనిః' అనువాక్యమునుబట్టి రాణాయని, ద్రాహ్యాయణశాఖీయముగా ద్రాహ్యాయణ గృహ్యసూత్రము రచియించెనేమో యని తోఁచుచున్నది. ఇవి గాక జైమిని గోభిలసూత్రముల ననుసరించిన కర్మప్రదీప మను కారికాగ్రంథము మఱియొకటి లండన్‌నగరములోని పుస్తకాలయమున నున్నది. అయిదువందల శ్లోకములతోఁడి యాగ్రంథము పది ఖండికలుగానున్న దని గైక్వా రనుపరిశోధకుఁడు తెలుపుచున్నాఁడు[2]. దీని కాశార్కమిశ్రుఁడు భాష్యము రచియించెను. ఇతఁ డారంభమునఁ గావించిన ప్రతిజ్ఞ యిట్లున్నది.

"తం బాదరాయణం నౌమి యో ఒసౌ జైమినయే దదౌ
కర్మకాండం పరం సామగాయినా మభికాంక్షితమ్

1. ఈశ్లోకము కర్మప్రదీప మనుమఱియొకగ్రంథము మొదట నున్నట్లు తెలియవచ్చుచున్నది. నిజముగా నిది యెందలిదో!

2. మనదేశమందలిపుస్తక భాండాగారములలో లేనికొన్ని వైదికగ్రంథము లందున్నట్లు గ్రంథసూచికవల్లఁ దెలియుచున్నది.

జైమినిం మునిశార్దూలం మూలం సామ్నాం సగోభిలమ్
నత్వా కర్మప్రదీపార్థవిచారః క్రియతే మయా"

ప్రకరణాంతగద్యములందు భాష్యకర్త పేరు, ఆశాదిత్యమిశ్రుఁడనియు, అతనితండ్రి చక్రధరమిశ్రుఁడనియు నున్నది. ఇంక నిట్టిసామశాఖీయగృహ్యగ్రంథము లనేకము లుండవచ్చును.

కృష్ణయజుశ్శాఖీయగృహ్యసూత్రములు:—సంహితాపాఠభేదమున నేర్పడినశాఖలు గాక, ఆయాశాఖలు కొన్ని సూత్రభేదమునఁ గూడ వేఱుపడినవి. తైత్తిరీయశాఖలో, ఆపస్తంబసూత్రు లనియు బౌధాయనసూత్రు లనియు నిరుతెఱఁగులవారు కలరు. ఆంధ్రదేశమందలితైత్తిరీయు లందఱు నాపస్తంబసూత్రులే యని చెప్పవచ్చును. అట్లే మైత్రాయణీయశాఖలో హైరణ్యకేశులు మానవులు ననుభేదము గలదు. ఇట్లేర్పడినశాఖలవారు తమతమసూత్రములనే గృహ్యకర్మములందు ప్రమాణముగాఁ గైకొందురు. అట్టి సూత్రములు, ఆపస్తంబము బౌధాయనము హిరణ్యకేశి మానవము కఠము వైఖానసము, అనునవి. ఇవిగాక, భారద్వాజగృహ్యము శాట్యాయనగృహ్యము ననురెండుసూత్రములు తైత్తిరీయశాఖకుఁ జెందినవి గలవు. కాని, యీసూత్రములవా రెండైనఁ గలరేమో తెలియదు.

ఆపస్తంబసూత్రము ౨౩ ఖండములగ్రంథము. ఇందు ౪౦౫ సూత్రములు కలవు. దీనికి హారదత్తుఁడనాకులావృత్తిని, సుదర్శనాచార్యుఁడు తాత్పర్యదర్శనమును కపర్దిస్వామి భాష్యమును రచియించిరి. ఈ గృహ్యసూత్రమా, ఇతనిశ్రౌతసూత్రములోని ౨౭ వ, ప్రశ్నమే యని కొందఱును; శ్రౌతసూత్రము ౨౪ ప్రశ్నములగ్రంథమే, తరువాతివి గృహ్యధర్మాదులనుబోధించు వేఱుప్రకరణములు, ఆపస్తంబసూత్రము లన్నిటి నొకటిగాఁ జేర్చి వ్రాసినవారిలిఖితపుస్తకములను బట్టి యిది శ్రౌతసూత్రమందలిభాగ మనుచున్నారుగాని యది యుచితము కాదని కొందఱును, తలంచుచున్నారు. ఎట్లున్నను ఫలము వేఱు కాదు.

కర్మలు శ్రుతిలక్షణములు, ఆచారలక్షణములు నని ద్వివిధములు. ఇందు మొదటివి పూర్వోక్తము లయిన వివిధయాగములు. ప్రత్యక్షశ్రుతిచేఁ దెలియరాని వై యాచారమువలనఁ దెలియఁబడుచున్న వివాహాదికర్మ లాచారలక్షణములు. అవియే గృహ్యములు. మొదటిప్రతిజ్ఞాసూత్ర మీయభిప్రాయము నిట్లు చెప్పుచున్నది.

'అథ కర్మా ణ్యాచారా ద్యాని గృహ్యంతే' ఆచారాత్ ప్రయోగాత్ గృహ్యన్తే జ్ఞాయన్తే న ప్రత్యక్షశ్రుతేః తాని కర్మాణి వ్యాఖ్యాస్యామః' అని వృత్తికారులు.

 

"యత్కృతం వేదవ ద్భాష్య మాద్రియన్తే విపశ్చితః
స కపర్దీ చిరం జీయా ద్వేదవేదార్థతత్త్వవిత్"

అని కపర్దిస్వామిని, అతనిభాష్యమును స్తుతించినసుదర్శనాచార్యుఁడు నిట్లే 'ఫలాపేక్ష లేకుండ శిష్టు లాచరించునౌపాసనహోమాదులును, యజ్ఞము లం దధికారము కలిగించునట్టి శరీరసంస్కారార్థములును పాకయజ్ఞశబ్దవాచ్యములు నైనపాణిగ్రహణాదులును, ఏయాచారమునుండియు ననుమితము లైనవేద వాక్యములనుండియుఁ దెలియఁబడుచున్నవో, అవి గృహ్యకర్మము లని ప్రతిజ్ఞా సూత్రమున కర్థము వ్రాసెను. దీనినిబట్టి గృహ్యకర్మలు ప్రత్యక్షశ్రుతివిహితములు గాకపోయినను, అనుమేయ శ్రుతులవల్ల జ్ఞాయమానము లగుచున్నవనియు, శిష్టాచార సిద్ధము లైనయట్టి గృహ్యకర్మలను బ్రతిపాదించునవే గృహ్యములు లేక స్మార్త సూత్రము లనియుఁ దెలియుచున్నది.

బోధాయనగృహ్యము నాలుగు ప్రశ్నలగ్రంథము. ఇందు ౧౨ అధ్యాయములు గలవు. దీని కనుబంధముగా, రెండుప్రశ్నల పరిభాషయు, అయిదు ప్రశ్నల గృహ్యశేషము, మూఁడుప్రశ్నల పితృమేధము ననుమూఁడు సూత్ర గ్రంథములు బోధాయన నిర్మితములుగా ముద్రితములై లభించుచున్నవి[1]. ఈ యనుబంధగ్రంథములు బౌధాయనములో కావో! కాని, పరిభాషలోఁ బ్రతిషిద్ధదేశగమనమున కుదాహరణముగా 'అథాప్యుదాహరన్తి' అని యుల్లేఖింపఁబడిన.—

"సౌరాష్ట్రం సింధు సౌవీరా వవన్తీం దక్షిణాపథమ్
ఏతాని బ్రాహ్మణో గత్వా పున స్సంస్కార మర్హతి".

అను శ్లోకమును; గృహ్యశేషములో నవగ్రహపూజావిధి సందర్భమునం దావాహనీయు లైన రవ్యాదిగ్రహములను రుద్రాదిదేవతలను, కళింగావన్తీభోజ కటకయమునామగధసింధు సౌరాష్ట్ర బర్బరాంతర్వేది దేశజులనుగాను కాశ్యపాదిగోత్రులనుగాను జైమిన్యాదిసూత్రులనుగాను వర్ణించిన సూత్రములును శ్లోకములును, వై మూఁడుభాగము లర్వాచీను లెవరో రచియించి బోధాయన గృహ్యమున కనుబంధముగాఁ జేర్చియుందు రనుటకు మాత్ర మెక్కువగా నవకాశ మిచ్చుచున్నవి.

దీనివ్యాఖ్యానము లెందును లభింపలే దనియు, 'శిష్టివ్యాఖాన' మనుపేర ననమగ్రము నపరిశుద్ధము నతిసంక్షిప్త మయినదొకటి లభించినది గాని, యది తృప్తికరముగా లే దనియు బోధాయనగృహ్యప్రకాశకులు వ్రాసియున్నారు.

---

1. మైసూరు మహారాజావారి ముద్రాలయము.

మైత్రాయణీయ మానవసూత్రము రెండుపురుషములుగా విభజింపఁబడినది. ప్రథమపురుషమం దిరువదిమూఁడుఖండములును, ద్వితీయపురుషమందు పదునెనిమిదిఖండములును గలవు. బ్రహ్మచారినియమములతో నారంభమైన యీసూత్రము పుత్రేష్టియాగముతో సమాప్తినొందుచున్నది. ఇందలి సూత్రము లతిమితాక్షరములుగాక ప్రయోగసూచకములై యించుక పెద్దవిగా నున్నవి. దీనికి వ్యాఖ్యాన మున్నట్లుకనఁబడదు. ఇటావానగరవాసు లగుభీమసేనశర్మగారు తాము హిందీభాషలో రచియించినభాషావృత్తితో దీనిని బ్రకటించియున్నారు. ఈసూత్రము వివరించు వివాహాదిప్రయోగము చాలవఱకు మనయాపస్తంబసూత్రప్రయోగమునే యనుసరించి యున్నది గాని యందందు దేశాచారమును బట్టి వచ్చినయాచారభేదములు కనఁబడును. ఆపస్తంబమునికూడ, సమంత్రకములైనగ్రహ పూజాంకురారోపణ ప్రతిసరబంధాదులును అమంత్రకము లైన నాకబలియక్షబలీంద్రాణీ పూజాదులును జనపదగ్రామకులముల యచారము ననుసరించి చేయఁదగు నని 'ఆవృతశ్చాస్త్రీభ్యః ప్రతీయేరన్' అనుసూత్రమునఁ దెలిపియుండెను[1].

కఠగృహ్యసూత్రము లబ్ధము కాలేదు. ఔఖేయశాఖకుఁ జెందినవైఖానససూత్రముల్వ్రాతప్రతు లందందు కలవు. ఇది ౧౧ ప్రశ్నలగ్రంథము. 'అథ నిషేకాదిసంస్కారాన్ వ్యాఖ్యాస్యామః' అనుసూత్రముతో నారంభ మైన యిదియును వెనుకటిసూత్రములవలెనే వివిధగృహ్యకర్మలను వివరించుచున్నది. ఇవి గాక తైత్తిరీయమునకు సంబంధించి, ఆపస్తంబగృహ్యసూత్రకారిక - ఆపస్తంబగృహ్యప్రయోగదీపిక - గృహ్యరత్నము - ఆపస్తంబపితృమేధ ప్రశ్నభాష్యము విధానమాల - సంస్కారనిర్ణయము - పాకయజ్ఞనిర్ణయము - మొదలయిన వింకను గలవు.

శుక్లయజుశ్శాఖీయ గృహ్యములలో, పారస్కరగృహ్యసూత్ర మనునది ప్రసిద్ధమై యున్నది. పేరునుబట్టి పారస్కరుఁడు రచియించినట్లు స్పష్టము. కాని, యీపారస్కరుఁ డన్యుఁడు కాఁడు, వాక్యకారవరరుచియు శ్రౌతసూత్రకర్తయు నైనకాత్యాయనుఁడే యని పెద్దలవాడుకవలనఁ దెలియుచున్నది. ఇది మూఁడు కాండములగ్రంథము. దీని కనుబంధములుగాఁ గాత్యాయనకృతములు గా, పరిశిష్టకండిక - శౌచసూత్రము - స్నానసూత్రము - శ్రాద్ధసూత్రము - భోజనసూత్రము - అనునవి కలవు.

ఈగృహ్యసూత్రమునకు, కర్కోపాధ్యాయుఁడు జయరామాచార్యుఁడు హరిహరాచార్యుఁడు గదాధరదీక్షితులు ననువారు భాష్యములు వ్రాసిరి. వీరిలోఁ గాత్యాయనశ్రౌతసూత్రములకుఁ గూడ వ్యాఖ్యవ్రాసిన కర్కోపాధ్యాయుఁడే

1. ఆప. గృ. 2·15.

ప్రాచీనుఁడు. ఇతఁడు భాష్యారంభమున "శ్రౌతా న్యాధానాదీని కర్మాణ్యుక్తాని తదనన్తరం స్మార్తా న్యనువిధీయన్తే తత్రైౌత దాదిమం సూత్రమ్. అథాతో గృహ్యస్థాలీపాకానాం కర్మ" అని వ్రాయుటనుబట్టి కాత్యాయనుఁడు శ్రౌత సూత్రములు రచియించి తరువాత నీస్మార్తసూత్రములు నిర్మించె నని గోచరించు చున్నది. ఈపారస్కరాపరనాముఁ డైన కాత్యాయనుఁడు విశ్వామిత్రగోత్రజుఁ డైన కతమహర్షిగోత్రాపత్య మయినట్లు హరివంశమువలనఁ దెలియుచున్నది[1]. షోడశసంస్కారాది గృహ్యకర్మలను బ్రతిపాదించు నీగ్రంథము చతుర్వ్యాఖ్యా పరిశిష్టకండికాది సమేతమై కాశీనగరమున ముద్రితమై యున్నది.

అథర్వశాఖీయగృహ్యసూత్రము కౌశిక మనుపేర వెలయుచున్నది. ఇది కౌశికశ్రౌతసూత్రము ననుబంధము. ఇందు వివాహాదిగృహ్యకర్మములే కాక, అథర్వవేదీయము లైన యాభిచారికకర్మలు గూడఁ బ్రతిపాదింపఁబడిన వని మాగ్దోనలుపండితుఁడు వ్రాయుచున్నాఁడు. ఈగ్రంథము నాకు లభింపలేదు.

ఇట్లు పై నుదాహరించినవియే కాక వాని ననుసరించుచుఁ గాలక్రమమున బయలుదేఱిన మఱికొన్ని గృహ్యగ్రంథములు కలవు. అట్టివానిలో, కమలాకర భట్టు రచియించినయగ్నినిర్ణయము శ్రౌత గృహ్య లౌకికాగ్నులయం దేకర్మము లాచరింపఁదగు నను విషయము నిర్ణయించుచున్నది. నారాయణభట్టు నిర్మించిన గృహ్యాగ్నిసారము సకలగృహ్యసూత్రోక్తకర్మలసారమును సులభముగా బోధించు చున్నది. గృహ్యకల్పతరు వనెడిమఱియొకటి వైదికకర్మస్వరూపము వెల్లడించు చున్నది. ఇట్లే యింకను గృహ్యకర్మవిశేషములను దెలుపుగ్రంథము లనేకము లర్వాచీనములు కలవు.

ధర్మసూత్రములు.—ఇవి నాలుగైదుమాత్రమే ప్రసిద్ధి కెక్కినవి. ఇం దాపస్తంబ హైరణ్యకేశీయ బౌధాయనములు కృష్ణయజుశ్శాఖీయములు. గౌతమ సూత్రము సామశాఖీయము. ఈగౌతముఁ డెవ రనువిషయము స్మృతిప్రకరణ మున విచారింతము. వైఖానసధర్మప్రశ్న మనుపేర నొకసూత్రగ్రంథము ముద్రితమై యున్నది. విషయమునం దాపస్తంబాదులను బోలినయీయర్వా చీనసూత్రము కృష్ణయజుశ్శాఖీయాంతర్గతమై విఖనసుఁ డనుమునిచే రచియింపఁ బడిన దగుటచే వైఖానస మనఁబడుచున్నది. పైసూత్రములం దుదాహరింపఁ బడిన మతాంతరములనుబట్టి తొల్లి మఱికొన్ని ధర్మసూత్రము లుదయించి యుండు ననుట కవకాశము కనఁబడుచున్నది కాని యవి లభింప కున్నవి. కాని, గద్యపద్యాత్మకముగా నున్నవాసిష్ఠస్మృతి యొకటి పూర్వధర్మశాస్త్రములలో

1. విశ్వామిత్రస్యతు సుతా దేవరాతాదయః స్మృతాః,
దేవశ్రవాః కత శ్చైవ తతః కాత్యాయనాః స్మృతాః ॥

గణింపఁదగినది కనఁబడుచున్నది. అది స్మృతియైనను ధర్మసూత్రగౌరవమునకుఁ గూడ నర్హమైయున్నది.

మను హారీత మతము లుద్ఘాటించిన యాపస్తంబము వానికంటెఁ బరము, పాణినీయమునకుఁ బూర్వము. భాల్లవులను బురాతనమునులనుగా నిర్వచించిన పాణినీయసంప్రదాయమున కాధారభూతమైన భాల్లవిగాథ నుదాహరించిన వాసిష్ఠము పాణినీయమునకుఁ బూర్వము. దీనినుండి కొన్నివాక్యములు గ్రహించినదియు గౌతముని బేర్కొన్నదియు నగుబౌధాయనము హైరణ్యకేశి సూత్రము కంటెఁ బూర్వముగాఁ గనఁబడుచున్నది. క్రీస్తుపూర్వము పంచమశతాబ్దిలోని శిలాశాసనమందలి హిరణ్యకేశి శబ్దమునుబట్టి హైరణ్యకేశిసూత్ర మంతకంటెఁ బ్రాచీన మనుట విదితము. ఇఁక గౌతమాపస్తంబములలో నేది పూర్వ మను విషయమున్నది. ఆపస్తంబములో యువతీవివాహమును సూచించు మంత్రలింగములు కొన్ని కల వనుట నిజముకాని, యవి రజస్వలా వివాహజ్ఞాపకములు కా వని కొందఱును, అవు నని కొందఱును వాదములు సలుపుచున్నారు, 'శేషం సమావేశనే జపేత్' అనెడి యాపస్తంబసూత్రమందలి సమావేశనశబ్దమునకు 'వధ్వా సహ మైథునార్థం శయనమ్' అనివ్యాఖ్యాత లర్థమువ్రాయుచు, ఇది ఋతుసమావేశనరూపముగా దనియు, రాగము లేక పోయినను, కర్మార్థమైన క్రమజపవిధాన మనియు వ్రాసియున్నారు. ఎట్లయిన నిట్టిసూచన లిందు కన వచ్చునుగాని గౌతమసూత్రమునఁ గనరావు. తక్కినవానితోఁ బాటు, ఆపద్ధర్మముగా యువతీవివాహమును గౌతమసూత్రముగూడ నంగీకరించినను, సహజముగా "ప్రదానం ప్రాగృతోః, అప్రయచ్ఛన్ దోషీ" అని ఋతుపూర్వకాలికవివాహమునే కంఠోక్తిగా శాసించినది. మఱియు నాపస్తంబ మాఱువివాహములు చెప్పియుండ నిది యష్టవిధవివాహములను జూపినది. దీనినిబట్టి యాపస్తంబము పూర్వ మనియు గౌతమము పర మనియుఁ జెప్పఁదగియున్నది. అయినను, ఒకరిద్దఱు సకలధర్మసూత్రములకంటెను గౌతమమే యాద్య మని తలంచిరి. అది యైనను, ఊహలమీఁద నాధారపడిన దే కాని సత్ప్రమాణబద్ధ మైనది కాదుకాని, యెట్లయిన, సూత్రములలో నేమి చెప్పఁబోవు స్మృతులలో నేమి, ఒకదానిలోనివాక్య మేదో యొకటి యైనను మఱియొకదానిలోఁ గనవచ్చుటను బట్టి కొందఱు కొన్ని పూర్వము లనియు, మఱికొందఱు మఱికొన్ని పూర్వము లనియు భావించుట కవకాశము కలుగుచున్నమాట సత్యము. ఇందు కొక యుదాహరణము.

వాసిష్ఠస్మృతి ముప్పదియధ్యాయముల గ్రంథము. ఇందు మను హారీత గౌతమ ప్రజాపతి యమ వసిష్ఠుల మతములును, శాలక భాల్లవి వాజసనేయక మతములు నుద్ఘాటింపఁబడినవి. 'అబ్రవీ స్మనుః, ఇతి గౌతమః' అనుచు నిది

యేధర్మములను వివరించెనో, అవి యన్నియు మనుస్మృతియందును గౌతమ సూత్రమందును గనవచ్చుచున్నవి. కాని, "మానవం శ్లోక ముదాహరన్తి" అనుచు నిది యేశ్లోకము లుదాహరించెనో, వానిలో 'యో ఽనధీత్య ద్విజో వేద' మిత్యాదిశ్లోకములు కొన్ని ముద్రిత మనుస్మృతిలోఁ గనఁబడుచున్నవి. కొన్ని కనరాకున్నవి. దీనినిబట్టి మనుస్మృతి ముద్రణమునకుఁ గొన్నిశ్లోకములు లభింప లే దనవలెను గాని, యిది యుదాహరించిన శ్లోకములు కొన్ని మనుస్మృతికి మఱియొకగ్రంథమునుండి లభించె నని చెప్పరాదుగదా! మఱియు నిది ప్రాజాపత్యశ్లోకము లనుచు నెన్ని యుదాహరించెనో వానిలో నొక్కటియు ముద్రితమైన ప్రజాపతిస్మృతిలోఁ గనఁబడకున్నది. దీనినిబట్టి మఱియొక ప్రాజాపత్యస్మృతి ప్రాచీన మైనది కల దని యనుమానింపవలసివచ్చుచున్నదిగాని మానవ ధర్మశాస్త్రము మఱియొకటి ప్రాచీన మైనది కల దని యనుమానింపవలసినపని లేదు. ఇది నిజస్థితిగా యుండఁగా, మాక్సోనలు పండితుఁడు, మనుస్మృతికి మూలభూత మైన మానవధర్మసూత్ర మొకటి కలదనియు దానినుండి పెక్కు వాక్యములు వసిష్ఠస్మృతిలోనికి వచ్చె ననియు దీనినుండి కొన్ని వాక్యములు మనుస్మృతికి వచ్చె ననియు నందుచే వసిష్ఠస్మృతి మనుస్మృతికంటెఁ బూర్వ మనియు ననుమానించెను. వసిష్ఠస్మృతి ప్రాచీనస్మృతులలోఁ జేరఁదగిన దైనను, మనుస్మృతికే కాదు, గౌతమాపస్తంబములకుఁ గూడఁ బర మని నా తలంపు. ఇఁక దీనినిగూర్చి చర్చింపక యీమతద్వయమును బాఠకలోకమునకు విడుచుచున్నాను.

ధర్మసూత్రములలో నుత్తమఖ్యాతి వహించిన దాపస్తంబము. ఇది ముఖ్యముగా దక్షిణహిందూదేశమందలి సకలవర్ణాశ్రమాచారములకును బరమ ప్రమాణ మైనది. దీని మొదటిసూత్రమగు 'అథాత స్సామయాచారికా న్ధర్మా న్వ్యాఖ్యాస్యామః' అనునది బ్రహ్మయజ్ఞమందు పఠింపఁబడుట దీనివేదాంగకల్పత్వమునకు గుర్తగును. ఇది రెండుప్రశ్నలగ్రంథము. ఈ రెండును శ్రౌతసూత్రములోని ౨౮-౨౯ ప్రశ్నలని కొందఱు భావింతురు. దానితో సంబంబంధము లేని వేఱుగ్రంథ మని కొందఱందురు. ఎట్లన్నను, కర్త యొక్కఁడే కావున నిది విచారణీయము కాదు. ఇం దొక్కొక్కప్రశ్నమునఁ బదునొకండేసి పటలములు గలవు.

ఈధర్మసూత్రములు సామయాచారికము లైనధర్మములను బోధించును. సమయ మనఁగాఁ బురుషుఁడు చేసినవ్యవస్థ. అది, విధి నియమ ప్రతిషేధ భేదమునఁ ద్రివిధము. ఇందు, ప్రవృత్తిప్రయోజనము విధి. గ్రామాంతరము వెళ్లి వచ్చినగురువు నానాఁడే చూడవలె ననుట విధి యనఁబడును. నివృత్తి ప్రయోజనములు నియమప్రతిషేధములు. ఏదిక్కుగాఁ దిరిగిభోజనము చేసినను, ఆఁకలి

తీఱికపోదు గాని, అయినను ప్రాఙ్ముఖముగాఁ గూర్చుండియే భోజనము చేయవలెను, బ్రాహ్మణుని గాని గోవును గాని కాలితోఁ దన్నఁగూడదు, ఇత్యాదులు. ఏతాదృశసమయమూలములైన యాచారములందలి ధర్మములు సామయాచారికధర్మము లనఁబడుచున్నవి. కర్మజన్యమును, అభ్యుదయనిశ్శ్రేయసహేతువు నైన యాత్మగుణము ధర్మము. అట్టి ధర్మమునకు హేతుభూతములైన కర్మములను విశదీకరించునది యీశాస్త్రము.

పరహితకాంక్షియు సకలవేదవేదాంగవేత్తయు నగునాపస్తంబముని సత్కర్మానుష్ఠానమున మానవసంఘము తరింపఁగోరి బ్రాహ్మణాదివర్ణములకు విహితములయినవివిధధర్మములను, దేశాచారముల ననుసరించియు మన్వాదిపూర్వస్మృతులవలోకించియు సామయాచారికధర్మసూత్రరూపమున లోకమునకుఁ బ్రసాదించెను. మానవజన్మ మెత్తినవాఁడు తనజీవితకాలము నెట్లు గడపవలెను? తన ప్రవర్తన మెట్లు చక్కఁబఱుచుకొనవలెను? అనువిషయములను సంపూర్ణముగా నుపదేశించునీసూత్రము సంఘధర్మశాసనమై ప్రాచీనభారతీయసంఘజీవితమునకాదర్శమై వెలయుచున్నది. ఇందు, కౌత్స హారీత కాణ్వ పుష్కరసాది వార్ష్యాయణి శ్వేతకేతు మనుప్రభృతు లగుప్రాచీనమునులు పేర్కొనఁబడిరి[1]. వాజసనేయకమత ముద్ఘాటింపఁబడినది. దీనినిబట్టి ధర్మనిర్ణయమున నిది మనుస్మృతినిగూడఁ గొన్నివిషయముల ననుసరించిన దనియే కాక, దీనికిఁ బూర్వము కౌత్సహారీతాదులధర్మనిర్ణయములు గూడఁ గల వనియు, వాజసనేయులయాచారములు వెలుపడినపిదపనే యిది యవతరించిన దనియు, వెనుకఁ జెప్పినట్లుగాఁ బాణినీయష్టాధ్యాయికంటె నిది పూర్వ మగుటచే దీనికాలము క్రీస్తుపూర్వ మెనిమిది లేక తొమ్మిదవశతాబ్దియై యుండు ననియుఁ దెలియనగును. దీనికి హరదత్తుఁ డుజ్జ్వల యనువ్యాఖ్యరచియించెను. పెక్కుగ్రంథములనుండి ప్రమాణవచనములను గ్రోడీకరించుచు సుబోధకముగా నున్నయీవ్యాఖ్యానము లోకప్రసిద్ధమై యున్నది.

ఆపస్తంబమువలెనే హైరణ్యకేశిధర్మసూత్రముగూడఁ దనకల్పసూత్రమున కనుబంధము. ౨౭ అధ్యాయములకల్పసూత్రములో ౨౬-౨౭ అధ్యాయములు ధర్మసూత్రాత్మకములు. ఇది మనదేశమున వ్యాపించినది కాదు.

గౌతమధర్మసూత్రము మూఁడుప్రశ్నలగ్రంథము. ఇదియును దక్షిణహిందూదేశమున నెక్కువవ్యాప్తిని జెంది, ఆపస్తంబమువలెనే ప్రమాణ మగుచున్నది. ఇది జన్మచే సామవేదీయమైనను, ఇందలివిషయము సర్వశాఖాసామాన్యమై వెలయుచున్నది. కాని యిందలియిరువదియాఱవయధ్యాయము సామవిధానబ్రాహ్మణము ననుసరించిన దగుటచే నీసూత్రము సామశాఖీయ మనుట

1. ఆప. ధ. సూ. 1-9-18; 2-6-14; 1-5-17;

స్పష్టము. దీనికిని హారదత్తుఁడు మితాక్షరవ్యాఖ్య రచియించెను. ఇందలిలౌకిక ధర్మములు హిందూధర్మశాస్త్రమం దుదాహృతములై యున్నవి. క్రియాకాండ మనుపేర నీసూత్రమునకుఁ బరిశిష్టగ్రంథము కొంత కలదు. కాని, యిది గౌతమ నిర్మితము కాదు.

బౌధాయనధర్మసూత్రము నాలుగుప్రశ్నలగ్రంథము. ఇందలి యవాంతరభాగము లధ్యాయములు. దీనికి గోవిందస్వామి రచించినవ్యాఖ్య ప్రసిద్ధమై యున్నది. ఏశాఖవా రయినను దమసూత్ర మున్నప్పటికిని బరసూత్రము నను సరించి యాచరింపవలసివచ్చెనేని, బౌధాయనసూత్రమునుబట్టి నడచినచో స్వసూత్రము నవలంబించినఫలమే చెందు నని వృద్ధమనువు చెప్పియున్నాఁడు.

'స్వసూత్రే విద్యమానేతు పరసూత్రేణ వర్తతే।
బౌధాయనమతం కృత్వా స్వసూత్రఫలభాగ్భవేత్'

దీనినిబట్టి యీసూత్రమునకుఁగల విశేషవ్యాప్తియు సర్వసమ్మతత్వమును దెలియుచున్నవి.

శ్రౌతగృహ్య సూత్రములందువలెనే ధర్మసూత్రములందును సంప్రదాయభేదములు కొన్ని గనవచ్చుటయే కాదు, దేశభేదమునుబట్టి వచ్చినయాచార భేదములు కూడఁ గొన్ని గనిపించును. వాసిష్ఠమువలెనే యాపస్తంబము షడ్విధ వివాహములు చెప్పినది. గౌతమాదు లష్టవిధవివాహములు చూపినవి. గాంధర్వము నుత్తమవివాహములలో నేదియుఁ జేర్చలేదు కాని, షడిత్యేకే, అనుచుఁ గొంద ఱాసురగంధర్వములు సమ్మతించినట్లు గౌతమసూత్రము చెప్పినది. బ్రాహ్మార్షదైవములు మూఁడే ప్రశస్తము లని యాపస్తంబ మన్నది. దీనికిఁ బ్రాజాపత్యమును జేర్చి నాల్గు ప్రశస్తములని బౌధాయనము నక్కాణించినది.

సూత్రము లన్నిటియందును సాధారణముగా వర్ణవిభాగము ఉపజాతులు తత్తజ్జాతికృత్యములు ద్విజాతుల యుపనయనము గురుసేవనము వివాహము గార్హస్థ్యము నిత్యనైమిత్తికకర్మలు ప్రాయశ్చిత్తములు అతిథిసత్కారము తత్తజ్జాతిజీవికలు భోజ్యాభోజ్యములు జాతాశౌచమృతాశౌచములు శ్రాద్ధము దానము రాజధర్మములు దండవిధులు వానప్రస్థము సన్యాసము మొదలయిన సర్వవర్ణాశ్రమాచారసంబంధము లయినసాంఘికధర్మము లన్నియు వర్ణింపఁబడినవి. కాలమునుబట్టియు దేశమునుబట్టియు మాఱిన యాయాధర్మము లందందు విశేషముగా గోచరించును. ఇందు విశదీకరింపఁబడినకట్టుపాట్లు చూచినచో నెపుడైనమానవుఁ డిన్నినిబంధనలకు లోఁబడి జీవితకాలము గడపియుండెనా యని మన కిపు డాశ్చర్యము కలుగవచ్చును గాని, ఆకాలమున మూఁడు వర్ణములవారును, తరువాతఁ దరువాత బ్రాహ్మణులును వీనిలోని నియమము

లకు వశ్యులై ప్రవర్తించుచు వచ్చి రనుట యసంశయము. ఇపు డయిన నీనియమములకు లోఁబడి జీవితకాలము గడపు మహానుభావుఁడు కోటి కొక్కఁడైన భరతఖండమునఁ గనరాకపోఁడు. నిజముగా నీవిధుల ననుసరించి యొకమానవుఁడు ప్రవర్తించెనా, తప్పక యతఁడు చిత్తశుద్ధియు నారోగ్యము నాయుర్వృద్ధియు విజ్ఞానమును గలిగి బ్రహ్మజిజ్ఞాసాధికారియై యాత్మజ్ఞానమున ముక్తుఁ డగు ననుట నిరాక్షేపము. అయిన నేమి? ధర్మసూత్రము లుపదేశించిన యట్టి పావనజీవన మిపుడు భరతఖండవాసులకుఁ గలలోనివార్త యయ్యెఁ గదా!

## స్మృతులు.

ఇది వెనుకటి యన్నిటికంటెను మిక్కిలి చిక్కుగానున్న విషయము. సూత్రకర్తలలో నిద్దఱుమాత్రమే ప్రాచీనమహర్షులుగా నున్నారుకాని, యిపుడు లెక్కకు వచ్చుచున్నరమారమి నలువదిమంది స్మృతికర్తలలోను నలుగురైదుగురు తప్ప దక్కినవారందఱు నట్లే కనఁబడుచున్నారు. వారివివర మిది.—

కశ్యపుఁడు అత్రి భరద్వాజుఁడు విశ్వామిత్రుఁడు గౌతముఁడు (గోతముఁడు) జమదగ్ని వసిష్ఠుఁడు ననుసప్తమహర్షులు ఋగ్వేదసూక్తద్రష్టలు. వీరందఱిపేర స్మృతు లున్నవి. వీరిలో గౌతమభరద్వాజులు సూత్రకర్తలుగాఁ గూడ నున్నా రని యిదివఱకుఁ జదివియున్నాము.

అంగిరసుఁడు ఉశనసుఁడు ప్రజాపతి విష్ణువు యముఁడు బృహస్పతి సంవర్తుఁడు దేవలుఁడు నారదుఁడు ముద్గలుఁడు పరాశరుఁడు మనువు ననువారు ఋగ్వేదసూక్తద్రష్టలో నున్నారు.

యాజ్ఞవల్క్యుఁడు శుక్లయజుస్సుతో సంబంధము గలవాఁడు.

హారీతుఁడు శంఖుఁడు లిఖితుఁడు వ్యాసుఁడు పులస్త్యుఁడు శాతాతపుఁడు దక్షుఁడు మొద లగువారు పురాణేతిహాసములలోనివారు.

ఆపస్తంబుఁడు ఆశ్వలాయనుఁడు బోధాయనుఁడు గోభిలుఁడు కాత్యాయనుఁడు ననువారు సూత్రకర్తలలోనివారు. ఇంకను గొందఱు స్మృతికర్తలు వినవచ్చుచున్నారు. వారిమాట యటుండ నిండు. ఇపుడు ముందుగా, అత్రి మొదలుగా మనువువఱకుఁ గలసూక్తద్రష్టలు స్మృతికర్త లగుదురా కారా? యని విచారణ చేయుదము.

వారే వీ రన్నచో నీస్మృతులు ఋగ్వేదకాలమందే పుట్టిన వని వాఙ్మయచరిత్రకు విరుద్ధముగాఁ జెప్పినట్లగును. ఛందోబద్ధము లైనఋక్కులు రచియించిన వారికి స్మృతిశ్లోకములు నిర్మించుట దుర్లభము కాదు గాని, ఆభాషకు నీభాషకు హస్తిమశకాంతర ముండుటచే నివి వారివి కా వని యంగీకరింపవలసివచ్చుచున్నది. అట్లయినచో నెవరో రచియించి వారి పే ళ్లెందుకుఁ బెట్టవలసివచ్చిన

దని యాక్షేపము రావచ్చును. ఇందు కొక్కటే సమాధానము. వంశపరంపరా ప్రాప్తములు సంక్షేపవాగ్రూపములు నగునమ్మహర్షుల ధర్మసంప్రదాయములకు వారిగోత్రములవారు సవిస్తర మయిన పద్యమయస్మృతిరూపము గల్పించి వారిపేరఁ బ్రకాశింపఁ జేసియుందురు. లేదా, ప్రాచీనసంప్రదాయముల ననుస రించి వారిపేళ్లు గల యర్వాచీనమును లెవరయిన రచియించియుందురు. అంతే కాని ఋగ్వేదమునాఁటి ఋషులు మాత్రము వీనిని రచియింపలే దని విశ్వసింప వచ్చును. ఇందుకుఁ గొన్ని కారణములు.—

మనుస్మృతియవతారికలో, మహర్షు లందఱు మనువును సమీపించి నమ స్కరించి, మహాత్మా! మాకు వర్ణాశ్రమధర్మములు చెప్పవలసిన దని కోరఁగా నతఁడు, ఈశాస్త్రమును (మనుధర్మశాస్త్రమును) స్వయంభుబ్రహ్మ నిర్మించి మొదట నాకుఁ జెప్పెను. తరువాత నేను దీనిని మరీచ్యాదులకుఁ జెప్పితిని. ఇపుడు భృగుమహర్షి మీకుఁ జెప్పఁగలఁడు. అతనివలన వినుఁ డని చెప్పినట్లున్నది.

అత్రిసంహితా త్రిస్మృతులమొదల, మునీశ్వరు లందఱును వేదవిద్వరుఁ డైనయత్రిమహర్షికి నమస్కరించి సర్వలోకహితకర మైనయర్థము చెప్పు మని కోరఁగా నతఁడు ధర్మములు చెప్పిన ట్లున్నది.

యాజ్ఞవల్క్యస్మృతిమొదట, మిథిలాపురమం దున్నయోగీశ్వరుఁ డైన యాజ్ఞవల్క్యునికి మునులు మ్రొక్కి వర్ణాశ్రమధర్మములు చెప్పు మనఁగా నతఁడు చెప్పినట్లున్నది. ఇట్లే తక్కినస్మృతులయందు నుపక్రమము కనవచ్చును. ఇది యంతయు, కథలు చెప్పు మని శౌనకాదులు సూతుని, జనమేజయుఁడు వైశం పాయనుని గోరఁగా వారు భారతాదికథలు చెప్పుటను బోలియున్నది. భార తాదులలోని యాకథలకు సూతవైశంపాయనులు కర్తలైనచో వీని కత్రిమను ప్రభృతులు కర్త లనఁదగియుందురు గాని యది సంభవింపకున్నది. పోనిండు, ఈపోలిక యెందుకు? ఇది శాస్త్రమహత్త్వప్రశంసాపర మయినయామహర్షుల శైలీవిశేష మందు మేని మఱియొక యాక్షేపము వచ్చును. అవతారికనుబట్టి ధర్మ శాస్త్రము స్వయంభువు రచియించినట్లు కనఁబడుచుండ దీనికి మానవధర్మశాస్త్ర మను పేరెట్లు వచ్చిన దని శంకించుకొని, కుల్లూకభట్టు, "శాస్త్రశబ్దముచే శాస్త్రార్థ మైనవిధినిషేధసమూహమే చెప్పఁబడును. దానిని బ్రహ్మ మనువునకు బోధిం చెను. మనువు దానిని గ్రంథరూపముగా నిర్మించెను" అని మేధాతిథి మత మునుబట్టి సమర్థించెను. దీనినిబట్టి సప్తమనువులలో మొదటివాఁ డయినస్వాయం భువమనువు ధర్మశాస్త్రకర్త యని యంగీకరింతము. అట్లయినచో ఋక్సూక్త ద్రష్ట లైనసాంవరణ వైవస్వత మనువులకంటెఁ పూర్వుఁ డైనయితనిధర్మ శాస్త్రము ఋగ్వేదమునకుఁ బూర్వ మగును. నిజముగా నవతారిక యుద్దేశ మిది కల్పాదియందు పుట్టిన దనియే. అయిన నిది స్వాయంభువమనుకృత మని కాని

శ్రుత్యర్థము ననుగమించునిది శ్రుతుల కన్న ముందు పుట్టె ననికాని భావించుట సముచితమా? ఇఁక దీని నిట్లుంచి ప్రసిద్ధ మైనపరాశరస్మృతి గ్రహింతము.

పరాశరస్మృతిలోఁ బెక్కుచోట్ల "తం ప్రవక్ష్యా మ్యహం పూర్వం పరాశరవచో యథా" అనువాక్యము కనఁబడుచున్నది. దీనినిబట్టి పరాశరుని మతము నన్యుఁ డొకఁ డావిష్కరించె నని విదిత మగుచుండఁగా నిది పరాశరుఁడే నిర్మించె నని యెట్లు చెప్పఁగలము? ఈపరాశరుఁడు సూక్తద్రష్ట యైనపరాశరుఁడో వ్యాసునితండ్రి యైనపరాశరుఁడో మఱియొకఁడో నిర్ణయించుట యెట్లు? ఎవ రన్నను, పరాశరునివచన మెట్లున్నదో దాని ననుసరించి చెప్పుచున్నా ననెడి గ్రంథకర్తప్రతిజ్ఞ కర్థమేమి? తక్కినవానివిషయము నిట్టిదే. కావున నాత్రేయాదిమానవాంతస్మృతు లయ్యామహర్షులసంప్రదాయములనుబట్టి తరువాతఁ దరువాత వారిగోత్రములవారో వారిపేళ్లవారో రచియించి యుందు రనుట సమంజసము. ఇఁక యాజ్ఞవల్క్యస్మృతికర్తృత్వము—

యాజ్ఞవల్క్యుఁడు కశ్యపాత్రిమన్వాదులవలెఁ బురాతనముని కాఁడు. మిథిలాపురవాసి యైనయీయోగీశ్వరుఁడు శుక్లయజుశ్శాఖకు బ్రాహ్మణము రచియించినవాఁ డనియుఁ జిరంతనముని కాఁ డనియుఁబాణినీయసంప్రదాయమునఁ గూడఁ దెలియుచున్నది. అట్టి యితఁడు స్మృతి రచియించియుండు నని యంగీకరింపవచ్చును గాని, దానియవతారికలోని రెండుశ్లోకము లించుక సంశయాస్పదముగా నున్నవి.

"మ న్వత్రి విష్ణు హారీత యాజ్ఞవ ల్క్యోశనో ఽఙ్గిరాః।
య మాప స్తంబ సంవర్తాః కాత్యాయన బృహస్పతీ॥
పరాశర వ్యాస శంఖ లిఖితా దక్ష గౌతమౌ।
శాతాతపో వసిష్ఠశ్చ ధర్మశాస్త్రప్రయోజకాః॥"

యాజ్ఞవల్క్యుఁడే గ్రంథకర్త యైనచో నిట్లు స్మృతి యారంభించుచునే పూర్వస్మృతికర్తలలోఁ దనపేరు చేర్చుకొనునా? పోనిందు చేర్చుకొనుఁగాక. తక్కినవా రందఱు నితనికిఁ బూర్వు లని యంగీకరింత మన్నను, విస్పష్టముగా నితని కర్వాచీనుఁ డైనపాణినికిఁ దరువాతివాఁ డని తెలియుచున్న కాత్యాయను నెట్లు పేర్కొను ననెడి యాక్షేపము మాత్రము రాకపోదు. కాని, "పాణినీయవాక్యకారుఁడును శుక్లయజుః ప్రాతిశాఖ్య శ్రౌతసూత్రాదికర్తయు నగు కాత్యాయనుఁడే యితఁడు పేర్కొన్న స్మృతికర్త యగుకాత్యాయనుఁ డనుటకుఁ దగిన ప్రమాణము కనరాదు. అందుచే స్మృతికర్త యైనమఱియొక కాత్యాయనుఁడు యాజ్ఞవల్క్యునికిఁ బూర్వ ముండె ననుట కాక్షేపమే" మని సమాధానము రావచ్చును. కాని, ఆ యితరకాత్యాయనుఁ డెందును ప్రసిద్ధుఁడై కనరాఁడు.

అందుచే నిచ్చట మూఁడే గతులు. స్మృతికర్త యగుకాత్యాయనుఁ డొకఁడు పూర్వుఁడు కలఁ డన్నచో, అవతారిక యన్యోక్తిగా నున్నను, అది మహర్షుల శైలి యని యంగీకరించి వైదికయాజ్ఞవల్క్యుఁడే యీస్మృతి రచియించె నన వలెను. ఇది వైదికయాజ్ఞవల్క్యుఁడు రచించినదే కాని, యట్టిపూర్వకాత్యాయనుఁడు లేఁ డన్నచోఁ బైశ్లోకములు ప్రక్షిప్తము లనవలెను. అట్లు కా వన్నచో వైదికయాజ్ఞవల్క్యునిసంప్రదాయము ననుసరించి ప్రసిద్ధకాత్యాయనుని తరువాతివాఁ డగు మఱియొక యాజ్ఞవల్క్యుఁ డీస్మృతి రచియించె ననవలెను. ఇట్లే పురాణేతిహాసాదులలోని హారీతాదుల స్మృతులను గూర్చియు విచారింప నగును. ఇఁక సూత్రకర్త లగునాపస్తంబాదులస్మృతు లున్నవి.

వివిధసూత్రకర్తలైనయాపస్తంబాశ్వలాయన బోధాయన గోభిలకాత్యాయనాదులు తమధర్మసూత్రముల గూఢార్థమునే పద్యమయస్మృతిరూపమున వెల్లడించియుండు ననుట కాక్షేపము లేదు గాని వెనుకఁ జెప్పినట్లే వానియారంభము లన్యోక్తులుగా నున్నమాట సత్యము. అయినను, వారిధర్మసూత్రములు ప్రత్యక్షమగుచుండ స్మృతులు వారి వన్నను వారిమాటలసార మన్నను భేదము లేదు గావున నవి తత్కృతములు గానే యంగీకరింపవచ్చును.

ఈ స్మృతులలో మఱొక్కవిశేషము. ఇది కూడ వెనుక వచ్చిన కర్తృత్వశంకను బలపఱుచునది గావున నించుక పరిశీలింతము. వీనిలో వృద్ధ లఘు విశేషణములతోఁ గూడినవి సుమారు పది యున్నవి. ఇందు వృద్ధవిశేషణము కొన్నిచోట్ల గ్రంథపరముగాను, మఱికొన్నిచోట్ల స్మృతికర్తృపరముగాను గూడఁ గనఁబడుచున్నది. కర్తృపర మయినదాని కైనను నియతస్థితి లేదు. వృద్ధమను వృద్ధపరాశర వృద్ధయాజ్ఞవల్క్యాది స్మృతులు మన్వాదిస్మృతుల కంటె నన్యము లని చెప్పక తప్పదు. వారు పూర్వు లగుటచే వృద్ధవిశేషణము వచ్చినదో, లేక మన్వాదులే ముందు పెద్దస్మృతులు రచియించి తరువాత వానికి సంగ్రహములు వ్రాయుటచే మొదటివానికిఁ దరువాతివారు వృద్ధ విశేషణములు తగిల్చిరో తెలియదు. అట్లయిన రెండవవానికి లఘువిశేషణము లెందుకు రాలే దనెడి యాక్షేపము సిద్ధ మగును. ఇది యిట్లుండ మొదట రచియించినదానికి రెండవది సంగ్రహ మగుటచే లఘువిశేషణము గాంచె నందుమేని వృద్ధహారీత స్మృతికిని లఘుహారీతస్మృతికిని విషయైక్యమే లేదు. అట్లు గాక, ఒకఁడే రెండేసి మూఁడేసి విభిన్నవిషయము లగుస్మృతులు రచియించె నందుమా, అదియును బొసఁగ కున్నది. ఇందు కొకయుదాహరణము.

శాతాతపస్మృతి వృద్ధశాతాతపస్మృతి లఘుశాతాతపస్మృతి యనునవి మూఁడును ముద్రితము లైనవి. ఇందు మొదటిది సుమారు ౨౭౦ శ్లోకములతో నున్నది. ఇది శాతాతపుఁడు తనశిష్యుఁ డైనశరభంగున కుపదేశించినట్లున్నది.

కాని యీమాట కొన్ని వ్రాతప్రతులలో లేదు. ఈస్మృతిలోనివిషయము కర్మవిపాకము. ఇందు ప్రాయశ్చిత్తములు విధింపఁబడినవి.

రెండవదానిలోని మొదటిశ్లోకము, వృద్ధశాతాతపుఁడు చెప్పిన స్మృతితంత్రమును సంక్షేపముగాఁ జెప్పుచున్నాననెడి గ్రంథకర్తృప్రతిజ్ఞను దెల్పుచున్నది. గ్రంథమధ్యమందు "శాతాతపోఽబ్రవీత్, శాతాతపవచోయథా" అను మాటలు కనవచ్చుచున్నవి. గ్రంథసంఖ్య చూతుమా, అఱువది యెనిమిది శ్లోకములు. విషయము చూతుమా, పూర్వోక్తశాతాతపాదులలోని కొన్ని ప్రాయశ్చిత్తములు. ఇట్టి గ్రంథము వృద్ధశాతాతపస్మృతి యనఁబడుచున్నది.

మూఁడవదాని మొదట 'శాతాతపస్య మహర్షే ర్ధర్మశాస్త్రం వ్యాఖ్యాస్యామః' అను ప్రతిజ్ఞావచన మున్నది. మధ్యమధ్య 'శాతాతపోఽబ్రవీత్' అను వాక్య మైదాఱుచోట్ల నున్నది. ఈశాతాతపధర్మశాస్త్ర ముత్తమ మని కడపటి శ్లోకము చెప్పుచున్నది. ఇందలి శ్లోకసంఖ్య ౧౭౩. ఇందు బ్రహ్మహత్యాసురాపానాది మహాపాతకములకుఁ బ్రాయశ్చిత్తములు విధింపఁబడినవి. ఇట్టి గ్రంథము లఘుశాతాతపస్మృతి యని చెప్పఁబడుచున్నది. దీనినిబట్టి యనేకస్మృతులనామములు వానికర్తృత్వములు నెంతసముచితములుగా నున్నవో యాలోచింపవలసినదే కాని, యిఁక దీనింగూర్చి చర్చించుట యనావశ్యకము. కాని, యొకమాట. స్మృతుల నామములకును ఋషులపేళ్లకును ముడివెట్టి వాని పౌర్వాపర్యమును, ప్రాచీనార్వాచీనతను నిర్ణయించుట యసంగత మని మాత్రము చెప్పవలసియున్నది. ఇట్లనుటచేఁ బ్రాచీనస్మృతులు లేవని నాయభిప్రాయము గాదు. మను హారీత గౌతమాపస్తంబ పరాశర వాసిష్ఠయాజ్ఞవల్క్యాదిస్మృతులు ప్రాచీనము లనుట నిరాక్షేపము. ఇందు మొదటిరెండును బ్రాచీనతమములు. తక్కిన వాని పౌర్వాపర్య మజ్ఞేయముగా నున్నది.

ఇట్లున్న యీధర్మశాస్త్రము లన్నిటిలోను విషయమునుబట్టియు గుణమును బట్టియు నాఁటినుండి నేఁటిదనుక లోకమునఁ గొనియాడఁబడుచున్నవి మనుయాజ్ఞవల్క్యపరాశరస్మృతులు. ఇవి దాదాపు మూఁడువేల సంవత్సరములనాఁడు భారతీయులవర్ణములను ఆశ్రమములను ఆచారములను వ్యవహారములను రాజపరిపాలనమును సక్రమముగా క్షేమంకరముగా నడపింప నుదయించిన పెద్దచట్టములు. అంతే కాదు, ప్రపంచవిజ్ఞానమునకు గనులు. సౌశీల్యోపదేశమునకు గురువులు. నిష్కాములును నిష్పక్షపాతులును దేశహితాభిలాషులు నగు నమ్మహామునులు పరమేశ్వరప్రేరిత మైనసత్సంకల్పముతో నిర్మించినవి కావుననే, యీదీర్ఘకాలములో దేశ మెన్నికడగండ్లకు లోఁబడినను, ఎన్నో రాజ్యములు తలక్రిందైనను, వృత్తులు తాఱుమాఱైనను, కాలకర్మవశమున నివి పఠనశ్రవణ వ్యవహారమునకు దూరము లైనను, నవీననాగరికత ప్రబలుచున్నను, కులక్రమాగత మైనవీని

యుపదేశసారము నేటికిఁ గూడ హైందవుల రక్తనాళములయందు కొంచెము గానో గొప్పగానో ప్రవహించుచున్న దనుటయే వీనిమహత్త్వమును వేనోళ్లఁ జాటుచున్నది. ఇందు:—

కుల్లూకభట్టవిరచిత మైనమన్వర్థముక్తావళీవ్యాఖ్యతో విలసిల్లు ద్వాదశాధ్యాయపరిమిత మగుమనుస్మృతి సుమారైదువందల సాంఘికధర్మములను బోధించుచు హృదయరంజక మగుచున్నది. ఆచారవ్యవహారప్రాయశ్చిత్తము లను మూఁడధ్యాయములును, వర్ణనిర్ణయ వ్యవహారలక్షణాశౌచవిధానాదు లగు నలువదినాలుగు ప్రకరణములును గలిగి విజ్ఞానేశ్వరవినిర్మిత మితాక్షరావ్యాఖ్యతో విరాజిల్లుయాజ్ఞవల్క్యస్మృతియు నట్లే వందలకొలఁది ధర్మముల నావిష్కరించుచున్నది. పరాశరస్మృతి పరిమాణమున వానికంటె మిక్కిలి చిన్నదైనను, సాయణాచార్యుని జ్యేష్ఠసోదరుఁడును వేదవేదాంగవేత్తయు నగు మాధవాచార్యునిచే వ్యాఖ్యాతమై పెద్దరత్నావణ మైనది. మూలమున కిరువదిరెట్లెక్కువగా వ్యాఖ్యయుండుట యొకటే విశేషము కాదు, ఈవ్యాఖ్యతోడి పరాశరస్మృతిచేతిలో నున్నచోఁ దొల్లి యుదయించినస్మృతు లన్నియును ధర్మసూత్రములును బురాణములును గూడఁ జేతిలో నున్నట్లే. అందుచేతనే దీనికిఁ బరాశరమాధవీయ మనెడివిఖ్యాతి లోకమున విస్తరించినది. ఇదియును వెనుకటివానివలెనే సర్వవిధము లైనవర్ణాశ్రమాచార వ్యవహారాదులను బోధించుచు వ్యాఖ్యానమహిమచే బహువిధ దేశాచారమతభేదముల నొక్కచోఁ దెలుపుచున్నది. అముద్రితములును నామమాత్రావశిష్టములు నైనయెన్నో స్మృతులలోని శ్లోకములు దీనిలోఁ గనవచ్చుచున్నవి. బొంబాయిలో, పండితవామనశాస్త్రిచేఁ బ్రకటింపఁబడిన సవ్యాఖ్యపరాశరధర్మశాస్త్రము పాఠకులపాలిటికల్పతరు వనఁదగినంత విశదముగా నిర్దుష్టముగా నున్నది.

మనుస్మృతిలో ద్వితీయాధ్యాయమున నొకశ్లోక మిట్లున్నది.

"యో ఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయా ద్విజః
స సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః"

వేదవాక్యము విప్రలంభకవాక్యమువంటి వాక్యమేకావున నది ప్రమాణము కా దని హేతువాదము నాశ్రయించి యేద్విజుఁడు శ్రుతిస్మృతుల నవమానించునో, వేదనిందకుఁ డైనయట్టి నాస్తికుని శిష్టులు వేదాధ్యయనాదికర్మలనుండి బహిష్కరింపవలె నని దీనిభావము. ఇందలి నాస్తికపద మాధారముగాఁ గొని కొందఱు 'మనుస్మృతి బౌద్ధచార్వాకాదిమతములు బయలుదేఱినపిదప నుదయించిన' దని భావించిరి కాని యది సరికాదు. వేదోక్తకర్మ లాచరింపనివారును సోమపానమును యాగపశ్వాలంభమును నిరసించినవారును బ్రాచీనార్యులకాలమునుండియుఁ గల రనుటకు, వేదోక్తకర్మాచరణమున మతభేద మాశ్ర

యించి భారతీయవైదికార్యులతోఁ గలహించి వెడలిపోయిన పారశీకార్యులే నిదర్శనము. అట్టికర్మనిందక మైనమత మొకటి పారంపర్యప్రాప్తమై యందందు తలచూపుచుండ వేదోక్తకర్మలు నిందించు ద్విజునకు వేదములు చెప్పరా దను తలంపుతో నిందు నాస్తికశబ్ద ముపయోగింపఁబడినది గాని, యిది బౌద్ధచార్వాకాదుల నుద్దేశించి ప్రయోగింపఁబడినది కా దనుట స్పష్టము. కావున స్మృతులకాలము క్రిందికి దిగలాగుటకై బయలువెడలిన యీవాదము సముచితము గాదు.

మఱికొందఱు గద్యాత్మకము లైనసూత్రములు ముందు పుట్టిన వనియు, పద్యాత్మకము లైనస్మృతులు తరువాతఁ బుట్టిన వనియు విపరీతవాదము లేవనెత్తిరి. ఇది యెంతమాత్రమును హేతుబద్ధము కా దనుట కింతవఱకుఁ జూపిన యాయాగ్రంథముల పౌర్వాపర్యమే చాలును. క్రీస్తుపూర్వము పదునాల్గవ శతాబ్ది మొదలుగా నైదవశతాబ్ది కడపటివఱకును సూత్రగ్రంథము లుదయించుచునే యున్నవి. వానిలోఁ గడపటిదిగా భావింపఁబడు వైఖానసధర్మసూత్రము కంటెను, పాణినికిఁ బూర్వుఁ డైన యాపస్తంబుఁడు స్మరించినమనుస్మృతి పర మనుట కెవ రైన సాహసింపఁగలరా ? పాణినితరువాతివాఁ డయినకాత్యాయనుని శ్రౌతగృహ్యసూత్రాదులకంటెను గూడ మనుస్మృతి పర మనుట శక్యమగునా ? కావున నీవాదము నిరాధార మనియు, సూత్రములును, పద్యాత్మకస్మృతులును జనియించుటలోఁ బౌర్వాపర్యము నిర్ణయింప శక్యము గా దనియు విశ్వసింపనగును.

ఇట్లు వర్ణాశ్రమధర్మశాసనము లై శ్రుతుల ననుగమించి బయలువెడలిన స్మృతుల ననుసరించి యనేకము లయిన నిబంధనగ్రంథము లుదయించినవి. వానిలో హేమాద్రి మాధవ కమలాకర భట్టాది పండితోత్తములు రచియించిన నిబంధనములు సాంఘికధర్మశాసకములు బహువిధకాలవిజ్ఞానదాయకములునై లోకమునఁ బ్రసిద్ధి గాంచియున్నవి. అందు హేమాద్రి మాధవమతములను జక్కఁగాఁ బరిశీలించి కమలాకరభట్టు రచియించిన నిర్ణయసింధువు పరమ ప్రమాణముగాఁ గొనియాడఁబడుచున్నది. ప్రాయశ్చిత్తవిధానమున హేమాద్రి సర్వోత్తమముగా వన్నె కెక్కినది. ఇట్లే స్మృతిచంద్రిక స్మృతిప్రకాశము జ్యోతిర్నిబంధము స్మృతిసారావళి జ్యోతిఃప్రకాశము సంబంధవివేకము శుద్ధిచింతామణి ప్రయోగ పారిజాతము సంస్కారలోపము మదనరత్నము మితాక్షర (మార్కండేయకృతము) మొదలయినవి బహువిధాచారముల భేదములను, తన్నిర్ణయములను జూపుచున్నవి. ఈనిబంధనగ్రంథములలోఁ గూడఁ గొన్ని వ్యాస గర్గ వసిష్ఠ శౌనకాదులు రచియించినవి గానే గ్రంథాంతగద్యములవల్లను, ఇతర నిబంధనకర్తల యుదాహరణవచనములవల్లను దెలియుచున్నను గాని, యట్టి

వన్నియు స్మృతులకంటె నత్యంత మర్వాచీనము లగుట సత్యముగావున నవి తత్తత్పూర్వమహర్షి నిర్మితము లనిమాత్రము భ్రాంతి పడరాదు. స్మృతీతిహాసపురాణములలోని విశేషవిషయములనే దేశాచారభేదములనుబట్టి యీనిబంధనములు వివరించిన వగుటచే వీనింగూర్చి విశేషించి వ్రాయవలసినది లేదు.

## పరిశిష్టములు.

ఒకపూర్వగ్రంథమందు చెప్పఁబడని విషయములను వర్ణించుచుఁ దరువాత దాని కనుబంధ మైనగ్రంథశేషము పరిశిష్ట మనఁబడును. దీనికి ఖిల మనియుఁ బేరు కలదు. తమకు సంబంధించిన గ్రంథములకు సంపూర్ణత నొసంగనుదయించిన యీపరిశిష్టములు వానియందలి విషయములకు సరిపడునవై ప్రాచీన విద్వాంసుల విషయపరిశోధనమును వాఙ్మయాభిలాషను గ్రంథనిర్మాణపద్ధతిని వెల్లడించుచు, వైదికసారస్వతగరిమను విస్తరింపఁజేసిన ప్రచారకులో యనునట్లు దేశము నలుఁగడల వ్యాపించినవి. లెక్కకు మిక్కిలి యెక్కువగా నున్న యివి ఋగ్వేదము మొదలుగా సూత్రముల తుదివఱకుఁ గల వివిధగ్రంథములలో ననేకములకు సంబంధించి కనవచ్చుచున్నవి గాని, వీనిలో ముప్పాతిక మువ్వీసమెపు డెవరు రచియించిరో చెప్పుటకుఁ దగినయాధారములు మాత్రము లభింపవు. కడచిన యధ్యాయములందు ఋగ్వేదఖిలసూక్తములు, వాజసనేయ సంహితలోని కడపటియధ్యాయములు కొన్ని, తైత్తిరీయారణ్యకములోని యాజ్ఞికృ్యోపనిషత్తు, నిరుక్తపరిశిష్టము, శుక్లయజుః ప్రాతిశాఖ్య పరిశిష్టము మొదలుగాఁ గల పరిశిష్టములనుగూర్చి యాయాసందర్భములఁ జదివియున్నాము. ఇపుడు తత్తత్పరిశిష్టవిశేషములు సంగ్రహముగా గ్రహింతము.

ఋగ్వేదమునకుఁ జేరినఖిలము లను పరిశిష్టసూక్తములు ముప్పదిరెండున్నను వానిలో ననేకము లొకటిరెండు మూఁడు ఋక్కులతోనే యున్నవి. శ్రీసూక్త మొకటిమాత్రమే ౨౯ ఋక్కులు కలది. దీనిలో మొదటి పదియేను ఋక్కులకుమాత్రమే సాయణులు భాష్యమువ్రాసిరి. ఈ సూక్త మొకటి మాత్రమే లోకమునఁ బ్రసిద్ధి కెక్కినది. తక్కిన సర్పమంత్ర గరుడమంత్రాది రూపముల నున్న నెక్కుసూక్తము లథర్వసంహితవ్యాప్తి చెందిన తరువాత నవతరించినవి కావచ్చును. ఇందు రాత్రిసూక్తమేధాది సూక్తములు కొన్ని భాషారీతినిబట్టి లౌకికభాష చక్కఁగా వ్యాప్తిచెందినకాలములోఁ బుట్టినవిగాఁ గనవచ్చుచున్నవి. కాని, యిందలి కొన్ని కొన్ని ఋక్కులు ఋగ్వేదములోనివే యనుట నిజము. ఇంక, సూత్రములకు సంబంధించి బహ్వృచపరిశిష్టము శాంఖాయన పరిశిష్టము ఆశ్వలాయన గృహ్యపరిశిష్టము మొదలయినవి కొన్ని ఋగ్వేదోక్త కర్మబోధకములు కలవు కాని, యవి శాంఖాయనాది నిర్మితము లని మాత్రము తలంపరాదు.

గోభిలసూత్రములకుఁ బరిశేషముగా సామవేదోక్తకర్మలు బోధించునట్టి ఛందోగపరిశిష్ట మను గ్రంథ మొకటి కలదు. అది కాత్యాయనముని రచియించె నని యొకపారస్కరసూత్ర వ్యాఖ్యాత తెలిపెనుగాని, యది విశ్వసనీయము గా లేదు. ఇది గాక గృహ్యాసంగ్రహ మనుపేర గోభిలపుత్రుఁడు నిర్మించిన పరిశిష్టమును - సామగచ్ఛందస్సు - క్రతుసంగ్రహము - వినియోగసంగ్రహము - సోమోత్పత్తి - మొదలయినవి సామవేదమునకు సంబంధించిన వింకను గొన్ని కలవు.

యజుర్వేదపరిశిష్టములు పదునెనిమిది. అందు యూపలక్షణము ఛాగలక్షణము ప్రతిజ్ఞానువాక్యము అనువాకసంఖ్య చరణవ్యూహము[1] శ్రాద్ధకల్పము ప్రవరాధ్యాయము ఉక్థశాస్త్రము క్రతుసంఖ్య నైగమము యజ్ఞపార్శ్వము హౌత్రకము పాశవము కూర్మలక్షణము అనునవి వ్యాస నిర్మితములుగాఁ జెప్పఁబడుచున్నవి కాని, యిందుకుఁ దగిన సత్ప్రమాణ మేదియు లేదు. ఇవి గాక శుల్బములు ఋగ్యజుస్సులు పార్షదము ఇష్టకాపూరణము, అను నాలుగును యాజుషపరిశిష్టములుగానే గణింపఁబడుచున్నవి. వీనిలో యూపలక్షణాదు లనేకములు వానిపేళ్లనుబట్టియే శ్రౌతసూత్రగ్రంథములకుఁ బరిశిష్టములై శ్రౌతకర్మవిశేషములను బోధించున వని తెలియవచ్చుచున్నది. పార్షద మనునది ప్రాతిశాఖ్యసూత్ర పరిశిష్టముగా నున్నది. వీని కర్తృత్వము సందిగ్ధముగా నున్నను, ఇందు కొన్ని కాత్యాయనకృతము లనెడి ప్రతీతి కూడ నుండుటనుబట్టి పార్షదాదులు కొన్ని శుక్లయజుస్సంబంధములుగా నూహింపఁ బడుచున్నవి. ప్రవరాధ్యాయము కాత్యాయనకృత మని చెప్పెడి యీ క్రిందిశ్లోకము గూడ నీయూహ నొకించుక బలపఱుచుచున్నది.

'కాత్యాయన విరచితో విప్రాణాం హితకామ్యయా
అధ్యాయః ప్రవరాఖ్యో ఽయం పురా బ్రహ్మవినిర్మితః'

నిజముగా నిది కాత్యాయనుఁడు నిర్మించినదనుటకుఁ దగినహేతువులు లేవు గాని, యీగ్రంథము గోత్రనిర్ణయ మనుగ్రంథము ననుసరించినదిగాఁ గనవచ్చుచున్నది. ఇందు కశ్యపాది సప్తమహర్షుల గోత్రములును, అగస్తిగోత్రమును వివరింపఁబడినవి. నైగమపరిశిష్టము యాస్కనిరుక్త పరిశేషమే కాని యన్యము కాదు. ఇవియును గాక, ఉపజ్యోతిషము సాంగలక్షణము నను మఱి రెండు పరిశిష్టములు యజుర్వేదమునకుఁ గలవు.

---

1. శౌనకనిర్మితచరణ వ్యూహము దీనికంటె వేఱు.

అథర్వవేదమునకు సంబంధించిన పరిశిష్టములు సుమారు డెబ్బదివఱకును గల వని చరణవ్యూహములోని యొక్క వాక్యమునఁ గనవచ్చుచున్నది గాని యవి యలభ్యములుగా నున్నవి. కౌశికసూత్రకర్త యగుకుశికుఁడే యథర్వపరిశిష్టముల కర్త యని ప్రతీతి కలదు గాని, యిది వ్యాసకాత్యాయను లాయాపరిశిష్టములనిర్మాత లనుటవంటిదే కాని వేఱుకాదు.

## అనుక్రమణికలు.

అన్ని వేదములకును, అనుక్రమణికలు కలవు. ఇందు వేదములలోని మండలములు అష్టకములు కాండములు అధ్యాయములు ప్రశ్నలు సూక్తములు వర్గములు మొదలగువాని సరియైనసంఖ్యలను దెలుపునవి కొన్ని, సూక్తములు అనువాకములు పనసలు మొదలగువాని మొదళ్లను దెలుపునవి కొన్ని, వేదములలోని పదములను అక్షరములను దెలుపునవి కొన్ని, దేవతలను ఋషులను ఛందస్సులను దెలుపునవి కొన్ని, ఒకమంత్రముమొదలు తెలిసినచో నది యేవేదమందలి యేప్రధానభాగములోని యేయవాంతరభాగములో నున్నవమంత్రమో, అనుక్రమణీ సాహాయ్యమునఁ జెప్పవచ్చును. ఒకపదము గాని, యొకయక్షరము గాని తప్పిపోకుండఁగను మాఱిపోకుండఁగను క్రొత్తవి చేరకుండఁగను బ్రాచీన సంప్రదాయము ననుసరించి సంహితాపదపాఠాదులను సక్రమముగా లెక్కించి కట్టుదిట్టము చేసినయీయనుక్రమణిక లర్వాచీనములే యైనను వీనివలననే వేదములిపుడు యథోక్తముగా నిలిచి యున్న వనుట నిజము. అనుక్రమణికలు రచియించిన వారు వీ రని నిర్ణయించుట కవకాశము లేదు గాని, ఆర్షానుక్రమణి మొదలగుకొన్నిటి కర్తృత్వము మాత్రము శౌనకుని కారోపింపఁబడి యున్నది. సంహితలలోని బహువిధభాగములను మంత్రములను సూచించునట్టి సూచికలీయనుక్రమణిక లనుటచేతనే వీనియందలి విషయము గోచరించును గాని సర్వానుక్రమణినిగూర్చిమాత్ర మించుక వ్రాయవలసియున్నది.

శౌనకునిపేరఁ జరణవ్యూహ మొకటి గనఁబడుచున్నది. అది నాలుగువేదములందలి ముఖ్యవిషయములను సూచించుచున్నది. సర్వానుక్రమణి ప్రత్యేకముగా ఋగ్వేదమందలి యెల్లవిషయములను గరతలామలకము గావించుచున్నది. ఇది గాక ఋగ్వేదానుక్రమణి బోస్తలక్షణము సంహితాసూత్రము చతుర్జ్ఞానము మొదలగుమఱికొన్ని యనుక్రమణికలు ఋగ్వేదమునకుఁ గనవచ్చుచున్నవి గాని, యవి దీనివలె వివిధవిషయసూచికలు కావు. సర్వానుక్రమణి కెవరో యొకటీక రచియించిరి గాని, దానికంటె షడ్గురుశిష్యుని వేదార్థదీపికయే ప్రశస్తముగా నున్నది. ఈవ్యాఖ్యాత కలిసంవత్సరములు ४౨౮౩ నిండుతఱి ననఁగా నిప్పటికి ౭౮౩౫ సంవత్సరముల క్రిందట నీవృత్తి రచియించె నని యితనిమాటలవల్లనే

తెలియుచున్నది[1]. కాత్యాయనునితరువాత సుమారు పదునాలుగువందలయేండ్లకు జన్మించినషడ్గురుశిష్యుఁడు శౌనకాశ్వలాయనకాత్యాయన కృతుల సత్యవృత్తాంత మెఱిఁగి వ్రాసె ననుట విశ్వాసపాత్రము గాక పోయినను, అతఁడు తెల్పినయవ తారికలోనివిషయ మిందు సంగ్రహించి చూపెదను.

"తొలుత భారద్వాజకులమున శౌనహోత్రుఁడై పుట్టి తరువాత భృగు కులమున శౌనకుఁడై జన్మించినమహర్షియే ఋగ్వేదద్వితీయ మండలద్రష్ట. అతఁడు పెక్కుగ్రంథములు రచియించెను. అందు కల్పసూత్ర మొకటి. శౌనకుని శిష్యుఁ డాశ్వలాయనుఁడు మఱియొక శ్రౌతసూత్రము నిర్మించి గురువునకు నివే దించెను. అది చూచి శౌనకుఁడు శిష్యునిప్రీతికై సహస్రఖండపరిమిత మైనతన కల్పసూత్రగ్రంథమును నశింపఁజేసెను. శౌనకునితక్కిన గ్రంథములు పదియును ఋగ్వేదమును సంరక్షించునవి. అవి, ఆర్షానుక్రమణి-ఛందోఽనుక్రమణి - దేవ తానుక్రమణి - అనువాకానుక్రమణి - సూక్తానుక్రమణి - ఋగ్విధానము - పాదవిధానము - బృహద్దేవత - ప్రాతిశాఖ్యము - స్మార్తదర్శనము - అనునవి. అశ్వలాయనుఁడు రచియించినవి పన్నెండధ్యాయముల కల్పసూత్రము నాలుగ ధ్యాయముల గృహ్యసూత్రము ఐతరేయారణ్యకములోని నాల్గవయారణ్యకము, అనునవి. ఈపదమూఁడుగ్రంథము లెఱిఁగినకాత్యాయనముని, వాజసనేయిశ్రౌత సూత్రము - సామశాఖకుఁ జెందినయుపగ్రంథము - శ్లోకమయ మైనస్మృతి - అథర్వవేదసంబంధి బ్రహ్మకారిక - శుక్లయజుః ప్రాతిశాఖ్యము - పాణినీయమహో దధికి నావ యైనమహావార్తికములు - ఋగ్వేదమునకు సంబంధించిన సర్వానుక్ర మణి - అను గ్రంథములు రచియించెను."

దీనినిబట్టి, ఆశ్వలాయనకాత్యాయనుల కృతులనుగూర్చి యాక్షేపణ లేదు గాని, శౌనకుఁడు పదిగ్రంథములు రచియించె ననుటయే యాక్షేపార్హమై యున్నది. నిజముగా శౌనకుఁడు ఋగ్వేదగుప్తి కార్షానుకమణికాదు లైదును రచియించె నేని వానిని జూచినకాత్యాయనుఁడు వానియందలివిషయమే సర్వానుక్రమణికగా రచియించియుండఁడు. శౌనకుఁ డార్షానుక్రమణ్యాదులు రచియించె నని షడ్గురు శిష్యుఁడు మాత్రమే చెప్పెను గాని,వరరుచి యనుపేరుగలకాత్యాయనుఁడు సర్వా నుక్రమణి వ్రాసినట్లుగా నితనివలెనే, ఋగ్వేదవ్యాఖ్య వ్రాసినయాత్మానందుఁడు గూడ "శౌనకాదిమతసంగ్రహీతు ర్వరరుచే రనుక్రమణికా" యనుచు వచించి

---

1. ఖగో ఽన్త్యా న్మేష మాషేతి కల్యహ ర్గణనే సతి
సర్వానుక్రమణీవృత్తి ర్జాతా వేదార్థదీపికా.
లక్షాణి పంచదశవై పంచషష్టి సహస్రకమ్
ద్వాత్రింశచ్చ శతం చేతి, దినవాక్యార్థ ఈరితః.
1565132 దినములను 365 చే, భాగింపఁగాఁ ౪౨ సంవత్సరములు వచ్చినవి.

యున్నాఁడు. ఇప్పటికిఁ గనవచ్చుచున్న ఋగ్వేదసంబంధిలక్షణ గ్రంథములలో ఋగ్విధానము బృహద్దేవత యనురెండును శౌనకుఁడు రచియించిన వనికొందఱు నమ్ము చున్నారు. ఇందు బృహద్దేవత గూడ ఋషిచ్ఛందోదేవతాదులను వివరించిన దగుటచే నాత్మానందుఁడు చెప్పినట్లుగా శౌనకునిబృహద్దేవత మొదలగువానిని బరిశీలించి సర్వాంగసుందర మగునట్లుగాఁ గాత్యాయనుఁడు సర్వానుక్రమణి రచియించి యుండు ననుట సంభావ్య మగుచుండఁగా, నెట్లో తననాఁటికి వ్యాపించిన వైదికలోకప్రవాదమునుబట్టి శౌనకుఁ డార్షానుక్రమణికాదులు రచియించె నని షడ్గురుశిష్యుఁడు వ్రాసియుండెను. అంతే కాని యతఁ డవి నిర్మించె ననుటమాత్రము విశ్వసనీయము కాదు. ఇది యిట్లుండ.

వైయవతారికావిషయమునుబట్టియు నితరాధారములనుబట్టియుఁ గూడ ఋగ్వేదసర్వానుక్రమణి కాత్యాయనకృతము గా స్పష్టపడుచుండఁ గొన్నివ్రాత ప్రతులలో శౌనకునిపేరు గనఁబడుచున్నది. ఇదే కాదు, మఱికొన్నిలక్షణగ్రంథములు గూడ శౌనకకృతములుగానే కనవచ్చుచున్న వని వెనుకనే చదివియున్నాము. ఇట్టివాని కర్తృత్వ మేసంప్రదాయమునుబట్టి లేఖకులు శౌనకుని కారోపించుచు వచ్చిరో యూహింపఁజాలము గాని, దీనినిబట్టి మొదటినుండియు వైదికలక్షణకర్తలలో శౌనకునిపేరు ప్రధానముగా గణింపఁబడుచువచ్చిన దని మాత్రము చెప్పవచ్చును. అందుచేతనే కొన్నిలక్షణముల కర్తృత్వము సందిగ్ధావస్థలో నున్నది. అయినను షడ్గురుశిష్యవ్యాఖ్యాత మైనసర్వానుక్రమణి కాత్యాయనకృత మే యని విశ్వసింపవచ్చును.

సామవేదాద్యనుక్రమణికలు గూడ నాయావేదముల వివిధవిషయములను సూచించుచు ఋగ్వేదసర్వానుక్రమణికి సాటి యగుచున్నవి గాని వానికర్తృత్వ మజ్ఞేయముగా నున్నది. బైట్ సంఖ్య యనుమఱియొకయనుక్రమణి కలదు. అది ఋగ్యజుస్సామవేదములు మూఁడింటికిఁ గూడ సంబంధించిన దని బర్నెలుపండితుఁడు వ్రాసియున్నాఁడు. ఇంక నిట్టియనుక్రమణిక లెన్నో యున్నవి.

## వేదలక్షణములు.

ఇది ప్రకృతవిషయము కాదు. వెనుకటియధ్యాయములందు పెక్కుసందర్భముల శిక్షాప్రాతిశాఖ్యాదిబహువిధలక్షణగ్రంథములనుగూర్చి చదివి యున్నాము. అందనుక్తము లయినవియు నయ్యావేదములకు సంబంధించినవియు నగు మఱికొన్నిముఖ్యలక్షణగ్రంథములనుమాత్ర మిందు గ్రహింతము.

'ఋగ్వేదస్తు ఘనాన్తస్స్యా ద్యజుర్వేదో జటాన్తకః
సామవేదః పదాన్తస్స్యా త్సంహితాన్త స్త్వథర్వణః'

అనుక్రమోపిస్రాప్తిలక్షణములోని శ్లోకమునుబట్టి, అథర్వసంహితకుఁ దప్పఁ దక్కినయన్నిసంహితలకును 'పదపాఠ' మనుపేరఁ బదవిభాగము కల దనియు, సామ సంహితకుఁ బదపాఠము తప్పఁ గ్రమాదిపాఠములు లే వనియు, యజుర్వేదమునకు ఘనాదిపాఠములు లే వనియుఁ దెలియవచ్చును గాని, లోకమునం దిపుడు గూడ యజుర్వేదఘనపాఠము వినవచ్చుటచేతను, పారిశిక్షావ్యాఖ్యాన మగుయాజుషభూషణము రచియించిన చక్రపండితుఁడు—

'పద క్రమ జటా ఘన ధ్వజ రథాదిభేదై ర్యుతా
శ్రుతిః ప్రథితలక్షణా స్ఫురితపంచవర్ణక్రమా'

అని వచియించి యుండుటచేతను, యజుర్వేదమునకు ఘనాదివికృతులు గూడఁ గల వని విదిత మగును. ఋగ్వేదపదపాఠము శాకల్యముని నిర్మిత మని శాకల్యదృష్టే పద మేకలక్ష' మిత్యాదిశ్లోకమునఁ దెలియుచున్నది గాని సామ కృష్ణ శుక్లయజుస్సుల పదపాఠములకర్త లెవరో తెలియరాదు. పదపాఠము సంహితార్థము తెలియుట కెక్కువ సహాయపడునది యగుటచే నథర్వసంహితకుఁ గూడఁ బదపాఠ ముండి యుండు ననియే యూహింపవలసివచ్చుచున్నది. మంత్రమందలి పదములను విభజించుటయే పద మనఁబడును. అట్టి పదవిభాగము లేక భాష్యకర్త లథర్వవేదమునకు వ్యాఖ్యలు వ్రాసి రనుట యసంగతము కావునఁ బదపాఠ మిపుడు వెలుగాఁ గనరాక పోయినను సాయణాదు లథర్వసంహితాపద పాఠ మెఱిఁగి యుందురనియే భావింపవచ్చును. ఇఁక సంహితా పదక్రమాదుల యుచ్చారణరీతి నించుక యుదాహరింతము.

అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్ - సంహిత.
అగ్నిమ్ - ఈళే - పురోహితమ్ - యజ్ఞస్య - ఇత్యాదిపదము.

ఇట్లున్నమంత్రమందలి ద్వితీయాదిపదములు రెండుసార్లు వచ్చునట్లు క్రమముగాఁ బై పదములందుకొనుచుఁ బఠించుట క్రమ మనఁబడును.

అగ్ని మీళే, ఈళే పురోహితమ్, పురోహితం యజ్ఞస్య - ఇత్యాది 'యాపదస్య పదావృత్తి స్సా జ టే త్యభిధీయతే' అను లక్షణమునుబట్టి, ఒకపద మూఁడుసార్లు వచ్చునట్లు పఠించుట జట యనఁబడును.

అగ్ని మీళ ఈళే ఽగ్ని మగ్ని మీళే, ఈళే పురోహితం పురోహిత మీళ ఈళే పురోహితమ్ - ఇత్యాది. ఇందు 'ఈళే' అనుపద మూఁడుమార్లు వచ్చినది. ఇట్లే పురోహితాది పదములు నీపాఠమున నాఁడుసార్లు వచ్చును. జట వికృతులలో మొదటిది.

'జటా మాలా శిఖా రేఖా ధ్వజో దండో రథో ఘనః
అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమపూర్వా మనీషిభిః'

అని వికృతివల్లి. వీనిలో, క్రమమాల, క్రమదండ మిత్యాదిగా నవాంతరవికృతులు గూడఁ గలవు. మంత్రజ్ఞప్తి నత్యంత మభివృద్ధిపఱుచుట కేర్పడిన యీవికృతులనుగూర్చి యనేకలక్షణగ్రంథము లుదయించినవి. ఇందలి స్వర వర్ణోచ్చారణ భేదాదులను దెలుప మఱికొన్ని యావిర్భవించినవి. ఇట్టివియును వీని వ్యాఖ్యలును గలిసి వైదికవాఙ్మయమునం దధికముగాఁ గనవచ్చుచున్న వనుట యతిశయోక్తికాదు. అందు—ఋగ్వేదలక్షణము ఋగ్వేదపరిభాష సంహితాసూత్రము పదసంఖ్య ఉపలేఖము క్రమరత్నము జటోదాహరణము వర్ణోచ్చారణలక్షణము రావణభాష్యటీకము వికృతివల్లి మొద లయినవి ఋగ్వేదసంబంధములు. ఇందు వికృతవల్లి పురాతన మనియు వ్యాళిమహర్షిప్రోక్త మనియు దానికిఁ గౌముదీవ్యాఖ్య రచియించిన గంగాధరాచార్యుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

"గ్రంథే వికృతివల్ల్యాఖ్యే వ్యాళిప్రోక్తే పురాతనే
టీకేయం క్రియతే ఽస్మాభి ర్నామ్నా వికృతికౌముదీ"

సామవేదలక్షణములు కొలఁదిగాఁ గనవచ్చుచున్నవి. అందు, సామపరిభాష స్వరనిర్ణాయకము, ఇందు క్రుష్ట ద్వితీయ తృతీయ చతుర్థ మంద్ర స్వరములు విశదీకరింపఁబడినవి. సామతంత్ర మని మఱియొకటి కలదు. ఇది ఛందోగసంబంధివ్యాకరణము, పదమూఁడు ప్రపాఠకముల గ్రంథము. ఇంకను స్తోహిప్రాప్తి లక్షణ గాయత్రీగాన లక్షణాదులు మఱికొన్ని కలవు.

కృష్ణయజుర్వేదలక్షణగ్రంథము లత్యధికముగా నున్నవి. కాని యివి చాల వఱ కత్యంత మర్వాచీనము లనియే తోఁచుచున్నది. అందు, దేవమనీషిపుత్రుఁ డయినశ్రీవత్సాంకుఁడు రచియించిన 'అనింగ్య' మను నది పద్యాత్మకము. ఇందు హలాదివిభక్తులును యకారాదిపదములును బర మగునపుడు స్వరోచ్చారణ మెట్లుండునో వివరింపఁబడినది. అంతప్రదీప మనునది సంహితలోనివిరామస్థలముల నున్న దీర్ఘాంతములు విసర్జనీయాంతములు నగుశబ్దములను వర్ణక్రమప్రకారము తెలుపుచు, పదపాఠమున కెక్కువ సహాయపడుచున్నది. ఇదియును శ్లోకాత్మక మైన చిన్నగ్రంథము.అవర్ణి యనుమఱియొకలక్షణము సంహితలోఁ బదాదినున్న-ఓ-ఏ-అనువానిలో మొదట నున్నది అకారమో ఆకారమో తెలుప నుపయోగించును. అవర్ణి యనుపేరు గలవి రెండుమూఁడులక్షణము లున్నవి. వానికి వ్యాఖ్యానములును గలవు. వానిలో, చింతామహాధిపతియజ్వ రచియించిన యవర్ణి[1] సంహితలో, అవర్ణముతోఁ బ్రారంభ మగుపదములను దెలుపును. ఉచ్చస్వరనిర్ణయము ఉచ్ఛేదర్శి- స్తోహిప్రాప్తి స్తోహిలక్షణము రావణభాష్యటీకము లక్షణరత్నము షడ్వింశతిసూత్రము సప్తలక్షణము స్వరపంచాశత్తు సర్వభక్తి వేదలక్షణము

1. తింత్రిణీకుల సంభూత మహాధిపతి యజ్వనా.

మొదలయినవి యుదాత్తాదిస్వరములు సంధులు మొదలగువానిని శాసించుచున్నవి. త్రిక్రమలక్షణము క్రమపాఠశాసకము. థకారధకారసూత్రము వేదములోని తవర్గ ద్వితీయచతుర్థవర్ణబోధకము. నపర తపర మనులక్షణము వేదమందలినకారాంత తకారాంతపదములను దెలుపుచున్నది. ప్లుతానుశాసనము ప్లుతస్వరజ్ఞాపక మగుచున్నది. పూర్వోత్తరోభయదీర్ఘి యనునది పూర్వపదముల తుదనుండుదీర్ఘములను పరపదములమొదటనుండు దీర్ఘములను ఉభయపదసంయోగమందలి దీర్ఘములను విశదపఱుచుచున్నది. జటావలి జటాలక్షణ మనునవి జటావికృతిని వివరించుచున్నవి. పదకారికారత్నమాల యనుపద్యాత్మకలక్షణము శుక్లయజుర్వేదమందలి విసర్గము అనుస్వారము వేష్టనము మొదలగువానిస్వరూపము నిర్ణయించుచుఁ బదపాఠజ్ఞానమున కుపకరించుచున్నది.

వేదలక్షణానుక్రమణినిబట్టి లక్షణగ్రంథములసంఖ్య సుమారేఁబది మాత్రమే కనవచ్చునుగాని పఠనపాఠవ్యవహారమున లేక పుస్తకాలయములం దణఁగి యున్నలక్షణగ్రంథములు నూటి కెక్కువగానే కనఁబడుచున్నవి. ఇది సప్తలక్షణముల నిట్లు చూపుచున్నది.

'శమానంచ విలంఘ్యంచ నపరం తపరం తథా
అవర్ణ్యావర్ణ్యనింగ్యం చ సప్తలక్షణ ముచ్యతే.'

దీనిచే సప్తలక్షణ మనునది యీసప్తవిధలక్షణములకూడిక యని తెలియనగును. వీని కన్నిటికిని వ్యాఖ్యానములు కలవు. ఈ యనుక్రమణి వేదోచ్చారణక్రమము నియమించుచు నీక్రిందివారు పాఠకాధము లని వక్కాణించుచున్నది.

'గీతీ శీఘ్రీ శిరఃకమ్పీ తథా లిఖితపాఠకః
అనర్థజ్ఞో ఽల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః.'

సర్వవేదపాఠఫల మను చిన్నగ్రంథము లక్షణజ్ఞుఁడై సంహితాపదక్రమాదులు పఠించువాఁడు బ్రహ్మలోకమును బొందు నని చెప్పుచున్నది. దీనిని బట్టి పూర్వులవేదపాఠమందలి జాగరూకతయు వేదసంరక్షణ దక్షతయు వేదార్థజ్ఞానసంపదయుఁ దెల్లమగుచున్నవి. మఱియు వేదలక్షణవ్యాఖ్యాతలలో త్రిభాష్యరత్న మను ప్రాతిశాఖ్యవివరణము రచియించిన సోమయార్యుఁడు, సర్వసమ్మత శిక్షావివరణము వ్రాసిన ఆలమూరి మంచిభట్టు, శమానసంధిపదదర్పణము రచియించిన పోగల మల్లయార్యయజ్వ, యోహిప్రాప్తిభరద్వాజశిక్షా వ్యాసశిక్షాదుల వ్యాఖ్యలు రచియించిన[1] వేల్మికన్యాపురపు సూరావధాని మొదలగు

1. ఈపద మితనికృతులలో - వేల్మికన్యాపుర - హోమకన్యాపుర - అని కనఁబడుచున్నది. సూర్యనారాయణ శబ్దముకూడ నవతారికా శ్లోకములో నున్నను, గద్యలలో - వేల్మికన్యాసూరావధాని విరచితే—అని కనఁబడుచున్నది. గ్రామనామము సందిగ్ధముగా నున్నను, ఇతఁడు తెలుగువాఁ డగుట సందిగ్ధము కాదు.

విద్వద్వర్యు లాంధ్రు లగుటచే నాంధ్రదేశమున మున్ను వేదవిద్య సర్వలక్షణ సంపూర్ణమై యెట్లు వర్ధిల్లినదో తేటపడఁగలదు.

వైదికచ్ఛందస్సునకు సంబంధించి ఛందోవిచితి ఛందోమంజరి ఛందోనిదర్శనము ఛందోనిర్ణయము నిదానసూత్రము మొదలగు కొన్నిలక్షణములు కనఁబడుచున్నవి. ఇందు మొదటిది పింగళనాగకృతముగాను రెండవది విష్ణుభట్ట నిర్మితముగాను గొన్ని ప్రతులలోని గద్యలవల్లఁ దెలియుచున్నది. నిదాన సూత్రము సామవేదచ్ఛందోవిషయకము. ఇది పతంజలికృత మని చెప్పఁబడు చున్నది. ఇది పన్నెండు ప్రపాఠకముల గ్రంథము. ఇది కాశీపురమున ముద్రిత మైనది. ఇట్లింకను వైదికలక్షణములును వాని వ్యాఖ్యలును గలవు. అట్టివానిలో గణనీయము లైనకొన్నిటి నిందు గ్రహింతము.

యాస్కనిఘంటువునకు దేవరాజయజ్వ విపుల మైన భాష్యము రచియించెను. అది యైదధ్యాయముల పెద్దగ్రంథము. అందు యాస్కనిరుక్తములోని నైఘంటుకకాండమందు నిర్వచింపఁబడని బహుశబ్దముల యర్థము నిరూపింపఁ బడినది. ఈ వ్యాఖ్యాత యజ్ఞేశ్వరార్యునిపుత్త్రుఁడు శ్రీరంగపురీ ప్రాంతగ్రామ నివాసి. ఋగ్యజుర్వేదములందలి బహుక్లిష్ట శబ్దములయర్థము కరతలామలకము గావించు నీభాష్యము మంత్రార్థజ్ఞానమున కెంతయుఁ దోడ్పడుచున్నది. భగవ ద్దుర్గాచార్యులనైఘంటుకకాండ వృత్తికంటె నితనిభాష్యము మిక్కిలి సంశయ విచ్ఛేదకమై యొప్పుచున్న దనుటకంటె దీనినిగూర్చి వేఱుగా వ్రాయఁ బని లేదు.

వైదికకోశ మను మఱియొకలక్షణము భాస్కరరాయ దీక్షితుఁడు రచియించినది కలదు. ఇది యాస్కునినైఘంటుక కాండమును బోలియు నందు లేని యనేకశబ్దములను జూపుచున్నది. ఇది నానాపదకాండము, ఏకపదకాండము నని రెండు కాండములుగా నున్నది. ఇందు మొదటిది మూఁడువర్గములు రెండవది రెండువర్గములు.

భాస్కరరాయదీక్షితుఁడు బహుక్రతుకర్త. ఇతని యింటిపేరు భారతివారు. ఇతనితండ్రి గంభీరరాజదీక్షితులు. ఇతనికాలము తెలియఁదగిన యాధారములు లభింపలేదు గాని, యీవైదికకోశమునకుఁ బద్యాత్మక మైనసంపూర్ణవ్యాఖ్య రచియించిన నారాయణయజ్వ గావించిన భాస్కరరాయ ప్రశంస చూడఁగా నతనినాఁటికే యీవైదికకోశకర్త ప్రాచీనుఁడుగా గణింపఁబడుచు వచ్చినట్లు తెలియవచ్చును. ఎట్లయినను భాస్కరరాయుఁడు సాయణాచార్యులకుఁ బూర్వుఁ డనుట సత్యము. ఇఁక నింతకు మున్ను పెక్కుసార్లు పేర్కొనఁబడిన ఋగ్విధాన మునుగూర్చి యించుక తెలిసికొని యీప్రకరణము ముగింతము.

ఋగ్విధానము ఋగ్వేదలక్షణగ్రంథములలో నుత్తమ మనుట నిర్వివాదము. ఋగ్వేదరత్నాకరము ఋగ్విధాననావ లేకుండ దాఁట శక్యముగాదనియు, ఋగ్విధానము తెలియని ఋగ్వేదపఠనము వ్యర్థ మనియు నిందలియవతారిక ఘోషించుచున్నది. కాని, యీ ఋగ్విధానము శౌనకనిర్మిత మనుట కిందలి యవతారికాదులఁ గనఁబడు "నమ శ్శౌనకాయ" యనెడివాక్య మడ్డపడుచున్నది. శౌనకుఁడే యిది రచియించినచో నమస్కారపూర్వకముగఁ దన్నే తాను స్మరించుకొనునా? "మహ్య మేవ నమో నమః" అని బ్రహ్మవిద్యార్యలొకటిరెండు చోట్లఁ జెప్పుకొన్నట్లు ప్రతీతి కలదుగాని, యీ గ్రంథనిర్మాణవిషయ మట్టిది గాదు. బృహదృగ్విధాన మనుమఱియొక గ్రంథ మున్నట్లు తెలియవచ్చుచున్నది. ఆగ్రంథము నాకు లభింపలేదు గాని, యొకవేళ నది శౌనకనిర్మిత మేమో యనియు, దానిసారమునే మఱియెవరో ఋగ్విధానముగా సంగ్రహించియుండ దీనికర్త శౌనకుఁ డనెడిప్రతీతి విస్తరించి యుండు ననియుఁ దోఁచుచున్నది. పద్యాత్మకమయినదీనికి, కనిష్ఠఋగ్విధాన మనునామాంతరము కలదు. ఇది నాలుగధ్యాయముల గ్రంథము. ఇందు ఋగ్వేదమంత్రముల వినియోగము పూర్తిగాఁ జూపఁబడినది.

## వేదభాష్యములు.

పూర్వాధ్యాయములందు దాయాసందర్భముల సంహితాబ్రాహ్మణారణ్యకోపనిషద్భాష్యములను వేదాంగాదుల వ్యాఖ్యానములను యథాసంభవముగాఁ జేర్కొనియున్నాము. ఇపు డందలిముఖ్యభాష్యములను దత్కర్తలనుగూర్చి యించుక ముచ్చటింతము.

మంత్రములభావమును బ్రాహ్మణములును, వేదశబ్దస్వరూపాదులను శిక్షాదిలక్షణములును, తదర్థనిర్వచనమును నిరుక్తాదులును, తద్వినియోగాదులను సూత్రాదులును, వివరించుచు వచ్చుటచేతను వైదికభాషకుఁ గొంచెము దగ్గఱగా వచ్చుచున్న లౌకికభాష యార్యవ్యవహారమం దుండుటచేతను వేదార్థవిజ్ఞానమునకు భాష్యము లవతరింప వలసినయావశ్యకత చిరకాలమువఱకుఁ గలుగలేదు. సంస్కృతము వ్యవహారమునుండి తొలఁగి కేవలము గ్రాంథిక మైనపిదపఁ గూడ, అది యాగాచరణపరాయణ మగుబ్రాహ్మణజాతికి మిక్కిలి పరిచితమై పఠనపాఠవ్యవహారమున నుండుటచేతను వేదశ్రౌతము లాకాలమున బ్రాహ్మణజాతిసామాన్యము లగుటచేతను శ్రౌతసాహాయ్యమునఁ గొంతకాలము బ్రాహ్మణులు వేదభావ మెఱిఁగి క్రతువు లాచరించుచుండెడివారు. తరువాతఁ దరువాత సంస్కృతాభ్యాస మొనర్పక శుష్కవేదాధ్యయనము గావించు శుద్ధశ్రోత్రియులు 'జ్ఞాత్వా కర్మాణి కుర్వీత' యనెడివిధివాక్యమునకు విరుద్ధముగా వేదార్థ మెఱుఁగకయే యాగము లాచరిం

చెడి యాచారము సంభవించినతఱి లోకానుగ్రహతత్పరులును వేదవేదాంగ వేత్తలు నగుమహానుభావులు వేదార్థవివరణమునకుఁ బూనుకొనిరి. అది క్రీస్తు శకారంభమున కీవలిమాట.

వేదావిర్భావమునకును వేదభాష్యోత్పత్తికిని మధ్యకాల మెంతతక్కువగాఁ జూచినను మూఁడు నాలుగువేల సంవత్సరము లుండును. ఈ మధ్యకాలమున వైదిక శబ్దజాలమునుండి లౌకికభాషకు వచ్చిన బహుశబ్దములు రూపమునందు నర్థము నందుఁ గూడ మార్పు చెందుచు వచ్చినవి. ఇందుకు నిరుక్తపాణినీయాదులఁ గనవచ్చు ననేకశబ్దముల నిర్వచనములును, ప్రక్రియలు నుదాహరణ మగును. ఈమధ్యకాలమున నీమంత్రమున కిది యర్థ మని చెప్పెడి సంపూర్ణ గ్రంథ మేదియు నుదయింపలేదు. అట్టి మంత్రార్థ మంతయుఁ గర్మకాండము ననుస రించిన సంప్రదాయమునుబట్టియే యవగత మగుచుండెడిది. ఆకర్మకాండ మైనను మొదటినుండి యొకవిధముగానే యున్నది గాదు. అది కాలక్రమమున వివిధాంగ సంపన్నమై విస్తరించినది. అందుచేతనే కొన్నిమంత్రములభావము లును, వానినిబట్టి కొన్ని శాఖలవారి కర్మాచరణ పద్ధతులును వేఱగుట సంభవిం చినది. ఈ హేతువులనుబట్టి కొన్ని మంత్రములయర్థము భాష్యములందు మాఱు త్రోవ పట్టిన దని కొందఱు తలంచిరి. ఋగ్వేదమందలి కొన్ని ఋక్కులయర్థము క్లిష్టమై బలాత్కారముగా లాగిన ట్లుండుటనుబట్టి వారియూహ కొంత సకారణ ముగాఁ గనఁబడినను, భాష్యములు మంత్రముల సహజార్థమావిష్కరించు టకే బహువిధములఁ బ్రయత్నించిన వని మాత్రము విశ్వసింపక తప్పదు. ఏ మనఁగా ?

వేదములు కర్మార్థము జ్ఞానార్థము నుదయించిన వని యందఱు సమ్మతిం తురు. ఒకమంత్రము నొకఋషి దర్శించె నన్నంతనే యది యొకభావమే తెలు పుచు నందే స్థిరపడి యుండె ననవలెను గాని ద్వ్యర్థికావ్యమువలె నది రెండర్థ ములు తెలుపునని కాని, లేక డిత్థాదిశబ్దములవలె నిరర్థక మని కాని చెప్ప వలను పడదు గదా! అట్టిచో నొకమహర్షి నిర్మించినయొకమంత్ర మతనియాశయ ముతోనే పఠనపాఠక్రమమున వచ్చి కర్మోపయోగి యైనపుడు దానియర్థముం గూర్చి సంశయ మేల కలుగవలెను ? అట్లేయర్థము సంప్రదాయసిద్ధమై భాష్య కర్తలమతి కెక్కెనో, యది మూలకర్తలయాశయమున కన్య మెట్లగును ? కావున నేవో కొన్నిశబ్దములయర్థములు శబ్దశక్తిని బట్టియు సంప్రదాయప్రవర్తకుల మతములనుబట్టియు వేఱుగాఁ గనవచ్చినను, మొత్తముమీఁద భాష్యములు మంత్రములసహజార్థమునే వెల్లడింపఁబూనిన వనుట సత్యము.

ఆయావేదములకు భాష్యములు రచియించినవారు మఱి కొంద ఱున్నను వేదార్థప్రకాశయశోలక్ష్మి సాయణమాధవాచార్యులను మాత్రమే వరించిన

దనుట సర్వజగద్విదితము. తక్కినవారిభాష్యములు వేదార్థప్రకాశమువలె సకలార్థబోధకములు కావు. కావ్యములకు మల్లినాధ వ్యాఖ్య యెట్టిదో వేదములకు సాయణభాష్య మట్టిది. అంతసుఖకరముగా వేదభావము వెల్లడించునది మఱియొకటి లేదనుట యతిశయోక్తి కాదు. సాయణభాష్యములే యవతరింపకున్నచోఁ గడిచినయైదువందలసంవత్సరములలో వేదవేత్తయైనపురుషుఁడే లేకుండఁ బోవునేమో! ఇట్లనుటచేఁ దక్కినభాష్యములు నిరుపయోగము లని తలంపరాదు. వేనిని జూచి సాయణుఁడిట్టికూలంకష మైనవ్యాఖ్యలు రచియించెనో, ఆ భట్టభాస్కరమిశ్రాదుల భాష్యములు సాయణులకుఁ బూర్వము వేదార్థజిజ్ఞాసువులహృదయముల రంజింపఁజేసినవియే కాక సాయణభాష్యములకు మార్గదర్శకములై వైదికలోకమునకు మహోపకార మొనరించి యున్నవనుట మఱవరానివిషయము. ఇఁక ఋగాదిక్రమమున భాష్యములను, తత్కర్తలను దెలిసికొందము.

ఋగ్భాష్యము:—ఇది, ఆనందతీర్థభగవత్పాదులు రచియించినపద్యాత్మక వ్యాఖ్య. కాని, యిది ఋగ్వేదమండలియెల్లమంత్రములను గర్మపరముగా సమన్వయింపఁ బూనినది కాదు. సంసారసాగరపారమును బొందఁ దలఁచినముముక్షువులు భగవత్ప్రసాదము లేక ముక్తిని గాంచఁ జాలరు గావున, వారికీశ్వరజ్ఞాన ముపదేశింపఁ గోరి భగవత్పరము లైనకొన్నిఋక్కులకు జ్ఞానపరముగా నానందతీర్థులు భాష్యము రచియించి రని యీభాష్యమునకు టీక వ్రాసినజయతీర్థభిక్షువు వక్కాణించియుండెను. దీనినిబట్టి యీభాష్యము నుద్దేశమును దీనిపద్ధతియు విదితములగుచున్నవి.

ఆనందతీర్థు లేకాలమువారో తెలియదు. వీరిభాష్యము ముద్రిత మైనట్లును గనఁబడదు. అసంపూర్ణము లైనదీనివ్రాఁతప్రతులు కొన్నితంజావూరు పుస్తకభాండాగారమున నున్నవి. ఇది ఋగ్వేద మామూలాగ్రము వివరింపఁబూనినది కాకున్నను, దేవతావిషయకజ్ఞానప్రతిపాదనము మాత్రము చేతనే పరిమాణమున మిక్కిలి పెద్దగ్రంథ మైనది. జయతీర్థులు దీనికి రచియించిన ఋగ్భాష్యార్థతత్త్వప్రకాశిక యనుటీక యింతకంటెను రెండురెట్లు విపులమై జిజ్ఞాసువులకు విజ్ఞానదాయకమై యలరారుచున్నది. అయినను, ఏది మన ముద్దేశించితిమో, ఆఋగ్వేదభాష్యముమాత్ర మిది కాదు. ఇందలిముఖ్యవిషయము గాయత్రీమంత్రపురుషసూక్తార్థసంగ్రహముగా వర్ణించినయానందతీర్థుల యీ క్రింది శ్లోకమువల్లనే తెలియుచున్నది.

"స ఏ వాఖిలవేదార్థ స్సర్వశాస్త్రార్థ ఏవచ
స ఏ వాఖిలశబ్దార్థ ఇ త్యా మహోపనిష త్పరా."

జయతీర్థుల ఋగ్భాష్యార్థతత్త్వ ప్రకాశిక ననువర్తించి ఋగర్థరత్నమాల యను మఱియొకవ్యాఖ్య కనఁబడుచున్నది. ఇది మహీధర పండితుఁడు రచి

యించినదిగా బర్నెలు పండితుఁ డూహించెనుగాని యిందుకుఁ దగిన ప్రమాణము చూపఁబడలేదు. ఈ వ్యాఖ్యయు నసంపూర్ణముగానే యున్నట్లు తెలియుచున్నది. విషయమున నిదియును జ్ఞానార్థకమే యగును. అగ్న్యాదిసూక్తములు సకలవేద ముఖ్యుఁడు నోంకారప్రతిపాద్యుఁడు నగు పరమేశ్వరుని బ్రతిపాదించునవిగా సర్వజ్ఞశిఖామణియు భాష్యకారుఁడు నగునానంద తీర్థుఁడు సమన్వయించె నను దీనియుపోద్ఘాతమే యిది పూర్వోక్తతీర్థుల హృదయము ననుసరించి జ్ఞానప్రతి పాదక మగుచున్న దని వెల్లడించుచున్నది.

వేదార్థ ప్రకాశము:—ఈపేర సాయణాచార్యకృతము లయిన ఋగాది సంహితాబ్రాహ్మణారణ్యకాదుల భాష్యము లనేకములు వైదికకల్పభూరుహములై వెలయుచున్న వనుట లోకప్రసిద్ధము. ఈభాష్యము లిట్టి వని వర్ణించుట కాగ డాతో సూర్యుని జూపుటయే యగును. వేదములపె రెత్తినంతనే యెట్టి వా రయిన ముందుగా సాయణాచార్యులకుఁ జే యెత్తి మ్రొక్కవలసినదే.

సాయణభాష్యము లన్నిటిమొదటను మంగళాచరణశ్లోకములతోఁడి పద్య మయావతారిక యొకటి యున్నది. అందు "వాగీశాద్యాస్సుమనస" ఇత్యాదిగా, 'కృపాళు ర్మాధవాచార్యో వేదార్థం వక్తు ముద్యతః' అనువఱకును గలపద్యము లన్నిటియందు సమానముగానే యున్నవి. ఈయవతారికనుబట్టి బుక్కమహీపతి యానతిచే మాధవాచార్యులు వేదభాష్యములు రచియించినట్లు కనఁబడునుగాని, అధ్యాయాంతగద్యములనుబట్టి 'శ్రీవీరబుక్కభూపాలసామ్రాజ్యధురంధరుఁడయిన సాయణాచార్యునిచే రచియింపఁబడినమాధవీయవేదార్థప్రకాశ' మనెడి సత్యవిష యము గోచరించును. శ్రీమతీ మాయణార్యులపుత్రు లయినమాధవసాయణు లిద్దఱును వీరబుక్కభూపతిమంత్రులు. వీ రిరువురును వేదవేదాంగవిద్వర్యులు మహా ప్రతిభాశాలులు. రాజునాజ్ఞచే సాయణుఁడు భాష్యములు రచియించి వానికిఁ దనయన్నపేర మాధవీయ మనుపేరు పెట్టెను. ఇది యథార్థమైనను కొందఱు, మాధవాచార్యుఁడే వేదభాష్యములు రచియించె ననియు, అతఁడే సన్యసించి విద్యారణ్యుఁ డయ్యెననియు, దానంజేసి వేదభాష్యమునకు విద్యారణ్య మనుపేరు వచ్చె ననియుఁ దలంతురు. కాని యది వాస్తవము కాదు. సాయణుఁడే భాష్య ములు రచియించెను.

ముద్రితగ్రంథావతారికలలోఁ గనఁబడనిరెండుశ్లోకములు కొన్నిలిఖిత పుస్తకములలోఁ గనవచ్చుచున్నవి. అవి ప్రక్షిప్తము లనఁదగియున్నను, అందలి విషయము మాత్రము సత్యమై గ్రంథాంతగద్యములను బలపఱుచుచున్నది. ఆశ్లోకము లివి.—

"స ప్రాహ నృపతిం రాజన్ సాయణార్యో మమానుజః
సర్వం వే త్త్యేష వేదానాం వ్యాఖ్యాతృత్వేన యుజ్యతామ్

ఇత్యుక్తో మాధవార్యేణ వీరబుక్కమహీపతిః
అన్వశా త్సాయణాచార్యం వేదార్థస్య ప్రకాశనే "

దీనినిబట్టి భాష్యరచయిత సాయణార్యుఁ డనియు, నతఁ డన్నయందలి భక్తిచే భాష్యమునకు మాధవీయ మనుపేరు వెట్టె ననియు విదిత మగును. కొందఱు సాయణమాధవు లిద్దఱు నొకరే యనెడి యభిప్రాయ మావిష్కరించిరి గాని యదియును సరిగాదు. యజ్ఞసుధానిధి యనుశ్రౌతగ్రంథము నవతారికలో మాధవార్యుఁడు తనభ్రాత యైనట్లుగా సాయణాచార్యుఁడే వక్కాణించి యున్నాఁడు. విజయనగర సామ్రాజ్య పరిపాలకుఁ డగువీరబుక్కభూపతి కాలమునుబట్టి క్రీ. శ. పదునాల్గవ శతాబ్దిమధ్యకాలమున సాయణ భాష్యములు విద్వల్లోకమున కానందదాయకము లయ్యె నని తెలియుచున్నది.

సాయణాచార్యులు తొలుతఁ బూర్వోత్తర మీమాంసలకు సంగ్రహ వ్యాఖ్యలు రచియించి తరువాత నధ్వర్యువేద మైనకృష్ణ యజుర్వేదమునకు భాష్యము వ్రాసి పిదప ఋగ్వేదమునకు భాష్యము రచియించి, అనంతరము సామాథర్వవేదములకుఁ గ్రమముగా వ్యాఖ్యానములు నిర్మించెను. ఇతఁడు తనభాష్యములందు వివిధబ్రాహ్మణారణ్యకోపనిషత్తులనుండి ప్రమాణవాక్యము లుదాహరించుటయే కాక విశేషించి ఋగ్భాష్యమున, యాస్కుఁడు నిరుక్తమున వ్యాఖ్యానము గావించిన యెల్ల ఋక్కులయర్థము నట్లే తనభాష్యమునకుఁ దోడుగా నుదాహరించియుండెను.

సామవేదఋగ్భాష్యము.— దీనిని దొలుత భారతస్వామి రచియించెను. ఇతఁడు కాశ్యపగోత్రుఁడు యజ్ఞదా నారాయణులపుత్రుఁడు మైసూరుసంస్థానమునకుఁ జెందినశ్రీరంగపట్టమున నివసించినవాఁడు. హొసలాధీశ్వరుఁ డగురామనాథుఁడు రాజ్యము చేయుకాలమునఁ దా నీభాష్యము వ్రాసినట్లుగా నిట్లు చెప్పుకొని యున్నాఁడు. "హొసలాధీశ్వరే పృథ్వీం రామనాథే ప్రశాసతి వ్యాఖ్యా కృతేయం క్షేమేణ శ్రీరంగే వసతా మయా "

హొసలరాజ్యము కర్ణాటదేశమునకు సంబంధించినది. హొసలవంశ్యులు తొలుత జైనులయ్యుఁ దరువాత వైష్ణవులుగా మాఱిరి. రామనాథుఁడు దేవగిరిలో నుండి క్రీ. శ. ౧౨౭౨-౧౩౧౦ నడుమ రాజ్యము చేసినవాఁ డగుటచే భారత స్వామి పదుమూఁడవశతాబ్దికడపటిభాగమున నీభాష్యము రచియించె ననుట తెల్లము. దీనినిబట్టి యితఁడు సాయణాచార్యులకంటె నుమా రఱువదిసంవత్సరములు ముందటివాఁ డగుచున్నాఁడు.

సామవేదఋగ్భాష్యము పూర్వార్చికకును వేదార్థప్రకాశ ముత్తరార్చికకును లభించుచున్నవి. ఇది చూడఁగా భారతస్వామి మొదటిభాగమునకు మాత్రమే భాష్యము రచించియుండఁ దరువాత సాయణు లుత్తరభాగమునకు భాష్యము వ్రాసి

యుండు నని గోచరించుచున్నది. భట్టభాస్కరమిశ్రుఁడు ఋగ్వేదసామవేదములకు భాష్యములు రచియించె నని కొందఱందురుగాని యవి యెందును గానరాకున్నవి. మొన్నమొన్నటివఱకు నతనికృష్ణయజుర్వేదభాష్యము ప్రకటితము గాకుండుట చూడ నవి గూడ నెందైన మఱుఁగుపడియుండె నేమో యని యనుమానము కలుగుచున్నది.

కృష్ణయజుర్వేదభాష్యములు:—వీనిలో మొదటిది జ్ఞానయజ్ఞము. దీనికర్త భట్టభాస్కరమిశ్రుఁడు. సకలవేదశాస్త్రము లెఱింగిన యీమహావిద్వాంసుఁ డాంధ్రుఁ డనియు, క్రీ. శ. దశమశతాబ్దికడపటివాఁ డనియు బర్నెలుమొదలగువారు వ్రాసిరి. ఇతఁడు ద్వాదశశతాబ్ది ద్వితీయభాగములోనివాఁ డని శేషగిరిశాస్త్రిగారు భావించిరి. ఇతని జ్ఞానయజ్ఞములోని.—

'ఏవ నిష్పావకే శాకే కౌశికాన్వయ జన్మనా
భట్టభాస్కరమిశ్రేణ జ్ఞానయజ్ఞః ప్రకీర్తితః'

అనుశ్లోకమందలి 'అనుము'లర్థమైననిష్పావకశబ్దమునుబట్టి యితనియింటిపేరనుములవా రనియు, అందుచే నితఁ డాంధ్రుఁ డనియు నిర్ణయించి వైదికలోకసంప్రదాయమునుబట్టి యితఁడు ౯౦౦ ప్రాంతమువాఁ డని బర్నెలు వ్రాసిన దానిని ఖండించుచు, శేషగిరిశాస్త్రిగారు 'నిష్పావకశబ్దము శకసంవత్సరపరముగాని గృహనామపరము కా దనియు, కాని యీపద మిట్లే యున్నచో నితఁడు సాయణాచార్యునికిఁ దరువాతివాఁడు కావలసివచ్చును గావున—'నిష్పావక' యని సవరించి యితనికాలము శా. శ. ౧౧౧౦. అనఁగా, క్రీ. శ. ౧౧౮౮, అని చెప్పుట సముచిత మనియు నభిప్రాయమిచ్చిరి. ఆలోచింపఁగా నిష్పావకశబ్దము గృహనామపరమైతే శాకశబ్ద మెట్లు సార్థక మగు ననియు, శకాబ్దపర మైతే యెట్లో కాలము కుదుర్చుటకు, పకారము దిద్దుట యెట్లు సముచిత మనియు రెండుపక్షములందు నాక్షేపణలు సిద్ధ మగుచున్నవి. కాని చెన్నపురిప్రాచ్యపుస్తకభాండాగారములోని ౧౮౮ సంఖ్యగలయొక కృష్ణయజుర్వేదభాష్యలిఖితపుస్తకముకడపట.—

'ఏవ నిష్పావకే లోకే కుశికాన్వయజన్మనా'

అనుపాఠము కనఁబడుచున్నది. ఇందలిజనసముదాయార్థక మయినలోకశబ్దము వంశపరముగా సమన్వయింపవచ్చును గావున నిష్పావకశబ్ద మనుముల యనునింటిపేరు చెప్పునది గానే భావింపవచ్చును. ఇపుడు, అనుములవంశమందు కౌశికగోత్రమునఁ బుట్టినభట్టభాస్కరమిశ్రుఁ డనుభావము విదిత మగును. శకాబ్దములు చెప్పుటయే కవియభిప్రాయ మైనచో నతఁడు నిష్పావకశబ్దముకంటె విస్పష్టార్థక మైన మఱియొకశబ్ద ముపయోగించియుండు ననియు, అనుము లనెడివి శేషార్థ మిచ్చుదీనిని ప్రయోగించుటనుబట్టి గృహనామము చెప్పుటయే యతనియభీష్ట మనియుఁ లోకే,

అనుపాఠమే శుద్ధ మనియుఁ దోఁచుచున్నది. భట్టభాస్కరుఁ డాంధ్రుఁ డనెడి యనాదిప్రతీతి కూడ నీయభిప్రాయమునకే యెక్కువయవకాశ మిచ్చుచున్నది. కావున నిష్పావకశబ్దము గృహనామపర మనియే నాయభిప్రాయము.

భట్టభాస్కరమిశ్రులు తైత్తిరీయ సంహితాబ్రాహ్మణములు రెంటికిఁ గూడ సంపూర్ణముగా భాష్యములు వ్రాసిరి. ఇపుడు పోల్చిచూడఁగా సాయణభాష్యముల కంటె నవి సంక్షిప్తములుగాఁ గనఁబడును గాని వ్యాకరణకార్యము లెక్కువగా వివరించుచు మంత్రభావము గ్రహించుట కనుకూలములుగా నున్నయవి యా కాలమునందు దేశమున మిక్కిలి వ్యాప్తిని జెందిన వనుట నిజము. అవతారికలోని యీ క్రిందిప్రతిజ్ఞాశ్లోక మితనిభాష్యపద్ధతిని వెల్లడించుచున్నది.

"మంత్రాణాం వినియోగ మాగమవిధిం ఛందాంస్యృషీన్ దేవతాః
కాండర్షీ న్నిగమా న్నిరుక్త మితిహాసాఖ్యాయికే బ్రాహ్మణమ్,
వాక్యార్థస్వరరూప మర్థమనవన్యాయాం శ్చ వక్ష్యే పృథక్
శబ్దానా మనసూయవ స్సుమనసః శృణ్వన్తు జిజ్ఞాసవః."

ఇతఁడు భావస్వామిని బోధాయనమునిని విశేషించి పేర్కొనుటనుబట్టి భావస్వామికృత పూర్వమీమాంసాభాష్యమును బోధాయనకల్పసూత్రమును భాష్యరచనమున నెక్కుడు ప్రమాణములనుగా గ్రహించె నని విదిత మగును. వేదశాస్త్రజ్ఞుని యాధిక్యమును,వేదార్థాధికారిని భట్టభాస్కరుఁ డిట్లు నిరూపించెను.

"సేనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వ మేవ చ।
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవి దర్హతి॥
ఇతిహాసపురాణజ్ఞః పదవాక్యప్రమాణవిత్ ।
అఙ్గోపకారవేదీ చ వేదార్థం జ్ఞాతు మర్హతి॥"

తైత్తిరీయములోని రుద్రప్రశ్నకుఁ బ్రత్యేకముగా నిద్దఱుముగ్గురు భాష్యములు రచియించిరి గాని వా రందఱివేళ్లు తెలియకున్నవి. ఆగ్రంథములును దేశమున వ్యాప్తి చెందినవి కావు. ఈక్రిందిశ్లోకమునుబట్టి, అహోబలకవి రుద్రప్రశ్నకు శ్లోకాత్మకభాష్యము రచియించె నని తెలియుచున్నది.

'సంసారసాగరసముత్తరణే ప్రవీణం
శ్రీమా నహోబలమహాకవిరాజరాజః।
శ్రీరుద్రభాష్యతరు ముజ్జ్వలపద్యరూపం
చక్రే సదాశివకృపాసముపాత్తవిద్యః'

శుక్లయజుర్వేదభాష్యములు:—ఇందు వేదదీప మనుభాష్య ముత్తమము. ఇది మహీధరాచార్యవిరచితము. కాని దీనికిఁ బూర్వము రెండుమూఁడుభాష్యములు కలవు. ఈవేదదీపము పూర్వోత్తరభాగములతుదను—

"ప్రణమ్య లక్ష్మీనృహరిం గణేశం భాష్యం విలోక్యౌవటమాధవీయం।
యజుర్మనూనాం విలిఖామి చార్థం పరోపకారాయ నిజేక్షణాయ॥
భాష్యం బుద్ధ్వా సమాలోచ్య మాధవౌవటశాంకరం।
యన్మయా లిఖితం సంత స్తద్దృష్ట్వా క్షుంతు మర్హథ॥
శ్రీమన్మహీధరకృతే వేదదీపే మనోహరే।
వ్యరమచ్చరమో ఒధ్యాయః పరమాత్మనిరూపకః"

ఇత్యాదిశ్లోకములు కలవు. వీనినిబట్టి, ఉవటుఁడు మాధవుఁడు శంకరుఁడు ననువారు వాజసనేయిసంహితకు భాష్యములు రచియించి రనియు, ఆభాష్యములను జూచియే మహీధరుఁడు వేదదీపము వెలయించె ననియుఁ దెలియును. వైమువ్వరిలో వజ్రటపుత్రుఁడయిన ఉవటుఁడు శుక్లయజుర్వేదీయ వ్యాఖ్యా రచనమునఁ బ్రసిద్ధుఁడు. ఇతఁడు తనవాజసనేయి మంత్రభాష్యమున—

"ఆనందపురవాస్తవ్య వజ్రటాఖ్యస్య సూనునా।
మంత్రభాష్య మిదం క్లృప్తం పదవాక్యైస్సునిశ్చితైః॥
ఋష్యాదీంశ్చ నమస్కృత్య హ్యవన్త్యా ముపటో వసన్।
మంత్రభాష్య మిదం చక్రే భోజే రాజ్యం ప్రశాసతి"

అని వ్రాసికొన్నశ్లోకములనుబట్టి, అవంతీ (ఆనంద) పురవాసి యనియు భోజమహారాజు రాజ్యము చేయుకాలమున ననఁగా, క్రీ. శ. ౧౦౩౦ ప్రాంతమున నీవేదదీపము రచియించె ననియుఁ దెలియుచున్నది. ఇఁక:—

రెండవభాష్యకర్త యైన మాధవుఁడు సాయణమాధవుఁ డనియు, మూఁడవవయతఁ డగు శంకరుఁడు జగద్గురు శంకరాచార్యుఁ డనియు విదితము[1]. ఈముగ్గురును నిర్మించిన భాష్యములను జూచిన మహీధరుఁడు వేదదీపము నతి సులభముగాను మిక్కిలి విపులముగాను రచియించెను. ఇది మాధ్యందినశాఖకు సంబంధించినది.

కాణ్వసంహితకు వేదార్థదీపిక యనుపేర, అనంతాచార్యుఁడు సంపూర్ణ భాష్యము నిర్మించెను. భగీరథీనాగదేవభట్టుల పుత్రుఁడును, కాశీనివాసియు నగు నీయాచార్యుఁడు సుమారు నూఱుసంవత్సరములక్రిందటివాఁడు. ఇతఁడు గాక కాణ్వసంహితకు జాతవేదభట్టోపాధ్యాయపుత్రుఁడగు నానందబోధభట్టోపాధ్యాయుఁడు మఱియొకభాష్యము రచియించెను.

---

1. మాధవభాష్యము సాయణాచార్యభాష్యమే యనుట నిస్సంశయముకాని, శంకరులు సంహితకు భాష్యము వ్రాసినట్లు కనఁబడదు, వారిబృహదారణ్యకోపనిషద్భాష్యమే మహీధరుఁడు పేర్కొన్నదని తోఁచుచున్నది.

ఇట్లు పేర్కొన్న సాయణాది పూజ్యపాదులభాష్యములు గాక చతుర్వేద సంహితలకును గొన్ని బ్రాహ్మణములకును మఱికొందఱు రచియించినభాష్యములు గూడ సముద్రితగ్రంథపట్టికలందు కనవచ్చుచున్నవి గాని యవి లోకమున వ్యాప్తి చెందినవి కావు.

ఉపనిషద్భాష్యములు:—ఇవియును వీనివృత్తులు టీకలు దీపికలు వివరణములు ననేకము లున్నవి. గ్రంథవిస్తరము గాకుండఁ బ్రధానము లైనకొన్నిటిని మాత్రమిందు గ్రహింతము. వేద భాష్యములకు సాయణాచార్యులవలెనే వేదాన్తభాష్యములకు శంకరభగవత్పాదులు ప్రసిద్ధి కెక్కి రనుట సర్వజగద్విదితము. షణ్మతస్థాపకులును జగద్గురు బిరుదాంకితులు నద్వైతమతాచార్యులు నగు శంకరు లద్వైతపరముగా నిర్మించిన యనేకభాష్యములకుఁ దరువాతివారు బహువిధము లైనవివరణములు రచియించియున్నారు. ఆనందతీర్థులు ద్వైతపరముగా రచియించిన దశోపనిద్భాష్యములకు మఱికొందఱు వృత్తులు నిర్మించియున్నారు. రంగరామానుజాచార్యాదులు విశిష్టాద్వైతపరముగా, తైత్తిరీయాదులు కొన్ని యుపనిషత్తులకు మాత్రమే వ్యాఖ్యలు నిర్మించిరి. శంకరాచార్యాదిప్రధానపురుషులు రచియించినభాష్యము లన్నియు ముద్రితములై లభించుచున్నవి గాని వాని వివరణాదు లనేకములు ముద్రితము లైనట్లుకనఁబడదు.

దశోపనిషత్తులకును జీవేశ్వరాభేదపరముగా భాష్యములు వ్రాసినశంకరులవారీశావాస్యము మొదల "ఈశావాస్యమిత్యాది మంత్రములు కర్మవినియుక్తములు కామింజేసి పరమాత్మ ప్రతిపాదకము లగుచున్నవి. ఆత్మయొక్క శుద్ధత్వ దురితదూర త్త్రైవకత్వ నిత్య త్వాశరీరత్వ సర్వగతత్వాది లక్షణముల నీయుపనిషత్తులు నిరూపించుచున్నవి. ఏతాదృశలక్షణములు కర్మవిరుద్ధము లగుటచే నీమంత్రములకుఁ గర్మలయందు వినియోగము లేకపోవుట యుక్తమే యగుచున్నది." ఇత్యాదిగా వ్రాయుచు నుపనిషత్తులు విజ్ఞానబోధకము లనెడి ముఖ్యాభిప్రాయ మావిష్కరించియున్నారు. మఱియుఁ దమకుఁ బూర్వము వేదాన్తములు వ్యాఖ్యాతము లైనను విస్పష్టార్థ ప్రతిపత్తికై గురుప్రసాదమున నే నీవ్యాఖ్య వ్రాయుచున్నా ననుచు నాచార్యులవారు తైత్తిరీయ భాష్యము మొదల నిట్లు వక్కాణించియున్నారు.

'యై రిమే గురుభిః పూర్వం పదవాక్యప్రమాణతః
వ్యాఖ్యాతా స్సర్వవేదాన్తా స్తా న్నిత్యం ప్రణతో ఽస్మ్యహమ్'

దీనినిబట్టి శంకరభాష్యములకుఁ బూర్వము పూర్వులు రచియించిన యుపనిషద్భాష్యము లున్న వని తెలియవచ్చును. అయినను శంకరులభాష్యము లన

మానములై వ్యాపించుటంజేసి యవి యెందో యణఁగిపోయినవి. శంకరాచార్యుని తైత్తిరీయోపనిషద్భాష్యము చూచియే సాయణాచార్యు లాయుపనిషత్తులకు వ్యాఖ్య రచియించినను, పఠనపాఠ వ్యవహారమున దాని కన్నప్రశస్తి దీనికి లే దనుట స్పష్టము. తైత్తిరీయోప నిషత్తునకు విద్యారణ్యుఁడు చూపిన మార్గము ననుసరించి యొకానొక విద్వాంసుఁడు లఘుదీపిక యనుపేరఁ జిన్న వ్యాఖ్య రచియించినట్లు—

"విద్యారణ్యకృతవ్యాఖ్యాదుగ్ధాబ్ధిం పాతు మక్షమాః
ఏతస్మా దుద్ధృతం సారం తృప్తిదం తే పిబ న్త్వమున్".

అను శ్లోకమునఁ గనవచ్చును. కాని, యీవిద్యారణ్యవ్యాఖ్య సాయణ కృతవ్యాఖ్యకంటె నన్యము కాకపోవుటచే, మాధవాచార్యుఁడే విద్యారణ్యుఁ డనెడిప్రతీతి చిరకాలముక్రిందటనే బయలుదేఱి స్థిరపడె ననుట కీశ్లోకముగూడ నొకప్రమాణ మగుచున్నది.

జగద్గురువుల తైత్తిరీయోపనిషద్భాష్యమునకు భాష్యవార్తిక మనుపేర వారిశిష్యుఁ డగుసురేశ్వరాచార్యుఁడు పద్యమయ మయిన పెద్దవ్యాఖ్య రచియించెను. 'ఆనందగిర్యాచార్యులు శంకరతైత్తిరీ యోపనిషద్భాష్యమునకును సురేశ్వరకృతతద్వార్తికమునకును గూడ, టీకలు రచియించెను. వార్తిక టీకాగద్యములఁ గొన్నిచోట్ల 'ఆనందజ్ఞానవిరచితా టీకా' యని కనఁబడుచున్నది గాని మంగళాచరణ శ్లోకైక్యమునుబట్టి యీయానందజ్ఞానుఁ డానందగిరియే యని తెలియుచున్నది. ఆనందజ్ఞానుఁడు శంకరుల బృహదారణ్యకోపనిషద్భాష్యాదులకుఁ గూడ నిట్టే టీకలు వ్రాయుటయు, సురేశ్వరాచార్యులు వార్తికములు వ్రాయుటయుఁ దలఁచుచుగాఁ గనవచ్చును. శంకరాచార్యులవలెఁ బ్రధానము లైన యనేకోపనిషత్తులకు శంకరానందుఁడు దీపికలు రచియించెను. ఈశంకరానంద భగవత్పాదులు వేదాన్తపంచదశీకారు లగువిద్యారణ్యులగురు వేమో యని తోఁచుచున్నది. శంకరానందులవలెనే నారాయణాశ్రమి గూడ ముండక మాండూక్య బ్రహ్మవిద్యాద్యుపనిషత్తులకు దీపిక లనుపేర వ్యాఖ్యలు రచియించెను. శంకరుల పెక్కుభాష్యములకు శివానందయతి టిప్పణములు నిర్మించెను. తైత్తిరీయాంతర్గత మైననారాయణ మనెడి యాజ్ఞిక్యుపనిషత్తునకు జ్ఞానోత్తమ పూజ్యపాదశిష్యుఁ డగువిజ్ఞానాత్ముఁడు గూడ వివరణము నిర్మించెను. ఇతర భాష్యములు చూచినపిదప రచియింపఁబడిన యీవివరణ మద్వైత జ్ఞానసుఖబోధకమై యున్నది. ఇట్లింక నెందఱేని యుపనిషద్వ్యాఖ్యలు రచియించిరి గాని శంకరభగవత్పాదు లుద్ధరించిన యద్వైతమును దన్మార్గ మాశ్రయించి వ్యాఖ్యా

వివరణాదుల విస్తరింపఁజేసినవారిలో సురేశ్వరాచార్యులును, ఆనందగిర్యాచార్యులును మిక్కిలి ప్రశంసనీయు లగుచున్నారు.

ఈశావాస్యాది ప్రధానోపనిషత్తులకు ద్వైతమతపరముగా భాష్యములు రచియించినవారిలో నగ్రగణ్యు లానందతీర్థులు. మధ్వాచార్యులు పూర్ణప్రజ్ఞుఁడు ననునామాంతరములు గలయీయానందతీర్థులు మారుతిమూఁడవయవతార మని యీక్రింది యితనిమాటలవల్లనే తెలియుచున్నది.

"మధ్వ ఆనందతీర్థ స్స్యాత్ తృతీయా మారుతీతనుః
ఆనందతీర్థ ఇతితు యస్య నామ తృతీయకమ్
పూర్ణప్రజ్ఞేన తే నేదం కృతం భాష్యం హరేః ప్రియమ్ "[1].

ఆనందతీర్థులభాష్యములలో నీశావాస్యాదికతిపయభాష్యములకు జయతీర్థభిక్షువును, ఐతరేయాదిభాష్యములుకొన్నిటికి విశ్వేశ్వరతీర్థులును, నరసింహయతి, కృష్ణాచార్యాదులును, కఠాదిభాష్యములుకొన్నిటికి వ్యాసతీర్థ, వేదేశభిక్షుశ్రీనివాసాచార్యులును, టీకావివరణాదులు రచియించిరి. ఛాందోగ్యమాండూక్యాదులకు కొన్నిటి కానందతీర్థులభాష్యములుగాక రాఘవేంద్రయతి రచియించినయర్థసంగ్రహములుగూడ వేఱుగా నున్నవి. శ్రీనివాసాచార్యునితైత్తిరీయోపనిషద్వ్యాఖ్యటీకావతారికనుబట్టి విద్యాధిరాజాది మునీంద్రులు మఱికొందఱు ఛాందోగ్యాదులకు భాష్యములు నిర్మించినట్లు కనఁబడుచున్నది.

రఘూత్తమయతి, బృహదారణ్యకభాష్యమునకు టీక వ్రాయుచు, "ఈకాణ్వోపనిషత్తునకుఁ గొంద ఱన్యథా వ్యాఖ్యానములు రచియించియుండుట కని పెట్టి యుందలితత్త్వము వెల్లడింప నానందతీర్థులు తొలుత భాష్యమురచియించిరి. ఇందలిప్రౌఢిమను బ్రకాశింపఁ జేయుటకై నే నీపరబ్రహ్మప్రకాశిక యనువృత్తి రచియించుచున్నాను" అని వక్కాణించి, ద్వైతవేదాన్తభాష్యవివరణమున నానందతీర్థులమత మావిష్కరించినవారిలో జయతీర్థుని, అతనిశిష్యుఁ డగువ్యాసతీర్థుని మిక్కిలి ప్రశంసించియున్నాఁడు. ఇట్లున్నవివిధవివరణాదులు చూడద్వైతపరమైన యుపనిషన్మత ముద్ధరించినయాద్యముని యానందతీర్థు లని విదిత మగును. ఇతఁడు త్రిమతాచార్యులలో నొకఁడు. శంకరాచార్యుల కర్వాచీనుఁడు. ఇంక—

విశిష్టాద్వైతమతపరముగా, తైత్తిరీయబృహదారణ్యకాద్యుపనిషత్తులు కొన్నిటికి వ్యాఖ్యలు రచియించినవారిలో గణనీయుఁడు రంగరామానుజా

1. ఛాం. ఉ. భా. [illegible]

చార్యులు. ఇతఁడు వాత్స్యాయనార్చార్య పరకాలమునీంద్రులశిష్యుఁడు. కాంచీపురవాసి. విశిష్టాద్వైతమతోద్ధారకు లగురామానుజాచార్యుల సూత్రభాష్యము చక్కఁగాఁ బఠించి, సూత్రభాష్యోపయుక్తోపనిషద్వాక్యవివరణము రచియించిన పండితోత్తముఁడు. ఇతని భాష్యములుగూడ దేశమునఁ బఠనపాఠవ్యవహారమునఁ బ్రసిద్ధములై యున్నవి.

ఇది
శ్రీహరితసగోత్రాపస్తంబసూత్రాధీతసకలతంత్ర రామస్వామిశాస్త్రిపౌత్రుండును,
వేదవేదాన్తజ్ఞాని శ్రీరామావధాని పుత్రుండును, శబ్దతర్కాద్వైతాచార్య
చర్ల బ్రహ్మశాస్త్రి ప్రియశిష్యుండును, ఆంధ్రవిశ్వకలాపరిషత్కలా
శాలా సంస్కృతాంధ్రా ధ్యాపకుండునగు మల్లాది సూర్య
నారాయణశాస్త్రి రచియించిన సంస్కృతవాఙ్మ
యచరిత్ర ప్రథమ భాగమగు వైదిక
వాఙ్మయ చరితయందలి నవమా
ధ్యాయము సర్వము.

ఓంతత్సత్ - పరబ్రహ్మార్పణమస్తు.



